అంతర భారతీయ పుస్తకమాల

# ఐవానే గజల్


జీలానీ బానో


అనువాదం

బి. సీతా కుమారి




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# ఉపోద్ఘాతం

ఉర్దూ సాహిత్యంలో కాల్పనిక కథా రచన బీజాలు మీర్ అమ్మాన్ రచించిన సుప్రసిద్ధ ప్రాచీన నవల 'బాగో బహార్'లో కనపడతాయి. నిజానికి ఈ గ్రంథాన్ని ఇతిహాసగాథా దృక్పథంతో చూడవచ్చును. ఇందులో నిర్దిష్టమైన కథాగమనం మధ్య నడుచుకునే సంఘటిత కథా వస్తువుగాని, పూర్తిగా రూపుదిద్దుకున్న పాత్రలుగాని కనపడవు. ఇది పరిష్కారం లేకుండా సమాప్తమయ్యే నవలల కోవకు చెందినది. దీని అంతర్గత కథాంశం పునరావృతమైన, పునరుద్ఘాతమైన వర్ణనలలో కనుగొనవచ్చును. ఇవి యిందులో ప్రత్యక్షమయ్యే పాత్రల మానసిక పరిస్థితితో ముడిపడి, ఆ పరిస్థితిని ప్రతిబింబిస్తాయి. తీర్చిదిద్దిన పాత్రలతో యధేచ్ఛగా, లేదా కచ్చితమైన గమనంతో సాగే కథా వస్తువుతో కూడిన కాల్పనిక కథా రచనని ఉర్దూ సాహిత్యంలో ఒక విధంగా చెప్పాలంటే మౌల్వీనాజీర్ అహ్మద్, అబ్దుల్ హలీమ్ షరార్‌లు ప్రారంభించారు. మౌల్వీ యించుమించు ప్రత్యక్షమైన ఉద్బోధన ద్వారా నైతిక విలువలను పెంచేందుకే ఎక్కువ ప్రాముఖ్యం యివ్వగా షరార్ కళని మాధ్యమంగా చేసుకుని గత చరిత్రని పునరుజ్జీవింప జేసేందుకు ప్రయత్నించారు. ఆయన రచించిన 'ఫిరదౌస్-ఎ-బరీన్'ని చరిత్ర, కాల్పనికతలు మిళితమైన అద్భుత కళాఖండంగా పరిగణించవచ్చును. వారిద్దరు కూడా ఒక పరిమిత రంగాన్నే ఎంచుకుని అందులో ఖైదీలుగా వ్యవహరించినప్పటికి ఆ యిద్దరూ కూడా ఉర్దూ నవలాభివృద్ధి పైన మంచి ప్రభావాన్ని కనబరిచారు. అయితే మున్షీ ప్రేమ్‌చంద్ తన 'గోవదాన్', 'మాదన్-ఎ-అమల్' నవలల ద్వారా కాల్పనిక కథా రచనని ఒక సుస్థిర పునాదిపై కళా రూపంగా నిలబెట్టి సామాజిక వాస్తవ పరిస్థితులను తెలిపేందుకు ఒక సాధనంగా ఉపయోగించుకున్నారు. మౌల్వీ నాజిర్ అహ్మద్‌లాగే మున్షీ ప్రేమ్‌చంద్ కూడా నైతిక విలువలకు గట్టిగా కట్టుబడి ఉన్నారు. అయితే ఆయన కళ, నైతిక విలువలు, సామాజిక ఆర్థిక' స్పృహ వీటిని తన రచనలలో

సక్రమంగా పొందుపరిచారు. అభ్యుదయ రచయితల ఉద్యమం ప్రారంభం కావడంతో (దీనిని గట్టిగా ప్రోత్సహించి, బలపరిచిన వారిలో ప్రేమ్‌చంద్ ఒకరు) సాహితీవేత్త తన దృష్టిని మారుతున్న సాంఘిక ఆర్థిక పరిస్థితులపై నుంచి మరల్చకుండా తన కళని యించుమించు దానికి దాసోహం చేయడం అనివార్యమైంది. అయితే బాహ్య ప్రభావాలు కళాకారుని క్రియాత్మక మేథా సంపదతో సమ్మిళితమైతేనే తప్ప, కేవలం సాంఘిక, ఆర్థిక పరిస్థితుల చిత్రీకరణ అపరిపక్వంగా, అసంతృప్తిగా, అవిశ్వసనీయంగా మిగిలిపోతుంది. తీవ్ర అభ్యుదయ వాద ప్రచారకులైన కృష్ణచంద్ర, తదితర రచయితల దృక్పథం ఒక నిర్దిష్టమైన ప్రయోజనంతో మసకబారి పోవడంతో పూర్తి పరిపూర్ణత, ఉత్కృష్టతల స్థాయిని అందుకోలేదు. అజీజ్ అహ్మద్ రచించిన 'ఐసే బలింది ఐసి పాస్తి', 'గురియాజ్' అన్న రెండు నవలలను సాధారణ అభ్యుదయవాద నవలలకంటె ఉన్నతమైనవిగా చెప్పవచ్చును. ఎందుచేతనంటే ఆ నవలల అంతటా కూడా కొంత పరిణత, ఆలోచనా శక్తి కనపడతాయి. ఈ గుణాలు యితర తరహా నవలల్లో పూర్తిగా లోపించాయి. షౌకత్ సిద్ధికి నవల 'ఖుదా-కి-బస్తీ'లో నగర అంధకార జీవితపు వ్యక్తులను అతి వివరంగా విశ్లేషించి చిత్రించడం జరగడంతో యిది మితిమీరిన సంచలనాత్మక రచనగా కనపడుతుందే కాని చక్కటి ఉదాత్తమైన నవలగా కనపడదు. దేశ విభజనానంతర పర్యవసనాల దృష్టితో ఖదేజా మస్తూర్ రచించిన 'ఐగన్' సున్నిత భావాలతో చక్కగా సాగిన లఘు కళాఖండం. అదే విధంగా జమీల్ హాష్మి రచించిన 'తలాష్-ఎ-భరన్', రజియా ఫాషిష్ అహ్మద్ రచించిన 'ఆబోధోపా' కూడా సునిశిత భావనాశక్తి నిండిన రచనలుగా చెప్పవచ్చును. ఈ రెండింటిలోను కూడా ఆధునికత, విచక్షణలతో కూడిన రుచి కనపడతాయి. పందొమ్మిది వందల యాభయ్యో దశాబ్దపు చివరలో కుర్‌తుల్ ఏన్ హైదర్ 'ఆగ్‌కా దరియా' అన్న నవల రచించారు. ఇందులో మానవ సందిగ్ధతని అతి నిశితంగా పరిశీలించడం జరిగింది. చారిత్రిక పరిణామాన్ని కాలానికి గల భూమికని కచ్చితంగా గుర్తించడం జరిగింది. ఈ నవల ఉర్దూ పాఠకులను తుఫానులా కదిలించింది. ఆ తరువాత 1963లో అబ్దుల్లా హుస్సేన్ నవల 'ఉదాస్ నస్లీన్' వచ్చింది. ఇది పరిపూర్ణమైన నవల. సునిశిత భావ వ్యక్తీకరణ,

విశాల భావనా పరిధి, యోచనా శక్తి రెండింటి దృష్ట్యా కూడా 'ఆగ్-కా-దరియా' కంటె ఉత్తమమైనది.

1963 లో ప్రచురితమైన జీలానీ బానో నవల 'ఐవాన్-ఎ-గజల్'ని కుర్‌తుల్ ఏన్ హైదర్ లేదా అబ్దుల్లా హుస్సేన్ రచించిన నవలలంత ఉన్నతమైనదిగా చెప్పడానికి వీలులేదు. అయితే యిది ఉత్తేజదాయకమైన మంచి కళాఖండమే. 'ఐవాన్-ఎ-గజల్', 'ఆలిఫ్ లైలా' రెండు నవలలో ప్రధానమైన కేంద్రాలు వీటి చుట్టూ యావత్ కథ అల్లుకుని ఉంది. మొదటిది ఫ్యూడల్ వ్యవస్థ విలువలపై ఆధారపడిన తన కళను చూసి గర్వపడుతు, క్షీణించిన సమాజానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. వామాద్ హుస్సేన్, అహ్మాద్ హుస్సేన్‌లు యీ ఫ్యూడల్ విలువలను మూర్తీభవిస్తారు. రెండవది కొల్లగొట్టుకొనడం, మూఢ నమ్మకాలు ఆధారంగా గల మరణోన్ముఖ సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. మిస్కిన్ అలీషాతోతా చష్మి ఈ మూఢ నమ్మకాలను సమర్థిస్తారు. 'ఐవాన్-ఎ-గజల్' కవితలల్లుతూ లైంగిక సౌఖ్యానికి అలవాటు పడి అస్తమిస్తున్న సంపద, వైభోగాల సంధ్యా కాంతిలో జీవితం వెలిబుచ్చే వ్యక్తులకు ఆలవాలం. అమాయకులైన మూఢ భక్తుల నుంచి రాబట్టే డబ్బుతో 'ఆలిఫ్‌లైలా' పచ్చగా వర్థిల్లుతుంది. కుహనా సంస్కృతి, కలుషిత మత తత్వాలకు ఆలవాలమైన యీ రెండు కేంద్రాలకు గల ఉమ్మడి లక్షణాలు ఏమిటంటే, ప్రజలను కొల్లగొట్టుకొనడం, జీవితపు దారుణ వాస్తవాలను ఎదుర్కొనలేక పెడముఖం పెట్టే వైఖరి, మారుతున్న పరిస్థితులకు అనువుగా నడుచుకోడానికి నిరాకరించడం. బూజుపట్టిన భావాలు, సిద్ధాంతాలకు నిలయమైన ఈ రెండు కేంద్రాల మధ్య ఉద్భవించే సచేతనత్వానికి ఒక ప్రక్క హైదర్ అలీఖాన్, అహ్మాద్ హుస్సేన్‌లు, మరొక ప్రక్క రాషీద్ ప్రాతినిధ్యం వహిస్తారు. హైదర్ అలీఖాన్, వాహిద్ హుస్సేన్‌కి బావమరిది. రాషీద్, వాహిద్ హుస్సేన్ అలీఖాన్ కుమారుడు. హైదర్ కమ్యూనిస్ట్ పార్టీలో చేరిపోతాడు.

అల్ప బూర్జువా తరగతి ప్రతినిధి అయిన రాషీద్ అనతి కాలంలోనే సంపన్న వ్యాపారస్థుడుగా మారిపోతాడు. మిస్కిన్ అలిషావ్ కురుడైన హుమయూన్ తాను జన్మించిన సమాజపు ఊబి నుంచి బయట పడలేక

పోతాడు. దానితో దిక్కులేనివాడై అతని భార్య బతూల్ బేగమ్ తన సోదరుడు రాషీద్ హుస్సేన్ విసిరిన నాలుగు మెతుకులను ఏరి తెస్తే, వాటితో సంతృప్తిపడి జీవితాన్ని గడుపుతాడు. ఈ నవల రెండు ప్రధాన పాత్రల చుట్టూ తిరుగుతుంది. అవి బషీర్ బేగం, హైదర్ ఆలీ ఖాన్‌ల కూతురు చాంద్, బతూల్ బేగం, హుమయూన్‌ల కుమార్తె గజల్. ఆయాజ్, షహజద్‌ల తరువాత పుట్టిన గజల్‌ని పురుషాధీన 'అలీఫ్‌లైలా' ప్రపంచంలో అశుభంగా పరిగణిస్తారు. తల్లి బషీర్ బేగం మరణించి, తండ్రి హైదర్ అలీఖాన్ అరాచక శక్తులలో చేరి, క్రైస్తవ మతానికి చెందిన సాయాని పెళ్ళాడటంతో చాంద్ తమ పూర్వీకుల గృహం 'ఐవాన్-ఎ-గజల్' చేరుకుంటుంది. అది ఆమె మేనమామ రాషీద్, అతని గయ్యాళి భార్య రజియా గుప్పిట్లో ఉంది. అలాగే గజల్ తల్లి బతూల్ బేగం మరణించడంతో ఐవాన్-ఎ-గజల్, గజల్‌కి యించుమించు స్థిర నివాసం అవుతుంది. వీరిద్దరి జీవితాలు సమానాంతరంగా సాగుతాయి. చాంద్‌ని, గజల్‌ని ఒక దానికి మరొకటి ఎదురుగా నిలబెట్టిన అద్దాలుగా పరిగణిస్తే, సమకాలీన సాంఘిక వ్యవస్థలోని నిమ్నోన్నతాలు వాటిలో ప్రతిబింబిస్తాయి.

చాంద్, గజల్ రెండు కూడా విషాద పాత్రలే. వారు పుట్టి పెరిగిన సమాజపు సాంఘిక ఆర్థిక కట్టుబాట్ల పీడితులు. చాంద్ చెప్పలేనంత అందమైన అమ్మాయి. సంగీత, రంగస్థల నటనా శక్తి ఆమెలో అపారంగా ఉన్నాయి. ఆమె హైదరాబాదులోని కళా రంగాల వారితో చేరి అనతికాలంలోనే తారాస్థాయిని అందుకుంది. క్రూర వక్ర బుద్ధిగల స్త్రీలోలులు కళాకారులు, వ్యాపారులు ఆమెని పెడతోవన పెట్టి పతితని చేయడాన్ని రాషీద్ అనుమతిస్తాడు. వీరిలో రాజా శివరాజ్, ఖాన్ సాహెబ్, బిల్‌గరామి వంటి వ్యక్తులు ఉన్నారు. ఆమె యువ శిల్పి సంజీవ ప్రేమలో పడుతుంది. ఈ సంజీవ ఆ తరువాత పూర్తిగా అజ్ఞాత గెరిల్లా కార్యకలాపాలతో చేరిపోయి, చాంద్‌ని వదిలేస్తాడు. చాంద్, అతను అలవాటు పడిన ఆ కష్ట జీవితానికి ఇమడలేక పోతుంది. సంజీవా ఆ తరువాత ఉగ్రవాద కార్యకలాపాలలో తన సహచరిణి అయిన కైసర్‌ని (ఫాతీమా బేగం కుమార్తె) పెళ్ళాడతాడు. వారిద్దరికీ అసాధారణ తెలివితేటలుగల కూతురు క్రాంతి పుడుతుంది. క్రాంతిని ముందు చాంద్

సంరక్షణలోను, ఆ తరువాత గజల్ సంరక్షణలోను ఐవాన్-ఎ-గజల్‌లో వదిలేస్తారు. తన భౌతిక సౌందర్యం తరిగిపోయి, సంజీవచేత విడిచివేయబడి, ఎల్లప్పుడూ పనులు సాధించుకోవడానికి ఒక పావుగా ఉపయోగించుకోబడిన చాంద్ వీరోచితంగా మరణాన్ని స్వీకరిస్తుంది. కాని ఆమె అనుసరించిన మార్గం ఆమెకు కళంకం తెచ్చింది. గజల్‌కి కూడా యింత ఎక్కువగాను కళాత్మకమైన ప్రతిభా సంపద ఉంది. ఆమె కూడా అనేక విధాల చాంద్ అనుసరించిన మార్గంలోనే వెళ్లింది. మరింత ఎక్కువ శారీరక ఆకర్షణ కలిగి, చాంద్‌ని ఆరాధ్య దేవతగా భావించిన గజల్ అల్లకల్లోల జీవిత మార్గాన్ని ఎంచుకుని, అదే విధంగా దారుణమైన చావుకి గురి అవుతుంది. ఆమె ఖాన్ సాహెబ్, బిల్‌గరామి, నసీర్ వంటి మోసగాళ్ళతో ప్రేమ వ్యవహారంలో చిక్కుకుంటుంది. వాళ్ళందరూ కూడా ఆమెని వదిలేస్తారు. చివరికి రాషీద్ కొడుకు షాహీన్,· యింట్లో వాళ్ళు గట్టిగా వ్యతిరేకించినప్పటికి ఆమెను పెళ్ళి చేసుకుంటానంటాడు. ఒక విధంగా చెప్పాలంటే ఆమెని ఆ పాప పంకిలం నుంచి అతను వీరోచితంగా కాపాడతాడు. అంతకుముందు హైదరాబాదుకి చెందిన సుప్రసిద్ధ ఉర్దూ గజల్ రచయిత సర్‌వార్ కొంత ఆమె అందానికి ముగ్ధుడై, కొంత దయాభావంతో ఆమెను పెళ్ళి చేసుకుంటానంటాడు. అన్ని వైపుల నుంచి దురదృష్టపు చావు దెబ్బలతో చితికిపోయిన గజల్, షాహీన్‌కి చట్టపరమైన భార్యగా మారి తన జీవితానికి భద్రత కల్పించుకుంటుంది. కాని పొరుగు దేశంనుంచి నసీర్, అతని భార్య నఫీస్ రావడంతో ఒక విధంగా పరిస్థితి తారుమారు అవుతుంది. అతనితో ఆమె అక్రమంగా లైంగిక సంబంధం పెట్టుకునేలా బలవంతం చేస్తారు. అంతేకాకుండా యింతకుముందు అతనితో పెళ్ళి నిశ్చయమైన గుర్తుగా యిన్నాళ్ళు వేలికి పెట్టుకున్న బంగారపు ఉంగరాన్ని నసీర్ తీసేసుకుంటాడు. ఇన్నాళ్ళు ఆమె చేతిని ఆ ఉంగరం ఉండటానికి షాహీన్ ఎప్పుడూ అభ్యంతరం చెప్పలేదు. ఇది ఒక విధంగా ఆమె జీవితం కొనసాగడం ఆధారపడివున్న తాయెత్తు వంటిది. ఇది పోయిందని తెలుసుకోగానే బాణం తగిలిన లేడిలా గిలగిల కొట్టుకున్న ఆమె కళ్ళల్లో మరణ వేదన వ్యక్తమౌతుంది. అంతకుముందు ఆమె తన మాజీ ప్రియుళ్ళ ఫొటోలుగల ఆల్బమ్‌ని మంటలో వేసి తగలబెడుతుంది.

విచిత్రం ఏమిటంటే ఈ మంటల్లో సగం కాలిన సర్‌వార్ ఫొటో మాత్రం మిగులుతుంది. అతని కళ్ళల్లో ఒకటి ఆమె వైపు తీక్షణంగా చూస్తూ ఉంటుంది. అతను ఒక్కడే ఆమెను నిజంగా ప్రేమించాడనడానికి యిది సూచన. ఆమె మాత్రం ధైర్యం చేసి అతనితో పెళ్ళికి ఒప్పుకోలేకపోతుంది. ఆమె యీ సందర్భంలో ఉద్రేకభరితమైన, కామ వాంఛితమైన జీవితాన్ని కాక నిరాడంబరమైన సంతృప్తికరమైన అజ్ఞాతమైన జీవితాన్నే కోరుకుంది. పాపం విధి అనుకూలించలేదు.

గజల్ చాంద్‌ని ఆరాధ్యదేవతగా పరిగణించి, అన్ని విధాలా ఆమె నడిచిన మార్గంలోనే నడవాలని ప్రయత్నించినట్టు యింతకుముందు చెప్పుకున్నాము. అయితే ఈమెది కాస్తంత జటిలమైన పాత్ర. చాంద్ అంత స్పష్టంగా కనపడదు. ఒకదాని తరువాత మరొకటి సంభవించిన పరిణామాలను జాగ్రత్తగా పరికిస్తే చాంద్, గజల్ యిద్దరినీ కూడా రాషీద్ తన తీరని ఆశల కోసం వాడుకున్నట్టు కనపడుతుంది. హుమయూన్ నిస్సహాయత, దిక్కులేనితనం కూడా గజల్ మిత స్వభావానికి, ఆమె పాపపుకూపంలో పడిపోవడానికి దోహదపడ్డాయి. ఆమెలో ముఖ్యంగా గోచరించేది ఏమిటంటే ఒక విచిత్రమైన మనస్తత్వం. దెబ్బతిని, వేధించబడిన వ్యక్తిత్వం. ఆమెతో బాటు జీవించే వ్యక్తులు ఎల్లప్పుడూ ఆమెను హీనంగా చూసేవారు. దానితో అల్పులైన ఆమె ప్రేమికులు పలికే తేనె మాటలకు ఆమె యిట్టే మోసపోయి, వారికి లొంగిపోయేది. చాంద్‌లాగే సమాజపు దృష్టిలో ఉండి, తన అందచందాల సమ్మోహన శక్తిని గుర్తెరిగి, నిత్యం కానుకలతో ముంచెత్తబడిన గజల్ ఎల్లప్పుడూ ఎదుటివారి బుజ్జగింపుకి లొంగిపోయేది. అదే ఆమెని దెబ్బతీసింది. వాహిద్ హుస్సేన్‌కి సాంఘిక వాస్తవాలతో రాజీపడే గుణం సహజంగా లేదు. పైగా వయసు మళ్ళింది. దానితో అవినీతిని, అక్రమాలను అరికట్టలేక పోతాడు. 'ఐవాన్-ఎ-గజల్', 'ఆలిఫ్-లైలాల'లో క్రమశిక్షణా రాహిత్యం రాజ్యం ఏలేది. దీనితో చాంద్, గజల్ యిద్దరూ కూడా విచ్చలవిడిగా లైంగిక సంబంధాలు పెట్టుకుని, మెల్లగా స్వార్థపరుల చేతుల్లో చిక్కుకుంటారు. ఇద్దర్నీ వాళ్ళు పూర్తిగా కొల్లగొట్టుకుంటారు. ఖాన్ సాహిబ్, బిల్‌గరామీ ఆరితేరిన అవినీతిపరులు, గూండాలు. అహ్మద్ హుస్సేన్‌కి

అక్రమ సంబంధం వల్ల పుట్టిన నసీర్ దుర్మార్గుడు, నీచంగా మాట్లాడుతాడు. వీళ్ళు కాకుండా ఖుర్షీద్ ఆపా వంటి అల్ప వ్యక్తులు మనకు తారసిల్లుతారు. వీరు వ్యభిచార వ్యాపారం జరుపుతూ చిన్న చిన్న పిల్లలను ఎవరు ఎక్కువ డబ్బు యిస్తే వాళ్ళకి అమ్మేస్తారు. చాంద్, గజల్‌ల అల్లకల్లోల జీవితాలు, వారి దురదృష్టాలను, శరీర ఆకర్షణకు, దుర్బుద్ధికి మధ్య సంఘర్షణకు తార్కాణంగా చెప్పుకోవచ్చు. ప్రణయాధిపతి ఎన్ని రూపాలలో సాక్షాత్కరిస్తాడో, యిందులో యిమిడి ఉన్న ఆపదలేమిటో కూడా మనకు తెలుస్తుంది. ఈ సంఘర్షణ నుంచే అసంతోషం, విషాదం తలెత్తుతాయి. భ్రమలు తొలగిపోతాయి. చాంద్, గజల్ యిద్దరు కూడా యిటువంటి పరిస్థితులనే ఎదుర్కొన్నారు. స్త్రీలు పురుషాధిక్య ప్రపంచంలో ఆటపావులు తప్ప మరొకటి కాదని వారి సునిశిత మనోభావాలను ధనంతో ముడిపడిన యీ వాణిజ్యపు సమాజం అపవిత్రం చేస్తుందని దీనివల్ల వెల్లడి అవుతోంది. చాంద్, గజల్ కూడా వారి అపూర్వ భౌతిక ఆకర్షణ, తొందరపాటు వైఖరుల కారణంగా సీతాకోక చిలుకలుగా వ్యవహరిస్తారు. అధికారం, ధనబలం ఉండి తమ చేత పట్టుకున్న వ్యక్తులు వారి రెక్కలను కత్తిరించి వేశారు. రాషీద్ తన కుయుక్తి, అనవసర జోక్యం చాంద్, గజల్‌ల సర్వనాశనానికి ఎలా దారితీస్తాయో ఊహించలేదు, గ్రహించలేదు. నిర్జీవం, నిస్సత్తువ, నిర్లక్ష్యం మూర్తీభవించిన హుమయూన్ పరిస్థితులు చేయి జారిపోతుంటే చూస్తూ ఊరుకుంటాడు. ఆ తరువాత వాటిని సరిదిద్దే శక్తి అతనికి లేదు. గజల్‌ని తమ వలలో వేసుకున్న వంచకులు కురిపించిన దానధర్మాలతో అతను ఉబ్బితబ్బిబ్బు అయినట్టు కనపడుతోంది. అసలు అతనికి యితరుల మీద ఆధారపడి తినడం అలవాటే. వాహిద్ హుస్సేన్, అహ్మద్ హుస్సేన్‌వంటి వ్యక్తులు పాతబడిపోయిన సంప్రదాయాలను పట్టుకుని వేలాడతారు. క్షీణ జమీందారీ వ్యవస్థకు వారు ప్రతినిధులు. అయితే మిస్కీన్ అలీషా మాత్రం మరింత శక్తి సామర్థ్యాలు, మోస స్వభావంగల వ్యక్తి. అయితే పరిస్థితులను గమనించే అవకాశం అతనికి ఎక్కువగా లభించలేదు. వాహిద్ హుస్సేన్ భార్య- బీబీ. అహ్మద్ హుస్సేన్ భార్య ఉజాలా బేగంలు ఏమాత్రం వ్యక్తిత్వం లేని మనుషులు. అయితే యిదివరలో 'ఐవాన్-ఎ-గజల్'లో పీడించబడి, హేళన చేయబడి, ఆ

తరువాత సంజీవాని పెళ్ళాడిన కైసర్ మాత్రం ఘటికురాలు. ఆమె అజ్ఞాత ఉగ్రవాదులతో చేరుతుంది. ఆమెకు పుట్టిన క్రాంతి ఎంతో గంభీరమైన, మెత్తని స్వభావంగల అమ్మాయి. యవ్వనపు ప్రేమ వికారాల వల్ల చలించదు. దానితో ఆమె అపురూప సౌందర్యంతో, విచలితులైన తుచ్ఛ స్త్రీలోలుడు నసీర్ ఆమెను వలలో వేసుకోడానికి చేసిన ప్రయత్నాలకు లొంగదు. ఒకపక్క మంచి చైతన్యత, కార్యశూరత్వం, సాహసంగల వ్యక్తులు కనపడగా, మరోపక్క షేఖూమియా, గులాం రసూల్‌వంటి వారు తగులుతారు. వారికి కొంత బుద్ధి కుశలత ఉన్నప్పటికీ చాలా వరకు యాంత్రిక జీవితానికి అలవాటు పడి, మనసుకి తోచింది చేసే వ్యక్తులు. వారిలో కొంత విడ్డూరమైన నడవడిక కనపడుతుంది. మన దృష్టిని ఆకట్టుకునే మరో రెండు పాత్రలు రజియా, షాహిన్‌లు. రజియా రాషీద్ భార్య, షాహిన్ వాళ్ళ పెద్ద కొడుకు. రజియా ఈర్ష్య స్వభావంగలది. ముక్కోపి. ఇట్టే ప్రతిస్పందిస్తుంది. కాని చాలా తెలివైనది, అన్నీ తనకి కావలసినట్టు చేసుకోగలదు. షాహిన్ మంచి స్వభావం కలవాడు, ఉదారుడు ఇట్టే ప్రకోపితుడవుతాడు. అయితే దృఢమైన నిర్ణయాలు తీసుకుని వాటికి కట్టుబడి ఉండగల మనో నిబ్బరం ఉంది. గజల్‌కి గల ప్రేమ వ్యవహారాలు, అపఖ్యాతి తెలిసి ఉండి కూడా ఆమెని వివాహం చేసుకోవడంలోనే అతని వ్యక్తిత్వం వెల్లడి అవుతుంది. సుప్రసిద్ధ కవి అయిన సర్వార్ కూడా మన దృష్టిని ఆకర్షిస్తారు. ఆయనకి మంచి భాషా పాండిత్యం, నిజాయితీ తప్ప వేరే ఆకర్షణీయమైన గుణం ఏదీ లేదు. అదే విధంగా ప్రేమ వ్యవహారాలలో చిక్కుకుని అప్రతిష్ఠపాలై, నలుగురి చేత పరిహసించబడే మిస్ రెడ్డీని కూడా మనం మర్చిపోలేము. అలాగే హమీద్‌మియా పేరులేని చెల్లెలు. జీవితంలో సహజంగా పొందవలసిన సౌఖ్యాన్ని అన్ని విధాలా జారవిడుచుకున్న నిర్భాగ్యురాలు. అన్యాయానికి అణచివేతకు, లేమికి బలి అయి లంగ్రీఫోపూ పారిపోయి, రహస్యంగా జరిగిన విచిత్ర వివాహ ప్రహసనంలోని ఒక ప్రధాన పాత్రధారి. ఈ నవలలోని ప్రధాన సంఘటనలు, కథా గమనంలోని మార్పులు బ్రిటిష్ సర్వోన్నతాధికారం సన్నగిల్లి హైదరాబాదు సంస్థానపు రాజకీయ వ్యవస్థలో వచ్చిన మార్పులతో ముడిపడి ఉండటాన్ని మనం గమనిస్తాము.

హైదరాబాద్ సంస్థానపు సర్వం సహాధికారానికి ముప్పు ఏర్పడి, అది చివరికి భారత యూనియన్‌లో విలీనమౌతుంది. దాని ఫ్యూడల్ వ్యవస్థ స్థానంలో ప్రజాస్వామ్య వ్యవస్థ నెలకొంటుంది. దానిలో గతకాలపు బూజు పట్టిన సంప్రదాయాలకు, సాంఘిక పద్ధతులకు ఆదరణ తగ్గి, అవి త్వరలోనే అంతరిస్తాయి. అహ్మద్ హుస్సేన్ పాకిస్తాన్‌కి వలస వెళ్ళిపోవడం, రాషీద్ వ్యాపార సంబంధాలలో మార్పులు దీనికి ప్రతీకలు.

'ఐవాన్-ఎ-గజల్' 1976లో ప్రచురితమైంది. దీనికి మంచి ఆదరణ లభించింది. ఇది ఎంతో జాగ్రత్తగా అల్లిన నవల. చకచకా ఉత్సాహంగా సాగిపోతుంది. వ్యవహారిక నుడికారంపై గల గొప్ప ఆధిపత్యం వెల్లడవుతుంది. వివిధ పాత్రల మధ్య సంభాషణ, వ్యక్తులు, సంఘటనలపై నవలా రచయిత్రి వ్యాఖ్యలు ఎంతో సజీవంగా సునిశితంగా ఉంటాయి. ఆమె పరిస్థితులను నిర్మోహమాటంగా, వాస్తవ దృక్పథంతో అంచనా వేయటమేగాక, అవసరమైన చోట వ్యంగ్య పద్ధతిలో విమర్శించడానికి వెనుకాడలేదు. ఆమె చక్కని అవగాహనతో, నిష్పక్షపాత వైఖరితో నిశిత దృక్పథంతో వివిధ పాత్రల మనోగత భావాలను విశ్లేషించారు. చాంద్, గజల్‌ల విషాద గాధని కేవలం కుటుంబ పరిధికే పరిమితం చేయబడింది గాని దానిని ఏ సార్వత్రిక పరిణామంతోను ముడిపెట్టలేదు. (పురుషుడు, స్త్రీ, పశుత్వం వీటి మధ్య గల నిరంతర త్రిముఖ సంఘర్షణతో మాత్రం దీనిని మేళవించడం జరిగింది). ఇందులోని పాత్రలను వాటి మనోగత భావాల ద్వారా వ్యక్తం చేయలేదు. సువిశాల నేపథ్యంలో వివిధ సంఘటనలను, భిన్న మనస్తత్వాలుగల విభిన్న పాత్రలను ఎంతో వాస్తవంగా చిత్రించడం జరిగింది. వివిధ పాత్రలు తమ పొరపాట్లు, తప్పటడుగులు, కుత్సితాల ద్వారా తమకు తాముగా తెచ్చుకున్న బాధలను, విషాదాన్ని మన కళ్ళ ముందు ఉంచడం జరిగింది. మనిషి ఎంత అల్పుడో, డాంబిక జీవితం ఎంత నిరర్థకమో ఈ నవల చివరలో వెల్లడవుతుంది. వీటన్నింటి కారణంగా యిది ఒక చక్కని నవలగా రూపొందింది.

- ఉస్లూబ్ అహ్మద్ అన్సారీ

# హాలు కిక్కిరిసి ఉంది

సోఫాల వెనుక కుర్చీలు వరుసగా చివరిదాకా వేసివున్నప్పటికీ, తలుపుల దగ్గర, కిటికీలలోన, వేదిక వద్ద ఇంకా జనం నిలబడి ఉన్నారు. బయట వరండాలో ఆ జనసందోహంలో అజీమ్ ఎక్కడా లేడు. కాని అతన్ని గురించిన ప్రశంసలు, అభినందనలు, లవుడ్ స్పీకర్ల ద్వారా వారి చెవులకు సోకుతూనే ఉన్నాయి.

ప్రతికుల్ - హింద్ కాన్ఫరెన్స్‌కు సంబంధించిన ప్రముఖ సాహితీవేత్తలు, కళాకారులు ముందు వరుసలో ఉపవిష్టులయారు. మంత్రియై యుండి, తన విలువైన కాలాన్ని కొంత కేటాయించి ఒక గొప్ప ఉర్దూ సాహితీవేత్తకు అభినందనలు తెలిపేందుకు విచ్చేసిన సభాధ్యక్షుని ఉర్దూ, భాషా భిమానానికి వారు సంతోషిస్తున్నారు.

సభాధ్యక్షులు కార్‌చోటి మసనద్ (జరీతో ఎంబ్రాయిడరీ చేసిన పెద్ద దిండు) బాలీశులపైన కూర్చొని, పంచె కొసను పట్టుకొని, తనకు లభించనున్న ఈ గౌరవానికి ఆనంద పడుతున్నారు. అమితానందము పొందుతున్న ఆయన సభా కార్యక్రమాలను వినే బదులు ఆస్వాదిస్తున్నారా అన్నట్లు నోరు తెరచుకునే వున్నారు. ఆయన వంగి, ఎన్నోసార్లు తన పి.ఎ.ను పిలిచి, తనకు వేసిన ఆ ఎర్ర గులాబీ దండను జాగ్రత్తగా ఇంటికి తీసుకు వెళ్లవలసిందని చెప్పారు. తరువాత తన చెప్పులు, జ్ఞప్తికి వచ్చాయి. ఆయన వాటిని మఖమల్ పరచిన చోట జనం బలవంతం చేయగా విప్పవలసి వచ్చింది.

మంత్రియైన తరువాత ఆయన ఉర్దూ భాషకు సంబంధించిన ఎంతో జ్ఞానాన్ని సంతరించుకున్నారు. ఈనాడాయన ఒక ఉర్దూ సభకు అధ్యక్షత వహించేందుకు అంగీకరించినారు. ఉర్దూ, గజల్ గురించి జరుగుతున్న సభ అది. ఈనాడు ఆయన చేసే ఉపన్యాసాన్ని ఆయన పి.ఎ. ముందుగా ఉర్దూలో వ్రాశాడు. తరువాత అది తెలుగులోకి అనువాదమయింది. తెలుగులో దాని అర్థము తెలుసుకొని, ఉర్దూలో వ్రాసిన దానిని ఆయన

కంఠస్థం చేసేశారు.

గజల్ అని ఏదైనా పక్షినంటారో లేక ఎవరైనా స్త్రీ పేరో అన్న విషయం కూడా ఆయన ఎరుగరు. కాని తనను బలవంతంగా సభాధ్యక్షత వహించమని లాక్కొని వచ్చిన ఒక ఉర్దూ కవిని ఎరుగుదురు. అప్పుడప్పుడే కొత్త ప్రభుత్వమేర్పడింది. అందుకని ప్రధానమంత్రి నెహ్రూ మంత్రులను ప్రజలతో బాగా కలసి మెలసి ఉండవలసిందని, ముఖ్యంగా సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొని ప్రజలకు చేరువ అయేందుకు ప్రయత్నిం చవలసిందని వారినాదేశించారు.

ఆ కారణంగానే ఆయన తన మిత్రుని మాటను మన్నించారు. ఆయన మంత్రిగా కాకుండా కేవలం ఎల్లారెడ్డిగా ఉన్నప్పుడీ వ్యక్తి ఒకసారి పల్లెకొచ్చాడు. అతను నైజామ్ జాగీర్దారీ అత్యాచారానికి వ్యతిరేకంగా ప్రజలను ఉద్రిక్తపరిచాడు. రైతుల పొలాలను లాగివేసుకుంటారని వారిని నమ్మించి, జాగీర్దారులను, భూస్వాములను ఎదిరించేందుకు వారిని సంసిద్ధులను చేశాడు. ఈ నాటికీ చెరగని తన చిరునవ్వుతో గ్రామ ప్రజలందరిని ఆకట్టుకున్నాడు. అతని మాటలను వినేందుకు వెళుతున్న ఆ ఊరి యువకులను, పెద్దలను, అహమద్ హుసైన్ నవాబు వారించి ఒక రోజు అందర్నీ జైళ్లలో మగ్గేటట్లు అతను చేయగలడని బెదిరించారు.

కాని యువకులు ప్రభంజనము వంటివారు. వారు అజీమ్‌ను కలుసు కునేందుకు అనేక మార్గాల నన్వేషించుకున్నారు.

ఆ రోజులలో ఎల్లా రెడ్డి తమ గ్రామంలోని బడిలో, పిల్లలకు చదువు చెప్పేవారు. ఒకనాడు అజీమ్ ఆ పాఠశాలకు కూడా వచ్చిపడ్డాడు. పిల్లలకు చదువు చెప్పడానికి కావలసిన నూతన బోధనా పద్ధతులను, కొత్త పాఠాలను నేర్పించేందుకుపక్రమించాడు. అక్కడి నుంచి వెళ్లేటప్పుడు, విద్యార్థులు మొదలు అధ్యాపకుల వరకూ అందరినీ మిత్రులుగా మలచుకున్నాడు. గ్రామ ప్రజలందరి హృదయాలను దోచుకున్నాడు. అతను యువకుడు. బక్క పలుచగా, సామాన్య ముఖకవళికలు గలవాడు.

ఆ కాలంలో కైసర్, సంజీవాల గురించి చర్చలు జరుగుతూండేవి.

---

1. తెలంగాణా ఉద్యమానికి సంబంధించిన ముట్టడిదారులు.

వారు దలమ్‌కీ[1] మార్గదర్శకులుగా పని చేసేవారని వినికిడి. కైసర్ ఏదో జాగీర్‌దారీ వంశానికి సంబంధించినదైనప్పటికీ మెషీన్‌గన్ చేతబట్టి నిజామ్ సైన్యంతో పోరాడుతూంది.

అప్పటివరకు ఎల్లారెడ్డి దృష్టిలో దక్కను తురకవారు కేవలం రెండు రకాల వారు మాత్రమే. తన కోపంతో గ్రామాన్నంతా వణికించే అహమద్ హుసైన్ వంటి నవాబులు లేదా ప్రతి ఉదయం చిరిగి శిధిలావస్థలోనున్న జోళ్ల మధ్య తానూ ఒక కుళ్లిన చెప్పులాగా కూర్చునే సలారు మోచీ వంటివారు.

అల్లా ప్రతి తురకవాడిని నవాబు అహమద్ హుసైన్ వలె సృష్టించి ఈ భువికి పంపుతాడనే వాడు సలారు. కాని తమ కర్మాలను బట్టి సలారు, గుడ్డి భార్యలాగ ఇంటింటా బిచ్చ మెత్తుతూ తిరుగుతూంటారు.

మరికొంతకాలం గడిస్తే ఎల్లారెడ్డి కూడా ఆ యువకుల మాటలకు లోనై పుట్టిముంచుకునే వారేమో కాని భగవంతుడి సంకల్పం మరొక విధంగా ఉండబట్టి స్వామీ ఆనందరావుగారు, ఢిల్లీ నుంచి నవాబు అహమద్ హుసైన్‌కి అతిథిగా వచ్చేశారు. కాంగ్రెస్ పార్టీ గొప్ప నాయకుడై యుండి కూడా ఈసారి ఆయన ప్రజల వద్ద నుంచి చందాలు వసూలు చేయలేదు. ఎటువంటి కానుకలు అంగీకరించలేదు. ఆయన కేవలం, బ్రిటిష్‌వారు తమ మూటాముల్లె సర్దుకుంటున్నారన్న శుభవార్తను తెలిపారు. కనుక కాంగ్రెస్ కూడా తన శక్తినంతా కూడ గట్టుకుని ప్రజలను నిజామ్ పంజానుంచి విముక్తుల్ని చేసే కాలం ఆసన్నమయిందని, లేకుంటే కమ్యూనిస్టులు తెలంగాణా ప్రాంతాన్నంతా కబళించి వేయగలరని వక్కాణించారు.

అప్పట్లో గ్రామంలో ప్రతిరాత్రి ప్రళయాన్ని తీసుకువచ్చేది. నవాబు అహమద్ హుసైన్ తన రక్షణార్థమై పట్టణం నుంచి పిలిపించుకున్న ఇత్తిహాదుల్ ముసల్మీన్ రజాకార్లు (స్వయంసేవకులు) అల్లాహో అక్బర్ అనే నినాదాలతో బయలుదేరేవారు. తరువాత వారితో పోరాడేందుకు ఎర్రజెండాలు కల సైన్యం కొండల పైనుంచి దూకి వచ్చేది. ఉదయం పశ్చాత్తప్తుడివలె సిగ్గుతో, వ్యాకులపాటుతో సూర్యుడు గ్రామంలోకి తొంగి చూసేసరికి పొలాల విరిగిన గట్లపైన శవాలు పడుండేవి, ధాన్యంతో

నిండి ఉన్న పంట రక్తంలో స్నానమాడినట్టు కనబడేది.

ఇటువంటి పరిస్థితులలో నవాబు అహమద్ హుసైన్, స్వామీజీ కలసి గ్రామంలోని బుద్ధిమంతులైన యువకులను ప్రోగుచేశారు. ఎల్లారెడ్డి కాంగ్రెస్ పంచాయత్ కమిటీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ఆ రోజు విశేషమేమిటోగాని ఎల్లారెడ్డి మెట్లధిరోహిస్తూనే ఉన్నారు. ఆయన నవాబు అహమద్ హుసైన్ సూచించిన మార్గాన్ననుసరించి నేడు మినిస్టరై గద్దెనెక్కారు.

ఆయన కెదురుగా ఆ బక్క పలుచని ఛామన చాయగల యువకుడు ఎప్పటివలె చిరునవ్వు చిందిస్తూ కూర్చున్నాడు. తన దృఢమైన ఉద్దేశ్యాలను ఏనాడు సడలనివ్వలేదు. తుపాకీ గుళ్ళకు గుండెనెదురొడ్డాడు. ఉరిత్రాడతని వెన్నంటి పరుగెత్తుతున్నా, స్థిరంగానే నిలబడ్డాడు. ఎల్లారెడ్డి అతనికెన్నో స్వప్నాలు సూచించారు. ఢిల్లీలో ఏదైనా పెద్ద పదవినిప్పిస్తానని ఆశ పెట్టారు. దేనిపై ఆశ ఉందో కాని అతనే పదవిని లెక్క చెయ్యలేదు. కాలం అతనిలో ఎటువంటి మార్పు తేలేదు.

అతనిప్పుడు కూడా చిరిగిన చెప్పులను ఈడ్చుకుంటూ సభలకి సమావేశాలికి తిరుగుతూ కనబడుతుంటాడు. అతనికి క్షణమైనా తీరుబడి ఉండదు. ప్రతి క్షణం ఎంతో యోచించి వెచ్చించేవాడు. ఈ సమయంలో వేదిక కెదురుగా సోఫా మీద కూర్చున్న ఎల్లారెడ్డిని చూస్తున్నప్పుడు, అతని వెనుక, అతని అభిమానులు పెద్ద, సంఖ్యలో గుమిగూడి ఉన్నారు. సాహితీవేత్తలు కవులు, కళాకారులు అల్లా ఏ దిక్కు చూసినా నేడు ఐవానే గజల్‌లో ఎంతమంది ఇమిడిపోయారో!

పది సంవత్సరాలకు ముందు ఏ అజీమ్ అంటే భయపడి పారిపోయారో ఆ అజీమ్ ఆహ్వానం మీద ఒక ఉర్దూ సభకు అధ్యక్షత వహించవలసి వస్తుందని కాని, అక్కడ గజల్ పరమైన తన అభిప్రాయాలు వ్యక్తం చేయవలసి వస్తుందని కాని ఆయనకేం తెలుసు?

అదీ ఎలాంటి సభ! పాదరక్షల రక్షణార్థం ఎటువంటి ఏర్పాటూ చెయ్యనటువంటి సభ. అదీకాక కారచోబీమసనద్‌పై కూర్చోడానికి బాధాకరంగా ఉండటమే కాక ఆయన కొత్త పంచె ఆ జరీలో చిక్కుపడి చిరిగిపోతోంది. ఇవన్నీ, జాగీర్‌దారుల గొప్పలు. ఆయన ఐవానే గజల్

యొక్క ఈ సువిశాలమైన హాలుని చూశారు. ఇంత పెద్ద మహాలు, ఇంత అందమైన హాలు, షాండ్లియర్లతో ఖరీదైన మఖమల్ తివాసీలు పరిచిన హాలులో ఈ మహల్‌కి యజమానులు, కవులు అయినటువంటి జాగీర్‌దారుల చిత్రపటాలు బంగారు ఫ్రేములలో అమర్చబడి ఉన్నాయి. వారి సంతతి వారు ఈ మహాలు, దాని గ్రంథాలయాన్ని ఉర్దూ భాష కొరకు ప్రజలకిచ్చేశారు.

కానీ అజీమ్ స్నేహితుడైన సురుర్‌కి పన్నెండు సంవత్సరముల తరువాత ఐవానే గజల్‌కి వచ్చినందుకు విపరీతంగా విసుగేస్తోంది. సురుర్ కూర్చున్నవైపే ఉంది ఆడపిల్లల దృష్టి. అతను హైదరాబాదు వాస్తవ్యుల ప్రియమైన గొప్పకవి. పెద్ద పెద్ద అందగత్తెల గర్వాన్ని అణిచివేశాడు. అతనిపై ఆసక్తి కలవారెందరో, కానీ అతను మాత్రం అవివాహితుడే - నలభై సంవత్సరాల బ్రహ్మచారి. ఐవానే గజల్‌కి వచ్చి దిగులు పడసాగాడు. అర్థరహితమైన తన చేతులను చూసుకుంటూ ఇప్పుడు వీటినేం చేయాలి, ఎక్కడ పెట్టాలి అని ఆలోచించసాగాడు.

ఏదో మంచి షేర్ పూర్తవబోతున్నట్టు అంత వరకూ తానొక్క షేర్ కూడా చెప్పలేక పోయినట్టు కలవరపడ్డాడు. తన రెండు కవితా సంపుటాలు పెద్ద బండ రాయిలాగ మెదడు మీద ఉన్నట్లు, వాటి బరువు వలన తల పగులుతున్నట్టు అనిపించింది.

తల పైకెత్తి చూశాడు.

డాక్టర్ యాకూబ్ హుసైన్ తన స్థూలకాయాన్ని మోసుకుంటూ గంభీరమైన కంఠంతో గర్జిస్తున్నాడు. తన పట్టు సడలితే ఎక్కడ జారి పోతూందో అన్న భయంతో మైక్‌ని ఒక చేతితో గట్టిగా పట్టుకున్నాడు.

'అధ్యక్ష మహాశయా!

నా వ్యక్తిగత అభిప్రాయం ప్రకారం గజల్ అన్నది మన వాఙ్మయంలో తరుకులేని జ్యోతి వంటిది. మీరనుమతిస్తే... నేననేదేమిటంటే... సాహిత్యం నుంచి గజల్‌ని తీసివేసినట్లయితే కవిత్వపు ఊహా ప్రపంచం అంధకార బంధురమైపోతుంది. నా ఉద్దేశ్యమేమిటంటే... నా స్వీయాభిప్రాయం... నా దృక్కోణం... నేను... నాయొక్క...'

సురుర్ కాళ్లూపుతూ ఆలోచించసాగాడు. పాతకాలపు ఆలోచనలు

కల వాడైనప్పటికి యాకూబ్ హుసైన్ అంత పెద్దవాడు కాడు. ఆయన గజల్ గురించి చక్కటి, మరీ సత్యమైన మాట అన్నాడు కాబట్టి అతని పెద్ద, పొట్ట, పెదవుల కొనల నుంచి కారుతున్నటువంటి ఉమ్మి అతని స్వంత ఉద్దేశ్యాలను, కూడా భరించవచ్చునుకున్నాడు. గజల్ లేకుంటే, ఒక ఊహా లోకమేమిటి, ప్రపంచమే చీకటి మయమైపోతుంది. ఇది వాస్తవం. ఎదురుగా ఉన్నటువంటి అందమైన యువతుల గుంపు కనబడేదే కాదు కవిత్వమంతా రసహీనమైపోయేది - ఆత్మ రహితమైపోయేది!

కరతాళ ధ్వనుల హోరుకి సురుర్ ఉలిక్కిపడ్డాడు. సెమినార్ మొదటి భాగం పూర్తయిపోయి ఉంటుందనుకొని సిగరెట్ తీసుకొని నిలబడ్డాడు.

కానీ డాక్టర్ యాకూబ్ హుసైన్ తప్పుకోగానే సిరాజ్ హాష్మి మైక్రోఫోన్‌ని కైవశం చేసుకున్నారు. ఆయనకి పాత విషయాలను త్రవ్వడమంటే మహా సరదా. కులీ కుతుబ్‌షాహి మొదలుకొని ఆజీమ్ వరకూ గల వంశ వృక్షము, వారి వంశ పరిస్థితులు వారి తప్పులు, ఇంకా పొరపాట్లు, వారు మరణించిన తేదీలు అన్నీ ఆయనకు కంఠస్థమే. అందువలన ఆయన వస్తూనే గజల్‌కు సంబంధించిన విషయాలను ఏకడం ప్రారంభించారు.

గజల్ గురించి ఒక పాత వినికిడి ఏమిటంటే, అసలు గజల్, గజాల్ (జింక)కి సంబంధించిన విషయం - వేటగాళ్ళు వేటాడినప్పుడు, గాయ పడినప్పటికి జింక పరుగెడుతునే ఉంటుంది. వేటగాళ్లు కూడా దాన్ని వెంటాడుతునే ఉంటారు. చివరికి శరీరమంతా గాయాలతో నిండి పోయినప్పుడు అది పడిపోతుంది. అప్పుడు దాని కళ్ళలో కనపడే బాధ, నిరాశలను 'గజల్' అంటారు.

సిగరెట్ వెలిగిస్తున్న సురుర్ చేతులు ఆగిపోయాయి. అతని పెదవులు ఆశ్చర్యంతో తెరుచుకునే ఉండిపోయాయి. స్వప్నహీనమైన అతని కళ్లు, అలాగే స్థిరంగా ఉండిపోయాయి. శిలా విగ్రహంలాగా ఉండిపోయిన అతను సిరాజ్ హష్మిని రెప్పలార్పకుండా చూడసాగాడు. అతని అంతరంగంలో అంతా కల్లోలంగా వుంది. భయంకరమైన యుద్ధం జరుగుతూంది. వేలాది వేటగాళ్ళు గాయపడ్డ జింకను చుట్టుముట్టి బాణాలు కురిపించసాగారు.

ఉష్!... ఆ జిత్తులమారి ముసలాడు ప్రాణాలు విడుస్తున్న లేడి ముఖాన్ని చూసి ఉంటాడు. అతడు బహుశా గజల్, ఐవానే గజల్ గురించిన పూర్తి వివరాలను తెలిసినవాడై ఉండవచ్చు.

సభ సమాప్తమయింది... అంతా వెళ్లిపోయారు...

ఒంటరిగా, నిర్మానుష్యంగా ఉన్న ఐవానే గజల్‌లో కూర్చున్న సురుర్ గజల్‌కు సంబంధించిన భావాలలో లీనమయిపోయాడు.

ఉదయం!

ప్రతి ఉదయం ఎంత అందంగా ఉంటుంది ఎంత కొత్తగా, ఉత్సాహాన్ని పెంపొందించేదిగా ఉంటుంది. పోస్టుమాన్ తలుపు తడుతున్నట్లు ప్రతిదినం లేవగానే ఏదో ఆనందానుభూతి కలుగుతుంది. ఈ పోస్ట్‌లో ఎన్ని శుభవార్తలు నిండి ఉన్నాయో ఎవరికి తెలుసు!

ప్రాతఃకాలం ఒక పోస్ట్ బంట్రోతులాగ హృదయపు కవాటాలను తడుతుంది. జీవితంలో ఒక కొత్త రోజు ప్రారంభం, ఒక నవల మొదటి పుట... ఒక కొత్త గజల్ ప్రథమ పంక్తి!

మన వారసులు ఈ ఉదయాన్ని స్పృశించలేరని, భావిలో పుట్టబోయేవారు దీనిని గురించి ఆలోచిస్తారన్న విషయం తల్చుకుంటే ఎంత ఆనందంగా ఉంటుంది. కేవలం మనం మాత్రం హక్కు దారులమైన ఈ క్షణాలెంత శక్తివంతమైనవో! కాలం యొక్క ఈ ఆస్థిపై హృదయంలో ఒక విధమైన వేదన ఉద్భవిస్తుంది. నీటి బుడగలాగ నాలుగు దిశలా వెదజల్లుతూ పోతుంది.

తోటలో సపోటా చెట్టుక్రింద కుర్చీలో కూర్చున్న వాహిద్ హుస్సైన్ ఆలోచిస్తున్నాడు. ఉదయపు శోభను ఒక షేర్‌గా మలచాలని ప్రభాత ప్రార్థనలకు (నమాజ్) ముందే ఇక్కడకు వచ్చి నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఎదురుగా కవిత్వం రాసుకునే నోట్‌బుక్‌లో సరిగ్గా కుదరక చిందర వందరగా ఉన్న గజల్ యొక్క ఒకటిన్నర పంక్తి రాసి వుంది. దానిపైన కళ్ళజోడు, కళ్ళజోడుపైన క్రిందటి రోజు కోర్టునుంచి ఆయన పేర వచ్చిన సమన్ పెట్టబడింది.

'ఏ కవైనా ఈ విధంగా కవిత్వం చెప్పి ఉంటాడా?'

కవితా దృష్టిని పెంపొందించే చుట్టుప్రక్కల వాతావరణాన్ని

సంబోధిస్తూ ఆయన ఈ విధంగా అన్నారు. నాకంటే ముందున్నటువంటి కవుల కెప్పుడైనా శాంతి లభించిందా, అని ఆలోచించారాయన. శాంతి జీవితము, మృత్యువు కూడా అయినటువంటి శాంతి. ఆ శాంతి అన్వేషణలోనే మనిషి భూమిని చీల్చి వేశాడు, సముద్రాన్ని కలచి వేశాడు, ఆకాశాన్ని గాలించాడు, కాని అదెక్కడా లభించలేదు.

వాహిద్ హుసైన్ శాంతియుతమైన క్షణాలను విశ్లేషించాలని నిత్యం అనుకునేవారు. శాంతి భేదాలను జ్ఞాపకం చేసుకునే వారు... ఎటువంటి శాంతి? ఆయన ఉద్యోగం చేసిన ముప్పది సంవత్సరాలు ఈ శాంతి కొరకు అన్వేషిస్తూనే గడిపివేశారు. ఇప్పుడు కూడా దేని కోసమో నిరీక్షిస్తున్నారు... మృత్యువు కోసమా! లేక మార్పు తీసుకువచ్చే ఆ రాబోయే కాలం కోసమా... ఏదైనా శుభవార్త... శుభవార్త కూడా ఎంత విచిత్రమైనది. ఈ కాలంలో శుభవార్త అంటే స్వలాభం అని రాషిద్ చెప్పేది నిజమే. వాహిద్ హుసైన్ ఎప్పుడూ దేన్నీ అంగీకరించరు. స్వార్థపరుడైనటువంటి తన కుమారుని మాటలకి ఆయనకి ఆశ్చర్యం వేస్తుంది. బాధ కూడా కలుగుతుంది. ఐవానే గజల్‌లో నివసిస్తూ కవుల వంశానికి చెందిన వాడై వుండి కూడా రాషీద్ ఎంతో రసహీన హృదయుడు. అనుక్షణం లాభనష్టాలు బేరీజు వేసుకుంటూ కూర్చునేవాడు. కానీ వాహిద్ హుసైన్ ఆ భయాన్ని మనసు లోంచి తీసిపారవేశారు. నష్టం అన్నది మనిషియొక్క అదృష్టం, అది కేవలం అతనికే స్వంతం. ఎందుకంటే నష్టమనేది మనిషి ఒంటరిగా అనుభవిస్తాడు, పాలుపంచుకునే వారుండరు.

విసిగిపోయి పుస్తకం తీసుకుని లోనికి వెళ్ళి పోదామనుకున్నారాయన. అప్పటికే గౌహర్ బేగమ్ హారారా తీయని పానీయం తయారు చేసేసి ఉంటుంది. కాని ఇప్పుడాయనకి, కవిత్వం మత్తెక్కించె పానీయం అయిపోయింది. ప్రతి కొత్త గజల్ ఆయనకు నూతన శక్తిని ప్రసాదిస్తూంది. నలువైపుల నుండి చుట్టుముట్టిన చింతలను పారద్రోలలేక పోయినప్పుడు ఆయన ఏదేని కొత్త విషయాన్ని పద్యంగా మలచడానికి ప్రయత్నించేవారు. దానితో పాటే కాలగమనాన్ని తెలుసుకునేందుకు సపోటా చెట్టు నీడను పరికిస్తూండేవారు.

విజ్ఞానం ఎంతో వికసించింది. కాలమానం కనుగొనేందుకు ఎన్నో

రకాల గడియారాలు ఆవిష్కరించబడ్డాయి. కానీ వాహిద్ హుసైన్ ఇప్పటికీ ఎండ - నీడలు వలననే కాలాన్ని ఊహించుకునే వారు. పింఛను ప్రారంభమైన నాటినుండి ప్రతీకారంగా గడియారం చూడడం మానేశారు. ఈ గడియారమే ముప్పై ఐదు సంవత్సరాల వరకు రోజులను, గంటలను తిప్పేసింది.

ఇప్పుడాయన హాయిగా ఆలోచిస్తూ కాలాన్ని గడుపుతున్నారు. ఋతువుల సూక్ష్మమైన మార్పును కూడా ఆయన అనుభూతి చెందుతున్నారు.

ఈ రోజు ఆకాశమెంతో ముదురు నీలం రంగులో ఉంది! రాత్రి చలి ఎక్కువగా ఉంటుంది.

ఇవాళ ఎంత ఉక్కపోస్తూంది. మధుమాసం వస్తూంది కాబోలు.

అంజూరా చెట్టు చివురిస్తూంది. ఇక వసంతం రానున్నది. ఈ కవులు వసంత ఋతువు వెంటపడతారెందుకో!

రాషిద్ ఆలోచిస్తూండేవాడు - మంచిదేనండి, వసంతం వచ్చేసింది ఒప్పుకుంటాను. తోటలో నాలుగైదు పువ్వులు ఎక్కువగా వికసించాయి. ఒకటో, రెండో రంగు రంగుల పిట్టలు గెంతుతూ కనబడ్డాయి. చూడండి బాబూ, అల్లా... అల్లా... ఖైర్‌సల్లా!...

రాషిద్ ఈ విధంగా రేయింబవళ్ళు రూపాయిలు - పైసలు మార్పిళ్ళలో చిక్కుకుపోవడం చూసి వాహిద్ హుసైన్ గుండెలో ఎవరో గుచ్చినట్లనిపించేది. ఈ కాలం కుర్రాళ్ళెంత భౌతికవాదులయి పోతున్నారో! సున్నితమైన భావాలు వీరిని స్పృశించలేదు. తన తండ్రి ఎండాకాలం కొరకు ఎటువంటి ఏర్పాట్లు చేస్తున్నాడో కూడా రాషిద్‌కి తెలియదు. మల్‌మల్ లాల్చీలు, తయారుగా ఉన్నాయి. తోటలో మళ్ళల్లో పూలమొక్కల కొత్త కొత్త అంట్లు నాటుతున్నారు. ద్రాక్షతీగల కటింగ్ అయిపోయింది. శిస్తుల లెక్కలు చూచుకొనేందుకు గ్రామానికి వెళ్లాలి.

వాహిద్ హుసైన్ ప్రతి ఋతువుకి ఏదో పండుగ వస్తున్నట్టు ఈ విధంగా స్వాగతం పలికేవారు. ఇతరుల ఇళ్ళల్లో చూడండి! కూర్చుంటూ లేస్తూ చలికాలం గురించిన బాధ, ఎండాకాలం వస్తే ఎండల్ని తిట్టుకోవడం ప్రారంభమౌతుంది. ఎండలు తమతో మామిడి పళ్ళను కూడా తీసుకు

వాహిద్ హుసైన్ ఈ విధమైన కవిత్వపు ధోరణిలో మాటలాడటం చూసి ఒకసారి సరోజినీ నాయుడు అన్నారు - 'వాహిద్ నవాబ్! మీరు మీ ఈ కోమల భావాలను కవిత్వం ద్వారా వ్యక్తం చేస్తే ఎంత బాగుండేది!'

ఈ మాటకి అక్కడున్న వారంతా నవ్వేశారు. ఎందుచేతనంటే వాహిద్ హుసైన్ తనను కవిగా తప్ప మరో విధంగా భావించరు.

వాస్తవానికి ఆయనెంత చక్కటి విషయాల గురించి ఆలోచించేవారో ఆ భావ సౌందర్యం ఆయన కవిత్వంలో ఎప్పుడూ వ్యక్తం కాలేదు. ఎందుచేతనంటే ఆయనెప్పుడూ 'దాగి' (ఒక కవి) యొక్క ఊహా - పద్ధతులను అనుసరించేవారు. ఆయన కవిత్వంలో నఖ-శిఖ వర్ణన, చవుకబారు భావాల తళుకు బెళుకులు తప్ప మరేదీ ఉండేది కాదు. ఈ విషయంలో ఆయన శాస్త్రాలను, తన ప్రతిభకు సంబంధించిన సమస్యలను ఆవలకు నెట్టి వేసేవారు. ఎందుచేతనంటే వారి వంశంలో ఏడు తరాలనుంచి వస్తూన్న కవిత్వంలో ఈ విధమైన అనుకరణే కనబడుతుంది.

ఆయన ప్రియురాలి పొగడ్తలు తప్ప మరేమీ వినియుండలేదనడానికి ఐవానే గజల్ తలుపులు గోడలే సాక్ష్యాలు.

అప్పుడు, వాహిర్ హుసైన్ చుట్టూ ఉన్న వాతావరణం శాంతియుత నిశ్శబ్దతతో నిండి ఉంది. అజుర్[1] నెల పూర్తి కావస్తూంది. ఉదయం అస్పష్ట వాతావరణంలో నిండి ఉన్న ఒక విధమైన చల్లదనం ఉంది. శరీరంలో చలి పుట్టిస్తూంది. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. కాని చెట్లపై పక్షులు మేలుకున్నాయి. ప్రపంచపు సమస్యలపై వాటిలో గంభీరమైన చర్చ జరుగుతూంది.

తెల్లవారుతూండడం వల్ల రోడ్డుపైన రంగుల నీడలు కనబడుతున్నాయి. తోటమాలి అప్పుడే పైప్‌తో లాన్‌లోని గడ్డిపై నీరు చల్లాడు. దాని వల్ల తడిసిన గడ్డి వాసనలో, అప్పుడే విరిసిన రంగు రంగుల పువ్వుల వాసన మిళితమైంది. కుళాయి కట్టి ఉంది. కాని దానిలోంచి పడుతున్న సన్నని నీటిధార నుంచి ఎవరో ఒక విధమైన వేగంతో నడుస్తున్నట్టు, క్రమబద్ధమైన శబ్దం వస్తూంది.

వాహిద్ హుసైన్ తలపై సపోటా చెట్టుపైన పక్షులు ఇష్టమొచ్చినట్టు

---

1. ఇరానీ వారి క్యాలెండర్‌లోని 9వ మాసం

అల్లరి చేయడంతో మునిగిపోయాయి. ఆ సమయంలో ఆయన చాలా బాధపడుతున్నారన్న విషయం వాటికసలు పట్టలేదు.

ఈ పక్షులకి కూడా సమస్యలుంటాయి. తమ దృక్పధాలు, సిద్ధాంతాలను ఒప్పించేందుకు ఇంత గట్టి - గట్టిగా అరవవలసి వస్తుంది. ఆ కారణంగా అవి ఒకదాన్నొకటి చంపడానికి లేక చావడానికి సిద్ధ పడిపోతాయి. ఏకాభిప్రాయం వున్నవన్నీ ఒక గుంపుగా కలిసి ఉంటాయి. మానవుడు ఎక్కువగా చదివి, అతిగా ఆలోచించి లక్ష్యాలను ఏర్పరుచుకున్నాడు. మనిషి జ్ఞానార్జన కోసం చైనా వరకూ వెళ్ళగలడు, కాని అక్కడి నుంచి తిరిగి వచ్చేటప్పుడు తనతో ఏమి తీసుకు వస్తాడు? ఏ సమస్యకైనా సమాధానం పొందడం సంభవమా? ఆయన కళ్ళజోడుని, తను వ్రాసిన గజల్ యొక్క ఒకటిన్నర పంక్తులపైన పెట్టి ఆలోచించి, వార పత్రిక కోసరం ఎదురు చూడసాగారు. ఏదైనా ముఖ్యమైన వార్త కోసం ఉదయం ఎంతగానో ఎదురు చూడడం జరుగుతుంది, చివరికాయన దిగులుతో వార్తా పత్రికను మడిచి పెట్టిస్తారు. కళ్ళజోడు తీసేసి 'నేటి దిన పత్రికలో ఏమీలేదు' కాని ఏదో ఒక రోజు చాలా ఉండవచ్చు, అంటూ తనలో తానే గొణుక్కునేవారు. నాజీల కుట్రలు, ఐరోపా ఖండంలో రగులుతున్న అగ్ని, గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం పైన వ్యాఖ్య... ఆనాడు వాహిద్ హుసైన్ రక్తపు పోటు ఇంకా పెరిగిపోయేది. ఆయన నాడి వార్తా పత్రిక మీదే ఆధారపడ్డట్టు నిజానికి ఆయన తన స్నేహితులతోనూ, కొడుకు రాషిద్‌తోనూ, 'ఇదిగో, ఇతరుల విషయాలతో మనకేం పని! మన దేశంలో శాంతి భద్రతలుంటే చాలు...'

కాని తమ భవనం, ఐవానే గజల్‌లో తప్ప ప్రపంచంలో ఇంకెక్కడా శాంతి భద్రతలు లేనట్టు ఆయన భావన.

'షి... షీ... షూ... వు... వూ...'

రంగు రంగుల రెక్కలుగల చిన్నపక్షి తన ఈలవంటి చక్కటి ధ్వనితో వాహిద్ హుసైన్‌తో సంభాషించేందుకు వచ్చేసింది. ఈ పక్షి రోజుకి ఎన్నోసార్లు ఆయన వద్దకు వచ్చి ఎవరో దొరసాని ఆంగ్లంలో మాట్లాడుతున్నట్టు మాట్లాడేది. ఉదయం ఫలహారం చేసిన తరువాత చిన్న చిన్న రొట్టి ముక్కలు ప్రాంగణంలో వెదజల్లేవారు. దీనికి

మాట్లాడుతున్నట్టు మాట్లాడేది. ఉదయం ఫలహారం చేసిన తరువాత చిన్న చిన్న రొట్టి ముక్కలు ప్రాంగణంలో వెదజల్లేవారు. దీనికి ప్రత్యామ్నాయంగా ఆ పక్షి ఆయన ప్రతి కొత్త గజల్ వినేందుకు సిద్ధంగా ఉండేది. ఆయన సమస్యలకి, బాధలకి వూరట కలిగిస్తూ సలహా యిస్తూండేది. ఆయనతో కలసి ఆయన శత్రువులను ఎప్పుడూ శపించేది.

పక్షితో పాటు రంగు, రంగుల సీతాకోక చిలుకల గుంపు కూడా, ఆహ్లాద పరచేందుకు వచ్చేవి. ఆ గుంపు చిన్న - చిన్న మొక్కలపైన రంగు, రంగుల పూరెక్కల వలె కనబడేది.

ఎర్ర మోరమ్ మడి ఆయన కుర్చీ మొదలు దూరంగా ఉన్న గేటు వరకూ ఉంది. ఆ గేటు ఐవానే గజల్ హృదయంలాగ తెరుచుకుని వుంది. గేటుకి రెండు ప్రక్కల జీనియా వువ్వులు విపరీతంగా ఉన్నాయి. దాని వెనుక క్రోటన్ తోటల వరుసలు ప్రారంభమయాయి. గేటుకి దక్షిణం వైపు ఎరుపు, తెలుపు రంగుల పూలతో బోగన్‌విలియా లత, ఐవానే గజల్ అధికారాన్ని పూర్తిగా కప్పివేసింది. హైదరాబాద్‌లో నివసించే ప్రతివారికీ ఆ భవంతి, అందులో నివసించే వారు సుపరిచితులే. గేటు దగ్గర నుండి లోపలి వరకు మళ్ళ కిరుప్రక్కల పచ్చని గడ్డిని కత్తిరించి పెద్ద - పెద్ద పూల మళ్ళు తయారయ్యాయి. వాటిలో ఊదా, తెల్లటి పువ్వులనెవరో గంపలతో గుమ్మరించినట్లున్నాయి. ఈ పూరాశుల క్రమం పైన మెట్ల వరకు ఉంది. అక్కడి నుంచి ఐవానే గజల్‌లోని అన్నిటికంటె పెద్ద హాలు బైత్ - ఉల్ - గజల్ కనబడుతూంది. ఎదురుగా స్థంభాలు ఆధారంగా పెద్ద వరండా ఉండేది. దానికి రెండు వైపుల లోపలికి వెళ్ళేందుకు దారులు మధ్యలో బైత్ - ఉల్ - గజల్ ద్వారం. ఆ భవనంలోని అన్ని భాగాల క్రమం చివరికి ఆ హాలులోకి వచ్చి కలిసేది. హాలులోపలి నేలపైన ఎర్రటి మఖమల్ తివాసీలు పరచి ఉన్నాయి. పాత అఖరోట్ చెక్కతో చేయబడిన అతి విలువైన పెద్ద సోఫాలు, మఖమల్‌తో కప్పబడి ఉన్నాయి. వాటి వెనుక బంగారు రంగులతో నగిషీలు చెక్కిన కుర్చీలు బారులు తీరి ఉన్నాయి. వాటి మధ్యలో ఎత్తైన ఆసనం, దానిపైన జరీతో కూడిన తివాసీ పరచి ఉంది. ఆ తివాసీపైన కారచోబీ దిళ్ళు వేసి వున్నాయి. హైదరాబాద్‌కి వచ్చిన ప్రతి ముఖ్యమైన కవి ఆ ఆసనంపైన కూర్చుని

తన భావాలను వ్యక్తం చేసేవాడు. ఆ హాలులో, కవులై ముషాయరాలను నిర్వహించిన, వాహిద్ హుసైన్ పూర్వీకులందరి ఫోటోలు బంగారు ఫ్రేముల్లో అమర్చి ఉన్నాయి. ఒకదాని కంటే ఒకటి గొప్ప హుందాతనంగల ముఖాకృతులు. ఒక చిత్ర పటంలో పెద్ద గుబురు మీసాలుంటే వేరొక దానిలో పొడవైన గడ్డం కదులుతూన్నట్లు కనబడేవి. తలకు పగిడీ చుట్టుకుని నడుముకి కత్తులు వేలాడదీసిన వారిలో, అవసరమైనప్పుడు కత్తి తిప్పడం ఎవరికీ చేత కాలేదు. వారందరూ కలం పట్టడంలో ఘటికులు. క్లిష్ట పరిస్థితి ఎదురైనప్పుడల్లా వారికి ఓటమే సంభవించింది. అతి విలువైన, దుర్లభమైన పుస్తకాలతో ఐవానే గజల్ గ్రంథాలయం నిండి ఉంది. క్రమంగా ఐవానే గజల్ డాబు - దర్పం తరిగిపోవడం జాగీర్లు తగ్గి పోవడం, మోసాలు, కుట్రలు పెరిగి పోవడంతో గత్యంతరం లేక, వాహిద్ హుసైన్, భవనం నుండి బైటకొచ్చి తహసిల్దార్ వంటి అతి సామాన్యమైన ఉద్యోగం చెయ్యడం, ఆగ్నున కుమారుడు ఇంజనీరింగ్ చదివేందుకు విదేశాలకు వెళ్ళడం అంతా ఈ పుస్తకాల ప్రభావమే. ఇటువంటి గడ్డు రోజులు చూడడం ఈ మహాలు ముఖాన వ్రాయబడిందేమో...!

ఎక్కువ చదివితే ఫలితమిలాగే ఉంటుంది కాబోలు. అప్పుడప్పుడు వాహిద్ హుసైన్ ఆలోచించేవారు - ఇంకా ఎక్కువ చిక్కులు... ఎక్కువ సమస్యలు... సందేహాలు... భ్రమలు... జ్ఞానం మూలంగా ఏదేని ఒక తుది నిర్ణయం చెయ్యగలుగుతాడా?

అప్పుడే రోడ్డు మీద సందడి ప్రారంభమైపోయింది... అప్పుడప్పుడొక టాంగా టక టకమంటూ వెళ్ళిపోతూంది. గొల్లవాడెవడో, నెత్తిన దాణాతో నిండిన గంప పెట్టుకుని గేదెల్ని తోలుకుంటూ పోతున్నాడు. దూల్హానవాబు భవంతి ముందు ఎవరో దాసీ అరుస్తూంది, సీతారామ్ గారింటి ముందు వారి పెద్ద కుమార్తె కళ్లాపి జల్లి ముగ్గు పెడుతూంది.

సీతారామ్‌గారు బ్రాహ్మణులు, కాని ఈద్ బక్రీద్‌లప్పుడు క్రమం తప్పకుండా వాహిద్ హుసైన్ గారింటికి వచ్చి సేమియా - పాయసం తినేవారు. వారింట్లో జరిగే ప్రతి పూజ, పండుగలలో వాహిద్ హుసైన్, ఆయన భార్య - బిడ్డలు పాల్గొనేవారు. ఆయన వకీలు, వాహిద్ హుసైన్‌గారి నిజమైన తప్పుడు కేసులన్నీ సీతారామ్‌గారు వాదించేవారు. తప్పుడు

సాక్షులను తీసుకు వచ్చేవారు, ఆయనకి వాహిద్ హుస్సైన్ వంత పాడేవారు. రాషీద్‌తోపాటే వాళ్ళబ్బాయి మల్లేశం కూడా బి.ఏ. పాస్ అయ్యాడు. రాషీద్ ఇంజనీరింగ్ కోసరం వెళ్లాడు కాని మల్లేశం చిన్న - చిన్న బిల్డింగులు కట్టించే సామాన్యమైన వ్యాపారం చేయసాగాడు. ఈ పని కోసం అతడు రాషీద్, వాహిద్ హుస్సైన్‌లను పొగుడ్తూండేవాడు.

కొద్దిసేపైన తరువాత దూల్హా నవాబు తన భవనం నుంచి బయటకొచ్చారు. వెండి, బంగారుతో నేసిన పాత షేర్వానీ వేసుకున్నారు. పగిడీ కట్టుకున్నారు. తెల్లగా పండిపోయిన జులపాలతో పొడుగ్గా, బక్కపలుచగా వున్నారు. తన చిన్ని మనుమణ్ణి గుండెల కదుముకుని రోడ్డు మీదికి వాహ్యాళికై వచ్చారు.

దుల్హా నవాబు గారింట్లో పదేసిమంది నౌకర్లు - చాకర్లు, ఆయాలు పసిపిల్లలు ఉండేవారు. కాని ఆయన మాత్రం ఏడాది నిండిన తన పౌత్రుణ్ణి తీసుకుని అలాగ తిరుగుతూండేవారు, ఆ పసివాడే తన సర్వస్వం అయినట్లు, ఆయనని చూస్తే వాహిద్ హుస్సైన్‌కి కూడా, తన మూడు సంవత్సరాల పౌత్రుడు షాహీన్‌ని తీసుకుని దూల్హా నవాబుతో కలిసి తిరగాలని ఆశగా ఉండేది. కాని ఆయన కుమారుడు తన కొడుకుని పూర్తిగా ఆంగ్ల పద్ధతుల్లో పెంచుతున్నాడు. ఆ పిల్లవాడి క్రిష్టియన్ ఆయా అతణ్ణి ఏడు గంటలకి ముందు లేవనిచ్చేది కాదు. పిల్లవాడి పెదవులపైన ముద్దు పెట్టుకోవద్దు, ఎప్పుడు పడితే అప్పుడు తియ్యటి - పుల్లటి పళ్ళు తినిపించవద్దు, వట్టి కాళ్ళతో నేలమీద దింపవద్దు, అలాంటి ఆంక్షలు కూడా ఉండేవి... భూమిపై ఇంతటి కాఠిన్యం - అసహ్యం నిండి ఉన్నప్పుడు దుల్హా నవాబు లాగ ఎవరినో ఒకరిని గుండెలకదుముకుని సర్వం మరచి పోవాలనిపిస్తుంది. ఎదురవుతున్న రోజుని గురించిన సత్యాన్ని, సూర్యుని ఉనికిని ఎవరైనా ఎలా మరువగలరు?

'సలామ్ చెయ్యనా కిబ్లా![1] దూల్హా నవాబు గేటు దగ్గర నుంచి వెళుతూండడం గమనించిన వాహిద్ హుస్సైన్ గౌరవ పురస్సరంగా వంగి అన్నారు.'

---

[1] లబ్ధ ప్రతిష్ఠులను సంబోధించుటకు ఉపయోగించే పదము.

'ఆయుష్మాన్ భవ... సిరి పెరుగుగాక... గౌరవాభి వృద్ధియగుగాక,' దుల్హా నవాబు ఆగిపోయారు.

'ఈ రోజు చిన్న పాషా మిమ్మల్ని త్వరగా బయటకు తీసుకు వచ్చారే?'

'ఆ... అవునండీ... చిన్న నవాబుని గుండెల కదుముకుంటే హాయిగా ఉంటుంది...' దుల్హా నవాబు నిట్టూరుస్తూ అన్నారు.

నిజం చెప్పారు... ఆ మనువర్తి విషయంలో కూడా ఇప్పటి వరకు ఏం జరుగలేదనుకుంటాను? దుల్హా నవాబుకు సుఖ-శాంతులెందుకు కరువయ్యాయో వాహిద్ హుస్సైన్‌కు తెలుసు.

'ఎప్పుడవుతుందో అల్లాకే తెలుసు. హుజూర్‌వారి రజతోత్సవ శుభ సందర్భంలో అందరి మనువర్తి పెరుగుతుందంటున్నారు.'

'ఆ, భగవదనుగ్రహం!' వాహిద్ హుస్సైన్ చేతులు కట్టుకుని తల వంచుకుని నిలబడ్డారు. ఆ రోజులలో పెద్దలతో సంభాషించే పద్దతి అంతే.

కాని మనువర్తి ఆపాటి పెరిగితే మాత్రం ఏమౌతుంది మియా! - దుల్హా నవాబు విసుగ్గా అన్నారు.

'పెద్దన్నగారి మహాలులో నలుగురు బేగమ్‌లున్నారు, ఆరేడుగురు బానిస పిల్లలున్నారు. మన మహల్‌లో ఇద్దరు బేగమ్‌ల ఖర్చుంది. పదిహేను వందల రూపాయలు నెలసరి ఆదాయం కల జాగీరు మాత్రమే మిగిలింది. పుత్రరత్నానికి కూడా పెళ్ళయిపోయింది. ఇంట్లో అల్లుడుగారు, వారి సంతానం ఉన్నారు. మీరే చెప్పండి... ఎలా గడుస్తూంది?'

'సత్యం శెలవిచ్చారు హజత్!'

వాహిద్ హుస్సైన్ క్లుప్తంగా సమాధానాలు విని వ్యాకులపడి దుల్హా నవాబు ముందుకి సాగిపోయారు. వాహిద్ హుస్సైన్ చేతులు వెనక్కి కట్టుకుని పచ్చని గడ్డిపైన వట్టి కాళ్లతో పచార్లు చేయసాగారు. దుల్హా నవాబు తాత - తండ్రులెప్పుడైనా ఈ విధంగా ఆలోచించి ఉంటారా? ఈ కొత్త ఇంగ్లీషు రెజిమెంటు చాలా ఇబ్బంది పెట్టేసింది. జాగీర్దారుల మొత్తం జమా-ఖర్చులు గురించిన చింత. ప్రతి నిమిషం పరిశీలించడం వెచ్చించేదొకరు. ఆదుర్దా వేరొకరికి. ఈ దరిద్రగొట్టు ఆంగ్లేయులు మహళ్లలోని రాణివాసాన్ని సహితం గాలించి వదిలిపెట్టారనే వారు దుల్హానవాబు.

భయపడిన నిజామ్‌కు 'మనిషిపై జరిగే అత్యాచారాల ఆపుదల' అనే ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఆ విభాగం, ఇళ్ళకి, మహాళ్ళకి వెళ్ళి కుర్రాళ్ళని, పని పిల్లల్నీ బయటకు పిలిచి వారిపై ఎటువంటి అత్యాచారం జరిగిందో కనుక్కునేది. ఇక ఈ నౌకరీ చేసేవాళ్లకి చాడీలు చెప్పడం అలవాటే కదా! వీపుపైన, చేతులపైన ఏ గాయం గుర్తు కనబడినా వారు ఆ పిల్లని లారీలో పడేసి ప్రభుత్వం తరఫున జప్తు చేసేవారు, ఆపైన తల పగులగొట్టుకున్నా ప్రయోజనం ఉండేది కాదు. వినేవారు కాదు. నిజానికి ఈ పని పిల్లలు, ఊరికే ఆకాశం నుండి ఊడి పడ్డవారు కాదు - పద్దతి ప్రకారం డబ్బు ఖర్చు పెట్టి కొనబడేవారు. ఇంక పనెవ్వరు చేస్తారు? జీతగాళ్ళని పెట్టుకుంటే ఎన్నో పోకిళ్ళు పోతారు. ఈ పరిస్థితిని చూసి పని మనుషులు కూడా గర్వంగా తిరుగుతున్నారు. ఇప్పుడు, చీకట్లోనో, వెలుగులోనో వారి చెయ్యి పట్టుకునే సాహసం ఎవరికుంది? పట్టుకుంటే సరి గుర్రపురౌతుల గుంపు వచ్చేస్తుంది గొడవ చెయ్యడానికి.

వాహిద్ హుసైన్ గేటు దగ్గర నిలబడి చాలా దూరం వరకు వరుసగా ఉన్న బంగళాలను చూడసాగారు. మాసికలు వేయబడిన ఫకీర్ల బట్టలలాగ పాతబడి, పైకి అసహ్యంగా ఉన్న ఇళ్ళు తమలో ఏమేమి దాచుకున్నాయో! ప్రతి ఇంట్లోను ఎన్నెన్ని కథలుంటాయో, చిరునవ్వు చాటున, కన్నీటి మాటున దాగిన మాటలు, నిరాశా పరంపరలు ఎన్నో!

ఆయన విసిగిపోయి, చివరికి తన ఇంటిని చూశారు. ఇక్కడ ఆయన ఎంత కళాత్మకమైన తోటను పెంచారంటే అది మొత్తం హైదరాబాదులో పేరు కెక్కింది. ఇంతకుముందు ఐవానే గజల్ కేవలం తనలో నివసించే కవుల వలన ప్రసిద్ధికెక్కింది. వారు నాలుగు తరాలనుండి కవిత్వం చెబుతూ వచ్చారు. ఎందుచేతనంటే అల్లా వారికి కవిత్వపరమైన చింత తప్ప మరే ఇతర చింత కలిగించలేదు. బైత్ - ఉల్ - గజల్‌లో పెట్టిన చిత్రపటాలలో వారంతా గొప్ప దర్పాలతో కూర్చుని ఉన్నారు. కాని వారంతా ఎంతటి బుద్ధి హీనులైన ప్రేమికులో వాహిద్ హుసైన్‌కి తెలుసు. ఆ భవనాల్లో నిత్యం జీవితంతో ఆటలాడుకున్నారు. ఒక ఆకర్షణీయమైన అందగత్తె తన హావ భావాలతో అందరిపైన రాజ్యం చేసేది.

కేవలం వాహిద్ హుసైన్ కృషి వల్లనే ఈ ఇల్లు చక్కని పూదోటగా

మారి, ఒక కొత్త రూపాన్ని సంతరించుకున్నది. ఇప్పుడీ భవనంలో ఎవరైనా, అందమైన సాకీని (మదిర త్రాగించే స్త్రీ/పురుషుడు) అవుతుంది. ఎందుచేతనంటే వాహిద్ హుస్సైన్ ఏ అందమైన కుసుమాన్ని తెచ్చి ఐవానే గజల్‌ని అలంకరించారో, ఆమె, పండు జుట్టుతో, మనుమల దుస్తులు కుట్టడంలో నిమగ్నమై ఉంది. ఇది ఇలావుండగా వాహిద్ హుస్సైన్ వియోగావస్థ ఎలాగుందంటే ఆయన రాసిన ఏడు కవితా సంపుటాల కాయితాలన్నీ వియోగపు ఉద్విగ్నతతో కూడిన వియోగాగ్నిలో కాలుతూ ఉండేవి.

అందుకు కారణం నిర్దయుడు, ఉద్ధండుడు అయినటువంటి సాకీ ఆయనకు పాన పాత్రకాని, పానీయాన్ని కాని ఇచ్చేవాడు కాడు. ఆయన ఒక మైనపు బొమ్మతో ఆడుతూ తన యవ్వనాన్ని గడిపేశారు. ఆ బొమ్మని మేల్కొలిపితే కళ్ళు తెరిచేది, పరుండబెడితే కలలో కరిగిపోయేది.

బహుశా ఈ కారణం వల్లనేమో వాహిద్ హుస్సైన్ తమ వంశ పారంపర్యంగా వచ్చిన పాత పద్ధతులకు వ్యతిరేకంగా ఒకే భార్యతో సంతృప్తులై తమ ఇంట్లో కొత్త కొత్త కుసుమాలను వికసింప చేయడంలో లీనమైపోయారు. వారి తోటలోని ప్రతి కొమ్మ ఉండవలసిన రీతిలో వంగి ఉండేది. ప్రతి పూవు, సభ్యతగల నాగరికుల వలె చిరునవ్వు చిందిస్తూ ఉండేది. లాన్ పైన గడ్డి పరకకి కూడా క్రమ శిక్షణను భంగ పరచగల ధైర్యంలేదు. ఆయన తహసిల్దారుగా పనిచేసే కాలంలో తన వద్ద పని చేసే వారితో ఏ విధంగా వ్యవహరించేవారో, అదే విధంగా ఈ మొక్కలతో కూడా ప్రవర్తించడమే దీనికి కారణం.

అప్పుడప్పుడు రాషిద్ నవ్వుతూ అనేవాడు 'నాన్నగారు మొత్తం తోటనంతా మార్చ్ - ఫాస్ట్ చేయిస్తారు!'

తన ఏకైక పుత్రుని ఈ మాట ఆయనకెంతో నచ్చింది. నిజానికి రాషిద్ ప్రతి మాటా ఆయనకు నచ్చేది. రాషిద్ పుట్టిన తరువాతే ఆయన పిచ్చి కొంచెం ఉపశమించింది. ఆయన భార్య విద్రోహం నుంచి తన దృష్టిని మరల్చుకున్నారు.

రాషిద్ తన తాతగారి కాలంలో పుట్టివుంటే, అతని సమర్థతని మెచ్చుకోవడం జరిగేది. కనీసం సుబేదార్ వరకైనా చేరుకునేవాడు. జాగీరు,

ఖితాబు లభించి ఉండేది. నజాకత్‌జింగ్ మనుమడు ఇంజనీరింగ్ చదివి ఐదు వందల రూపాయలు సంపాయించే రోజులు చూడవలసిన ఆగత్యముండేది కాదు. రోజంతా గొడుగేసుకుని ఎండలో, కూలీలతో నిలబడుతున్నాడు. క్యాంపులలో తిరుగుతున్నాడు. ప్రభుత్వం అతని సామర్థ్యాన్ని పూర్తిగా ఉపేక్షించిందనడానికి వీలులేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయ భవన నిర్మాణానికి ముందు, ప్రభుత్వం స్వంత ఖర్చులపై, అతన్ని విదేశాలలోని మంచి భవనాలను చూసేందుకు పంపింది.

రాషిద్, అతని సంతానాన్ని గురించి వాహిద్ హుసైన్ కెక్కువ బెంగలేదు. ఎందుకంటే ఆయన తమ్ముడు అహమద్ హుసైన్‌కి, మునాసిబ్ జింగ్ ఏకైక పౌత్రి ఉజాలాబేగమ్‌తో వివాహం జరిగింది. ముప్ఫై సంవత్సరాల వైవాహిక జీవనాన్ని గడిపినప్పటికి ఉజాలా బేగమ్ వంశాంకురాన్నివ్వలేక పోయింది. అందువల్ల వాహిద్ హుసైన్‌కి అప్పు అనే చెదలు తినేస్తున్న తన ఆస్తి గురించిన చింత ఇసుమంతైనా లేదు.

ఆయన తన మిగిలిన సంపదను, తన కుమార్తెలైన బషీర్, బతూల్ బేగమ్‌ల వివాహాలకై వెచ్చించేశాడు. ఇప్పుడిక ప్రతి సంవత్సరం ఐవానే గజల్‌ను జప్తు చేయటానికి నోటీసులు వస్తున్నాయి, వాటినేదో విధంగా ఆయనే దాటివేస్తున్నారు. ఇప్పుడాయన దృష్టంతా ఔరంగాబాద్‌కేసి ఉంది. అక్కడ అహమద్ హుసైన్ లెక్కలేనంత ఆస్తిని పోగు చేసుకుని కూర్చున్నాడు.

అహమద్ హుసైన్, వాహిద్ హుసైన్‌లాగ కేవలం కవిత్వంతో కాలం గడవలేదు, పెద్ద పెద్ద హోదాలకై ప్రాకులాడలేదు. రాచరికపు కుట్రలలో పాలు పంచుకోలేదు. దీనికి మూల కారణం, భార్య వలన ఆయనకు సంక్రమించిన ఆస్తి. అది ఆయన్ని శక్తివంతుణ్ణి చేసింది. ఆయన పల్లెటూరిలోని తమ భవనంలో ఉండేవారు. ఆయన ఇంద్రుడిలాగ సుఖాలన్నిటిని సమకూర్చుకున్నారు. ప్రపంచపు గొడవలతో ఆయనకు పని లేదు.

వాహిద్ హుసైన్ తన తమ్ముడి అదృష్టం చూసి ఈర్ష్య కలిగేది. అహమద్ హుసైన్ స్వార్థంతో జీవించటం వలన సంతోషంగా ఉండేవారు. వాహిద్ హుసైన్‌కి ఎంత ప్రయత్నించినా తన వ్యక్తిత్వంలో ఒంటరితనం

కనబడేది కాదు. ఏదో ఒక చివర, ఎవరితోనే ఒకరితో బంధనం వుండేది. అసలు 'నేను' ఏమిటి?

ఎవ్వరూ పంచుకోలేనటువంటి నా వ్యక్తిత్వం - భగవంతుడిలాగ - కాని దేవుణ్ణి ఒంటరిగా ఊహించుకోడానికైనా మానవుని ఉనికిని ఆ దైవం నుంచి వేరు చేయవలసి వస్తుంది - అలసి, ఓటమితో చివరికి పుస్తకాన్ని శరణుజొచ్చేవారు!

కొంచెంసేపైన తరువాత పేపరు వచ్చేసింది!

వాహిద్ హుసైన్ అక్కడే మళ్లగట్టుపైన కూర్చుని, కళ్ళజోడు పెట్టుకొని, గబగబా కాగితాలు తిప్పడం మొదలెట్టారు. ప్రత్యేకంగా ఏ విషయం గురించి ఎదురు చూడడం లేదు, కాని సుర్సియా చదివేటప్పుడు ఆయన గుండె వేగంగా కొట్టుకునేది.

ఎవరికి ఎక్కడికి బదిలీ అయింది? ఎవరు మరణించారు? ఎవరిపై ప్రళయం వచ్చిపడింది? ఎవరు నెత్తికెక్కారు? ఇప్పటి వరకు దక్కనులో బయటి విషయాలు తక్కువగా అచ్చయేవి. ఏదో అతి ముఖ్యమైన ప్రపంచాన్ని కదిలించే వార్త అయితే ఏదో ఓ మూల అచ్చయేది. వాహిద్ హుసైన్ అన్నిటికంటే ముందు 'ఫరమాన్ ముబారక్' చదివేవారు. ఫరమాన్ (ఆర్డరు)పై చూపు నిలిపేముందు ఆయన ఉన్నట్లుండి టోపీతీసి తలపైన పెట్టుకుని జాగ్రత్తగా కూర్చునేవారు. ఆయన ఆనాటి ఫర్మాన్‌ని కూడా చాలా శ్రద్ధగా చూశారు.

'ఇనే ఇకాదే - ఏ - మహఫిల్ - ఏ - ముషాయరా.'

ఫర్మాన్‌లో ఈ విధంగా రాసి వుంది. ఈ కాలంలో ఇదొక కసరత్తై పోయింది. ఈ ఉర్దూ భాషని ఉన్నత స్థాయికి చేర్చాలనో లేక బ్రతికించాలనో అనుకుంటే, కొన్ని గంటలు దీనికై వెచ్చించి, కవుల కవిత్వాన్ని పొగిడి - పోవడానికి వస్తూ పోతుంటే - ఈ కవిత్వం, సభలు లేక సమావేశాలు వలన ప్రయోజనమేముంటుంది! అది లేకపోగా, ఇది కేవలం మనసును రంజింప చేయడమే అవుతుంది. లేక ఫోటోలు తీయించుకునే ఉద్దేశ్యం... నిజానికి ఉర్దూ భాష ఉన్నతిని కాని, ప్రతిష్టతని కాని కాంక్షించేట్టయితే దీనికోసం ఒక సంస్థని ఏర్పాటు చేయాలి. తప్పనిసరిగా ఆ సంస్థ ఇతర భాషలలోని ఉపయోగకరమైన గ్రంథాలను

ఉర్దూ భాషలోకి తర్జుమా చేయించాలి. నా ఆధునిక వాఙ్మయాన్ని వెలుగులోకి తేవాలి. లేక దుర్లభమైన గ్రంథాలను ముద్రించాలి. ఆ ముద్రణకు సరియైన ఏర్పాటు చేయాలి. కాని కష్ట సాధ్యమైన విషయమేమిటంటే దీనికి పెద్ద మొత్తాలు కావాలి. ఒక ఫండ్ ఏర్పాటు అవడంతో పాటు సమర్థులైన వ్యక్తులు ఈ కార్యభారాన్ని వహించి పట్టుదల, ఉత్సాహాలతో దీనిని నిర్వర్తించాలి. ఇది జరగనంత వరకు ఈ ముషాయరాలు వ్యర్థం. ఇవి కేవలం మనో వినోదాన్ని కలుగజేస్తాయి.

'వివరాలేమిటంటే, ఇది నా స్వంత అభిప్రాయం. చాలామంది చదువుకున్న వారికిది యాదృచ్ఛికం, కాకపోతే అనవసరపు ఇతర పనులలో వేలు పెట్టే హక్కు నాకు లేదు. అంతేకాకుండా మా ఇంట్లో, ముషాయరాకి ఎటువంటి విలువ, గౌరవం లేదు. కాని ఒక విషయం నా కంటి కెదురుగా కనబడుతూంది. అదేమిటంటే ఒక ప్రక్క ముస్లిమ్ జాతి బీదరికంతో బాధపడుతూంది. మరొక ప్రక్క అనవసరపు విషయాలకై డబ్బు వృధాగా ఖర్చవుతుంది. ఇది నిజంగా చూడదగినటువంటి తమాషాయే.'

ఈ విధంగా ముషాయరాల పడవ మునిగిపోయింది. కవుల ఎడ చూపిన అగౌరవానికాయన సిగ్గు పడ్డారు.

'ఫర్మాన్' చదివిన ఆయనకిలాగ అనిపించింది - కింగ్ కోఠి ప్రపంచం కూడా అహమద్ హుస్సైన్ ప్రపంచానికి భిన్నంగా లేదు. అక్కడ 'నేను' అన్న అహంకారం మాత్రమే ఉంది. వాహిద్ హుస్సైన్ ఇంకా వార్తా పత్రికలోని ముఖ్యాంశాలలో మునిగే ఉన్నారు, అంతలో సరిగ్గా అదే సమయానికి వారి మనుమరాలు చాంద్ అలవాటు ప్రకారం, పూల కొమ్మలలో తన గౌను చిక్కుకుంటుందేమో అన్నంత వేగంగా పరుగెత్తుకొని వచ్చింది.

'తాతగారూ! త్వరగా లోపలికి రండి. ఆర్డలీ చిన్న తాతగారి లేఖను తీసుకుని ఔరంగాబాద్ నుండి వచ్చాడు!

'ఐ' ఆయన ఉలిక్కిపడ్డారు. తొందరలో ఉండికూడా ఆయన ఫర్మాన్ ముబారక్ ఉన్న వార్తా పత్రికను జాగ్రత్తగా మడిచి చేత పట్టుకున్నారు.

'చిన్న తాతగారికి కొడుకు పుట్టాడట!' చాంద్ క్రోటన్ ఆకులను పీక సాగింది.

'ఆ... ఐ...?' ఈసారి పేపరు దూరంగా వెళ్లి పడింది. తన నోట్ బుక్‌ను అక్కడే వదిలి లోనికి పరుగెత్తారు.

కొద్ది నిమిషాల తరువాత ఆయన ముందు హాలులో అందరి మధ్య కూర్చుని, కళ్ళద్దాలు ముక్కుమీద సర్దుకుని, ఉత్తరంలోని చివరి పంక్తులని అందరికీ వినిపిస్తున్నారు - 'బేగమ్, నౌమౌలూద్ (నవజాత శిశువు) పెద్దలందరికీ పాదాభివందనాలు చేస్తున్నారు. నేనుకూడా పెద్దలందరికి పాదాభివందనాలు చేస్తున్నాను, పిన్నలకు ఆశీస్సులు.

'వస్సలామ్

హాకీర్‌పుర్ తక్‌సీర్

అహమద్ హుసైన్ ఖాన్ ఆఫీ అనహో.'

ఉత్తరం దానంతటదే వాహిద్ హుసైన్ చేతినుండి జారిపడింది, కాని ఆయన చేతులు అలాగే ఉన్నాయి. ఆయనొక్కరే ఏమిటి, ఈ ఉత్తరం, అక్కడ కూర్చున్న వారందర్నీ స్థాణువులుగా చేసేసింది. కుంటత్త మాత్రం లోలోపల ఏదో గొణుక్కుంటోంది.

చాలాసేపు తరువాత వాహిద్ హుసైన్ అతికష్టం మీద, తనలో తాను ధైర్యం తెచ్చుకుని చేతులు నలుముకుంటూ అన్నారు, 'చూశావా! చివరికి - ఉజాలా బేగమ్ మనల్ని ముంచేసింది!'

'ఊహ్! ఈ పిల్లవాని పుట్టుక ఏమంత గొప్ప విషయం? బాబాయిగారి మహల్‌లో, ఇటువంటి పిల్లలెంతమంది పెరుగుతున్నారో!'

బోలెడంత ఆస్థికి తన భర్త కాక వేరొక వారసుడున్నాడంటే ఒప్పుకునేందుకు సిద్ధంగా లేదు రాషిద్ భార్య రజియా.

'అల్లామియా! బీజానీ అదృష్టాన్నెలా పండించావు! క్షణంలో బేగమ్ అయిపోయారు' కుంటత్త ఈర్ష్యాపూరిత స్వరంతో అంది.

'థూ! ఆ పాడు మొహాందెందుకవుతుంది బాబాయిగారి బేగమ్!' వాహిద్ హుసైన్ పెద్ద, కూతురు బషీర్ బేగమ్ కోపంతో అంది.

'చూస్తూండండి, ఉజాలా పిన్ని దాన్ని తన చెప్పుకింద అణిచి ఉంచుతుంది. దాని మీద హక్కేమిటి... ఎందుకూ పనికిరాని పిల్ల...!' బషీర్ బేగమ్‌కి బీజానీ మీద విపరీతంగా కోపం వస్తూంది. ఆమెని ముక్కలుగా చేసి విసిరి పారేయాలనిపిస్తూంది.

'అయితే బీజానీ అహమద్ భాయీ బేగమ్ అవదా ఏమిటి?' బీబీ మొదటిసారి ఈ చర్చలో పాల్గొంది. వాహిద్ హుస్సైన్ బీబీ రెండవ పన్ను కూడా పడిపోవడం గమనించారు, కాని ఆమె విషపు నవ్వులో మాత్రం తాను మొదటిసారి చూసిన వ్యంగ్యమే కనబడుతూంది.

'బేగమ్ అయే అదృష్టం అందరికీ ఉంటుందా ఏమిటి?' అంత ఘోరమైన సంఘటన జరిగిన సమయంలో కూడా వాహిద్ హుస్సైన్ బీబీకి జవాబు చెప్పడం మరిచిపోలేదు.

'ఏమైంది...? ఎవరు బేగమ్ అయిపోయింది...' కైసర్ తల్లి ఫాతిమా బేగమ్, చాటలో బియ్యంతో హాల్లోకి వచ్చింది.

'ఇదిగో, మీ సోదరుడు అహమద్ మియా వాళ్ళింట్లో ఒక పిల్లుండేది బీజానీ! దాని నొసటన కూడా బేగమ్ అవడం, రాసి పెట్టుందట!' బీబీ, తన మనుమడు షాహీన్ చొక్కాని, మోకాళ్ళపై పెట్టుకుని, చేతులతో ఇస్త్రీ చెయ్యసాగింది.

'కొడుకు పుట్టింది మీ సోదరుడింట్లో!' గొప్ప పేరు పెట్టారు - 'నౌమౌలుద్'ట! కుంటత్త హేళన చేసింది.

'రెండు మాటలూ తప్పే...' వాహిద్ హుస్సైన్ విసుగ్గా కళ్ళద్దాలను బల్లమీద విసిరికొట్టి, షేర్వానీ గుండీలు పీకసాగారు.

'అహమద్ మియాకి కొడుకు పుట్టనూ లేదు, నౌమౌలూద్ అని పేరు పెట్టనూలేదు!'

'మరి మీరిప్పుడు చదివిన ఉత్తరం...' రజియా ఆశ్చర్యంగా అడిగింది. అందర్నీ కంగారుపెట్టడం కోసం వాహిద్ హుస్సైన్ నాటకమాడారు అన్నట్టు అంతా ఆయన్ని చూశారు.

'పిల్లవాడికి నసీర్ హుస్సైన్ ఖా ... అని పేరు పెట్టినట్లు కూడా చదివాను నేను. పిల్లవాడు అహమద్ మియాకి కాదు, బీజానీకి పుట్టాడు' ఆయన గట్టిగా అరిచారు. అప్పటికి ఆయన రక్తపు పోటు చాలా పెరిగిపోయింది, కోపంతో వణకసాగారు.

హో... హో... హో... హై... హై... హై... అంటూ ఫాతిమా బేగమ్ కుంటత్త, రజియా బేగమ్, బషీర్ బేగమ్, వాహిద్ హుస్సైన్ జోరుగా నవ్వసాగారు.

కోపంతో ఆయనకి బ్లడ్ ప్రెషర్ ఇంకా పెరిగిపోయింది. రజియా

గర్భంలో కదలాడుతున్న పసిప్రాణి బాధవలన గబ, గబా తిరగడం మొదలుపెట్టింది. రజియా నవ్వుతూ లోపలికెళ్ళి మూలగసాగింది.

ఈ వార్త వలన అందరికంటే ఎక్కువ సంతోషించింది కుంటత్త, కాని ఆమె తన ఆనందాన్ని వ్యక్తం కానీయలేదు.

కుంటత్త పేరు గౌహారీబేగమ్. ఆమె, రాషిద్ సమ వయస్కులు. వాహిద్ హుస్సైన్‌కి బాబాయి కూతురు. తల్లి దండ్రులకి ఏకైక సంతానమని వినికిడి. పదునాలుగు సంవత్సరముల ప్రాయంలోనే ఆమె తండ్రి పెళ్ళి సంబంధాలు వెతుకులాట ప్రారంభించారు. దురదృష్టవశాత్తు ఆమె తల్లిదండ్రులిరువురు ఒక రైలు ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయారు. కుంటత్త తన ఆస్థిపాస్తులు, నగ-నట్రలతో వాహిద్ హుస్సైన్ తండ్రిగారి వద్దకు వచ్చేసింది. ఆయన తన మనుమరాలికోసం ఎంతో శ్రద్ధగా సంబంధాలు వెతుకుతుండగానే ఆమెకు పాతికేళ్ళ వయస్సు వచ్చేసింది. వాహిద్ హుస్సైన్ అహమద్ హుస్సైన్‌లు, ఆమె ఆస్థిపై కన్నువేయటం వల్ల వచ్చిన ప్రతి సంబంధం తిప్పికొడుతున్నారని ఇంట్లో అంతా నిందించసాగారు. చివరికి ఒక రోజు పండుగ రోజున చంద్ర దర్శనం చేసుకుని తనకు అదృష్టం కలిగించమని ప్రార్థిస్తూ గౌహార్ బేగమ్ డాబాపైకి వెళ్ళింది. అక్కడినుండి కళ్ళు తిరిగి క్రింద రోడ్డుపైన పడిపోయింది. మెల్లిగా తెలివి వచ్చింది. తననెవరో వెనుకనుండి నెట్టివేశారని ఆమె భ్రమ, కాని ఐవానే గజల్‌లో ఆమెకు ప్రాణహాని తలపెట్టే శత్రువులెవరున్నారు? ఆసుపత్రి నుండి ఆమె ఇంటికి వచ్చింది. చట్ట ఎముక విరిగిపోయి, ఒక కాలు కుంటిదైపోయింది. కర్ర సహాయంతో నడవసాగింది. అలాటి కుంటి పిల్లని పెళ్ళాడేదెవరన్నది సమస్య అయింది. ఐవానే గజల్‌లో అందరూ ఆమెని కుంటత్త అనే పేరుతో పిలిచేవారు. పనివాళ్ళ మీద అధికారం చలాయించడం, ఆ భవనంలో అన్ని ఏర్పాట్లు చెయ్యడంలో రోజంతా ఆమెకి సరిపోయేది. అందరూ ఆమెనెంతో అభిమానించేవారు. ఆమె పుల్ల విరుపుమాటలు ఆ ఇంట్లోని వారంతా భరించవలసి వచ్చేది. ఆ ఇంటి ఆడపిల్లలందరూ ఆమె ఆజ్ఞను శిరసావహించవలసి వచ్చేది. ఆమెకు కొద్దిపాటి సుస్తీచేసినా వాహిద్ కంగారు పడిపోయేవారు. తన చెల్లెల్ని తృప్తి పరచడానికి ప్రయత్నించేవారు. దురదృష్టవంతురాలైన చెల్లెలి మీద

ఆయనకెంతో జాలి. ఇంటిల్లిపాది మీదా ఆమె అధికారం చెలాయించేది. ఆమె అందర్నీ నోటికొచ్చినట్లు మాటలు అని నొప్పించేది. ఆమె ప్రతి ఒక్కరి లోపాలను ఎత్తి చూపడానికెప్పుడూ సిద్ధంగా ఉండేది.

ఆ ఇంట్లో వాహిద్ హుస్సైన్ భార్యతో జగడమాడడానికి మాత్రమే ఆమెకి అవకాశముండేది. నిజానికి వదినా - మరదళ్ళ మధ్య శత్రుత్వం ఎప్పుడూ ఉన్నదే కదా. కాని బీబీ స్వభావం ఉద్రిక్తత నెరుగదు. అంతేకాకుండా ముప్ఫై సంవత్సరాలు గడిచిన తరువాత కూడా తను ఆ ఇంటికి రాణిగా కాక బంట్రోతు కూతురుగానే ఆమె భావించింది. ఆమె తన అధికారాన్నంతా కుంటత్తకి అప్పచెప్పేసింది. ఇంటి బాధ్యతలకి దూరంగా ఉంటూ నిత్యం అలంకరించుకుని, మెరిసే దుస్తులను వేసుకుని, చేతులకి బంగారు, రాళ్ళ గాజులు మెరుపులతో, సువాసన ద్రవ్యాల ఘుమఘుమలతో దోమ తెరలో కూర్చుని ఉండేది. లేదా నవలా పఠనంలో కాలం గడిపేది. గతించిన కాలానికి సంబంధించిన వార్తలను చర్చించేది లేదా పరదాలు కట్టిన కారుల్లో బంధువుల ఇళ్ళకు వెళ్ళిపోయేది. ఇంట్లో గోంగూర వండారో లేక పాలకూర వండారో ఆమెకి తెలిసేది కాదు. వాహిద్ హుస్సైన్‌కు ఏఏ వస్తువులు నిషిద్ధమో కూడ ఆమె ఎరుగదు.

వాహిద్ హుస్సైన్ గదిలోకి రాగానే ఆమె నవ వధువులాగా ముడుచుకుని కూర్చునేది. ఆయన ప్రతి కోరికను, ప్రతి ఆజ్ఞను శిరసావహించేందుకు నిత్యం సిద్ధంగా ఉండేది. వాహిద్ హుస్సైన్‌కు నవాబుల అదృష్టం కాని, రాచరికపు దర్జా కాని లభించలేదు. అందుకని ఆయన మాటలలో సఖ్యత నిండి ఉండేది. ఆయన సమయోచితంగా మాట్లాడగలిగే వారు. అవసరమైనప్పుడు తేనెలు కురిపిస్తూ, లేదా విషం కక్కుతూ మాట్లాడగల సమర్థత వుంది ఆయనకి. తన స్నేహితులతోను, నౌకర్లతోను నవ్వుతూ ప్రేమగా, తన ముందు ఎవరినీ లెక్క చెయ్యకుండా దర్పంగా మాట్లాడేవారు. ఈ రెండూ కాకుండా వాహిద్ హుస్సైన్‌లో మరొక రూపంకూడా గోచరించేది. అది ప్రేమికుడి వలె సున్నితంగా వ్యవహరించటం అది కూడా భార్య వరకే పరిమితమయేది. ఆరాధన కూడా మానవ జీవితంలో ఒక అంశం. అప్పుడప్పుడు తమ సర్వస్వాన్ని ఎవరికో ఒకరికి సమర్పించి, కైవశం చేయడంలో కూడా ఎంతో తృప్తి

లభిస్తుంది. వాహిద్ హుసైన్ తన అహంకారాన్ని అవతలకు నెట్టి, తాళాలన్నీ భార్యకు అప్పచెప్పారు. పాతిక సంవత్సరాల వయసులో పాతిక సార్లు ప్రేమించగల వాహిద్ హుసైన్‌ని కట్టిపడేసినటువంటి స్త్రీ ఆమె. కాని ఈ మహల్‌లోకి వచ్చి ముగ్గురు బిడ్డల తల్లి అయి కూడా ఆమె ఆయనకు సన్నిహితం కాలేదు. మరి ఆయన తోటలో పుస్తకం తెరిచి పెట్టుకొని ప్రాతఃకాలానికై వేచివుండక ఏం చేయగలరు!

జాబుని చేత్తో పట్టుకుని చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయారాయన. ఈ రోజు సవ్యంగా తెల్లవారలేదు. తల పగులకొట్టుకున్నా ఒక్క పంక్తి అయినా వ్రాయలేక పోవడమన్నది ఎన్నడూ జరగలేదు. వార్తాపత్రికలో ఏ విధమైన ఆశ్చర్యకరమైన వార్త రాలేదు కాని ఆశ్చర్యం ఆ దురదృష్టకరమైన ఉత్తరంలో దాగి వుంది.

ఈ చాంద్ కూడా ఎంతటి దౌర్భాగ్యురాలు, బద్ధకస్తురాలు, తన తాతగారి ఇల్లు వదిలి ఇక్కడెందుకు పడుంటుంది? పొద్దున్నే పాఠం చదువుకోలేదు, నమాజ్ చదువుకోలేదు. ఈ దురదృష్టకరమైన వార్త వినిపించడానికి పరుగెత్తుకొచ్చింది. అందుకనే కాబోలు ఆడపిల్లలు పుట్టగానే తల బాదుకుంటారు.

'వదినా! మీరు ఈ రోజు బషీర్ బేగమ్ చేత ఉజాలా వదినకి ఉత్తరం వ్రాయించండి, బీజానీతో ఎక్కువగా మాట్లాడవద్దని వ్రాయండి. పిల్లవాడి కొరకు ఒక క్రిష్టియన్ ఆయాని పెట్టమనండి, లేకపోతే ఈ నీచురాలి పాలుత్రాగి పిల్లవాడు కూడా అలాగే నీచుడైపోతాడు.'

'అప్పుడు వాడు నిజంగా నవాబు ఐపోతాడు. గౌహర్ బేగమ్, బీబీ నవ్వుతూ గౌహర్ బేగమ్‌కేసి చూసింది. ఉజాలా బేగమ్ సంపదకి వారసుడు లభించడం మంచిదే...'

'ఛూ - ఆమె దగ్గర ఏమాస్థి ఉంది!' రజియా కనుబొమ్మలు చిట్లిస్తూ అంది.

'ఉజాలా పిన్ని తన ఆస్థిని చూసి బాగా మురిసిపోతూంటుందంతే!'

'అదికాదు రజియా! ఉజాలా బేగమ్ వంశంవారు బాగా ఉన్నవారట కథలలో చెప్పిన ధనవంతుల విషయాలన్నీ వీరి వంశం వారివేనట. నేనక్కడి కథలన్నీ విన్నాను...'

కుంటత్త మోకాళ్ళపై గడ్డం ఆనించుకుని ఉజాలా బేగమ్ గతాన్ని చూడసాగింది.

లోపలి గదిలో షాహీన్ ఏడుస్తున్నాడు. రజియా తన గదిలోకి వెళ్ళి మూలగడం మొదలుపెట్టింది. అక్కడ వాహిద్ హుస్సైన్ కూర్చుని ఉన్నారు. వెనుకవైపు గదిలో చాంద్ ఆడుతూ పాడసాగింది.

'నా చిన్న మదిలో చిన్న ప్రపంచం...'

చాంద్ వయస్సు ఎనిమిది సంవత్సరాలు, కాని ఇప్పటి నుంచే తల్లి బషీర్ బేగమ్ ఆమె అందాన్ని చూసి వణికిపోయేది. వారి వంశంలో అందమైన ఆడపిల్లలు విషం తాగి చచ్చిపోయారు. లేదా ఏదో ఒక భవనంలో బంధింపబడ్డారు.

అందం బీబీలాగ ఏ నౌకరు ఇంట్లో దాక్కుని ఉన్నా ఉపద్రవాన్ని లేవదీసి తీరుతుంది. దక్కను కథ అయితే భాగమతీ మొదలుకొని బీబీ వరకు ప్రణయం విభిన్న రంగులలో వ్యక్తమవుతూంది. కాని ఇప్పుడు కాలం మారిపోయింది. బషీర్ బేగమ్ భర్త హైదర్ ఆలీఖాన్ ఈ మారిపోయిన కాలానికి ప్రతీక. హైదర్ ఆలీఖాన్ బషీర్ బేగమ్‌కి వరుసకి అన్నగారు. ఆయన లండన్ వెళ్ళి బారిస్టర్ పాస్ అయి వచ్చారు. నేషనలిస్ట్ భావాలు కల వ్యక్తి. హైదరాబాదులో అప్పటికింకా జాతీయతా భావాలు చెలరేగలేదు. ఇత్తిహాద్ - ఉల్ - ముసలిమీన్ (మహమ్మదీయుల ఐక్యత) విషయం తెలియనే తెలియదు. కాని రాజకీయపరంగా బహాదుర్ యార్ జంగ్ ప్రాధాన్యం పెరిగింది. ఆయన హైదరాబాద్‌ను కలిపివేయడానికి వ్యతిరేకించడమే కాకుండా హైదరాబాదును ఒక స్వతంత్రమైన ఎస్టేటుగా చూడాలనుకునేవారు.

ఐరోపాఖండం యొక్క రాజకీయ పరమైన విషయాలను అవగాహన చేసుకున్న వారిలో హైదర్ ఆలీఖాన్‌వంటి వారు కొందరు. నెహ్రూ పండితుడు రూపొందించినటువంటి కాంగ్రెస్ రాజనీతిని ఇష్టపడేవారు. ఫాసిజమ్ వల్ల సంభవించే అపాయాన్ని గుర్తించసాగారు. భారతదేశంలో హిట్లర్, ముసోలినీలకు వ్యతిరేకంగా ప్రజలు కలిసికట్టుగా ఉన్నారు. కాని హైదరాబాదు ప్రజలు ప్రపంచ రాజకీయాలు అంతగా తెలిసినవారు కారు. హైదర్ ఆలీఖాన్ లండన్ నుంచి వచ్చి బషీర్ బేగమ్‌ను పెళ్ళి

చేసుకున్న తరువాత హైదరాబాదు రాజకీయాలు మారసాగాయి. ''జోష్'' కవిత్వం, కాజీ అబ్దుల్‌గఫార్ ప్రయత్నాల వల్ల నూతన అభిరుచులు చోటు చేసుకోసాగాయి. సరోజినీ నాయుడు కాంగ్రెస్‌లో చేరి పనిచేస్తూండేవారు. ఆమె నాయకత్వంలో హైదరాబాద్‌లో కొత్త అభిరుచులు కలిగిన కొందరు తయారయారు. వారికి హైదర్ ఆలీఖాన్ ముఖ్యమైన కార్యకర్త. ఇకబాల్ 'బాల్-ఏ-జిబరీల్' వ్రాసి భారత దేశంలోని యువకులకు జాగృతి సందేశాన్ని అందిస్తున్న రోజులవి. విశ్వకవి అప్పటికే 'గీతాంజలి' వినిపించేశారు. కాని హైదరాబాద్‌లో ఇకబాల్ గజల్స్ పెద్ద పెద్ద భవంతులలో జరిగే కవ్వాలీలో మాత్రమే వినబడేవి. అన్యాయాల అడుగున నలిగిపోతున్న, నిజానిక్తై నిరీక్షించే ముసలి జాగీర్‌దార్లు, భ్రామక ఆవరణలోకి వచ్చినప్పుడు కళ్ళు తుడుచుకునేవారు. బషీర్‌బేగమ్ తన భర్త ఉద్దేశ్యాలను తెలుసుకునే ప్రయత్నం ఎన్నడూ చెయ్యలేదు. ఆరు, ఏడు తరగతులలో చదువుకుంటున్నప్పుడే ఆమె వివాహం జరిగిపోయింది. ఆ రోజులలో స్త్రీల చదువు సంధ్యలకు ఎక్కువ ప్రాధాన్యత ఉండేది కాదు. వరకట్నం తాలూకు సొమ్ము, ఉన్నత వంశం ఈ రెండు వారికి అత్తవారింట్లో ఔన్నత్య అనుభూతిని కలిగించేవి. బషీర్‌బేగమ్ తన తల్లి అందాన్ని కూడా వెంట తెచ్చుకుంది. ఐవానే గజల్‌లోని అందం సమ్మోహనశక్తి కూడా పేరెన్నికగన్నది. అందువల్ల విదేశాలలో చదువుకుని వచ్చిన భర్తకి ఆమె అత్యంత ప్రీతిపాత్రురాలు. తన భర్త ఆంగ్లేయుల వలె ప్రతిరోజు ఉదయం స్నానం చేస్తాడని, ఇంగ్లీషులో మాట్లాడతాడని, ఎత్తైన కొండ మీద తలుపులకు గొళ్ళాలు, గొలుసులు లేని ఇల్లు కల్పించాడని ఆమె మురిసిపోయేది.

తన కుమార్తె చాంద్ సుల్‌తానా డాక్టరు అవ్వాలని హైదర్ ఆలీఖాన్ నిర్ణయించుకున్నారు. అందుచేత చాంద్‌ని కాన్వెంట్ స్కూల్‌లో చేర్పించారు. ఆమె నవ్య సమాజంలో స్వతంత్ర ప్రతిపత్తికల స్త్రీగా రూపుదిద్దుకోవాలి. ఆమె సాయంత్రం ఒక డాన్స్ స్కూల్‌కి వెళ్ళేది. గౌనులు వేసుకునేది. జుట్టు దొరసానులవలె కత్తిరించుకుంది. తండ్రితో ఇంగ్లీషులో మాట్లాడేది.

చాంద్ ఫాషన్‌పై వచ్చిన మార్పు ఆమె తాతగారింట్లో రకరకాలుగా వ్యాఖ్యానించుకున్నారు. వాహిద్ హుసైన్‌కి కూడా తన మనుమరాలి

ఆచ్ఛాదనలేని కాళ్ళు నచ్చేవి కావు. కాని విదేశాలనుండి వచ్చిన అల్లుడాయన్ని ప్రభావితం చేశాడు. అందుకని అతని ప్రతి మాటని అనాలోచితంగా ఒప్పేసుకునేవారు. సమర్థులైన వారి ప్రతిమాట వెనుక ఏదో మంచి దాగి వుంటుందన్న భావనే దీనికి కారణం.

కొద్ది సంవత్సరాల తరువాత ఉత్తరాది సభ్యతతో ఒక క్రొత్త పద్ధతి ఉద్భవించింది. సరోజినీ నాయుడు మార్గదర్శకత్వంలో ఉన్నతిని కాంక్షించే సాహితీవేత్తలు, కళాకారుల మొదటి సమావేశం జరిగినప్పుడు హైదర్ ఆలీఖాన్ ముఖ్య పాత్ర వహించారు. అల్లుడు అంటే వాహిద్ హుసైన్ చాలా భయపడేవారు. అల్లుడే కమ్యూనిస్టులు, నాస్తికులను, సమర్థించేందుకు పూనుకుంటే తన నావే మునిగిపోయిందనుకోవచ్చు.

ఒకనాడు హైదర్ ఆలీఖాన్ అత్తవారింట్లో విందారగించి వెళ్ళేటప్పుడు వాహిద్ హుసైన్ నచ్చ చెప్పడానికి ప్రయత్నించారు. 'మీరు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా మాట్లాడటం, ఉపన్యసించడం వరకు ఫరవాలేదు. కాని ఈ నాస్తికులైన గూండాల మాటలు పట్టుకుని పోలీసుల చేతులలో పడితే మాత్రం నాకు భయం. ఉన్నత వంశాలవారికి ఈ గూండాలు, కుర్రాళ్ళతో ఏం పని! ఆయన ఆలోచించసాగారు - యువకులనెప్పుడూ భవిష్యత్తుని గురించిన భయంతో బెదిరించాలి. ఎందుకంటే వారెప్పుడు జరుగబోయే దానిగురించే ఆలోచిస్తుంటారు.

'ఈ కమ్యూనిస్టుల పాలన ప్రారంభమైందనుకోండి. మంచివారి పరువెలా నిలుస్తుంది? ప్రపంచంలో ఎప్పుడైన ధనికులు, పేదవారు సమానమవగలిగారా! ఎందుకొచ్చిన గొడవిది?'

తన మామగారు ఆలోచించే పద్ధతి సరైనదని హైదర్ ఆలీఖాన్‌కి తెలుసు. ఎందుకంటే ప్రతి వ్యక్తికి తన గతం, అనుభవం, తన హితము కలసి ఒక ప్రత్యేకమైన దృక్పథం ఏర్పడుటలో సహాయపడతాయి. కాని అతని దృష్టి మొత్తం ప్రపంచ పరిస్థితులపైన ఉంది. ఆయన ఎట్టి పరిస్థితులలోను భారతదేశపు రాజకీయాలు, భారతీయుల పట్టుదల పరిణామాలను విస్మరించలేదు. ఆయన్ని ఆవహించిన దేశభక్తి అపాయం, జీవనోపాధికంటే ఏ విధంగానూ తక్కువ కాదు.

అంతేకాకుండా అత్తవారింటికి వచ్చినప్పుడు వాహిద్ హుసైన్‌తో

వాదించడంలో ఆయనకి ఒక విధమైన ఆనందానుభూతి కలిగేది.

'సెలవీయండి అబ్బాజాన్, కొత్త వార్తలేమైనా...!' భోజనానంతరం అలంకరించిన బైతుల్ గజల్‌లో కూర్చుని ప్రశ్నించేవారు.

'నేనేం వార్తలు వినిపించగలను...?' వాహిద్ హుసైన్ పైప్ వెలిగించుకుని పడక కుర్చీలో కూర్చుని అనేవారు.

'స్వచ్ఛంద రాష్ట్రాలకు సంబంధించిన మీ కల నిజమయ్యింది మియా!' వాహిద్ హుసైన్‌కి నవ్వొచ్చేది.

కాని సూటు - బూటు వేసుకున్న హైదర్ ఆలీఖాన్‌కి మామగారి ముందు శ్రద్ధాభక్తులతో తలవంచుకుని కూర్చోవలసి వచ్చేది.

'అవును... మీరు చెప్పింది నిజమే... కాని చూడండి అబ్బాజాన్, మన మనసులోంచి ప్రతి విషయానికి భయపడాల్సిన బాధ తొలిగిపోయింది కదా - విదేశీ శక్తులంటే భయం... క్రొత్త అనుభవాలంటే భయం... క్రొత్త మార్గాలలో అడుగు ముందుకు వేయాలంటే భయం, ఉద్దేశ్యాలను వ్యక్తం చెయ్యాలంటే భయం... ఇటువంటి భయాలు లేకుండా కనీసం ఈ ఒక్క మేలన్నా జరిగింది కదా!

'ఎలా మాట్లాడుతారు బావగారు మీరు...' రాషిద్ కూడా ఒక కుర్చీలాక్కుని దగ్గరగా కూర్చున్నాడు. నిజానికి రాజకీయాలలో అతనికి అభిరుచి లేదు, కాని ఉత్తరాదిలో చెలరేగుతున్న తుఫాను ప్రభావం కొంత ఇక్కడ కూడా తెలివిగల, విద్యావంతులైన వ్యక్తులపైన పడింది.

నేనొక మాట చెబుతాను బావగారూ, ఎస్టేట్లు ఏకమైపోతే మన దర్జా, దర్పాలన్నీ పోతాయి. మున్సబ్, జాగీర్లు అన్నీ ఊడిపోతాయి. పెద్ద పెద్ద ఉద్యోగాలన్నీ హిందువులు కొట్టేస్తారు.'

ఎట్టి పరిస్థితులలోను జాగీర్లు ఉండవు. కాని ప్రజాతంత్రంలో ఉన్నతిని కాంక్షించే తత్వాలు...?'

క్షమించండి. ఉన్నతిని కాంక్షించే వారి బారి నుంచి భగవంతుడే రక్షించాలి. ఆ అర్థంలేని కవిత్వం, అశ్లీలమైన కథలు... భగవంతుడే కాపాడాలి. మీరేమో దాన్నే గొప్పగా భావిస్తున్నారు.

హైదర్ ఆలీఖాన్ ఆశ్చర్యపడేవారు. వేల సంవత్సరాలనుంచి సౌఖ్యాలనుభవిస్తున్న ఈ వృద్ధులతో వాదించడం కష్టం. బారిస్టర్ అయిన

తన వాగ్ధాటి అంతా ఇక్కడ పనికి వచ్చేది కాదు. ఆయన మెల్లిగా అనేవారు 'అబ్బాజాన్ విషయమేమిటంటే, సాహిత్యపరమైన విషయాలలోకూడా కొత్త ప్రయోగాలు జరుగుతున్నాయి. జాగీర్దారీ సంఘంలో సాహిత్యాన్ని కేవలం సౌఖ్యానికి, మనోరంజనానికి ఒక సాధనంగా మాత్రమే భావించడం జరిగింది. గజల్‌లో కేవలం స్త్రీ సౌందర్యం తప్ప మరే విషయము లభించదు... కానీ ఇప్పుడు సాహిత్యంలో కొత్త విషయాలు...'

'అదలా ఉంచండి మియా... షాయరీలో ఏ విషయం కొత్తగా ఉంటుంది'. వాహిద్ హుసైన్ పైప్‌లోని పొగాకును దులిపి అనేవారు, 'అదే ప్రేమ, ఆసక్తికి సంబంధించిన విషయం... ఇందులో నవ్యత ఏముంటుంది?'

ఇటువంటి సమయాలలో తను ప్రేమలో కొత్తదనాన్ని తీసుకురావడం కోసం చేసిన ప్రయత్నాన్నంతా ఆయన మరచిపోయేవారు.

'కవిత్వంలో ప్రేయసికి బదులుగా ఇంకెవరి నఖశిఖ వర్ణన జరుగుతుందో మీరే చెప్పండి! కార్మికుల పనులపై గజల్ వ్రాయగలమా! లేక యంత్రాల భాగాలను పొగుడుతారా?'

(ఈ మాటపై రాషిద్, వాహిద్ హుసైన్‌కు, విపరీతంగా నవ్వొచ్చేది.)

'బావగారూ, మీ కమ్యూనిజమ్ పాలనలో మా సిరిసంపదలు లాక్కుని మీరు బీదవారికి పంచిపెట్టడం ఏం న్యాయం చెప్పండి? బెస్తవాళ్ళు, చెప్పులు కుట్టేవాళ్ళు నవాబులతో సమానంగా అయిపోవడం ఘోరమైన అన్యాయం కాదటండీ!' రాషిద్ చాలా గంభీరంగా అయిపోయాడు.

'ఇటువంటి ఎన్నో అన్యాయాలను సహించడానికి సిద్ధంకండి రాషిద్‌మియా!' హైదర్ ఆలీఖాన్ వాక్కులో కాఠిన్యం ధ్వనించింది.

'ఏ వ్యవసాయ కూలీ అయినా ఎన్నికలలో గెలిచి మీకు నాయకుడై కూర్చున్నప్పుడాలోచించండి న్యాయం సంగతి!'

ఇలాంటి పరిస్థితులలో వాహిద్ బ్లడ్‌ప్రెషర్ ఉన్నట్లుండి పెరిగిపోయేది. ఆయన కోపంగా, 'చూడండి హైదర్ పాషా! మీకు వ్యతిరేకంగా సి.ఐ.డీ. రిపోర్ట్ ఆలీపాషా వరకూ చేరుకుంది. మీరు ఫాసిజమ్ పేరిట పరిస్థితులను ఆసరాగా తీసుకుని ఆంతరంగిక రాజకీయాలపై ఉపన్యసిస్తూంటారు. కమ్యూనిస్టుల సభలలో పాల్గొంటుంటారు? ఆయన అల్లుడికి అపాయాన్ని

గురించి హెచ్చరిస్తున్నారు.

అది షహారేవర్! మాసం.

వాతావరణంలో ఒక రకమైన మత్తు, అలసత్వం నిండి ఉన్నాయి.

ఐవానే గజల్‌లో వాతావరణం ఇంకా మనోరంజకంగా ఉంది. అందుకు కారణం - ఈ భవంతిలో నివసించేవారు తమ-తమ వ్యక్తిత్వాలలో మునిగి ఉన్నారు. బయటి ప్రపంచంలో వీరి పరిచయం బహు స్వల్పం.

క్రిప్సు ఉద్దేశ్యాలను కాంగ్రెస్ రద్దు చేసినటువంటి కాలమది. జిన్నా వెనుక ముస్లిములు 'లేకే - రహేంగే పాకిస్తాన్ (పాకిస్తాన్ తీసుకుని తీరుతాం)' అని కేకలు వేస్తూ తిరుగుతూండేవారు. వంతెనలు విరుగసాగాయి. రైళ్ళు పట్టాలమీద నుంచి దొర్లుతున్నాయి. భారతదేశంలోని ప్రముఖులందరూ 'సర్' అన్న బిరుదును తిప్పికొట్టారు. కాని నిజామ్‌కి వార్తలలో ఎటువంటి ఆసక్తి ఉండేది కాదు. ఆయన ప్రతి రాత్రి ఒక గజల్ చెప్పేవారు. అది ప్రాంతీయ వార్తా పత్రికలో ఉస్తాద్ జలీల్ సలహాతో పాటు మొదటి పుటలో అచ్చయ్యేది. గౌరవపురస్సరంగా ఆ పత్రికను ప్రజలెప్పుడూ చెత్తబుట్టలో వేసేవారు కారు. పాలకుని ఎడల ప్రేమ, భక్తి విశ్వాసాలు, దక్కను ప్రజల హృదయాలలో నాటుకు పోయాయి. ప్రతిరోజు నిజామ్ సవారీ రోడ్ల మీద నుంచి వెళుతున్నప్పుడు, బారులు తీరి గంటల తరబడి ఆయన దర్శనం కొరకు ప్రజలు వేచి ఉండేవారు. ఈ జమిందారీని చిరస్థాయిగా ఉండేటట్లు చేయుమని ప్రాతఃసాయంకాలాలు ప్రార్థన చేసేవారు.

ప్రతిరోజులాగే ఆ రోజు కూడా ఐవానే గజల్‌లో సందడి ప్రారంభమైంది. వాహిద్ హుసైన్ తోటలో తిరిగాక వార్తాపత్రిక తీసుకుని వచ్చేసరికి హాలులో చాంద్ నాట్యం చేస్తూంది. తాతగారు రావడం చూడగానే ఆమె రెండు చేతులతో ముఖం దాచుకుని రజియా గదిలోకి పారిపోయింది. సెలవ రోజంతా ఆమె తాతగారింట్లోనే గడిపేది. ఆమె అల్లరిని ఇంటి దగ్గిర తండ్రి ఎప్పుడూ అడ్డగిస్తూండేవారు. కాని ఇక్కడ మేనమామ, అత్తయ్యలకిద్దరికి ఆమె అంటే ఎంతో ఇష్టం.

చాంద్‌లోని మార్పు ఫాషెన్‌ను చూసి ఎక్కువ సంతోషించేది బీబీ, కారణం ఆమె ఒక పూరిపాక నుండి అక్కడికి వచ్చింది. స్త్రీ పాకలో

ఉన్నా, మహల్‌లో ఉన్నా, ఒకే పరిధిలో తిరుగుతూంటుంది. కాని చాంద్ చదువుకోవడం చూసి ఆమెలో, చాంద్ ఈ పరిధినధిగమిస్తుందన్న ఆశ చివురించేది.

వాహిద్ హుస్సైన్ లోపలికి రాగానే ఆయన ఊహించినట్లుకాక ఆయన రాకనెవరూ గమనించలేదు. లోపల రజియా నొప్పులు పడుతూండడం వలన కుంటత్త, బీబీ ఆమె దగ్గిర ఉండడమే దీనికి కారణం. హాలులో ఎర్రటి దస్తకఖ్వాన్ పరిచారు. దానిపైన పెద్ద పళ్ళెరాలలో ఖిచిడీ, వెన్న, ఖీమా, ఊరగాయి, అప్పడాలు, వాహిద్ హుస్సైన్ కొరకు ఉడికించిన గుడ్లు పెట్టి వున్నాయి.

మాలిన్‌బీ తలపై ముసుగు వేసుకుని చేతిలో విసనకర్ర పట్టుకుని కూర్చుని ఉంది. వాహిద్ హుస్సైన్‌ని తినడం ప్రారంభించమని దానర్థం. ఆయన పరిస్థితిని అవగాహన చేసుకున్నారు. అందుచేత మెల్లిగా, 'రాషిద్ మియా ఎక్కడున్నారు?' అని ప్రశ్నించారు.

'ఆయన కారు తీసుకుని డాక్టరమ్మని తీసుకుని రావడానికి వెళ్ళారండి!'

'ఊహ్...' ఆయన బేసిన్‌లోకి చేతులు జాపడంతో సలారు ఆయన చేతులు కడిగి తువ్వాలు అందించాడు. ఆ తువ్వాలునే వడిలో పరుచుకుని ఖిచిడీ ఉన్న పెద్ద పళ్ళెం మూత తెరిచారు. కాని ఆయనకెందుకో ఆ రోజు భోజనం చెయ్యాలనిపించడం లేదు. రెండవ మనుమడి రాకకు ఆనందం, ఖంగారు రెండూ ఒక్కసారిగా కలిగి ఆయనలో అశాంతి చెలరేగింది.

నేడు ఈ ఇంట్లోకి ఒక క్రొత్త ప్రాణి రానున్నాడు. ఆయన నిన్న, మొన్న రాషిద్ పుట్టిన శుభవార్త విన్నట్టుంది. సరిగ్గా ఇటువంటి ఉదయమే... ఇటువంటి కాలమే... నేడు రాషిద్ రెండవ కుమారుడు రానున్నాడు. ఈ క్రొత్త క్రొత్త పిల్లలు ఏమి చేసేందుకు వస్తున్నట్టు...? వాహిద్ హుస్సైన్ చెయ్యి ప్లేట్‌లో అలాగే ఉండిపోయింది. భగవంతుడు ప్రపంచం చూసి నిరాశచెందలేదు కనుక నవ శిశువులను పంపుతుంటాడు. కాని అతను ప్రతి పాత శిశువుని చూసి నిరాశ చెందాడంటారు టాగూర్. అప్పుల, తాకట్ల చెదలు పట్టిపోయిన ఆస్థుల కొరకు అన్నదమ్ముల తగాదాలు, మోసాలు, పెద్ద పెద్ద హోదాలు, ఖితాబుల కొరకు పరుగులు. ఎవరో

ఒక స్త్రీ కొరకు సర్వస్వాన్ని కోల్పోవడం... వాహిద్ హుసైన్‌కి జీవిత లక్ష్యం ఇలానే కనిపిస్తూంది. ప్రతి మనిషి కేవలం తన కొరకే జీవిస్తాడు... కూతురు - కొడుకు పిల్లల సంతోషాన్ని చూడడం, తన అహంకారం తృప్తి పడేటట్టు కొడుకు అభివృద్ధిని చూడగలగడం. ఈనాడు తన తుర్కీ టోపీని ఇంకొంచెం ఎత్తుగా పెట్టుకుని బయటకు వెళ్ళాలి. ఇద్దరు పౌత్రుల తాతగారు... రెండు లక్షలకి అధిపతి... ప్రతి పౌత్రుణ్ణి ఆయన ఒక ప్రామిసరీ నోటుగా భావించి క్యాష్ చేసేసుకోగలరు... అందుకనే పుత్రుని రాకకి ఆనందోత్సాహాలు జరుపుకోవడం.

ప్రాంగణంలో బిస్మిల్లా బీ తన కొడుకుని కొడుతూంది.

ఆయా వేస్తూన్న బట్టలు నచ్చక షాహిన్ మాటి మాటికీ చొక్కా విప్పేస్తూ అరుస్తున్నాడు. షాహీన్ మొండితనం చూసి వాహిద్ హుసైన్ అతడ్ని వళ్ళో కూర్చో పెట్టుకున్నారు. చిన్న నవాబుకి ఇష్టంలేని ఏ పని చెయ్యవద్దని ఆయన ఆయాని కేకలేసారు. ఆయనకి తన మనుమడంటే విపరీతమైన ప్రేమ. ఆ ప్రేమ ఎలాటిదంటే చదువుకున్న యువకుడైన కొడుకు కూడా ఆయనకు నచ్చేవాడు కాడు. 'అసలు కంటే వడ్డీ ముద్దు కదండీ!' నవ్వుతూ ఇతరులతో అంటూండేవాడు.

'ఓ కైసర్... బాబాకు రొట్టె తీసుకురా...' ఆయా పిలవగానే కైసర్ పరుగెత్తుకొచ్చింది. తొమ్మిది పది సంవత్సరాల వయసు కల బక్క పలుచని పిల్ల వదులుగా ఉన్న పైజమా, చిరిగి మాసిపోయిన కుర్తా వేసుకుంది. ఆ పిల్లకేసి చూస్తే ముందుగా కాంతివంతమైన కళ్ళపైన దృష్టి పడుతుంది. దీప కళికలవలె మెరుస్తూ ఆ కళ్ళు, వెనుదిరిగి వెళ్ళేటప్పుడు అసాధారణమైన పొడవైన జడపైన చూపు నిలిచిపోయేది. ఇంత చిన్న పిల్లకి ఇంత పెద్ద జడ...!

వాహిద్ హుసైన్ వద్దకు వచ్చి నిలబడింది కైసర్. ఆయన జాగ్రత్తగా పరిశీలించారు. ఆ పిల్ల ఇంత పెద్దదైపోయిందా అని ఆయనకు ఆశ్చర్యం కలిగింది!

'ఈమె ఫాతిమా బేగమ్ కూతురు కదూ...? కైసర్ ఎప్పుడూ మహల్‌కి వస్తూండేది. కాని వాహిద్ హుసైన్ ఆమెని చూసి చాలా కాలమైంది.

'చిత్తం, బాబు' ఫాతిమా బేగమ్ బియ్యం బాగుచేస్తూ తలపైన ముసుగు

సవరించుకుంటూ వెనుకగా వచ్చి నిలబడింది.

'అన్నగారూ, ఇంత పెద్దదైపోయిందీ పిల్ల! చదువుకుంటానని తెగ పట్టు పడుతూంది. ఏం చేయను? ఈమె తండ్రికై ఎదురు చూసి చూసి విసిగిపోయాను. ఫాతిమా బేగమ్ ఈనాడు తన అర్జీ ఆయన సమక్షంలో, ఎంతో భయపడుతూ, అతి హీనస్వరంతో విన్నవించుకుంటుంది. వాహిద్ హుసైన్ షాహిన్‌ను జాగ్రత్తగా చూస్తూ మౌనం వహించారు.

'నిజమే, నీకు చాలా కష్టంగా ఉండి ఉంటుంది. సరే వచ్చే నెలనుండి ప్రతి నెలా ఇక్కడకు వచ్చి పది రూపాయలు తీసుకు వెళుతూండు.'

'కాని కైసర్ తండ్రి...' సిగ్గు, బాధల వల్ల ఆమె విషయం పూర్తిగా వివరించలేకపోయింది.

'అహమద్ మియా పాపం ఏం చేయగలరు? గులామ్ రసూల్‌ని విడిచిపెడితే మిగిలిన వ్యవసాయ కూలీలు తమని కూడా విడిచి పెట్టవలసిందనని అడుగుతారు. నేను చెప్పేదేమిటంటే నువ్వు కూడా పిల్లల్ని తీసుకుని ఔరంగాబాద్ వెళ్ళిపో.'

'చిత్తం... కాని కైసర్ రానంటోంది. దానికి ఉజాలా బీబీ అంటే చాలా భయం. ఈ దరిద్రపు మొహం నన్నెక్కడా శాంతిగా ఉండనివ్వదు,' నిట్టూరుస్తూ అంది ఫాతిమా బేగమ్. తిరిగి బియ్యం బాగుచెయ్యడం మొదలుపెట్టింది.

ఫాతిమా బేగమ్ పూల మడిలో పుట్టుకొచ్చే ముళ్ళ పొదలాంటిది. వాహిద్ హుసైన్ తండ్రిగారు వరుసగా పుట్టుకొస్తున్న సంతానం చూసి కంగారుపడి, దిగులు పడుతూ, కాస్త మానసికాహ్లాదం కోసం ఫాతిమా బేగమ్ తల్లిని వివాహం చేసుకున్నారు. సంవత్సరం కూడా గడవక ముందే ఆ భార్య కూడా ఆయనని చూసి అసహ్యించుకోవడం మొదలెట్టింది. నవాబ్‌గారికి విషయం తెలియగానే అంతులేని కోపంతో ఆమెనొక గదిలో బంధించేశారని వినికిడి. అంతలో ఒక చక్కని అమ్మాయి వేంచేసిందన్న వార్త వినగానే దిగులుతో కూలబడిపోయారట. ఆ తరువాత ఆయన్ని ప్రాణంపోయిన తరువాతే లేవతీశారు. వాహిద్ హుసైన్ అంటూండేవారు. తరువాత వాహిద్ హుసైన్, అహమద్ హుసైన్ వీలునామాని పరిశీలించగా అందులో ఫాతిమాబేగమ్ తల్లి ప్రస్తావనేలేదు. అంతేకాకుండా మరొక

వివాహం చేసుకున్నట్టు ఋజువు చేయగల ఎటువంటి ఆధారాలు లభించలేదు.

ఈ పీడ జీవితాంతం మెడకు చుట్టుకుంటుంది కాబోలనుకున్నారు అహమ్మద్ హుసైన్, కాని వాహిద్ హుసైన్ చాలా సానుభూతితో వ్యవహరించి ఫాతిమా బేగమ్ తల్లికి కొంత నెలసరి ఆదాయం ఏర్పాటు చేశారు. అనాధ స్త్రీలకు సహాయం చేయడం వలన భగవంతుణ్ణి మెప్పించినట్లవుతుందని భావించి 12, 13 సంవత్సరాల ఫాతిమా బేగమ్‌ని, అహమద్ హుసైన్ దగ్గర పనిచేసే ఒక వ్యవసాయ కూలీ గులామ్ రసూల్‌కిచ్చి పెళ్ళి జరిపించేశారు. ఆయన తన స్వంత ఖర్చుతో ఈ వివాహం చేశారు. కాని, ఈ వివాహానికై గులామ్ రసూల్ తండ్రికి కొంత డబ్బు కావలసివచ్చి, అతను తన కుమారుణ్ణి అహమద్ హుసైన్ దగ్గిర ఐదువందల రూపాయలకి తాకట్టుపెట్టాడు.

ఆ రోజులలో పల్లెలో వ్యవసాయ కూలీలను సునాయాసంగా తాకట్టు పెట్టడం జరిగేది. నిర్ధారించబడిన గడువు పూర్తి అయ్యే వరకు ఇటువంటి కూలీ రేయింబవళ్ళు యజమాని వద్ద పని చేసేవాడు. అందులో అతని తిండి బట్టలు లెక్కించేవారు కాదు. గడువు కాలంలో యజమాని సొమ్ము తీర్చివేయాలి, లేదా తాకట్టు గడువు ఇంకా పెరిగిపోయేది. ఏ కూలీ అయినా చేసుకున్న ఒప్పందానికి వ్యతిరేకంగా పారిపోతే అతన్ని గ్రామంలో గౌరవించేవారు కారు. మనిషి మాటేకదా నమ్మగలిగేది. అడి తప్పిన వాణ్ణి ఎవరు గౌరవిస్తారు? గ్రామాలలో అందరూ ఒప్పుకోవలసిన ఇతర చట్టాలలాంటిదే ఇదికూడా! కనుక గులామ్ రసూల్ కూడా రోజంతా అహమద్ హుసైన్ పొలాలలో పనిచేసేవాడు. అక్కడ పనిలేని సమయంలో ఉజాలా బేగమ్ ఇంటి వద్ద కట్టెలు కొట్టడం, యజమాని కాళ్ళుపట్టడం, బేగమ్ సాహిబా బట్టలు ఉతకడం, బజారు పనులు చెయ్యడం వంటి పనులు అప్పగించేది. ఫాతిమా బేగమ్ కూడా అక్కడికి వెళ్ళినట్లయితే, ఒక దాసీని మరో పని పిల్లని తీసివేసేది. ఉజాలా బేగమ్ జీతం ఇచ్చి నౌకర్లని పెట్టుకుంటే, పారిపోతాడేమో అని బెంగ ఉంటుంది. కాని ఫాతిమా బేగమ్, కైసర్ ఎక్కడికీ పోరన్నది ఆమెకి తెలుసు. పగలూ, రాత్రి వారిరువురిని హింసిస్తూండేదావిడ. ఆవిడ పెట్టే బాధలన్నీ సహించేది

ఫాతిమా బేగమ్. కాని కైసర్ అలాగ కాకుండా ఎన్నోసార్లు ఎదిరించి చెప్పు దెబ్బలు తిని అక్కడినుండి తిరిగి వచ్చింది. ఈ విధంగా పన్నెండు సంవత్సరాలు గడిచిపోయాయి. బాకీ చెల్లించ లేకపోవడం వలన ఫాతిమాబేగమ్ భర్త అలాగే తాకట్టులో పడి వున్నాడు.

ఫాతిమా బేగమ్ పట్నం వచ్చేసి ఒక గుడిసెలో ఉంటూ, పొట్ట గడుపుకునేందుకు ఊరగాయలు, అప్పడాలు తయారుచేసి అమ్మేది. కైసర్ స్కూల్‌కి వెళ్లేది. మిగిలిన సమయంలో పెద్ద వాళ్ళిళ్ళకి, బంధువుల ఇళ్ళకీ వెళ్ళి చిన్న చిన్న పనులు చేసి కొంత డబ్బు తెచ్చేది. ప్రతినెలా నాలుగైదు రోజులు ఊరగాయ పెట్టడం, మసాలాలు దంచడం, బియ్యం బాగుచెయ్యడం వంటి పనుల సాకు మీద బీబీ ఇంటికి వెళ్ళేది. బీబీ మూడు, నాలుగు రూపాయలిచ్చేది. ఇవి కాకుండా పాత బట్టలు, శ్రీమంతుల మనసు తీరిపోయిన బట్టలు ఆమెకు లభించేవి. కైసర్‌కి పై పనులు పురమాయించేది. కైసర్ స్వభావం తల్లికి వ్యతిరేకంగా ఉండేది. పేటలోని ప్రతి పిల్లవాడితో దెబ్బలాడేది. కైసర్ ఉన్నప్పుడు, పిప్పరమెంట్ పేరుతో క్వినైన్ మాత్ర ఇచ్చేది చాంద్. రాషిద్ ఒక్క పైసా ఇచ్చి దానికి బదులు ఎండలో గంట సేపు నిలబెట్టేవాడు. తరువాత ఆమె పైసా అడిగితే బొటనవేలు చూపించి అందర్నీ తెగ నవ్వించేవాడు.

'అబ్బ! ఈ పిల్లకి పైసలంటే ఇప్పట్నించే ఎంత ఆశ!' బషీర్ బేగమ్ అనేది.

రజియా తన సారెలో తెచ్చిన గ్రామ్‌ఫోన్‌లో బిబ్బో, సురేంద్రల రికార్డు 'తుమ్‌నె ముఝుకో ప్రేమ్ సిఖాయా!' పెడితే కైసర్ ఆశ్చర్యపోయేది. ఇదంతా చాంద్ అల్లరనీ, ఆమె ఆ పెట్టెలో దాక్కుని పాడుతుందనీ కైసర్ గాఢంగా నమ్మేది.

ఇంట్లోని వారంతా కైసర్ చేత నౌకర్లలాగ పని చేయించుకునేవారు. కుంటత్త, కాళ్ళు పట్టించుకునేది. బతూల్ తన పిల్లల్నప్పగించేది. వాహిద్ హుసైన్‌కి ఫాతిమా బేగమ్ చేతి ఊరగాయలు, పచ్చళ్ళు చాలా ఇష్టం. అందువల్ల ఫాతిమా బేగమ్ మామిడికాయల చెక్కుతీస్తే, కైసర్ మసాలాలు దంచేది. బియ్యం బాగుచేసేవారు. తల్లీకూతుళ్లు కలసి పొయ్యిలు బాగుచేసేవారు. రజాయిలు వగైరాలు కుట్టేవారు. వారికి జీవితం

దుర్భరమయింది. ముందునుయ్యి, వెనుక గొయ్యిలా తయారయింది. చేసే పనులకి బదులు మూడు నాలుగు రోజుల భోజనం గడిచిపోయేది. బషీర్‌బేగమ్ చాంద్ పాత గౌన్లు చిన్నవైపోయాయంటూ కైసర్ కిచ్చేది. నిజానికి కైసర్, చాంద్ ఒకే వయసు వారవడమే కాకుండా చాంద్ కంటే కైసర్ పొడుగ్గా కనిపించేది. చాంద్ విడిచిన బట్టలు కట్టుకోవడానికి కైసర్ చాలా ఏడ్చేది. చాంద్‌కి, కైసర్‌కి పడకపోవడమే దీనికి కారణం. ఆ బట్టలు వేసుకునేటప్పుడు కైసర్ చాలా గొడవ చేసేది, గౌన్లని పళ్ళతో చింపేసేది. చాంద్ ఆమె స్నేహితురాళ్ళు ఆమెని ఎక్కిరించి, ఏడ్పించేవారు. కైసర్, అమ్మమ్మ వాళ్ళింట్లోంచి చాలా వస్తువులు దొంగిలించి తీసుకుపోతుందనుకునేది చాంద్. అందువల్ల ఒకసారి రిబ్బన్ పోయింది, మరొకసారి ఫాతిమాబేగమ్ వెళ్ళగానే రజియా పర్స్‌లో ఒక రూపాయి తగ్గిపోయింది.

బతూల్ బేగమ్, బషీర్ బేగమ్‌లకు కైసర్ పొడవైన జుట్టు ఈర్ష్య కలిగించేది. బషీర్ బేగమ్ చాంద్ జుట్టు పొడుగ్గా అవడం కోసం ఎన్నో ప్రయత్నాలుచేసి, చివరికి భర్త సలహానుసారం ఇంగ్లీషు ఫేషన్‌లాగ జుట్టు కత్తిరించింది. 'ఇదిగో ఫాతిమా అత్తా! పొడుగుజుట్టు దరిద్రానికి కారణమంటారంతా. దీని జుట్టు కత్తిరింపించెయ్యి. నీ కష్టాలు గట్టెక్కుతాయి' అని బషీర్ బేగమ్ మాటి మాటికీ అంటూండేది.

ఆమె నవ్వుతూ, 'కైసర్ జడ చాలా పొడుగ్గా ఉంటుంది కదూ. జడ పుచ్చుకుని ఈడ్చెయ్యటానికి భర్తకి వీలుగా ఉంటుంది', అనేది.

ఆ మాటలకి అక్కచెల్లెళ్ళిద్దరికీ బాగా నవ్వొచ్చింది. బతూల్ బేగమ్, 'ఈ కైసర్ ఎలాగా మాట్లాడుతుంది, చూస్తూండు అత్తవారింట్లో ఒక్కరోజు కూడా నిలవదు? అని మళ్ళీ 'నువ్వే దమ్మిడీకి మొహం వాచి ఉంటే, అంత పెద్ద జుట్టుకి ఎంత నూనె కొనవలసొస్తుందో చూడు. కొంత జుట్టు కత్తిరించెయ్యి?' అనేది.

కాని ఫాతిమా బేగమ్ ఏ మాటకీ జవాబు చెప్పేది కాదు. తలమీది కొంగు సరిచేసుకుని బియ్యంలో రాళ్ళేరుతుండేది.

'నువ్వు కత్తిరించకపోతే నేనే కత్తిరించేస్తాను', బషీర్ బేగమ్ కత్తెర కోసం వెతకసాగింది.

వాహిద్ హుసైన్ హాల్ లోంచి లేచి గదిలోకొచ్చేసరికి రజియాకి స్వస్థత చేకూరినట్టుంది. కుంటత్త, బీబీ హాల్‌లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. 'బజారులో శేరు నాలుగణాల కమ్ముతూన్నప్పుడు ఐదణాలు శేరు చొప్పున ఎందుకు కొనుక్కొచ్చావు? అని సలారుతో జగడమాడుతూంది బీబీ.

'కాలం ఎంత మారింది? వాహిద్ హుసైన్ పైప్ పీలుస్తూ ఆలోచిస్తున్నారు.

'పోనీండి బీబీ పాషా! కోడలికి వంట్లో సరిగ్గా లేదు. గొడవచెయ్యకండి? కుంటత్త అంది.

'ఎలా పోనియ్యను, గౌహార్ బేగమ్! ఒక అణా ఊరకనే వస్తుందా?'

అప్పుడప్పుడు బీబీకి తాను బేగమ్‌నన్న పిచ్చి ఊహా నెత్తిన సవారీ చేసేది, తరుచు ప్రతికూల పరిస్థితులలోనే అలా జరిగేది. అటువంటప్పుడు ఆమె ఈ విధంగా ప్రవర్తించేది. సరే... వాహిద్ హుసైన్ తన ఆలోచనలో మునిగారు. తమ వంశంలోని పసిపిల్లలకి సహితం కంఠస్థమైన, తన పితామహుడికి సంబంధించిన ఆ కధ, ఆయనకు జ్ఞాపకమొచ్చింది - ఒకనాడు తాతగారు తోటమాలితో, గులాబీ మొగ్గ ఫలానా రోజు వికసిస్తుందని, పందెం కాశారు. ఆ రోజు నవాబుగారు ప్రాతఃకాలాన ప్రార్థన అనంతరం జపం చేసుకుంటూ తోటలోకొచ్చేసరికి తోటమాలి ముందుకొచ్చి అన్నాడు, 'సర్కార్! ఇవాళ ఈ పువ్వు చూడలేదా?'

'హు, సరే!' ఇది గురువారంనాడు విడుస్తుందని 'ఆనాడు ప్రభువులు పందెం కాశారు, ఈనాడు బుధవారం?'

'అరే, అయ్యో...!' ప్రభువులు నిలుచుండి పోయారు, 'నేను నీతో ఏదో పందెం కూడా కాశాను కదూ!'

'అవునండీ... అవును...!' మాలి చేతులు జోడించి ఉండిపోయాడు.

'అయితే మరి నీకేం కావాలి?' ఆయన లెక్కలేకుండా అడిగారు.

'హై... హై... హై... ప్రభువులే మాకు జన్మదాతలు,' మాలీ ఏమీ అడగలేదు.

'మున్షీగార్ని పిలువు.'

ఇంత ఉదయాన్నే పిలవనంపినందుకు ఆయాసపడుతూ మున్షీగారు హాజరయారు.

'కలమ్‌దాన్‌లో ఎంత మొత్తం ఉంది? ప్రభువులు జపం చేసుకుం టూండడం వలన చేతితో సైగచేసి ప్రశ్నించారు.

'చిత్తం నిన్ననే పన్నులు వసూలైనాయి. ఆ బాపతు నాలుగువేల ఐదు వందలో లేక ఐదువేలో...?' 'ఆ సొమ్ము మాలీకిచ్చెయ్యండి' ఆయన చేతి సైగతోటే బోధపరిచారు. మాలీతోపాటు, ఈ ఉత్తర్వు వినుటకై గుమిగూడిన ఇతర నౌకర్లు చెల్లా చెదురైపోయారు - ఇది అసాధారణమైన బక్షీష్ అని.

ఆ మాలీ కొడుకు చదువుకుని ఎక్కడో ఉద్యోగం చేస్తున్నట్టు, అతని మనుమడు మల్లేశమ్ రాషిద్ తోటి ఇంజనీరని, ఇప్పుడు రాషిద్‌తో కలిసి వ్యాపారం చేస్తున్నాడని గౌహార్ అత్తకి తెలుసు. కొత్త ఫాషన్‌తో కట్టిన, వాళ్ళ బంగళా ఎదురుగానే ఉండేది. ఇద్దరూ మంచి స్నేహితులు. ఈ వంశం వారితో వాహిద్ హుసైన్‌కి మంచి సంబంధ బాంధవ్యాలుండేవి. మల్లేశమ్ తండ్రిని వాహిద్ హుసైన్ 'రాజా' అని పిలిచేవారు. హోలీ, దీపావళి, దసరా, పండుగలప్పుడు అంతా మల్లేశమ్‌తో తప్పనిసరిగా జూదమాడేవారు. బోనాల పండుగ సంబరాలు చూడడానికి ఇద్దరూ కలిసి వెళ్ళేవారు. ఆనాడు స్నానం చేసి, అలంకరించుకుని పూజకోసం వచ్చిన స్త్రీలను ఏడిపించి, ఒకరిద్దరిని మోసగించి తమతో తీసుకుని రావడం వీరికి చాలా అవసరం.

మల్లేశమ్ కొడుకు నారాయణ, చాంద్‌తో చదువుతున్నాడు. వారిద్దరిదీ గాఢమైన స్నేహం. చాంద్ నారాయణతో ఆడుకోవడానికే ప్రతి శెలవు రోజు ఐవానే గజల్‌కి వచ్చేది.

'గౌహార్ బేగమ్! కూర్చునే నిద్రపోయారా ఏమిటి? బీబీ కుదిపేసరికి ఆమె ఉలిక్కిపడింది.

'ఏమిటి, నొప్పులెక్కువయ్యాయా?' ఆవిడలేచి కూర్చుంది.

'బతూల్ బేగమ్ అత్తవారింటి నుంచి ఆర్డలీ వచ్చాడు'

'అయ్యో! ఏం వార్త తెచ్చాడో ఏమిటో?'

హాలుముందు అందరూ గుమిగూడారు. మధ్యలో తెల్లటి యూనిఫామ్ వేసుకుని, పాగా చుట్టుకుని, నడుముకు 'అలిఫ్ లైలా' బెల్టు బిగించి, ఒక నల్లటి ఆర్డలీ నిలబడి ఉన్నాడు. అతని చేతిలో సీలువేసిన ఒక కవరు

ఉంది.

బతూల్ అత్తవారిల్లు, 'అలిఫ్‌లైలా'లో అందరూ ఇదే విధంగా దర్గాగా ఉండేవారు, ప్రతి విషయానికి పద్ధతులు, శాసనాలు, అదీకాక 50 ఏళ్ళ క్రితం వారి లకడీదాదా నిర్ణయించిన పద్ధతులన్నీ అమలు జరిపేవారు.

వారి తండ్రి, తాతల కాలం వరకు హైదరాబాద్ నవాబులు - జాగీర్‌దారుల అవసరాలు తీర్చేవారు. వారు దర్గా - హజరత్ రహమత్ ఆలీపాషా, పీఠాధిపతులు కావడమే అందుకు కారణం. అది చాలా గొప్ప పవిత్రమైన సమాధి, అక్కడికి విభిన్న ధర్మానుయాయులు తలయొగ్గి నమస్కరించడానికి వచ్చేవారు.

ఎప్పటికీ తరగనటువంటి సంపద అది. ధనికులందరి కోరికలు తీర్చేటటువంటిది. చెడిపోయిన పనులకు సానుకూలపరిచే పనిని స్వయంగా, అలహాజ్ మిస్‌కీన్ ఆలీషాహి, కష్టాలను గట్టెక్కించే మంగళప్రదమైన చేతులు అవి. కాని ఎందువల్లనో ఇప్పుడీ వంశపువారి చేతులలో ఆ దైవత్వం లోపించింది. ఈ దర్గా నుండి కూడా కోరికలు కలవారు కోరికలు తీరకనే వట్టి చేతులలో తిరిగిపోతున్నారు. రివాయత్‌ల ఏదో పోతూన్న స్తంభాలను నిలబెట్టడమెలాగా అని ఆలోచించి దిగులు పడిపోయేవారు మిస్‌కీన్ ఆలీషాహ్ తోతా చష్మి. ఎటుచూసిన రాఖ్-బట్‌లు రివాయత్‌లు అన్నీ చెదిరిపోతున్నాయి.

ఇప్పటి పరిస్థితులెలాగున్నాయంటే ఆయన తన నలుగురు భార్యల్ని వారి పద్దెనిమిది మంది సంతానంతో పాటు అలిఫ్‌లైలాలో అట్టెపెట్టి తాను దర్గాలో ఒక గదిలో పడుండేవారు. దర్గా అలిఫ్‌లైలా ప్రాంగణంలోనే ఉంది. ప్రపంచపు భోగవిలాసాలనుండి దర్గాను రక్షించేందుకు ప్రభుత్వము దయవలన మంజూరైన స్థలంలో మిస్‌కీస్ అలీషాహ్ తాతగారు ఒక గొప్ప మహల్‌ను నిర్మించారనడం సముచితంగా ఉంటుంది. తన సంతానం ఆ మహల్‌లో ఉండి దర్గాని దుష్ట శక్తులబారి నుండి రక్షిస్తూ పవిత్రంగా ఉంచగలరని ఆయన ఆశయం. ఒకప్పుడు మిస్కీన్ ఆలీషాహ్ తాతగారొక పాకలో పడుండగా చూసి, 'నీ కొరకు మేము అలిఫ్‌లైలా కథవంటి ఒక భవనాన్ని కట్టించిస్తాము వెళ్ళు...' అన్నట్టు వినికిడి. అందువల్ల ఆయన తన భవనానికి 'అలిఫ్‌లైలా' అనే నామకరణం చేశారు.

ఇప్పుడిక మిస్కీన్ అలీషాహ్ పరిస్థితెలాగుందంటే పట్నంలో ఏం జరిగినా, బంధువుల గృహాలలో ఎటువంటి శుభాలు, అశుభాలు జరిగినా ఆయన దర్గా నుండి బయటకు వచ్చేవారు కారు.

రహమత్ అలీషాహ్ ఒకనాడు మిస్కీన్ అలీషాహ్ కలలో కనబడి, తవ్వి తన గోరీని బయట పడేటట్టు చేసినట్లయితే వీరి సంతానమెప్పుడూ ఆకలితో బాధపడదు. అని చెప్పినట్టు ప్రతీతి. దర్గా వలన మంచి లాభాలొచ్చేవి. ఉద్దండులు సహితం అక్కడికి వచ్చి తలయొగ్గేంత ప్రసిద్ధిగాంచిందీ దర్గా.

ఇప్పుడెవరైనా, మీరెందుకు బయటికి రావడంలేదని ఎవరేనా మిస్కీన్ అలీషాహ్, తోతాచష్మిని ప్రశ్నిస్తే ఆయన చేతులెత్తి ఆకాశంకేసి చూస్తూ, 'నాకు ఇచ్చిన ఆజ్ఞను అమలుపరుస్తాను' అనేవారు.

వకీళ్ళు, దళార్లు చెయ్యలేని పనులు మిస్కీన్ అలీషాహ్ ఇచ్చే తాళ్ళు, తాయెత్తుల వల్ల జరుగుతాయని ప్రసిద్ధిగాంచింది.

అలిఫ్‌లైలా దర్బారు, డాబు గురించి గొప్పగా చెబుతూండడం పరిపాటి. రహమత్ అలిషాహ్, ప్రతిరాత్రి మిస్కీన్ అలీషాహ్ తలవద్ద వెయ్యి రూపాయల సంచీ పెట్టి వెళ్ళేవారని ప్రజలు చెప్పుకునేవారు. మిస్కీన్ అలీషాహ్ జిన్నాత్‌కి చదువు చెబుతారని, అవి రోజూ ఒక సంచీడు బొగ్గులు వారికిస్తాయని, తెల్లవారేసరికి ఆ బొగ్గులు బంగారు కణికలుగా మారిపోతాయని అనుకునేవారు. ఈ మాటలను నిరాకరించడమెలాగ? గొప్ప గొప్ప జమీందార్లకు లభ్యంకానంతటి దర్జాగా ఉండే వారాయింటి స్త్రీలు, పిల్లలు.

మిస్కీన్ ఆలీషాహ్, తోతాచష్మి చేసే చమత్కారాల ప్రభావం స్త్రీలపై ఎక్కువగా ఉండేది. గొప్పవారి - బీదవారి బజార్లు, సమాజాలు వేరైనట్టుగానే వారి దర్గాలు, దేవాలయాలు కూడా విభజింపబడతాయి.

రహమత్ అలీషాహ్ మజార్ 'బంగారు జాలీ, మంచి ముత్యాల షామియానా, ఇంకా గొప్ప భవనంలోని ప్రతి ఇటుక, సల్తనత్-ఏ-ఆసఫియాకి పునాది వేసినటువంటివి పేరెన్నిక గన్న స్త్రీల బహుమానాలే. కనుకనే గొప్ప గొప్ప బేగమ్‌లు అక్కడికి వచ్చి ప్రార్థించేవారు.

పెద్ద - పెద్ద జాగీర్దార్లు వచ్చి తన ప్రతిద్వంద్వి ఓటమిని గురించి

తెలుసుకుని వెళ్ళేవారు. ఇక్కడికి వచ్చిన స్త్రీల కడుపు పండింది, పురుషుల ఇనప్పెట్టెలు నిండాయి. ఉర్స్ జరిగినప్పుడూ ఒక వెయ్యిమంది బీదవారికి అన్నదానం జరిగేది.

దీనంగా ముఖంపెట్టి, ఫకీరు తానే బీదవాడైనప్పుడు, ఇంతమందికి భోజనం పెట్టే సాహసం అతనికి ఎక్కడినుండి వస్తుంది? అదంతా పీర్-ముర్షిద్ చలవ-చమత్కారం అని అంటూండేవారు - మిస్కీన్ అలీషాహ్.

అందువల్లనే మిస్కీన్ అలీషాహ్ పచ్చని దేహచ్ఛాయ, ఖిజబ్ రాసినటువంటి నల్లని గడ్డంతో చంద్రబింబంలాగ మెరుస్తూండేది. ఆయన నల్లటి జర్క్-బర్క్ పెద్ద తలపాగా పెట్టుకుని తలపై మష్వంద రుమాలు కట్టుకుని చెతిలో జపమాల పట్టుకుని, విశాలమైన కళ్ళనెత్తి బీబీనైనా ఆశీర్వదించేటప్పుడు ఒక విధమైన కాంతి నలుదిశలా వ్యాపించేది.

తిరిగి తమ ఉనికి మాయమవడం ప్రారంభమయ్యేది. తప్పు చేసిన శరీరం పడిపోవడంతో ఆచ్ఛాదన లేని ఆత్మ మిస్కీన్ ఆలీషాహ్‌తో లీనమైపోవాలని కోరుకునేది.

స్త్రీల విపరీతమైన శ్రద్ధ, భక్తులు మిస్కీన్ ఆలీషాహ్‌ని ఇరకాటంలో పెట్టేవి. మురాద్ అలీ కూతురు అందుకే పిచ్చిదైపోయిందని వినికిడి. రాత్రిళ్ళు లేచి మిస్కీన్ అలీ షాహ్‌ని పిలుస్తూండేది. ఆమె దీర్ఘ రోగంతో విసిగిపోయిన మురాద్ అలీ ఒకనాడు ఆమెని తీసుకువచ్చి మిస్కీన్ ఆలీషాహ్ పాదాలపై పడవేశారు.

ఒక అవివాహిత యువతిని తన గదిలో ఎలాగ ఉండనివ్వగలనని ఆలోచించిన మిస్కీన్ ఆలీషాహ్ చివరికి ఆమెను వివాహం చేసుకున్నారు.ఆలిఫ్ లైలాలోని ఒక గది ఆమెకి కేటాయించడం జరిగింది. మిస్కీన్ ఆలీషాహ్ దయ నలువైపులా వ్యాపించింది. మొత్తం నవాబుల జాగీర్దార్ల బేగమ్‌లకి అది ఒక చవకబారు మార్గంగా తోచింది.

ఇంక యువతులు మిస్కీన్ ఆల్‌షాహ్‌ని చూడగానే ముడుచుకు పోయేవారు. ఇటు ఆలిఫ్ లైలా ప్రాంగణంలో కొత్త కొత్త గదులు ఏర్పడసాగాయి. అల్లా నాలుగు కంటే ఎక్కువ వివాహాలు చేసుకోవడానికి అనుమతించలేదు కనుక ముందుగా పెళ్ళి చేసుకున్న భార్యలకు ఆయన విడాకులివ్వవలసి వచ్చింది.

కాని నిజాత్ గురించి కొట్టుమిట్టాడే ఆత్మలు ఆ గదులలో కూడా వలలో కొట్టుకునే చేపలవలె బాధపడేవి. గోడలకేసి తలలు పగులకొట్టుకుని, పిల్లల్ని కొట్టి సవతులతో పోట్లాడి మిస్కీన్ ఆలీషాహ్ ముఖం చూడగానే మూర్ఛపోయేవారు.

మిస్కీన్ ఆలీషాహ్ దగ్గిర చాలా వజ్రాలున్నాయని, అక్కడి ప్రతి స్త్రీ వజ్రం మింగేసి చచ్చిపోయేదని ప్రజలు చెప్పుకునేవారు.

ఆలిఫ్‌లైలాకి సంబంధించిన గాధలు విన్న వాహిద్ హుసైన్‌కి ఆశపుట్టుకొచ్చింది. జాగీర్ అనే నావ మునగడానికి సిద్ధమయేసరికి రక్షణ నిమిత్తం ఎన్నో విధాల ప్రయత్నించసాగారు. ఆయన రాషీద్‌కి గొప్ప వ్యాపారవేత్త కూతురు రజియాతో వివాహం జరిపించారు. బషీర్ బేగమ్ బతూల్ బేగమ్‌లు ఐవానే గజల్ పద్దతులన్నీ కూడా తెలుసుకున్నారు. బషీర్ బేగమ్ స్వభావం తొందరపాటుది కాబట్టి లండన్ వెళ్ళొచ్చిన హైదర్ ఆలీఖాన్‌ని ఎంపిక చేశారు. బతూల్ బేగమ్ అందంతోపాటు తల్లి స్వభావాన్ని కూడా పుణికిపుచ్చుకుంది, పరిస్థితుల కనుగుణంగా తనని తాను మలుచుకోగలదామె. అందువలన మిస్కీన్ ఆలీషాహ్ తన కుమారుడైన హుమాయూన్ ఆలీషాహ్ కొరకు బతూల్ బేగమ్ నడిగేసరికి ఐవానే గజల్‌లో ఆనందం వెల్లివిరిసింది.

బతూల్ బేగమ్ అత్తవారింటి నుండి పుట్టింటికి వస్తే ఇద్దరు కావలావాళ్ళు, ఒక దాసీ కూడా వచ్చేవారు. పుట్టింటికి తప్ప ఆమె వేరెక్కడికి వెళ్ళేందుకు అనుమతించేవారు కారు. ఇవి గొప్పవారి పద్ధతులు. ప్రజలు వారి గోరీ వద్దకు వచ్చి హాజిరీ ఇచ్చేవారు.

స్వయంగా ఎప్పుడూ గడపదాట వీలులేదు. పుట్టింటికి వచ్చే ముందుకూడా బతూల్ బేగమ్ మిస్కీన్ ఆలీషాహ్ దర్బారుకి ఒక అర్జీ పంపవలసి వచ్చేది. అప్పుడు అనుమతి లభించేది. మిస్కీన్ ఆలీషాహ్ భార్యలెందరో పుట్టింటి పేరు చెప్పి అబద్ధపు సాకులతో పలాయనం చిత్తగించారు. అలిఫ్ లైలాలో ప్రతి దానికీ కాల నిర్ణయం జరిగేది.

ఇది ఫకీరు కుటీరం. మౌలా ఉద్దేశాన్ననుసరించే ఇక్కడ ప్రతి అడుగు పెట్టాలి. ఇష్టమొచ్చినట్టు వ్యవహారించడానికిది ఏ జాగీర్దారు భవంతో కాదు; అనేవారు మిస్కీన్ అలీషాహ్.

బతూల్ బేగమ్, హుమాయూన్ ఆలీషాహ్, వాహిద్ హుసైన్ గారింటికి వచ్చేటప్పుడు, చాలాకాలం ముందుగానే ఉత్తరాల నకళ్ళు ప్రారంభమయేవి. నిర్ణీత సమయానికి హుమాయూన్ ఆలీషాహ్ వచ్చేవారు. ఎర్రటి షేర్వానీ, జరీషవులా, సెంటు వాసనలతో గుబాళిస్తూ, ధగ-ధగ మెరిసే వజ్రపుటుంగరాలతో ఆయన కారు దిగేవారు. ఆ కారుపైన ఆలిఫ్‌లైలా బోర్డు ఉండేది. వారితోపాటు వచ్చే మిఠాయిల గంపలపైన ఆలిఫ్ లైలా చీటీ అంటించి ఉండేది. ఇదంతా రహమత్ ఆలీ షాహ్ ఇచ్చిన దర్గా ఆస్థి, అందువల్ల నాకు హక్కులేదు అనేవారు మిస్కీన్ ఆలీషాహ్.

బతుల్ బేగమ్ వివాహం జరిగి అయిదు సంవత్సరాలయింది. ఇప్పుడామె మిస్కీన్ ఆలీషాహ్‌కి మూడవ వారసుడ్నివ్వబోతూంది.

ఆలిఫ్ లైలా నుండి నేడొచ్చిన జాబు కష్టమైన ఉర్దూలో వ్రాసివుంది. మొదట బీబీ దాన్ని జాగ్రత్తగా పరిశీలించి అందులో ఏమి వ్రాసివుందో ఊహించింది. తరువాత ఆ లేఖ రజియావద్దకు పంపింది. తన గర్భంలో జరుగుతున్న అలజడిని ఓర్చుకుని ఆమె చదవడానికి ఎంతో ప్రయత్నించింది. మెట్రిక్ వరకు ఆమె చదువుకుంది. కాని ఉర్దూ అంతంత మాత్రంగానే వచ్చు. కాని కుంటత్తకి తప్పులెన్నడం అలవాటు. పిల్ల చదువు విషయంలో మనల్ని మోసగించారని అనేకసార్లు మెల్లిగా అంటూండేది.

చివరికి బయట నుంచి రాషిద్‌ని రప్పించారు.

రాషిద్ మెట్రిక్ మొదలు ఇంజనీయరింగ్ వరకు అన్ని పరీక్షలు ఫస్ట్ డివిజన్‌లో పాస్ అయ్యాడు. అయినా ఉత్తరంలోని విషయం వెంటనే చెప్పలేకపోయాడు. చివరికి ఉత్తరంలోని సారాంశాన్ని ఈ విధంగా చెప్పాడు. 'కోడలు మూడవ వారసుడి ఆగమనానికై ఎదురు చూస్తున్నారు. అవసరమైనప్పుడు సహాయానికై, ఆమె తల్లిగారికి, ఇతర స్త్రీలకి ఇందు మూలముగా తెలియచెయ్యడమైనది?'

కుంటత్త 'ఇదీ ఆలిఫ్-లైలా పనులు' అంది.

'ఈ ఉత్తరం నిన్న పంపించి వుంటారు. ఇప్పటికి బతూల్ బేగమ్ బిడ్డ పుట్టి 12 - 13 గంటలై ఉంటుంది.'

'అల్లాహ్ అమీన్!' అంటూ, చిరిగిన చెరుగును తలపైకి లాక్కుంటూ ఫాతిమా బేగమ్ వచ్చింది.

'భాభీ పాషా! మీరు దౌహోత్రులతోనూ పౌత్రులతోను ఆనందించాలి. భగవంతుడు తల్లీబిడ్డల్ని క్షేమంగా ఉంచాలి. భాభీపాషా! బతూల్ పాషాని చూడడానికి మీతో పాటు నేను కూడారానా?' అడిగింది ఫాతిమా బేగమ్.

'నువ్వా...!' రజియా ఆమెను నఖశిఖ పర్యంతం ఒకసారి చూసింది. మాసిన చీర, చిరిగిన కుర్తా, వట్టికాళ్ళు - ఫాతిమా బేగమ్‌ని కూడా పంపడమంటే, బీబీ ఆమెకి తన పాత బట్టలు, చాంద్ పాత గౌను కైసర్‌కివ్వాలి, తలకి నూనె - ఇటువంటి వాళ్ళని వియ్యాలవారింటికి పంపితే ఏం బాగుంటుంది?

'ఇప్పుడు నువ్వెక్కడికి వెళతావు ఫాతిమా బేగమ్! పనులన్నీ పాడైపోతాయి, ఇవాళ కోడలికి ఒంట్లో సరిగ్గా కూడా లేదు'

బీబీ ఆ ఇంటికొచ్చి ముప్ఫై ఏళ్ళయింది. కాని ప్రతి మాటకి కుంటత్త జవాబిచ్చేది.

'మంచిది - మంచిది!' ఫాతిమా బేగమ్ చిన్నబుచ్చుకుని దూరంగా వెళ్ళిపోయింది. ఆమె ఉత్సాహంగా ఒక మాటైతే అనేసిందికాని, కుంటత్త ఈ విధంగా చెప్పుతూ సమాధానమిస్తోందని ఊహించలేదు.

'అమ్మీ, అమ్మీ! నేనూ వస్తాను!' ఇంట్లో ఎక్కడికో వెళ్ళే హడావిడి గమనించిన కైసర్ గొడవ చెయ్యడం మొదలెట్టింది.

'మమ్మీ, చూడండి, కైసర్ కూడా మీతో, బీబీతో కలిసి వెళతానని పట్టుపడుతుంది.' చాంద్ తన తల్లి బషీర్ బేగమ్‌తో అంది.

'చుప్, చుప్ ముర్దార్!' ఫాతిమా బేగమ్ గబగబా లేచి కైసర్‌ని పొయ్యి దగ్గర కీడ్చుకుపోసాగింది, కైసర్ ఇంకా గొడవ చెయ్యసాగింది. బషీర్ బేగమ్‌కి విపరీతంగా కోపం వచ్చింది. కైసర్ పొడుగాటి జుట్టుని చూస్తే ఆమెకెప్పుడూ ఈర్ష్యగానే ఉండేది. అవసరమున్నా లేకపోయినా కైసర్ జడపట్టుకుని తెగకొట్టేది.

'ఉండు వస్తానిప్పుడే!' భుజాల వరకూ ఉన్న తన జుట్టు దువ్వుకుంటూ అంది. ఆమె జుట్టు ఏ మందు వాడినా పెరగలేదు. చాంద్‌కి కూడా కైసర్ పొడవైన తలకట్టు చూస్తే ఈర్ష్యగా ఉండేది. 'తల్లి ఒళ్ళో పడుకుని మమ్మీ నా జుట్టు, కైసర్ జుట్టులాగా ఎప్పుడవుతుంది?' అని అడిగేది.

'ఆ దరిద్రగొట్టు మొహం దాని పేరెత్తకు నా దగ్గర!', బషీర్ బేగమ్‌కి

కోపం వచ్చింది.

'నేను పసిబిడ్డని చూడడానికి వెళతాను' కైసర్ మంకు పట్టు విడవలేదు.

'అల్లామియా, కరుణించు. నా బిడ్డని క్షేమంగా ఉండేట్టు చెయ్యి,' బీబీ తనలో తాను ప్రార్థిస్తూ వెళ్ళడానికి తయారవడంలో నిమగ్నమయింది.

'ఓసి ముర్దార్, ఏడ్చి ఏడ్చి ఇప్పుడెందుకు అశుభాన్ని సూచించే విధంగా చేస్తున్నావు? నీ మొహం మండా.' ఫాతిమా కైసర్‌ని కొట్టడం మొదలెట్టింది. దానితో కైసర్ అరుపులు ఇంకా పెరిగాయి.

బషీర్ బేగమ్ తఖ్త్ మీంచి లేచి, మరుక్షణం దేన్నో బయటికి విసిరేసింది, ఫాతిమా బేగమ్ వెను తిరిగి చూసింది అది కైసర్ జడ.

కుంటత్తకి, బీబీకి కూడా చాలా ఆశ్చర్యం కలిగింది. చాంద్ నవ్వుతోంది గట్టిగా.

'నేను ముందే చెప్పాను, నా ముందు మొండి పట్టుపట్టకు. నా కోపం చాలా చెడ్డది.' బషీర్ బేగమ్ ఆయాసపడుతూ కత్తెరను విసిరికొట్టింది.

బీబీ, అతి కష్టం మీద కళ్ళెత్తి తన కుమార్తెని చూసింది. ఆమె స్వయంగా ఈ పాము పిల్లల్ని పాలిచ్చి పెంచింది. ఆమె కుంటత్తకేసి తిరిగి, బీబీ ఇప్పుడు నవ్వితే బాగుంటుందా లేక ఏడిస్తేనా! చెప్పమన్నట్టు ప్రశ్నార్థకంగా చూసింది.

కాని కుంటత్త కూడా తల పట్టుకుని కూర్చుంది.

'మా ముర్షిదుల్లో ఈనాటిదాకా ఎవరూ సినిమా చూడలేదు, కాని మీ ఈ పుత్రిక మా పుత్రరత్నాన్ని కూడా తప్పుదారి పట్టిస్తోంది. వాడు భార్య మాటల్ని హదీస్-షరీఫ్‌పై గంబర్ ఆదేశం అనుకుంటాడు.

బయట బతూల్‌బేగమ్ అత్తగారు సణుగుతూనే ఉంది. లోపల రోషన్‌దాన్‌లేని చీకటి గదిలో బీబీ, బషీర్ బేగమ్‌లకు ఊపిరాడడంలేదు. ఎదురుగా వెడల్పాటి దోమతెరపై, ఒకేసారి ఎంతోమంది పైల్వానులతో పోరాడిన అనంతరం ఓడిపోయి పడున్నట్టు, పడుంది బతూల్ బేగమ్. పళ్ళతో కొరుక్కోవడం వలన పెదవులు చిట్లి రక్తసిక్తమైపోయాయి. నొప్పుల తీక్షణత కొంచెం తగ్గినప్పుడామె ఒకసారి అల్లాని, మరొకసారి బీబీని పిలుస్తోంది. కొవ్వొత్తి వెలుగు చీకటిని కొంత వరకు తొలిగించింది.

మంత్రకత్తెలాగ కనబడుతున్న మంత్రసాని బతూల్ బేగమ్ పైకి

వెళ్ళబోతూంటే బీబీ ఆమెని పట్టిలాగింది.

'ఆగు, ఆమె వద్దకి వెళ్ళొద్దు.'

'ఆలిఫ్ లైలాలో ఐవానే గజల్‌లో తేడా ఉంది. ఆలిఫ్ లైలాలోకి ఎప్పుడూ డాక్టరు కాని డాక్టరమ్మకాని రారు. డాక్టర్ల చేత వైద్యం చేయించుకోవడానికి ఇచ్ఛగించినవారు కారు. రకరకాల రోగాలకి ప్రత్యేకమైన డాక్టర్లను సంప్రదించే అలవాటు ప్రబలలేదు ఇంకా.

వందలాది ఇంగ్లీషు పేర్లుగల జబ్బులు ఇంకా వ్యాప్తి చెందలేదు. అందువల్ల గ్రామాలలో జబ్బులు నయంకావని, రోగిని హైదరాబాదు తీసుకువెళ్ళాలనే మాటలు ఎప్పుడూ వినబడేవి కావు. హార్ట్-ఎటాక్ (గుండె జబ్బు), బ్లడ్‌ప్రెషర్, కేన్సర్ జబ్బుల మరణించిన వారి గురించి వినడం బహు తక్కువ.

అందుకని పూర్వాభావం గల వంశాలలో డాక్టరమ్మకి చూపించడం తప్పుగా భావించేవారు.

ధార్మిక సంప్రదాయాలలో నిషేధించిన ద్రవ్యాలు ఇంగ్లీషు సూదులలో కలపటం వల్ల వయోవృద్ధులు ప్రాణాలు విడిచే వారు కాని ఇంగ్లీషు మందులను తాకేవారు కారు.

మిస్కీన్ ఆలీషాహ్ ఇంట్లో కూడా ఇంగ్లీషు మందులు, డాక్టరమ్మ రావడం తప్పుగా భావించేవారు. ఈ వస్తాదువంటి మంత్రసానే మిస్కీన్ ఆలీషాహ్ వంశోద్ధారకులు రక్షణకు బాధ్యురాలు.

'ఇదిగో గోరీ బేగమ్! ఒక లాంప్ పంపించండి అక్కడికి. చీకటిలో ఊపిరాడడం లేదు.' ఇంగ్లాండు నుంచి వచ్చిన భర్తకి భార్య, బంజారా హిల్స్‌లోని అధునాతన బంగాళాలో నివసించే బషీర్ బేగమ్ అంది.

'వద్దమ్మా... మేము మా బిడ్డలకి మొదటిసారి కిరసనాయిలు దీపం చూపించం,' బతూల్ అత్తగారు బయటినుంచి జవాబిచ్చింది.

'భగవంతుడా...!' బషీర్ బేగమ్ ఓర్చుకుంది. 'వీళ్ళింటికి డాక్టరమ్మరాదు. ఇంగ్లీషు మందులు ఇవ్వరు. పిల్లవాడి ముత్తాతకి రహమల్ ఆలీ షాహ్ కలలో కనబడిన ఆ భూగృహంలోనే పిల్లవాడు జన్మిస్తాడు. బతూల్ బేగమ్‌ని ఆమె కేకలు బయటి వారెవరికీ వినపడడానికి వీలులేదని ముందే ఆజ్ఞాపించారు!'

'మా అత్తగారు ముందే చెప్పేసేవారు, చూడమ్మా, నాకు మనుమడు కావాలి. ఆడపిల్ల కనక పుడితే పుట్టింట్లో పారవేయిస్తాను. నేను అత్తగారి సలహాను వినేదాన్ని, దాన్నే అమలు జరిపేదాన్ని' బతూల్ అత్తగారు అంటూంది.

'ఎట్లా...?' బషీర్ బేగమ్ ఆశ్చర్యంగా అడిగింది,' 'అత్తగారూ ఆయన కొడుకునిచ్చినా - కూతుర్నిచ్చినా అది భగవదనుగ్రహం. కాని మా బతూల్ బేగమ్‌కి మాషా అల్లాహ్, ముందుగానే ఇద్దరు కొడుకులున్నారు.

'దానివలనేమవుతుంది? అయితే... కనురుకుంది.'

అందరూ 'ముర్షిదుల పిల్లనెవరూ పెళ్ళిచేసుకోరు. కొడుకు పుడితే చెయ్యి ముద్దు పెట్టుకుంటారు. గౌరవిస్తారు. నాకు మూడవసారి కూడా మనుమడే కావాలి. కోడలికదే చెబుతున్నాను.'

ఆవిడ వేలెత్తి బెదిరిస్తూ, కోపం నిండిన చూపులతో బతూల్ బేగమ్ నొకసారి చూసి బయటికి వెళ్ళిపోయింది.

బతూల్ అత్తగారు, రాజ కుమార్తెలను ఆడ కుక్కలుగా, రాజ కుమారులను రాళ్ళుగా మార్చివేసే మంత్రగత్తెలాగ కనబడింది బషీర్ బేగమ్‌కి.

మిస్కీన్ ఆలీషాహ్ రెండవ లేక మూడవ భార్య కుమార్తెలు మిలాద్ షరీఫ్ చదువుతున్నారప్పుడు.

లోపల కూడా పెళ్ళి సందడిలాగ హడావిడిగా ఉంది. మిస్కీన్ ఆలీషాహ్ దర్గాలో సభలు ఏర్పాటు చెయ్యడం పాటలు పాడడం పరిపాటే. కాని ఇటువంటి శుభ సందర్భాలలో మద్దెల వాయించడం, నపుంసకుల నృత్యాలు కూడా జరిగేవి. ద్వారం వద్ద బ్యాండ్ వాయించేవాళ్ళు వేచి ఉన్నారు. పిల్లవాడి ఏడ్పు వినగానే దుందుభులు మోగించడానికి సిద్ధంగా ఉన్నారు. వంశంలో మరొక నక్షత్రం వెలుగుతుందనే వార్త మిస్కీన్ ఆలీ షాహ్‌కి అందించడానికి కుతూహలంగా ఎదురుచూస్తున్నారు. మిగిలిన ముగ్గురు పెద్ద సవతుల ముందు, బతూల్ అత్తగారిని ఎప్పుడూ చిన్న చూపే చూశారు. మిస్కీన్ ఆలీషాహ్ భార్యలలో అందరికంటే పెద్ద భార్య ఐతే ఆమెను తన భర్తకు అర్థాంగిగా అంగీకరించనే లేదు. ఆమెను చిన్న వయసులో ఏదో భూతం ఆవహించింది. హజరత్ వద్దకు చికిత్స

నిమిత్తమై ఆమెను తీసుకువచ్చారు. ఆ భూతం చాలా శక్తివంతమైంది కావడంతో మిస్కీన్ ఆలీషాహ్, ఆరాధన, తపస్సు చెయ్యవలసి వచ్చింది. వెయ్యి విధాల ప్రయత్నించిన మీదట స్వస్థత చేకూరింది. ఇప్పుడింక తల్లి-తండ్రులతో వెళ్ళడానికామె నిరాకరించింది. ఆయన ఆశ్రయంలోనే ఉండిపోయింది. తరువాత హుమాయూన్ పుట్టబోయే ముందు ఆయన పద్ధతి ప్రకారం ఆమెను వివాహం చేసుకున్నట్టు వెల్లడి చేశారు. మిస్కీన్ ఆలీషాహ్ దృష్టిలో హుమాయూన్ ఒక్కడే ఆయన స్వంత బిడ్డ. మిగతా ముగ్గురు భార్యలు అది నిజం కాదు అని ఎన్నో విధాల ఆయనను నమ్మించడానికి ప్రయత్నించినా, ఆయనకు మాత్రం హుమాయూన్ ముమ్మాటికీ తన బిడ్డే అని గట్టి నమ్మకం. అందువల్ల ఆ ఇంట్లో ముర్షిదుల పద్ధతులకు వ్యతిరేకంగా హాజరత్ ఆజ్ఞలను ఉల్లంఘించే సాహసం ఎవరికేనా ఉందా అంటే అది హుమాయూన్ తల్లికే ఉండేది. ఆమె సడలిన శరీరం నలువైపులనుంచీ వేళ్ళాడుతూ ఉండేది. కొంచెం జుట్టు నెరవడం మొదలయింది. నోరంతా నల్లగా ఉండి, ఆమె ఆత్మలోకూడా కాంతి కిరణం లోపించిందా అన్నట్టుండేది. ఆమె ఎటువైపు నడిస్తే, ఏనుగు నడిస్తే వచ్చే శబ్దంలాగ, ఆమె నగలు గలగలలాడేవి. ఆవిడకి లేని ఆభరణం లేదు. ఎప్పుడూ సర్వాభరణాలు. అలంకరించుకునే తిరుగుతూండేది. శేరున్నర వెండితో చెయ్యబడిన పాంజేబులు, పట్టీలు మొదలైనవి పెట్టుకునేది. అవన్నీ తీసేసరికి కాళ్ళు దడదడలాడి పడిపోయింది అమ్మ అంటూండేవాడు హుమాయూన్. చాంద్ ఆమెని ఆభరణాల కొండ అనేది. అందుకని బషీర్ బేగమ్ ఎప్పుడూ ఆలిఫ్ లైలా కొచ్చినా ఆమెతో పాటు చాంద్ తప్పకుండా వెళ్ళేది.

'అమ్మా! అమ్మా! నేను చచ్చిపోతే బాగుండును?' తన శక్తినంతా కూడదీసుకుని బతూల్ బీబీని గట్టిగా పట్టుకుని అంది.

'అయ్యో! అదేం చోద్యమమ్మా! ప్రపంచంలో నువ్వొక్కదానివే పడుతున్నావా బాధ. తొలిచూలు కూడా కాదు?' ఇటువంటప్పుడు గారం చేస్తే బాధెక్కువవుతుందని బషీర్ బేగమ్‌కి తెలుసు.

'ఊరుకో... ఊరుకో...!' బీబీ గట్టిగా అంది. ఆమె కూడా ఒక స్త్రీయేకదా. ప్రతి స్త్రీకి భగవంతుడు మానవ సృష్టి బాధ్యత అప్పగిస్తాడు. కాని తనవంటి

మరొక అభాగ్యురాల్ని ఈ భూమి మీదికి తీసుకురావడానికిచ్చగించదు. భగవంతుడు స్త్రీకి కనుక అధికారం ఇచ్చినట్లైతే బతూల్ అత్తగార నుకుంటూన్నట్టు తన భవిష్యత్తును తీర్చిదిద్దుకునే శక్తి బతూల్ చేతిలో ఉండి ఉంటే, ఆమె ఇక్కడ చావునెందుకు కోరుకునేది? ఆమెకు ఆశ్చర్యం ఎందుకు కలిగేది? బతూల్ అత్తగారు తన సవతులందరిపైన అధికారమెలాగ చలాయించేది? ప్రపంచంలో కేవలం పురుషులు మాత్రమే ఉండేవారు, ఇష్టమొచ్చినట్టు హాయిగా జీవించేవారు. ఆడవారిలాగ బాధలు, పిల్లలు, ఏడ్పులు... జీవితం హాయిగా ఎలాగ గడుస్తుంది!

హుమాయూన్ హాల్‌లో పచార్లు చేస్తున్నాడు. సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తున్నాడు. అతని అడుగులు అతి నెమ్మదిగా పడుతున్నాయి. కాని అతని మెదడు, నిమిషానికి 90 మైళ్ళ వేగంతో పరుగెడుతూంది.

మొట్టమొదటిసారి అతడు బతూల్‌ని ఎప్పుడైతే చూశాడో కాని చూపు మరల్చుకోలేక పోయాడు. తన ఇరవై ఏడేళ్ళ జీవితంలో అతను రెండే రెండు పనులు చేశాడు. తండ్రిగారి కోర్కెననుసరించి ఏడవ తరగతి పాస్ అవడం, తరువాత బతూల్‌ని పెళ్ళి చేసుకోవడం. పెళ్ళికి ముందు అతను రోజంతా రహీమ్ మియాతో రమ్మీ ఆడేవాడు, అప్పుడప్పుడు రహీమ్ మియాతో కలసి, మరేదో కోర్కె తీర్చుకోవడానికి వెళ్ళి పోయేవారు. కాని ఒకసారి బతూల్ మేలి ముసుగుతీసి, ఆమెను చూశాడో, అంతే అక్కడే నిలిచిపోయాడు. గంటల తరబడి రహీమ్ మియా ఎదురు చూసి, చూసి నీరు కారిపోయేవాడు. కొత్త సరుకుల గురించిన శుభవార్తలు మాటిమాటికీ లోనికి పంపించేవాడు, కాని వివాహితుడైన హుమాయూన్ ఎప్పుడూ బయటికి వచ్చేవాడు కాడు.

విన్నవారంతా బతూల్ అదృష్టానికి, అసూయపడేవారు. ఎంతగా ప్రేమించే భర్తనిచ్చాడో భగవంతుడు. అమాయకురాలైన బతూల్‌కి చివరికి, దాని ఫలితం లభించింది. క్షణం కూడా బతూల్‌ని విడిచిపెట్టి ఉండేవాడు కాడతను. తరువాత ఆమె అయాజ్‌నిచ్చిందతనికి. పౌత్రుడి పుట్టుకలకి తాతగారు, యామ ఎంత హడావుడి చేశారంటే తన ప్రతిద్వంద్వినని చూసి బాధపడలేదతను. రెండవ సంవత్సరం షహజాద్ పుట్టాడు. హుమాయూన్ మెల్లగా బతూల్‌కి దూరం కాసాగాడు.

'ఈ ఇద్దరు పిల్లలు పిల్లలుకారు, రెండు లక్షల పెట్టుబడి. పోయిన మన సంపదకు బదులు వచ్చిన వారు? అంటూ తాతగారు మురిసిపోయారు. ఇది విన్న హుమాయూన్‌కి కొంత తృప్తి అనిపించింది. అప్పటి నుండి అతను బతూల్‌ని అపురూపంగా చూసుకోసాగాడు. అతడు భార్యని అమితంగా ప్రేమించడం వలన ఆలిఫ్ లైలా కట్టుబాట్లకు విరుద్ధంగా మొట్టమొదటిసారి 'షీర్ - ఫరహాద్' చూపించడానికి తీసుకువెళ్ళాడు.

కాని షీరీని పొందలేకపోతున్నానన్న బాధతో ఫరహాద్ గుండెపైన సుత్తితో కొట్టుకునేసరికి అది తిన్నగా బతూల్ గర్భంలో దాగి ఉన్న పసి మనసులో నాటుకుపోయింది. దుఃఖాంతమైన సినిమాలు చూసినప్పుడు బతూల్ ఎవరో మత ప్రవక్త ద్వారా షహాదత్ పరమైన గాథ వింటూనట్టు విపరీతంగా విలపించేది. ఆమె గర్భస్థ శిశువు ఆమెకంటె మృదు స్వభావం కలది. ఒక ప్రక్క షీరీ ఫరాహాద్ కోసం బాధపడుతూంటే, పిల్లవాడు కార్లోనే పుట్టి సినిమాకి వెళ్ళిన రహస్యాన్నెక్కడ బట్టబయలు చేస్తాడో అని హుమాయూన్ ఎంతో దిగులు పడిపోయాడు.

హుమాయూన్ తల్లినెవరో వేడి నూనెలోకి నెట్టినట్లయింది. కోడల్ని సాధించే, హింసించే చక్కటి అవకాశమామెకు లభించింది. హుమాయూన్ ఆ గదిలో ఉండి ఉండకపోతే, జడపట్టుకుని కొట్టాలన్న ఆమె కోర్కె తప్పక నెరవేరి ఉండేది. చేతులు వెనక్కి కట్టుకుని, అశాంతితో మూడవ కుమారుని రాకకై ఎదురు చూస్తున్నాడు. ఇరవై ఏడేళ్ళవాడై కూడా ఇప్పటి వరకూ తండ్రి చేతిలో దమ్మిడీ కూడా సంపాయించి పెట్టకపోగా, గుండెనొప్పితో వున్న తండ్రి ఎప్పుడు మరణిస్తాడా, తనని అదృష్టం ఎప్పుడు వరిస్తుందా అని ఎదురు తెన్నులు చూసేవాడు. తమకు లక్షల ఋణాలున్నాయని తండ్రెన్నిసార్లు చెప్పినా హుమాయూన్ ఎప్పుడూ ఆయన మాటలు నమ్మలేదు. అతడి సవతి అన్నదమ్ములు, చెప్పులరగ దీసుకుంటూ స్కూలుకి వెళ్ళేవారు. ఇక్కడా అక్కడా ఉద్యోగాలు చేయసాగారు. కష్టపడడం అన్న మాట వింటేనే ప్రాణం పోయినట్టుండేది హుమాయూన్‌కి. అతడదృష్టవంతుడు. అతనికెప్పుడూ అదృష్టం కలిసి వచ్చేది... ముందు ముందు అతని ముగ్గురు కొడుకులూ పెద్దవారవుతారు. వారికొరకు తన తాత తండ్రుల భిక్షాపాత్రైన రహమత్ ఆలీషాహ్

సమాధిలోని ఏ భాగాన్ని వదులుకోడతను. అంతేకాకుండా అతని ముగ్గురు కొడుకులూ కలసి బంగారు భవనాలు నిర్మిస్తారు.

అతడు తిరిగి చెవి యొగ్గి తలుపుకేసి చూడసాగాడు. ఎవరో శత్రువు అతని కుమారుని గొంతు నులిమి వేసినట్టు లేక అంతా మరణించినట్టు, నిశ్శబ్దంగా ఉంది లోపల. అతడు వేగంగా పచార్లు చేయసాగాడు.

'ఇదిగో అమ్మా, నా బహుమానం డబ్బులు తియ్యి. మూడవ మనుమడికి వందకి తక్కువ పుచ్చుకోను తెలుసా! హుమాయూన్ సోదరి తల్లితో అంటూంది లోపల.

ఈనాడు జాగరణ. అందరూ తమ దుస్తుల గురించి ఆలోచిస్తున్నారు. లక్ష రూపాయలు లాటరీ ఫలితాలు రాబోతూన్నట్టు దిగులుగా కూర్చుండిపోయాడు హుమాయూన్.

అంతట్లో ఆయాజ్, షహజాద్ దెబ్బలాడుకుంటూ వచ్చారు. మూడేళ్ళ ఆయాజ్ అర్థంకూడా తెలియని తిట్లు తిట్టేవాడు. రెండేళ్ళ తమ్ముడు షహజాద్‌ని ఆ పిల్లవాడి తండ్రిని కూడా తిట్టేవాడు. చెప్పు తీసుకుని దబదబా బాదేవాడు తల్లిని. షహజాద్ పూర్తిగా తల్లిపోలిక. తల్లిలాగే పిరికివాడు, ఎక్కువ మాట్లాడేవాడు కాదు. ప్రతి చిన్న మాటకి ఏడ్చేవాడు.

అప్పుడు ఈ ఇద్దరి మొహాలూ చూసేసరికి ఒళ్ళుమండింది. 'పనికి మాలిన వెధవలు! ఏదంటే హుమాయూన్‌కి అసహ్యమో అవే పనులు చేసేవారు. పుట్టబోయే బిడ్డపైన ఈ పిరికిది, మూర్ఖురాలు అయినటువంటి స్త్రీ నీడని కూడా పడనివ్వడు. ఒకవేళ వీళ్ళిద్దరు విసిగిస్తే, అందరికంటే చిన్నవాణ్ణి దర్గాకి ఉత్తరాధికారిగా...?'

చెమటతో తడిసి, ఒగరుస్తూ, అతని వదినగారు బషీర్‌బేగమ్ గదిలోంచి బయటికి వచ్చి, 'అభినందనలు హుమాయూన్‌మియా! మీ సాహబజాదీషీరీ కంటే కూడా చాలా అందంగా ఉంది,' అని కూతురు, పుట్టిన వార్త చెప్పింది.

హుమాయూన్ గుండెలపైన ఫరాహాద్ తైషాతో ఈడ్చికొట్టినట్లయింది. అతడు తన వదినగార్ని, ఆమె మోసం చేసి లక్ష రూపాయల సంచి దాచేసినట్టు, చూశాడు.

'మనుమరాలు... మనుమరాలు...! అన్నవార్త, పెనుతుఫాను దీపాల్ని

ఆర్పుతూ పోతూన్నట్టు ఆలిఫ్-లైలాలో వ్యాపించింది.

బయట వేచి ఉన్న మేళగాళ్ళు అనాలోచితంగా దుందుభులు మోగించడం ప్రారంభించారు.

'అయ్యో, నాచావుకీ బాజాలేమిటి?'

హుమాయూన్ తల్లి ప్రాంగణంలో గుండె పట్టుకుని కూర్చుండి పోయింది. ఆల్ఫ్-లైలాలో ఆడపిల్ల పుట్టినప్పుడల్లా డబ్బు కష్టాలు కూడా తీసుకువచ్చింది.

'అత్తగారూ, అల్లుడి పరమైన అభినందనలు...! బషీర్ బేగమ్ అపరాధాన్ని వప్పుకుంటున్నట్టు, అత్తగారికి, అల్లుడికి సంబంధించిన సంతోషకరమైన కాల్పనికానందాన్ని కలిగించేందుకు ప్రయత్నించింది. తిరిగి భయంకరమైన నిశ్శబ్దం ఆవరించింది.

హుమాయూన్ సోదరి నపుంసకులను వారించింది. గోడకి ఆవతలి ప్రక్క, హుమాయూన్ సవతి తల్లులుండే ప్రదేశం నుంచి నవ్వుల సవ్వడి అధికమయింది.

తలని రెండు చేతులతో పట్టుకుని చీకటి గదిలో కూర్చుని మిస్కీన్ ఆలీషాహ్ ఈ పిల్లకి వరుడెలాగ దొరుకుతాడా అన్న ఆలోచనలో పడ్డారు. ముర్షిదుల పిల్లని వివాహమాడడం కష్టతరమైన పని.

'మమ్మీ... మమ్మీ... ఈ పిల్లకూడా పెద్దదై షీరీలాగ గుండెలో బాకు గుచ్చుకుంటుందా...?' షీరీలాంటి అందమైన ఆ పసిపాపని చూసి చాంద్ తల్లినడిగింది.

'ఊరుకో... ఊరుకో...! పిచ్చెక్కిందా ఏమిటి?' బీబీ కసిరింది.

అప్పటికి చాంద్ వయసు ఏడు సంవత్సరాలు. కాని ఆ పిల్లకి సినిమా కథలన్నీ కంఠస్తం, అప్పటి సినిమా పాటలన్నీ వచ్చును. చాంద్‌కి లీలాచట్నీస్ అంటే చాలా ఇష్టం. నాట్యం చేస్తే ఆమెకి బోలెడు బహుమానాలు లభించేవి. బషీర్ బేగమ్‌కి ఆ విషయాలన్నీ పుట్టింటి వారినుంచి దాచవలసి వచ్చేది, బషీర్ బేగమ్ అత్తవారిల్లు ఎక్కువ దూరమేమీ కాదు. కాని కట్టుబాట్లు తీరుతెన్నులలో శతాబ్దాల తేడా కనబడేది.

ఐవానే గజల్‌లోని స్త్రీలు కార్లకి పరదాలు కట్టుకుని వెళ్ళే రోజులలో చాంద్ మేనత్తలు భర్తలతో నాట్యం చెయ్యడానికి సికిందరాబాద్ క్లబ్బుకి

వెళ్ళేవారు. చేతులులేని రవికలు పెదవులకి రంగు, ఎత్తుమడమల జోళ్ళు ఫేషన్ హైదరాబాద్‌లో ముందుగా ఈ వంశంలోనే ప్రారంభమైంది. ఇతర వంశాలలో పుట్టిన మగపిల్లలెంతమందో పై చదువుల కోసం విదేశాలు వెళ్ళారు. కాని జుట్టు కత్తిరించుకుని, గౌన్లు వేసుకుని మొట్టమొదట ఈ ఇంటి ఆడపిల్లల్నే కిరస్తానీ - స్కూళ్ళకి పంపించటమైంది తరువాత ఎన్నో కథలుగా చెప్పుకునేవారు. ఒక్కతె సీతాల్ తిరగడానికి వెళ్ళి అక్కడెవరో తెల్లవాడ్ని పెళ్ళి చేసుకుంది. వేరొకామె తండ్రి-తాతల కళ్ళ ముందు వరుడ్నెన్నుకుంటే తల్లితండ్రులు చప్పట్లు కొట్టి ఆమె ఎంపికను మెచ్చుకునేవారు. అక్కడి కథలన్నీ బషీర్ బేగమ్ ద్వారా విని కుంటత్త అయ్యో... అయ్యో... అనుకునేది.

బషీర్ బేగమ్ అత్తవారింటి కథలు వినలేక చెవులు మూసుకునేవారంతా! అందుకని బషీర్ బేగమ్ పుట్టింటికి అరుదుగా వచ్చేది. ఆడపడుచులను చూసి, ఆమె కూడా పక్కపాపిట తీసుకుని కజ్జన్ బాయీలాగ జుట్టు దువ్వుకోసాగింది. పెదవులకి రంగు పూసుకునేది. చీరకూడా వంపు సొంపులు కనబడేటట్టు నడుము దగ్గర బిగించి కట్టుకునేది. చేతులులేని రవిక వేసుకోవాలంటే మాత్రం వణుకుపుట్టేది. పుట్టింట్లో ఒకరు ఆమె పక్కపాపిట గురించి అడ్డు చెబితే మరొకరు చాంద్ వట్టి కాళ్ళ గురించి అయిష్టత వ్యక్తం చేసేవారు. వీటన్నింటి వలన బతూల్ బేగమ్ అత్తవారింటికి చాలా తక్కువ సార్లు వెళ్ళేది. ఇలాంటి పరిస్థితులొస్తే బతూల్ బేగమ్ పురుడుకు రావలసి వచ్చేది.

దీనికి 'గజాలా' అని పెట్టండత్తగారూ! కళ్ళు చాలా అందంగా ఉన్నాయి. మాషా అల్లాహ్!' షాయర్ కూతుర్ని అని ఋజువు చేసుకుంది బషీర్ బేగమ్.

'సరే, ఏదో ఒక పేరు పెట్టండి, పేర్లో ఏముంది కనుక!' అత్తగారు నిట్టూర్చింది.

మరునాడు వాహిద్ హుసైన్ తన కొత్త గజల్ పంక్తిని మాటి మాటికీ అనుకుంటూ లోనికి వచ్చేసరికి ఆయనచేతిలో ఆలిఫ్-లైలాకి సంబంధించిన పెద్ద కవరు ఉంది. కుంటత్త నమాజ్ చదువుకోడానికి చిత్రాసనం మీద తిన్నగా కూర్చుంది. వాహిద్ హుసైన్‌ని చూసి ఆగిపోయింది.

'ఏం భాయీ పాషా! అంతా క్షేమమేకదా?'

'పిల్లకి ఏం పేరు పెట్టారు?' ఎంతో కుతూహలంగా అడిగిందామె.

'గజల్... గజల్...!

నిన్నటి నుండి రకరకాలుగా ప్రాసకోసం ప్రాకులాడుతున్నారాయన. కాని అల్లరిచేసే, చేతికందని ప్రియురాలివలె ఆ ప్రాసపట్టుబడడం లేదాయనకి. ఈ రోజా ప్రియురాలు వస్తుంది. ఎంత కొత్త విషయం... ఎంత బాగుంటుందో...!

'అయ్యో ఈ గజల్ ఏం పేరు?,... అత్త ముక్కున వేలేసుకుని రాషిద్‌ని అడిగింది. గడ్డం గీసుకుంటూ ఆగిపోయాడు రాషీద్ 'గజల్...? నాన్నగారెవరికి పెట్టారీ పేరు?'

'భేష్...!' వ్యంగ్యంగా అని అతను తిరిగి అద్దంకేసి తిరిగిపోయాడు.

'బాగానే ఉంది... మనకి జవానే గజల్ ఉంది. గజల్ ఎవరూ లేదిక్కడ.'

ఈ వంశంలో కవిత్వమంటే ఇష్టంలేని మొదటి సభ్యుడు రాషీద్. ఈ విషయం మీద తన ఏకైక పుత్రుడు తమ వంశపు పద్ధతులను మంట కలుపుతున్నాడని వాహిద్ హుసైన్ సిగ్గుపడేవారు.

'ఐనింటి పిల్లలకి ఇలాంటి పేరా...?' తలపైని మేలి ముసుగును సరిచేసుకుంటూ అంది బీబీ.

'ప్రేమపరమైన మాటలను గజల్ అంటారు,' ఆమె సిగ్గు, గాభరా పడుతూ తన భర్త తనకు మాత్రమే మెల్లగా వినిపించే గజళ్ళను గుర్తు చేసుకుంది.

'అవును...! రాషిద్ అద్దంలో తన ముఖాన్ని జాగ్రత్తగా చూసుకుంటూ అన్నాడు. రేజర్ పట్టుకున్న అతని చెయ్యి, కసాయివాడు మేక తోలు ఒలుస్తున్నట్టు గబగబా పనిచెయ్యడం మొదలుపెట్టింది.

పారసీ బాషలో గజల్ అంటే దెబ్బతిన్న లేడి మరణించేటప్పుడు, దాని కళ్ళలో కనబడే బాధ అని కూడా అంటారు.

'మీ సొగదీయడాలు ఆపండి...' తన మనసులో అశాంతిని కప్పిపుచ్చుతూ. పేరు... ఆడవారి మాటల్ని గజల్ అంటారు... మెట్రిక్‌లో చదువుకున్నాను నేను?'

'అయితే సరే...,' అంటూ కుంటత్త నెమ్మదిగా ఊపిరి పీల్చుకుని

రెండవసారి నమాజ్ చేసుకునేందుకు ఉపక్రమించింది. రజియా మెట్రిక్ చదువు విషయం మాత్రం ఆమె ఎంత మాత్రం ఒప్పుకోలేదు.

రాషీద్ త్వరగా బట్టలు మార్చుకుని బయటకెళ్ళిపోయారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనం ఊరికి దూరంగా ఆడిక్‌మెట్‌లో కడుతున్నారు! రాషీద్‌కి కూడా ఒక పెద్ద కాంట్రాక్ట్ దొరికింది. ఈ పని త్వరగా ముగించవలసి ఉంది. అలా హజరాత్ కోరిక అనుసారం ఈ కాంట్రాక్ట్ సొమ్ము లభిస్తే ఐవాన్ గజల్ జప్తుకాకుండా కాపాడుకోవచ్చు. జామియా ఉస్మానియా చిత్ర పటం తయారు చేయటంకోసం ఐరోపా ఖండం, మిడిల్ ఈస్ట్‌కు పంపిన ఇంజనీర్లలో అతడు కూడా ఒకడు.

'హాలులో అలంకరించిన దండలు ఎంత అందంగా ఉన్నాయో?'

మిరాసీ జాతికి చెందిన స్త్రీలు తివాసిపైన కూర్చుని గొంతు చించుకుని పాడుతున్నారు.

పెద్ద హాలులో ఆసనం మీద ఎఱ్ఱటి మఖమల్ దిళ్ళు వేశారు. దానిపైన పువ్వులు, అమర్చారు. అల్లరి పిల్లలు వ్రేలాడుతున్న పువ్వులను నలిపి పారిపోతున్నారు. భవనంలో జనం కిక్కిరిసి ఉన్నారు. వెనుక భాగంలో ఉల్లిపాయలు, నిమ్మకాయలు, వెల్లుల్లి తొక్కలు నిండి ఉన్నాయి. పెద్ద పెద్ద డైసాలు, వంటపాత్రలు ఇటు అటు ఈడుస్తున్నారు. పొయ్యిలు మండుతున్నాయి. మాంసము, బియ్యం, నెయ్యి రాసులుగా ఉన్న మసాలాల దగ్గర వంటవారితో పాటు గులామ్ రసూల్ పరుగెడుతున్నాడు. 'గులామ్ రసూల్ మంచినీళ్ళు...!' అని ఇటునుంచి ఒకరు కేకపెడితే గులామ్ రసూల్ కిళ్ళీ! అంటూ అటునుంచి ఇంకొకరు అరుస్తున్నారు. ఈ లోపల బేగమ్ సాహిబా, 'గులామ్ రసూల్ జోళ్ళు' అని గర్జిస్తూంది.

అతిధులు రావడం మొదలుపెట్టారు. బయట షామియానాల కింద జంపఖానా పైన తెల్లటి చాందినీ పరిచారు. దానిపైన ఇరానీ తివాసీలు పరిచారు. మధ్యలో అక్కడక్కడ వెండి అతికించిన బీడాలు పెట్టారు. బయట పురుషుల కోసం కేటాయించిన స్థలంలో జనం నిండి ఉన్నారు. వారి మధ్య, మంచి ఒడ్డుపొడుగులో, పచ్చగా ఉన్న అహమద్ హుసైన్ చిరునవ్వు నవ్వుతూ వస్తూన్నవారందర్నీ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నారు. నేడాయన పాదాల వద్ద బిగుతుగా ఉన్న పైజమాపైన

హమరూ షేర్వానీ వేసుకున్నారు. తలపై వున్న తుర్కీటోపీ కుచ్చు నుదుటిమీద వ్రేలాడుతూంది. ఆయన తరుచు అతిధులను కలుసుకునేందుకు గేటు వద్దకు రావలసి వస్తూంది. పరదాలు కట్టిన కార్లు వచ్చినప్పుడు స్త్రీల సవారీని మరోవైపు తీసుకు వెళ్ళండని చేతితో సైగ చేసేవారాయన.

ఉజాలా బేగమ్ బంగారు వన్నె జార్జెట్ చీర కట్టుకుంది. పనుల వత్తిడితో కంగారుగా తిరుగుతూంది. మిలమిలలాడుతున్న మెరుపులాంటి కాంతి ఆమె ముఖంలో మెరుస్తూంది. పెళ్ళి పేరంటాల వంటి వాటికి ఆమె చాలా చక్కగా అన్ని ఏర్పాట్లు చెయ్యగలదని ప్రతీతి, అయినప్పటికీ నేడామె అందమైన ముఖంలో అలసట కనబడుతూంది. మాటి-మాటికీ ఏదో మరచిపోతూంది. పనిపిల్లలు, దాసీల సంగతి వేరే చెప్పక్కరలేదు. వారెప్పుడూ పని దొంగలే. అదను చూసుకుని అంతా మాయమయిపోతారు. ఆమె ఒంటరిగా అటువంటి వాళ్ళపై అజమాయిషీ చేస్తూంది. ఇటు అతిధులను ఆహ్వానిస్తూంది. సమవయస్కులని వేళాకోళమాడుతూ, పిల్లల్ని బురదకాళ్ళతో తివాసీ మీదకి రావద్దని నివారించడం వంటి పనులు ఒకేసారి చెయ్యడం తన మామ్మవద్ద నేర్చుకుందామె.

మంచి ఒడ్డుపొడుగుగల స్థూల కాయురాలామె. వయసు నలభైదాటింది. ఎరుపు రంగు కలసిన తెల్లని దేహచ్ఛాయ, ఇప్పటికీ ఆమె అందంలో ఆకర్షణ చెప్పుకోదగ్గదే. ఎదుటివారిని సమ్మోహనపరిచే ఆకర్షణ అది. ఆమె వాక్కు అందం కూడా మనసుని ఆకట్టుకునేది. ఓటమిని ఎరుగనిది.

ఆ భవంతి వివిధ గదులలో, స్త్రీలు విడిగా కూర్చుని వేళాకోళాలు, సరదా సంతోషాలలో మునిగి ఉన్నారు. పువ్వులు, అత్తర్ల సుగంధాలు, బయటినుంచి వచ్చే బిరియానీ, బఘెరా బైగన్, కబాబ్ గుబాళింపులను కమ్మివేస్తున్నాయి.

వంటవాళ్ళు వండుతున్న వైపునుంచే స్త్రీలులోనికి వస్తున్నారు. అడ్డుకట్టిన తెర చాటున డైసాలు, పాత్రలు, కూరల, గుడ్ల తొక్కలు పడి ఉన్నాయి. వంటవాళ్ళు నీళ్ళు పోసి పోసి ఆ ప్రాంతమంతా బురదమయం చేసేశారు. అందుకని ఎవరైనా వస్తూంటే ఉజాలా బేగమ్ వారికి 'ఇదుగో కొంచెం చీరపైకి పట్టుకుని రామ్మా! ఈ దరిద్రపు వంటవాళ్ళు నలువైపులా నీళ్ళు పోసేశారు, అనేది.

పెద్ద పెద్ద పొయ్యిలనుంచి వచ్చే పొగ నలుమూలలా అలుముకుంది. మధ్యలో షీఖామియా పాత బట్టలు వేసుకుని, చేత్తో కర్ర పట్టుకుని వంటవాళ్ళని గమనిస్తున్నారు.

'మిఠాయిలో చక్కెర ఎంత పడిందో చూపించండి... కొంచెం మిఠాయి రుచి చూస్తున్నారు.'

'ఈ పగిలిన గుడ్లు అటు ఇచ్చెయ్యండి....!'

గబాగబా గుడ్లని నోట్లో వేసుకుంటూ ఇంకొకవైపు తిరుగుతున్నారు.

లక్మీ వంటకం కరకరలాడుతుంది కదా...? ఆయన సాలిమ్‌లక్‌మో నోట్లో వేసుకుని చూస్తున్నారు. పిల్లలు తివాసీల మీద దొంగాట ఆడుతున్నారు.

హాలులో అటు మూల, అందరూ జోళ్ళు విడిచి, లోపలికి వెళ్తున్నారు. ఆ ప్రదేశంలో, ఆయాల మొత్తం గుంపు ఒకటి, ఏడుస్తున్న పిల్లల్ని ఊరుకోపెట్టడానికి బదులు ఖబుర్లలో లీనమై ఉంది. అక్కడే కూర్చుని బీజానీ కిళ్ళీలు కడుతూంది. అదొక్కపనే మిగిలిపోయింది. అటువస్తూ - వస్తూ ఉజాలా బేగమ్ 'ఓసి దరిద్రపు ముఖమా, ఇవాళ నీ చెవుల కేమయింది? దారిలో కూర్చోవద్దని ఎన్నిసార్లు చెప్పాను? చెప్పు తియ్యమంటావా...?'

బీజానీ, బేగమ్ సాహిబా మాటలను లెక్కచెయ్యకుండా అలాగే కూర్చుని కిళ్ళీలపైన వెండి తీగలు చుట్టడం చూసి అక్కడ గుమిగూడిన ఆయాలందరూ ఆశ్చర్యపోయారు.

పురుషులున్న ప్రదేశం నుంచి అహమద్ హుసైన్ స్త్రీలున్న వైపు రావలసి వచ్చింది. అత్యవసరమైన పని మీద ఎన్నోసార్లు లోపలికి వచ్చినప్పుడు పొరపాటున ఎవరో బనారస్ చీర కట్టుకున్న స్త్రీని గుద్దుకోవడంతో బయటికి పారిపోయేవారు. లోపల అంతమంది మోహనాంగులు గుమిగూడి ఉన్నప్పుడు ఆయన కంగారు పడడం సహజమే.

అయినప్పటికీ ఆయన ఎంతో ఓర్పుగా జాగ్రత్తగా, అప్పుడే వచ్చిన అతిథిని ఆహ్వానించడానికి వెళ్ళేవారు. ఒంగి పాదాభివందనం చేసేవారు. తన చేతులతో అతిథి చేయి గ్రహించి కళ్ళకద్దుకుని, తిరిగి చేతులు జోడించి, దయచెయ్యండి ఖిబ్లా...! అనేవారు.

అహమద్ హుసైన్ ఇటువంటి వినమ్రతాపూర్వక ప్రవర్తన చూసి వాహిద్ హుసైన్ తెగ నవ్వేవారు. తహసీల్దార్లు లంచాలతో పట్టణాల్లో దర్జాగా బ్రతకడం, పల్లెలో జాగీర్దారులాగ బ్రతకడంలో చాలా తేడా ఉంది. వాహిద్ హుసైన్ తహసిల్దారు, అయివుండి భూస్వామి వలె ప్రవర్తించేవారు. ఆయన తన తాతగారి అపారమైన సంపదకి హక్కుదారై అనుభవించారు. కాని చిన్నవారి ముందు తలవంచవలసి వస్తోంది ఇప్పుడు.

నేడు వాహిద్ హుసైన్, బీబీ ఇద్దరూ లేకపోవడం అందరికీ ప్రస్ఫుటంగా కనిపించింది. ఇటువంటి శుభ సందర్భాలలో ఆప్తులు అందరికీ గుర్తొస్తారు. అందుకని తన కుమారుని ఛిల్లా (ప్రసవించిన నలభైవ రోజున జరిపే ఉత్సవం)కి బావగార్ని, తోడికోడల్ని పిలిచింది. వారు రాకపోవడానికేదైనా సాకు చెప్పవచ్చు. అహమద్ హుసైన్ వారసుణ్ణి చూడగలిగేటంత పెద్ద మనసు వాహిద్ హుసైన్‌కి లేదని ఉజాలా బేగమ్‌కి తెలుసు. ఉజాలా బేగమ్ మొత్తం ఆస్థికి రాషిద్ వారసుడని ఆశించిన ఆయన ఇది ఎలాగ సహించగలరు.

బయటనుంచి అహమద్ హుసైన్ నవ్వుల సవ్వడి విని ఉజాలా బేగమ్ చిరునవ్వు నవ్వుకుంటూంది.

ఈనాడామె అహమద్ హుసైన్ అమాయకత్వంపై గట్టి దెబ్బ తీసింది, ఇప్పుడు గాభరా పడసాగింది. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఈ కంగారుతో ఆమె మరింత అందంగా కనబడుతూంది. ముదురు ఊదారంగు బనారస్ చీరపైన కారగే కలీదార్ కుర్తా చాలా అందంగా కనబడుతూంది.

మెడలో జడావీలచ్చా, సత్‌లడా, చందనహార్ నగలు మెరుస్తున్నాయి. చేతులకి వజ్రపు కంకణాలు అందాన్ని చేకూరుస్తున్నాయి. నిజానికి విలువైన రాళ్ళు పొదిగిన కంకణాలు పచ్చని ముంజేతికి అందానిస్తాయి. ఉజాలా బేగమ్ కంకణాల చేతులు చూడడానికి రెండు కళ్ళు చాలడం లేదు.

అంత అందమైన ఆమె పట్టుదలతో ఎవరో రాజ కుమారుడి మహలుకి బదులు అహమద్ హుసైన్ సామాన్య భవనంలోకి వచ్చింది. ఆమె మాతామహుడైన మునాసిబ్ జింగ్ సుబేదారుగా కూడా పనిచేశారు. ఆయన వంశంలో, నవీనత్వాన్ని అభిమానించేవారు ప్రఖ్యాతిగాంచారు.

ఆయనెప్పుడూ ఎవరూ చెయ్యనటువంటి పనే చేసేశారు. ప్రసిద్ధిగాంచిన ఒక ఇరానీ అందగత్తెను పెళ్ళి చేసుకున్నారు. ఆ కాలంలో ఇది ఎంత పెద్ద విషయమంటే జాగీరు కూడా కదిలిపోయింది. అప్పటికింకా రాచకుటుంబాలలో, విదేశీ కోడళ్ళను తీసుకువచ్చే రాజకుమారులు ఉద్భవించలేదు. అంతేకాకుండా నల్లమందు నిషాలో నుంచి ఈమాన్ జంగ్ మంజూరు, షాహ్ ఫరేమాన్‌ను అమలు జరుపవలసిన బాధ్యత ఆ వంశానికి చెందిన ప్రతి యువకుడిపైన ఉండేది. నల్లమందు నిషాలో హుజూరేవాలా నుంచి ఈమాన్ జంగ్ మంజూరయిన అమ్మాయిని స్వీకరించవలసిన బాధ్యతకూడా వారిపైన ఉండేది. అందువలన ఈమాన్ జంగ్ తఖ్మ, కలమీ మామిడి చెట్లతోపాటు, అందమైన గులాబీ కొమ్మపైన ముళ్ళ కొమ్మను సైతం అలంకరించేవారు. ఆ కొమ్మలెప్పుడూ పచ్చగానే ఉన్నాయి. ఆ చెట్టుపైన మొగ్గలకి బదులు కోర్టుకేసులు, వంశానుక్రమమైన శతృత్వాలనే ముళ్ళు పుడుతూనే ఉన్నాయి. అవి మొదట్లో మనసుల్ని కొద్దిగా కదిపి వేయడం ప్రారంభించి చివరికి కుట్రలతో అసఫియా సల్తనత్ పునాదుల్నే కదిలించివేశారు.

నిజానికా రోజులలో జీవితం శాంతియుతంగా ఉండేది. మూసీనది ఒడ్డున పట్టణంలో వ్యాప్తి చెందిన బాధా వీచికలు భవనాలకి దురంగా ఉండేవి. ప్రభువుల అసంతృప్తి భగవంతుని కోపానికే విధంగానూ తీసిపోదు కనుక హుజూరు వారి ఆడ ఏనుగు పుట్టిన రోజు వేడుకలు నగరవాసులందరూ జరుపుకునేవారు.

ప్లేగ్, అమ్మవారు వ్యాపించినప్పుడు కాళీమాత అసంతృప్తితో పాటు మతపరమైన పెద్దల అసంతృప్తి కూడా కలిసేది.

ఆంగ్లేయులు తలమీద కూర్చుని పెత్తనం చలాయిస్తున్న రోజులవి. మొట్టమొదటిసారిగా వారి దృష్టి జమీందారీలో నివసిస్తూన్న స్త్రీలవైపు మరలింది. సాధారణంగా ఇక్కడే విద్రోహానికి దారితీసే చిన్న చిన్న దెబ్బలాటలు ప్రారంభమయాయి. ప్రజలు అట్టడుగున అణగివుండి బయటకు అసలు కనబడేవారు కారు. ఆ రోజుల్లో హోదాలకోసం విదేశాలకి వెళ్ళవలసిన ఆగత్యం ఉండేదికాదు. ఇప్పటి వరకు మునాసిచ్ అలీబేగ్ అని పిలిచే మునాసిద్ జంగ్ ఏదో పెద్ద హోదా కోసం ఎదురు తెన్నులు

చూస్తోంది. ఇంతలో ఇరాన్ నుండి, ఇక్కడ స్థిరపడాలనే ఉద్దేశ్యంతో ఒక యాత్రికుల సమూహం ఔరంగాబాదు వచ్చి చేరింది. ఔరంగాబాదు ఎక్కువ చల్లగా ఉండే జిల్లా అందువల్ల స్వయంగా హుజూర్ - ఆలీ కూడా ఎండాకాలంలో కొద్ది మాసాలు ఇక్కడే గడిపేవారు. సాధారణంగా బయట నుంచి వచ్చే విదేశీయులు, బస చేయడానికి ఔరంగాబాదునే ఎన్నుకునేవారు. ఆరిఫ్‌బేగ్ ఇరాన్ నుంచి తనతోపాటు బోలెడంత జ్ఞానాన్ని, సభ్యతని మూటకట్టుకుని, ఇక్కడ తన మంచి పేరు తెచ్చుకుందామని వచ్చాడని ప్రతీతి. అతడు చందమామ వంటి తన కుమార్తె ఖుష్ జమాల్‌ని హుజూర్‌కి బహుమతిగా ఇచ్చి, ప్రత్యామ్నాయంగా తన జీవనోపాధి సంపాదించుకునేందుకు వచ్చాడన్న వార్త వ్యాపించింది. అందమైన తమ కుమార్తెలకి బదులుగా ఎందరో తల్లిదండ్రులు ఎన్నో తరాలవారికి అదృష్టాన్ని కలిగించారు. ఆ పిల్ల కొద్ది మాసాలు హుజార్‌పుర్‌నూర్ విశేషాభిమానానికి పాత్రురాలై, తరువాత అంబరీబాగ్‌లోని ఒక చీకటిగదిలో చేరి తెరమరుగై పోయేది. ఇటువంటి స్త్రీలకు మూడు పూటలా భోజనం, నెలకొక జత బట్టలను పంపే బాధ్యతగల విభాగం తప్ప మిగిలిన వారంతా ఆమెను మరచిపోయేవారు.

ఆరిఫ్‌బేగ్ కూడా సాఫల్యపు సోపానాలు అతి త్వరితగతిని అధిగమించాడని వినికిడి. ఆ పిల్లని మొట్టమొదటిసారి చూసిన తరువాత హుజార్ పుర్‌నూర్ రాత్రంతా విశ్రమించలేక పోయారట. ఎంత డబ్బు న్యాయం అయినా సరే, ప్రతి షరతుకి తలఒగ్గి, ఎలాగో ఒకలాగ, ఆరిఫ్‌బేగ్ కుమార్తెను మహాలులోకి చేర్చే ఏర్పాటు చెయ్యవలసిన బాధ్యత షీషీలోని వారిపైన పడింది. అంతలో ఆరిఫ్ బేగ్ పొరుగువారైన మునాసిఫ్ ఆలీ బేగ్ మధ్యలో తలదూర్చి తన వంటవాడిచేత బిరియానీ వండించి, అందులో ఏదో వస్తువు పెట్టి ఖష్‌జమాల్‌కి తినిపించేశారు. దక్కను ఇంద్రజాలం పేరెన్నికగన్నది. పాదుషా మహాలులో వుండాలని కలలు గంటున్న అందగత్తె ఒక జాగీర్దారు అంటే పడి చస్తుందా! మునాసిబ్ ఆలీ బేగ్ తండ్రి ఆ సమయంలో గుర్రాలు - బట్టలకి సంబంధించిన పైకం కోసం వియ్యంకుడితో గొడవబడుతున్నారుట. అటువంటి పరిస్థితులలో ఈమాన్‌జంగ్ ముఖ్యమైన కాగితాలపై సంతకాలు పెట్టించి ఈ వార్త

పాదుషావారి చెవిన వేశారు. దాంతో మునాసిబ్ ఆలీ వంశంపైన విపరీతమైన కోపం వచ్చి, తలవని తలంపుగా వారి ఎస్టేట్‌పైన ఎంక్వైరీ కమిటీని వేశారు. అష్టకష్టాలుపడి మునాసిబ్ జింగ్ జాగీరు కాపాడుకున్నారు. కాని పాదుషా కృప వల్ల అదృష్టవంతులవవలసిన ఆయన బంధువులను చూస్తూ ఉండిపోయారు. చాలాకాలం తరువాత ఖుష్‌జమాల్ తన తెలివితేటల వలన ఆయన సన్నిధికి చేరిపోవడంతో మునాసిబ్ ఆలీ బేగ్ ఉన్నట్లుండి మునాసిబ్ ఆలీజంగ్ అయిపోవడమే కాకుండా, తన భవనంలో అపురూపమైన వస్తువులననేకం చేర్చి తిరిగి పాదుషాకి బాధ కలిగించారు.

ఉజాలాబేగమ్, పూర్తిగా తన ఇరానీ నానమ్మ రూపురేఖా విలాసాలతో, అదే కోపం, అదే గర్వంతో ఏకైక పుత్రుడి ఏకైక పుత్రికగా పుట్టింది.

మునాసిబ్ జంగ్ ప్రతి శుక్రవారం నమాజ్ తరువాత కలుసుకున్నప్పుడు, ఉజాలా బేగమ్‌కి బహుమానం ఇస్తానని తన డైరీలో వ్రాయించుకున్నారు. కాని వయోభారంతోపాటు అసంఖ్యాకమైన దుస్సంఘటనల వలన ఆయన శక్తి హీనులయ్యారు. ప్రస్తుత పరిస్థితి ఎలాగుందంటే ఒకవైపు నుంచి ద్వారపాలకుడు వచ్చి, ఉజాలా బేగమ్ రాకని సూచిస్తూ, కలుసుకునేందుకు అనుమతిని కోరుతున్నారన్న వార్త తెలియపర్చగానే, ఆయన బుద్ధి, మనసులోంచి తొలిగిపోయిన ఒక వేశ్యవైపు మళ్ళేది. ఒకేసారి ఎన్నో జ్ఞాపకాలు బాధించేవి.

ఆయన అనుకునేవారు - శరీరానికి బలం చేకూర్చే ఖమీరా - గాల్‌జబా తిరిగి వాడడం మొదలుపెట్టాలి. చాలా రోజుల నుండి జుట్టుకి ఖజాబ్ రాసుకోలేదు అప్పుడప్పుడు నమాజ్ కూడా చేసుకోవాలి.

ఆయన కంగారుగా లేచేవారు, మీసాలు మెలేసి గుండె విరుచుకుని నిటారుగా నుంచునేవారు. నౌకర్ల సహాయంతో చుడీదార్, పైజమా, ఎర్రటి హామరూ షీర్వానీ వేసుకునేవారు. అప్పుడు ఐదేళ్ళ ఉజాలా బేగమ్‌ను తీసుకువచ్చేది ఆయా.

'ఓహో మీరొచ్చేశారా!' ఆయన వెంటనే వేశ్య జ్ఞాపకాన్ని దులిపేసి తాతగారయే ప్రయత్నం ప్రారంభించేవారు. తన తెల్లటి మీసాలతోపాటు ఆమెను ముద్దు చేసేవారు, ఉజాలా బేగమ్ తన ముఖాన్ని తిప్పేసు కోవడంతో అది ఆయా పాలయ్యేది. ఆమె కంగారుగా ఉజాలా బేగమ్‌ను

క్రిందకి దింపేసేది.

'తాతగారూ, నేనింక తెల్ల గుఱ్ఱం మీదెక్కను, సాయీస్ కొడుకు దాన్ని తాకాడు!'

'వద్దు, వద్దు బీబీ పాషా! తిట్టకూడదు! ఆయన ప్రేమతో బోధ పరిచేవారు.'

'మరి ఆ వెధవ నా గుఱ్ఱాన్నెందుకు తాకాడు?'

'తాతగారూ! మీ తుపాకీని నాకొకసారి ఇవ్వండి! నేనా పాపిష్టివాడ్ని చంపేస్తాను,' ఆయన ఉజాలా బేగమ్ అమాయకత్వానికి అనాలోచితంగా నవ్వేసేవారు.

'మనుషుల్ని చంపకూడదు, నాయనా! తప్పు...?'

'తప్పంటే ఏమిటి తాతగారూ...?' ఆమె మెడపైకెత్తి అడిగేది.

'అల్లామియాకి మనమీద కోపం వస్తుంది...'

'ఆ... మీరంటే అందరికీ చాలా భయం కదా...'

చివరికదే అయింది. తాతగారి కారణంగా ఉజలాబేగమ్ ఇష్టమొచ్చినట్టు ప్రవర్తించేది. ఎప్పటిలాగే ఉజలా బేగమ్ తాతగారి తుపాకీ తీసుకుని తోటలోకి వెళ్ళి, ఇటూ, అటూ తోచిన రీతిన గురిచూసి తుపాకీ పేల్చడం మొదలెట్టింది. ఇప్పుడామె వయసు పదహారేళ్ళు.

ఆమె పక్షుల్ని వేటాడుతున్నానుకొంది. కాని ప్రతాప్‌కిరన్ తోటమాలి ఆ గుండుకి గురైపోయాడు. ఇరుగుపొరుగు వారవడం వలన ప్రతాప్‌కిరన్ రెడ్డి, మునాసిబ్ జింగ్‌ల మధ్య చాలాకాలం నుండి గొడవలుగా ఉన్నాయి. ఇద్దరూ ఒకరినొకరు అడ్డుపడే ప్రయత్నంలో ఉండేవారు. జిల్లా మునాసిబ్ జంగ్ పాలనాధికారంలో ఉండవచ్చు, కాని ఈకను కాకిగా మార్చి, ఇంగ్లీషు రెజిమెంటు ముందు పెట్టే కాలమది. జహాంగీర్ పాదుషాలాగ మునాసిబ్ జంగ్ కూడా న్యాయం గురించి గొప్పలు చెప్పుకున్నాడు కాని ఉజాలా బేగమ్ ఇంకా ఎవరికీ నూర్‌జహాన్ కాలేదు. అలాగే అయి ఉంటే మాలి, ముందు తన ప్రాణాలు హాజరు పరచేవాడతను. లోపల దివాన్‌ఖానాలో అహమద్ హుసైన్ ఒక కేసుకు సంబంధించిన సిఫార్సు కొరకు వేచి ఉన్నారు. మునాసిబ్ జంగ్‌కి అకస్మాత్తుగా అంతటి ఇబ్బంది ఏం వచ్చిపడిందో, ఆయన తలను రెండు చేతులతో పట్టుకుని కూర్చోవడానికి

గల కారణమేమిటో అహమద్ హుసైన్‌కి అర్థం కావడంలేదు. పట్టు, పట్టి, చాలా సార్లడిగిన తరువాత మునసిబ్ జంగ్ తన కష్టం వివరించారు. అహమద్ హుసైన్ వెంటనే తాను సహాయపడగలనని ఒక ఉపాయాన్ని సూచించారు. అహమద్ హుసైన్ కారులో పరదాలు కట్టి, అందులో ఉజాలా బేగమ్‌ని ఔరంగాబాదు నుంచి దురంగా పంపించేసినట్లయితే, వారెంత తల పగులకొట్టుకున్నా సాక్ష్యం లభించదు, అని చెప్పి ఆయన తన కారులో ఉజలా బేగమ్‌ని దాచి ఎలాగ పారిపోయారంటే, రెండు గంటలలో 60 మైళ్ళ దురంలో ఉన్న అజంతా గుహల ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ వాంఛ నిస్సహాయతలతో కూడిన ఒక సంఘటన జరిగిపోయింది, అది చూసి రాజకుమారుడైన సిద్ధార్థుడు కళ్ళుదించుకుని కూర్చున్నాడా అన్నట్లు వుంది. తిరిగి ఒకసారి ఉజాలా బేగమ్ చేతులు తుపాకీ కోసం బాధపడుతూనే ఉన్నాయి. ఆమె ఆర్తనాదాలు ఆ చీకటి లోయలలో ప్రతిధ్వనించాయి. ఇందులో అహమద్ హుసైన్ తప్పు మాత్రమేముంది? నేటి వరకు ఆ అన్నదమ్ములిద్దరి కళ్ళకి కనబడిన ఏ ఆడపిల్లనీ వారు విడిచిపెట్టి ఎరుగరు. అదీ కాకుండా ఉజాలా బేగమ్ దివ్య సౌందర్యం దేవతల్నే కవ్వించేదిగా ఉంటే ఇంక అహమద్ హుసైన్ సంగతి మాటేమిటి?

చాలాకాలం తరువాత ప్రతాప్‌రెడ్డి అన్ని విధాలా ప్రయత్నించి కూడా ఋజువు చెయ్యలేక ఓడిపోయేక ఉజాలా బేగమ్ మళ్ళీ ఒకసారి తుపాకీనివ్వమని తాతగార్ని అడగసాగింది. కాని వెక్కెక్కి ఏడుస్తూ ఉజాలా బేగమ్, అహమద్ హుసైన్ భార్యగా, తాతగారి భవనం విడిచిపెట్టి వెళ్ళింది.

ఈసారి కారు పువ్వులతో అలంకరింపబడింది. దానితో పాటు మునాసిబ్ జంగ్ డాబు దర్పాలు, ఆయన సంపద, ఉజాలా బేగమ్ అహంకారం అన్నీ అణగారి పోయాయి. మునాసిబ్ జంగ్ మనుమరాలు దగ్గరికొచ్చేసరికి కూడా జాగీరుకి వచ్చే ఆదాయం అహమద్ హుసైన్ తాలూకు ఏడు తరాలవారు దర్జాగా బ్రతక గలిగేటంత ఉండేది.

పిల్లి అదృష్టం వలన ఉట్టి తెగిపడిందన్నట్టు అయింది. వాహిద్ హుసైన్ తన షాయరానా పట్టుదలతో బీబీని పెళ్ళాడి వంశమర్యాదను మంట కలిపితే, అహమద్ హుసైన్ తిరిగి వంశ గౌరవానికి వన్నె తెచ్చారు.

అంత అకస్మాత్తుగా జరిగిన, తన తమ్ముని వివాహ వార్త విని వాహిద్ హుస్సైన్ ఆశ్చర్యపోయాడు. అసలు తన తమ్ముడు మునాసిబ్ జంగ్ స్థాయికి ఎలా చేరుకోగలిగాడో! ఉజాలా బేగమ్ సారహీనమైన భూమి వంటిది. ఆమె కడుపు పండలేదు. కాలం గడుస్తూన్న కొద్దీ మునాసిబ్ జంగ్ ఆస్తి తనకే వస్తూన్నట్టు అనిపించ సాగింది వాహిద్ హుస్సైన్‌కి.

ఎన్నోసార్లు అతడు రెండవ వివాహం చేసుకుంటాడేమో అని తెలుసుకునే ప్రయత్నం చేశారాయన. కాని అహమద్ హుస్సైన్ తెలివి తక్కువ వాడు కాదు. మనసునాహ్లాద పరుచుకోవడానికి స్త్రీ కొరతేమీ లేదు. అదీకాక ఒక భార్య వల్ల ప్రాణాన్ని రకాటంలో పడేసుకున్నారాయన. పిల్లలు లేకపోవడం కూడా మేలే. లేకపోతే ఇంద్ర వైభవాన్ని అనుభవించే అవకాశమెలాగ కలిగేది? తన ప్రేమ కలాపాల గురించికాని, ప్రేయసుల గురించి కాని నోరిప్పే అవకాశమివ్వలేదాయన తన భార్యకు. చిన్న చిన్న విషయాలు కూడా ఆమెకు భరించలేనివిగా ఉండేవి. ఇంత డబ్బెలా ఖర్చవుతుందని అడిగే సాహసం చెయ్యలేకపోయిందామె. తన భర్త మళ్ళీ పెళ్ళి చేసుకోకపోవడం, అంత పెద్ద భవంతిని తానే ఏలడం తక్కువేమి కాదు. ఇంత ఆస్థికి యజమాని అయి ఉండి కూడా ఎవరైనా నవాబు, కేవలం భార్యకోసం సంతాన హీనుడై ఉండడం ఆశ్చర్యకరమైన విషయమే. జనం ఉజాలా బేగమ్ అదృష్టాన్ని చూసి ఈర్ష్య పడేవారు, అంతగా ప్రేమించే భర్త లభించాడని ఆశ్చర్యపడేవారు.

నాయనమ్మ రూపం, మునాసిబ్‌జంగ్ తెలివితేటలు పొందింది. ఉజాలా బేగమ్, ఒకనాడు ఆ సుబేదారి మెదడుతోనే ఒక గొప్ప ప్రణాళికను రూపొందించిందామె. దాని కారణంగానే నేడు వారిల్లు ఆనందోత్సాహాలతో మారు మ్రోగుతూంది. చాలాసార్లు ఈ తెచ్చుకున్న, పోషిస్తూన్న పిల్లలు ఎంత ముఖ్యమైన పాత్రను ధరిస్తారో! బీజానీని తన తల్లి సారెతో పంపిందో లేక ప్లేగ్ క్యాంప్‌నుంచి తీసుకు వచ్చిందో ఉజాలా బేగమ్‌కి అస్సలు గుర్తు లేదు. ఎవరో ఒకరైతే ఆలోచించవచ్చు. వారి భవనంలో పది పన్నెండుమంది అమ్మాయిలు పెరుగుతున్నారు. ఇతర ఆడపిల్లలలాగే బీజానీలో కూడా అన్నీ నీచమైన అలవాట్లే, విలువైన పాత్రలు పగులగొట్టడం, ఒకసారి పిలిస్తే చచ్చినా పలుకకపోవడం, ఒక్క దెబ్బకే

ఊరంత గొడవ చెయ్యడంలాంటి దురలవాట్లు ఆమెకీ ఉన్నాయి. ఆమెలో ఉన్న ముఖ్యమైన చెడు అలవాటు ప్రేమ వ్యవహారాలు. ఉజాలా బేగమ్ ఇంట్లోని పిల్లలందరి కట్టు తెగిన యౌవనాన్ని అదుపుచేస్తూనే ఉంది. కాని బీజానీ ఆవిణ్ణి విసిగించేసింది. అందునా, ఫాతిమా బేగమ్ భర్తయి, అప్పుకి బదులుగా తాకట్టుగా పడి ఉన్న మూర్ఖుడు గులామ్ రసూల్‌ని ప్రేమించింది. బీజానీ. అహమద్ హుసైన్ ఎలాగైనా సరే అతన్ని త్వరగా విడిచి పుచ్చుదామనుకుంటే అతడిలాంటి పిచ్చి పనుల వల్ల గడువు పెంచుకుంటూ పోతున్నాడు.

బీజానీ చేస్తున్న పిచ్చి పనులను గమనించి ఉజాలా బేగమ్ ఆమెను తిట్టింది, 'ఓసి దరిద్రపు ముఖమా, అతడేనైనా పెళ్ళికానివాడా! ఫాతిమా బేగమ్, ఆమె కుమార్తె కైసర్ నీ ప్రాణానికుసూరుమని ఏడుస్తారు.' కాని బీజానీ సిగ్గులేకుండా తనని గులామ్ రసూల్‌కిచ్చి పెళ్ళి చెసేయ్యమని ఎప్పుడూ గొడవ పెట్టేది. ఉజాలా బేగమ్‌కి ఈ విషయమంటే అసహ్యమేసింది. ఆమె ఎంతోమంది ఆడపిల్లలకి ఎంతో ఆసక్తితో బొమ్మల పెళ్ళిళ్ళులాగ పెళ్ళిళ్ళు చేసింది. ఆహ్వానపత్రాలచ్చు వేయించింది. ఒకసారి తహసీల్దారు బంట్రోతు కోసం బంగారపు ఉంగరం కూడా తీసుకువెళ్ళిందామె. కాని వారంతా సంతానోత్పత్తిలోనే నిమగ్నమైపోయారు. వారి బద్ధకం పెరుగుతూపోయింది. వారి భర్తలు వెచ్చాలు అవీ తీసుకువచ్చేటప్పుడు డబ్బులెలాగ కొట్టేద్దామా అని చూస్తూండేవారు. పొద్దస్తమానూ భార్యలతో ప్రేమ కలాపాలు సాగించడంలోనే మునిగి తేలేవారు. ఇక పని చెయ్యాలంటే పీకలమీదికే వచ్చినట్టుండేది వారికి.

ఒక రాత్రి అవకాశం చూసుకుని గులామ్ రసూల్ బీజానీతో పాటు మాయమైపోయాడు. అహమద్ హుసైన్ అనుజ్ఞ లేనిదే ఔరంగాబాదులోని పక్షులు కూడా ఎక్కడికీ వెళ్ళగలిగేవి కావు, ఇంక బీజానీ ఒక లెక్కా! కాని, అసలు విషయమేమంటే ఆనాడు ఉజాలాబేగమ్ పనిస్థితి సవ్యంగా లేదు. జిల్లాకు క్రొత్తగా వచ్చిన పోలీసు అధికారి క్రైస్తవుడు. అతడు ముదనష్టపుదాన్ని కూడా వెంటేసుకొచ్చాడు. మిస్ జూలి బొంబాయిలో ఏదో కళాశాలలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేస్తుండేది. ఆమెవచ్చి అహమద్ హుసైన్‌కి ఏం నేర్పించిందో కాని ఆయన క్లబ్‌కే అంకితమైపోయారు.

ఎనిమిదేసి రోజులైనా ఇంటికొచ్చేవారు కారు. వచ్చినా జూలీ వెంబడే ఉండేది. తన జాగీరు చూపించడానికి కూడా తీసుకెళ్ళేవారు. తను స్వయంగా భోజనం పెట్టేవారు.

ఉజాలా బేగమ్ జీవితమంతా భర్త వేసే వేషాలు సహిస్తూనే ఉంది. కాని ఈసారి లక్షణాలు వేరుగా ఉన్నాయి. పిల్లలకోసం అహమద్ హుస్సైన్ జూలీని వివాహం చేసుకోబోతున్నారన్న వార్త బయట వినబడుతూంది. లోలోన ఆయన ఏదో అనబోతూ ఆగిపోయేవారు, 'ఊహ్! మేము మరణిస్తే మాకు ఫాతిహా ఎవరు చేస్తారో!'

'ఈ ఆస్తంతా ఇప్పటినుంచే ఏదైనా శరణాలయానికి వ్రాయించు చెయ్యాలి!'

భర్త నోటివెంట, అంతకు ముందెప్పుడూ ఇంటువంటి మాటలు వినలేదు ఉజాలా బేగమ్. అటువంటి పరిస్థితిలో బీజానీ, గులామ్ రసూల్ పట్టుబడి తిరిగి వచ్చే సరికి బీజానిని కొడుతూ తనకాలు వెనక్కి తీసుకుంది బేగమ్. తన ముఖంలో ఎప్పుడూ కనబడనటువంటి ఒక విధమైన మెరుపు బీజానీ ముఖంలో కనపడటమే అందుకు కారణం, అది కనుక్కోవడానికి ఆమెకు ఎక్కువసేపు పట్టలేదు.

ఆనాడామె చాలాసేపు ఆలోచించింది. చాలా రోజుల తరువాత ఆ రాత్రి అహమద్ హుస్సైన్ ఆమెను పడకటింటికి పిలవనంపేసరికి ఆమె తలపైన మేలిముసుగు సవరించుకుని, కాబాకేసి ముఖం తిప్పుకుని ఒక కల గురించి వినిపించ సాగింది, రాత్రి కలలో రహమత్ ఆలీషాహ్ ఒక శుభవార్త చెప్పారు. అది ఏమిటంటే, అహమద్ హుస్సైన్ వారసుడు బీజానీ గర్భం నుంచి ఉద్భవిస్తాడు. కనుక ఆ పిల్లతో ఆయన వివాహం చేసుకున్నట్లయితే, ఉజలా బేగమ్ హక్కులలాగే ఉంటాయి. ఇంకే గొడవ ఉండదు. ఆ పిల్లవాణ్ణి తాము, తమ బిడ్డగా పెంచుకుంటారు. దాంతో అన్నీ సర్దుకుంటాయి.' ఈ కల గురించి చెప్పడానికి ముందే ఉజాలా బేగమ్ కాజాగార్ని పిలిపించింది. ఆయన బయట గదిలో కూర్చుని ఉన్నారు. ఈ విషయంపైన అహమద్ హుస్సైన్‌కి ఆలోచించే అవకాశమే దొరకలేదు. ఆయనకి రహమత్ ఆలీషాహ్ అంటే ఎంతో శ్రద్ధ-భక్తి కనుక అప్పుడు కూడా ఏమీ ఆలోచించలేక పోయారు. కాజీగారు అహమద్

హుసైన్ కి బీజానీకి వివాహం జరిపిస్తూంటే, ఉజలా బేగమ్ తన నెవరో పనికివూలినవాడికి కట్టబెడుతున్నట్టు బీజానీ గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది.

ఆ రాత్రి అహమద్ హుసైన్ ఆ చిన్న పిల్లకేసి చూసేసరికి, ఆమె దెబ్బతిన్న పక్షిలాగ వణికిపోయింది. రాత్రంతా ఆ పిల్ల కేకలు ఏడుపు వింటూ కళ్ళు తుడుచుకోసాగింది; ఉజాలా బేగమ్.

రెండు మూడు నెలలలాగే గడిచిపోయాయి.

సరిగ్గా మిస్ జూలీ,మిసేస్ అహమద్ హుసైన్ అయిపోవడానికి నిర్ణయించుకున్న సమయంలో, ఒకనాడు అభినందనల మధ్య అహమద్ హుసైన్ తాను తండ్రి అయిన వార్త విన్నారు. ఇక ఆయన రహమత్ ఆలీషాహ్ అద్భుతమైన మహిమను ఒప్పుకోకేం చేస్తారు. విధిలేని పరిస్థితులలో జూలీని మర్చిపోయి రహమత్ ఆలీషాహ్ దర్గాకెళ్ళి మొక్కులు, తీర్చుకునే ప్రయత్నంలో మునిగిపోయారు.

ఉజాలా బేగమ్ రవికెలోంచి పది రూపాయలనోటు తీసి మూడు సార్లు దిగతుడిచి బీజానీ కిచ్చింది.

భోజనాల హడావిడి తగ్గిన తరువాత మీరాసీ జాతి స్త్రీలు ఢోలక్ తీసుకుని గట్టిగా గొంతు చించుకుని పాడసాగారు.

ముసలి హజరత్ బేగమ్ తన వణుకుతున్న చేతులతో ఉజాలా బేగమ్‌కి ఎర్రటి బెనారస్ చీర కట్టి, మేలి ముసుగువేసి మసనద్‌పైన కూర్చోపెట్టింది.

'ఏడుగురు తల్లుల్ని పిలవండి', హజరత్ బేగమ్ కళ్ళద్దాల వెనుక మెరుస్తూన్న కళ్ళతో అక్కడ గుమిగూడిన వారిని చూసింది. వారి చుట్టుపక్కల స్త్రీలంతా పూలతో అలంకరించే వేడుకని చూడడానికి ఒకరినొకరు తోసుకుంటున్నారు. పువ్వులు అలంకరించడం, వేడుకలు జరిపించడంలో హజరత్ బేగమ్ అందెవేసిన చెయ్యి, ఆమె తమ వంశంలో అందరికంటే పెద్ద ముత్తైదు, అదృష్టవంతురాలైన ఇల్లాలు.

ఆమెకు అన్ని వేడుకలు తెలుసు, కనుక ఇల్లాళ్ళందరూ ఆమెనే ముందుంచేవారు.

'గంధం ఎక్కడుంది? కొబ్బరి మేవాల పళ్ళెం ఎక్కడికి పోయింది?'

'దిష్టి తీయవలసిన డబ్బెక్కడ పెట్టారు?' హజరత్ బేగమ్ కళ్ళజోడు

పెట్టుకుంది. కాని కంగారులో ఏమీ బోధపడడంలేదు. ఒక ప్రక్క స్త్రీలు గొడవ పెడుతున్నారు. బోలెడుమంది తల్లులు ఆమె ఎదుటనుండగా, ఆమె ఏడుగురు తల్లుల్నీ వెతుకుతూంది, చందనం రాసి, తమలపాకులు, వక్కలతో ఆమె ఒడి నింపాలనుకుంటూంది.

'అహామద్ మియాన్నైతే పిలవండి...!'

ఇది విని సగం గుంపు బయటికెళ్ళిపోయింది. అతి కష్టం మీద, జాగ్రత్తగా అహామద్ హుస్సైన్ లోపలికొచ్చారు. తలవంచుకుని పెళ్ళికొడుకులాగ సిగ్గు పడుతున్నారు. కొత్తగా తండ్రి అయే గర్వంతో కూడుకున్న హుందాతనం వుట్టి పడుతోంది. జుట్టు కొద్దిగా తెల్లబడుతూంది. ముఖము మీది రేఖలు స్పష్టంగా కనబడుతున్నాయి, లావెక్కుతున్నారు.

వస్తూనే ఆయన తల పందిరికి కట్టిన లతలతో చిక్కుకుని టోపీ మసనద్‌పైన వెళ్ళిపడింది. గాభరాపడి, తిరిగి సద్దుకుని, ముఖ్యులు, పెద్దవారు అయిన స్త్రీలకి వంగి, వంగి సలామ్ చెయ్యసాగారు.

ఉజాలా బేగమ్ ఎంతో మంది అత్తలకి, పినతల్లులకి వంగి సలామ్ చెయ్యమని ఆజ్ఞాపించింది. ఆయన అలాగే చేసి పిల్లవాడు అదృష్టవంతుడు కావాలని ఆశీస్సులు తీసుకుంటూ ఆయాసపడిపోయారు.

తరువాత సుగంధ పరిమళాలతో, పట్టుచీరలతో స్త్రీలు, ఆయన్ని ఉజాలా బేగమ్ వద్ద మసనద్‌పైన కూర్చోపెట్టారు. ఆ పరిస్థితిలో అహామద్ హుస్సైన్ కంటబడరాదన్న విషయాన్ని మరిచారు స్త్రీలు.

'కాని ఈ పిల్లవాడు ఉజాలా బేగమ్ కడుపునపుట్టి ఉంటే...' ఆడవాళ్ళు గుసగుస లాడ సాగారు.

అకస్మాత్తుగా ఉజాలా బేగమ్ దృష్టి ఖాళీగా వున్న తన ఒడిపైన పడింది, ఆమె కేకవెయ్యడం మొదలెట్టింది, 'ఓ బీజానీ! నసీర్ నవాబుని ఇటు తీసుకురా!'

అందరికీ తమ మూర్ఖత్వం తెలిసొచ్చింది. 'అయ్యో, పిల్లవాడేలేడు. హాజరత్ బేగమ్ కూర్చుని పూల దండలు విడదీస్తూ కూర్చుంది.'

చీకటిగదిలో ఏడుస్తూన్న పిల్లవాడిని బీజానీ [illegible]వెలకదుముకుని జోకొడుతూంది. గులామ్ రసూల్ గిలక్కాయ[illegible] సుకుని వెనక తిరుగుతున్నాడు.

'అయ్యో, ఈ తమాషా చూడండి... పనులన్నీ విడిచిపెట్టి పిల్లవాడి వెనకాల తిరుగుతున్నాడు?'

'పసివాణ్ణే అక్కడికి తీసుకు రమ్మంటున్నారు...' ఒక స్త్రీ బీజానీ దగ్గర నుంచి పిల్లవాణ్ణి లాక్కొని లోపలికి పరుగెత్తింది.

హాజరత్ బేగమ్ పిల్లవాణ్ణి ఉజాలా బేగమ్ ఒడిలో పడుకోబెట్టి, కూరలు, మేవా, పటికిబెల్లం, డబ్బులతో కొంగు నింపింది. పిల్లాడికి దిష్టి తీసింది. ఉజాలా బేగమ్‌కి, అహమద్ హుసైన్‌కి పూలదండలు వేసి, తీపి తినిపించింది. తరువాత వారన్-ఫేరన్ ప్రారంభమైంది. వంశానికి చెందిన ప్రతి స్త్రీ వచ్చి వెండి రూపాయలు వారిపై నుంచి దిగతుడిచి అభినందించింది. అప్పుడు వాళ్ళిద్దరూ లేచి అందరికీ సలామ్ చేశారు.

చాలా వెనుకగా నిలబడ్డ బీజానీ ఈ తమాషా అంతా చూడసాగింది.

'ఉజాలా దులహన్! ఇకమీద బీజానీని జాగ్రత్తగా చూసుకో, రసూల్ తరఫున ఆమెను తృప్తి పరచడం నీ పని.'

'ఊరుకోండి, తన కడుపు పంటని మీ ఒడిలో చేర్చింది.'

'అయ్యో! అయితే నేను ఆమెకివ్వాల్సిందివ్వనా?' ఉజాలా బేగమ్ అపార్థం చేసుకుని అంది. 'ఈరోజే ఆ మురదార్‌కి కొత్త చీర, కుర్తా ఇచ్చాను... బీజానీ!... ఓసీ దెయ్యం, కొత్త బట్టలు వేసుకుని అందరికీ సలామ్ చెయ్యవేం?'

చామన ఛాయతో బక్కపలుచని శరీరంతో ఉన్న 15, 16 సంవత్సరాల పిల్ల బీజానీ సిగ్గుపడుతూ ముందుకొచ్చింది. పిల్లవాడ్ని ఉజాలా బేగమ్ ఒళ్ళో పడుకోబెట్టుకుంది, లేకపోతే ఇంత చిన్నపిల్ల ఒక బిడ్డను కన్న తల్లి అంటే ఎవరికీ నమ్మశక్యం కాదు.

ఆమె గంజిపెట్టిన చేనేత చీర చెరగును తలపైన వేసుకుని ముందు హాజరత్ బేగమ్ కాళ్ళకి దణ్ణం పెటింది. తరువాత బేగమ్‌లందరికీ దణ్ణం పెట్టి, చివరికి గోరింటాకు పెట్టిన, బంగారు పాంజేబులున్న ఉజాలా బేగమ్ తెల్లని పాదాలపై పడి ఏడవడం మొదలుపెట్టింది.

'ఛో, ఛో అవతలకి...!' ఉజాలా బేగమ్ గాభరాగా ఆమెను వెనక్కు నెట్టింది. ఇటు పువ్వుల చల్లదనం వల్ల భయపడిన పిల్లవాడు ఏడవడం మొదలుపెట్టాడు. అహమద్ హుసైన్ అప్పటి వరకూ పెళ్ళి కూతురులాగ

తల వంచుకుని కూర్చున్నారు.

'ఏమే ఈ అపశకునపు ఏడుపెందుకు? నీ అదృష్టం పండింది ఈ రోజు. నీ బిడ్డ తన తల్లిదండ్రుల నీడలో చల్లగా పెరిగి పెద్దవ్వాలని ప్రార్థించు, ఇక జీవితాంతం నీకు తిండి, గుడ్డా గురించిన బెంగ లేదు, అంటూ హజరత్ బేగమ్ బీజానీని కేకలేసింది.'

'ఈ కులట నిలకడగా ఉంటుందా?' నుదుటి చెమటను తుడుచుకుంటూ అంది ఉజాలా బేగమ్. 'దీనికీ భవనంలో ఉండబుద్ధి అవుతుందా? దీనికెప్పుడూ అడ్డమైన తిరుగుళ్ళు కావాలి!'

'కానీ పిల్లవాడు పాలు తాగినంతకాలం ఈ దెయ్యం కాళ్ళని గొలుసులతో కట్టి ఉంచు...!' ఒక ఇల్లాలు సలహా ఇచ్చింది.

'మీరు కూడా మాట్లాడండి అబ్బాజాన్...!' అహమద్ హుసైన్‌కి వరుసకి మరదలైన అమ్మాయి వేళాకోళం చేసింది.

'ఇక ఇప్పుడు నేను మాట్లాడవలసిన అవసరమేముంది? నేను బయటికి వెళుతున్నాను... ఆదాబ్ అర్జ్‌హై.'

'పిల్లవాడికి పేరేం పెట్టారు అహమద్‌మియా!' ఎవరో అడిగారు.

'నసీర్ హుసైన్ ఖాన్?'

'అల్లా శుభం చేకూర్చుగాక! చాలా చక్కని పేరు!'

'పెద్దనాన్నగారు, పెద్దమ్మ రాలేదా కొడుకుని చూడడానికి?'

ఒక బేగమ్ మొదలుపెట్టింది, ఇక ఉజాలా బేగమ్ అందుకుంది. 'ఎలా వస్తారు ముమానీ బేగమ్! మా ఇల్లు నిలబడేసరికి వారికి గుండెలు పగిలాయి. మా అత్తవారింట్లో అంతా నేను. చచ్చిపోతే ఈ ఆస్థినంతా స్వంతం చేసుకుందామని ఎదురుచూస్తున్నారు.'

'చాలు, చాలు, ఇంక ఊరుకో...!' అహమద్ హుసైన్ ఆమెను కేక పెట్టి బయటికి వెళ్ళబోయారు. స్త్రీ ఎవరేనా సరే, అత్తవారి చెడ్డతనాన్ని ఎంత చక్కగా వర్ణిస్తుందో!

'వీడింతగా ఎందుకేడుస్తున్నాడు...?' పిల్లవాని కేకలు విని కంగారుపడింది ఉజాలా బేగమ్.

'ఇవ్వండి, నాకిచ్చెయ్యండి,' ఇంకెవరేనా పిల్లవాడిని తీసుకునే లోపు బీజానీ మధ్యలోనే తీసుకుని తన గదికేసి పరుగెత్తింది. కొంతసేపైన

తరువాత కొంతమంది స్త్రీలు అటువైపు వెళ్ళి గదిలోకి తొంగి చూశారు. బీజానీ కొంగుచాటున పిల్లవాడ్ని దాచుకుని నెమ్మదిగా పాలిస్తూంది ఆమె దగ్గర కూర్చుని గులామ్ రసూల్ గిలక్కాయి వాయిస్తున్నాడు.

'ఈ పిల్లలెంత మారిపోయారు. దీని వయసు చూడు... మా పిల్లలు ఈ వయసులో తలమీద చున్నీ సరిగ్గా వేసుకోవడం ఎరగరు... రామ... రామ...! ఉస్తానీ మా తలమీద ముసుగు సవరించుకుని చెంపలేసుకుంది.

'అల్లా, అహమద్ నవాబుని సర్వవిధాలా రక్షించాలి పాపం ఎంత నెమ్మదస్తులో. ముప్ఫై సంవత్సరాలు ఓర్పుగా సంతానం కోసం వేచి ఉన్నారు. ఇక ఇప్పుడు భార్య చెప్పగా ఒక పిల్లని పెళ్ళాడారు.'

'చూస్తూండు, కొడుకు కూడా తండ్రిలాగే మంచివాడవుతాడు ఉజాలా బేగమ్ వాణ్ణి దర్జాదర్పాలుగల నవాబుగా తీర్చి దిద్దుతుంది?'

'ఏం జరుగుతోందిక్కడ?' ఉజాలా బేగమ్ అందర్నీ తోసుకుంటూ బీజానీ గదిలోకొచ్చింది. చెవులు కొరుక్కోవడం చూస్తే ఈ రోజెందుకో ఆమెకు గుండె దడ దడ లాడుతూంది. ఆమె ప్రతి వ్యక్తిని అనుమానంగా చూస్తూంది.

'చిన్న నవాబుని నౌకర్ల గదిలోకి తీసుకురావద్దని నీకెన్ని సార్లు చెప్పాను!' తరువాత ఆమె గులామ్ రసూల్ వైపు తిరిగింది.

'ఏరా, నువ్విక్కడెందుకు చచ్చావు? ఇవాళ చిన్న నవాబుకెదురుగా కూర్చుని గిలక్కాయతో ఆడుకోవడమేనా అన్నిటికంటే ముఖ్యమైన పని?'

గులామ్ రసూల్ కోపంగా లేచి నిలబడ్డాడు. ఆ మూర్ఖుడు, పిచ్చివాడిలాగ ఎప్పుడూ నోరు తెరుచుకుని ఉంటాడు. అతడ్నందరూ పిచ్చివాడంటారు, తన ఈ బిరుదు విన్నప్పుడు కూడా నవ్వుతుండేవాడు. అతడి ముందెవరైనా ఫాతిమా బేగమ్, కైసర్ పేరెత్తితే వారి భార్య బిడ్డలవుందు తలెత్తడానికి కూడా తను అర్హుడుకానట్లు తల దించుకునేవాడు. కాని ఈ గులామ్ రసూలే బీజానీ చుట్టూ ఎలాగ తిరగగలిగాడో! ఉజాలా బేగమ్ ఒక్క తోపుతోసి అతడ్నక్కడి నుంచి తొలగించింది. అతను చాలాసేపు రెప్పలల్లార్చి చూస్తూ నిలబడ్డాడు. తరువాత వంగి ఆ గిలక్కాయ తీసి ఎంతో శ్రద్ధగా ఉజాలా బేగమ్ ముందుంచాడు.

ఉజాలా బేగమ్, పిల్లవాడిని ఊరుకోపెట్టే విధానాల గురించి తన స్నేహితురాలొకామె నడుగుతూంది. గిలక తీసుకుని నుంచున్న గులామ్ రసూల్‌ని చూసి ముందు గాభరా పడినా తిరిగి నవ్వడానికి ప్రయత్నించింది.

'చూశావా, గులామ్ రసూల్ ఎలాంటి పిచ్చాడో! చిన్న నవాబుకోసం ఎక్కడినుంచో రెండు పైసలిచ్చి దీనిని కొనుక్కొచ్చాడు... నా బిడ్డంటే ఇతడికెంతో ప్రేమ...!'

అవును! ఇందాకటినుంచీ ఇతడి స్వంత బిడ్డేమో అన్నట్టు దగ్గర కూర్చున్నాడు.'

'నిజమే, ఇతనికి కూడా ఒక కూతురుంది హైదరాబాదులో, ఉజాలా బేగమ్ అంది. పిల్ల మాట వినగానే సంతోషం కలిగిందతనికి. అతడు నవ్వుతూ, సిగ్గుపడుతూ బయటకు వెళ్ళిపోయాడు.

రజియాకి ఛిల్లా అవబోతూంది, చాంద్‌తోపాటు ఆ మహల్లోని అమ్మాయిలు ఢోలక్ తీసుకుని హాలులో కూర్చున్నారు.

అంతా పాడుతున్నారు. వారి పాటల సవ్వడి ఐవానే గజల్ గేటు దాకా వినబడుతున్నాయి. ఆసనం మీద కూర్చుని కళ్ళజోడు పెట్టుకుని, బీబీ చిన్న చిన్న దుస్తులు కుడుతూంది.

కింద బాదామ్, అఖరోట్, కొబ్బరి, పటిక బెల్లం ట్రేలలో పెట్టి ఉన్నాయి. కుంటత్త బాలింతరాలి కోసం 'కాయం' తయారు చేస్తూంది.

బయట బైతుల్ ఆనందంతో స్నేహితులతో కలసి గట్టిగా నవ్వుతున్నాడు. వంటింట్లోంచి మాహే - కలియే (విశేషమైన వంటకం)లో పెట్టిన తిరగమోత ఘుమఘుమలాడే సరికి చాంద్ రెండవ పాట ప్రారంభించింది.

'పాడండి అభినందన గీతం అనునిత్యం.'

ఈ ఇంట్లో ఎంత శాంతిగా ఉందో... ఎంత తృప్తి చుట్టు పక్కల అంతా ఎవరి ఆలోచనలలో వారు మునిగి ఉన్నారు. ఇంక చలికాలం వచ్చేస్తుంది... రాత్రిళ్ళు హాయిగా ఉంటాయి. వాహిద్ హుసైన్‌కి రాత్రులు ఎప్పుడూ హాయిగానే ఉంటాయి. రాత్రి... తనతో కూడా ఎన్నో ఆనందానుభూతులను తీసుకొచ్చే రాత్రి, ప్రపంచపు బాధల నుంచి దూరంగా తీసుకుని వెళ్ళే రాత్రి.

లోపల రజియా కూతురు ఏడుస్తూంది. ఇక్కడ ఎంత ప్రశాంతంగా

ఉంది. ప్రపంచంలో ఎక్కడో హిరోషిమా అనే పేరుగల పట్టణం అణుబాంబు వల్ల ధ్వంసమైపోయిందన్న విషయం ఈ ఇంట్లోని వారికెవరికీ తెలియనే తెలియదు.

బయటి ప్రపంచంలో భయంకరమైన పరిస్థితి ఏర్పడుతోంది.

భారతదేశంలో స్వాతంత్ర్య పోరాటం తీవ్రం కాసాగింది. మనుషులు ఒకర్ని ఒకరు తోడేళ్ళలాగ వెంటాడుతున్నారు... మృత్యువు... నాశనం... నలువైపులా హాహాకారాలు చెలరేగుతున్నాయి... ఈ బయటి ప్రపంచం వాహిద్ హుసైన్‌కి చాలా దూరంగా ఉంది. కాని ఈ బాహ్య ప్రపంచంతో తనకున్న సంబంధ బాంధవ్యాలను ఆయన తెంచుకోలేక పోతున్నారు. ఈ రెండు లోకాల మనిషి పైప్‌నో లేక 'గాలిబ్'నో ఆశ్రయిస్తాడు. జీవితంలో కవిత్వం ప్రాధాన్యతని తక్కువగా అంచనా వేయటం జరుగుతూంది. కాని 'గాలిబ్' ఒక్కడే ఆయనకు ఎన్నో విధాల తోడ్పడుతున్నాడు. తనకి ఆసరాలేదనిపించినప్పుడు, ఒంటరితనం బాధించినప్పుడు 'గాలిబ్'ని ఆశ్రయించేవారు.

మనిషి, ప్రేమని ఎక్కడెక్కడో వెతుక్కుంటూ తిరుగుతాడు. ప్రపంచంలో ఉండే కళాకారులు, సైంటిస్టులు, విద్యావేత్తలు అంతా వెతికేది కేవలం ఈ ఒక్కదాని కోసమే.

జీవితానికి దూరంగా, మనిషి ఆఖరి గమ్యస్థానం, అంతిమ ఆశ్రయం, దేని కోసమైతే మనిషి చావుకి కూడా సిద్ధపడతాడో - అదే ప్రేమ.

'ఈ రోజు యుద్ధం సమాప్తమయింది.' ఆయన వార్తా పత్రికని తృప్తిగా ప్రక్కకి తొలగించారు. హిరోషిమాలో అప్పుడే పుట్టిన పిల్లలు, వారి పుట్టుకలకి సంతోషించే తల్లులు, అమ్మమ్మలు, నానమ్మలు... లోపల పాట సాగుతూంది.

ఈ స్త్రీలు ఎంత ఆశతో జీవిస్తారు... ప్రతి శిశువు పుట్టగానే కలలు కంటారు... ఎన్నో ఊహా సౌధాలను నిర్మించుకుంటారు.

అడాడా ధమ్... ఒక్క అణుబాంబు అందర్నీ మూగబోయినట్టు చేసింది. ముక్తి ఎక్కడుంది... మతం, భగవంతుడు ఏకాగ్రత... భగవంతుడే, కాని అతడు తనే సృష్టించిన ప్రపంచంలో ఎందుకు కలగచేసుకోడు!

వాహిద్ హుసైన్ చాలాసార్లు మిస్కీన్ అలీషాహ్‌తోతాచష్మీ వద్దకు

వెళ్ళారు. నేను ధర్మపరమైన సమస్యలపై చర్చించేందుకు రాలేదు. కేవలం జ్ఞానార్జన కొరకు వచ్చాను అని చెప్పారు.

కాని జ్ఞానానికి హద్దంటూ లేదెక్కడా, అది, వేదాంతం, తర్కం, న్యాయం మొదలైన శాస్త్రాలలో చిక్కుకుపోయింది. శతాబ్దాల అనుభవాలు, వ్యక్తుల హిత-లాభాలలో... వాహిద్ హుసైన్ అలా సమస్యలలో చిక్కుకుంటూ పోయారు.

'అసలు మనిషి అవలంబించవలసిన మార్గమేమిటి? ఏ చింతనా పద్ధతితో పయనించాలి?'

ఆయన కంగారుగా, తిరిగి తన గజల్‌కేసి వచ్చేశారు. తానొక ముషైరాలో కూర్చున్నట్టు, ప్రజలు శెహబాష్, శెహబాష్ అని మెచ్చుకుంటూ తనని ఉత్సాహ పరుస్తున్నట్టు భావించసాగారు.

ఇంతలో ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డారు. నిజంగానే ముషైరా జరుగుతూంది. చాంద్ మొదలు బీబీ దాకా అందరూ ఈ గొడవలో మునిగి ఉన్నారు. మనిషికి ఆలోచించేందుకేమి లేనప్పుడు సంతుష్టుడైపోతాడు, చింత లేనివాడయిపోతాడు. ఆయనకి చుట్టుపక్కల ఉన్నవారందరూ, ఎన్నడూ ఆలోచించని వారందరూ నవ్వుతున్నారు. వారంతా కేవలం వర్తమానంలో జీవిస్తున్నారు.

జీవితంలో, పరుగులెడుతూ, గెంతుతున్న పద్ధతులకు దూరంగా కూర్చుని ఉన్న వాహిద్ హుసైన్ తన ఊహా సుందరి చిత్రాన్ని విమర్శిస్తున్నారు.

ఆ పాడు విషయాలపై ఆయన వేల సంఖ్యలో కాకపోయినా వందలాది గజళ్ళు రాసి ఉంటారు. కొంచెం అంత్యానుప్రాస, తరువాత వచ్చే పదజాలాన్ని మార్చవలసి వచ్చేవి, అదే ప్రేమికుడు తన గుండెను కాల్చివేస్తున్నాడని... వేరొక ప్రక్కనుంచి ప్రతిద్వంద్వి విరుచుకు పడుతున్నాడు. కాని వందలాది సార్లు చీకిన ఎముక, ఇతరుల నోట్లో కనబడేసరికి నోరూరుతుంది.

'అమ్మయ్యా, గజల్ తయారయింది.'

కాని నేడెందుకో గజల్ కూడా తనని విడిచి పోయింది. రాషిద్ అల్ప ఆదాయం, అప్పుల బాధలను చూసి అది దూరంనుంచే వెనుతిరిగి పోయింది.

హాలులోని గొడవకి గాభరాపడి వాహిద్ హుసైన్ కళ్ళద్దాలను కిందకి జరిపి తన రివాల్వింగ్ కుర్చీని వేరొకవైపు తిప్పుకున్నారు.

వీరంతా ఎవరు...? ఆలోచించసాగారు... ఈ శరీరం, అల్లరి పిల్లలు నిర్దయులైన బంధువులు, ఆజ్ఞలను ఉల్లంఘించే సంతానం, మాట వినని భార్య... ఈ దోపిడీదారులే - ఆయన ప్రతిభని, స్ఫూర్తిని, అందమైన శరీరాన్ని ప్రేయసుల గుంపుని... అంతా దోచేసుకున్నారు.

తన జీవితంలో స్త్రీని తప్ప ఆయన వేరే ఏ అందాన్ని పరిపూర్ణమైన అందంగా భావించలేదు. ఐవానే గజల్‌లో నివసించే వారంతా కూడా ఏదో అందమైన స్త్రీకి బందీలుగా ఉండేవారు, వారి కవిత్వపు పొంగు జాగృదావస్థలో వుండాలన్నది వారి ఆశ, ఆశయం. వాహిద్ హుసైన్ కూడా యౌవనారంభ దశలోనే హృదయాన్నటూ - ఇటూ పారవేసు కోవడం ప్రారంభించారు. ప్రతిరోజూ ఒక కొత్త ప్రేయసి ప్రేమలో బంధింపబడేవారు. రాత్రంతా కార్చిన కన్నీరుతో తలగడ తడిసిపోయేది. తెల్లవారేసరికొక గజల్ తయారయేది.

కాని ఈమె కూడా ఒక స్త్రీయే... ఆయన మరొకసారి తన కుర్చీని తిప్పుకుని ఎదురుగా కూర్చుని ఉన్న బీబీని చూశారు. అసలు చిన్న చిన్న బట్టలు కుట్టడమే జీవిత పరమార్థము అన్నట్టు హాయిగా కుడుతూంది. ప్రపంచపు గొడవలు, వాహిద్ హుసైన్ అస్తవ్యస్తమైన మస్తిష్కం తృష్ణతో కూడిన ఆయన శరీరం, ఇవేమీ తెలియనట్టుండేది... ప్రేయసిగా ఆయన జీవితంలో అన్ని రంగులూ చిందించి, భార్య అయి, జీవితంలోని, రంగులన్నీ తుడిచివేసింది. ఈనాటి పరిస్థితి ఎలాగుందంటే ఎన్నో కేసుల సందర్భంగా ఆయనను న్యాయ స్థానాల్లో పిలుస్తున్నారు. కూతుళ్ళిద్దరూ అత్తవారిళ్ళలో దుఃఖిస్తున్నారు. పింఛను మొదలయ్యిందో లేదో ఎన్నో రోగాలు ఒక్కుమ్మడిన ప్రారంభమయ్యాయి. ఏభై ఐదు సంవత్సరాలకే రక్త పోటు పెరుగుతూందని చెప్పాడొక డాక్టరు. గుండె దడనే వాడింకొక హకీమ్. ప్రతి గురువారం సాయంకాలం, పసుపు పచ్చని అన్నంపైన నిమ్మకాయ, పెరుగు మొదలైనవి వేసి దిష్టి తీసేది గౌహర్ అత్త తోటలో తిరుగుతూంటే ఏదో ఆవహించి ఉంటుందనుకునేది ఆమె.

వరండాలో ఒక మూల తిరుగుడు కుర్చీలో ఇదంతా చూసేవారు.

గాలి ఆడడం లేదు. ఎండా కాలమింతా మొదలవలేదు. కానీ విపరీతంగా ఉక్కపోస్తూంది. రాత్రిళ్ళు దోమలు కుట్టటం వల్లనో లేక పిల్లల గొడవ వల్లనో నిద్ర పట్టేది కాదు. తోటలోని చెట్లన్నీ నిరుత్సాహాన్ని కప్పుకున్నట్టు నిలుచున్నాయి. టప్... టప్ అని వాటి కన్నీరు పండుటాకులు రాలినట్టు రాలుతున్నాయి.

ఆశ్చర్యచకితుల్ని చేసేటటువంటి వార్తల బరువుతో వార్తాపత్రిక కూడా బల్లమీద పడి వణుకుతున్నట్టుంది.

నేడు పాదుషాకి మళ్ళీ వంటశాల మేనేజరుపై కోపం వచ్చింది, దాసి - సంతతికిచ్చే టమోటోకూరలో నెయ్యి, ఎందుకు తక్కువ వేస్తున్నారు? ఏర్పాట్లు ఇంత అధ్వాన్నంగా ఎందుకున్నాయి?

ఈ విషయం కింగ్ కోఠీ - వంటశాలనుండి బయలుదేరి చార్మినార్ వద్ద టీ దుకాణాల వరకూ పాకింది. ఐదు పైసల టీ ముందు పెట్టుకుని కూర్చున్న ఉబ్బసం రోగి, పట్టణపు ముసలి షాయర్, నల్లమందు, చరస్ వంటి మత్తు పదార్థాలను సేవించేరని మహాళ్ళ నుండి తరిమివేయబడ్డ పోకిరీ వాళ్ళు, కాలం కలిసిరాని నవాబులు, కుట్రల మూలంగా ఇటు - అటు పరుగెట్టే భారతీయులు. వీరంతా ఈ విషయం గురించి చర్చిస్తూంటారు - హుజూరువారికీ రోజు కోపం వచ్చింది. భగవంతుడు రక్షించుగాక...

యుద్ధం అయిపోయింది. గాంధీగారిప్పుడు విదేశీ వస్తువులను బహిష్కరిస్తారు... తన ఆశ్రమంలో దీక్ష పూనుతారు... అహింసా బలంతో భారతదేశానికి స్వాతంత్ర్యం లభిస్తుంది... ఈ భారతదేశం దక్కనుకి చాలా దూరంగా ఉంది. తన ప్రతిభతో అక్కడి విషయాలు ఏకాగ్రతతో ఆలోచిస్తూ వాహిద్ హుసైన్ అలిసిపోయేవారు.

భగవదత్తమైన స్వాతంత్ర్యం ఎంత గొప్పది... మన పాదుషా... మన ఎస్టేటు... మన దేశం... వాహిద్ హుసైన్‌కి తన పట్టణం అన్నా - తన ఇల్లన్నా ఎంతో ప్రేమ... అందుచేతనే బైట వార్తలెక్కువగా చదివే వారుకారు... ఈనాటి ముఖ్యమైన వార్త... దాసీ పుత్రుల కూరలో... చేము హాల్లాలో ఎవరి దర్బారులోనో ఒక షాయర్ తన కలామ్ వినిపిస్తున్నాడు.

'వాహ్ వాహ్'ల గోలతో కప్పులెగిరిపోతున్నాయి.

మహబూబ్‌కీ మెహందీలో పూలమాలలమ్ముడుపోతున్నాయి. గులాబీ

మొగ్గవంటి కోమలాంగి ఆయన ఒక వేళ్య కోతాలో కూర్చుని ఏదో రాగంలో దాగ్ గజల్ పాడుతూంది.

పత్తర్ గట్టి కెదురుగా సాలార్‌జంగ్ గొప్ప మహాలు ఉంది. ప్రపంచంలో దుర్లభమైన, విచిత్రమైన వస్తువులను సేకరించి లెక్కలేనన్ని గదులలో అమర్చిన తరువాత, మైక్రోస్కోప్ సహాయంతో చెదలుపట్టిన మసౌదాలను చదవడానికి ప్రయత్నిస్తున్నారాయన. అతి విలువైన, దుర్లభమైన పుస్తకాలను సేకరించడం ఆయనకి ఇష్టం.

ఎవరి ద్వారం ముందో కింగ్ కోఠీకి సంబంధించిన మూడు పెద్ద కార్లు నిలిచాయి. పదిమంది కాపలావాళ్ళు దిగారు. నలుగురు భోటియాలు కలసి ఒక పళ్ళెం దింపారు.

ఖమీరీటికియా, ఒక మామిడిపండు, ఒక పళ్ళెంలో మీగడ దాని వెనుక, వారి కృప వలన లభించే గొప్ప పట్టిక ఉంటుంది... పెద్ద హోదా... జాగీరు... బిరుదు... రాబోవు ప్రపంచంతో సంబంధం లేనట్టు కళ్ళు మూసుకుని పాడుతున్నారు.

'లేవండి చున్నూ నవాబుగారూ, లేవండి... వసంత ఋతువు ఎప్పుడో వెళ్ళి పోయింది!'

పూవులలోని సౌరభం మాయమయింది. ఇప్పుడిక అన్ని వైపులా ఆకురాలు కాలపు శోకము వ్యాపించి ఉంది. పువ్వులు లే చిగుర్ల మధ్య దాగి విశ్రాంతి తీసుకుంటున్నాయి. శవాన్ని తీసుకుని వెళ్ళిపోయిన తరువాత ఇంట్లో వ్యాపించే నైరాశ్యంలాగ ఉన్నాయి. కత్తిరించిన గులాబీ మడులు. తోటమాలి ఇవాళ ఎండుటాకులు ఏరి పారవేయడానికి చాకళ్ళను పిలు చుకువచ్చాడు. తిరిగి గులాబీ చెట్లు కొత్తగా మొగ్గ తొడుగుతాయి. కొత్త మొగ్గలు చిరునవ్వులు చిందిస్తాయి.

కాని నా ప్రతిభ ఎలాగ మొండి గుర్రంలాగ ఆగిపోయిందిప్పుడు! రోజంతా గడిచిపోయింది కాని ఉద్రేక పరిచే ఒక్క పద్యం కూడా రాయలేకపోయాను.

ఒకప్పుడు ఈ బీబీ మీద ధ్యానంతో గజళ్ళు వరదలాగా పొంగుకొచ్చేవి. కాని ఇప్పుడామె, ద్రాక్ష గుత్తులన్నీ దింపేసుకున్న తరువాత ద్రాక్ష తీగలాగ, నిరర్థకమైపోయింది.

బీబీ కోసం నిరీక్షిస్తూ ఇరవై మూడు సంవత్సరాలైపోయింది. ఆయనలో అక్కడక్కడ ఎత్తు పల్లాలేర్పడ్డాయి. బీబీ ఇప్పుడాయన ప్రియురాలు కాదు, జగానికంతకీ యజమానురాలు అయి కూర్చుంది.

పెద్ద భవంతి, గొప్ప వంశ ప్రతిష్ట, వాహిద్ హుసైన్ ప్రేమపూర్వక ప్రవర్తన, రాషిద్ ఉన్నతిని కాంక్షించే ఉద్దేశ్యాలు, నలుమూలలనుంచి ఏడుస్తూ, దెబ్బలాడుకుంటూండే మనుమలు - మనుమరాళ్ళు.

ఇదంతా బీబీ దూరంగా నిలబడి ఆయన్ని కష్టపెట్టేందుకు ఇదంతా చేసినట్టు కనబడుతుంది.

ఎదురుగా పొగాకుతో నిండిన పైప్ ఉంది. ఆయన మాటిమాటికి విస్తృతమైన ఆకాశం కేసి చూస్తూ అయ్యో ఈ గాలిబ్ కూడా ఏదేదో అని చచ్చాడు - మాతమే - యక్ - షహరే ఆరజూ...!

చిందర వందరగా ఉన్న గజల్‌ని తీసి విసిరికొట్టారు, పైప్ తీసుకుని అంత్యానుప్రాసకై ప్రాకులాడడం మొదలుపెట్టారు.

కుర్తా పూర్తి చేసి, ఆమె మౌనంగా ఉన్న వాహిద్ హుసైన్‌ని చూసింది.

మరుభూమిలో పెట్టిన అంటులాగ ఉండేది బీబీ ఈ ఇంట్లో.

ఇరవై మూడు సంవత్సరాలు గడిచినా ఆమె ఈ ఇంట్లో స్థిరపడ లేకపోయింది. ఏదో ఒక రోజు పంజరం తలుపు తెరుచుకుంటుంది. తాను ఎగిరిపోయి పుష్పభరితమైన శాఖమీద కూర్చుంటాననే విశ్వాసంగల పక్షిలాగ ఉండేదామె ఈ ఇంట్లో.

బీబీ తండ్రిగారు వాహిద్ హుసైన్ మహల్లో గుమాస్తాగా ఉండేవారు. గుమాస్తాగిరీ వెలగబెట్టిన తరువాత బేగమ్ సాహిబాని తృప్తిపరచేందుకు బీబీ తల్లిచేత, అప్పడాలు, వడియాలు, ఊరగాయలు పెట్టించి తీసుకువెళ్ళేవారు. తన యజమానులని సంతోషపరచడం అన్నది ఆయన రక్తంలో జీర్ణించుకుపోయింది. అందుకని ఐవానే గజల్‌లో ఆయనకి మంచి గౌరవం లభించేది. ఏవైనా శుభకార్యాలు కనుక జరిగితే బాధ్యతాయుతమైన పనులన్నీ ఆయనకు అప్పచెప్పేవారు. మహలులోని బేగమ్‌లు అత్తలు, సవతులకు తెలియకుండా దొంగచాటుగా నగలు, లేక బట్టలు కొనుక్కోదల్చితే ఈ గుమాస్తాగారే తెచ్చి ఇచ్చేవారు. ఇలాంటి పనులు చేసినప్పుడు మోసంతో బేడో - పావలానో మిగుల్చుకుని ఆయన ఇంటికి

వెళ్ళినప్పుడు తన ఏకైక పుత్రికకి మహాళ్ళలో డాబు దర్పాలకు సంబంధించిన ఆశ్చర్యకరమైన కథలు వినిపించేవారు. బీబీ పుట్టడమైతే గుమాస్తాగారి పూరింట్లో పుట్టింది. కాని కథలలో చెప్పుతునే మహాళ్ళలో నివసించే రాజ కుమార్తెల వంటి సౌందర్యం గలది. ఆమెను చూసినవారంతా సమ్మోహితులయేవారు. కాని తన కుమార్తెను చూసినప్పుడు ఆయన భయపడిపోయేవారు. స్త్రీజాతి! అందులో ఇంత అందమైనది.

'అల్లాయే దీన్ని గట్టెక్కించాలి!'

ఈ మహాలుకి సంబంధించిన అన్నదమ్ములిద్దర్నీ గుమాస్తా బాగానే ఎరుగడంచేత తన భార్యాబిడ్డల్ని ఎప్పుడూ మహల్‌లోకి తీసుకు వెళ్ళలేదు.

ఐవానే గజల్‌లో ప్రతిరోజు రాత్రి ఐదు సేర్లు మాంసం వండుతారని చెప్పినప్పుడు బీబీ ఆశ్చర్యపడిపోయేది. తమ ఇంట్లో నెలల తరబడి అర్ధపావు కూడా వండుకునేవారు కారు. మహాళ్ళలో జరిగే అన్యాయ - అత్యాచారాల గాథలు విని వణికిపోయేదామె.

బీబీ పసి హృదయంలో, నవాబులన్నా - జాగీరులన్నా భయంతో పాటు విపరీతమైన అసహ్యం పెరగసాగింది. ఒకేసారి నలుగురేసి భార్యల్ని కట్టుకోవడమేకాక పనిపిల్లలు, బానిసపిల్లలు, ఉంపుడు కత్తెలు కూడా ఉండేవారు. వారిళ్ళలో సంతానం పట్ల ప్రేమ రక్త సంబంధమైన ప్రేమకాక స్వార్ధపూరితమై ఉండేది. బీబీకి వారంటే ఎంత అసహ్యమో, ఆ కథలు - గాథలుకి సంబంధించిన ఏదో ఒక మహల్‌ని ఒకసారి చూసి రావాలన్న గాఢమైన వాంఛ కూడా ఉండేది. కాని ఆమె కోరికని తండ్రి ఎప్పుడూ త్రోసిపుచ్చేవారు. ఆమెకి పదునాలుగు సంవత్సరాల వయసు వచ్చేసరికి ఒక పోలీసు కానిస్టేబుల్ వద్ద నుంచి వర్తమానం వచ్చింది. భార్య సలహా మేరకు తండ్రి ఒకనాడు కూతుర్ని దేవిడీలోకి తీసుకువెళ్ళారు. ఆ పిల్లచేత బేగమ్ సాహిబాకి సలామ్ చేయించి పెళ్ళి మాట చెప్పి ఏదైనా బహుమానం పొందుదామన్నది ఆయన ఆశయం.

ఈ విధంగా భయపడుతూ, వణుకుతూ, దిగులుగా బీబీ ఒకనాడు ఐవానే గజల్‌లో అడుగుపెట్టింది. తెల్లకారక పైజమా, గులాబీరంగు దుపట్టి, కుర్తా పొడవాటి జడతో ఆమె లోపలికి వెళ్ళింది.

వాహిద్ హుసైన్ మేనత్త నమాజు చెయ్యడానికి కూర్చుంది, కానీ ఎదురుగా సూర్యకాంతితో మెరిసిపోతున్న పిల్లని చూసి లేవవలసి వచ్చింది. ఇలాహీఖైర్... ఈ పిల్లని భద్రంగా ఇంటికి చేర్చు. మేనత్తకి గుమాస్తా తెలివి చూసి ఏడుపొచ్చింది. గులాబీ మొగ్గలాంటి... ఈ పిల్లనిక్కడికెందుకు తీసుకువచ్చాడు? అహమద్ హుసైన్, వాహిద్ హుసైన్ అచ్చోసిన ఆంబోతుల్లా తిరుగుతున్నారు. వారి ప్రేమ వ్యవహారాలకి ఇంట్లోవారు విసిగిపోయారు. అహమద్ హుసైన్ తమ వంశంలోని వారిలాగ కవిత్వాన్ని చేబట్టలేదు. కనుక అతడు బెస్త, మాదిగ స్త్రీలను కూడా పట్టుకొచ్చేవాడు. ఇంట్లోని బానిస, దాసి పిల్లలు సరేసరి, కాని వాహిద్ హుసైన్ షాయర్ కనుక అందరి ప్రాణాలు ఇబ్బందుల పాలయేవి. పెద్ద హజరత్‌కి, ఈ ఇద్దరికీ ముక్కుతాళ్ళు బిగించడమెలాగా అని చాలా బెంగగా ఉండేది. ఇంట్లోని పెద్దవాళ్ళు, స్త్రీలతో కలసి ఆయన గంటల తరబడి తల పగులకొట్టుకునేవారు. కాని ఒక చోట వంశం తక్కువదైతే, వేరొకచోట కట్నం తక్కువ లభించే పరిస్థితి...!

రెండవ గదిలో వాహిద్ హుసైన్ తిరుగుతూన్నారు. ఆయన తన మేనత్త కూతుర్ని, తన స్నేహితురాలైన జిమానీ బేగమ్‌ని పిలిపించమని, వేధిస్తున్నారు.

'చాలు, చాలు! ఇక వేధించవద్దన్నయ్యా. ఆమె తల్లి జమానీకోసం మంచి సంబంధం వెతుకుతూంది. పాపం ఆ పిల్ల జీవితమెందుకు పాడు చేస్తారు.'

కొద్ది నిమిషాల తరువాత ఆయన సోదరి పరదా దగ్గరకొచ్చి 'భాయీ పాషా... ఇలా రండి, కొంచెం తొంగి చూడండిక్కడి నుంచి. మీరు ఇంత అందమైన పిల్లనెప్పుడైనా చూశారా?'

వాహిద్ హుసైన్ పరదా కొన ఎత్తి చూశారు. ఎదురుగా నేలపైన, జోళ్ళదగ్గర వజ్రపు తునక లాంటి అమ్మాయి మెరిసిపోతోంది. తలపైన దుపట్టా జాగ్రత్తగా వేసుకుని ఏదో విచిత్ర వస్తు ప్రదర్శనశాల కొచ్చినట్టు, కళ్ళు పెద్దవి చేసుకుని నలువైపులా చూస్తూంది.

వాహిద్ హుసైన్ ఆ అందాన్ని చూశారు. చలన చిత్రంలోని బొమ్మలు హఠాత్తుగా ఆగిపోయినట్టు నిశ్చలంగా ఉండిపోయారు.

కొద్ది నిమిషాలు గడిచిపోయాయి. ఆయన సోదరి కంగారుగా, భాయీ పాషా తొలగిపోండి. అక్కడ ఒకర్తె ఉంది. అంటూ కొంచెం ముందుకు వచ్చి, వాహిద్ హుసైన్ సమ్మోహనంగా ఆ పిల్ల కళ్ళను కూడా ఎక్కడ చూస్తారో అని, బీబీకి అడ్డుగా నిలుచుంది.

తరువాత తలుపు మూసి ఆయనతో అంది, 'గుమాస్తాగారి అమ్మాయి వచ్చింది. పాపం బీదవాళ్ళు, కనుముక్కు తీరెంత బాగుందని!' తాను చేసిన తప్పుకి కంగారుపడి బీబీ ప్రత్యేకతని కొంచెం తగ్గించాలన్న ఉద్దేశ్యంతో అలాగంది ఆమె.

కాని వాహిద్ హుసైన్‌కి ఏమీ వినబడలేదు. తాను గుడ్డివాడైపోయానేమో అనిపించిందాయనకి. ఆయన కళ్ళముందు ఎలాంటి మెరుపు మెరిసిందంటే, ఇప్పుడు నలుదిశలా అంధకారం అలుముకున్నట్లయింది. ఇటువంటి ఘోరాంధకారంలో జమానీ బేగమ్ ఏమిటి, ఎక్కడి వేశ్యలు. 'వాహిద్ హుసైన్ రాత్రంతా అశాంతితో తిరుగుతూ గడిపారు. గుమాస్తాగారి అమ్మాయిని ఎట్టి పరిస్థితులలో ఎలాగైనా సరే పొంది తీరాలన్న గట్టి ప్రయత్నం చేస్తారనుకుంది ఆయన చెల్లెలు. కాని అక్కడ మౌనం వ్యాపించి ఉంది. తిండి-తిప్పలు లేవు. స్నేహితులతో కేరింతలు, ప్రతి శనివారం రాత్రి ముషైరాలో వినబడే కేకలు... అన్నివైపులా మంచు కప్పేసినట్టుంది. ఐవానే గజల్‌లోని షాయర్లందరూ ఏ ప్రేయసికై నిరీక్షిస్తూ కవిత్వం చెప్పారో, ఆ ప్రేయసి ఈమే' అన్న భావన కలిగింది, వాహిద్ హుసైన్‌కి, తాను ఈమె ధ్యానంలోనే మునిగిపోయాననుకున్నారు. వాహిద్ హుసైన్ మేనకోడలు బీబీ సహాధ్యాయిని కనుక ఆయనకు సాయపడదామని ప్రయత్నిస్తే విచిత్రమైన వార్తలు అందసాగాయి.

ఆమెకు సవతులంటే అసహ్యం. నవాబులు జగీర్దారులంటే ఆమెకు పరమ అసహ్యం. ఆమెకి దేవిడీలలో ఉండటం అస్సలు నచ్చదు. నవాబుల్ని నమ్మడానికి లేదు. వారు కొద్ది రోజులలో మారిపోతారు.

కవిత్వమామెకు అర్థం కాదు.

వాహిద్ హుసైన్ ప్రతిరోజు ఒక కొత్త విషయం తెలుసుకునేవారు, ఆయన కోరిక ఇంకా ప్రజ్వరిల్లేది. తన దృష్టిలో ఆయన పూర్తిగా ఫర్హాద్ అయిపోయి, పాలకాలువ ప్రవహింపజేయడానికి సిద్ధమైపోయారు. ఇటు

ఆయన తండ్రిగారు 'దాగ్' సహవాసులతో గజళ్ళు వినిపిస్తూ, వాహిద్ హుసైన్, అహమద్ హుసైన్‌ల సంబంధాల గురించి ప్రయత్నిస్తుండేవారు. చిట్టచివరికి ఐదువేల రూపాయల రొక్కానికి ఆశపడిన గుమాస్తాగారు కరిగిపోయారు. ఐవానే గజల్‌లోని పెద్ద హాలు బైతుల్ గజల్‌లో బీబీ పెళ్ళి కూతురై దర్శనమిచ్చింది. వివాహ విషయంలో అంగీకారం తెలుపవలసి వచ్చినప్పుడు, బలవంతులైన నలుగురు వనితలు ఆమె మెడ పట్టుకుని ఒప్పుకున్నట్టు ఇటు అటు కదిలించేసరికి ఆమె స్పృహ తప్పి పడిపోయింది. పెళ్ళి కొడుక్కి మారుగా హకీమ్ ఆమెను మొదటిసారి చూశారు. ఇటు వాహిద్ హుసైన్ తండ్రిగారి స్థితి దారుణంగా ఉంది. తమకు నచ్చిన, స్త్రీలనెందరినైనా నవాబులు చాటుగా పెళ్ళాడవచ్చు. కాని మొదటిసారి సెహోరా[1] జలవే[2]ల పెళ్ళి కూతురు ఏదో ఒక గొప్ప వంశానికి చెందిన గౌరవనీయురాలైన అమ్మాయి అయి ఉండేది. బీబీ అత్తగారు స్వయంగా చెప్పిన విషయమేమంటే, బీబీ విపరీతమైన భయంతో రేయింబవళ్ళు విలపించేది. ఏదో ఒకనాడు తనని ఏ గోడలోపల్లో పెట్టి, గోడ కట్టించేసి వాహిద్ హుసైన్ మరొక పెళ్ళి చేసేసుకుంటారని ఆమె భయపడేది. ఆమె హృదయపూర్వకంగా వాహిద్ హుసైన్‌ని ఎప్పుడూ తన భర్తగా భావించలేదు. తనని బలవంతంగా మహలులోకి తీసుకొచ్చిన ఆయన్ని ఒక పట్టుదలగల దోపిడీదారుగానే భావించిందామె. తప్పించుకు పోగలిగిన మార్గాలన్నీ మూయబడ్డాయి. కనుక ఒక మంచి నడవడికగల ఖైదీలాగ బీబీ ఆ ఇంట్లో కాలం గడపసాగింది. ఆమె కళ్ళు మూసుకుని, తలవంచుకొని కూర్చుండెన్నో నెలలు. అత్తగారు ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళిపోయేది.

వాహిద్ హుసైన్ ఏది చెబితే అది ఒప్పేసుకునేది. ఐవానే గజల్‌లో బిరియానీ తింటే ఆమెకి వికారంగా ఉండేది. నగలు ముళ్ళవలె గుచ్చుకునేవి. బనారస్ చీరలంటే భయం కలిగేది.

ఆదేశాల్ని అమలు జరిపితే ఎవరికి నచ్చదు? కాని వాహిద్ హుసైన్‌కి

---

[1] వివాహకాలంలో తలకి కట్టే పూలదండలు.

[2] పెళ్ళి కూతురి ముసుగు తొలిగించి చూపడం.

భార్య మౌనం భీతిగొల్పేది. కనుక ముష్టివాడిలాగా రకరకాల రుచులు ఆనందాన్ని పొందే వాహిద్ హుసైన్ చెవులు పట్టుకుని ఊరుకున్నారు.

వస్తూనే జరీ చీరలు, వజ్రాలు, ముత్యాల నగలలో బీబీ మునిగిపోయి ఉంటే ఆయన కూడా ఆమె వల్ల తృప్తులై మరొక వైపు దృష్టి మరల్చేవారు. కాని బీబీ గజళ్ళలో ప్రేయసి వంటిది. ఆమె సుగంధం వలే నలువైపులా వ్యాపించి ఉంది. వాహిద్ హుసైన్ ఆ పరిమళాలను అనుభూతి చెందేవారు కాని స్పృశించలేక పోయేవారు. ముగ్గురు బిడ్డల తండ్రి అయినప్పటికీ బీబీ నేటికి అపరిచితురాలిలాగే అనిపించేది ఆయనకి.

రాషిద్ పెరుగుదల ఆయన చింతలను పెంచింది. బషీర్, బతూల్‌ల చిలిపి అల్లర్లు పెరగసాగాయి. బీబీ ముఖంలో మెరిసే కాంతి సన్నగిల్లింది. ఒకనాడు బీబీ తన చేతులతో రాషీద్ తలపైన సేహారా కట్టింది. బషీర్ బేగమ్‌ని పెళ్ళి కూతుర్ని చేసింది. చిన్నారి షాహీన్‌ని గుండెల కదుముకుని తన ప్రతి ఓటమిని మరిచిపోవడానికి ప్రయత్నించింది.

ఈ ఇరవైమూడు సంవత్సరాల విస్తృత కాలంలో ఆయనతో బీబీ ఎప్పుడూ ఫిర్యాదు చెయ్యలేదు, జగడమాడలేదు. వాహిద్ హుసైన్ ప్రతి మాటనీ ఆమె ఆమోదించింది. ఆ వంశపు పెద్దలు, పిన్నలు, అందర్నీ సంతోషపెట్టింది. ఎవరి విషయాలలోనూ తలదూర్చలేదు. ఐవానే గజల్ తలుపులు, గోడలు ఆమె కంఠాన్ని చాలా తక్కువగా విన్నాయి. ఆమె ఒక గుడ్డ బొమ్మలాగ వాహిద్ హుసైన్ చేతులలో ఆడుతూంది, కాని నేటివరకూ, ఆమెకు క్యారెట్ ఇష్టమో లేక ముల్లంగి ఇష్టమో, తీపి పదార్థాలు ఇష్టంగా తింటుందో లేక పుల్లటి పదార్థాలో ఎవరికీ తెలియదు.

ఎంత ద్వేషంకల స్త్రీ ఆమె. ఆమెకు జగీర్దారులంటే అసహ్యం అని ఎవరో అన్న విషయం నిజం. ఆమెకు దేవిడీలో ఉండడం ఇష్టంలేదు. ఆమె వెనక్కు తగ్గిన కొద్దీ, ఆమెను పొందాలన్న కోరికతో ఆయన వెంటాడజొచ్చారు.

అందుకనే ఈ బాధించే ప్రేయసిని వర్ణిస్తూ ఏడు నోట్‌బుక్‌లను నలుపుచేశారు.

కాని బీబీ నేడు కూడా ఎంతో హాయిగా కూర్చుని మనుమల బట్టలు కుడుతూంది. ఆమె ప్రపంచానికి సంబంధించిన ప్రతి సమస్యకీ నవ్వేది,

మాట్లాడేది. కాని ఇంటికి సంబంధించిన అతి ముఖ్యమైన సమస్య, దానితో తనకేమీ సంబంధం లేనట్టు మౌనం వహించేది. ఆమె వాహిద్ హుసైన్ తీవ్ర వాంఛలను భరించింది, అకస్మాత్తుగా వచ్చిపడిన ఆయన వార్ధక్యాన్ని సహించింది. కాని వాహిద్ హుసైన్‌ని తనవాడిగా భావించి మాట్లాడలేదు.

మీ తాతగారు... మీ నాన్నగారు... మీ తమ్ముడు... మీ ముత్తాత... ఆమె వాహిద్ హుసైన్‌ని ముక్కలు ముక్కలుగా చేసి ఇతరులకప్పజెపుతూ వచ్చింది!

వాహిద్ హుసైన్ నిట్టూర్చి మళ్లీ పైప్ వెలిగించారు.

నేడు హజరత్ బాగ్ గారింట్లో ప్రతినెలా జరిగే ముషైరా ఉంది. అందులో మొత్తం హైదరాబాదులో ఉండే ప్రముఖ షాయర్లందరూ కలుసుకుంటారు. 'ఫానీ' బదాయూనీ, 'జలీల్' మానక్‌పురీ మొదలుకుని, నడుముకి కత్తీ, తలపైన పగిడీ కాళ్ళకి సన్నని పైజమాలు వేసుకున్న దేవిడీలలోని షాయర్లవరకు అంతా కలుస్తారు.

ఈ రోజే వాహిద్ హుసైన్ గజల్ పూర్తికావడం లేదు.

వాహిద్ హుసైన్ 'దాగ్'ని అనుకరించేవారు కాని ప్రస్తుతం గంభీరమైన సమస్యలపైన వ్రాయడం మొదలుపెట్టారు. ఇకబాల్ రచన 'బూగేదరా' అచ్చయింది. టాగూర్ మెల్లగా మానవుడు - స్నేహం, వేదాంతం వంటి విషయాలపై పాటలు పాడడం ప్రారంభించాడు. సాధారణంగా షాయర్లు స్వయంగా 'అమీర్', 'మీనాదూ', 'చక్‌బస్త్', 'ఇకబాల్'ని అను కరించసాగారు.

ఉత్తర భారతదేశంలో 'హాలీ' తన ముసద్దస్ (విశిష్టమైన కవిత) వినిపించడం జరిగిపోయింది. మహమ్మదీయుడి కళ్ళు చెమర్చాయి, భావోద్రేకం కలిగింది. ఇప్పుడు ఎటుచూసినా 'ఇకబాల్' ప్రబోధలు ప్రతిధ్వనిస్తున్నాయి.

'ప్రియా నీవు ఒప్పుకోవడంలేదు, నల్లని మేఘాలు కమ్ముకుంటున్నాయి, నా హృదయం ఉప్పొంగుతూంది,' అని పాడే కవ్వాలీ గాయకులు, ' ఓ అనాగరిక బానిసా, ఎక్కడుంది నీ గమ్యం' అది ఆలాపించడం ప్రారంభించారు. ప్రేమ్‌చంద్, 'సోజేవలన్' దగ్ధం అయిపోయింది. దానివల్ల ప్రజ్వరిల్లే నిప్పుకణాల సెగకి భారతీయుల హృదయాలు రగులు

కుంటున్నాయి.

వాహిద్ వార్తాపత్రికలో జలియన్ వాలాబాగ్‌లో జరిగిన సామూహిక హత్యాకాండకు సంబంధించిన వార్త చదివి వణికిపోయారు. జన్మభూమికై ప్రాణాలర్పించిన బాధలెన్నో విని ఉన్నారాయన కానీ యువతరం భావాల అనుభూతి పొందలేకపోయారు. భగత్‌సింగ్ తోటివారికి ఎవరో ఒక ప్రేయసి లేకపోయిందా? వారు మారుతున్న ఋతువుల సమ్మోహన శక్తిని అనుభవించలేదా? స్త్రీ సౌందర్యం, గీతాల ఆకర్షణ, షేర్ ఆనందం, తమ ఇంట్లో ఉండే శాంతి - జీవితంలో ఎన్ని రంగులు ఉన్నాయి, ఎన్ని బంధాలున్నాయి! వాహిద్ హుసైన్ యాభై ఐదు సంవత్సరాలకు మించిన ప్రాయం ఉన్నా, చావాలన్న కోరిక లేదు. ఆయనకి మృత్యువు పేరు వింటే భయం వేసేది. దేశం కోసరం కూడా ప్రాణాలు పోగొట్టుకోవచ్చునా?

దేశ స్వాతంత్ర్యం కోసం వందలాది ప్రజలు ప్రాణాలను కోల్పోయారు. ఈ భారతదేశం ఎప్పుడు స్వేచ్ఛగా ఉంది? మొట్టమొదట ఆర్యులు ఎక్కడినుంచో అడవులలో తిరుగుతూ తిరుగుతూ దేశంలో ప్రవేశించారు. తరువాత మహమ్మదీయులు దేశాన్ని అస్తవ్యస్తంగా చేసేశారు. ఇప్పుడు ఆంగ్లేయులు కైవశం చేసుకున్నారు. ఆంగ్లేయులు వెళతారు, కాంగ్రెస్ రాజ్యం ఏర్పడుతుంది. తరువాత కొంతమంది కమ్యూనిస్టులుగా ఉద్భవిస్తారు. ప్రజల సమాన హక్కులు, ప్రజాస్వామ్యం ఈ విసిగించే విషయాలనుంచి విముక్తి కలిగించే త్రోవ ఏది? ప్రజలు నిజంగా హాయిగా స్వేచ్ఛగా జీవించగలిగే ఆ మార్గం ఏమిటి?

స్వాతంత్ర్యపరమైన ఏకాగ్రత, ఏదైనా దేశానికో జాతికో సంబంధించినది కాకుండా కేవలం జాతుల మధ్యగల ప్రతిభాపరమైన హెచ్చు తగ్గుల మీద ఆధారపడిందని తోచేది ఆయనకి.

రెండు ప్రాయాల భేటీ, రెండు ప్రతిభల మధ్య విరోధం, కనుకనే గాంధీగారు రూపొందించిన కాంగ్రెస్ రాజ్యాంగ విధానం నెహ్రూ దగ్గర అధికారం కొత్త మలుపు తిరిగింది. భగత్‌సింగ్ యౌవనం మృత్యువుని ఎలుగెత్తి పిలుస్తూంది. వాహిద్ హుసైన్ పేపరులోని ప్రాంతీయ రాజకీయాలలోని మార్పులు మాత్రం గమనించేవారు. నిజానికి హైదరాబాదులో వెలువడే ఉర్దూ దిన పత్రికలలో బ్రిటిష్ ప్రభుత్వపు

ప్రాంతీయ స్వేచ్ఛ, పార్లమెంటు పాలనకి సంబంధించిన ప్రకటనలు మొదలైన వాటికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు కారు. కొత్తతరానికి నాయకుడైన నెహ్రూ పండితుడు, ఫాసిజమ్ వల్ల పెరుగుతున్న అపాయాన్ని గురించి ఏమైనా అంటే, ఆ వార్త పత్రికలో ఏదో ఒక మూల చోటు చేసుకునేది.

వార్తా పత్రికలపై గట్టి ఆంక్ష ఉండేది. రాజకీయ పార్టీ తల ఎత్తింది. ప్రజలు ఆలా హాజరత్ ఎడల భక్తి ప్రపత్తులు కలిగి ఉండేవారు, ఈ ఎస్టేటు చిరకాలం వర్ధిల్లాలని ప్రార్థించేవారు. హైదరాబాదులో కలిసి మెలిసి ఉండే సంస్కృతికి పునాది వేసినవాడు కులీకుతుబ్‌షా. ఆయన భాగమతిని మహారాణి చేసి, హిందూస్తానీ వేషధారణతో, హిందువుల పండుగలు జరిపి, తెలుగులో కవిత్వం చెప్పి హిందుస్తానీ సభ్యతా సంస్కృతులను కలపడానికి తెలివైన ప్రయత్నమేమీ చెయ్యలేదు. కానీ తన చుట్టుపట్ల ఉన్న సంస్కృతిలో లీనమయిపోయాడు.

నేడు కింగ్ కోఠీలోని ఒక చెదలు పట్టిన కుర్చీలో మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ కూర్చుని ఉన్నారు. మాసిపోయిన పైజమా, పాతరంగు వెలసిపోయిన షేర్వానీ, బాగా మాసిపోయిన టోపీ పెట్టుకున్న ఆయన ఒక పెద్ద యూనివర్సిటీ కోసం ఎన్నో లక్షల ఖర్చుతో ఒక ప్రణాళికను రూపొందిస్తున్నారు. ఈ విశ్వ విద్యాలయంలో ఆయన ప్రజ తమ మాతృభాషలో జ్ఞానాన్నంతా ఆర్జించుకోవాలన్నది ఆయన అభిలాష, తాను సింహాసనాన్నధిష్టించనున్న రోజు క్రింద పడిపోయిన పావలా వెతికేందుకు ఒక గంట కాలాన్ని వెచ్చించారు నవాబ్. జాగీర్లు ఉద్యోగాలు బిరుదులు ఇచ్చేటప్పుడు హిందువులు, మహమ్మదీయులు అని ఆలోచించలేదు. హైదరాబాదులోని బ్రాహ్మణులు షేర్వానీపై తుర్కీ టోపీ పెట్టుకునేవారు, ఉర్దూ దినపత్రిక చదివినంత మాత్రాన వారి మతానికి హాని కలిగేది కాదు.

చాలామంది హిందూ స్త్రీలు దేవిడీలలో బేగమ్‌లైపోయారు, కాని హిందువుల స్వాభిమానం దెబ్బతినలేదు. అమ్మవారు వ్యాపిస్తే ముస్లిమ్ స్త్రీలు దానికి మొక్కుబడులు చెల్లించేవారు. దర్గాల్లో ఉర్సు జరిగినప్పుడు హిందువుల తరఫునుంచీ వస్తువులు, తినుబండారాలు వచ్చేవి. బీబీకి

ఆలమ్ సందర్భంగా మహమ్మదీయుల కంటే ఎక్కువగా హిందువుల తరఫునుంచే చల్లని పానీయాల ఏర్పాట్లు జరిగేవి. వెండి చంద్రుడు, పంజాలు అర్పించడం జరిగేది. రమ్‌జాన్ సందర్భంగా మసీదులకి ఇఫ్తారా (ఉపవాస విరమణకై ఉపయోగించే ఖాద్య సామగ్రి) హిందువులు పంపేవారు.

ఎస్టేటులోని ప్రతి మహమ్మదీయుడికీ తెలుగు వచ్చు. హిందువుల పిల్లలంతా ఉర్దూ మీడియంలో చదువుకునేవారు, కాని మాతృభాషకి హాని జరుగుతుందేమో అన్న భయం వారికి ఉండేది కాదు. విశ్వాసపరమైన ప్రతి పువ్వును కాల్చివేసే అనుమానం అసహ్యం అనే అగ్ని వారి హృదయాలలో ఇంకా రగుల్కొనకపోవడమే ఇందుకు కారణం.

హైదరాబాదు పురవాసులకి శతాబ్దాల తరబడి లభించిన ప్రతిభ, శారీరక శాంతి భద్రతల కారణంగా బద్ధకం, అజాగ్రత్త, అలసట అలవడ్డాయి. హైదరాబాదులో సామాన్యంగా ప్రతి ఇంట్లో 9 గంటలకి తెల్లవారేది.

ఒకసారి ఉత్తర భారతదేశం నుంచి వచ్చిన ఒక షాయర్ ఒకానొక సందర్భంలో వాహిద్ హుసైన్‌తో పరాచికాలాడుతూ అన్నారు, 'మిత్రమా, మీ జాగిర్దారులు హైదరాబాదులో కేవలం మూడు పనులు మాత్రమే చేశారు - బిరియానీ తిన్నారు, దేవిడీలు కట్టించారు, మనువు జాతిని పెంపొందించారు.'

ఇది విని వాహిద్ హుసైన్ విరుచుకుపడ్డారు. వారు శుద్ధమైన దక్కనుకు సంబంధించినవారు. బయటినుంచి వచ్చే ఈ షాయర్లు, మాటి మాటికీ దక్కను సంస్కృతిని హేళన చేసేవారు. ఆయనకి వారి విమర్శ విని వళ్ళు మండేది. షుమాలీ హింద్ ఉర్దూని షాయరీ అనుకునేవారు. అక్కడి సభ్యతని, జ్ఞానాన్ని ప్రామాణికంగా భావించేవారు. కోపంతో ఆయన ఆ షాయర్‌తో అన్నారు, లేదు! మేమింకో పనికూడా చేస్తూంటాము. గుమ్మం దగ్గరకొచ్చి అడుక్కునే వాళ్ళకి దాన ధర్మాలు చెయ్యడం.

ఆ షాయర్ దీనికి పెద్ద - పెద్ద అర్థాలు తీసి చాలా దూరం తీసుకువెళ్ళారని వినికిడి. కిషన్ ప్రసాద్ ఉన్నతి కాలమది. ఆయన తన మహల్‌లో జరిగే ముషైరాలో గజల్ వినిపించేవారు.

నేను హిందువుని, నేను తురకని,

ప్రతి మతం పైన నాకు విశ్వాసం.

ఆయన గంగా - యమునల సంగమం వంటి సభ్యతా - సంస్కృతులపై అధికారాన్ని వ్యక్తం చేసేవారు. ఆయన తను హిందువు, తను తురకవాడు కూడా అనేవారు. షుమాలీ హింద్ సభ్యతని, కవిత్వాన్ని గౌరవించేవారు. దక్కను సభ్యత చూసుకుని గర్వపడేవారు. దక్కను సభ్యత - సంస్కారాల్ని ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళడంలో గొప్ప పాత్ర వహించారు. ఆయన సన్నని కంఠం పొట్టి శరీరం, మృదువైన పద్ధతులలో ఒక విధమైన సమ్మోహన శక్తి ఉండేది. అది చూసి, ఠక్కున సమాధానం చెప్పగల కుట్రలు పన్నగల తెలివితేటలు కలవారు కూడా వణికిపోయేవారు. కాని వాహిద్ హుసైన్‌కి పద్ధతి ఎప్పుడూ నచ్చలేదు.

తత్ఫలితంగా ఆయన హుజూర్ దగ్గర ఉండే జానీ సాహబ్‌తో ఒక బృందం తయారుచేశారు. అది బయటినుంచి వచ్చే ప్రతి కవి, పండితులకు, కిషన్ ప్రసాద్ వేలసార్లు సిఫార్సు చేసినా, ప్రయత్నించినా, హుజూర్ వారి హృదయంలో స్థానం లేకుండా చేసే ప్రయత్నంలో మునిగి ఉండేది. వారు ఎలాగోలాగ అక్కడికి చేరుకోగలిగినా వారి మొరలాలకించే వారెవరూ ఉండేవారు కాదు. రెండు, మూడు సంవత్సరాలిలాగ చేతులు, కాళ్ళు ఝాడించి ప్రయత్నించి చివరికి ఒక రోజు హజరత్ బాగ్‌లో జరిగే ముషైరాలో బాధపడుతూ గజల్ వినిపించేవారు.

'ఫానీ' మేము గోరీ - కఫన్ లేని జీవచ్ఛవాలం పరదేశం అచ్చి రాలేదు,

స్వదేశం వీడిపోయింది, పరదేశం అచ్చిరాలేదు.

ఈ విధంగా ఎంతోమంది షాయర్లపై క్రోధం వ్యక్తం అయింది. మరికొంతమంది పరిస్థితులను అవగాహన చేసుకొని కవులకు ప్రతిచోట, భూమి గట్టిగా, ఆకాశం దూరంగా ఉంటుందని గ్రహించి పారిపోయారు.

వాహిద్ హుసైన్ సపోటా చెట్టుకింద కూర్చుని ఏవేవో ఆలోచిస్తున్నారు.

గజల్ తయారవడమే తరువాయి. వెంటనే బైతుల్ గజల్ పెద్ద హాలుని ఊడవడం శుభ్రపరచడం ప్రారంభమయ్యేది. కుర్చీలు తొలగించి, తెల్లటి చాందినీ పరచేవారు. మధ్యలో అధ్యక్షుని కార్‌చోటీ, మసనద్ వేసేవారు. ఒక పెద్ద దీపమో లేక పైన ఉన్న దీపగుచ్ఛం వెలిగేది. అగరువత్తులు

వెలిగేవి. వెండి పళ్ళేలలో వెండి అంటించిన కిళ్ళీలు, వెండి ఉగాల్‌దాన్, మంచి టీ, తీపి పదార్థాలు, బిస్కెట్లు, నమకేన్ బాదామ్ అన్నీ సిద్ధం అయేవి.

బైతుల్ గజల్ అలమార్లలో పెట్టబడిన వ్రాసేవాళ్ళ హస్తలిఖిత పాత పత్రాలు, పాడులిపులు, పుస్తకాలలో దాగిన బల్లులు, బొద్దింకలకు ఆ రాత్రి విశ్రాంతి లేకుండా ఇటు - అటు పరుగెత్తవలసి వచ్చేది. పొగడ్తల కేకలతో వాటికి నిద్రాభంగం కలిగేది. ఒక బల్లికి చాలా పట్టుదలగా ఉండేది - ఎప్పుడు వాహిద్ హుసైన్ గొప్ప షేర్‌కి వాహ్ - వాహ్ అన్న ధ్వనులు మిన్ను ముట్టినా అది - 'ఛ... ఛ... ఛ...!' అనేది.

పొద్దున్నే కర్ర తీసుకుని ఆయన బల్లుల్ని వేటాడడానికి బయలుదేరేవారు.

సగం అంటుకున్న పైప్ ఎదురుగా పెట్టి ఉంది, ఆయన ఆకాశం కేసి చూస్తూ...

అయ్యో ఈ గాలిబ్ కూడా ఏమేమి అని చచ్చాడో...!

ఆయన తన సగం రాసిన గజల్‌ని విసిరికొట్టారు, నోట్లోంచి పైప్‌తీసి తన చుట్టు-పక్కల ఉన్న ప్రపంచాన్ని గుర్తించసాగారు.

హాలులో ఎంతోసేపు ఆడుకుని చాంద్‌కి విసుగొచ్చింది. ఇక నారాయణని, సలేమ్‌ని తరిమేద్దామనుకుంది. చాంద్ ఎప్పుడూ ఆట మధ్యలో ఆపేసేది. ఇప్పుడు దొంగవ్వడం చాంద్ వంతు కనుక నారాయణ ఆట, నిలిపెయ్యడానికి ఒప్పుకోలేదు.

'చెప్పాను కదా, ఇప్పుడు నేనింక ఆడను? తన కత్తిరించిన జుట్టును ఒక దగ్గర చేర్చి రిబ్బనుతో కట్టుకోసాగింది. ఆమె జుట్టు పూర్తిగా బంగారు రంగులో ఉంది. గులాబీ రంగు బుగ్గలు కోపంతో ఎరుపెక్కాయి. ఆ ఎరుపెక్కిన బుగ్గలపైన మెరుస్తున్న జట్టుచూసి 13, 14 ఏళ్ళ నారాయణ ఎటువంటి భావోద్రేకానికి గురైయ్యాడో, మోహంతో ఆమె వద్దకు వచ్చి బుగ్గ కొరికాడు.'

'ఉయ్ అల్లా! బదమాష్... సిగ్గులేని వాడా...!' ఆమె గట్టిగా అరవడం చూసి భయపడిపోయిన నారాయణ కిటికీ వెనక దాక్కున్నాడు.

'ఏమైంది?... ఏమైంది...? ఇంటిల్లిపాదీ పరుగెత్తుకొచ్చారు.'

'నారాయణ చాలా తుంటరి కుర్రాడు... పోకిరీ...!' ఆ పిల్ల నవ్వుతూ

అన్నది.

'చేతులు విరక్కొట్టి పారేస్తానా బెస్తవాని సంతానాన్ని...!'

'నువ్విప్పుడు పెద్దదానివైపోయావు, చాంద్ పాషా! ఈడొచ్చిన మగ పిల్లల మధ్య ఆడవద్దు.' కుంటత్త బోధపరిచింది.

ఇది విని కిటికీ వెనుక దాక్కున్న నారాయణ తలెత్తి చాంద్‌ని వెక్కిరించాడు.

చాంద్ తిరిగి నవ్వుతూ, అతణ్ణి కొట్టడానికి పరుగెత్తింది.

'నారాయణేం చేశాడు చెప్పు.' రజియా అడిగేసరికి ఆ పిల్ల సిగ్గుపడిపోయింది. రజియాకి ఆమెకి చాలా స్నేహం. ఆమెని సంతోషపెట్టడానికే అందమైన గౌన్లు వేసుకుని రోజూ సాయంత్రం తాతగారింటికి వచ్చేది. రాషిద్ మామయ్య, అత్త ఆ పిల్లనెప్పుడూ తమతోపాటు అన్ని చోట్లకీ తీసుకువెళ్ళేవారు.

'ఛీ...!' ఆమె రెండు చేతులతో తన ముఖాన్ని దాచుకుంది. ఈ విధమైన భంగిమ లీలా ఛట్నీస్ వద్ద చూసి నేర్చుకుంది. సినిమాలు చూసి ఆమె చాలా విషయాలు తెలుసుకుంది. పది, పన్నెండు సంవత్సరాల ప్రాయంలోనే, తన అందం గురించి తెలుసుకోవడమే కాకుండా, తాను అసాధారణమైన పిల్లనని, భావించుకునేది. తన తాతగారు గొప్పవారు. తండ్రి సమర్థుడు. తాను గొప్ప అందగత్తె. కనుక వంశాచారపు బూజుపట్టిన పాత పద్ధతులకు భిన్నంగా తాను నడుచుకోవాలి. అశోక్ కుమార్ వంటి పోలికలు కల షహజాదా తనని గుర్రం మీదెక్కించుకుని తీసుకువెళతాడు.

రాషిద్ మామయ్య, స్ఫురద్రూపిగా ఉన్న అత్తయ్యని పెళ్ళిచేసుకుని తీసుకువచ్చిన తరువాత, వారిద్దరూ బాహ్య ప్రపంచాన్ని పట్టించుకోకుండా రేయింబవళ్ళు ప్రేమకలాపాల్లో మునిగి ఉన్నప్పుడు, చాంద్ దొంగచాటుగా వారి వ్యవహారాలను కనిపెట్టేది. అకస్మాత్తుగా ఆమెకి కూడా పెళ్ళి చేసుకోవాలన్న కోరిక కలిగేది. కాని ఒక దుస్సంఘటన ఆమెలో వివాహం పట్ల విముఖత, అసహ్యం కలిగించింది. అందంగా ఉండటం, షహజాదా లాంటి దుస్తులు ధరించే బతూల్ అత్త భర్త హృదయపూర్వకంగా నచ్చాడు. అతనెప్పుడైనా బతూల్ అత్తయ్యతో కలిసి వచ్చినప్పుడు ఏదో ఒక వంకతో అతని చుట్టూ తిరిగేది. అతను బతూల్ గదిలోకి వెళ్ళినప్పుడు, కుంటత్త

ఏదో ఒక సాకుతో ఆమెనక్కడి నుంచి బలవంతంగా తీసుకువెళ్ళేది.

ఒక రోజు ఆదారా తాగుమోతు షేఖూమియా వచ్చాడు. అతను కుంటత్త బంధువు. అలవాటు ప్రకారం బతూల్ అత్త అతనితో బాగా నవ్వుతూ వేళాకోళంగా మాట్లాడేది. షేఖూమియా నిత్యం ఒక మత్తు పానీయం మత్తులో మునిగి తేలుతూ తెగ వాడుతూండేవాడు. అందుచేత ఇంట్లోని పెద్దలు, పిన్నలు అతని చుట్టూ మూగేవారు. ఒకరు నీకు పెళ్ళి చేయిస్తాం అని మాటిచ్చి పైసలు గుంజుకునేవారు, కొందరూ సేంధా అని మోసంచేసి కిరోసిన్ తాగించేవారు. ఆ రోజు షేఖూమియా వెళ్ళిన తరువాత బతూల్ అతని ముందు అంతగా నవ్వుతూ పరాచికా లెందుకాడిందని ఆమె భర్త నానా గొడవ చేశాడు. ఇక ముందు బతూల్ అతని ముందుకు రాకూడదు అని ఆంక్ష విధించాడు. ఆనాటి నుండి హుమాయూన్ అంటే అసహ్యం వెయ్యడమే కాకుండా ఎప్పటికీ పెళ్ళి చేసుకోకూడదనే నిర్ణయించుకుంది. బతూల్ ఎదురుగుండా ఉంటే హుమాయూన్ని బతూల్ అత్త భర్త అని, వెనుక 'దరిద్రుడు' అని పిలుస్తూంది.

ఇతరుల మాటలు వినడం ఆమె స్వభావంకు వ్యతిరేకం. బషీర్ బేగమ్ ఎప్పుడైనా తన ఇష్టప్రకారం కుర్తా కుడితే, ఆమె తొడుక్కునేదే కాదు. ఆమె అంటే అందరికీ ఎంతో ప్రీతి, తాతగారు, ఆమె చేత ఇంగ్లీషు పద్యాలు, సినిమా పాటలు పాడించి, తన స్నేహితులకు వినిపించేవారు. తండ్రితోపాటు స్విమ్మింగ్‌పూల్‌కి, రైడింగ్ క్లబ్‌కి వెళ్ళేది. సాయంత్రం శ్యామలాదేవి దగ్గర శాస్త్రీయ సంగీతం నేర్చుకునేందుకు వెళ్ళేది. కాన్వెంట్‌లో ఏదైనా ఉత్సవం జరిగితే అద్దాలు కుట్టిన రంగురంగుల లంగా జాకెట్, చేతులకి రంగుల గాజులు, వేసుకుని చిన్న లంబాడీ వనితలాగ అభినయిస్తూ స్టేజ్ మీద డాన్స్ చేసేది.

పల్లెటూరెళ్తుంది మూగది
సాయంత్ర మొస్తుంది మూగది
తహసీల్దారు డేరా, పెద్ద ఊరి
దొరగారంటే భయం మూగదానికి
దొంగలంటే భయం మూగదానికి.

అప్పుడు కూడా ఊరికే కూర్చోవడమంటే విసుగనిపించి వరండాలోని కుర్చీలపై దొర్లడం మొదలెట్టింది. సపోటా చెట్టు క్రింద వంటరిగా కూర్చున్న తాతగారు ఏదో గంభీరమైన ఆలోచనలో మునిగి ఉన్నారు. తాతగారి షాయరీ అంటే చాంద్‌కి చాలా ఇష్టం.

ఆయన చేతులు చాచి, కనుబొమ్మలు విశాలంగా చేసుకుని గర్జిస్తూన్నట్టు షేర్ వినిపిస్తూంటే, తోటలో కూర్చున్న పక్షి తుర్రుమని ఎగిరిపోయేది. అప్పుడు మౌనంగా కూర్చున్న తాతగారి మొహం చూస్తే స్కూల్‌లో వేసిన ఒక డ్రామా జ్ఞాపకమొస్తూంది. అందులో 'కింగ్ లియర్' అచ్చు తాతగారిలాగే ఉన్నాడు - మంచి భారీ విగ్రహం, తెల్లటి శరీరఛాయ, అక్కడక్కడ నెరిసిన గడ్డంతోపాటు దిగులుగా ఏదో పోగొట్టుకున్నట్టున్న రూపం. అమాయకత్వం, అన్వేషణ, నిషాల్లో మునిగి ఉన్న వదనం. ముసలితనంలో అడుగిడిన మానవులంతా ఎన్నో కోల్పోతారు కాబోలు. దేని గురించో నిరీక్షణ? ఎవరెవర్ని పిలుస్తూంటారో!

తాతగారికి చాంద్ అంటే చాలా ఇష్టం. టిఫిన్‌లో గ్రుడ్లుతినేటప్పుడు దానిలోని తెల్లని భాగం చాంద్ కిచ్చేవారు. తాను తీసుకునే తియ్యని లేహ్యాలు, టానిక్కులు అన్నీ ఆమెకిచ్చేవారు. ఎప్పుడు పడితే అప్పుడు పళ్ళు కోయడం ఆయన కస్సలు నచ్చేదికాదు. కాని తోటలో తిరుగుతున్నప్పుడు చాంద్ పట్టుబడితే అప్పుడప్పుడు ఒకటో అరో నారింజకాయలు కోసిచ్చేవారు.

రంగు రంగులు పువ్వులు కోయడానికి మాత్రం ఎప్పుడు అనుమతి లభించేది కాదు. ఐవానే గజల్‌లో ఎంత విచిత్రమైన పువ్వులు పూసేవో! ఎవరో బుట్టలతో పువ్వులు గుమ్మరించినట్టుండేది. తాతగారు ఉదయం, సాయంకాలం ఆ పువ్వుల మధ్య తిరుగుతూండేవారు. ఒక్కొక్క కొమ్మని సరిగా చేస్తూ, నెమ్మదిగా, అవి వాడిపోవడమనే విచిత్రం చూస్తూండేవారు. దీనికి వ్యతిరేకంగా చాంద్ తాతగారింట్లో చెట్లమాట దేముడెరుగు, మనుష్యుల్ని కూడా పట్టించుకునే వారు కారెవరూ. ఇల్లంతా గొడవగా ఉండేదెప్పుడు. ఇంటి పనంతా పనివాళ్ళకు అప్పజెప్పడం వలన ఏ పనీ సవ్యంగా జరిగేది కాదు. చాంద్ అత్తలు, పిన్ని రేయింబవళ్ళు మేకప్‌లో, క్లబ్బులు, పార్టీలలో మునిగి వుండేవారు. పిల్లలు ఆయాల ఒడిలో

అరుస్తూండేవారు. చాంద్ తన తాతగారి నెత్తి నెక్కి ఆడుకుంటూ అక్కడ అల్లరి చెయ్యడం, కేకలెయ్యడం, ఆటపాటల మీద ఎటువంటి ఆంక్షలు ఉండేవి కావు. ఆమె తండ్రి ఎప్పుడూ స్నేహితులతో కలిసి తాగుతూ, గట్టిగా మాట్లాడుతూ ఉండేవారు. చాంద్, తండ్రి స్నేహితులంటే ప్రపంచంలోని కష్టసుఖాలని తమవిగా భావించేటటువంటివారు. ఎప్పుడైనా చాంద్ అటువైపు వెళితే రాజకీయాలు, గాంధీగారు, సోషలిజమ్, ఫాసిజం పేర్లు విని విసిగిపోయేది. హైదర్ ఆలీఖాన్‌ని పోలీసులు తీసుకుపోతారని తాతగారు చెప్పిన వార్త విన్నప్పటి నుంచి, ప్రపంచంలో ఏం జరిగినా, జరగనియ్యండి. మీరెందుకు పాల్గొంటారు అటువంటి విషయాలలో, అని తండ్రికి ఎన్నోసార్లు నచ్చచెప్పడానికి ప్రయత్నించింది చాంద్.

ఆమె తల్లి, తండ్రికి విరుద్ధంగా ప్రపంచంలోని సమస్త విషయాల పట్ల ఆసక్తి చూపేది. బషీర్ బేగమ్‌కి జీవితమంటే తగని ప్రేమ. ఒక దానిని మించి ఒకటి ఖరీదైన చీరలు కట్టుకునేది. రకరకాల నగలతో బట్టలు మ్యాచ్ చేస్తూండేది. గోరింటాకు పెట్టుకునేది. పెదిమలకి రంగు పూసుకునేది. రాత్రింబవళ్ళు స్నేహితురాళ్ళ మధ్య కూర్చుని నవ్వుతూ తుళ్ళుతూండేది. హైదర్ ఆలీఖాన్ ఎంతటి గంభీరమైన సమస్యలో చిక్కుకుని ఉన్నా, ఆమె వద్దకు వచ్చేసరికి నవ వధువులాగ వగలు పోయేది. అత్తర్లలో మునిగి పువ్వులలో దాగి ఉండే ఆమె ప్రతి రాత్రి దోమతెరపైన తాజా పువ్వులు జల్లేది. ప్రతి రాత్రి ఆమె కొరకు పూలనగలు తప్పకుండా వచ్చేవి.

ఎవరైనా ఇంకా ఇదంతా ఏమిటని అంటే 'నా కొడుకు పుట్టి, కోడలింటికి వచ్చేస్తే అప్పుడు నేను అలంకరించుకోవడం మానేస్తాను,' అనేదామె.

చాంద్ తరువాత ఆమెకు సంతానం కలుగలేదు. అందుకని చాలాకాలం సంతానం కోసం మందులు మింగడం తాయెత్తుల తాళ్ళతో గడిచిపోయేది. ప్రతి రెండు, మూడు నెలలకొకసారి తన దిండుక్రింద ఉన్న తాయెత్తుని తీసి పారవేసేవారు. ఊద్, లోబాన్ పరిమళాలతో నిండి ఉన్న నీళ్ళు పారబోసేవారు.

నేడు వాహిద్ హుసైన్‌గారి పాత స్నేహితుడొకరొచ్చారు -

దూల్హా నవాబు, వస్తూనే అలవాటు ప్రకారం తోటలోంచి ఒక విరిగిన ఇటుక తీసుకుని దానిమీద చెవుల పిల్లి లాగ ముడుచుకుని కూర్చున్నారు. వాహిద్ హుస్సైన్ కూడా వాజు (నీళ్ళకుండి) ఎక్కి కూర్చున్నారు. స్నేహితులతో ఇలాగే దగ్గరగా కూర్చుని మాట్లాడేవారాయన. దూల్హా నవాబు, పాత హమరూ షేర్వానికి, ఖరీదైన రత్నం గుండీలున్నాయి. వెండి బంగారు పోగులతో నేసిన బట్టతో కుట్టిన, అసహ్యంగా, అంటుకుంటున్నటువంటి పగిడీ పెట్టుకున్నారు. మొఘలు వంశస్థులు వేసుకునే పైజమా, తెల్లని గుబురు మీసాలు, మాట్లాడుతున్నప్పుడు కదులుతున్నాయి. ఆయన పడుకునేటప్పుడు కూడా పగిడీ తీసేవారు కారని ప్రతీతి. దూల్హా నవాబు, 'పాయ్‌గాహ్' వారి సంబంధీకులనీ, వారికి ప్రత్యేకంగా వేరే పోలీసులుండేవారని - కాని, ఆయన తండ్రి, వేశ్యల వల్ల, కీమియా (వెండి, బంగారాలు చేసే రసాయన కళ) తయారు చేయడం వల్ల యావదాస్తినీ కోల్పోయారని కుంటత్త చెబుతూండేది. ఇప్పుడు దూల్హా నవాబు తన తాగుబోతూ, సోమరిపోతూ అయిన కొడుకు, విధవ కూతురు, వారి అసంఖ్యాక సంతానంతో పాత హవేలీలో వున్నారు. ఆ దర్జా, డాబు - దర్పాలు అలాగే వున్నాయి. సేవలు చెయ్యడానికి ఇంట్లో దాసీజనం లేరు, కాని ఆయన మాటి మాటికీ గులషన్, గుల్‌బదన్ అని పిలుస్తూ తానే స్వయంగా పనులు చేసుకునేవారని ప్రజలు చెప్పుకునేవారు.

డెబ్బై, డెబ్బై ఐదు సంవత్సరాల వయసు కల వారైనప్పటికీ, వాహిద్ హుస్సైన్‌ని తన గురువుగా చేసుకుని కేవలం దక్కనీ భాషలో షేర్ చెబుతూ తన కవిత్వాన్ని తానే ఎక్కువగా పొగుడుకునేవారు. ఆయన వల్ల రెండు ప్రయోజనాలుండేవి. ప్రతి రోజు తన కొత్త గజల్ వినిపించడానికి సరియైన వ్యక్తి అనుకునేవారు వాహిద్ హుస్సైన్. ప్రణాళికలు వెయ్యడంలోను, కొత్త కొత్త వస్తువుల వ్యాపారం గురించి కలలు కనడంలో వాహిద్ హుస్సైన్‌కంటే చాలా ముందుండేవారు దూల్హా నవాబు.

జాగీర్లు అధికారాలు నష్టపోవడం ప్రారంభమయినప్పటి నుంచి దూల్హా నవాబు వ్యాపారం చెయ్యాలని నిర్ణయించుకున్నారు. ప్రత్యేకించి స్వదేశీ వస్తువులను గురించి ప్రపంచానికి తెలియపరచాలన్న ప్రయత్నంలో

ఇప్పటివరకూ యాభై వేల రూపాయలు పోగొట్టుకున్నారాయన. ఈ మధ్య ఆయన వాహిద్ హుసైన్‌తో కలసి బిరియానీ, బఘూరా బైగన్, విదేశాలకు సరఫరా చేసే యోచన పరిశీలిస్తున్నారు. ఇప్పటి వరకూ ఎవరూ ప్రయత్నించని ఇటువంటి పథకాన్ని గురించి రాషిద్ ఎటువంటి శ్రద్ధా కనబర్చేవాడుకాదు. అతని ఈ విముఖత్వం వాహిద్ హుసైన్‌కి ఎంతో బాధ కలిగించేది.

అజీఖబ్లా! మనం వృద్ధులమైపోయాము. మన తెలివితేటలు, అనుభవం ఉపయోగపడుతుంది. ఏదైనా చేద్దామన్న ధ్యాసే లేదీ తరం యువకులకి?

'ఏం చెప్పనండీ! మా అబ్బాయిగారు కూడా ఇలాంటి దుష్టుడే అయిపోయారు.'

'నేను చెబుతున్నాను వినండి! మేము అంతా చేస్తాం. మీ రాషిద్ నవాబు తన జ్ఞానాన్నుపయోగించి ఏదైనా ఉపాయంతో బిరియానీ విదేశాలకెళ్ళే వరకూ వేడిగా ఉండేట్టు చూడగలిగితే చాలు.' దూల్హా నవాబు ఉత్సాహపరుస్తూ అన్నారు.

'అదేం కష్టం!' నిమ్మచెట్టు ఆకునొకదానిని కోసి నలిపి వాసన చూస్తూ అన్నారు. 'చూడండి! ఫిరఔన్ కాలంనాటి శవాలు ఎక్కడివక్కడ ఉన్నప్పుడు 15, 20 రోజులు బిరియానీ వేడిగా ఉండలేదా?'

'కాని మా పుత్రరత్నం ఇంజనీరై, మతం నుంచి, ప్రపంచం నుంచి దూరమైపోయాడు. నిజానికి వ్యాపారం చేసే అధికారం, హక్కు మహమ్మదీయులకే కేటాయించేసాడు అల్లామియా, ఇంట్లో కూర్చునే వేలకొలది ఆదాయం చేసుకోవచ్చు.

'బఘూరాబైగన్‌కు సంబంధించిన ఒక ఉపాయం నాకు తెలుసు. అదెలాంటిదంటే మీ విదేశీయులు పెదవులు నాక్కుంటూ ఉండిపోవాలిసిందే!' ఆ ఉపాయాన్ని జేబులోంచి తీయసాగారు దూల్హా నవాబు.

'ఒక సేరు బిరియానికి రూపాయిన్నర ఖర్చుందనుకోండి. మన కంపెనీ దానిపైన ఒక రూపాయి లాభం వేసుకుంటుంది. ఇంక రోజుకు వెయ్యి డబ్బాలు అమ్ముడుపోయేట్లయితే, ఎంత లాభం వచ్చింది...?'

వాహిద్ హుసైన్ నీటితొట్టె గోడపైనుంచి దిగి ముడుచుకుని కూర్చుని, పై వేళ్ళతో లెక్కపెట్టసాగారు.

ఆదాయం మాటరాగానే దూల్హా నవాబు ఇటూ అటూ చూసి ఎవరూ లేకపోవడం వల్ల సంతుష్టులయ్యారు.

'చూడండి వాహిద్ నవాబ్... మన ఈ స్కీమ్‌ని కూడా ఎవడో తెలివైన వాడెవరో కొట్టుకుపోతాడు.'

చాంద్ కిటికీ తెరిచి తోటకేసి చూసింది. నిమ్మచెట్టు కింద తొట్టెపైన కూర్చున్న తాతగారు కనబడ్డారు. రెండు చేతులతో తల పట్టుకుని, ఇటిక పైన కూర్చున్న దూల్హా నవాబెందుకో పెద్ద విదూషకుడిలాగ కనబడ్డారు. గజల్ వినిపించే ధోరణిలో దూల్హానవాబు కోసం ఒక కుర్చీ తెప్పించాలన్న ధ్యాస లేకపోయింది వాహిద్ హుసైన్‌కి. విధిలేక చాంద్ స్వయంగా ఒక కుర్చీ ఆయన కోసం తీసుకువచ్చింది.

'శహభాష్! ఆయుష్మతీభవ... ఈమె బషీర్ బేగమ్ కుమార్తె కదూ!'

దుల్హానవాబు ఒక్క ఉదుటున ఇటికపైన కూర్చున్నట్టే కుర్చీపైన, ముడుచుకొని కూర్చున్నారు.

'మాషా అల్లాహ్ అచ్చు తల్లిలాగే అందంగా ఉంది.'

'తాతగారికి సలామ్ చేశావా?' వాహిద్ హుసైన్ చాంద్ నడిగారు. సరే! ఇక దూల్హా నవాబులాంటి చెవుల పిల్లులకు కూడా సలామ్ చేస్తూ పోవాలి కాబోలు!

'ఆ... ఆ... చేసింది,' మాట మార్చడం కోసం దూల్హా నవాబు అబద్ధమాడారు.

'చెయ్యలేదు...' వెంటనే అంది చాంద్.

'ఐ... ఐ...' దూల్హా నవాబొక వెకిలి నవ్వు నవ్వారు.

'సరే నేనంటున్నదేమంటే... నోట్లోంచి పైప్ తీసేసి మాట్లాడుతూ అల్లా అందమైన ఆడవాళ్ళని మన మనస్సును రంజింపచెయ్యడం కోసం పుట్టించాడు. కాని హాజరత్! స్త్రీకి బుద్ధి, వాక్కు ఇచ్చి అల్లామియా ఆమె సగం అందాన్ని పోగొట్టాడు.'

మాటలు, అనుకోని విధంగా బిరియానీ నించి స్త్రీ అందంవైపు మళ్ళాయి.

'అవునవును... అల్లామియా, ఆడదాన్ని, ప్రథమ మానవుడి మనస్సును రంజింప చెయ్యడానికి సృష్టించాడు కదూ! అందుకనే కదా గజల్ అంటే ఆడవాళ్ళతో మాట్లాడడమని అర్థం.' దూల్హా నవాబు తన మాటలకి తనే

మోకాళ్ళపై కొట్టుకుంటూ నవ్వసాగారు.

'అయితే తాతగారూ ఆడవాళ్ళు మూగగా ఉండేవారా...?' చాంద్ భయంగా అడిగింది తాతగార్ని. చాంద్ మాటలకి, 'హో, హో' తిరిగి నవ్వసాగారు దూల్హా నవాబు.

'చూశారా హాజరత్! మీ మనుమరాలు ఇంగ్లీషు చదువుతూంది కనుక... ఏమడిగిందో చూశారా?' అందుకనే కూతుళ్ళు, కోడళ్ళు ముందు కవిత్వం చెప్పకూడదు. అందుకనే కదా హవేలీల్లో ఆడవారుండడానికి, మగవారుండడానికి వేరు వేరు ఏర్పాట్లు చేయటమయింది.

'హో, హో, హో! అంటూ వాహిద్ హుస్సైన్ ఆయన మాటకి కృత్రిమంగా నవ్వసాగారు. ఆయన జీవితమంతా తహసీల్దారీ చేశారు, అక్కడే నవ్వే అవసరముండేది కాదు. లేకపోతే సిగార్ కాలుస్తూ షాయరీ చెబుతూండేవారు, కనుక హాయిగా హృదయపూర్వకంగా నవ్వడం ఆయనకెప్పుడూ చేతకాలేదు.

'వాహిద్' అనే పేరుతో కవితలు వ్రాసే వాహిద్ హుస్సైన్ అనే ఒక గొప్ప పేరు మోసిన కవి హైదరాబాదు నగరంలో ఉన్నట్టు, పట్టణపు సాహితీ వేత్తలందరికీ తెలిసినప్పటికీ, ఎవరూ ఆయన్నెప్పుడూ ముషైరాకి అధ్యక్షత వహించే అవకాశం కూడా ఇవ్వలేదు.

సెమీ గవర్నమెంట్‌కి సంబంధించిన పద్ధతులు జిల్లాలో ఏవేనా జరిగితే ముషైరా తప్పక ఉండేది. అటువంటప్పుడు ముషైరా అధ్యక్షత వహించే బాధ్యత తానే స్వయంగా స్వీకరించేవారు. అలాంటి అవకాశం లభించినప్పుడు, సాధారణంగా శ్రోతలకి నాలుగైదు గజళ్ళు తప్పనిసరిగా వినిపించేవారు. విన నిరాకరించే ధైర్యమెవరికుంది?

నిన్న సలారు మందు తీసుకొచ్చాడా?' వాహిద్ హుస్సైన్ మాటిమాటికీ అడుగుతున్నారు.

'ఇప్పుడనవసరంగా అతణ్ణి బజారు... అలా హాజరత్ సవారీ 'మాదరే-దకన్'కి సలామ్ చెయ్యడానికి వెడుతుంది. ఇప్పుడు రోడ్లన్నీ మూసి వున్నాయి.'

ఆనాడు మామగారికి చాలా కోపంగా ఉంది అందువల్ల ఎవరో ఒక నౌకరుకి మూడుతుందని రజీయా సలారుని రక్షించడం కోసం అతని

తరఫున మాట్లాడింది.

'అంతా అబద్ధం. ఇవాళ జుమ్మా (శుక్రవారం). ఇవాళ ఈ టైమ్‌లో అలా హాజరతే నమాజ్ చెయ్యడం కోసం పబ్లిక్ గార్డెన్స్‌కి వెళ్తుంటారు.

'అయితే బేగమ్, సాహిబా మందుల దుకాణంలో దూరిపోయుంటుంది.' సలారును రక్షించడం కోసం మరో మాట అంది.

బేగమ్ సాహిబా రోజంతా పరదాలున్న కారులో రోడ్లమీద, బజారుల్లో తిరుగుతూండేవారు. ఎక్కడ కావాలనుకుంటే అక్కడ కారునాపేసి, కొట్లలో దూరి, ఏది ఇష్టమైతే అది తీసుకెళ్ళిపోయేవారు. అలా హాజరత్‌ని బాధపెట్టడం కోసం ఆమె ఈ విధంగా నియమోల్లంఘన చేసేవారు. కింగ్‌కోఠీలో ఆమెకు మారుగా వేరొక సుందరి, అలా హాజరత్‌కి నచ్చడమే ఇందుకు కారణం.

'మీకు కనుక అవకాశమొస్తే మొత్తం రాజవంశాన్నంత సలారు రక్షణార్థం నిలబెట్టేవారు దులహాన్ బేగమ్!' వాహిద్ హుసైన్ మాటలకి - పేపరు చదువుతున్న రాషిద్, కిళ్ళీ నములుతున్న బీబీ, బిడ్డకి పాలు పడుతున్న రజియా, వక్కలు కత్తిరిస్తున్న కుంటత్త - అంతా ఫక్కుమన్నారు.

'ఉజాలా బేగమ్‌కి, బిడ్డ లభించాడు, బాగుంది!' మాట మార్చడం కోసం కుంటత్త శోకగీతాలాపన ప్రారంభించింది.

వాహిద్ హుసైన్ పైప్ కింద పెట్టి ఎంతో ఓర్పుగా గౌహార్ బేగమ్‌ని చూడసాగారు.

'ఉజాలా బేగమ్ ఏం చేసినా చట్టం మాత్రం వాడిని అహమద మియా కొడుకని ఒప్పుకోదు... ఏం రాషిద్ మియా? ఆయన ఎంతో ఆశగా రాషిద్‌కేసి చూశారు. జీవితమంతా ఏం చేశారని ఎవరైనా ఆయన్ని అడిగితే రాషిద్‌ని చూసేవారు. ఇతర జాగీర్దార్లను చూడండి. ఏడుగురేసి కొడుకులున్నారు. కాని ఎందుకూ పనికి రారు. బలాదూర్ అని తిరుగుతూంటారు. కచ్చేరీలకి వెళుతుంటారు. చెద పట్టిపోయిన ఈ ఆస్థిమీదే ఆశతోనే జీవిస్తున్నారు. అటువంటిది రాషిద్ సమర్థతని గమనించి ప్రభుత్వం, ఇంజనీయర్ చదువుకోసం విదేశాలకు పంపింది. మంచి ఒడ్డు పొడుగు ఉన్న రాషిద్ సూటు వేసుకుని దర్జాగా తన కారులో తిరుగుతూంటాడు. హైదరాబాదులో ఎన్నో అందమైన భవనాలు నిర్మించి

నగరానికే అందాన్ని చేకూర్చాడు. ఈ సమర్థతతో పాటు అతనిలోని మరొక గొప్ప గుణమేమంటే సహజంగా జాగీర్దార్లకుండే గర్వం, మచ్చుకైనా లేదు. సర్దుకుపోగలిగే స్వభావం గల వాడైన రాషిద్ ముందుచూపు కలవాడు. నిత్యం తండ్రిని గురించి శ్రద్ధ వహిస్తూ, తల్లిని సంతోషపెడుతూ బంధువులందరికీ ప్రేమపాత్రుడయి భార్య ఎడల అనురాగం కలిగి ఉండేవాడతను.

అతనిలోని ఈ ప్రత్యేకతల వల్లనే వాహిద్ హుసైన్ జాగీర్దారుల ఇంటి పిల్లలకి బదులు రజియాని వెతికారు. రజియా పితామహుడు కొద్దిపాటి పెట్టుబడితో ఒక చిన్న సిగరెట్ ఫ్యాక్టరీని స్థాపించారు, అది చూస్తూండగా లక్షల విలువగల వస్తువులను ఉత్పత్తి చేయసాగింది. ప్రస్తుతం జాగీర్దార్లు నెల రోజులలో కూడా పొందలేనంత మొత్తం, రజియా తండ్రి ఒక్క రోజులో సంపాయిస్తున్నాడు. రజియా రాషిద్ ఇంటికి వస్తూ, ఒక కారు, ఒక బంగళా, వంద తులాల బంగారం లక్ష రూపాయల రొక్కం, తనతో తీసుకువచ్చింది. వాహిద్ హుసైన్ అటువంటి కోడల్ని నెత్తినెక్కించుకోక ఏం చేస్తారు?

'అహమద్ హుసైన్‌కి వారసుడు పుట్టిన సందర్భంలో కూడా 'నాన్నగారు' ఈ విషయంలో మీరు గొడవ చెయ్యకండిప్పుడు. భగవంతుడు బాబాయిని క్షేమంగా చూడాలి. ఉజాలా పిన్ని సంగతి తరువాత చూసుకుంటాము' అని మాటిమాటికీ అంటూ వచ్చాడు.

'ఉజాలా వదిన పిల్లవాణ్ణి మాల్వీ చేస్తుందని వినికిడి. రహిమత్ అలీషాహ్ సమాధి దగ్గిర అలాగ మొక్కుతుందిట.'

'అయితే ఇప్పట్నించే పిల్లవాడికొక గడ్డం తగిలించేస్తే సరి,' రజియా నవ్వసాగింది. రజియా లక్షాధికారి కూతురు. అయినా ఉజాలా బేగమ్ ఆస్థి చెయ్యిజారి పోతుందన్న బాధ ఆమెనీ మధ్య కలవరపెడుతూంది.

'ఇది వరకు మంచి కుటుంబాలలోని పురుషులంతా గడ్డం పెంచుకునేవారు. మా వంశంలోని వారంతా కూడా అలాగే చేశారు. ఒక్క అహమద్ హుసైన్ మాత్రం ఆ పద్ధతిని మార్చేశాడు. గడ్డమూ లేదు, కవిత్వమూ లేదు!' గౌహార్ అత్త అంది.

'అరె! మా వంశంలో అయితే...!' వాహిద్ హుసైన్ ముందు మాట

మరిచి, లేచి కూర్చున్నారు.

'మా వంశంలోని వారంతా పురుషులంతా కవిత్వమూ చెప్పారు, గడ్డంకూడా పెంచుకున్నారు. స్వర్గస్తులైన మా తాతగారు చాలా గొప్ప వ్యక్తి ఏం దర్జా! ఏం ఠీవి! నాకు నిన్న మొన్నటి విషయంలాగ జ్ఞాపకముంది! ఆయన దూరంగా శూన్యంలోకి చూస్తూ అన్నారు.' తాతగారెప్పుడూ మష్జర్ షేర్వానీ, జరీ పగిడీ వేసుకునేవారు. ఆయన బైటికి వెళితే, ముందుగా హుక్కా అక్కడుండేది. ఒక టీపాయ్ మీద, కవితలు, వ్రాసే పుస్తకం సిరా బుడ్డి, కలం పెట్టేవారు. ఆయన తన పేరు ప్రఖ్యాతులు గడించిన గజళ్ళన్నీ ఈ విధంగానే వ్రాశారు. గౌహార్ బేగమ్ తండ్రి అయిన మా పెద్దనాన్నగారికి మాత్రం కవిత్వమంటే గిట్టదు.

అదే ఈ వంశాన్ని నాశనం చేసింది. ఇది చాలా చెడ్డది, దురదృష్టానికి చిహ్నం జీవితమంతా డబ్బు, త్రాగుడు, వేశ్య, ముషైరాలలో కరిగిపోతుంది.

'సరిగ్గానే చెప్పేవారు!' బీబీ పాన్‌దాన్ తెరుస్తూ అంది.

'నిజంగానే ఈ వంశం సర్వస్వం నాశనమయిపోయింది!'

గౌహార్ బేగమ్ నిట్టూర్చింది. రాషిద్, రజియా శ్రద్ధగా వింటున్నారు.

'చాలా తెలివైనవారు పెద్దనాన్నగారు! కుటుంబంలో తాతగారెవరినైనా, నమ్మేవారూ అంటే అది పెద్దనాన్నగారినే.'

గౌహార్ బేగమ్ తన తండ్రి ప్రసక్తి వచ్చేసరికి కళ్ళు తుడుచుకోసాగింది.

ఇప్పుడు వాహిద్ హుసైన్ ముఖంలో ఎన్నో జ్ఞాపకాల జ్యోతులు ప్రకాశిస్తున్నాయి. అవినీతి ప్రారంభమైనప్పుడు, ఆ రాత్రి తాతగారు పానీయాన్ని అస్సలు తాకలేదు.

'అవినీతా... అదేమిటి...? రాషిద్ వార్తాపత్రికను పక్కన పెట్టి కుతూహలంగా అడిగాడు.

'అసలు జరిగిందేమిటంటే తాతగారికి, ఇంగ్లీషు రెజిమెంట్‌కీ ఏదో గొడవ వచ్చింది. అది పెరగసాగింది. తాతగారి అంతఃపురంలో స్త్రీలపై అత్యాచారాలు జరుగుతున్నాయని రెజిమెంట్ ఆరోపించింది. విచారించేందుకొక కమీషన్ వచ్చింది?

'అయితే అత్యాచారాలు జరిగేవా?' రాషిద్ అడిగాడు.

'అంతా ఉట్టిదే! నిదానంగా పైప్ వెలిగించుకుంటూ అన్నారాయన.'

'ఆ రోజులలో నవాబులందరూ మానసికానందం కోసం అందమైన స్త్రీలని అంతఃపురంల్లో చేర్చుకునే పద్ధతుండేది.

వీరంతా బీదవారైన తల్లిదండ్రుల దగ్గర తిండికీ, బట్టకి కూడా కరువయినవారు. లేదా మూర్ఖులకి భార్యలైనవారు. కానీ వారికి మహాళ్ళలో జీవితం బాగుండేది. వారి పేర్న జాగీర్లు, ఉద్యోగాలు, వారి సంతానం భవిష్యత్తు ఉజ్వలంగా వుండేది.

వీరి తల్లిదండ్రులు వేరే కానుకలు పొంది సుఖంగా జీవించేవారు. ఇంత అయిన తరువాత కూడా ఏడుస్తూ, తమ ఆడపిల్లల్ని నవాబులెత్తుకుపోతున్నారని అందరికీ చెప్పుకుంటూ తిరిగేవారు.

'అప్పుడు తాతగారేం చేశారు?' రాషిద్ అడిగాడు.

ఆ రోజు ఒక ముఖ్యమైన మీటింగు వుంది. క్లబ్‌లో నాట్యం ఉంది. అయినా తండ్రి చెబుతున్న పాత గాధలు వినడం బాగుంది అతనికి.

'ఆ... ఆ రాత్రి తాతగారి ముందర కాగితాలు ఉన్నాయి. అటువంటి పరిస్థితులలో ఆయన వద్దకు వెళ్ళడానికెవరికీ అనుమతి లభించేది కాదు. నాయినమ్మ అయితే ముందుగానే పిల్లలతోపాటు హావేలీలో మరో మూల వెళ్ళి కూర్చుంది. ఆ రోజులలో పార్వతి అనే వేశ్య ఆయన మన్ననలందుకుంటూండేది. నేనా దృశ్యాన్ని నేటి వరకూ మర్చిపోను.

వాహిద్ హుసైన్ చెప్పుకుంటూ పోతున్నారు. ఆయన చుట్టుపక్కల కూర్చున్న బీబీ, గౌహర్ బేగమ్, రాషిద్, రజియా అంతా ఆయనతో పాటు ఏదో విచిత్ర లోకంలో విహరిస్తున్నట్టు మౌనంగా ఉండిపోయారు.

పార్వతితోపాటు మేమంతా కూర్చుని తోటలకి వెళ్ళుతున్నాము. ఒక దాంట్లో తినుబండారాలు, మరొక దాంట్లో నౌకర్లు, వేరొకదాంట్లో సామాను కూడా బంట్రోతులు,

మట్టి రోడ్ల మీద వెళుతుంటే రావిచెట్లు, చింతచెట్ల నీడ ఉండేది. చుట్టుపక్కల వీరి పొలాలు మఖమల్ పరిచినట్లున్నాయి. వాటివెనుక దట్టమైన అడవి, ఎర్రగా కనబడే కొండలు, ఆ కొండలపైన నీలాకాశం, ఎగురుతున్నట్టు కనపడే మేఘాలు దగ్గరనుంచి అంతా నాకు జ్ఞాపకం, వాతావరణమంతా వరి పంట సువాసనలతో నిండి వుంది. ఎవరో పిల్లవాడు ఆవుల్ని గేదెల్ని తోలుకుంటూ వెళ్ళిపోతున్నాడు. ఎక్కడో పొలాల మీది

నుంచి పక్షుల దండు ఎగిరి ఆకాశంలో చెదిరిపోయింది. ఎక్కడో ఒక ఔస్త స్త్రీ తలపైన కట్టెల మోపుతో వెళుతూంది. అక్కడక్కడ చిన్న చిన్న పిల్లలు చింతచెట్టెక్కి, చింతచిగురు కోస్తున్నారు.

'అబ్బా... ఈ దృశ్యాల్ని చూడడం.... కవిత్వం...!' రజియాకి విసుగొచ్చింది.

'ఇంతలో సాయంత్రమయిపోయింది. డాక్ బంగళాకి బదులు అడివిలో డేరాలు వేయించుకొందామని మేమంతా పట్టు పట్టడం మొదలుపెట్టాము.

'రాత్రి మనోహరంగా వుంటుంది కాని ఇదేమి ఆనందం!' మేము పిల్లలమంతా కేకలు పెడబొబ్బలు విని లేచేసరికి అర్ధరాత్రి అయి ఉంటుంది. స్త్రీలంతా నేలపై తలలానించి వణికిపోతున్నారు. మేము తల్లుల చీరలలో ఒదిగి ఏడవసాగాము. కొంతమంది రైతులు అటుగా వెళుతూ డేరాలు ఇక్కడెందుకు వేశారు? నది ఒడ్డున బంజారా వాళ్ళున్నారు, వాళ్ళు దోపిడీలు చేస్తారు. ఇది విని స్త్రీ రక్షణార్థం వారికి నాయకుడైన గౌసూమియా నిటారుగా పడుకున్నారు. మీ స్త్రీల మంకుపట్టు వల్లనే ఇలాగయింది, డాక్ బంగళా విడిచిపెట్టి అడవిలో ఎందుకు విడిది చేశారు?

'భగవంతుడా! పెళ్ళయిన, పెళ్ళికాని పిల్లలందరి గౌరవం, అభిమానం నీ చేతులలో ఉంది. ఓ భగవాన్ ఈ రాత్రి క్షేమంగా గడిచిపోనీ, నేను బీబీ - ఆలమ్ (జెండా)కి బంగారవు చంద్రుణ్ణి అర్పిస్తాను' నానమ్మ అలా నేలపై తల ఉంచే మొక్కులు, మొక్కుకోసాగింది.

'ఇంతలో ఏదో ఆలోచించి పార్వతి లేచింది. తాతగారు పెళ్ళాడిన భార్యకాదావిడ. కాని పరిణయమాడిన పత్ని కన్న మక్కువ ఎక్కువగా ఉన్న స్త్రీ ఆమె. ఇది ఇలాగుండగా వేశ్యతో వరుస కలుపుకోవడానికి వ్యక్తులెవరూ సంసిద్ధులయేవారు కారు. కానీ ఆమెని గౌరవంగా 'బాయీ అమ్మా!' అని పిలిచేవారంతా.

వాహిద్ హుసైన్ పైప్ వెలిగించుకోడానికి ఆగి పార్వతి ధ్యానంలో మునిగిపోయారు.

'రాషిద్ మియా!' ఆమె ఎటువంటి స్త్రీ అనుకున్నావ్! అర్ధరాత్రి, అడవిలో దీపంలో వెలిగిపోయేదామె ముఖము. ఎటుచూస్తే అటు అంతా ఆమె స్వంతమైపోయేవారు. నన్ను గంటల తరబడి ఒడిలో

కూర్చోపెట్టుకునేది. ఆమె ఎదురుగా కూర్చుంటే తప్ప తాతగారు షేర్ చెప్పలేకపోయేవారు. తాతగారిలాంటి ఉక్కు మనిషిని ప్రభావితం చేసిందంటే నమ్ము. ఆమె గౌనూమియా బట్టలు వేసుకుని, షేర్వానీ, పగిడీ ధరించి, కాటుకతో మీసాలు దిద్దుకుని ద్వారపాలుకుడు నుంచి తుపాకీ లాక్కుని డేరా బయటికి వెళ్ళి నిలబడింది. చేతిలో కాగడా తీసుకుని ఇటూ అటూ తిరుగుతూంటే, ఒక మొగలాయి షహజాదా తన అంతఃపుర రక్షణార్థం తిరుగుతోందనిపించింది. అందరికీ గుండెదడ తగ్గి కొంత శాంతి చేకూరింది. పిల్లలు హాయిగా నిద్రపోయారు గౌనూమియా కళ్ళు తెరచి లేచి కూర్చున్నారు.

'నానమ్మ వేశ్యలతో మాట్లాడేవారు కారు. అయినా ఇదిగో పార్వతీ, పోతే పోయింది సంపద... ఎవడేనా నిన్నే ఎత్తుకు పోగలడు... లోపలి కొచ్చెయ్యి...' అన్నారు.

'అయ్యో బేగమ్ సాహిబ్! సంపద కోసం కాదు, పెళ్ళికాని, పెళ్ళయిన మీ వారి రక్షణ కోసం నిలబడ్డాను. అయినా వేశ్యనెవరైనా తీసుకుపోతారా బేగమ్ సాహెబ్!' నవ్వుతూ అడిగిందామె.

'అలా ఉండేవారా కాలపు వేశ్యలు!'

వాహిద్ హుసైన్ మెచ్చుకోలు చూపులతో నలువైపులా చూశారు.

'ఆమె ముందు గట్టిగా నవ్వడానికి కాని, తలపై ఆచ్ఛాదన లేకుండా రావడానికి కాని ఎవరికీ ధైర్యం చాలేది కాదు. దసరా పండుగనాడు పార్వతి తల్లి సోదరి, ఆమెను కలుసుకోవడానికి వచ్చేవారు. కానీ ఆమె ఎప్పుడలా వారిని లోపలికి ఆహ్వానించలేదు. దేవిడీ గేటువద్ద వారికి కుర్చీలు వేసేవారు. అక్కడే తలుపు దగ్గర నిలబడి ఆమె వారితో మాట్లాడేది'

'వారికి, కుర్చీలెందుకు వేసేవారు?' రజియా కుతూహలంగా అడిగింది.

'ఎందుకంటే... ఆ కాలంలో, పురుషులు, వేశ్యలు మాత్రమే కుర్చీలపై కూర్చునేవారు. నాకు బాగా జ్ఞాపకం, ఒక రోజు పెద్దక్క ఆడుతూ, వచ్చి కుర్చీలో కూర్చుంది. వెంటనే పార్వతి 'మీరు కుర్చీ మీద కూర్చోకూడదు పాషాజానీ' కుర్చీమీద పురుషులు లేక మాలాంటి వేశ్యలు మాత్రమే కూర్చుంటారు,' అంది.

'ఈమె కూడా భాగమతి కూతురు - కూతురు లేక కొడుకు కూతురో

అయి ఉంటుంది అనుకున్నాడు రాషీద్.'

'మీ తాతగారు చనిపోయిననాడు ఏమైంది! రజియా ప్రశ్నించింది.'

'ఆ... ఏమన్నావ్?' ఉలిక్కిపడ్డారాయన తిరిగి సద్దుకున్నారు. కళ్ళద్దాలు తీసి, కళ్ళు నులుముకుని, చిన్న ఫ్రెంచ్‌కట్ గడ్డం చేత్తో నిమురుకుని, తిరిగి కళ్ళజోడు పెట్టుకున్నారు, కార్తీక మాసపు రాత్రులలో లాగా వణుకు పుట్టిందాయనకి.

'తాతగారు పోయిన రోజు ఉదయం, ఆయన చుట్టూ బోలెడన్ని కాగితాలు పడి ఉండడం గమనించింది పార్వతి. బాదామ్-హారీరా (తీయని పానీయం) నుంచి ఆవిరి రావడం ఆగిపోయింది. స్నానాలగదిలో బయాజ్ కలం ముక్కాలి పీట మీద పెట్టి ఉన్నాయి. ఉజూ (నమాజ్ చేసుకోవడానికి ముందుగా కాళ్ళు చేతులు, ముఖము కడుగుకొనుట) కోసం పెట్టిన నీళ్ళు చల్లబడుతున్నాయి. కానీ ఆయన, దీపగుచ్ఛం ముందు తల వంచుకుని అలాగే కూర్చుని ఉన్నారు.

'ప్రాతఃకాలం నమాజ్ చేసుకునే వేళయిపోయింది సర్కార్, లేవరా ఏమిటి?' మెల్లిగా అంది పార్వతి. ఇది విన్న ఆయన కళ్ళెత్తి పార్వతిని చూశారు, అప్పుడు ఆయన కళ్ళు పావురం రక్తంలాగ ఎర్రగా ఉన్నాయని, గదినిండా ఒక విచిత్రమైన సువాసన నిండి ఉందని, పార్వతి అన్నది. ఆయన మెల్లిగా అన్నారు. ఇంకా తెల్లవారలేదు. ఎంత భయంకరమైన రాత్రో!'

'అది తాతగారి ప్రేమపూరిత మాటనుకున్న పార్వతి, దురదృష్ట వంతురాలైన పార్వతి, నవ్వేసి ఆయన వద్దకు వెళ్ళింది.

'అయితే దీపమార్పివేయనా ఇప్పుడు?'

ఇది వింటూనే తాతగారు బాధగా 'ఇప్పుడింకేముంది దీంట్లో ఇది బూడిద, వట్టి బూడిద!'

పారో చెప్పేది, నేను చూసేసరికి...

'ఉహ్..., అందరూ ఊపిరి బిగపట్టి, కళ్ళు పెద్దవి చేసుకుని వాహిద్ హుస్సైన్ కేసి చూస్తున్నారు.

'అప్పుడేమయింది?' అడిగాడు రాషిద్.

'ఏం లేదు...' నిట్టూర్చుస్తూ కప్పుకేసి చూడసాగారాయన.

'అక్కడ నిజంగా బూడిదైపోయిందంతా, అంతే. కొంచెంసేపట్లో పోలీసులు పరుగెత్తుకొచ్చారు. ఐవానే గజల్‌కి యాభై లక్షల అప్పుంది. డెబ్బైమంది స్త్రీలనక్కడ దాచేశారు.'

'ఎంతటి అదృష్టవంతులో...!' కుంటత్త బాధగా అంది బాధతో పాటు ఆయన యెడలగల శ్రద్ధ కూడా ధ్వనించింది ఆ గొంతులో.

'అవన్నీ దస్తావేజనుకున్నాను, కాని అవన్నీ గజళ్ళు... అంటే ఒక్క రాత్రి పదిహేను గజళ్ళు...' అనేది నానమ్మ. వాహిద్ హుసైన్ అందర్నీ ప్రశంసాపూర్వకంగా చూసి, తాను కూడా పొంగిపోతూ, 'ఒక్కొక్క షేర్ ఎటువంటిదనుకున్నారు? జీవితమంతా అభ్యసించినా మరే షాయర్ చెప్పలేనటువంటివి.'

హకీమ్ షఫాలత్ ఆలీ వాటిని చూస్తూనే అన్నారు, ఇటువంటి గజళ్ళు వ్రాసిన తరువాత, ఆయనలో ఇంకా ఏం మిగిలుందని బ్రతుకుతారు...?

'ఉహ్... తరువాతేం జరిగింది?' అప్పటిదాకా నోరు తెరుచుకుని కూర్చున్న చాంద్, కేవలం ఈ కథ ముగింపు తెలుసుకోవడమే తరువాయి అన్నట్టడిగింది.

దగ్గర కూర్చున్న చాంద్‌ని జాగ్రత్తగా చూశారాయన. పైప్ తీసి వెలిగించి, కాళ్ళూపుతూ, పైప్ లోంచొచ్చే పొగ పీల్చసాగారు.

'అంతే ఆ రోజు నుంచే ఆ ఇంటి దురదృష్టం ప్రారంభమైంది. శవాన్ని తీసుకెళ్ళగానే, ఆ ఇంట్లోని ప్రతి వస్తువు తీసుకెళ్ళిపోయింది పార్వతి. నాన్నగారు దేవిడీ నుంచి వెళ్ళగొట్టిన స్త్రీలు గొడవచేసి ఎన్నో చేజిక్కించుకున్నారు. ఐవానే గజల్, మా కోసమే అన్నట్టు మిగిలింది కనుక నానమ్మ మమ్మల్నందర్నీ పెట్టుకుని ఇక్కడే ఉండిపోయింది. కాని అబ్బాజాన్ పెద్దవారవగానే ఆస్తినంతా మళ్ళీ కొత్తగా ఏర్పాటు చేశారు.

'అందుచేతనే షాయరీ-వాయరీ అంటే మా తండ్రికంత అసహ్యం,' ఏదో దీర్ఘాలోచనలో మునిగి ఉన్న కుంటత్త అంది.

'అసహ్యమా...?' ఆరిపోయిన సిగార్‌ని విసుగ్గా, విసిరికొట్టారాయన 'ఎవరైనా షాయర్ దీవాన్ ఇంట్లో కనబడితే, విసిరిపారేసేవారు. భగవంతుడు రక్షించుగాక, వయసులో ఉన్నప్పుడు చున్నూ నవాబ్‌కి షాయరీ మీద కొంత మమకారం ఉండేది. చిన్నాన్న కంట పడితే... భయంవల్ల ఇంట్లో

బయాజ్ పెట్టుకునే ధైర్యం ఉండేది కాదు. కాబట్టి షేర్ రాసి ఇక్కడా-అక్కడా దాచేవారు. అనుకోకుండా ఒకసారి చిన్నాన్నగారు ఒక షేర్ చూశారు. అందులో ప్రేయసి కళ్ళను పానపాత్రతో పోల్చారు. అంతే చిన్నాన్నగారు జపమాలను విసిరికొట్టారు.

'అసలు వేలెడంత కుర్ర వెధవకి ఒక ప్రియురాలుండడం మొదటి తప్పు. ఇంక మహాశయా! మనిషి కళ్ళని పానపాత్రతో పోల్చడమేమిటి? అసలు కళ్ళలా ఉంటాయా? అంతా అబద్ధం. ఇంత పచ్చి అబద్ధాలు చెబితే, భగవంతుడికి కోపం వచ్చి, ఈ ఇల్లు ఆపదల పాలవుతుంది.

'అంతే ఆనాటినుంచి చున్నా నవాబు కవిత్వం వ్రాసిన కాగితాలు, నలిపేసినవి ఎవరికైనా దొరికితే ఇమామ్‌బీ ఇంటికప్పుపైకి విసిరేసేవారు. ఈ విధంగా ఎన్నోసార్లు ఇమామ్‌బీ పొయ్యంటించుకోవడానికి, లేక ఎవరైనా ఆయా పిల్లల కోసం పాలు వెచ్చపెట్టుకోవడానికీ కాగితాలనే ఉపయోగించుకునేది. అప్పుడప్పుడు షాయరీ అంటే ఇష్టపడే ఎలుక, తన ప్రియురాలికి వినిపించడం కోసం ఈ గజళ్ళు తీసుకుపోయేది. వాహిద్ హుసైన్ చెప్పిన చివరి మాటలకందరూ నవ్వేశారు. ఫిడేలు వాయిస్తూ పాడుతుంది చాంద్.

చాంద్‌కిప్పుడు పదహారు సంవత్సరాలు. ఈ మధ్యకాలంలో హఠాత్తుగా ఎన్నో దుస్సంఘటనలు జరిగిపోయాయి. జీవితాన్ని అమితంగా ప్రేమించే బషీర్ బేగమ్ ఒకనాడు నవ్వుతూ నవ్వుతూనే ప్రాణాలు కోల్పోయింది. డాక్టరు వచ్చే లోపలే ఆమె ఈ లోకాన్ని వీడిపోయింది. చాంద్ తండ్రి గుండెపైన తలపెట్టుకుని ఏడుస్తూంది. తండ్రి ఒక చదువుకున్న కమ్యూనిస్టు వర్కర్‌ని భార్యగా తీసుకు వస్తున్నారన్న వార్త తెలియగానే ఆమె ఐవానే గజల్‌కి వచ్చేసింది.

ఆమె ఖర్చుల నిమిత్తం హైదర్ ఆలీఖాన్, ప్రతినెలా వంద రూపాయలు స్వయంగా తెచ్చి ఇచ్చేవారు.

పాటలోని తప్పులు, ఫిడేల్ తీవ్రధ్వని - చాంద్ గదిలోంచి బయటికి వస్తున్నాయి. ఇది ఉదయం, అంటే ఆమె ప్రాక్టీసు చేసుకునే సమయం. కాని నేడామెకు ప్రేమ నిస్సహాయతపై దుఃఖం కలుగుతూంది. సినిమాలలోలాగ ఆమె పాడుతూ ఏడుస్తూండేది. పరిస్థితులకనుగుణంగా

మేకప్ వేసుకుని ఉత్తినే తన భగ్నప్రేమకై దుఃఖిస్తూండేది.

ఈ విధంగా చాంద్‌కి శోకంతో ఉదయం ప్రారంభమవడం, వాహిద్ హుస్సైన్ శాంతిని పారద్రోలటానికి ప్రాతిపదిక అయ్యేది. ఆయన, చాంద్‌ని పంటినొప్పిని భరించినట్టు, సహించేవారు. నిజానికి చాంద్ ఆధునిక దుస్తులు, స్వేచ్ఛాభావాలు, పద్ధతులు ఆయనకస్సలు నచ్చేవి కావు.

అప్పట్లో, హైదరాబాదులో, ఉన్నత శ్రేణికి చెందిన స్త్రీలు రెండు రకాలకి చెందినవారు. ఒకటి వాహిద్ హుస్సైన్ కుటుంబం, ఈ కుటుంబానికి చెందిన స్త్రీలింకా కార్లకి పరదాలు కట్టుకుని ప్రయాణించేవారు. బీబీలాగ తమ భర్తల హోదాలు ఆంగ్ల ఉచ్చారణ వారికెప్పుడూ సరిగ్గా జ్ఞాపకముండేది కాదు. ఇటువంటి స్త్రీలే మంచితనానికి, పవిత్రతకి సంబంధించిన శాస్త్రీయ పద్ధతులను తు.చ. తప్పక, పాటించేవారు. వీరు యశోధరలాగ, తమ సిద్ధార్ధులను, ముక్తి మార్గగాములుగా చేయగలిగేవారు. ఎవరైనా కొత్త సవితి రాగానే, తమ ఇంట్లోనే వనవాసాన్ని స్వీకరించేవారు. సీతలాగ వారిని ఒడిలో చేర్చుకోవడానికి, భూమి ఎప్పుడూ సంసిద్ధంగా ఉండేది. వారి ఉద్దేశ్యంలో డబ్బు, దర్జా అంటే ఎక్కువమంది నౌకర్లు, ఎక్కువమంది దాసీ పిల్లలు, గొప్ప, ప్రతిష్ట. వీటన్నిటినీ కాపాడుకోవాలంటే, ఎన్నో త్యాగాలు, భర్తల విసుగుదలను సహించడం, వారిని కాపాడుకోవడం - ఇవన్నీ మోయవలసిన బాధ్యతలు, వీటికి మారుగా నల్లపూసల పేరు లభించేది. అది సౌభాగ్యానికి చిహ్నంగా భావింపబడేది. తాళాలగుత్తి దొరికేది, కాని దానిలో వారి సుఖానికి సంబంధించిన తాళం మాత్రం ఉండేది కాదు. కాని ఈ తాళాల గుత్తితో వీరు కుటుంబం, సంపద, వంశం, సంతానం, గౌరవం, దర్జా మొదలైనవాటి మూసిన తలుపులన్నిటినీ తెరువగలిగేవారు.

రెండవరకం స్త్రీ హైదర్ ఆలీ ఖాన్ కుటుంబానికి, చెందినది. ఆమె ఢిల్లీ, డెహరాడూన్‌లకు వెళ్ళి విద్యనభ్యసించేది. ఆంగ్ల ఆఫీసర్ల క్లబ్‌లో నృత్యం చేసేది. చేతుల్లేని, రవికలు వేసుకునేది, జుట్టు కత్తిరించుకునేది, కొత్త కొత్త అలంకరణ పద్ధతులను అవలంబించేది. ఆమె తల్లి-తండ్రులను సహితం డియర్, డార్లింగ్, అనేది. అక్కడ పెళ్ళిళ్ళు తమ ఇష్ట ప్రకారం జరిగేవి. విడాకులు, ఇతరుల బలవంతంపైన ఇచ్చేవారు. ఈ ఇళ్ళ

రూపురేఖలు మారడానికి, ఐరోపా నుండి దొరసానుల్ని ఇరానీ పెళ్ళి కూతుళ్ళను పెళ్ళిచేసుకొని తీసుకువచ్చిన యువకులు కొంతవరకు బాధ్యులైతే, వారి పాశ్చాత్య విద్యా ప్రభావం కొంత ప్రభావాన్ని చూపింది. వీరివలన భారతదేశ ఉత్తరభాగంలో పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఎక్కువగా కనబడసాగింది. వీరు ఆంగ్లేయుల వలె మాట్లాడడం, ఇంగ్లీషు వారి వస్త్రధారణతో పాటు వారిపద్ధతుల ప్రకారం జీవిచడం నాగరికతా లక్షణంగా భావించేవారు. ఇటువంటి ఇళ్ళల్లోని పద్ధతులన్నీ మారిపోయాయి. ఎర్రరంగు వస్తర్ఖ్వాన్ పైని బిరియానీ ప్లేట్లు, బఘారా బైగన్ బేసన్లు పోయి, వెయిటర్లు, బట్లర్లు శుభ్రమైన బల్లలపైన మెరుస్తున్న గాజు గ్లాసుల్లో నాప్కిన్‌లు అమరేవి. నాజూకుగా నవ్వులు చిందిస్తూ లిప్‌స్టిక్ పూసుకున్న పెదవులతో సూప్, సిప్ చెయ్యడానికలవాటు పడ్డారీ వనితలు.

గౌనులు, సాక్స్ వేసుకుని రైడింగ్‌కి వెళ్ళేవారు. క్లబ్బుల్లో పార్టీలయ్యేవి, తరువాత స్కేండల్స్. కోర్ట్‌షిప్ హనీమూన్లకై ఒకప్పుడు వియన్నా, మరొకప్పుడు కాశ్మీరు, వేరొకసారి ప్యారిస్ వెళ్ళి, అక్కడి నుంచి విడాకుల కాగితాలు భద్రంగా పట్టుకుని వేరు వేరు ఓడల్లో తిరిగొచ్చేవారు. క్రొత్త జీవితానికి వేట మళ్ళీ మొదలయ్యేది.

సప్త సముద్రాల అవతల చెప్పుకునే మాటలు వీరిక్కడ చెప్పేవారు, అలాగే ఊపిరి పీల్చేవారు. కాని చుట్టుపక్కల ఉన్న వాతావరణం మాత్రం అతని ప్రాచీనమైనది.

'ఏం చెప్పమంటారు హజరత్! ఆ నవాబు వాహిద్ హుసైన్ మనుమరాలు హిందువుల కుర్రాడితో ప్రేమ కలాపాలు సాగిస్తూందట?'

'అవునండీ! నేను కూడా విన్నాను. పెదవులకి రంగు పులుముకుని అబ్బాయిల కాలేజీకి వెళుతుందిట?

'ఏమంటాం అంతా దోషమే. ఇంక మంచితనం, మాసిపోయినట్టే?

ఇలాంటి మాటలు విన్న వాహిద్ హుసైన్ అవమానంతో కృశించిపోయేవాడు.

చాంద్‌కు వయసు వచ్చేసరికి ఈ పరిస్థితుల్లో మార్పు వచ్చింది. ఉత్తర భారత దేశంలో తీవ్రమైన దేశభక్తి ప్రబలి ప్రజలు ఖద్దరు కట్టడం మొదలుపెట్టారు. తమకిచ్చిన బిరుదులు తిప్పికొట్టారు. పాతిపెట్టిన తమ

తమ పద్ధతులను తవ్వి తీయడం ప్రారంభించారు. చాంద్‌కీ హంగామా అంతు పట్టేది కాదు. ఆమె ప్రపంచం వేరు. ఉత్తర భారతం నుంచి దక్షిణానికి వీచిన గాలులతో పాటు దేశం ఎడల చిత్తశుద్ధి, భక్తి ప్రపత్తులకు సంబంధించిన నినాదం కూడా వచ్చింది. ఈ నినాదం మన సంస్కృతిని, కళలను కాపాడుకోవడానికి సంబంధించినది. భగవంతుడు సామాన్య ప్రజలను అక్బరు, రామనామ పరమైన నినాదాలతో తలలు పగులగొట్టుకోడానికి సృష్టిస్తే, అగ్రశ్రేణికి చెందిన వారంతా, ఆ నినాదాన్ని చాలా చక్కగా స్వంతం చేసుకున్నారు. పూర్తిగా యూరోపియన్‌లాగ ఉండేవారు. పూర్తిగా హిందూస్తానీగా మారిపోవడానికి చేసిన ప్రయత్నం అది. ధార్మికంగా ఉపయోగకరమైన పద్ధతులను నొక్కి వక్కాణించసాగారు. హోలీ పండుగనాడు, ఒకరు ఇంకొకరి రుమాలుపైన అతి నాజూకుగా రంగుల చుక్కలు వేయసాగారు. దీపావళి నాడు బంగళాలను దీపాలతో అలంకరించేవారు. ఈద్‌నాడు ఎంతో జాగ్రత్తగా స్నేహితులైన హిందువులకు సేమియా పాయసం తినిపించేవారు. ఇటువంటప్పుడు క్లబ్‌లో తప్పక ఒక పార్టీ ఏర్పాటు చేసేవారు. 'ఈద్ విలాప్ తర్‌కీబ్'. ఈ ఉత్సవంలో అమ్మాయిలు భరత నాట్యము, కథాకళి నృత్యం ప్రదర్శించేవారు. విరిగిపోయిన తంబూరాలతో, తమ సంగీతంలో మునిగిపోయి, దేవిడీల చీకటి గదులలో పడుండే బాబాయిలు, మామయ్యలు బయటికి వచ్చారు. అజంతా స్టయిల్ సిగలు, బంజారాల వలె కట్టుకున్న రవికలు, చేనేత చీరలు - ఇవన్నీ దేశం పట్ల తమ ప్రేమను, గొప్పగా వ్యక్తం చేసే సాధనాలుగా భావించారు.

ఉత్తర భారతంలో గాలిబ్‌పైన, మీర్‌పైన పరిశోధన చేస్తే దక్షిణాన అన్వేషకులు గోలుకొండ శిథిలాలను కలిచివేశారు. కులీ కుతుబ్‌షా, గవ్వాసీ, వజహీ, వల్లీ సిరాజల చెదలు పట్టిన కవిత్వాన్ని దులిపి, శుభ్రపరచి మ్యూజియంలో అలంకరించారు.

అటువంటి పరిస్థితులలో ఉన్నతిని కాంక్షించేవారి మొట్టమొదటి సమావేశం హైదరాబాదులో జరిగినప్పుడు, తన కూతురు చాంద్, ఎంతటి ప్రగతిని సాధించిందో చూపించేందుకు తనతో తీసుకుని వెళ్ళారు హైదర్ ఆలీఖాన్. ఆ కాలంలో ముస్లిమ్ స్త్రీలు బాహాటంగా సమావేశాలకి వెళ్ళేవారు

కారు. ఉన్నతిని కోరుకునే నినాదాలటుంచి, సమావేశానికి వచ్చిన అతిధులందరికీ హైదరాబాద్ ఎంతగానో నచ్చింది.

చాంద్, వాహిద్ హుసైన్ ఇంట ఆ విలువలకు ప్రాతినిధ్యం వహించింది. కృష్ణుడి శరీరం నీలంగా మారిపోయిందని వినికిడి. కాని చాంద్ తనకు తానై విషం మ్రింగి, ఆ విషం ఆమె శరీర ఛాయను మార్చకపోగా ఆమె నరనరాలలో ఒక విధమైన విద్యుత్తును నింపివేసింది.

ఆమె గౌన్లు వేసుకుని కాన్వెంట్‌కి వెళుతున్న రోజులలోనే, నారాయణతో, విడదీయరాని చందాన చిక్కుపడేటట్లు గాలి పటాలెగురవేసింది. నారాయణ ఇంట్లోని వారు పొడవైన వెదురుగడలకి ముళ్ళ కంపలు గుచ్చి, వాటి సాయంతో, ఆ దారం చిక్కు విడదీయాలనుకున్నారు. కాని ఆ ఆటనేవిధంగాను ముగించడానికిష్టపడలేదు చాంద్. తల్లి మరణంతో ఆమె సున్నితమైన స్వభావం, పట్టుదల ఇంకా పెరిగిపోయాయి. ఇప్పుడు చాంద్ రాషిద్-రజియాలకు ప్రీతిపాత్రురాలు. వాహిద్ హుసైన్ ఆమెపై ఎటువంటి కఠిన చర్య తీసుకునే అవకాశం లేకుండా పోయింది. పునర్వివాహం చేసుకున్నప్పటికీ హైదర్ ఆలీఖాన్ సత్యం, హక్కులు పరిరక్షించేవాడిగా తన గురించి చెప్పుకునేవారు. కాని నారాయణ, చాంద్‌ల స్నేహం విషయం ఆయనకి కూడా నచ్చలేదు. ఎప్పుడూ మృదువుగా సంభాషించే తండ్రి గర్జించగలడనీ, ప్రతి విషయంలో సమర్ధించే రాషిద్ మామయ్య కోపగించుకోగలరని ఆమెకప్పుడర్థమైంది.

అటు తరువాత వారం తిరక్కుండా నారాయణకు వివాహం చేసి తీరాలని, నారాయణ తండ్రిని, వాహిద్ హుసైన్ ఆజ్ఞాపించారు. అప్పుడు నారాయణ - చాంద్‌లు, ఆ రాత్రి విషం మ్రింగి మరణించాలని నిర్ణయించుకున్నారు.

హైస్కూలులో చదువుతున్న పదునాలుగు సంవత్సరాల చాంద్, ఆ రోజు ఆనందంతో గంతులేయసాగింది. నేటినుంచి ప్రేమకోసం ప్రాణాలర్పించిన వారిలో తనపేరు కూడా వ్రాయటమవుతుంది.

ఆమె నారాయణ తొలి ప్రేమను చవిచూసింది. షేక్స్‌పియర్, నీట్షే, మీర్, మీరాబాయిల గురించి ఆమెకింకా తెలియదు. కాని జేబున్నిస్సా షీరీ, బైలా, అనార్కలీల గాథలామె పుస్తకాలలో చదివి తెలుసుకుంది.

పార్టీలలో ఆమె చాలాసార్లు కులీకుతుబ్‌షాహ్ ఈ షీర్ పద్యం వల్లించింది.

విషం మ్రింగేటప్పుడు, విరిగిపోయిన ఫ్రేములో అస్పష్టంగా ఉండి, ఆ భవనంలో పూర్వం నివసించిన వారామెను ఆపడానికి ప్రయత్నించారు.

విషం కలుపుతున్నప్పుడు, మునాసిబ్ జంగ్, సాయబ్‌జంగ్‌ల మనుమరాలైన ఆమె విషం త్రాగకూడదని, గుడిసెలలో ఉండే వారి జీవితాలు చేదు చవిచూడడానికే ఉంటాయి, కనుక వారు విషాన్ని త్రాగుతారు, కాని ఆమె త్రాగనవసరం లేదు అన్నట్లు వినిపించింది.

ఓ వెండి గ్లాసెంతగానో బోధించింది. కాని చాంద్ రక్తంలో ఐవానే గజల్ ఏడుతరాల కవిత్వం ఎంతగా వ్యాపించిపోయిందంటే ఫర్బ్‌ద్‌ని కత్తి లేకుండానే చంపేపని చెయ్యలేకపోయింది. ఐవానే గజల్ పద్ధతినుల్లంఘించి విషం త్రాగేసింది. ప్రేమంటే ఏమిటో, దాని సిద్ధాంతాలు - నియమాలేమిటో తెలియని అమాయకురాలు! జీవితమంతా చేదు చవిచూడవలసి ఉంటుందని తెలియని పిల్ల.

ఐవానే గజల్‌లోని వారంత తెలివి తక్కువవారు కారు. ఆమె మరణిస్తే ఆ కాలపు యువకులైన కవులు కవిత్వమెలా చెప్పగలరు? అందుచేతనే వారు ఎంతోమంది డాక్టర్ల సహాయంతో ఆమెను గట్టెక్కించారు. చాలా రోజుల తరువాత ఆమెకు స్పృహ వచ్చేసరికి నారాయణ వాళ్ళింట్లో ముస్లిమ్ మీరాసినులు పెళ్ళిపాటలు పాడుతున్నారు.

రెండు, మూడు వారాలు గడిచిన తరువాత ఆమె పక్కమీదినుంచి లేచింది. నారాయణ పట్ల ప్రేమను విషం కాల్చివేసింది. పురుషులంటే అసహ్యంతో కూడుకున్న చేదు భావాలు ఆమెలో నిండిపోయాయి. ఇప్పుడామె తాతగారైన వాహిద్ హుసైన్ చెప్పిన మాటలన్నీ విని శ్రద్ధగా వాయులిన్ వాయించడంలో మునిగిపోయింది.

మెడికల్ కాలేజీలో అడుగుపెట్టేసరికి ఆమె శ్రావ్యమైన గాత్రం గురించి చెప్పుకోసాగారు. నలుగురూ ఆమెని పిలవసాగారు. సాంస్కృతిక కార్యక్రమాలన్నీ ఆమెకు అప్పచెప్పేవారు. ప్రతి నాటకంలోను ఆమె నాయిక.

కుర్రకారు ఆమె చుట్టూ తిరిగేవారు. ఆమె క్రీగంటి చూపు, చిరునవ్వు రేయింబవళ్ళు అశాంతికి ఎదుటివారిని గురిచేసేది. తన బంగారు రంగు

పొట్టిగా కత్తిరించిన జుట్టును విదిలిస్తూ పొడుగ్గా వున్న పమిటకొంగు రెపరెపలాడుతుండగా, అతి వయ్యారంగా తిరుగుతూండేది. ఆమె నారాయణ మీద పగ ఈ మగవారందరి మీదా తీర్చుకోవాలనుకునేది. అందర్నీ బాధించేది. చేయి పట్టుకున్నట్టే పట్టుకుని ఒక్క తోపు తోసేది. వాహిద్‌కి లిఫ్ట్ ఇచ్చేది, కుమారస్వామికి కూడా, కవి పహర్‌కి వయొలనిస్ట్ జోసెఫ్‌కి కూడా. కాని డాక్టర్ రహమాన్ దగ్గర ఇవేమీ పని చెయ్యలేదు. రహమాన్ మెడికల్ కాలేజి లెక్చరర్. పట్టణంలోని ప్రసిద్ధికెక్కిన గైనకాలజిస్ట్. అతను చాంద్ రుగ్మతనిట్టే పసిగట్టడమే కాకుండా, చికిత్స ప్రారంభించాడు. రహమాన్ భార్య కూడా డాక్టరే. ఆమె వేరొకచోట ఉద్యోగం చేస్తూంది.

గాలిబ్ వంటి భావాలుకల పురుషుల మనస్తత్వంపై పరిశోధన చెయ్యలేదసలు, పూలరంగడివంటి తన భర్తను నర్సులు, విద్యార్థుల మధ్య విడచి హాయిగా ఉండగలిగింది. చాంద్ అతి త్వరలో డాక్టర్ రహమాన్‌ని పరిణయమాడబోతుందన్న వార్త కాలేజంతా వ్యాపించింది. వారిద్దరూ నిత్యం కలసి కనబడసాగారు. హాస్పిటల్‌లోని ప్రైవేటు రూమ్‌లో క్లిష్టమైన రోగాల గురించి లెక్చరివ్వడానికి చాంద్‌తో గంటల తరబడి కూర్చునే వాడాయన. చాంద్ అతని కారులో పిక్‌నిక్‌కి వెళ్ళేది. సినిమా చూసేది, కొత్త కొత్త బహుమానాలతో ఇల్లు చేరేది. హైదర్ ఆలీఖాన్ లోలోపల కోపంతో ఉడికిపోతున్నాడు. డాక్టర్ రహమాన్ వద్దనుంచి కబురు రాగానే, ఈ ప్రేమకి తగ్గ ఫలితాన్ని రుచి చూపించాలని నిర్ణయించుకున్నాడు. కాని అకస్మాత్తుగా కూర్చున్నవాడు కూర్చున్నట్టే మరణించాడు. ఆయన మరణించడంతోటే ఆయన వద్ద బంగారు ఇటుకలకి మారుగా అప్పులనే బండరాళ్ళని దాచిపెట్టాడన్న విషయం తేటతెల్లమైంది. డాక్టర్ రహమాన్ ఒకనాడు అకస్మాత్తుగా తన భార్య ఉన్న ప్రదేశానికి బదిలీ చేయించుకుని, తనని కలవకుండానే వెళ్ళిపోయాడన్న వార్త చాంద్‌కి తెలిసింది. హైదర్ ఆలీఖాన్‌కి ఆమెపైన చాలా కోపం వచ్చింది. ఇప్పుడతను ప్రతి నెలా మొదటి తేదీన కూతురి దగ్గర కొచ్చి ఆమె ఎడల తనకుగల ప్రేమను వ్యక్తం చేయడానికి బదులు, ఎవరిచేతనో నూరు రూపాయలు పంపడం మొదలుపెట్టారు.

అది అటువంటి విషాదోదయం - చాంద్ లేస్తూనే వయోలిన్ వాయిస్తూ

గాలిబ్ గీతాన్నాలపించింది.

వాహిద్ హుసైన్, తప్పులతో పాడే ఈ గీతాన్ని, తన మరణించిన కూతురి ఏకైక చిహ్నమైన చాంద్ పాడుతుందన్న ఉద్దేశ్యంతో కాకుండా, రజియా-రాషిద్‌ల ప్రేమపాత్రురాలైన మేనకోడలు చాంద్ పాడుతుండడం వలన సహించేవారు.

రాషిద్‌కి నచ్చిన వారికి వ్యతిరేకంగా ఏమైనా అనే సాహసం గౌహర్ అత్తకిగాని వాహిద్ హుసైన్‌కి గాని లేదు.

కాని చాంద్ మూర్ఖత్వాన్ని విధిలేక సహించడం వల్ల వాహిద్ హుసైన్ పరిస్థితి దిగజారడం ప్రారంభించింది. ఆ కాలానికి సంబంధించిన ప్రగతి, సమాజంలో జరుగుతున్న మార్పులు, ఆ ఇంటి నుంచి వెళ్ళిపోయాయి. ఆయన కుమార్తెలిరువురినీ కేవలం ఉన్నత పాఠశాల వరకు మాత్రమే చదివించారు. పది, పదకొండు సంవత్సరాల వయస్సు వచ్చేవరకు అప్పటి, ఉన్నత శ్రేణికి చెందిన ముస్లిమ్ కన్యలు ధరించేటటువంటి దుస్తులు మాత్రమే ధరించేవారు అ పిల్లలు. ఇంకొంచెం పెరిగేసరికి బీబీవారిని కట్టుదిట్టంగా పరదాలో ఉంచింది. అందువలన, మంచి సంబంధం వచ్చిన వెంటనే వివాహాలు జరిగిపోయాయి, తన మనుమరాలు, మగపిల్లలతో కలసి డాక్టరీ చదువుతూందన్న వాస్తవం వాహిద్ హుసైన్‌కి చేదు నిజమే అయింది. ఆమె పరదా లేకుండా తిరిగేది. మేకప్ చేసుకుని డ్రామాలలో పాల్గొనేది, పాటలు పాడేది. ఈ పరిస్థితులలో కంగారు పడిన వాహిద్ హుసైన్ ఈ విషయంలో బీబీ గౌహర్ బేగమ్‌ల సహాయాన్ని ఆపేక్షించారు. కాని బీబీ, ముఖ్యమైన ఆ విషయంలో మౌనం వహించింది. గౌహర్ బేగమ్ కూడా ఆమెకు వంతపాడింది. ఆమె, చాంద్ మేకప్, పార్టీలు మొదలైన విషయాలన్నిటిలోనూ కల్పించుకోవడం, అడ్డు చెప్పడం మానివేసింది. చాంద్‌ని సర్వవిధాలా సమర్థించే రాషిద్-రజియాలు ఆ ఇంట్లో ఉండడమే ఇందుకు గల కారణం, గౌహర్ బేగమ్ చాలా సార్లు ఆలోచించేది. తాను కూడా ఆ ఇంట్లో నివసించిన కన్యే. తన యౌవనాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేసింది కాని ఎవరికి తెలియనివ్వలేదు. ఈ ఇంట్లో ఒక అవివాహిత దుర్భరమైన జీవితాన్ని గడుపుతూందన్న విషయమే ఎవరికీ పట్టలేదు. ఎప్పుడన్నా, ఏదన్నా సంబంధం వస్తే, అన్నద

మ్ములిద్దరూ గుసగుసలాడేవారు. చివరికి మెల్లిగా, ఆమె వినేటట్లు, 'అటువంటి పనికిమాలిన వానికిచ్చి పెళ్ళిచేసేకంటే గౌహర్‌బేగమ్ అవివాహితగా ఉండడమే మంచిది,' అనేవారు.

ఎవడికో ఒకడికి కట్టబెడితే భగవంతుడు క్షమించుగాక! బాబాయిగారికి సమాధిలో కూడా శాంతి లభించదు.

అప్పుడప్పుడు మంచి హుషార్‌గా ఉన్నప్పుడు, 'చాలు, ఇంక ఊరుకుంటే లాభంలేదు. ఈ సంవత్సరం గౌహర్ బేగమ్ బాధ్యతను నెరవేర్చాలి,' అనేవారు వాహిద్ హుసైన్.

అది విన్నప్పుడు, ఇరవై మూడు సంవత్సరాల గౌహర్ బేగమ్, 'యా అల్లాహ్, నన్నూ అదృష్టవంతురాల్ని చెయ్యి. నా జీవిత భాగస్వామిని పంపు, అని మెల్లిగా ప్రార్థించేది.

భగవంతుడు ఆమెకు వివాహయోగం వ్రాయలేదేమో, సంవత్సరాలు గడిచిపోతున్నా ఆమె అవివాహితగానే మిగిలిపోయింది. ఇప్పుడామె వయస్సు నలభై ఏళ్ళు. 40 ఏళ్ళ స్త్రీని ఎవరు వివాహం చేసుకుంటారు?

గౌహర్ బేగమ్‌కి తమ ఎడలగల ప్రేమ, ఆమె చేసే సహాయం చూసి సిగ్గు పడుతూ వాహిద్ హుసైన్, ఆమెతో, 'గౌహర్‌బేగమ్ నీ డబ్బుకి సంబంధించిన జమాఖర్చుల వివరాలు మా దగ్గర తీసుకుంటూండు,' అంటూండేవారు.

'నేనేం చేసుకుంటానన్నయ్యా! మీ దగ్గరే ఉంచుకోండి' కనీసం అప్పుడప్పుడు నీ నగలు, విలువైన దుస్తులన్నా వేసుకుంటూండు. రజియా వద్ద ఎన్నాళ్ళని ఉంచుతావు?'

'ఎందుకు వేసుకోవాలి, ఆ దుస్తులు, నగలు?' ఆమె విసుగ్గా ప్రశ్నిస్తే వాహిద్ హుసైన్ జవాబు చెప్పలేకపోయేవారు. గౌహర్ అత్త పదహారు, పదిహేడేళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడామెను ఎవరూ విలువగల దుస్తులు నగలు వేసుకోనివ్వలేదు, ఎందుచేతనంటే ఆ రోజులలో కన్యలను ఎక్కువగా అలంకరించుకోనిచ్చేవారు కాదు. తల్లి దండ్రులు మరణించగానే వివాహానంతరం ఉపయోగించుకోవచ్చునన్న ఉద్దేశ్యంతో, ఆమె వాటిని దాచి ఉంచింది. కాలు విరిగిన తరువాత తనను చూసి ఎవరైనా హేళన చేస్తారేమో అన్న సిగ్గుతో వాటినెప్పుడూ వాడలేదు. ఆమె నిత్యం

సామాన్యమైన తెల్లని దుస్తులు ధరించేది. చేతులు, మెడ ఎప్పుడూ బోసిగానే ఉండేవి. ఆమె బాల్యం నుంచి, ఎప్పుడు యౌవనంలో కడుగిడిందో, ఎప్పుడు వృద్ధాప్యపు అంచులు చేరుకుందో ఆమె జుట్టిలా నెరిసి పోయిందో ఇంట్లో చాలా కొద్దిమందికి తెలుసు. ఇప్పుడామె ముఖాన ముడతలు కనబడుతున్నాయి. ఆమె పని చేస్తూ ఆయాసపడిపోతూంది. ఇటువంటి జీవితం గడుపుతూ కూడా. ఆమె ఏ పురుషుడికేసి నవ్వుతూ చూడలేదు. తనను బలవంతంగా పల్లకీలో కూర్చోపెట్టగలిగే పురుషుడి కోసము మాత్రమే వేచి వున్న ఆమె ఎక్కడికీ తిరగడానికి వెళ్ళేదికాదు. ఆమెకెటువంటి సరదాలు ఉండేవి కావు.

అన్ని పద్ధతుల ప్రకారం జరిగే ఆ ఇంట్లో చాంద్ స్వేచ్ఛ అందర్నీ ఆశ్చర్యపరచేది. వాహిద్ హుస్సైన్ కేకలేస్తే, రాషిద్ ఆయనకి నచ్చచెప్పేవాడు.

'చాంద్ డాక్టరైనప్పుడు తెలుస్తుంది, వంశానికెంత పేరు ప్రతిష్టలు లభించాయో. ఏ జాగీర్దార్ల వంశంలోనైనా లేడీ డాక్టరుందా?'

'మరి ఈ నృత్యగానాలు! కొంచెం నలుగురి మాటలూ వింటే తెలుస్తుంది, ఎలా ఉమ్మేస్తున్నారో!' గౌహర్ బేగమ్ కోపంగా అంది.

'ఒక్క విషయమైతే అనుకోవచ్చు' వాహిద్ హుస్సైన్ వెంటనే ఆమెను సమర్థిస్తూ అన్నారు. మీ మనుమరాలికింత స్వేచ్ఛ ఎందుకిచ్చారండీ అని అంతా అడుగుతున్నారు.'

'ఎవరంటున్నారు?' రాషిద్‌కి కోపం వచ్చింది. 'నాముందరనమనండి. నాకందరి విషయాలు తెలుసు. బషీర్ అక్కయ్య, బతూల్‌లను చూశారుగా. వారికి కనుక చదువు సంధ్యలుండి ఉంటే, అలా బాధలు పడి ప్రాణాలొదిలేవారు కాదు.'

రాషిద్ ఉన్నతిని సాధించడంవంటి, విషయాలంటే ఎక్కువ ఇష్టపడేవాడు కాదు. కాని అవకాశాలను బట్టి పనులు చేస్తూండేవాడు. ఇంజనీర్‌గా పని చేయడమే కాకుండా అతడు మట్టి, సున్నం, రాళ్ళ వ్యాపారం కూడా చేస్తున్నాడు. వ్యాపారం కూడా చేస్తున్నాడు. వ్యాపార పరమైన విషయాలనతను అవగాహన చేసుకుంటున్నాడు. చాంద్‌వంటి చదువుకుని సభ్యత తెలిసి ఉన్న అధునాతన అమ్మాయిలకి ఎంత విలువ

ఉందో అతనికి తెలుసును. వారి సహాయంతో లక్షలతో కూడిన కాంట్రాక్టులు సంపాయించవచ్చునన్న విషయం అతనికి బాగా తెలుసు.

'అంతా మన అదృష్టం. అంతా జాగ్రత్తగా చూసి మేము పిల్లనిచ్చాము. కాని వారి దురదృష్టం వలన వాళ్ళ సంసారాలలాగయ్యాయి.'

దుఃఖంతో వాహిద్ హుస్సైన్ కంఠం గద్గదమయేది. పొయ్యి దగ్గర బిస్మిల్లాహ్‌బీ పెరుగుకుండ పెట్టడానికొక ఉట్టి కట్టింది. అక్కడ రెండు కాకులు జంటగా చేరి కావ్ కావ్ అంటున్నాయి. రోడ్డు మీంచి మట్టి, ఊరగాయలు అమ్మేవారి కేకలు వినిపిస్తున్నాయి. రజియా కొంగు పట్టుకు ఇస్త్రీ చెయ్యని యూనిఫారమ్ పట్టుకుని తిరుగుతూంది.

'ఇవాళ సలారు ఖీమా తీసుకురాడా? నేను వంటెలా చెయ్యను?' అంటూ గావు కేకలు పెడుతుంది బిస్మిల్లాబీ.

రజియా తలపైన కప్పేసుకున్నప్పటికీ తెల్లవారి పోయిందని ఊహించుకుంది గజల్. 'ఐవానే గజల్'లో ప్రతి ఉదయం ఇలాగే హడావిడిగా ఉండేది. రజియాని తొలగించి కళ్ళు కొద్దిగా తెరచి చూసిన గజల్‌కి, సపోటా చెట్టుక్రింద స్టౌవ్ పెట్టి క్యారెట్ మురబ్బా చేయిస్తూ, ఒక చేతితో జపమాల రెండవ చేతిలో చెమ్చా, నోటినుంచి అసభ్యకరమైన తిట్లతో తాతగారు కనబడ్డారు. వాహిద్ హుస్సైన్‌కి ఎప్పుడైనా మురబ్బా ఊరగాయలు తయారు చేయాలన్న మనసు కలిగితే సరి ఇల్లంతా నానా గొడవగానూ ఉండేది. విచిత్రమేమిటంటే ఎప్పుడూ దోమతెరలో పడుకుని ఉండే బీబీ కూడా కావల్సిన ఏర్పాట్లలో మునిగిపోయింది. పిల్లల్ని స్కూలుకి పంపించడం కోసం వారిని తయారు చెయ్యడానికి బదులు రజియా తోటలో గలగబా తిరుగుతూంది. స్టోర్ రూమ్ తాళాలు చేతబట్టుకుని గౌహర్ అత్త ఎప్పుడు ఏ వస్తువు అవసరమైతే వెంటనే పంపడానికి సిద్ధంగా నిలబడి ఉంది. వాహిద్ హుస్సైన్ కేకల మధ్య, చాంద్ గొంతు వినబడడం లేదు. వాహిద్ హుస్సైన్ గరిటతో కదిపే పద్ధతి నచ్చకపోవడం వల్ల బిస్మిల్లాబీకి చిరాకుగా ఉంది. వేడిగా ఉన్న గరిటెను పట్టుకోబోయిన ఆయన చెయ్యి కాలిపోయింది. వేళ్ళు మొదలుకుని అరిచెయ్యివరకు ఎవరో వేడి ఊచతో కాల్చినట్లయింది. దీనికి బిస్మిల్లాబీని నిందించాలో, లేక సరిగ్గాలేని ఆ పెద్ద గిన్నెనే నిందించాలో ఆయన ఇంకా నిర్ణయించు

కోలేకపోయారు. అప్పుడు కర్ణబేరిని, చేధిస్తూ చాంద్ పాట వినిపించింది.

'ఎవరు... గాలిబ్‌ని సరిదిద్ద ప్రయత్నిస్తున్న దెవరు? మూర్ఖత్వానికి కూడా హద్దుండాలి! గాలిబ్ షేర్ కూడా తప్పులతో చదువుతున్నారు?

'ఆహా, తప్పెందుకవుతుంది?' చాంద్ మరొకసారి పాడడానికి ప్రయత్నించసాగింది.

'సరిసరి, మంకుపట్టు కూడానా? ఓసి మూర్ఖురాలా, అది చౌకసీ -ఏ - ఇష్క్, చౌబసీ-ఏ-ఇష్క్ కాదు.' 'ఊహ్! అయితే అయిందిలెండి!' ఏడవడమన్నది తప్పనప్పుడు అది 'బౌబసీ' అయితేనేం 'చౌకసీ', అయితేనేం? రెండింటికీ పెద్ద తేడా ఏముంది.

గబగబా జపమాల తిప్పుతూ, 'అందుకే నాకు ఒళ్ళుమండుతుంది అన్నారాయన.

'ఈ స్త్రీ జాతే ఇంత, మూర్ఖత్వానికి మారుపేరు. డాక్టరీ చదువుతూంది. కాని గాలిబ్ వ్రాసిన ఒక్క పంక్తి సరిగ్గా చదవలేదు' వేళ్ళ మంట శరీరమంతా పాకినట్లయింది. ఈ కోపం ఎవరిమీద చూపించాలా అని ఆలోచిస్తున్న ఆయనకి పడుకున్న గజల్ కనబడింది.'

'ఓహో, అమ్మగారింకా నిద్రపోతున్నారన్నమాట!'

రజాయిలోంచి ఇవి విన్న గజల్ కంగారుపడింది.

'గజల్‌నేమీ అనకండి...', నెమ్మదిగా అంది బీబీ, దిగులుగా ఉన్న బీబీ ముఖం చూసి, ఆవిడ మాటని ఒప్పేసుకున్నారాయన.

'అమ్మయ్య, బ్రతికిపోయాం...' గజల్ రజాయి తీసి పారేసి నీళ్ళగది కేసి పరుగెట్టింది. బాత్‌రూమ్‌కెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కోడంలో ఎన్నో లాభాలున్నాయి. పళ్ళు తోముకున్నారో లేదో ఎవరికీ తెలియదు. సబ్బుతో కళ్ళు మండే బాధుండదు. చాలాసేపు కుళాయి నుండి వచ్చే నీటిధారని చేత్తో కొడుతూ ఆడుకుంటూ వుండిపోయింది. అప్పుడే రజాయిలోంచి బయటికి వచ్చిన వెచ్చని శరీరం పైన పడుతూన్న చల్లని నీటి తుంపర, మంచులాగ వుంది. సన్నటి నీటి ధారలోని కొన్ని నీటి బిందువులు ఆమె శిరస్సునలంకరించాయి. బట్టలనుంచి నీరు కారుతూండగా, మెల్లిగా వచ్చింది గజల్, బయటికొచ్చిన తరువాత పారిపోతున్న అపరాధిలాగ సురక్షితమైన ప్రదేశం కోసం వెతుక్కుంది. అంతలోనే చాడీలు చెప్పే స్వభావంగల

ఫౌజియా ఆమెను పట్టుకుని, 'అమ్మా, అమ్మా గజల్‌ని చూడు...!' అంటూ గట్టిగా నవ్వసాగింది.

తెల్లటి ఫ్రాక్ వేసుకుని, ఆకుపచ్చ రిబ్బన్‌తో జట్టు కట్టుకుని, తెల్లటి జోళ్ళు టకటకలాడిస్తూ తిరుగుతూంది ఫౌజియా. గజల్ దుస్తుల మాట వింటూనే పంతం మాని అటు చూశాడు షాహిన్. ఆయా చేతుల్లోంచి తప్పించుకుని ఇటూ - అటూ పరుగెడుతున్నాడు షాహిన్. ఆ పిల్లవాడు గజల్‌ని చూసి నవ్వసాగాడు, కేవలం తన చెల్లెలు ఫౌజియాని తృప్తిపర్చడానికి మాత్రమే, ఎందుచేతనంటే అతడి బట్టలు శుభ్రంగా లేవు. ఆ తడి బట్టలతో వణుకుతూన్న గజల్‌ని చూసేసరికి తనుకూడా కుళాయి కింద కూర్చుని బాగా అల్లరి చెయ్యాలనిపించింది.

'ఇదిగో బతూల్ బేగమ్! మీ అమ్మాయి ఎలా తయారయ్యిందో కొంచెం చూడు' నేలంతా బురద - బురద చెయ్యడంతో విసుక్కుంటూ అంది రజియా.

'నా గదిలోకి వెళ్ళకు తివాసీ పాడయిపోతుంది.'

అత్త మాటలు గొంతు వింటూనే తల్లి కొట్టబోయే దెబ్బలనూహించుకుని, కళ్ళు మూసుకుంటు రెండు చేతులూ తలపైన పెట్టుకుని నిలబడింది. తల్లిచేత దెబ్బలు తిని, గట్టిగా అరుస్తూ నేలమీద పడి పొర్లుతూన్న గజల్‌ని చూసి, కన్నీళ్ళు తుడుచుకుంటూ చాంద్ వయలిన్ పక్కన పెట్టేసింది. గజల్ దెబ్బలు తినడం తమాషాగా చూడసాగారు షాహిన్, ఫౌజియాలు.

ఏదీ, నా బెత్తం తీసుకురా...!' గర్జించారు వాహిద్ హుసైన్.

నిశ్శబ్దంగా మారిపోయింది వాతావరణం. గజల్ ముందు గొంతు పెంచి తరువాత ఊరుకుంది. డ్రిల్ చేస్తున్నప్పుడు ఎటెన్షన్‌లో నించుని, తండ్రి చొక్కా కత్తిరించి కుట్టిన ఆ దరిద్రపు కుర్తా కూడా వేయించుకుంది.

రజియా షాహిన్, ఫౌజియాలను లోపలికి తీసుకువెళ్ళిపోయింది. ఈ మొండి పిల్ల, తన పిల్లల్ని పాడు చేసేస్తుందేమో అని రజియాకి భయం.

'నేను గుడ్డు తినను ఒక కప్పు పాలే తాగుతాను' ఈ ప్లేటు అసహ్యంగా వుంది, ఆయా సబ్బు రాయకుండానే చేతులు కడిగేసింది, అంటూ ఫౌజియా గొడవ చెయ్యసాగింది.

రజియా ప్రేమగా మరిపిస్తూంది. ఎప్పుడైనా రాషిద్ కొంచెం కోప్పడితే,

'నా మనుమరాల్ని నువ్వు తిట్టొద్దు,' అనేవారు వాహిద్ హుసైన్.

నాలుగు సంవత్సరాల ఫౌజియా అంటే తాతగారికి, నానమ్మకి ఎంతో ముద్దు.

షాహీన్‌కిప్పుడేడేళ్ళు, తను పెద్దవాడినని, తెలివైన వాడిననీ భావించి, పట్టుపట్టడం మానేశాడు. టిఫిన్ తినేటప్పుడు షాహీన్ తాతగారి ప్రక్కన కూర్చునేవాడు. తను ఫౌజియా, గజల్‌ల కంటే మూడేళ్ళు పెద్దవాడినని ఎప్పుడూ అనుకునేవాడు. అతడికి ఎన్నో ఇంగ్లీషు పద్యాలు వచ్చు. తన క్లాసులో ఎప్పుడూ ఫస్టొచ్చేవాడు. పాపం ఫౌజియాకి ఏ, బి, సీ, డీలే సరిగ్గా రావు. షాహీన్ తన చిన్నకారులో కూర్చుని నడిపిస్తూంటే, అది ఎలా నడుస్తుందో, ఆ రహస్యమేమిటో గజల్‌కి అసలు అర్థమయ్యేది కాదు. ఈ మధ్య అతడు తన వద్దనున్న రంగురంగుల బొమ్మల పుస్తకంలోంచి, చెల్లెలికి ఎన్నో కథలు శ్రద్ధగా చెబుతున్నాడు. ఇటువంటి సందర్భంలో ఎప్పుడైనా గజల్ అక్కడికి వస్తే, అన్నా చెల్లెళ్ళిద్దరూ వెంటనే ఆ పుస్తకాన్ని దాచేసేవారు. గజల్‌కి రంగురంగుల చిత్రాలు తినడమంటే చాలా ఇష్టం. అవి చాలా తియ్యగా ఉంటాయనేదా పిల్ల.

ఒకరోజు ఎలా ఉంటుందో తెలుసుకోవడం కోసం ముగ్గురూ కలిసి షాహీన్ పుస్తకం మొత్తం తినేశారు. అప్పుడేమంత గొప్పగా అనిపించలేదు. అంత ఆనందంగానూ లేదు. కాని రజియాకి విషయం తెలిసినప్పుడు మాత్రం ముగ్గురూ కలిసి చేసిన పనికి ఫలితం షాహీన్ ఒక్కడే అనుభవించవలసి వచ్చింది.

రకరకాల కథలు చెప్పే తాతగారంటే షాహీన్‌కెంతో ఇష్టం. పెద్దయ్యాక గడ్డం పెంచుకుని, తహసీల్దారుగా పనిచేస్తూ కవిత్వం చెప్పాలని అతడెప్పుడో నిర్ణయించుకున్నాడు. అన్నం తింటున్నప్పుడు, పూర్తిగా తాతగారి అనుకరించేవాడు. తాతగారిలాగే నాలుగు వేళ్ళతో ముద్ద చెయ్యడం, ఊరగాయలు, చింతపండు పులుసుతో చేసిన కూరలు తినకపోవడం అంతా ఆయనలాగే చేసేవాడు.

కూరలలో చాలా తక్కువ ఉప్పు వేసేవారు. టిఫిన్ తినడానికి ఖమీరా మరవాదీద్ తిని ఓవల్టీన్ త్రాగేవారు. ఎంత జాగ్రత్తగా, నాజూకుగా తినేవారంటే, ఈ లోపు ఇంటిల్లిపాదీ, టిఫిన్ చెయ్యడమయిపోయేది. గ్లాసు

ఎడమచేతితో పట్టుకోవాలి. కూర పూర్తిగా తినేస్తేకాని తిరిగి వేసుకోకూడదు. మధ్య మధ్యలో తాతగారి ఔషధ సేవనం జరిగేది. తినడానికి ముందొక మందు, తింటూన్న సమయంలో ఒకటి, తినడమయిపోయిన తరువాత మరొకటి, ఎప్పుడామందు తీసుకోవాలో, ఎంత తీసుకోవాలో, జ్ఞాపకం చెయ్యడం కూడా షాహీన్ పని.

టేబుల్ దగ్గర వారందరినీ ఒకసారి చూసింది గజల్. ముందుగా గుడ్లున్న ప్లేటు లాక్కుని అతి కష్టం మీద రెండు గుడ్లు తీసుకుంది. తరువాత ఖిచిడీ ఉన్న గిన్నెలోంచి ఎంత ఒంపుకుందంటే, ప్లేటుతోపాటు ఊరగాయి ఉన్న గిన్నె, ఆమ్లెట్ ఉన్న ప్లేటు కూడా మెతుకులతో నిండిపోయింది. చాంద్ తన ప్లేట్‌లో ఒక ఆమ్లెట్ ముక్కొకటి వేసుకుని ఫోర్క్‌తో ఆడుతూంది. ఆమె కళ్ళు వాచి ఉన్నాయి. ముఖం దిగులుగా ఉంది. గజల్ దృష్టి ఏ వస్తువుమీద పడితే అది వెంటనే గజల్‌కి అందేటట్టు చెయ్యాలని చూస్తూంది చాంద్. అతి చురుకుగా ఆ పని తానే చేసి అక్కకి శ్రమ లేకుండా చేస్తుంది గజల్. బోలెడంత వెన్న, గుడ్లు, ఊరగాయి ఖిచిడీలో పిసికేసి, తిన్నంత తిని విసిగిపోయిన తరువాత, ముక్కు తుడుచుకుంటూ పరోటాలకేసి చూసింది. కాని అకస్మాత్తుగా తల్లి చల్లని చెయ్యి సంకెళ్ళలాగ గజల్‌చేతిని పట్టేసుకుని గట్టిగా కొట్టేసరికి, నోట్లో కుక్కుకున్న అన్నం బైటికొచ్చిపడింది. గజల్ కుర్చీకింద పడిపోయింది. అందరూ బతూల్‌ని కేకలెయ్యడం మొదలెట్టారు.

అయ్యో! నువ్వెంత కఠినాత్మురాలవు బతూల్ బేగమ్! నేనెప్పుడూ నా పిల్లల్ని కొట్టలేను బాబూ!' అంది రజియా.

'తల్లీకూతుళ్ళిద్దరూ వట్టి మూర్ఖులు!' వాహిద్ హుసైన్ నెమ్మదిగా ఓవల్టీన్ తాగుతున్నారు. ఫౌజియా, షాహీన్ గజల్ దెబ్బలు తినడం చూసి నవ్వసాగారు.

'పెద్ద పిల్లలిలా ఉంటారు. చూశారా మీరు!' రాషిద్ ఫౌజియా, షాహీన్‌లకు బోధపరచాడు.

చాంద్ తన తెల్ల జార్జెట్ మీద బడ్డ మెతుకులు, కూర మరకలు జాగ్రత్తగా తుడువసాగింది. బీబీ ఈ తమాషాని చూస్తూ మౌనంగా ఒక్కొక్క రొట్టిముక్క తినడానికి ప్రయత్నిస్తూంది. ఈ మధ్య చాంద్ కారణంగా

ఇంటి వాతావరణం గంభీరంగా ఉంది. డాక్టర్ రహీమాన్ తిరిగి బొంబాయి వెళ్ళిపోయాడని, చాంద్ ఒంటరిగా ఏడుస్తూందని అందరికీ తెలుసు. కాని అంతా ఇదేమీ తెలియనట్టే ప్రవర్తిస్తున్నారు.

గజల్‌ని కొట్టిన తరువాత ఎవరికీ జవాబు చెప్పకుండా, కళ్ళు తుడుచుకుంటూ గదిలోంచి వెళ్ళిపోయింది బతూల్. 'మనిల్లు కనుక సరిపోయింది. కాని బతూల్, గజల్‌ని సరిగ్గా పెంచలేదు.' ఆగి, ఆగి అన్నాడు రాషిద్.

రజియాకి చాంద్ అంటే ఎంత ఇష్టమో, బతూల్ అన్నా గజల్ అన్నా అంత అసహ్యమని రాషిద్‌కి తెలుసు కాని బీబీ తండ్రిగారి వల్ల సహించవలసి వస్తూంది. ముఖ్యంగా తల్లి ముఖంలో స్పష్టంగా కనబడుతున్న నిస్సహాయత చూసి అతనికెంతో సానుభూతి కలిగేది. అతడు తన తల్లిని చాలా అభిమానించేవారు. ఆమె కోరుకున్నట్టు ఎల్ల వేళలా ఆమెను సంతోషపెట్టడానికి ప్రయత్నించేవాడు. అయినా అంతా కలిసి ఆమెను బంధించి కాపలా కాస్తూన్నట్టనిపించేది అతనికి. బీబీ అంతరంగంలోని మొండి స్వబావం ఓటమినంగీకరించదా అసలు? నిజానికి ఆమె ఎంతో కష్టపడి తన బాధ్యతలన్నీ నిర్వర్తించింది, కాని తల్లిగా, నానమ్మగా ఆమె ఎప్పుడూ ప్రవర్తించేది కాదు.

'బతూల్‌కేమైనా ఇవ్వాలనుకుంటే ఇచ్చెయ్యండి. పాపమైనా పోతుంది!' బీబీ నెమ్మదిగా వాహిద్ హుసైన్‌తో అంది.

'నా దగ్గరేమైనా కారూన్ ఖజానా ఉందా?' ఆయన విసుక్కున్నారు. 'ప్రతినెలా రెండు వందలు నేనెక్కడినుంచి తీసుకురాను? మీ అల్లుడు బాగా మరిగాడు ఎప్పుడూ చెయ్యిజాపే ఉంటుంది?.

'దానికి బతూల్ ఏం చెయ్యగలదు?' బీబీ కంఠం రుద్ధమైపోయింది. 'అతడు బతూల్‌ని చావకొట్టి పంపిస్తున్నాడు. డబ్బు తీసుకెళ్ళకపోతే మరింతగా హింసిస్తాడు.'

నన్ను ముక్కలుగా కోసి ఇచ్చెయ్యి' వాహిద్ హుసైన్ అరవసాగారు.

రజియా, రాషిద్‌లు ఈ విషయంలో పూర్తిగా మౌనం వహించారు.

ఆ బల్ల వద్ద నుంచి లేస్తూ, ఈ బాధాకరమైన వాతావరణం నుంచి ముక్తి పొందాలంటే బయాజ్ (పుస్తకం) తెరవాల్సిందే అనుకుంటూ సిగార్

వెలిగించుకుని అలమారలో వెతకసాగారు.

ఫౌజియా, షాహీన్‌లిద్దరూ స్కూల్‌కెళ్ళడానికి తయారయ్యారు.

రజియా, గౌహర్ అంతా కూర్చుని తాంబూలం వేసుకుంటున్నారు. తీవ్రమైన చర్చలో మునిగి వున్నారు.

'ఇదంతా చాంద్ అనుకరణలాగుంది. భగవదేచ్ఛ, ఫాతిమా బేగమ్ కూతురు కైసర్ కాలేజ్‌లో చదువుతూందిట. ఇది ప్రళయానికి చిహ్నాలు. నీచులింతగా పేట్రేగిపోతున్నారు!' అత్త ముక్కున వేలేసుకుంటూ అంది.

'బేగమ్ కాలి నడకన వెళుతూందిట కాలేజికి, అది తెలుసా! రజియా వ్యంగ్యంగా అంది. 'డబ్బు లేనప్పుడు గొప్ప వాళ్ళననుకరించవలసిన ఆగత్యమేమొచ్చింది? స్వర్గస్థురాలైన బషీర్ ఆపా - బ్రతికుంటే ఏం చేసేవారో?'

'ఏం చేస్తుంది పాపం... ఏదో పెద్ద దేవిడీలో బేగమ్ లేక ఖవాసే, అయ్యేంతటి అందచందాలు లేవు కదా!' బీబీ మాటలకి అత్త జాగ్రత్తగా ఆమెకేసి చూసి లోపల గదిలో ఏడుస్తూన్న బతూల్‌తో అంది.

'ఇంక ఊరుకో బతూల్ పాషా!'

బీబీదగ్గర కూర్చుని కింద పడిన వక్క ముక్కలు, తమలపాకు తొడిమలు నోట్లో పడేసుకున్న తరువాత, గజల్, చాంద్ గదికేసి బయలుదేరింది.

చాంద్ తెల్లని చీర కట్టుకుని, చేతుల్లేని రవిక వేసుకుని, బంగారం రంగు జుట్టును కొంచెం ముఖం మీద వేసుకుని కుర్చీలో కూర్చునుంది. ఆమె రూపం ఒక పెయింటింగ్‌లా ఉంది.

ఆమె మౌనంగా ఉండడం చూసి గజల్‌కి బల్లమీద పెట్టి ఉన్న రంగు రంగుల సీసాలను, డబ్బాలను తాకడానికి ధైర్యం చాలలేదు. దేవ కన్యలు నివసించే స్థలంలాగ అందంగా ఉంది చాంద్ గది. వరండాలోంచి వెళితే ఆ గదిలోంచి సువాసనలు వస్తూండేవి. చాంద్ స్వయంగా లోపలికి రమ్మని పిలుస్తుందన్న ఆశతో తలుపు దగ్గర నిలబడిపోయిందా పిల్ల. ఐవానే గజల్‌లో ఒక్క చాంద్ మాత్రమే గజల్ చేసే అల్లరి పనులకి ఎప్పుడూ నవ్వలేదు, కేకలెయ్యలేదు, తన గదిలోంచి బయటికి పొమ్మని ఆదేశించలేదు. ఒకసారి చాంద్ తను ఎంతో శ్రద్ధగా దాచుకున్న పాత షేఫూన్ రుమాలు గజల్ కిచ్చింది. చాంద్ అంటే గజల్‌కి చాలా అభిమానం,

నిజానికి ఆమెను చూసే అవకాశం గజల్‌కి చాలా తక్కువగా లభించేది. ఎప్పుడో కాని గజల్ తాతగారింటికి వచ్చేది కాదు. కాని చాంద్‌తో కలిసి ఉన్న కాస్సేపూ ఆమెను తాకి - తాకి చూస్తూండేది. అలా చూస్తూంటే చాంద్‌కి నవ్వొచ్చేది. చాంద్ ఊరికే నవ్వుతుండేదెప్పుడూ. ఆమెకి చాంద్ అని పేరుపెట్టి ఎవరో తెలియకుండానే ఆమెనవమానించారు. సహాస్రాదిత్యులుదయించినా ఆమె ముందు దిగదుడుపే. సినిమాలలో ఆడుతూ పాడుతూండే బొమ్మలాగే ఉండేదామె. సువాసనలు గుబాళించే దుస్తులు, కత్తిరించిన బంగారు రంగు కేశాలు, నీలి రంగు కన్నులలో, పన్నీటిలో ఈదుతున్న బంగారు రంగు చేపల వంటి కనుపాపలు. చాంద్ అక్కయ్యనే పెళ్ళిచేసుకోవాలని, తన మనసులో దృఢంగా నిర్ణయించుకుంది గజల్, ఈ విషయం ఫౌజియాకి కూడా చెప్పలేదు. చాంద్ మేనమామకి పనులెన్నో చక్కబడ్డాయి. ప్రభుత్వపరమైన పెద్ద పెద్ద ఫంక్షన్‌లో ఆమె ప్రోగ్రామ్ ఉండేది. కాలేజీలోని ప్రతి డ్రామాలోనూ ఆమే నాయిక. వార్తా పత్రికలామె కళ గురించి వ్యాసాలు వాసేవి. ఈ విధంగా ఉన్నత స్థాయికి తాను చేరుకోవడమే కాకుండా రాషిద్‌ని కూడా చేరుకునేటట్టు చేసిందామె.

అందమైన అక్క అంటే గజల్‌కి ప్రాణం. ఆమెకి టిఫిన్ తినేటప్పుడు, అప్పడాలు తినడమంటే అసహ్యం. అందువల్ల అప్పడాలున్న ప్లేటు మాత్రం గజల్ చెయ్యి తగలకుండా సురక్షితంగా ఉండేది. చాంద్ పొద్దస్తమానూ కూనిరాగాలు తీస్తూండేది. గజల్ కూడా ఆమె గొంతుతో గొంతు కలిపేది.

'గజల్! నీ కంఠం చాలా బాగుంది. నువ్వు కూడా తప్పకుండా పాట నేర్చుకో!'

'అలాగే... మీరు నేర్పించండి!' తన గురించిన పొగడ్త విని, చాంద్ ఆపా శుభ్రమైన చీరపైన తన మురికి చేతుల ముద్రలు వెయ్యసాగింది గజల్.

'నాకు తీరుబడేది డియర్...!' గజల్ బూరి బుగ్గలపై చిటిక వేసింది చాంద్. 'అల్లా! ఈ పిల్ల పెద్దదై ఎటువంటి ప్రళయాన్ని సృష్టిస్తుందో? అందమైన వస్తువులంటే అపరిమితమైన ఇష్టం చాంద్‌కి.

దిగులుగా ఆలోచించసాగింది గజల్. నిజంగా చాంద్ ఆపాకి తీరుబడేది? ఎప్పుడు చూసినా డ్రాయింగ్ రూమ్‌లో తెల్లవాళ్ళు, నల్లవాళ్ళు

నిండి ఉంటారు. ఒకప్పుడు డ్రామా రిహార్సల్ జరుగుతూంటుంది. మరొకప్పుడు చాంద్ ఆపా వయొలిన్ వాయిస్తూ పాడుతూంటుంది, వేరొకప్పుడు తన చిత్రపటాలు చూపిస్తూంటుంది. డ్రాయింగ్ రూమ్‌లో సిగరెట్ పొగ, నవ్వులతో నిండి వుంటుంది.

చాంద్ ఆపా ప్రతి విషయంలోను తన కోమలత్వాన్ని, విదుషీత్వాన్ని ఋజువు చేస్తూంటుంది. ఆమెకు నప్పని ఏ ఫాషన్ లేదు ప్రపంచంలో. రాషిద్ విదేశాలు వెళ్ళొచ్చినవాడు. రజియా జూనియర్ కేంబ్రిజ్ దాకా చదువుకుంది. అత్తకి పరదా లేకుండా కారులో వెళ్ళడం నేర్పింది చాంద్. నవ్వుతూ మగవాళ్ళతో మాట్లాడడం మేకప్ చేసుకుని పార్టీలకి వెళ్ళడం చాంద్ నుంచి నేర్చుకుంది రజియా. ఆమె కొత్త రకంగా సిగ చుట్టుకుని, చాలా చక్కగా మేకప్ చేసుకుంటే, ఇతరుల మాటటుంచి, రాషిద్ ఆకర్షితుడయేవాడు.

చాంద్ పేరుకి మాత్రమే ఆర్టిస్ట్ కాదు. ఆమె కళా పరిధి చాలా విస్తృతమైంది. మెడికల్ కాలేజి నుంచి పేరు ప్రఖ్యాతులు కల చిత్రకారుడు రాషిద్ దగ్గరికి పెయింటింగ్ నేర్చుకోవడానికి వెళ్ళేది. ఈ విధంగా ఆమె కళ, అభినయం, సంగీతం, పెయింటింగ్, డాక్టరీల సంగమం అయిపోయింది. ఆమె ఎప్పుడు డాక్టరై, ప్రజల బాధలను నివారిస్తుందా! అని ఎందరో ఎదురుచూస్తున్నారు. లోకుల నిరాదరణకు గురియైన ఎంతోమంది కళాకారులను, తన సిఫార్సువలన అదృష్టవంతుల్ని చేసిందామె. కాలేజీలోని అసాధారణమైన విద్యార్థులందరికీ కేంద్రబిందువుగా ఉండే చాంద్‌ని అందరూ అభిమానంగా డాక్టర్ చాందినీ! అని పిలిచేవారు. వాహిద్ హుసైన్ అప్పుల తుఫానులో చిక్కుకుని, అలమటిస్తున్న కాలం నాటి విషయాలివి.

అహమద్ హుసైన్, పాప ఫలితమైన ఒక పిల్లవాడ్ని దత్తత చేసుకుని, తమను వంచించిన నాటినుండీ రాషిద్ ధనార్జనకై కొత్త మార్గాల నన్వేషించసాగాడు. ఒక పక్క ఆస్థి, అప్పులలో మునిగిపోతూంది. రాషిద్ సంపాదన వెయ్యి, పదిహేను వందలతో ఐవానే గజల్ గౌరవ మర్యాదలు డోలాయమానంగా ఉన్నాయి. ఈ కష్టం నుండి గట్టెక్కడం కోసం ఆయన రాషిద్‌ని ఒక చెక్‌లాగా ఉపయోగించుకున్నారు. రజియా తనతో

లెక్కలేనంత సంపద తీసుకువచ్చింది. వాహిద్ హుస్సైన్ ఇష్టమొచ్చినట్టు ఆ డబ్బుని ఉపయోగించగలిగి ఉంటే, మొత్తమంతా బిరియానీ బఘారా - బైగన్‌ల వ్యాపారంలో వినియోగించి ఉండేవారు. కాని రాషిద్ తన తెలివితేటల్ని తహసీల్దారుగా ఉండి వృధా చెయ్యలేదు. అతను ఉద్యోగంతోపాటు కాఫీ, మందులు, బీడీలు మొదలైన వ్యాపారాలు ప్రారంభించాడు. స్వదేశపు వస్తువులకు ప్రోత్సాహమిస్తున్న రోజులివి. ప్రభుత్వం వ్యాపారస్థులకెంతో, సహాయం చేస్తూంది. చూస్తూండగానే వెండి వస్తువులు, సిగరెట్లు, బీడీలు భారతదేశం ఆర్జించాయి. హైదరాబాదు చాలా చిన్న ప్రదేశమే కాని ఇక్కడ తయారైన వస్తువులకి భారతదేశంలోనే కాకుండా ఇతర దేశాలలో కూడా ఎంతో విలువ ఉండేది. ఈ ప్రవహించే గంగలో తానుకూడా లబ్ధి పొందాలనుకున్నాడు రాషిద్.

అతను చాంద్ సహాయంతో పెద్ద వ్యాపారస్థులతో స్నేహం చేసి, షోలాపూర్ గుండా, తన సరుకుని బొంబాయికి స్మగుల్ చెయ్యడం మొదలెట్టాడు. కొద్ది నెలల్లోనే అతను పాత డొక్కు, బ్యూక్ కారుని అమ్మేసి కొత్త రోల్స్ రాయిస్ కారు కొనుక్కున్నాడు. ఐవానే గజల్ తలుపులు, గోడలు మరమ్మత్తు చేయించాడు. చాలా మటుకు అప్పులూ, వడ్డీ తీరిపోయాయి. ఇప్పుడు లోకులు చాంద్, రజియాలవైపు వేలెత్తి చూపడం ప్రారంభించినా, వాహిద్ హుస్సైన్ వంశ ప్రతిష్ఠకి భంగం కలుగలేదు. వ్యతిరేకించేవారిని ఆయన పాత పద్ధతులను పట్టుకుని వేళ్ళాడే వాళ్ళనేవారు, మూర్ఖత్వమనే బురదలో చిక్కుకుని తెలివితేటల్ని కోల్పోయారనేవారు. వీరి కన్యలు కురాన్ షరీఫ్ చదువుకొనడం తోటే చదువు ముగిస్తారు. మగపిల్లలు విచ్చలవిడిగా తిరిగి, హాయిగా దేవిడీలలో కూర్చుని చదరంగం ఆడుకుంటున్నారు. అకస్మాత్తుగా ఆట కట్టవుతుందని తెలిసినప్పుడు, తమని తాము రక్షించుకోగలిగే మార్గాలన్నీ మూసుకుపోయిన విషయం అర్థమవుతుంది.

తండ్రి మరణ వార్త విని లోనికి పరుగెత్తిన హుమయూన్, ఇక తన కష్టాలు గట్టెక్కాయని, తాను అదృష్టవంతుణ్ణని గట్టిగా నమ్మాడు. కాని ఆలి ఫ్లైలా నుండి గెంటివేసిన అతని సవితి అన్నదమ్ములందరూ, తండ్రి శవాన్ని మొయ్యడానికి వచ్చేశారు. ఆకలి, కష్టాలు వారికి జీవించడం

నేర్పాయి. వారిలో ఒకరు జడ్జిగా, మరొకరు బారిస్టరుగా, ఇంకొకరు తాహసిల్దారుగా, మరొకరు గుమాస్తాగా రూపుదిద్దుకున్నారు. అంతా కలిసి, హుమాయూన్ అసలు తమ తండ్రి సంతానమే కాదని ఋజువు చేశారు. పదిహేను సంవత్సరాల వయస్సు నుండి అరవై ఏళ్ళవరకు, మిస్కీన్ ఆలీషాహ్ చేతితో చెప్పుదెబ్బలు తింటూ జీవించిన అతని తల్లి ఆయనకేమీ కాదు. కాని హుమాయూన్ నిరాశ చెందలేదు. పోయిన తన సామ్రాజ్యాన్నతడిప్పుడు జూదం, తాగుళ్ళలో వెతుక్కోసాగాడు. ఎప్పుడో ఒకప్పుడు రహమత్ ఆలీ షాహ్ కరుణ వల్ల తన రోజులు బాగుపడకపోతాయా అని చేతులు కట్టుకుని ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

హుమాయూన్ పరిస్థితుల పరిణామాన్ని చూసిన తరువాత వాహిద్ హుసైన్ చదువు వల్ల కలిగే లాభాలను అవగాహన చేసుకుంటున్నారు చాంద్ ఆదేశాలను పాటించడం, ఆమె అన్నదాన్ని అమలు పర్చడం ఆ ఇంట్లో అదరికీ తప్పని సరైంది.

గౌహార్ అత్త ఊళ్ళోని ఆడపిల్లలందరికీ ముక్కుతాడు వేసింది కాని చాంద్‌నేం చెయ్యలేకపోయింది. వెయ్యిసార్లు ఆమె హృదయం బద్దలవడం, తిరిగి అతుక్కుపోవడం జరిగింది. ఒకదానికంటె, ఇంకొకటి విలువైన చీరలు కట్టుకుని, తీరికవేళలలో వంగి కూని రాగాలు తీస్తూండేది.

పని చేస్తూన్నప్పుడు, కత్తిరించిన ఆమె జుట్టు నుదుటిమీద పడుతుండేది. దగ్గరే కూర్చున్న గజల్ గబుక్కుని ఆ జుట్టుని ముఖమ్మీద పడకుండా పిన్నులో దూర్చేది.

గజల్ చేసే ఈ చేష్టలు చూసి, చాంద్‌కి ఎంతో నవ్వొచ్చేది, మత్తెక్కించే గజల్ కళ్ళంటే చాంద్‌కెంతో ఇష్టం. ఈ పిల్ల పెద్దదైతే ఏమవుతుందో? ఇప్పటినుంచే ఈ పిల్ల కళ్ళలో ఒక విధమైన ఆహ్వానం, ఆకర్షణలు ద్యోతకమవుతున్నాయి.

ఒకసారి ఏదో పనిమీద, 'ఓ లేడి వంటి కన్నులు కలదానా!' అని గజల్‌ని పిలిచింది.

అది విన్న గజల్ గర్వంగా తిరగసాగింది.

లోకుల ఉదాసీన దృక్కులు, తండ్రంటే ఉన్న భయం, తల్లికోపం అంతా, పూర్తిగా మర్చిపోయింది.

'చాంద్ ఆపా నాది!' ఒకనాడు గర్వంగా ఫౌజియాతో అంది గజల్.

'నీదెందుకు అవుతుంది?' ఫౌజియా కంగారు పడింది.

'ఆమె డాడీది, అమ్మది కూడా...'

'ఇప్పటిదాకా ఎవరైనా గాజర్ మురబ్బాలో కిస్‌మిస్ వేసేరా?' కిళ్ళీ కడుతూ ధైర్యంగా అడిగింది బీబీ.

'వేసి ఉండకపోవచ్చును. గాజర్ మురబ్బాలో కిస్‌మిస్ వెయ్యకూడదని హదీస్ - షరీఫ్‌లో అయితే వ్రాయలేదు కదా.'

అలవాటు ప్రకారం నేడు వాహిద్ హుసైన్ గాజర్ మురబ్బా చెయ్యడంలో మునిగిపోయారు. ఎప్పుడైనా ఏదైనా ఇబ్బంది కలిగినప్పుడు, కవిత్వం, దూరమయినప్పుడు ఆయన ఊరగాయ పచ్చళ్ళ శరణుజొచ్చేవాడు.

బీబీ వాహిద్ హుసైన్‌తో ఎక్కువగా వాదించేది కాదు. కాని రజియా పెళ్ళైన తరువాత, ఆమె ఇంటికి డైరక్టర్ జనరల్ అయి కూర్చుంది. ఇప్పుడామె వాహిద్ హుసైన్ ప్రేమకి భయపడడం, గౌహర్ బేగమ్ మాటలకి కుళ్ళడం మానేసి కోడలి తెలివితేటలు - సామర్ధ్యం చూసి సంతోషిస్తూంది. ఇల్లు, ఇంటికి సంబంధించిన, సమస్యలతో సంబంధం ఇంకా తగ్గిపోయింది. పొద్దస్తమానం పరదా కట్టిన కారులో బంధువుల ఇళ్ళకు వెళ్ళిపోయేది. లేదా ఇంటికొచ్చిన స్త్రీలతో కూర్చుని బాతాఖానీ వేసేది. వెండి పాన్‌దాన్ తెరిచి మాటిమాటికీ, కిళ్ళీలు తింటూండేది. ఎప్పుడైనా మనసు కలిగితే, షాహీన్, రాషిద్‌లకి కుర్తాలు కుట్టేది. తనకి కుట్టుపని వచ్చని గర్వంగా ఉండేది. రజియా, చాంద్‌లకు ఎంబ్రాయిడరీ కోసం కొత్త-కొత్త డిజైన్లు వెయ్యడం తెలుసు. చాంద్ తన జాకెట్ల డిజైను కాగితం మీద స్వయంగా గీసి దర్జీకిచ్చేది. కొత్త ఫాషన్లతో పిల్లలకి బట్టలు కుట్టడమంటే రజియాకెంతో ఇష్టం. కానీ మిషిన్ లేకుండా వారొక్కటీ కుట్టలేకపోయేవారు. బీబీ కుట్టుపనంతా మిషిన్ లేకుండానే చేసేది. పెళ్ళిళ్ళప్పుడు, బట్టలకి చమ్కీలు, జరీలు కుట్టవలసివస్తే, అందరూ బీబీ దగ్గరికి వచ్చేవారు. ఆవిడ పెళ్ళికూతురి దుస్తులు ఎంతో నాజూకుగా, చక్కగా తయారు చేసేది. జలవాకి సంబంధించిన జోలికెప్పుడూపోయేది కాదు. వరుసకి అత్తయిన ఒకావిడ, ఒకసారామెను అడిగింది.

'నాలాంటి సౌభాగ్యవతులు, అదృష్టవంతురాళ్ళ ఎక్కడున్నారు?

నిన్నింతగా ప్రేమించే భర్త పిల్ల-పాపలు, లక్షణమైన ఇల్లు, నువ్వు జలవా జోడా జోలికెందుకుపోవు?'

'అత్తమ్మా! సుహాగ్-జోడా (పెళ్ళి దుస్తులు) కుట్టేవారి అదృష్టం, ఆ చమ్కీ, అంచులలో ఇమిడిపోతుంది. అలాటప్పుడు, కొత్త పెళ్ళికూతురికి దెబ్బలాటలు గొడవలు ఎందుకు?'

అప్పుడప్పుడు మనసు పుడితే వాహిద్ హుసైన్, బీబీతో ఒకటి రెండు ఆటలు చదరంగం ఆడేవారు. ఆట కొత్తగా నేర్చుకుంటున్నప్పటికీ, బీబీ, ఆయన్ని ఓడించేది. దాంతో ఓ చక్కని యుద్ధం జరిగేది. వాహిద్ హుసైన్ చదరంగం సరంజామాని తీసి విసిరికొట్టేవారు. అటు ఇటు చూసి ఆమెను తన బాహువులలో బంధించేవారు. రిటైర్ అయిపోయి, పెన్షన్ తీసుకుంటున్నారాయన, కాని బీబీ లేకుండా ఒంటరిగా నిద్ర వచ్చేదికాదు.

నేటికీ ఆయన బీబీని కొత్త పెళ్ళి కూతుర్ని చూసినట్టు, చూసేవారు, ఆమె మాత్రం నేటికీ నిర్లిప్తంగా ప్రాణంలేని బొమ్మలా ప్రవర్తించేది.

పెన్షన్ తీసుకున్న తరువాత ఆయన బాధ ఎక్కువయింది. పెన్షన్ తీసుకురావడానికి ముందు, రిటైరయాక ఎలాగ కాలం గడపాలో అన్న విషయమై ఎన్నో బంగారు కలలు కన్నారు. ఇంటికొచ్చి నిశ్చింతగా కూర్చున్న తరువాత షేర్వానీ, చూడీదార్ పైజమా వదిలి లుంగీ కట్టుకుని పార తీసుకుని ఐవానే గజల్‌ని అందంగా తయారు చేశారు. తరువాత ఇంటికేసి దృష్టి సారించేసరికి రక్తపుపోటు, మధుమేహం రోగాలు ఆయన్ని ఏం చెయ్యనివ్వడం లేదు. ఆయన గొంతులోని గంభీరమైన ధ్వని, ఆయన కోపం, రెండూ ఆయన్ని విడనాడాయి. ఇప్పుడాయన ప్రపంచంలో ప్రతి విషయాన్ని పట్టించుకుంటున్నారు. ఫలానా నౌకరు ఎక్కడికెళ్ళాడు? చాంద్ దగ్గరకెవరొచ్చారు? ఇవాళ వంటేమిటి? గుండులాంటి మనిషిని వృద్ధాప్యం ఎలా మార్చేసిందో!

తాసిల్దారుగా పని చేసిన ముప్పై సంవత్సరాలలో తన ప్రాముఖ్యతని, ఇతరులు గుర్తించే అవసరం ఆయనకెప్పుడూ కలుగలేదు. జిల్లాలోని వారంతా ఆయన్ని అర్థం చేసుకునేవారు. ఆయన తన తాత తండ్రుల పద్ధతిలో తాసిల్దారుగా పనిచేశారు. సుబేదార్లు కూడా సిగ్గుపడే విధంగా దర్జాగా, పనిచేశారు.

అయ్యో ఎలాంటి కాలం వచ్చింది? ఆకాశం మీద ఎగిరే పక్షుల్ని చూసి ఆయన కళ్ళు మూసుకున్నారు.

ఆనాడు రాషిద్ పుట్టినట్టు తంతి వచ్చింది. ఆయన సంతోషం పట్టలేకపోయారు. తొలిసారి తండ్రైనందుకు కాదు, బీబీ కాళ్ళకి మరొక బంధం వేసినందుకు అపరిమితమైన ఆనందం. ఇప్పుడీ గౌహర్ అత్త కళ్ళు కప్పి ఎక్కడ బీబీ తన తండ్రి కుటీరానికి పారిపోతుందో అనే భ్రమ తొలిగిపోయింది.

ఆయన ఇంటికెళదామని సిద్ధమయారు. ఈ వార్త విన్న జిల్లాలోని ప్రజలు అభినందనలు తెలిపేందుకు రాసాగారు. ఎన్ని నజరానాలు, బహుమానాలు పోగయ్యాయంటే అవన్నీ ఇంటికి తీసుకురావడం కష్టమైపోయింది.

ఆ ప్రాంతానికి ఒక హిందూస్తానీ వ్యక్తి సుబేదారు అవబోతున్నాడన్న వార్త వ్యాపించింది. ఆ వ్యక్తి ప్రభుత్వం పిలుపునందుకుని ఎన్నో సార్లొచ్చివెళ్ళాడు. ఆ పదవి అతనికే దక్కినట్టు వినికిడి.

'ఈ హిందూస్తానీ వాళ్ళు చాలా గడుసువాళ్ళు', వాహిద్ హుస్సైన్ అందరికీ చెప్పేవారు.

ఆనాడు బల్గా వెళ్ళడానికి మహ్ఫూద్ అహమద్ రైల్లో కూర్చున్నారు. ఆయన ఓర్పుని పరీక్షిస్తున్నట్టు రైలు కదలడమే లేదు. యాత్రికులు చిరాకుగా కిటికీలలోంచి తొంగిచూస్తున్నారు. ముందు స్టేషన్‌లో రైలు తిరగబడిందని అంటున్నారొకరు. కమ్యూనిస్టులు రైలు పట్టాలు తొలగించారని అంటున్నారింకొకరు. రైల్వే ఉద్యోగులంతా కంగారుగా తిరుగుతున్నారు. వారు ప్రయాణీకుల వేలాది ప్రశ్నలకు జవాబివ్వడం మూర్ఖత్వంగా భావిస్తున్నారు.

పదిహేను నిమిషాలు... గంట గంటన్నర గడిచిపోయింది.

ఫ్యాన్ వేసుకుని, ఏ కారణం లేకుండా బండి గంటన్నర ఆలస్యమయ్యే, ప్రాంతంలో తను ఎంతకని మార్పు తేగలనని ఆలోచించసాగాడు మహ్ఫూద్.

కేకలు, గోల విని కిటికీ తేసి వచ్చాడు. వరదలాగ పొంగుకొస్తోంది జన సందోహం. ప్రజలెందుకో నినాదాలు చేస్తున్నారు. పూల దండలు, మిఠాయి బుట్టలు, మనుషుల నల్లటి తలలు తప్ప ఇంకేం కనిపించడం

లేదు. ఆయన హైదరాబాదు గురించి ఎంతో విన్నారు, మరెంతో చదివారు.

పూర్తిగా కళ్ళు తెరుచుకుని కూర్చుని, ఇంకా తెలుసుకోవాలన్న కుతూహలంతో మాటిమాటికీ అడుగుతున్నారు.

'తియ్యటి పప్పులో ఏ చక్కెర వేస్తారు?' తుర్రమ్‌ఖాన్ అనే పేరుగల పాదుషా ఎవరైనా ఉండేవారా హైదరాబాదులో? గండిపేట నీళ్ళెలాగుంటాయి? ఇక్కడ ఎండుచేపలు, చిన్న చేపలు తప్పనిసరిగా తినాలా?

'మీరు నీళ్ళల్లో చింతపండు పులుసు కలుపుకుని తాగుతారా?'

అకస్మాత్తుగా ఆ జనప్రవాహం ఆయన ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ కేసి వచ్చింది, ముందు ఆశ్చర్యపోయాడు, తరువాత కంగారు పడ్డారు. హైదరాబాదుకు కాబోయే సుబేదారు ఈ పెట్టెలో ప్రయాణిస్తున్నట్టు ప్రజలకి తెలిసి ఉంటుంది. కాని తన గురించి ఇంత గొప్పగానా స్వాగతం చెప్పడం! ఇప్పుడు నేనేం చెయ్యాలి? సాబిర్ నవాబు దీని విషయమై తనకేమీ చెప్పలేదే!

ఆయన పువ్వుల దండ నిమిత్తమై మెడ వంచేసరికి, ఒక చక్కటి ముఖ కవళికలు కల స్థూలకాయుడ్ని అక్కడ చేరిన జనం లోనికి తోశారు. అతడు పువ్వులతో నిండి ఉన్నాడు. అతని కానుకలను లోపల పెట్టడానికి వచ్చిన జనం మఫ్రూద్ అహమద్‌ని, అతని సామాన్ని తొక్కేశారు. కూడా ఉన్న సర్వెంట్ కాబిన్‌లో నౌకర్ల సమూహం, కోళ్ళబుట్టలు, పళ్ళబుట్టలు పెట్టాక బండి కదిలింది. అప్పుడు స్పృహ వచ్చిన తరువాత తన ఎదురుగా కూర్చున్న అదృష్టవంతుడైన అందమైన యువకుణ్ణి చూశారు. అతని ముఖములో ఒక విధమైన దర్పం కనబడింది. అది చూడగానే మొగలాయి షహజాదాల రూపు గోచరించినట్లయింది. సాబిర్ నవాబు నేర్పుతో దర్బారులో, గౌరవంగా వ్యవహించడం ప్రారంభించాడాయన.

'ప్రభువులు ఎంత వరకు ప్రయాణిస్తారో?'

'నేనా...? బల్దా వెళుతున్నా...' వాహిద్ హుసైన్ లెక్కలేనట్టు పూలదండలను తీసి కిటికీలోంచి విసిరెయ్యసాగారు.

'బల్దా? మఫ్రూద్ అహమద్ ఆశ్చర్యపోయారు. హైదరాబాదు చిత్రపటాన్నాయన కంఠస్థం చేశారు, కాని బల్దా ఎక్కడా కనబడలేదు.'

'ఈ బల్దా, హైదరాబాదుకెంత దూరంలో ఉంది?'

'ఆ...? వాహిద్ హుసైన్ తిరిగి చూశారు. చాలాసేపు చూశారు.' అప్పుడు మెడ తిప్పుతూ అన్నారు. 'ఏ గ్రామంనుంచొస్తున్నారు మీరు? మొదటిసారి హైదరాబాదు చూస్తున్నారు కాబోలు!'

'అవునండీ!' ఉద్దేశ్యానికి వ్యతిరేకంగా అనేశారు మఫ్రూజ్ అహమద్ పొరపాటైపోయిందని ఆయన నమ్మకం.

'మేము హైదరాబాదునే బల్దా అంటాం...' ఆయన ఎంత గట్టిగా నవ్వారంటే మఫ్రూద్ అహమద్‌కి కూడా నవ్వక తప్పలేదు అనంతరం వాహిద్ హుసైన్ తమ గొప్పతనాన్ని, డాబు దర్పాలతో కూడిన తమ వంశం స్థితిగతులను వివరించడం ప్రారంభించేసరికి ఎన్నో స్టేషన్లు వెళ్ళిపోయాయి.

(ఈ సాబిర్ నవాబు ఏ దరిద్రపు నవాబుల పరిస్థితులను చెప్పి నన్ను మోసం చేశాడో! అసలైన జాగీర్దారులతో ఇప్పుడు పరిచయం కలిగింది.)

వాహిద్ హుసైన్ బలవంతంగా తనతో భోజనం చెయ్యడానికి ఒప్పించారు.

మఫ్రూద్ అహమద్ తన టిఫిన్ కారియర్‌లోంచి షామికబీచ్, పూరీలు, రవ్వతో చేసిన హల్వా తినడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు.

'మా పనివాడు చింతచిగురు కూర చెయ్యడం ఆలస్యం చేసేసరికి రైలు ఒక గంట ఆలస్యంగా బయలుదేరవలసి వచ్చింది!' లెక్క లేనట్టున్నారు వాహిద్ హుసైన్. ఆయన బిరియానీ చేసే విధానం చెప్పేసరికి, చాలా మెచ్చుకున్నారు. బియ్యం వంటి సామాన్యమైన వస్తువుకంత గౌరవ మిచ్చేవాళ్ళు, మనుషులకి కూడా ఉన్నత స్థానం ఇవ్వగలుగుతారు.

వాహిద్ హుసైన్ బిరియానీ ఉన్న టిఫిన్ డబ్బా ఆయన కిచ్చేసరికి, ఆయన వద్దన్నారు.

'మీరు భోజనం చెయ్యరా?'

'భోజనం చేస్తాను, అన్నం తినను.

'బియ్యమా...! సరే మీరు భోజనాన్ని బియ్యం అంటారా?

'మీరు గో మాంసము తింటారా?'

'మీరు తినరా?' మఫ్రూజ్ అహమద్ ఆశ్చర్యంగా అడిగేసరికి ఆయన

గ్లాసుకేసి జాపిన తన చేతిని వెనక్కి లాగేసుకున్నారు. వాహిద్ హుసైన్ సరిగ్గా అప్పుడే నోట్లోకొక రాయి వచ్చి తుఫాను రేపింది. కంపార్ట్‌మెంటంతా ఆయన కేకకి కదిలిపోతూంది. పాత్రలన్నీ ఒక్కొక్కటి అడవిలోకి విసిరి వేశారు.

తరువాతి స్టేషన్‌లో వంటవాడి గురించి వాకబు చేశారు. నౌకరు దడదడా చెప్పుతో కొట్టిన తరువాత వాణ్ణి అక్కడే దింపేసి బల్దాదాకా నడిచి రమ్మని చెప్పమని ఆదేశించారు వాహిద్ హుసైన్.

మఫ్రూద్ అహమద్ చాలాసేపటి వరకూ తల బయట పెట్టి ఆ ముసలి వంటవాణ్ణి చూస్తూ ఉండిపోయారు. జీవితమంతా బియ్యాన్ని గౌరవిస్తూ గడిపేసిన అతని యాత్ర ఇంకా పూర్తి కాలేదు. ప్రతి బీదవానికి చేరుకోవలసిన గమ్యస్థానమైన బల్దా చేరుకోవాలి. ప్రతి గొప్పవానికి అది పూజించదగిన స్థానము.

'తమ పేరు తెలుసుకునే అవకాశం కలుగలేదు!'

'నవాబ్ వాహిద్ హుసైన్ ఖాన్ అంటారు నన్ను. నేను పర్భనీలో తాసిల్దారుగా పని చేస్తున్నాను.'

'తాసిల్దారా...? మఫ్రుద్ అహమద్‌కి మూర్ఛపోయినట్లయింది.'

'అల్లా కృప.' వాహిద్ హుసైన్ చేతులు జోడించి రైలు కప్పుకేసి చూశారు. నిజానికి మా వంశంలో నూరు తరాల వారెవరూ ఉద్యోగాలు చెయ్యలేదు. కాని ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. మావంటి జాగీర్దారులు మామూలు ఉద్యోగాలు చేస్తూ, తిరుగుతూండవలసిన రోజులొచ్చాయి!

మఫ్రూద్ అహమద్ మౌనంగా ఉండడం చూసిన వాహిద్ హుసైన్, 'మీకు హైదరాబాదులో ఏదైనా పని ఉంటే సేవకుడు ఎదురుగా ఉన్నాడు. ఒక్క పైసా ఖర్చు చెయ్యకుండా పని జరిగిపోతుంది. కవిత్వం అంటే అభిరుచి ఉండేటట్లయితే...'

సిగార్ వెలిగించి, కాళ్ళు జాపుకుని కూర్చున్నారాయన. మెరుస్తున్న తన బూట్ మఫ్రూద్ అహమద్ ఎదురుగా టేబుల్ మీద పెడుతూ, 'మీ పేరు కూడా చెప్పండి హజరత్!'

'ఆ వినమ్రుణ్ణే మఫ్రూద్ అహమద్ అంటారు. నన్ను సుబేదారు

పదవికొరకు ప్రభుత్వం పిలవనంపింది.'

'ఆ...? ఆ...? ఆ...?' ప్రపంచం తల్లకిందులైందో లేక వాహిద్ హుసైన్‌కి పిచ్చెక్కిందో తెలియదు స్పృహలేని స్థితిలో ఆయన ఎన్నో మొగ్గలేశారు. తన చేతులు నలిపేసుకున్నారు. వెంటనే జోళ్ళు విడిచి, పగిడీ పెట్టుకున్నారు. వంగి వం. సలాములు చేశారు.

కాని మఫ్రూద్ అహమద్ వినమ్రతతో చిరునవ్వు నవ్వుతూనే ఉన్నారు. నాకొక్కటే విచారంగా ఉంది. అనవసరంగా సద్రు ఉల్ మహా మీ చక్కర్‌లో పడ్డాను, నిజానికి తాసిల్దారు అవ్వలిసింది'.

వాహిద్ హుసైన్ గడిచిన కాలాన్ని తల్చుకుని నిట్టూర్చారు.

'జీవితంలో ఎటువంటి ఆనందాన్ని పొందాను. కాని ఈ మధుమేహం జీవించే ఆశ లేకుండా చేసింది. డాక్టర్లు చెప్పిన విధంగా, బీబీ ఆయనకి ఉప్పూ, కారం, నెయ్యి, మాంసం, - ఏదీ పెట్టడం లేదు. గట్టిగా వీచేగాలి నవల పుటలనన్నీ ఒక్కసారి ఎగరగొట్టినట్టు, కాలం ఎంత త్వరగా పరుగిడుతోంది?'

ఆయన లుంగీ కట్టుకుని, సపోటా చెట్టు కింద కుర్చీ వేసుకుని కూర్చుని, వచ్చేపోయేవారిందరినీ చూస్తున్నారు.

పన్నెండయ్యేసరికి మధ్యాహ్నం భోజనం తయారు చెయ్యాలని బిస్మిల్లాబీ ఆదేశించింది. ఇటు పొయ్యి మీంచి కుండ దించడం, అటు గౌహర్ బేగమ్ ఉడికిన కూరలు, ఉప్పుకారం లేని పదార్థాలు సాదా చపాతీలు ఆయనకు వడ్డించింది - ఇవి తప్ప ఇతర వస్తువులు ఆయన తినకూడదు. తాను తయారు చేసిన మురబ్బా, ఊరగాయలు కూడా ఇతరులకు తినిపించి ఆయన తృప్తి పడేవారు.

'ఇంకేం వండావు?' ఆయన బిస్మిల్లాబీ నడిగేవారు. చిన్న చేపలు, మజ్జిగ పులుసు, గోంగూర, బఘారా బైగన్...'

నువ్వు మజ్జిగ పులుసులో ఉప్పెక్కువ ఎందుకు వేస్తావు? ఏదీ ఇవాళెంత వేశావో చూడనీ?'

తరువాత రెండు మూడు వంకాయలు రుచి చూసేవారు. రెండు, మూడు ముక్కలు నమిలి, మాంసము ఉడికిందో లేదో చూసేవారు. బీబీకి రాషిద్‌కి తెలియకుండా ఇదంతా జరిగిపోయేది. ఎప్పుడైనా ఆయన అస్వస్థులైతే,

అందరికీ ఆ బఘూరా బైగన్‌లే గుర్తొచ్చేవి. భోజనం చేసి లేవగానే సిగార్ వెలిగించుకుని కూర్చునేవారు. ఆయన దగ్గరే, కుంటత్త వచ్చి కూర్చునేది - నేలమీద, ఇంక అప్పటి పరిస్థితులపై చర్చ - సమీక్ష ప్రారంభమయ్యేది. వాహిద్ హుస్సైన్ మంచి తెలివైనవారైనప్పటికీ, గౌహర్ బేగమ్‌తో మాట్లాడేటప్పుడు చురుగ్గా వుండేవారు కాదు. తమ వంశపు పట్టుదలలు, లోటుపాట్లు, గర్వంగా కథలు - కథలుగా చెప్పుకునేవారు. ఉద్దండులైన, బంధువుల వారి మారిన జీవిత పద్ధతులను గేలి చేసేవారు. వంశంలో ఏదో ఒకటి అంటించడం, ఆర్పడంలో వాహిద్ హుస్సైన్‌ది అందె వేసిన చెయ్యి - ప్రపంచంలోనే చిన్న - చిన్న కేసులు తీర్పులిప్పుడాయన కోర్టులో జరిగేవి.

భర్తపైన చాడీలతో ఉజాలా బేగమ్ ఒక వైపు నుంచి వస్తే, మేనమామ కోడలు, అత్తగారి అత్యాచారాల గురించి వివరించేది. అమ్మాయిలకి, అబ్బాయిలకి సంబంధాలు కుదిర్చే కైసర్ మొండితనం గాథలు వినిపించేవారొకరు. ప్రతి ఒక్కరు వాహిద్ హుస్సైన్‌ని ప్రశంసించి, ఆయన శత్రువులను తెగనాడేవారు.

అందుకే గౌహర్ బేగమ్‌కి ఆయనకి బాగా పొత్తు కుదిరేది. ఇంటి పనులతో విసిగి పోయినప్పుడు గౌహర్ బేగమ్ అన్నగారితో పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలం గడిపేది. అలా కూర్చుని మాట్లాడుతున్నప్పుడు కూడా, ఇంట్లో ఏమూల ఏం జరుగుతుందో, ఎక్కడ ఏ పిల్లవాడు, ఎలాంటి అల్లరి చేస్తున్నాడో, ఏ వస్తువు స్థానభ్రంశం చెందిందో, ఏ నౌకరు ఏ పనీ లేకుండా ఊరికే కూర్చున్నాడో, గమనిస్తూండేది. ఆవిడ్ని చూసేసరికి ప్రాణం పోయినట్లనిపించేది పిల్లలకి, గజల్‌కి తప్ప. అందరినీ గిరిగీసి కూర్చోపెట్టగలిగిన ఆమెని తోసి రాజంది గజల్.

అయినా కుంటత్త అంత చెడ్డదనిపించేది కాదు పిల్లలకి. ప్రత్యేకించి గురువారం నాడామె మాటలు మరీ తియ్యగా వుండేవి అందరికీ, ఆ రోజు పిల్లలందరూ ఆమె చుట్టూ తిరుగుతూండేవారు. ఆమె ఐదు రూపాయిల మిఠాయి తెప్పించి ఏదో జపం చేసేది. గౌహర్ అత్తకి ఇంకా తన పెళ్ళిమీద ఆశ ఉందనేది రజియా. యూసుఫ్ సాహెబ్ షరీఫ్ సాహెబ్ దర్గాలో ఎవరో వేశ్య ఈ జపం గురించి చెప్పిందట. కాని ఈ విషయం అందరి

దగ్గర దాచేది కుంటత్త. ఎవరైనా అడిగితే తల్లితండ్రుల ఆత్మలకు పుణ్యగతులు కలిగించడానికి ఫాతిహా (కురాన్‌లోని మొదటి సూరత్ పంక్తులు) చేస్తున్నాననేది.

ఎవరూ చూడకుండా మిఠాయి తీసుకువచ్చే బాధ్యతను షేఖామియా తీసుకున్నాడు. షాహీన్ అగరొత్తులు వెలిగించేవాడు. ఫౌజియా, గజల్ కలిసి మిఠాయి విడివిడిగా పంచేవారు. మిఠాయి తీసుకోడానికి మొట్టమొదట తయారయ్యేవాడు షేఖామియా. నిజానికి అందరిచేత తన్నులు, దెబ్బలు తిన్న షేఖామియాని జాగ్రత్తగా చూసేదామె. అతను వరుసకి దూరపు అన్న ఆమెకు. కాని ఒక్క పనికిమాలినవాడు, చరిత్రహీనుడు, త్రాగుబోతు, అసభ్యుడు, మూర్ఖుడు. ఇన్ని దుర్గుణాలున్న వాడైనప్పటికి అతన్నొక ఇంటివాణ్ణి చెయ్యడానికి కుంటత్త లెక్కలేనన్ని ప్రయత్నాలు చేసింది. మంచి వంశంలోని పిల్లలు దొరక్కపోయే సరికి బీద కుటుంబాలలోని పిల్లల కోసం వెతికింది. కాని లోకులకేమయిందో తెలియదు, అతనికి పిల్లనివ్వడానికెవరూ ముందుకు రాలేదు. ఇటువంటి చరిత్రహీనుడు పెళ్ళయిన తరువాత మారుతాడని కుంటత్త ఉద్దేశ్యం. పాపం అతని జీవితం మారుతుంది కదా అని ఆశపడింది.

ప్రతి నాలుగైదు రోజులకి ఎలాగో వచ్చేసేవాడతను. ఎన్నో రోజులు నౌకర్ల గదిలో పడుండేవాడు. పిల్లలద్వారా,

'మూడు రోజుల నుంచి ఆకలితో అలమటిస్తున్నానని గౌహార్ అక్కకి చెప్పండి' అని కబురు పంపేవాడు.

గౌహార్ ఆపా అతని ఆకలితో ఉన్నాడన్న విషయం తెలియగానే పళ్ళెంలో భోజనం పంపటానికుపక్రమించేది. షేఖామియా రాక, వాహిద్ హుసైన్‌కి, రాషిద్‌కి బొత్తిగా నచ్చేది కాదు. రాత్రిపూట గేటు తెరిచి గుండాలని లోనికి ప్రవేశపెడతాడో, లేక ఏదైనా వస్తువు తీసుకుని పారిపోతాడో ఎవరికి తెలుసు?

ఏ దరిద్రులో లేక దొంగ వెధవల కుటుంబానికి చెందినవాడు కాడతడు. అతని తండ్రి-తాతలు ఆస్తిపరులు. తండ్రి, తనూ ఆ ఆస్తిని నాశనం చేసేశారు. గౌహార్ ఆపా తల్లిదండ్రులు బ్రతికున్నంతకాలం అతనికి తిండి బట్టలకి ఇబ్బంది కలుగలేదు. వారేదో విధంగా ఏర్పాటు చేసేవారు. గౌహార్

బేగమ్ ఇప్పటికీ నిస్సహాయుడైన తమ్ముడికింత తిండి పెట్టడం తన బాధ్యత అనుకునేది.

ఒకసారి ఆమె ఎంతో ఘనంగా వివాహం జరిపించి, బొమ్మలాంటి భార్యని తీసుకొచ్చిందతని కోసరం. ఒక్క సంవత్సరంలోనే ఆమెకు నూరేళ్ళు నిండిపోయాయి. తరువాత తన ఇష్ట ప్రకారం పెళ్ళి చేసుకున్నాడతను. ఆమె షేఖామియానే నమిలేయడం మొదలు పెట్టింది. చిన్నమాట వినకపోయినా సరే ఆమె చెప్పు అందుకుని తమ్ముణ్ణి హింసిస్తుందని గౌహర్ బేగమ్ ఏడుస్తూ చెప్పేదందరికీ. రెండు, మూడు సంవత్సరాలు ఎంతో కష్టపడి ప్రయత్నించిన తరువాత ఆమె నుంచి విముక్తి పొందగలిగాడతను. ఇప్పుడు తిరిగి వివాహం చేసుకుందామన్న కోరికతో, ఆ రాబోయే పెళ్ళి కూతురి ధ్యాసలో, అతనిప్పటినుంచే దేవదాసయిపోయాడు. పగలూ, రాత్రీ మత్తులో మునిగి తేలుతూ ఉండేవాడు. పొద్దున్నే పక్కమీదనుంచి లేచిన దగ్గర నుంచి చక్కగా కనబడడానికి, అర్థంలేని ప్రయత్నాలన్నీ చేస్తుండేవాడు. లుంగీ కట్టుకుని, ఒక మూల కూర్చుని, తన బట్టతలని చేత్తో రాసుకుంటూ కూర్చునేవాడు. నల్లటి, కళాహీనమైన ముఖంలో ఎర్రబారిన కళ్ళు దీపాలలాగా కనబడేవి. గారెక్కిన నల్లటి పళ్ళతో, అతని రూపం పిల్లలకి విచిత్రంగా వుండేది. మత్తు పదార్థాలు సేవించకుండా, మామూలుగా ఉన్నప్పుడతను, పిల్లలకి దెయ్యాలు, భూతాలకు సంబంధించిన విచిత్రమైన కథలు చెబుతూండేవాడు. మత్తుగా ఉన్నప్పుడు చేతులు పైకెత్తి గాలితో దెబ్బలాడడం, విపరీతంగా తిడుతూండడం, పాడడం, ఏడవడం - ఇవన్నీ పిల్లలకి ఒక ఆటలాగుండేది. షాహీన్, ఫౌజియా, చాంద్, కైసర్ అంతా అతని చుట్టూ మూగి ఉండేవారు కాని గజల్‌కి అతన్ని చూస్తే రోత పుట్టేది. షేఖూమియా, తన పేరు వ్రాసుకోగలిగేపాటి చదువు మాత్రమే చదువుకున్నాడు. ఒకసారి ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళ్ళినపుడు తను వేరు వర్ణక్రమం కూడా సరిగా చెప్పలేకపోయాడట.

అప్పుడు తన సామర్థ్యాన్ని నిరూపించుకునేందుకు పిల్లలకి చదువు చెప్పడానికి కూర్చునేవాడు. తను బి.ఏ. వరకూ చదువుకున్నట్టు, పరీక్ష వ్రాయడానికి తీరుబడి లేదని చెప్పేవాడు. షాహీన్ 'కింగ్ - ప్రైమర్'

తెరిచి, జాగ్రత్తగా ఫోటోల్ని పరిశీలించేవాడు. పిల్లలు ఎదురు చూస్తున్నారన్న విషయం గమనించి అడిగేవాడు.

'ఇంగ్లీషులో కోడినేమంటారో చెప్పండి?'

'కోడి' అనేది గజల్.

'హెన్, హెన్,' షాహీన్ అరిచేవాడు.

'ఉష్! మీరంతా ఒట్టి మూర్ఖులు.'

'ఎగ్!' ఫౌజియా అనేది.

'హెన్, హెన్... ఇదిగో చూడండి,' షాహిన్ ఫోటో చూపించేవాడు.

'చూడు బాబూ! నువ్వు నిజంగా చెబుతున్నావా?' అనుమానపు దృష్టితో చూసేవాడతను.

'అవును' షాహిన్ మెడ తిప్పుతూ చెప్పేవాడు.

'తరువాత ఏముంది?' నెమ్మదిగా పేజీ తిప్పేవాడు.

అతనికి కవిత్వపు పిచ్చికూడా ఉండేది. ఎంతో గొప్పగా తన గజళ్ళు వినిపిస్తూ వాహిద్ హుస్సైన్ శిష్యుడనని గర్వంగా చెప్పుకునేవాడు. ప్రతి రెండు, మూడు నెలలకి ఒకసారి తన గజళ్ళ కట్టని వాహిద్ హుస్సైన్ టేబుల్ మీద పెట్టి పోయేవాడతను. కాని వాహిద్ హుస్సైన్‌కి విపరీతంగా కోపం వచ్చేది' ఒక్క పంక్తి సరిగ్గా వ్రాయలేని మూర్ఖుడు... వెధవ వాగుడు వాగుతాడు.'

రాత్రిపూట తూలుతూ వచ్చి ఏదో ఒక గోడని ఆసరాగా చేసుకుని, పిల్లల్ని అడిగేవాడు, పిల్లలూ మీరెప్పుడైనా సారా త్రాగారా? ఎప్పుడూ తాగకండి, అల్లామియాకి కోపం వస్తుంది. అందరూ ముఖం తిప్పేసుకుంటారు.

తరువాత నౌకర్లుండే గదిలోకెళ్ళి ఒట్టినేల మీద కుప్పలాగ కూలిపోయేవాడు.

'ఎవరైనా కాసిన్ని మంచినీళ్ళివ్వండి...!' అని షేఖూమియా అరుస్తూ ఉండేవాడు. ఎవరూ వినిపించుకునే వారు కారు. అతడి దగ్గర కెళ్ళాలంటే పిల్లలకి భయంగా ఉండేది.

ఒకసారి అతని మూలుగులు విని గజల్‌కి జాలి వేసింది. ఆ పిల్ల గ్లాసుడు నీళ్ళు తీసుకెళ్ళి అతని దగ్గరకి వెళ్ళేసరికి, అతను గ్లాసు తీసుకుని,

ఇదెవరమ్మా భగవంతుడు చక్కటి మొగుణ్ణిస్తాడు. మహల్లో నివసించే బేగమ్ అవుతుంది.

కల్లు రంగు తెలుపు.

తను రాసిన గజల్ పాడడం ప్రారంభించేవాడు.

గజల్‌కి అందమైన మొగుడు కావాలి. అందుకే షేఖూమియాకి మంచి నీళ్ళిస్తుంది, అంటూ ఫౌజియా తెగ ఏడిపించేది.

గజల్ ఎప్పుడూ బీబీ దగ్గరకి వచ్చినప్పుడు షేఖూమియా కేసి వెళ్ళేదికాదు. బీబీ ఇల్లు అంటే ఇష్టమేమీ లేదు గజల్‌కి. ఐవానే గజల్ నిప్పుల పళ్ళెం లాంటిది. దీన్ని ముట్టుకున్నా అయ్యో అంటూ అంతా పరుగెత్తుకొచ్చేవారు. అందుకే అయాజ్, షహజాద్ ఎప్పుడూ వచ్చేవారు కారు.

గజల్‌ని చూడగానే రజియా తన మంచంమ్మీంచి లేచిపోయేది. వాహిద్ హుస్సైన్ తన చెట్ల సంరక్షణార్థం బయటికొచ్చి నిలబడేవారు. గౌహర్ అత్త చిందర - వందరగా ఉన్న వస్తువులన్నిటినీ సద్దేయడం ప్రారంభించేది. ఫౌజియా - షాహీన్లు తను ఆట వస్తువులను దాచేసుకునేవారు.

వెళ్ళగానే తాతగారు ముందు ముఖం కడిగించేవారు, పళ్ళు తోముకోమని ఆజ్ఞాపించేవారు. వంద అంకెలు లెక్కపెట్టమనేవారు. ఇంత తొందరగా తాతగారు అంకెలెలాగ మర్చిపోతారా అని గజల్‌కి ఆశ్చర్యంవేసేది.

'అమ్మా, అమ్మా తాతగారి గడ్డమెందుకలాగ ఊగుతుంది? ఒకరోజు తల్లినడిగింది.'

'ఊరుకో... ఊరుకో తాతగారు వింటారు!' తల్లి కోప్పడింది.

'తాతగారెప్పుడూ తన గడ్డాన్ని చూసుకోలేదా?' ఆశ్చర్యంగా అలోచించింది గజల్.

'ఇంట్లో మాత్రం హాయి ఎక్కడుంది?'

హుమాయూన్, బతూల్, దెబ్బలాడుకున్నప్పుడు, గజల్‌కూడా ఇక్కట్ల పాలయేది. తల్లి చేత అప్పుడప్పుడు గజల్ కూడా తన్నులు తినేది. మిగిలిపోయిన కోపాన్ని తండ్రి, ఆ పిల్లపైనే చూపించేవాడు. అలాంటప్పుడు, ఆయాజ్, షహజాద్‌లు దూరంగా నిలబడి తమాషా చూసేవారు. లేదా మాట్లాడకుండా ఎటో మాయమైపోయేవారు. ఎప్పుడైనా

దెబ్బలు తిన్నా, వాళ్ళు ఏడ్చేవాళ్ళు కారు. అన్నలను తన్నులు, గుద్దులతో చితకబాది, తండ్రి అటు వెళ్ళాడోలేదో, వీళ్ళిటు నవ్వడం మొదలెట్టేవారు. కాని ఆ దృశ్యం గజల్‌ని గంటలు తరబడి ఏడ్పించేది. ఇప్పుడు హుమాయూన్‌కి భార్య - బిడ్డలకన్న ఇంట్లోని కిరస్తానీ ఆయామీద అభిమానం ఎక్కువైంది. ఆఫీసునుంచి వస్తూనే సాయా హుమాయూన్ గదిలోకి టీ తీసుకుని వెళ్ళిందంటే, ఇంక తలుపులు రాత్రే తెరుచుకునేవి.

'అయ్యో, నాన్న టీ తాగడానికంత ఆలస్యం చేస్తారు!' తలుపు ఎప్పుడు తెరుస్తారా అని ఎదురు చూస్తున్న గజల్ అంటే, తల్లి కొట్టడానికి సిద్ధమయేది.

'నోరు మూసుకో! ఇంకెప్పుడూ ఇటువంటి మాటలనకు నీకెందుకీ విషయాలన్నీ?'

తల్లికి కూడా, ఈ విషయంలో ఎటువంటి సంబంధం లేదనిపించింది. ఆమె లోలోపలే కుళ్ళిపోతూంది.

ప్రతీసారీ బతూల్‌ని చావగొట్టి, డబ్బు తీసుకురమ్మని పుట్టింటికి పంపించినప్పుడు, ఈ వార్త వాహిద్ హుసైన్‌కి, తెలియనిచ్చేవారు కారు. కాని ఒకసారి తానేవిధంగా హింసకు గురి అయిందో తాతగార్కి చెప్పింది గజల్. తల్లిని కాపాడుదామనుకుంటే తండ్రి తన్నులకి తాను గురి అయినట్టు, తన వీపుమీద ఏర్పడిన దెబ్బల గుర్తును తాతగార్కి చూపించింది గజల్.

ఆ రోజింట్లో నానా గొడవ జరిగిపోయింది.

తాతగారు, తన తుప్పెక్కిన తుపాకీని, వణుకుతున్న చేతులతో శుభ్రపరచడం, చాలా ఆసక్తిగా చూసింది గజల్. వెక్కిళ్ళతో వణుకుతున్న తల్లిని రజియా అత్త పట్టుకుని కూర్చుంది. ఆ రోజు ఒకళ్ళ తరువాత ఒకళ్ళు - అందరూ, నీ దెబ్బ తాతగారికెందుకు చూపించావని, గజల్‌ని తిట్టారు. ఒక్క చాంద్ మాత్రం ప్రపంచంతో సంబంధం లేనట్టు తన గదిలో ఒంటరిగా కూర్చుని ఏడుస్తూంది.

అత్త తెల్లని పక్కమీద తన మురికి కాళ్ళని రుద్దుతూ కూర్చుంది. ఇటువంటప్పుడు ఏడవడం మంచిది కాదని ఆ పిల్లకి తెలుసు, తల్లికి తిరిగి కోపం ఎక్కువయ్యే అవకాశం ఉంది. ఆమె తన దురదృష్టానికి, పిల్లల్ని, చావగొట్టి పగ సాధించేది. పైపెచ్చు గజల్ అంటే అసలు

ఇష్టముండేది కాదు రజియాకి. అసహ్యంగా ఉన్న మోరీని చూసినట్టు చూసేదామె గజల్‌ని. నిజానికి ఆమె పిల్లలు కూడా అంత శుభ్రంగా ఉండేవారు కాదు. ఫౌజియా రోజు రోజుకీ నెత్తికెక్కుతూంది. గజల్‌ని బొగ్గులబండిని చూసినట్టు చూస్తూ, తన ఫ్రాక్ ఎక్కడ మాసిపోతుందో అన్నట్టు జాగ్రత్తగా ఉండేది. షాహీన్ వట్టి మూర్ఖుడు, చురుకుదనం లేశమైనా లేదు. ప్రతి పనీ తల్లి నడిగి చేసేవాడు. తల్లి అనుమతి లేకుండా కింద పడ్డ మామిడికాయని కూడా తినేవాడు కాదు.

రజియాకి, గజల్ తన కొడుకుని 'షాహీన్ భాయీ' అని పిలవాలని ఉండేది.

గజల్, ఫౌజియా, షాహీన్‌లకు కొన్ని పనికిరాని వస్తువులనుపయోగించే విధానం నేర్పింది. ఉదాహరణకి వచ్చి నారింజకాయలు, గులాబీ పువ్వులు, కోసి మల్లయ్యకిస్తే, వాటికి బదులుగా డబ్బాలనిండా ఆరుద్ర పురుగుల్ని ఇస్తాడు. దొంగ - పోలీసు ఆట ఆడుకునేటప్పుడు, రాషిద్ బెల్టు సంకెళ్ళలాగ ఉపయోగపడతాయి. అత్త లిప్‌స్టిక్‌తో చేతులకి, గోళ్ళకి గోరింటాకు లాగ పెట్టుకోవడమే కాకుండా గోడలపైన పెయింట్ చెయ్యవచ్చు. చాంద్ టూత్ క్రీమ్, పళ్ళకి రాసుకుని ఉమ్మెయ్యడానికి బదులు తినవచ్చు. గజల్ ఎన్నోసార్లు స్నానాల గది తలుపులు వేసుకుని అలాగే చేసింది. చక్కగా తియ్యని ఐస్‌క్రీమ్‌లా ఉంది - అనేది గజల్. కాని ఇబ్బంది ఎక్కడ వచ్చేదంటే వట్టి మూర్ఖుడైన షాహీన్ ఏ కొత్త ఉపాయం వినినా, వెంటనే సలహా కోసరం తల్లి దగ్గరికి పరుగెత్తేవాడు.

'అమ్మా బీరువా అద్దాలు బద్దలుగొట్టి బిస్కట్లు తీసుకోమా మేము?'

తల్లి చూపులలోని కోపచ్ఛాయలు చూసి భయపడిపోయేవాడు, 'గజల్ అంటూంది...' అనేవాడు.

ఇది విన్న బతూల్ లోపలినుంచి వచ్చి, గజల్ వీపు మీద గుద్దుల వర్షం కురిపించేది. బీబీ ఇంటికి వచ్చే ముందు మంచిగా ఉండమని ఎన్నో బుద్ధులు నేర్పి, మాట తీసుకుని, ఆమెని తీసుకువచ్చేది బతూల్. గజల్ కూడా అవన్నీ అమలు పరచడానికి శాయశక్తులా ప్రయత్నించేది.

'ఎక్కడా ఠికానా లేనప్పుడు అల్లామియా ఇంకా ఎందుకు బ్రతికిస్తున్నాడో?'

ఆమెని కొట్టి-కొట్టి అలసిపోయి ఆ దెబ్బలన్నీ తనే తిన్నట్టు ఏడవడం మొదలెట్టేది బతూల్.

గజల్‌కి తమ ఇల్లంటే మక్కువ ఎక్కువ. అక్కడ అన్నా-చెల్లెళ్ళు ముగ్గురూ కలిసి ఇష్టమొచ్చినట్టు దెబ్బలాడుకునేవారు, కొట్టుకునేవారు. నాలుగు మూలలనుంచీ వేధించే కష్టాలకి పండిపోయి, జీవచ్ఛవంలాగ తయారయింది. ఆమె స్థితి చూసి బీబీ చాటుగా ఏడుస్తూండేది. అల్లా ఆమె బిడ్డల పరిస్థితులనెంత పాడుచేశాడో! ఇప్పుడామె చేతులలో శక్తి లోపించింది. బొద్దుగా, ఆరోగ్యంగా ఉన్న గజల్ వంటి మీద, పడే దెబ్బలు ఆమెకు తగిలేవి కావు. కానీ బతూల్ ఏడుస్తూ కూర్చుంటే, ఆయాజ్, షహజాద్‌లలాగ వెక్కిరించకుండా, తల్లి మోకాళ్ళనానుకుని తనుకూడా రెప్ప వెయ్యకుండా చూస్తూ కూర్చునేది.

పగలస్తమానం ఇష్టమొచ్చినట్టు గంతులేస్తూండేవారు, కాని సాయంత్రం తండ్రి ఆఫీసునుంచి వచ్చేసరికి అంతా తలో మూలా నక్కేవారు.

మధ్యాహ్నం తల్లి నిద్రపోతూన్నప్పుడు, ఆ నిశ్శబ్ద వాతావరణంలో గజల్‌కి తన అస్తిత్వం గుర్తొచ్చేది. మొత్తం సృష్టంతా కైవసం అయినట్టుండేది. అటువంటి వాతావరణంలో ఎవ్వరూ తోడులేని పరిస్థితిలో ఒంటరిగా ఇష్టమొచ్చినట్టు అల్లరి చేసేది. తియ్యకూడదని ఆంక్ష విధించిన వస్తువులన్నిటినీ, తియ్యడం పెట్టడం చేస్తూ, స్వేచ్ఛానుభూతి పొందేది. నిశ్శబ్దంగా తలుపు తీసుకుని బయటికి వెళ్ళిపోయేది. ఊరికే బయటికి చూసే నెపంతో వీధి వీధంతా ఒకసారి తిరిగొచ్చేది. మలమల మాడిపోతూన్న ఎండాకాలపు మధ్యాహ్నం, వేడిగా కాలిపోతూన్న సిమెంట్ రోడ్డుపైన పుట్టి కాళ్ళతో నడుస్తూ, కాశ్మీరు వెళ్ళి కూడా ప్రజలు పొందలేనంత ఆనందాన్ని పొందేది. ఆ సమయంలో తల్లి-తండ్రులు కొట్టిన దెబ్బలన్నీ మర్చిపోయేది. పిల్లల్ని ఎత్తుకుపోయేవారు. తనని కూడా ఎత్తుకుపోయి ఏదో ఒక మాయా నగరానికి తీసుకుపోకూడదా అని అప్పుడప్పుడు అనుకునేది. అక్కడ వజ్ర వైఢూర్యాలు రాసులుగా పోసి ఉంటే, వాటన్నిటినీ తీసుకుని తాను పారిపోయి వచ్చెయ్యవచ్చు. ఆ వజ్రాల్ని అమ్మేసి, ఒక ఎర్రటి చమ్కీతో మెరుస్తున్న కుర్తా కొనుక్కోవచ్చు, ఒకసారి అత్త రజియా వండినట్టు, అలాంటి గుండె కాయని వేయించుకుని

తినవచ్చు. అప్పుడు తండ్రి తనని కొట్టడం మానేస్తాడు. వజ్రాల్ని శుభ్రపరచడానికే సమయం దొరకనప్పుడు, తనని బాదే తీరికెక్కడుంటుంది తండ్రికి. తన తండ్రి తన్నెప్పుడూ కొట్టడని ఫౌజియా అబద్ధం చెబుతుంది. గజల్‌కి అబద్ధం నమ్మబుద్ధి అయ్యేది కాదు. కాని బీబీ ఇంట్లో విచిత్రమైన విషయాలు జరిగేవి. మామయ్య ఫౌజియాని చేత్తో ఎగరవేసి, పట్టుకుని ముద్దుచేసేవాడు. షాహీన్ ఈ రోజు జోళ్ళు వేసుకోను, శాండల్ వేసుకుంటానంటే ఎందుకు బలవంతం చేస్తానని మావయ్య అత్తతో గొడవ పడతాడు.

'డాడీ! నాకీ లెక్క రావడం లేదు అంటూ ఫౌజియా పుస్తకం తండ్రిపైన విసిరేసేది.'

'ఇలాతే, నేను బోధ పరుస్తానంటూ,' మావయ్య వంగి ఆ పుస్తకం తీసేవారు.

గజల్, ఫౌజియాలు వయస్సులో కొన్ని నెలలు తేడా మాత్రమే ఉంది. అందుకని అన్ని విషయాలలో ఫౌజియాను అనుకరించడానికి ప్రయత్నించేది గజల్. ఒక రోజు తండ్రిని సంతోష పెట్టాలని నిర్ణయించుకుంది గజల్.

'నాన్నా... నాన్నా... నాకీ పాఠం కంఠస్తం కావడం లేదు' అంటూ పుస్తకాన్ని తండ్రి ముందు పడేసింది.

'సరే, ఉండు, ఇప్పుడే కంఠస్తం అయ్యేటట్టు చేస్తాను' కర్ర పుచ్చుకుని చావబాదేడు తండ్రి.

తన తియ్యటి కంఠంతో ఎంత చక్కని పాటలు పాడినా, చాంద్ అక్కలాగ డాబుగా కనపడాలని, ప్రయత్నించినా, తల్లికెప్పుడూ ఆమెపట్ల అభిమానం కలుగలేదు.

ఆమె ఎప్పుడూ ముఖం కప్పుకుని ఏడుస్తూండేది. ఎప్పుడో ఒకసారి అకస్మాత్తుగా లేచి కాబాషరీఫ్ ఫొటో మీద పేరుకున్న దుమ్ముని, తన కొంగుతో తుడుస్తూండేది. మిఠాయి తింటూన్న వారిని చూస్తే ఎవరికైనా సహజంగా నోరూరుతుంది, కాని ఎవరైనా పిల్లల్ని తల్లి ముద్దాడుతుంటే తనకి కరువైన ప్రేమ గుర్తుకొచ్చేది. ఆ రాత్రి గజల్ ఎన్నో కలలు కనేది. తను అత్తలాగ మెరుస్తున్న చీర కట్టుకుని పెదవులకి రంగు పూసుకుని

ఎక్కడికో వెళుతున్నట్టు కల కనేది. ఇంకో మాటు చాంద్ అక్క వేషం వేసినట్టు, తల్లి ఝాన్సీ రాణీ అయిపోయేది, తనని గుండెలకదుముకునేది. తను అలసిపోయేంత వరకు, తనివి తీరా ఎంతో ముద్దుచేసేది. కళ్ళు తెరిచేసరికి అమ్మ, తన చిన్నప్పటి జర్‌బఫ్త్ పైజామా, జార్జెట్ చీర, చింపి కుట్టిన ఆ దరిద్రపు దుస్తులు గుర్తుకువచ్చేవి. ఇప్పుడు అమ్మ దగ్గర ఉన్న ఈ బట్టలు ఎంతో విలువైనవి. వీలైతే తల్లి వాటిని గజల్‌కి కట్న కానుకలు కోసం దాచిపెట్టేది. కాని గజల్ కావాలనే ఎంతో కోపంతో వాటిని మాటి మాటికీ వేసుకుని కొర్రులు పెట్టించి ఎంత అసహ్యంగా తయారు చేసిందంటే రజియా వాటిని తన అలమారులో పెట్టనివ్వలేదు.

'ఏదో వెధవ్వాసనొస్తూందీ బట్టల నుంచి, చాలా అసహ్యంగా ఉన్నాయి. ఇంక వీటిని తీసుకెళ్ళి మీ ఇంట్లో పెట్టిలో పెట్టుకో,' అత్త ఆ బట్టల్ని తీసి మంచం మీద పడేసింది. గజల్‌కెంతో బాధనిపించింది.

'వీటిని మీ అలమారలోనే పెడతాను. ఎక్కడికైనా వెళ్ళవలసి వస్తే ఇంటికెలా వెళతాను బట్టల కోసం.'

'నేను పెట్టను,' ముక్కు మూసుకుంటూ అంది అత్త.

ఇంత పెద్దదైపోయింది, కాని సరిగ్గా బట్టలు వేసుకోవడం కూడా చేత కాదు. మా ఫౌజియాని చూడండి, తెల్లటి గౌను మీద ఎప్పుడైనా ఒక్క మరక అంటుకుందా! ఈవిడ పాపం 'అలిఫ్‌లైలా' షహజాదీ, అంతే ఏమీ తెలియదు.

తరువాత గజల్‌కి బిస్మిల్లాహ్ అయినప్పుడు బీబీ మాత్రమే గుర్తుపెట్టుకుందా రోజుని. అమ్మకి నాన్నకి ఇవాళ గజల్ బిస్మిల్లాహ్ ధ్యాసే లేదు. సాయంత్రం బీబీ వచ్చింది, కూడా ఒక డైసాతో బిరియానీ, ఇతర తినుబండారాలు, నాలుగు పళ్ళేలలో మిఠాయి, పువ్వులు, ఒక ఎర్రటి సాటిన్ పైజమా ఎంబ్రాయిడరీ చేసిన ఎర్రటి దుపట్టా, చమ్కీ కుట్టిన ఎర్రటి కుర్తా తీసుకువచ్చింది. గజల్ ఆ దుస్తులు తీసుకుని గుండెల్లో దాచుకుంది. ఒక్క క్షణం కూడా వాటిని విప్పాలనింపించలేదు.

ఆ దుస్తుల్ని గజల్ ఈద్‌నాడు వేసుకుంది బక్రీద్‌నాడు కూడా. ఫౌజియా బొమ్మ పెళ్ళయినప్పుడూ, చాంద్‌తో నాటకానికి వెళ్ళినప్పుడు వేసుకుంది. తరువాత షాహీన్, అతని స్నేహితులు కలిసి, ఐవానే గజల్‌లో చిన్న

పిల్లల ముషైరా జరిపినప్పుడూ ఆ దుస్తులు వేసుకునే తాతగారు వ్రాసిన గజల్ వినిపించింది గజల్.

పిల్లలు చేసే ఈ తమాషాని, చూడడం కోసం ఇంటిల్లపాదీ గుమిగూడారక్కడ. గౌహర్ అత్తకైతే నవ్వి, నవ్వి పొట్ట చెక్కలయింది. షాహీన్ పూర్తిగా తాతగార్ని అనుకరిస్తున్నాడు. అలాగే గట్టిగా అరుస్తూ షేర్ చదవడం, అలాగే తను వ్రాసిన పంక్తులకి తానే మురిసిపోవడం, ఫౌజియా మాటి, మాటికీ సిగ్గుపడిపోయి, గజల్ మర్చిపోయింది. కానీ గజల్ మాత్రం పూర్తిగా చాంద్ ఆపాని అనుకరించింది. చాంద్ చేసిన అలంకరణలో అదేవిధంగా రాగయుక్తంగా, అభినయిస్తూ, గజల్ చదివేసరికి రజియా అసహ్యించుకుంటున్నట్టు, రాషిద్‌తో అంది, 'ఫొటోలలో ఉన్న మీ తాత - ముత్తాతలంతా గజల్ అభినయాన్ని చూసి ముగ్ధులై పోయుంటారు. ఇదంతా ఈ పిల్ల ఇప్పట్నించే ఎలా నేర్చుకుందో?

రాషిద్ జాగ్రత్తగా పరిశీలించాడు. ఐవానే గజల్ గోడలపై, బంగారు వన్నె ఫ్రేములో బిగించిన షాయర్లందరి ముఖాలు ఎంతో ప్రసన్నంగా కనబడ్డాయి.

ఎంతో కాలం తరువాత వారు రాబోయే ఒక కొత్త ఉపద్రవాన్ని చూశారీ రోజు.

లేకపోతే ఈ భవనంలో ఎప్పుడూ రాత్రనేదే వచ్చేదికాదు. రాత్రవడం తోటే సాకీ పాన పాత్రలతో ప్రత్యక్షమయ్యేవాడు. చాంద్, గజల్‌ని దగ్గరకు తీసుకుని ఎంతో మెచ్చుకుంది. 'శహబాష్'! నువ్వెంతో చక్కగా అభినయించావు, నేను నాటకాలలో చిన్న - చిన్న పాత్రలిస్తాను.'

కాని అమ్మా, నాన్నలు అలవాటు ప్రకారం అలాగే చూస్తూండి పోయారు.

తండ్రి అప్పుడప్పుడు ఆఁయాజ్, షహజాద్‌లకోసం బట్టలు, తినుబండారాలు తీసుకొచ్చేవాడు. వారు మగపిల్లలు కనుక ఎప్పుడో ఒకప్పుడు 'అలిఫ్‌లైలా' లో తాను పోగొట్టుకున్న అదృష్టాన్ని వెలికి తీసుకు వస్తారన్న నమ్మకం అతనికి. అందుకని అతనికి కొడుకులంటే ఇష్టం. వాళ్ళని కష్టపెట్టేవారు కారు. వాళ్ళు చేసే అల్లరిని చూసీ చూడనట్టు ఊరుకునేవాడు. కాని గజల్‌ని విపరీతంగా అసహ్యించుకునేవాడు.

ముర్షిదుల ఇంట్లో ఆడపిల్ల అచ్చిరాదని తన తల్లి, అన్న మాటలు హుమాయూన్‌కి బాగా జ్ఞాపకముంది. గజల్ పుట్టిన నాటినుంచే అలిఫ్‌లైలాని దురదృష్టపు మేఘాలు ఆవరించాయి. మిస్కీన్ ఆలీషాహ్ మరణంతో హుమాయూన్ భాగ్యోదయం కావలసిన తరుణంలో అదృష్ట ద్వారాలన్నీ మూసుకుపోయాయి. అతడు అలిఫ్-లైలా నుండి బయటికొచ్చి నూటయాభై రూపాయల జీతం మీద గుమాస్తాగీ చేస్తూ, దురదృష్టవంతురాలైన రోగిష్టి భార్యతో వేగుతున్నాడు. ఏ ముదనష్టపు పిల్ల పుట్టడం వల్ల తను సర్వనాశనం అయిపోయాడో, ఆ పిల్లకి తిండి-బట్ట ఇస్తున్నాడు.

గజల్ అన్నలిద్దరికీ తమ గొప్పతనం గురించి తెలియనే తెలియదు. స్కూల్ నుంచి వచ్చిన వెంటనే పట్టుపట్టి, తల్లిని వేధించి, చెరో పావలా పుచ్చుకునేవారు. పావలా చేతిలో పడగానే ఇద్దరూ సినిమా చూడడానికి పరుగెత్తేవారు. పొద్దున్న లేస్తూనే కర్ర - కత్తుల్ని తీసుకుని, నాడియా మరియు జాన్ కావస్‌లను అనుకరిస్తూ గోడలపైన దూకుతూ తిరుగుతూండేవారు. తల్లి చీరల్ని కప్పుకుని, మంచాల్ని నిలబెట్టి గుర్రాలుగా భావించి ఆడుకునేవారు. అయాజ్, షహజాద్‌లు పదకొండు, పన్నెండు సంవత్సరాల వయసు వారే అయినప్పటికీ పుష్టిగా, మంచి ఒడ్డూ-పొడుగు ఉండి వయసుకి మించినట్లు కనబడేవారు. హుమాయూన్ పిల్లలు ముగ్గురికీ తాతగారి అందం, ఆకర్షణ ఉన్నాయి. మిస్కీన్ అలీషాహ్ కళ్ళల్లో ఒక విధమైన సమ్మోహన శక్తి ఉండేది. ఆడవాళ్ళందర్నీ ఆకర్షించగలిగిన ఆయన కళ్ళలాగే ఉన్నాయి గజల్ కళ్ళు అని హుమాయూన్ తల్లి అంటూండేది. అదే విశాలమైన ఎరుపుతో కూడుకున్న తెల్లటి ముఖము, అవే అర్ధనిమీలిత నేత్రాలు, మౌనంగా స్వయం సంతోషంగా ఉండటం - ఈ బిడ్డ తన తాతగారి అదృష్టాన్ని కూడా వెంట తెచ్చుకునుంటే ఎంత బాగుండేదో!

ఒకనాడు ఇంటి ప్రాంగణంలో కూర్చుని గజల్ తల్లి వద్ద 'సిపారా' నేర్చుకుంటూంది. ఇంతలో చేతిలో కత్తి పట్టుకుని ధమ్మని దూకిన షహజాద్ గజల్‌ని ఒక చేత్తో పట్టుకుని మంచంపైకెక్కాడు. తిరిగి రెండవ చెయ్యెత్తి కావస్‌లాగ గట్టిగా హాయ్!' అన్నాడు.

మొదట గజల్‌కి ఏమీ అర్థం కాలేదు. గద్ద, తనని మాంస ఖండమని

ఎగరేసుకుపోయినట్టనిపించింది. తరువాత గొంతు చించుకుని ఏడవడం మొదలెట్టింది. కాని అన్నదమ్ములిద్దరు సంతోషంతో పొంగిపోతున్నారు.

'గజ్జో! ఇవాళ మేము నిన్ను నాడియా చేసేశాము. జాన్ కావస్ నాడియానిలాగే ఎత్తుతాడు సినిమాలో.

'వద్దు, నేను నాడియా అవను! నాడియాని అల్లా నరకాగ్నిలో కాల్చివేస్తాడు తెలుసా? తల్లి చెప్పిన విషయం ఆమెకి జ్ఞాపకముంది.'

కాని మరునాడు షహజాద్ ఎప్పుడు కత్తి తీసుకుని, గోడపైనించి దూకి, నడుము దగ్గర పట్టుకుని తనని ఎప్పుడు మంచం మీద పడేస్తాడో, అని పైజమాని పైకి పట్టుకుని, వణుకుతూ, ఎదురుచూస్తూ నిలబడింది గజల్. అన్నలు తనపై చూపిస్తున్న శ్రద్ధకి ఆనందిస్తూ గర్వంగా తిరగసాగింది. తనకు లభిస్తూన్న ఈ గౌరవానికి పొంగిపోతూన్న గజల్, ఫౌజియాని చూసి ఈర్ష్య పడడం మర్చిపోయింది. తన అన్నలిద్దర్నీ సినిమా హీరోలకన్నా సాహస వంతులనుకునేది. షాహీన్ పాపం లాన్‌లో స్నేహితులతో క్రికెట్ ఆడుకుని తృప్తి పడేవాడు, కాని తన అన్నలెంతటి వీరులో! వాళ్ళ ఉక్కు చేతుల గుద్దులు, సహించశక్యం కాని తన్నులు, వారు చేసే అన్యాయాలు, అన్నీ నవ్వుతూనే సహించేది ఆ పిల్ల. తనకేసి చూసే ప్రతి చూపుని శ్రద్ధగా పరిశీలించేది గజల్. తనని ప్రేమగా చూసే వారి తప్పులన్నిటినీ ఆమె క్షమించగలిగేది. కారణం అటువంటి చూపులు ఆమెకి అరుదుగా లభించేవి. ఆ వ్యక్తి అపరాధాలన్నీ మాయమైపోయేవి. ఒక ఆశా కిరణం కనపడేది. ఒక ఆకు తలెత్తి ఇటు - అటూ చూస్తే ఎదిగేది. ఒక పూరెక్క విచ్చుకునేది, ఒక తీగ గజల్‌ని బంధించేది.

నిన్న మధ్యాహ్నం, తల్లో పేలు తీస్తూ, అమ్మ చెప్పిన ఎన్నో విషయాలు, గజల్‌కి ఉండుండి జ్ఞాపకమొస్తున్నాయి. ఒక పిల్ల తండ్రికి మంచినీళ్ళివ్వకపోయేసరికి ఒక్క నీటి చుక్క కోసం ఆకాశంలో అరుస్తూ తిరుగుతూంటుంది. వాటి నోట్లో కన్నం ఉంటుంది. కనుక వర్షం వచ్చినప్పుడు నోరు తెరుచుకుని ఎగురుతూంటుంది, నీరు నోట్లో పడుతుందేమో అన్న ఆశతో. ఒక స్త్రీ భర్త ఆజ్ఞ పాటించకపోయే సరికి, అల్లామియా ఆమెను నరకంలోకి నెట్టిపేశాడు ఒక అమ్మాయి పరపురుషుల ఎదుట పడేసరికి ఒక ముసలి వ్యక్తి...'

. 'అయితే చాంద్ ఆపా అలా అయిపోతుందా?' చాంద్ ఆపా గురించి బెంగ పట్టుకుంది, ఎందుకో తెలియదు కాని, అమ్మ ఆమె ప్రశ్నకి చెంపకాయ కొట్టింది. ముద్ద నములుతూ ఆలోచిస్తూంది గజల్. ఇంట్లో ఏడుస్తూ - మొత్తుకుంటూన్న స్త్రీలామెను సరిగ్గా ఆలోచించనియ్యడం లేదు. ఆ పిల్ల పొయ్యి దగ్గర కిందే కూర్చుంది. సాయా పాలూ చెక్కరలో నానబెట్టిన రొట్టి తినిపిస్తూంది. తింటూన్నప్పుడు కూడా గత రాత్రి, దెబ్బలాడుతూ దెబ్బలాడుతూ, తండ్రి తల్లిని ఒక్క తన్నుతో ప్రాంగణంలోకి తోసిన సంఘటన మర్చిపోలేదు. తల్లిని లేవ తియ్యడానికి శాయశక్తులా ప్రయత్నించి, చేతకాక షహజాద్, ఆయాజ్‌లను పిలుచుకొచ్చింది. తరువాత వీధి వీధంతా ఇంట్లో పోగయ్యారు. అందరూ, మాటా పలుకూ లేకుండా పడి ఉన్న అమ్మని, అటు - ఇటు కదిపి చూస్తున్నారు. ఎప్పుడూ చూడనట్టు చూస్తున్నారు. తరువాత ఏడుస్తూ, మొత్తుకుంటూ బీబీ వాళ్ళంతా వచ్చేశారు. బీబీ వస్తూనే గజల్‌ని, ఐవానే గజల్‌కి పంపించేసింది. అక్కడ కేవలం ఫౌజియా - షాహీన్లు మాత్రమే ఉన్నారు. వాళ్ళిద్దరూ గజల్‌ని ఎంతో జాలిగా చూస్తున్నారు. ఆమె అల్లరికి అడ్డు చెప్పడంలేదు. ఆ పిల్ల ఇష్టమొచ్చినట్టు పచ్చి సపోటా కాయల్ని తెంపి పారేసింది. వరండాలోని రాళ్ళపైన తెగ ఉమ్మింది. అత్త స్ప్రింగ్ మంచం మీద ఇష్టమొచ్చినట్టు గంతులేసింది. ఫౌజియా, షాహీన్లతో ఎంతో దెబ్బలాడింది.

సాయంత్రం ఆమెను ఇంటికి పిలిపించేసరికి ఇంటినిండా జనం ఉన్నారు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఆయాజ్, షహజాద్‌లు ఏడుపు ముఖాలు పెట్టుకుని, బుద్ధిమంతుల్లాగ బీబీ దగ్గర కూర్చుని ఉన్నారు. అమ్మేది? మాటి మాటికీ అడిగేసరికి బీబీ ఆసుపత్రికెళ్ళిపోయిందని చెప్పింది. అది విని గజల్‌కూడా ఒక మూల మౌనంగా కూర్చుంది. ఈ రోజెందుకో స్త్రీలందరికీ తనంటే అభిమానం కలుగుతూంది. అంతా ఆమెను పిలిచి గుండెలకు హత్తుకుని ఎంతో ఏడ్చారు. ఈ ఏడుపులూ, పెడబొబ్బలతో విసిగిపోతూంది గజల్. మరొకప్పుడైతే అంతా తనపై చూపిస్తున్న ప్రేమకి ఎంతో గర్వపడేది.

బీబీ మౌనంగా ఆకాశం కేసి చూస్తూంది. అత్త రజియా మాటి మాటికీ కళ్ళు నలుపుకుంటూ దుఃఖిస్తున్నట్టు కనబడాలని ప్రయత్నిస్తూంది. కుంటత్త

స్త్రీలంతా కూర్చున దగ్గర ఉండి గట్టిగా అరుస్తూ శాపనార్థాలు పెడుతూంది. జుట్టుని దెయ్యంలాగ విరబోసుకుని మొహం కప్పుకుని తిడుతూంది. 'ఇప్పుడేమంత వయస్సుందమ్మా... దానితోటి వాళ్ళకింకా పెళ్ళేకాలేదు. ఈ ముర్షిదుల మొఖాలు మండా... మా బిడ్డని కాల్చుకు తినేశారు. దరిద్రులు... నా బతూల్ తల్లీ... తిరిగి నిన్నెక్కడ పొందగలనమ్మా...!' తిరిగి అంతా కలిసి ఏడవసాగారు.

'గజల్... గజల్, ఇక నువ్వు మా ఇంటికి వస్తే నా బొమ్మిచ్చేస్తాను,' ఎంతో ఉదార హృదయంతో అంది ఫౌజియా.

'ఏం? నాకెందుకిచ్చేస్తావు?' ముక్కు ఎగబీలుస్తూ అడిగింది గజల్.

'మీ అమ్మ చచ్చిపోయింది కదా ఇవాళ, అందుకు?

'తప్పమ్మా... అలాగనకూడదు...?' రజియా గబగబా ఫౌజియా చెయ్యిపట్టుకుని అవతలకి తీసుకువెళ్ళి చెవిలో ఏదో చెప్పింది.'

'అమ్మ చచ్చిపోయిందా...? అయితే చచ్చిపోయి ఎక్కడికెళ్ళింది?' గజల్‌కి ఏమీ అర్థం కాలేదు. విసిగిపోయి పురుషులు కూర్చున్న గదిలోకెళ్ళింది.

తాతగారు రెండు చేతులతో తలపట్టుకుని కూర్చున్నారు. రాషిద్ మామయ్య మాటి మాటికీ కళ్ళు తుడుచుకుంటూ, ఇంటికప్పుకేసి చూస్తున్నాడు. తండ్రి కూడా జుట్టు చిందరవందరగా వుంది. కొత్త వాళ్ళతో గదినిండా ఉంది. మాట్లాడవలసిన విషయాలన్నీ అయిపోయినట్టు అంతా మౌనంగా ఉన్నారు. తరువాత గజల్ దృష్టి చాంద్ ఆపా మీద పడింది, నల్లటి సల్వార్ కుర్తా దుపట్టా వేసుకుందామె. ఏడ్చి ఏడ్చి ఆమె ముఖం మండుతూన్నట్టుంది కళ్ళు వాచిపోయాయి.

'షేక్స్‌పియర్ ప్రపంచమొక రంగస్థలం, ప్రతి వ్యక్తి ఈ రంగస్థలంపైన తన పాత్రను నిర్వహించి, నిష్క్రమిస్తాడని షేక్స్‌పియర్ ఎంత చక్కటి మాట చెప్పాడు, కాని బతూల్ పిన్ని ఎంత విషాదకరమైన పాత్ర నిర్వహించింది...!' అంటూ మళ్ళీ ఏడవబోయే సరికి, ఆమెను ఓదార్చడం కోసం చుట్టూ చేరి, 'మీరింత చదువుకున్నవారై ఉండి ఏమీ తెలియని వారిలాగా...!'

'మీరు కొంచెం ఓర్పు వహించండి మిస్. చాందినీ... ఇలాగ ఎంతకని దుఃఖిస్తారు...'

తరువాత రాషిద్ మిత్రుడే ఖాన్ సాహెబ్‌కి, చాంద్ తన నాటకంలో నాయిక పాత్ర ధరించవలసి ఉందని, ఆమె ఈ విధంగా దుఃఖిస్తూంటే ఎలా అభినయించగలుగుతుందన్న విషయం గుర్తొచ్చింది. ఆయన మెల్లిగా, మీరు, చాంద్ నాతో వచ్చెయ్యండి, కాస్సేపలాగ తిరిగి వస్తే, చల్లగాలికి చాంద్ కొంత తేరుకుంటుంది. అన్నాడు రాషిద్‌తో. అది విని, 'నువ్వు ఖాన్ సాహెబ్‌తో వెళ్ళిపో, నేను నాన్నగారి దగ్గర ఉంటాను', అన్నాడు రాషిద్ మెల్లిగా.

ఖాన్ సాహెబ్ చాలా పలుకుబడిగల మనిషి, ఐదు - పదివేల కాంట్రాక్ట్ నిమిషాలలో ఇప్పించగలడతను.

'హాయ్ అల్లా, వద్దు బాబూ... నాకెక్కడికీ వెళ్ళాలనిలేదు!' అంది చాంద్.

ఆయన ఊరుకున్నారు. ఒక యువతి ఆత్మ శరీరంనుండి వేరైపోయింది. చాంద్ దిగులుగా ఉన్న ముఖం చూసి గదిలోని పురుషులందరి హృదయాలలో చీకటి పేరుకుపోయింది. చాంద్, పిన్ని మరణిం చిందన్నవార్త ఆమె స్నేహితులందర్నీ అక్కడికి లాక్కొచ్చింది. చాంద్ హుమాయూన్ ఇంటికొచ్చి పొడుగ్గా ఉన్న నల్లటి బ్యూక్ కారులోంచి దిగడం చూసిన చుట్టుప్రక్కల ఉన్న పురుషులు హుమాయూన్‌ని పరామర్శించడాని కొచ్చేశారు. గదిలో నేలమీద కూర్చోడానికి స్థలం లేదు. అందుకని తన ఉలెన్ పాంట్‌ని కూడా లెక్కచెయ్యకుండా ఖాన్ షాహెబ్ కటిక నేలపైన, చాంద్ దగ్గర చతికిలబడ్డారు. బతూల్, ఆమె అత్తవారు, ఆమె మరణిస్తే, రాషిద్, చాంద్‌లను ఎరుగున్న గొప్పవాళ్ళంతా పరామర్శించడానికి వాళ్ళింటికి వస్తారని కలలోకూడా ఊహించలేదు.

ఖాన్ సాహెబ్ చాలా గొప్ప వ్యక్తన్న విషయం హుమాయూన్‌కి కూడా తెలుసు. వారి తాత-తండ్రుల బేగమ్ బజార్‌లో వడ్డీ వ్యాపారం చేస్తూ, రాషిద్ తాత-తండ్రులు ఆస్థిని మెల్లిగా స్వంతం చేసుకుంటున్నారు. ఖాన్ సాహెబ్ ఆ సంపదని పెట్టుబడిగా పెట్టి పెద్ద ఎత్తున వ్యాపారం ప్రారంభించాడు. అతడు హైదరాబాదులోని పెట్టుబడిదారులలో ప్రముఖుడుగా గుర్తింపు పొంది పేరు ప్రఖ్యాతులు పొందడం కోసం అందరికీ ప్రీతిపాత్రుడవ్వాలన్న కాంక్షతో ఎన్నో కార్యక్రమాలను చేబట్టాడు.

అనాధ బాల-బాలికల కోసం శరణాలయాలు కట్టించాడు. జాగీర్దారుల దేవిడీలలో పుట్టి, జీవితాంతం చెప్పుదెబ్బలు తింటూ, ఇంట్లోని యువకుల వాంఛలకి బలైపోతూ, వాతలు పెట్టి హింసలకు గురి అయి, చివరికి ఎవరో ఒక బేగమ్‌చేత దెబ్బలు తింటూ ప్రాణాలొదులుతున్న అసహాయులందర్నీ ఈ అత్యాచారాలనుంచి తప్పించడానికి, వారికి విముక్తి కలిగించడానికి పోరాడి సాధించాడతను.

ఖాన్ సాహెబ్ ఒక సాంస్కృతిక సంఘానికి అధ్యక్షుడు కూడా. మెడికల్ కాలేజీలో ఏదో నాటకంలో చాంద్‌ని చూసేసరికి తన కల్చరల్ సొసైటీపైన కమ్ముకున్న చీకటి తెరలు క్రమంగా తొలిగిపోతూన్నట్టనిపించిందతనికి. అతను చాలా తెలివైనవాడు, పూలగుత్తితో చాంద్‌కి అభినందనలు స్వయంగా తెలిపేందుకు బదులు రాషిద్‌తో పరిచయాన్ని పెంచుకుని అతడికొక బిల్డింగు కట్టించే కాంట్రాక్ట్ ఇప్పించాడు. ప్రత్యామ్నాయంగా చాంద్‌వంటి అభినేత్రిని ఖాన్ సాహెబ్ సాంస్కృతిక సంఘానికి అర్పించే బాధ్యత రాషిద్‌పై పడింది. మొట్టమొదటిసారి అతను చాంద్‌ని కలుసుకున్నప్పుడు చాలా గౌరవంగా, అతి మర్యాదగా ప్రవర్తించాడు. చాంద్, అతనికెక్కువ ప్రాధాన్యతనివ్వకుండా ముక్తసరిగా ఉండిపోయింది. అతని వయస్సు నలభై దాటింది. అతని బట్టతల, నల్లటి మేనిఛాయ, స్థూలకాయం, చాంద్ వంటి స్త్రీలని ఆకర్షించేది కాదు. చాంద్ ముందు అతను తన పలుకుబడిని, సంపదనీ ప్రదర్శించడం తప్ప, మరేమి చెయ్యగలడు?'

నేడు అతను కొద్ది ప్రయత్నంతో చాంద్‌ని తనతో 'హోప్‌రుబా' తీసుకువెళ్ళడానికి, ఒప్పించగలిగాడు. చాంద్ ఆపా పొడుగాటి మెరుస్తూన్న కారులో కూర్చుని బట్టతల వ్యక్తితో వెళ్ళిపోగానే గజల్ తిరిగి లోపలికొచ్చేసింది.

తడి నేలమీద గంతుతూ తిరగసాగింది. చివరికి కుప్పలాగ పడున్న బట్టల మీద పడుకుని కళ్ళు నులుముకోసాగింది. అమ్మ చచ్చిపోయింది. అందుకని ఏడిస్తే నాన్న తప్పక కొడతారు. ఇలా ఆలోచించేసరికి అమ్మ జ్ఞాపకమొచ్చి నిజంగానే ఏడవడం మొదలుపెట్టింది.

ఆ పిల్ల ఏడుపు విని, ఇదివరకెప్పుడూ విననట్టు, అంతా పరుగెత్తుకొచ్చి,

గజల్‌తో పాటు దుఃఖించారు.

'హుమాయూన్ మియా! నువ్వు నీ కొడుకుల్ని కాపాడుకో. గజల్‌ని నా దగ్గరుంచుకుంటా' అంది బీబీ.

'అవును గజల్, ఐవానే గజల్‌లో ఉంటుంది...! వాహిద్ హుసైన్ కూడా ఉత్తేజితులై అన్నారు.'

ఉదయం హుమాయూన్ ముఖం మాడ్చుకుని, రెండు చేతులతో తల పట్టుకుని కూర్చున్నాడు.

తన నల్లటి చేతులలో తియ్యదనాన్ని రంగరించి ఎలాగైనా అతనిచేత టీ తాగించాలని సాయా లక్ష విధాల ప్రయత్నించింది. కాని అతను రెండుసార్లు ఆమె చేతిని తోసేశాడు. బతూల్ అతనికెటువంటి సుఖం ఇవ్వలేదు. కాని అప్పుడప్పుడు, వందో, రెండొందలో, పుట్టింటి నుంచి తీసుకువచ్చి, పబ్బం గడుపుతూండేది. ఇప్పుడు మరొక డబ్బుగల ఇల్లాలెక్కడ దొరుకుతుంది? నిన్నటి నుండి ఇదే సమస్య అతణ్ణి పట్టి పీడిస్తూంది.

పొయ్యి దగ్గర కూర్చుని బీబీ, అయాజ్, షహజాద్‌లకు నేతిలో వేయించిన పూరీలు తినిపిస్తూంది. ఈ విధంగా నెల్లాళ్ళకి సరిపడే నెయ్యి, ఒక రోజులోనే అయిపోయేటట్టుంది. కాని అతని అత్తగారికివేమీ పట్టలేదు. ఆవిడ ఐవానే గజల్ రాణి తన మనుమళ్ళను ఎంత ప్రేమగా చూస్తుందో అల్లుడికి తెలియచెప్పడమే ఆమె ధ్యేయంగా కనబడుతూంది.

తియ్యటి పూరీల సువాసన సోకగానే గజల్ కూడా మాసిపోయి జిడ్డోడుతూన్న తల్లి దిండు విడిచిపెట్టి, పొయ్యికేసి పరుగెత్తింది. కాని హుమాయూన్ చూస్తుండడం గమనించి, కుళాయికేసి తిరిగింది. కుళాయినుంచి కారుతున్నటువంటి నీటి ధారలను తీసుకుని మొహం కడుక్కుని చేతినుండి ఇంకా మురికి నీరు కారుతుండగా పూరీలపైన దాడి చేసింది.

గజల్ తల్లి మరణించింది. ఆ బక్క పలుచని, నోరులేని స్త్రీ తననింతగా బాధించగలదన్న విషయం నమ్మశక్యం కాకుండా ఉంది. ఇప్పుడు తాను పనికిమాలిన ముగ్గురు పిల్లల్ని ఏం చేయాలి? పోనీ తాతగారింట్లో గజల్‌కి ఉండే అవకాశం లభించింది. అయాజ్, షహజాద్‌లను అనాథ

శరణాలయంలో పడెయ్యాలి. అలాచేసి, సమాధిలో పడివున్న బతూల్‌ని హింసకు గురిచెయ్యాలి.

తల్లి చచ్చిపోయింది. వంటింట్లో అమ్మ కూర్చునే ప్రత్యేకమైన పీటమీద కూర్చున్న బీబీని చూసేసరికి విషయం మాటి మాటికీ గుర్తొస్తూంది. తింటున్నది మింగుడు పడడంలేదు. నేడెందుకో తియ్యటి పూరీలు కూడా రుచించడంలేదు. అమ్మ ఎప్పుడొస్తుంది? నేను కూడా అమ్మ దగ్గరికి వెళ్ళనా... ఈ విషయంలో తనకి పూర్తిగా హక్కు ఉంది, ఎందుకంటే అమ్మ మోసం చేసింది. ఐవానే గజల్‌కి వెళ్ళేటప్పుడు తనని మోసపుచ్చి, పడుకోబెట్టి వెళ్ళిపోయేది. ఉదయం తను కళ్ళు తెరుస్తూనే విపరీతంగా గోల చేసేది. ఎంత గోల చేసేదంటే తండ్రి స్వయంగా ఎత్తుకుని తీసుకువెళ్ళి తల్లి దగ్గర కుదేసి వచ్చేవాడు.

'ఇంక నేను అమ్మ దగ్గరికెళతాను' పూరీలు తినడం అయిపోగానే ఏడుస్తూ అంది గజల్. ఇవాళ మళ్ళీ తండ్రి చంకెక్కి బీబీ ఇంటికి వెళ్ళాలనుకుంది గజల్.

'బీబీ...!' హుమాయూన్ గజల్‌ని కోపంగా చూశాడు.

'బీబీ! ఈ పిల్ల ఏడ్పు మాన్పించండి, లేకపోతే నిజంగా దీన్ని కూడా, తల్లిదగ్గరికి పంపిస్తాను. ఇంకా పిల్లల్ని పెంచడం నా తరం కాదు.'

ఇది విన్న గజల్ ఏడుపు మానేసి దూరంగా వెళ్ళిపోయింది.

రాత్రి బలవంతంగా ఒక్కదాన్నే మంచంమీద పడుకోబెట్టే సరికి, ఆ పిల్లకి షేఖామియా చెప్పిన దయ్యాలు భూతాల కథలు జ్ఞాపకానికి రావడంతో, తల్లి చెమటతో తడిసిన ఆ దిండుని గట్టిగా పట్టుకుని పడుకుంది.

ఉదయం ఇంట్లో పెద్ద గొడవ ప్రారంభమైంది.

ఏ పని సకాలం పద్ధతి ప్రకారం జరగకపోవడం ఈ ఇంటి ఆనవాయితీ అయిపోయింది. ఇక్కడంతా సాయా రాజ్యం, బతూల్ ఆసుపత్రిలో పడుండేది. ఎప్పుడైనా బాగయి ఇంటికొస్తే, తిరిగి ఏదో ఒక అవయవం విరగొట్టి ఆమెను పుట్టింటికి తోలేసేవాడు హుమాయూన్. తండ్రి మరణించగానే 'అలిఫ్-లైలా' నుంచి నెట్టివేసిన హుమాయూన్‌ని వాహిద్ హుసైన్ తన పలుకుబడి నుపయోగించి, అతన్నేదో ఆఫీసులో ఒక ఆఫీసరుగా చేర్పించారు. క్రమక్రమంగా జీవితమంటే విషమనీ, భార్య

అన్నిటికంటే గొప్ప పీడని హుమాయూన్ తెలుసుకున్నాడు. పిల్లల్ని పెంచడం, ఇంటి బరువు బాధ్యతలను వహించడం కోసం తన సుఖాలన్నిటినీ బలి చెయ్యాలి. ఇంతకంటే పెద్ద శిక్ష ఏమైనా ఉంటుందా అసలు!

అలిఫ్-లైలా నుంచి బైటికొచ్చిన తరువాత ఎలాగో ఒకలాగ, చావచితక్కొట్టి బతూల్, పిల్లలపీడ నుంచి శాశ్వతంగా విముక్తి పొందాలని శతవిధాల ప్రయత్నించాడతను. కాని బతూల్ ఎన్ని తన్నులు తిన్నా అతని కాళ్ళకే చుట్టుకుపోయేది. అడగ్గానే తండ్రి వద్దనుంచి వందో రెండొందలో తెచ్చిచ్చేది. హుమాయూన్‌కి పిల్లలమీదెప్పుడెటువంటి అభిమానమూ లేదు. ప్రత్యేకించి గజల్ అంటే విపరీతమైన అసహ్యం. అలిఫ్-లైలా లోని అద్భుత దీపాన్ని దొంగిలించి, తనని మహాలు నుంచి బయటికి లాగి గుడిసెలో పడేసిందీ రాక్షసే, అనిపించేదతనికి.

బతూల్ మరణానంతరం అయాజ్, షహజాద్‌లకి ఇష్టా రాజ్యంగా ఉంది. తండ్రి రోజంతా ఆఫీసులో ఉండేవాడు. సాయాని పట్టించు కునేవారు కారు. అంచేత తల్లి కాటుక భరిణ దగ్గరనుంచి, తండ్రి పాత చెప్పుల వరకు దొరికినవన్నీ అమ్మేసి వాళ్ళు సినిమాలు చూసేశారు. ఆయాజ్‌కి చదువుమీద కూడా కొంచెం ఆసక్తి ఉండేది. ఎప్పుడూ ఒక పుస్తకం పుచ్చుకుని ఓ మూలకెళ్ళి కూర్చునేవాడు.

ఉదయం, ముగ్గురూ లేచారంటే తిరిగి ఏదో ఒక ఉపద్రవం ప్రారంభమయ్యేది. టిఫిన్ తినేటప్పుడు వాళ్ళు చేసే గొడవకి హుమాయూన్, ఆకలితోనే ఆఫీసుకు వెళ్ళిపోయేవాడు. తనకి టిఫిన్ దొరక్కపోయేసరికి గజల్ దొర్లడం ప్రారంభించేది. బతూల్ మరణానంతరం, గజల్ ఏడుపుని, కేకల్ని ఎవ్వరూ లెక్కపెట్టేవారు కారు. హుమాయూన్‌కి ఆ పిల్ల అంటేనే గిట్టేది కాదు. పుట్టిన నాటి నుంచి తండ్రి ప్రేమకి నోచుకోలేదు. గజల్, ఆయాజ్, షహజాద్‌లు కూడా గజల్‌ని ఆగర్భశత్రువుగా భావించేవారు. ఈ విధంగా అందరూ చీదరించుకున్న గజల్‌కి ఎండిపోయిన తల్లి గుండెలకి హత్తుకుపోయినప్పుడు కొంతవరకు శాంతి లభించేది. నిర్దయుడైన హుమాయూన్ చేతులనుంచి గజల్‌ని కాపాడడం కూడా బతూల్ బాధ్యతే. బతూల్ చనిపోవడంతో గజల్‌ని కొట్టడం తప్ప ఇతర పనులేవీ గుర్తుండేవి

కావతనికి. గజల్‌ని తనతోటి తీసుకువెళతానని బీబీ ఎన్నోసార్లు చెప్పింది. కాని హుమాయూన్ ఒప్పుకోలేదు. ఒక్క గజల్నే ఎందుకు తీసుకువెళితే ముగ్గుర్నీ తీసుకుపోండి, నాకు, ముక్తి లభిస్తుంది, అనే వాడతను. ఈ ఆకతాయి పిల్లల గుంపుని బీబీ ఎలా పెంచగలదు? ఒకవేళామె పెంచడానికి సిద్ధపడినా రజియా ఎందుకొప్పుకుంటుంది?

ఆ కారణంగా గజల్ డేగ చేతిలో చిక్కిన పావురంలాగ రోజంతా వణికిపోతూ ఏదో ఒక మూల కూర్చుని ఉండేది.

అన్న కుటుంబాన్ని ఆదుకోవడం కోసం వచ్చిందీ పిల్లల మేనత్త. ఆమె అయాజ్, షహజాద్‌లకు చెల్లిని కొట్టొద్దని చక్కగా బోధపరచేది. ఒకప్పుడు విసిగిపోయి, మా ఇంటికెళ్ళిపోతానని బెదిరించేది. అది విని కొంతసేపంతా మౌనంగా ఉండేవారు. తన కొడుకు, కోడళ్ళ మధ్య సఖ్యత ఏర్పర్చడం ంకోసం వెళ్ళవలసి వచ్చేదామెకు. అలాగామె వెళ్ళేసరికి ఇక్కడంతా నాశనమైపోయేది.

హుమాయూన్ పనులతోనే సరిపోవడంతో, పిల్లలకోసం వంట చెయ్యటానికి వీలయ్యేది కాదు సాయాకి. అయాజ్ జోడు పోయింది. షహజాద్ అయాజ్ పుస్తకం చింపేశాడు. ఇద్దరూ పోట్లాట ప్రారంభించేసరికి ఈ గొడవలో కూజా విరిగిపోయింది. ఊరగాయ జాడీ కింద పడిపోయింది. ఆయాజ్ ముక్కు అదిరి రక్తం కారడం మొదలెట్టింది. షహజాద్ గుద్దు, వాళ్ళని విడిపించడానికొచ్చిన గజల్ పొట్టకి తగిలింది.

ఇష్టమొచ్చినట్టు గొడవచేసి బాగా అలిసిపోయిన తరువాత, అన్నదమ్ములిద్దరూ గజల్‌ని ఏడిపించడం మొదలుపెట్టేవారు. ఈ గొడవలతో బతూల్ జీవితం తెల్లారిపోయింది. టానిక్ తాగుతూ ఎలాగో ఈ ఇంటిని కాపాడుకొచ్చింది అత్త. ఆమెకు గల ప్రేమే అందుకు కారణం. గజల్ కంచంలోంచి అయాజ్, మాంసపు ముక్క తీసుకుని తినేస్తే కొంప మునిగిపోయినట్లు కాళ్ళు నేలకేసి కొడుతూ గంటల తరబడి ఏడ్చేది గజల్.

సాయా బజారు కెళుతూ ఆ పిల్లని మూగి ముష్టివాని సంచిలో పడేస్తానని బెదిరించేది. ఆ ముష్టివాని కళ్ళంటే గజల్‌కెంతో భయం. అలా బెదిరించినప్పుడు ఇంకా గట్టిగా ఏడ్చేది. గజల్ అస్తమానం ఏడుస్తూండడం వల్లనే బతూల్ చచ్చిపోయిందనేది బీబీ. హుమాయూన్ విసుక్కుంటూ,

వుండుతూన్న పొయ్యిలోంచి కట్టె తీసుకురమ్మని అంరాజ్‌ని ఆజ్ఞాపించేవాడు, అది వింటూనే గజల్ బట్టలకంటుకున్న దుమ్ము దులుపుకుంటూ, ముంజేతితో ముక్కు తుడుచుకుంటూ నిలబడేది. అక్కడితో విషయం ఆగేది కాదు. ఈ తల్లిలేని పిల్లని పెంచవలసిన బాధ్యత తన ఒక్కడి మీదే ఉందన్న విషయం అకస్మాత్తుగా గుర్తొచ్చేది హుమాయూన్‌కి. వెంటనే, ముందు పాఠం నేర్చుకుని, సాయాచేత తల దువ్వించుకుని, జోళ్ళు వెతుక్కుని, స్కూల్‌కెళ్ళమని హుకుం జారీ చేసేవాడతను. కేవలం ఆ పిల్ల ఏడుపు మాన్పించడం కోసరం శిక్షిస్తున్నట్టు జరిగేదీ తతంగమంతా. బెదిరించగానే పని చెయ్యడం గజల్‌కి నచ్చేది కాదు. అందుకని ఆ మాటలు అసలు విననట్టు, గోళ్ళతో గోడని గీరుతూ, లెక్కలేనట్టు నిలబడేది. ఎవరైనా ప్రేమతో ఆజ్ఞాపించి, తల్లిలా నాలుగు గుద్దులు గుద్దినా బాధపడేది కాదు. తండ్రి పొద్దస్తమానం కొడుతూండేవాడు. ఆ పిల్ల తండ్రి ఈసారి కొట్టిన తరువాత తనని గుండెలకదుముకుంటాడనీ, అప్పుడతని ఒళ్ళో తలదాచుకుని ఏడుద్దామని, ఎదురుచూస్తూండేది. ఇతరుల సానుభూతి కొరకు వేచి ఉండేది గజల్.

నిజానికి వెయ్యి రకాల దిగుళ్ళతో బాధపడే బతూల్‌కి రజియాలాగ, బిడ్డ బుగ్గలపైన ముద్దు పెట్టుకుని లాలించే తీరుబడి ఉండేది కాదు. అయినప్పటికీ అప్పుడప్పుడు తండ్రిచేత దెబ్బలు తిన్న తనని గుండెలకదుముకుని ఏడ్చేదామె, అది గజల్‌కెంతో నచ్చేది. అమ్మ అలాగ బాధపడుతుంటే అలాగే నిద్రపోవాలనిపించేది గజల్‌కి. కాని ఇప్పుడటువంటి వారెవరూ లేరు. తండ్రి ఆమెకేసి చూస్తే చాలు, భూమి - ఆకాశం కదిలిపోతున్నట్టనిపించేది. ఈ కొట్టే వాళ్ళందర్నీ క్షైమా చేసి కాకులకి, గద్దలకి వెయ్యాలనిపించేది గజల్‌కి. ఈ ప్రపంచంలో ఒక్క చాంద్ ఆపా మాత్రం మిగిలి ఉంటే ఎంత బాగుండుననుకునేది.

అన్ని విధాలా నలుగురూ చీదరించుకున్నాక తరువాత మాసిపోయిన బట్టల కుప్ప మీదికెళ్ళి పడుకునేది. బతూల్ మరణించిన తరువాత, వాహిద్ హుసైన్ ఆస్తిలో కూతురుకి గల హక్కు సందర్భంగా వాహిద్ హుసైన్‌కి హుమాయూన్‌కి మధ్య పెద్ద గొడవ జరిగింది. దాంతో ఐవానే గజల్ తలుపులు మూసుకుపోవడంతో కాలు కాలిన పిల్లిలాగ పేట, పేటంతా

తిరుగుతూండేది గజల్. రాత్రి తను చాంద్ ఆపా అయిపోయినట్టు జులపాలున్న గాయకుడు సఆదత్ నేల మీద కూర్చుని నమస్కరిస్తున్నట్టు కలలు కనేది. తను కూడా చాంద్ ఆపాలాగ తన జలతారు చీరంచుని అతని మురికి చేతులలోంచి విడిపించుకుంటూ తెలివి తెచ్చుకోసఆదత్! అంత విపరీతంగా తాగకు అంటోంది.

తరువాత పొడుగ్గా ఉన్న నల్లని కారొకటి వచ్చేది, అంతలో ఎవరో తనని భూగృహంలోకి నెట్టేవారు. తిరిగి తను రాషిద్ మామయ్య ఒళ్ళో కూర్చున్నట్టు, అత్త తనని ఎంతో ముద్దుగా చూస్తూన్నట్టనిపించేది. ఆ అభిమానానికి తట్టుకోలేక తను ఎక్కెక్కి ఏడ్చేది. కళ్ళు తెరిచే సరికి, తలగడ నిజంగానే తడిసిపోయి ఉండేది.

తను చాంద్ ఆపా అవ్వాలంటే ముందుగా వయొలిన్ వాయించడం నేర్చుకోవాలి. పుస్తకాలు చదవడం కాని, నాటకాలలో అభినయించడంకాని తనకి చేతకావు. కానీ చాంద్ ఆపా పాడుతూండగా విన్న పాటలన్నీ అదే రాగంలో పాడడం నేర్చుకుంది. ఆమెలాగ నవ్వడం కూడా వచ్చింది. చాంద్ ఆపా ఒక్కసారి కనబడితే బాగుండును, ఇక ఎప్పటికీ విడిచిపెట్ట కూడదనుకునేది. ఒకసారి తల్లి దగ్గర పడుకున్నప్పుడు ఆ పిల్ల తల్లిని కుదిపేస్తూ అడిగింది.

'అమ్మా, అమ్మా! చాంద్ ఆపా అంత గట్టిగా ఎందుకు నవ్వుతుంది?'

'ఉష్...! అమ్మ అటు తిరిగి పడుకుంది.'

'అమ్మా, నేను కూడా చాంద్ ఆపాలాగ నవ్వుతాను.'

'నువ్వు నన్ను సమాధిలోకూడా నిశ్చింతగా పడుకోనివ్వవు, సరేనా!' అంటూ ఎందుకో అమ్మ ఏడవసాగింది. గజల్ భయపడిపోయింది. అమ్మ నీటి బుడగైపోయింది. చిన్న తాకిడికి పగిలిపోయింది. కాని చాంద్ ఆపా అవ్వాలంటే బాగా చదువుకోవాలి అనుకున్న గజల్. ఆ రోజు నుంచి పొద్దున్నే లేచి స్కూల్‌కి పరుగెత్తేది. రాత్రి పలకని తుడుస్తూ చాలా సేపటి వరకూ హోమ్‌వర్క్ చేసుకుంటూ కూర్చునేది.

చాంద్ తిరుగుళ్ళు నచ్చక హైదర్ అలీఖాన్ కూతురితో సంబంధ బాంధవ్యాలు తెంచేసుకున్నాడు. చాలా సార్లు తండ్రి - కూతుళ్ళ మధ్య పెద్ద గొడవలు జరిగాయి. తర్వాత కూతురికి నెల నెలా పంపే వంద

రూపాయలు పంపడం మానేశాడు. హైదర్ ఆలీఖాన్ ప్రాక్టీసు మానేసి కమ్యూనిస్టు పార్టీలో చేరిపోయాడు. అతడు దాడులు జరిపే తెలంగాణా వారితో కలిసి కుట్రలు పన్నడంలో మునిగిపోయాడు. పైకి మాత్రం ప్రగతిని కాంక్షించే రచయితల స్థానీయ శాఖకి కార్యదర్శిగా అదే ఆఫీసులో కూర్చుని పని చేసుకుంటున్నట్టు కనబడేవాడు. కమ్యూనిస్ట్ వర్కరు అయిన అతని సవితి తల్లి ప్రభావం, అతనిపైన పూర్తిగా పడటంతో, వాళ్ళిద్దరూ తన బాధ్యతలు, అభిరుచులు విస్మరించి, పార్టీ పనులు చేయసాగారు. ఆ కాలంలో తెలంగాణాలో దాడులు జరిపే ముఠా ప్రభావం చాలా ఎక్కువగా ఉండేది. వారు క్రమబద్ధమైన సైనిక శిక్షణను పొంది నిజామ్ సేనలతో పోరాడేవారు. చాలా చోట్ల ఈ ముఠాలకు స్త్రీలు నాయకత్వం వహించేవారు. వారు ప్రభుత్వ సైన్యాల వద్దనుంచి ఆయుధాలను లాక్కొని పోగు చేసేవారు. జిల్లాని తమ ఆధీనంలోకి తెచ్చుకునే ప్రభుత్వం ఈ పార్టీ కార్యకలాపాలపై ఆంక్ష విధించింది. దాంతో పార్టీ ముఖ్య కార్యకర్తలు అండర్ గ్రవుండ్‌లో ఉండసాగారు. బయట ఉన్నవారు, ప్రగతి కాముకులైన ఉద్యమకారులుగా పని చేసుకుంటూండేవారు. దేశముఖ్‌లు, జాగీర్దారులు గ్రామాలను దోచుకోవడం తమ హక్కుగా భావించి, సంచరిస్తున్న రోజులని, పల్లెలలోని రైతుల ధనమానాలు దోచుకున్నారు. పట్టపగలు పొలంలో పని చేసుకుంటూన్న కన్నెలను కారులో పడేసి తీసుకుపోయేవారు, కోతకి సిద్ధంగా ఉన్న పంటను కోయించి తీసుకుపోయేవారు. అటువంటి క్లిష్ట పరిస్థితుల వల్ల ప్రజలలో, పార్టీ ఎడల అభిమానం పెరగసాగింది. ప్రత్యేకించి శ్రామిక వర్గం - రైతులు - కార్మికులు - పార్టీవైపు పూర్తిగా మొగ్గుచూపారు. దుర్గమమైన కొండ మార్గాలపైన 'దళము'కి దారి చూపేవారు. ప్రభుత్వ సైన్యం పత్తేదారు పని చిత్తయిపోయేది. ఈ తుఫానుని ఆపడానికి నిజామ్ ఎన్నో విధాల ప్రయత్నించాడు. రైతుల సంతతి యువకులను, వారి కళ్ళముందే, వారి ప్రాంగణంలోని చెట్లకు వేళ్ళాడేసి ఉరి తీయించాడు. యువతులను సైనికులు బాహాటంగా ఎత్తుకు పోయేవారు. ఉద్యమకారులను, తమ కుటుంబ సభ్యులముందే కాల్చి చంపేవారు. ఈ భయంకరమైన శిక్షల వల్ల ప్రజలలో దుఃఖం, క్రోధం ప్రజ్వరిల్లింది. ఆ భయంకర పరిస్థితులను చూసి

జాగీర్దారులు, దేశ్‌ముఖ్‌లు వణికిపోయారు.

వాహిద్ హుస్సైన్ రక్తపుపోటు కూడా పెరిగిపోయింది. ఒక జాగీర్దారు, చదువుకున్నవాడు, గౌరవనీయుడు అయిన తన అల్లుడు, ఆ దుండగీళ్ళతో కలసి, వారికి మార్గదర్శకుడుగా వ్యవహరించడం ఆయన్ని చాలా బాధిస్తూంది. కోపంతో మామా-అల్లుడి మధ్య మాటలు నిలిచిపోయాయి. ప్రభుత్వపరంగా అల్లుడికీ ఆయనకీ ఉన్న సంబంధ బాంధవ్యాల గురించి, ఎన్నోసార్లు వాకబు చెయ్యడం జరిగింది. హైదర్ ఆలీఖాన్ కుమార్తె ఐవానే గజల్‌లో ఎందుకుంటూందని ప్రశ్నించారు వారు. నిజానికి తండ్రి రాజకీయాల గురించి చాంద్‌కేమీ తెలియదు. అలంకరణకి సంబంధించిన కొత్త పద్ధతులను నేర్చుకోవడం, పార్టీల్లో తన అభిమానులతో కాలక్షేపం చెయ్యడానికే తీరిక లేదామెకి. తన తండ్రి దర్జాగా, సుఖంగా ఉండే జీవితాన్ని విడిచిపెట్టి, ఈ గొడవలెందుకు ఎన్నుకున్నాడో కూడా ఆమెకి తెలియదు. వార్తా పత్రికల్లో నెహ్రూ, గాంధీ లెందుకు ఘోషిస్తున్నారో కూడా ఆమెకి తెలియదు. ఒకసారెవరో, ఆమె తండ్రి గొప్పవాడని అంటే, ఆయన కార్యకలాపాలను దృష్టిలో పెట్టుకుని గర్వపడాలి కాబోలుననుకుంది చాంద్.

ఆ రోజుల్లోనే మెడికల్ కాలేజీ భవన ప్రారంభోత్సవానికి వేంచేశారు హుజూరువారు. విద్యార్థి సంఘానికి అధ్యక్షురాలై, నివేదిక చదవడానికి వేదికనెక్కింది చాంద్. ఆయన ఎవరినీ లెక్కచేసేవారు కారు. అసహ్యించుకునే వారు. కాని అందమైన ముఖాలు కనబడగానే ముగ్ధులైపోవడం ఆయనకి పరిపాటే. చాంద్‌ని చూడగానే ఆమె గురించి వాకబు చెయ్యడం ప్రారంభమయింది. ఒక నల్లని దేహచ్ఛాయగల తన కొడుక్కి చాంద్‌ని ఎంపిక చేశారు.

చాంద్, ఖాన్ సాహెబ్‌ల ప్రేమ వ్యవహారం ఊరంతా పాకిపోయిన రోజులవి. అంచేత ఈ సంబంధాన్ని ఒప్పేసుకుందామని నిర్ణయించుకున్నాడు, వాహిద్ హుస్సైన్. చాంద్ రాజవంశంతో వియ్యమొందటం కంటే, గొప్ప విషయం తమకేముంటుందనుకున్నారాయన. ఈ విధంగానైనా చాంద్ తండ్రి తప్పులు కప్పబడిపోతాయని, నిద్రాణమైన తమ అదృష్టం తిరిగి మేల్కొనగలదని ఊహించసాగారు. రాజులతో

సంబంధాన్ని ఊరికే తోసిపుచ్చడం ఎప్పుడూ జరగలేదు. అలా హాజరత్ అభీష్టాన్ని, కాలం, జాతి అనే కత్తులు తెగించలేని బంధం.

ఇదంతా తెలిసి ఉండి కూడా 'ఛీ... ఇటువంటి దరిద్రపు మొహాల్ని నేనెందుకు చేసుకోవాలి పెళ్ళి అంటూ తిరస్కరించింది చాంద్.'

ఇది విన్న వాహిద్ హుస్సైన్ వణికిపోయారు. ఇంక తమ కుటుంబం ఎటువంటి ఆపదలకు గురికానున్నదో!

ఒకనాటి సాయంత్రం చక్కగా ముస్తాబై, ఎక్కడికో వెళ్ళడానికి తయారవుతూంది చాంద్. అంతలో పెద్ద పెద్ద జులపాలతో నల్లని ఒక హిందూ యువకుడు, చాంద్ పేర వ్రాసిన హైదర్ ఆలీఖాన్ లేఖని తీసుకొచ్చాడు. చాలాకాలం తరువాత తండ్రి ఉత్తరాన్ని చదువుకున్న చాంద్ ఎంతో దిగులు పడిపోయింది. చాంద్ పెద్దదైపోయిందనీ, అందువలన ఆమెను ఆజ్ఞాపించే హక్కు తనకు లేదని ఎంతో బాధగా వ్రాశాడతను. అయినప్పటికి రాచవంశంతో సంబంధ బాంధవ్యాలతనికి ఇష్టంలేదు.

ఉత్తరం చదివి తలెత్తి చూసిన చాంద్ కంగారు పడింది. ఆ నల్లటి యువకుడు తనని రెప్పవేయకుండా చూస్తున్నాడు. కొద్ది క్షణాలు తరువాత చాంద్, కంగారుగానే, 'నాన్నగారిప్పుడెక్కడున్నారని' అడిగింది.

'చాలా దూరంగా...!' అతను జవాబిచ్చాడు,

'మీరు కూడా నాన్నగారితో పని చేస్తుంటారా?'

'అవును నేనొక శిల్పిని, నా పని విడిచిపెట్టి పార్టీలో చేరిపోయాను, కాని ఇప్పుడు మిమ్మల్ని చూసిన తరువాత అలాగ చెయ్యకుండా ఉండవలసిందనిపిస్తూంది!'

'ఎందుచేత...?' చాంద్ నవ్వేసింది. అపరిచితులతో చక్కగా వ్యవహరించడంలో ఆమె దిట్ట.

'ఎందుకంటే నేను కొద్దిగా ఏమారే సరికి, ఖుదా శిల్పకళలో చాలా ఆరితేరాడు. ఆ భగవంతుడు మీలాంటి సుందరాంగులను సృష్టిస్తున్నాడు.'

'చాంద్ నవ్వసాగింది. ఇలాగ విచిత్రంగా పొగిడేవాడు అస్తవ్యస్తంగా ఉన్నవాడు, మత్తెక్కించే కన్నులవాడు - యువకుడి పట్ల ఆకర్షితురాలయింది చాంద్.'

'సరే, ఇంక వెళతాను' అతడు లేచి నిలబడ్డాడు.

'ఏం, అప్పుడే లేచారు, కొంచెం సేపు కూర్చోండి, మీరు మా నాన్నగారి మిత్రులు కనుక టీ తాగకుండా వెళ్ళనివ్వను.' అతను కూర్చున్నాడు, తరువాత డ్రాయింగ్ రూమ్‌లో అమర్చబడిన చిత్ర పటాల్నీ, విలువైన సామగ్రినీ తిలకించసాగాడు.

'బైటినుంచి చూస్తే మీ ఇల్లు చాలా అసహ్యంగా కనబడింది, కాని లోపలికొచ్చిన తరువాత ఇది మహాలు అనీ, మీరు దీనికి సంబంధించిన గజల్ అనీ తెలిసింది.'

మళ్ళీ నవ్వడం మొదలుపెట్టింది చాంద్. (నవ్వుతుంటే చాంద్ అందం రెట్టింపవుతుందని ఖాన్ సాహెబ్ అంటుండేవారు. అందుకనే డ్రామాలలో ఆమెను మాటి మాటికీ నవ్వించేవారు. ఆమె నవ్వినప్పుడల్లా, యువకులు గట్టిగా చప్పట్లు కొడుతూ 'వన్స్‌మోర్', 'వన్స్‌మోర్' అని అరిచేవారు.

'మీరు మళ్ళీ ఎప్పుడైనా రండి!' గేటుదాకా వచ్చి చాంద్ ఎంతో ప్రేమగా అంది.

'త్వరలో- నేను అరెస్టు అవబోతున్నానని వినికిడి. అలా జరగకపోతే ఆ భగవంతుడి శిల్పకళా నైపుణ్యాన్ని తిలకించడానికి మరొకసారి వస్తాను.

చాంద్ అతడిని మరువలేక పోయింది. అతడెవరో తెలియదు చంచలంగా, ఆకర్షణీయంగా, సాక్షాత్తు శ్రీకృష్ణుడిలాగ వున్నాడు. అతడి పేరైనా అడుగలేదు అనుకుంది.

హైదర్ ఆలీఖాన్ మీద కేసు తీసేయడంతో అతను ఇంటికి వచ్చేశాడని తెలిసింది. చాంద్, ఆయన్ని కలుసుకోవడానికి 'అంజుమన్' కార్యాలయానికి వెళ్ళింది. తండ్రిని కలుసుకుని చాంద్ ఎంతగానో ఏడ్చింది. మెల్లిగా ఆ ఉత్తరం విషయం, తరువాత యువకుని ప్రసక్తి వచ్చింది. సంజీవ గురించా! హైదర్ ఆలీ ఖాన్ అడిగాడు. 'ఈ మధ్య పోలీసులతని కోసం గాలిస్తున్నారు. అతడెక్కడితో వెళ్ళిపోయాడు.'

'ఇదేమిటి చిన్న పిల్లల్లాగ ఏడుస్తున్నావు?' హైదర్ ఆలీఖాన్ ఆమె తలమీద చెయ్యిపెట్టి 'నీకేది మంచిదనిపిస్తే అదే చెయ్యి, ఇతరులు పన్నిన వలలో చిక్కుకోవద్దు, వెళ్ళు, ఇంటికెళ్ళు! ఇక మీదట నన్ను కలుసుకోవడానికి ఇక్కడికి రావద్దు.'

తండ్రి ఆమెను దిగబెట్టడానికి క్రిందకొచ్చాడు.

'అయితే అప్పుడప్పుడు మీ కోసం సంజీవాని పంపిస్తూండండి,' తన నిస్సహాయతని వ్యక్తం చేస్తూ అంది చాంద్.

చాలాకాలం తరువాత ఒకసారి చాంద్, రాషిద్ మామూతో కలసి ఏదో మీటింగు నుంచి తిరిగొస్తుండగా సంజీవా కనబడ్డాడు. వరండాలో అతనెవరితోనో వాదించడంలో మునిగి ఉన్నాడు. అతను చాంద్ ఒక్కసారి చూసి, తిరిగి తన మాటలలో మునిగిపోయాడు. ఆమె ముందుకి సాగేసరికి వెనుక ఏదో ఉండిపోయినట్టనిపించింది. ఎందుకో తమని అవమానించినట్లనిపించింది. ఇంతవరకూ ఎవరూ తనని చూసి, చూడనట్లు ఊరుకోవడమన్నది జరగలేదు.

రెండు రోజుల తరువాత తండ్రిని కలుసుకోవడానికి అంజుమన్ ఆఫీసుకెళ్ళింది. తండ్రి లేరు, ఎవ్వరూ లేరక్కడ. ఆమె తిరుగుముఖం పట్టింది. గేటు దగ్గర సంజీవా కనబడ్డాడు.

'మీ నాన్నగారికి ఒంట్లో బాగాలేదు. అందువల్ల ఆయన ఇక్కడికి రావడంలేదు.'

'కాని మీరెందుకు రాలేదు? నాకు మాటిచ్చారు కదా!'

చాంద్ మొదటిసారి ఒక పురుషుడితో ఇంత మృదువుగా మాట్లాడింది.

ఆమె సంజీవాని జాగ్రత్తగా పరిశీలించింది. పొడవైన అతని వెంట్రుకలు చిక్కుపడి తల మీద ఒక గంప పెట్టినట్లు ఉంది. అతడి కను ముక్కుతీరు ఎంతో చురుకుదనాన్ని స్ఫురింపచేస్తూంది. అతని, అర్ధనిమీలిత నేత్రాలలో ఏదో విచిత్రమైన ఆకర్షణ ఉంది. అతను అతి సామాన్యమైన పాంటు-షర్ట్ వేసుకున్నాడు. తండ్రి, సంజీవ శ్రీమంతుడైన రెడ్డి కొడుకనీ గొప్పశిల్పి అనీ చెప్పాడు.

'మాటైతే ఇచ్చాను, సిగరెట్టు వెలిగిస్తూ, అన్నాడతను, కాని భూమ్మీది పనులు చెయ్యడానికి తీరిక దొరకడం లేదు. ఆకాశంలో మెరిసే చాంద్‌నెలా చూడ్డం?'

చాంద్‌కి నవ్వొచ్చింది. ఎంతో వయ్యారంగా, 'మీరు వస్తే నేను భూమిపైనే ఉంటాను. కళల గురించి మీతో కొంత చర్చించాలి.'

'అరె, ఒద్దు బాబూ!' సంజీవా ఏం పట్టనట్టు సిగరెట్ పొగపీల్చాడు.

'మీవంటి సున్నిత భావాలు కల కళాకారులతో నేను చర్చలు జరుపను. నేనతి మొరటు మనిషిని, రాళ్ళు పగులగొట్టేవాడ్ని.'

చాంద్‌కి అతడి మాటలెంతగానో నచ్చాయి. మర్నాడు తమ ఆర్ట్ సొసైటీ ఆఫీస్‌కి, సంజీవాని రహస్యంగా పిలిపించింది. కొత్త నాటకం విషయంలో అతనిని సంప్రదించాలనుకుందామె.

అదే రోజు ఖాన్ సాహబ్, చాంద్ సలహానను సరించి సంజీవాని తమ సొసైటీలో సభ్యుడుగా చేర్చుకున్నాడు. ఒక కమ్యూనిస్టు యువకుని సభ్యునిగా చేర్చుకుంటే సొసైటీలోని యువకులు కొంత శ్రద్ధ కనబరుస్తారనీ, ఐరోపాకు వెళ్లొచ్చిన సంజీవా మూలంగా నాటకాలలో కొత్త కొత్త భావాలు ప్రదర్శించవచ్చు అని ఆశపడ్డారు ఖాన్ సాహెబ్. అతి సామాన్యుడు, నల్లనివాడు అయిన ఆ యువకుడు చాంద్‌ని ఆకర్షిస్తున్నాడని గానీ, అందుమూలంగా తనని మాటిమాటికీ విదిలించి కొడుతుందనికాని అతనికి అనిపించనేలేదు.

చాంద్, సంబంధం తిరగ్గొట్టగానే రాజకుంటుంబం వారిలో క్రోధం పెల్లుబికింది. దాని ప్రభావం వాహిద్ హుసైన్ మీద కనబడలేదు కాని, ఆ క్రోధాగ్నికి హైదర్ ఆలీఖాన్ గురి కావలసి వచ్చింది. అతన్ని బంధించవలసిందని వారంటు జారీ అయింది. అతడు తన బృందంతో అండర్ గ్రౌండ్‌లో కెళ్ళిపోయాడు. చాంద్, అచ్చం మీరాలాగ తెల్లని దుస్తులు ధరించి, జుట్టు విరబోసుకుని, తంబూరా పుచ్చుకుని, 'కౌన్, గలీ గయొశ్యామ్ బతాదేకో ఈ...! అంటూ ఆలాపించసాగింది. అనుక్షణం చాంద్ వేస్తూన్న ఈ వేషాన్ని చూసి, పరిస్థితి చెయ్యిజారి పోయిందనుకునేవారు వాహిద్ హుసైన్. మొదటే తను వేళ్ళతో సహా పీకి పారవెయ్యవలసింది. అసలు చాంద్ ఆ విధంగా పాడయిపోవడంలో ఆమె తప్పు మాత్రమేముంది? సరియైన సమయంలో ఆమె వివాహం జరిగిపోయి ఉంటే పరిస్థితి నేడిలా ఉండేదా? కాని చాంద్ ద్వారా ఎన్నో పనులు సాధించవలసి ఉన్నప్పుడు, రాషిద్ ఆమె వివాహం ఎలా చెయ్యగలడు?

నేడు ఐవానే గజల్‌లో ముషాయరా జరుగబోతోంది. ప్రభుత్వం తరఫున ఆహ్వానితులైన, 'ఫానీ' బదాయూనీ వచ్చి ఉన్నారు. అతన్ని దక్కనులో

స్థిర పడనివ్వరనే విషయం వాహిద్ హుసైన్‌కి తెలుసు. కనుక ఈ అవకాశాన్ని వినియోగించుకుని, ఆయన ఒక ముషాయరా ఏర్పాటు చేశారు. హసరత్ 'మోహానీ', 'ఫానీ' బదాయూనీ, ఉస్తాద్ 'జలీల్' మానిక్‌పుర్, ఆలీ 'అఖ్తర్' హైరత్ 'బదాయూనీ మొదలైనవారు హాజరు కానున్నారు.

కాని ఈ రోజెంత తల పగులకొట్టుకున్నా ఒక పంక్తి అయినా కుదరడం లేదు. ముషాయరాలో కొత్త గజల్ వినిపించడం ఆయన పద్ధతి.

పుస్తకం ఒక ప్రక్కకి జరిపి కూర్చున్నారాయన. కళ్ళద్దాలు తీసి చొక్కా కొసలతో తుడిచి, తిరిగి ధరించి, ఇప్పుడిక ప్రపంచం కొత్త రంగులలో కనబడగలదని చుట్టూ చూశారాయన. మొదట రజియాపై ఆయన దృష్టిపడింది. రజియా ఒక కుర్చీలో కూర్చుని దీర్ఘాలోచనలో మునిగి ఉంది. ఆమె తన అత్తగారితో ఈ విధంగా అంది, 'బీబీ, పాపం కైసర్‌ని బాబాయి గారికిచ్చి వివాహం జరిపించెయ్యండి. ఉజాలా బీబీ ఇంతమందిని పోగేసినప్పుడు, ఈ పిల్లకీ తిండీ, బట్టా కొరత తీరిపోతుంది.

'ఆ... ఆ... ప్రయత్నించి చూడండి బేగమ్!' వాహిద్ హుసైన్ చర్చలో పాల్గొన్నారు.

'అయ్యో! మీ మెదడుకేమైంది! జ్ఞాపకముందా అసలు!' బీబీ ఏదో అనబోతూండగా అలవాటు ప్రకారం గౌహర్ అత్త మధ్యలో కల్పించుకుంది. 'ఒక సంవత్సరం ముందు చిన్నన్నయ్య స్వయంగా ఈ విషయాన్ని ప్రస్తావించాడు. నిరుడు ఫౌజియా పుట్టిన రోజు సందర్భంలో కైసర్‌ని చూసి...!'

'అచ్ఛా. అయితే...' రజియా చిన్న పిల్లలాగ నవ్వుతూ ప్రశ్నించింది.

'ఏమౌతుంది?' బీబీ కుంటత్త మాటకి అడ్డొస్తూ అంది, 'అహమ్మద్ మియా ఫాతిమా బేగమ్‌తో నీ మనుమరాలు యుక్త వయస్కురాలైంది. మా ముందుకు తీసుకు రావద్దు, లేదా ఒకనాడు పట్టుకుపోయి పెళ్ళిచెయ్యగలం అని తమాషాకన్నారు. ఇది విన్న ఫాతిమా బేగమ్ మౌనం వహించింది. కాని కైసర్ పిచ్చి కోపంతో, ముందుకొచ్చి? 'చెయ్యివేసి చూడండి నామీద! చెయ్యి విరగొట్టేస్తాను. నా తండ్రిని బెదిరించి భయపెట్టి, మీ బానిసని చేసుకునుంటారు. నన్నెవ్వరూ మోసగించలేరు,' అంది. ఆ మాటలు విని అంతా దిగ్భ్రాంతులయారు.

'చిన్నన్నయ్య, వదిన మాటని గౌరవించాడు కనుక సరిపోయింది,' గౌహర్ అత్త అంది.

'లేకపోతే, ఈ అన్నదమ్ముల కోపం నీకు తెలిసిందే కదా! ఫాతిమా బేగమ్ ఎదురుగానే దాన్ని తీసుకుపోయుంటే, ఎవరేం చెయ్యగలిగేవారు?'

'కైసర్ విద్రోహపు చర్యలకు సంబంధించిన గాధలు వాహిద్ హుసైన్ మొదటిసారిగా విన్నారు. ఒక్కసారి కైసర్ ఎక్కడైనా కనబడితే, ఆమె పొగరుమోత్తనానికి తగిన శిక్ష విధించాలని అనిపించింది ఆయనకి.'

'ఈ విషయం ఉజాలా వదిన చెవులకింకా సోకలేదు, లేకపోతే నిజంగానే ఆ పిల్ల గౌరవం మంటకలిపించి ఉండేది.'

'ఎలాంటి పనికిమాలిన వాళ్లు తల్లీ కూతుళ్ళు!' రజియాకి విపరీతంగా కోపం వచ్చింది. ఈ చిన్న జాతి స్త్రీల తలబిరుసుతనం, ఆమె ఇంత వరకు ఎప్పుడూ చూడలేదు.

'ఇవన్నీ ప్రళయాన్ని సూచించే లక్షణాలు. నక్కకీ, నాగలోకానికీ ఉన్నంత తేడా ఉంది!' గౌహర్ అత్త నిట్టూరుస్తూ అంది, 'చాంద్‌ని చూసి, దాన్ని కూడా కాలేజీలో చేర్పించి చదివిస్తున్నారు. ఇటువంటి పిల్లలకెక్కడైనా కాలేజీల్లో సీట్లు దొరుకుతాయా అసలు? నవాబ్ వాహిద్ హుసైన్ ఖాన్ మామయ్యని, షరాఫత్ జింగ్ మా తాతగారని చెప్పి ఉంటారు.'

'హొ, హొ, హొ...!' కుంటత్త మాటలకి నవ్వేసింది రజియా, 'ఈ దరిద్రగొట్టు మొహాల పేరెత్తద్దు నాదగ్గర,' అంటూ అక్కడి నుంచి లేస్తూ అంది.

'అవును బాబూ, మనింట్లో ఈ చరిత్ర హీనురాళ్ళ గురించి చర్చలెందుకు?' అకస్మాత్తుగా ఎంతో బాధగా అన్నారు వాహిద్ హుసైన్, అసలే పరిస్థితులు బాగాలేదు. ఏం జరుగుతుందో మీకేం తెలుసు?'

'ఏం ఏం జరిగింది...?' బీబీ చేతులోని అడకత్తెర జారిపడింది.

'ఏం జరుగుతుంది...!' వాహిద్ హుసైన్ ఇటూ - అటూ చూసి నెమ్మదిగా అన్నారు, 'ఫలగండా, కమ్యూనిస్టుల కైవశమైందని, ఇందులో మీ అల్లుడిది ముఖ్యమైన పాత్ర అనీ, వినికిడి.'

'అయ్యో!' బీబీ బాధపడసాగింది. రజియా, కుంటత్త కూడా మౌనం

వహించారు.

'ఇటు హిందువులు, బ్రిటిష్‌వారిని భారతదేశం నుంచి గెంటి వేయడానికి కంకణం కట్టుకున్నారు. ఎన్నో వంతెనలు కూలటమయింది. రైళ్ళకి నిప్పంటిస్తున్నారు. నాకు, ఇవన్నీ మంచి లక్షణాలుగా తోచడం లేదు.

'అవును, క్రిప్స్ ప్రణాళికని నెహ్రూ, జిన్నా త్రోసిపుచ్చారటగా!' లోపలెక్కడో గదిలో కూర్చున్న రాషిద్ తండ్రితో మాట్లాడడం కోసం బయటికొచ్చి కూర్చున్నాడు. 'కాని ఇంగ్లీషువారు వెళ్ళిపోతే ఈ కాంగ్రెసే, ముస్లిమ్‌లీగ్ ప్రజల్ని బ్రతకనివ్వరు చూస్తూండండి, నెహ్రూ రష్యాననుకరిస్తూ, ఇక్కడ కమ్యూనిస్టు రాజ్యం ఏర్పరుస్తాడు.'

'ఊరుకోవయ్యా! కాంగ్రెస్, ముస్లిమ్‌లీగ్‌ల వారెవరూ జాగీర్లు రద్దు చెయ్యమని ఎప్పుడూ చెప్పలేదు. ఈ కమ్యూనిస్టులే మన శత్రువులు.' ఇది విన్న రాషిద్ తలగోక్కోసాగాడు.

'నేను మన సైన్యానికి కమాండర్-ఇన్-చీఫ్ అవ్వాల్సింది, ఒక్క రోజులో ఈ గుండాల తలలు నేలపెట్టి కాలరాసేవాణ్ణి? కోపంతో పిడికిలి బిగించారు వాహిద్ హుసైన్.' యువకులకసలు బుర్రలేదు. ఇంగ్లీషు రెజిమెంట్‌ని మేమెప్పుడూ గుప్పిట్లో పెట్టుకున్నాము. ఎవరికీ నోరెత్తే దమ్ము లేకపోయింది. వాహిద్ హుసైన్ చెప్పుకుంటూ పోతున్నారు. రాషిద్ తలవంచుకుని అలాగే వింటున్నాడు.

కొంతసేపు శూన్యంలో దృష్టినిల్పి, రాషిద్ చెప్పసాగాడు, ఉక్కునెదిరించే శక్తి లేదు మనిషికన్నాడొకనాడు సంజీవా. మీరే కమాండర్-ఇన్-చీఫ్ సంగతి చెబుతున్నారో నాకు తెలియదు కాని గ్రామాల్లో గుట్టలు, మనల్ని తమ ఒడిలో దాచుకుంటున్నాయి. పర్వతాలు తుపాకుల ముందు భాగంగా మారి విసిరివేస్తున్నాయి. శతాబ్దాలుగా విశ్రాంతి తీసుకుంటున్న చేతులు, శతాబ్దాలుగా పని చేస్తూన్న ఈ శక్తినెదుర్కోలేనంటున్నాడు సంజీవా.'

'ఓహో! సంజీవా ప్రతి మాటా వింటున్న మిమ్మల్ని చూస్తూంటే ఓ ఎర్రజెండా చేత్తో పట్టుకుని 'దళంలో చేరేటట్టున్నారు' వాహిద్ హుసైన్ మాటలకి రజియాకి నవ్వొచ్చింది.

'కాని ఇది అబద్ధం కాదు కదా అబ్బాజాన్!' రాషీద్ బాధగా అన్నాడు.

'బెస్తవాడు తుపాకీ పేల్చడం ఎప్పుడైనా విన్నామా? కాని ఈనాడొక జిల్లా మొత్తం మీద అధికారం చలాయిస్తున్నాడు' ఈ మాటలంటుంటే అతని ముఖంలో నిస్సహాయతతో కూడిన విషాదం గోచరించింది.

'ఏదో ప్రాజెక్ట్ సందర్భంగా మేము గ్రామాలకి వెళుతుంటాము. అక్కడ కొండరాళ్ళను పగులకొట్టే స్త్రీలు కూడా నిస్సంకోచంగా జవాబులిస్తున్నారు.'

ఈ ఇంజనీర్లు, ప్రయాణాలకెళ్ళినప్పుడు ప్రతి రాత్రి ఒక రాళ్ళు కొట్టే స్త్రీని వీరి కొరకు తీసుకొస్తారని ఆమె విని వుండడం వల్ల అతని మాటలకామె నవ్వుకుంది.

కుంటత్త రాత్రి వంటకి కావలసిన వస్తువులు కొలిపిస్తూంది. ఈ మాటలు వింటూనే 'రాషిద్‌మియా ఏమంటున్నాడు? రాళ్ళు కొట్టే స్త్రీలేం చేస్తున్నారట?'

'పరిపాలిస్తున్నారత్తా! కలం చేత్తో పట్టుకుని పుస్తకాలు వ్రాస్తున్నారు.'

'ఛ, ఊరుకో!' కుంటత్తకి నవ్వడం చేతయి వుంటే ఇటువంటప్పుడు తప్పక నవ్వి ఉండేది. 'రాళ్ళు కొట్టడం కాదు, వెధవ మొహం వేసుకుని, బేగమ్‌లై కూర్చున్నారు.'

'అవునత్తా బేగమ్‌లై గ్రామాన్నంతనీ పాలిస్తున్నారు.'

'అలాగా! అయితే అక్కడ రాళ్ళెవరు పగులగొడుతున్నారు?'

'మన అదృష్టాలు ధ్వంసం అవుతున్నాయి గౌహర్ బేగమ్!' వాహిద్ హుసైన్‌కి ఏడుపొస్తూంది. సాయంత్రం ముషైరా ఉంది. ఒక్క పంక్తి కూడా వ్రాయలేకపోయారు. ఇది ఇలా ఉండగా ఐవానే గజల్‌ని శుభ్రపర్చడం, కూర్చోడానికి కావలసిన ఏర్పాట్లు, చెయ్యడం, తినడానికి టీ, మొదలైన ఏర్పాట్లన్నీ జరగాలి.

ఇంతలో ఉత్తరమొచ్చింది. కవరు అటూ ఇటూ తిప్పి చూసి, రజియా! ఇదుగో నీకుత్తర మొచ్చిందంటూ ఇచ్చాడు రాషిద్.

'అంతా బాగున్నట్టేనా? మీ నాన్నగారెలా ఉన్నారు?' రజియా తండ్రి ఎప్పుడు మరణిస్తాడా, ఒక్కగానొక్క అల్లుడైన రాషిద్‌కి ఆయన ఆస్థంతా ఎప్పుడొస్తుందా అని ఎదురుచూస్తూండేది కుంటత్త.

'హామిద్‌భాయీ ఉత్తరం' రజియా ఎందుకనో తనలో తాను

నవ్వుకుంటూంది.

'మీ నాన్నగారికెలాగుంది?'

'మీ హామిద్‌భాయీ ఉన్నారు చూశారా! ఆయనకి పెళ్ళట' కుంటత్తకి జవాబు చెప్పకుండా రాషిద్‌తో అందామె. అతనికి నవ్వొచ్చింది.

'నిజంగా?' కునికిపాట్లు పడుతూన్న వాహిద్ హుసైన్, కిళ్ళీ నోట్లో పెట్టుకోబోతూన్న బీబీ ఒక్కసారే అడిగారు.

'ఎక్కడో మాటలు జరుగుతున్నాయట. ఆడపెళ్ళివారు మూడువేల కట్నం అదీ ఇస్తామంటున్నారట.'

కానీ మనం వెళ్ళి, నిజంగా అంత ఇవ్వగల స్తోమతు వాళ్ళకుందో లేదో తెలుసుకోవాలట.

'అంతేగామరి,' కుంటత్త బీబీకేసి చూసింది.

'ఏమో ఎవరేనా ఫకీరో, బంట్రోతో అయి ఉంటే పాపం హామిద్‌మియాకి మోసం జరుగుతుంది!'

'అబ్బ ఊరుకోండింక!' వాహిద్ హుసైన్ విసుక్కున్నారు. మొత్తంమీద హామిద్‌మియా పెళ్ళి ఖర్చు పెళ్ళాం ఖర్చు భరించడానికి సిద్ధపడ్డాడన్నమాట.

నిజానికి హామిద్ మియా ఎవరికీ సంబంధించినవాడు కాడు. పిసినిగొట్టుతనానికి పెట్టింది పేరు. ఎవరూ అతణ్ణి చేరదియ్యడానికి కిష్టపడలేదు. మెట్రిక్ వరకూ రజియా తండ్రి చదువుచెప్పించాడు. తరువాత ఎలాగో జీతం కట్టక్కరలేకుండా చేసుకుని పట్టభద్రుడయ్యాడు. గుమాస్తాగా ఉద్యోగం వేయించడంలో వాహిద్ హుసైన్ ప్రయత్నాలు ఫలించాయి. అది కూడా ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం కావడంతో డబ్బుకూడ పెట్టడం తప్ప ఇంకేం చెయ్యలేడతడు. అనాథగా పడ్డపాట్లు, నిత్యం దారిద్ర్యపు తాకిడుల వలన, ప్రపంచంలో డబ్బే అన్నిటికంటే ముఖ్యమైనదిగా తయారయ్యిందతని దృష్టిలో. ఒకప్పుడు తినడానికేమీ లేనందుకు అతడు పస్తులున్నాడు, నేడు డబ్బు ఖర్చు చెయ్యకూడదన్న భావనతో పస్తులుంటున్నాడు. అందరూ అతణ్ణి వేళాకోళం చేసేవారు. అతడు మాత్రం నవ్వి ఊరుకునేవాడు. బంధువులలో అతని పిసినారితనానికి సంబంధించిన హాస్యాలు పిల్లలందరికీ కంఠోపాఠం. ఆటపట్టించేవారిని, నవ్వుతూ చూస్తూన్న అతడ్ని చూస్తే, అలాగే

నవ్వుకోండి ఒకనాడు నేను కారులో కూర్చుని వచ్చినప్పుడు మీ నవ్వులు మాయమయిపోతాయి, అని ఆలోచిస్తున్నాడేమో అనిపించింది. ఇదేమో పెళ్ళి విషయమాయె. అదీ కాకుండా, వియ్యాలవారికి ఫోజులు కొట్టడానికి, విందులారగించడానికి చక్కటి అవకాశం లభిస్తుంది. ఒక పక్క ఆడపెళ్ళివారు అడుగులకి మడుగులొత్తుతారు, వేరొకపక్క హామిద్‌మియాకి, చూశావా నీ బాధ్యతలన్నీ నెరవేర్చామని చెప్పొచ్చు.

ఇంట్లో ఒక్కసారిగా సందడి ప్రారంభమైంది.

ఒకనాడు బీబీ ఇనప్పెట్టెలోంచి నగలపెట్టె తీసింది. వియ్యపురాలి హోదాలో వెళ్ళేటప్పుడు ఆభరణాలు పెట్టుకోవడం ఆచారం. చాంద్‌కూడా ఈ పెళ్ళి విషయంలో శ్రద్ధ కనబర్చింది. పిసినారి హామిద్‌భాయీని ఆటపట్టించి ఆనందించేదామె. అదీ కాకుండా వియ్యాలవారింటికెళ్ళేటప్పుడు చాంద్‌ని తప్పనిసరిగా తీసుకెళ్ళమని, అందువల్ల కాబోయే అత్తవారికి అల్లుడి గొప్పతనం గురించి తెలుస్తుందని ఉత్తరంలో ప్రత్యేకించి వ్రాసి వుంది. చాంద్ వెంటనే దర్జీని పిలిపించి బ్లవుజ్‌కి సంబంధించిన కొత్త డిజైన్‌ను బోధపర్చింది. రజియా, రాషీద్‌లతో కలసి కంచి పట్టుచీర కొనడం కోసం బజారుకెళ్ళింది.

వారం రోజుల తరువాత పెళ్ళి కూతురి తమ్ముడు వారిని తీసుకువెళ్ళడానికి వచ్చేసరికి అంతా సిద్ధంగా ఉన్నారు. కుంటత్త కూడా తన సారె సామానుతో పాటున్న బట్టలలోంచి గులాబీ రంగు బనారసు చీర తీసి కట్టుకుంది. కుంటత్త, అవివాహితురాలు కాబట్టి పెళ్ళికాని పిల్లలు ధరించే దుస్తులే ధరించేది. కాని నలభైవపడిలో పడబట్టి అప్పుడప్పుడు చీర కట్టుకునేది. చీర కట్టుకున్నప్పుడామె, బీబీ అన్నట్టు అందంగా ఉండేది, రజియా ఇనప్పెట్టెలో ఉన్న తన నగలలోంచి కొన్ని తీసి పెట్టుకుందామె. కొద్దిగా నెరిసిన జుట్టుపై పైటకొంగు కప్పుకుంది. బీబీ ముదురాకుపచ్చ కతాన్ చీర కట్టుకుంది. కుందనపు బొమ్మలాగ మెరిసిపోతూందామె. బీబీ తన అందాన్ని ఎలాగ కాపాడుకుందో తెలియదు కాని, ఆ మెరుపు తగ్గనేలేదు. తన అందాన్ని కొంత బతూల్, బషీర్‌లకు పంచిపెట్టింది. మిగిలిన దాంట్లో తన వంతు సొంతం చేసుకుంది చాంద్. నేటికీ ఆమె చిరునవ్వు వాహిద్ హుసైన్ ఎన్నో గజళ్ళు వ్రాసేట్లు చేయగలదు.

కుంటత్త బీబీని, అవసరమైన నగలతో అలంకరించింది. ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు వదినలను, ఆడపడుచుల నలంకరించడం పరిపాటి. కుంటత్త, ఈ బాధ్యతను ఎప్పుడూ ఎంతో ఆనందంగా నిర్వర్తించింది. మెడలో చంద్రహారం మొదలైన ఆభరణాలు, పది వేళ్ళకి ఉంగరాలు, చేతులకు గాజులు, కంకణాలు అన్నీ అలంకరించింది. అయినా నగల పెట్టె నిండుగా అలాగే ఉంది. రజియాని ఇంకొన్ని నగలు పెట్టుకోమని చెప్పసాగింది కుంటత్త. ఊదారంగు కతాన్ చీర కట్టుకుని కొద్దిపాటి నగలు మాత్రమే పెట్టుకున్న రజియా ఎంతో ఆకర్షణీయంగా కనబడుతూంది. నప్పని నగలు పెట్టుకోవద్దని చాంద్ సలహా ఇచ్చింది. కనుక కుంటత్త ఎంత చెప్పినా రజియా ఇంకే నగలూ పెట్టుకోలేదు.

'బీబీ! మీరీ నగల పెట్టె మనతోపాటు తీసుకురండి! అందరికీ చూపిద్దాం' గజల్ మాటలకి బీబీకి నవ్వొచ్చింది. కుంటత్త కోపంగా అంది, 'ఎంతటి అమాయకురాలమ్మా ఈ పిల్ల! అందరికీ చూపించడానికా మనం నగలు పెట్టుకుంటున్నది?'

ఎంత పట్టు పట్టినా చాంద్ మాత్రం నగలని తాకనైనాలేదు. నేడామె బేగమ్ సారా (మధుబాలా)లాగ లోనెక్ ఉన్న బంగారు రంగు చేతుల్లేని రవిక వేసుకుంది. రవిక పొట్టిగా ఉందంటే, ముదురు నీలం రంగు జార్జెట్ చీరలోంచి ఆమె పచ్చటి నడుము మెరిసిపోతూంది. ఏదైనా పని మీద ఆమె కొంచెం వంగితే, ఎక్కడ ఆమె సోయగంపై తన దృష్టిపడుతుందో అని అటూ - ఇటూ చూస్తూంది గజల్. నేడు రెండు గంటలసేపు హైర్‌డ్రెసర్ దగ్గరకెళ్ళొచ్చింది చాంద్. ఆమె జుట్టు ముందు భాగంలో కిరీటంలాగ పైకొచ్చి అక్కడి నుంచి అలలలాగ ఉంగరాలుగా క్రిందికి వ్రేలాడుతూంది. మెరిసిపోతూన్న ఆమె బుగ్గలను తాకడం కోసం అల్లరి చేస్తున్నట్టున్నాయి ఆమె ముంగురులు. తెల్లని చేతికి నల్లటి స్ట్రాప్ ఉన్న చిన్న చేతి గడియారం పెట్టుకుని నల్లటి ముఖమల్ చెప్పులు వేసుకుంది. ఈ సాధారణ అలంకరణలో చాంద్ మెరిసిపోతూంది. ఆమెని చూసి రజియా ఆనందపడిపోయింది.

'అల్లా! ఇవాళ చాంద్ మెరిసిపోతోంది.' ఆమె చాంద్‌ని అల్లుకుపోయింది. చాంద్ అతి కష్టంమీద తన మెడ-బుగ్గలని, రజియా

లిప్‌స్టిక్ రంజిత పెదవులనుంచి కాపాడుకుంది. చాంద్ బయటికొచ్చేసరికి, కుంటత్త గుచ్చి-గుచ్చి చూసింది, ముగ్ధురాలైంది. 'అమ్మో! ఇదెక్కడి ఫాషన్ బాబూ, జుట్టంతా ముఖంమీద పడుతూంది. బోసి చేతులతో బయలుదేరింది.' ఇవాళ కుంటత్తకి కూడా చాంద్ చాలా నచ్చింది. కాని ప్రతి విషయంలో కల్పించుకోవడం ఆమె అలవాటు.

ఫౌజియాని ఆయా తయారుచేసి చాలా సేపయ్యింది. ఎర్ర ముఖమల్ గౌను వేసుకుని, ఎర్రటి రిబ్బన్ పెట్టుకుని, ఎర్రటి జోళ్ళు వేసుకుని గర్వంగా తిరుగుతూంది. నేడు స్త్రీలు వెళ్ళవలసిన రోజు కాబట్టి, తాను పురుషుడు కావడం వలన షాహీన్ వెళ్ళడానికి ఇష్టపడలేదు. బీబీ, రజియానడిగే ఒక ఫ్రాక్ తీసుకుని గజల్‌కి తొడిగింది. గజల్ మాటిమాటికీ ఫౌజియా గౌనుకేసి ఈర్ష్యగా చూస్తూ, తను వేసుకున్న పాత గౌనుకేసి చూసుకుంటుంది. ఫౌజియా గజల్‌ని జాగ్రత్తగా కనిపెడుతూంది. గజల్ తన అలవాటు ప్రకారం గౌను కొనని పళ్ళతూ చింపుతూ, పెళ్ళికూతురి తమ్ముణ్ణి కొట్టి పారి పోతూంటే, నా గౌను జాగ్రత్త చిరిగిపోతుంది అంటూంది ఫౌజియా. కాని పెళ్ళి కూతురి తమ్ముణ్ణి ఏడిపించడంలో మునిగిపోయింది గజల్. ఆ పిల్లవాడు, సన్నగా ఉండి, ముద్దులాగ కనబడుతున్నాడు. పది పదకొండేళ్ళ వయస్సుంటుంది. అతడు హాలులో ఒక కుర్చీమీద కూర్చుని గజల్ కొట్టే దెబ్బలూ, గుద్దులు సహిస్తున్నాడు. ఈ పిల్ల తన అక్కకి కాబోయే ఆడబిడ్డ కదా అని, మాటిమాటికీ టోపీ తీసుకుని పారిపోతున్నా ఏమీ అనకుండా ఊరుకున్నాడు.

బీబీ పెళ్ళికూతురి తమ్ముడికి, టీతోపాటు గులాబ్‌జామ్, పేస్ట్రీ, బిస్కెట్లు పెట్టింది. 'మీరింతెందుకు ఖర్చుపెట్టారని అడిగాడతను. అతడి మాటలకి నవ్వొచ్చింది రజియాకి. ఆమె మెల్లిగా బీబీతో అంది, 'బీబీ హామీద్ భాయికి మంచి జోడీ, బావమరిది ఇలాగ ప్రతి వస్తువు, ధరల గురించి గమనిస్తూంటే, ఇక భార్య కూడా ఇలాగే ఉంటుంది.'

ఇది విన్న బీబీ మెల్లిగా అతడి వద్దకొచ్చి కూర్చుంది. అతడి మొహంలో బాధ మిళితమైన మంచితనం తొంగిచూస్తూంది. అతణ్ణి చూస్తూంటే ఎప్పుడూ మనసారా నవ్వినట్టు, కడుపారా భుజించినట్టు కనబడడం లేదు, అయినప్పటికి ఎంతో తెలివి, మర్యాద కలవాడు. అతి సామాన్యమైన,

ఇస్త్రీ చెయ్యని షేర్వానీ వేసుకున్నాడు. కొంచెం మాసినట్టున్న, ఇంట్లో ఉతికిన పైజమా వేసుకున్నాడు. కాన్వాస్ జోళ్ళు, తలపైనున్న తుర్కీటోపీకి కుచ్చులేదు. వస్తూనే అందరికీ వంగి-వంగి సలాము చేశాడు. బిస్మిల్లాబీకి కూడా సలాము చేసి షాహీన్‌కి సలాము చెయ్యడానికి వంగేసరికి గజల్‌తోపాటు చాంద్‌కి కూడా నవ్వొచ్చింది.

వస్తూనే అరమరికలు లేకుండా అందర్నీ వరుసలు పెట్టి పిలిచేశాడు. అందరూ వెళ్ళే హడావుడిలో ఉండడం గమనించి గజల్ కుర్చీల మీదనుంచి దూకుతూ ఆ పిల్లవాడికి తన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించసాగింది. ఈ ఆటంటే విసుగు పుట్టించడంతో వేళాకోళం చేస్తూన్నట్టతన్ని కొట్టడం మొదలుపెట్టింది. అతడి టోపీ లాక్కుని పారిపోయింది. ఆ పిల్లవాడు ఎంతో నెమ్మదిగా బోధపరుస్తున్నట్టన్నాడు, 'ఇదుగో' నా టోపీ తీసుకుని పరిగెట్టద్దు... చూడండి మీ అమ్మగారు వస్తున్నారు.'

'మా అమ్మగారు చచ్చిపోయారు,' లెక్కలేకుండా జవాబు చెప్పి యధాప్రకారం అతని వీపుసాపు చేస్తూనే ఉంది.

'మీరే స్కూలుకి వెళతారు...?'

'నా ఫ్రాక్ వేసుకుని...'ఫౌజియా పెళ్ళి కూతురి తమ్ముడికి విషయం తెలియపర్చింది.

'అయ్యో తప్పు, అలాగ అనకూడదు' ఆ అబ్బాయి ఫౌజియాకి బోధపర్చాడు.

'ఎందుకనకూడదు?' ఫౌజియా అతన్నడిగింది.

'కొంచెంసేపు ఎవరి దుస్తులైనా తీసుకుంటే ఏం...?' అతడు నచ్చచెప్పాడు. అంతలో గజల్ అతని షేర్వానీ మీద ఒక్కటిచ్చి, నవ్వుతూ పారిపోయింది. వెనుక వైపుకి పరుగెడుతూ మెట్ల మీదనుంచి దొర్లుతూ వెళ్ళి ప్రాంగణంలో పడింది. వెంబడే అతను పరుగెత్తుకు వెళ్ళి ఏడుస్తూన్న గజల్‌ని త్వరగా లేవదీసి గుండెలకి హత్తుకున్నాడు.

'వద్దమ్మా... మా బంగారు తల్లీ... ఏడవ్వద్దు... నీ కళ్ళెంత బాగున్నాయి. ఏడిస్తే పాడయిపోతాయి.

గజల్‌ని ఊరుకోబెట్టి' అతడు బీబీ వద్దకు వెళ్ళాడు.

'ఇంక త్వరగా బయలుదేరండి. మా అక్క మధ్యాహ్నం భోజనం

సిద్ధం చేసేసుంటుంది!'

'లేదు బాబూ, మేమక్కడ భోజనం చెయ్యం!' రజియా అంది.

'మీరు తిని తీరాలి, మాకైదు రూపాయలు ఖర్చయిపోయాయిగా!'

'సరే సాయంత్రం తింటాంలే,' అతడి మనసు బాధపడకూడదని వెంటనే అంది బీబీ.

'కాని మీరు సాయంత్రందాకా మా ఇంట్లో ఉంటే పాత్రలు...!'

'పాత్రలేమిటి...?' రజియా కంగారుగా అడిగింది.

'మేమెవరింటి నుంచి పాత్రలు తెచ్చామో వారు నాలుగైయ్యేసరికి తిరిగి ఇచ్చెయ్యమన్నారు.'

'మీకెంతమంది అక్కచెల్లెళ్ళు?' ఈసారి కొంచెం గంభీరంగా అడిగింది రజియా.

'ఇద్దరండీ! పెద్దక్క స్కూల్‌లో టీచర్?'

'ఆమెకేనా ఇప్పుడు పెళ్ళి?'

'కాదండీ! ఆ పిల్లవాడు కంగారుపడ్డాడు. పెద్దక్క పెళ్ళి చేసుకోనందండీ! తన జీతమంతా చిన్నక్క పెళ్ళికోసం దాస్తోంది.'

'ఆహా, అయితే ఆమేనా మూడు వేలిస్తోంది?'

'అవునండీ! మా అన్నగారు కూడా చిన్నక్క కోసం ఏడు వందల రూపాయలు పోగు చేశాడండీ.'

'కట్నం అదీ రెడీగా ఉంది కనుకనా మీరు త్వరగా పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు.'

'అవునండీ, చిన్నక్కకి తొందరగా పెళ్ళి చేసెయ్యాలి, లేకపోతే పెద్దక్కలాగ తనూ పెళ్ళి చేసుకోనంటుంది.

ఎలాగైతేనేం, అంతా కార్లలో బయలుదేరారు. ఈ సంబంధం మీద విముఖత్వం ఏర్పడింది రజియాకి. ఇంత హీనస్థితిలో ఉన్న వీరు మూడువేలివ్వలేరన్న అనుమానం కలిగిందామెకి.

వీరంతా అక్కడికెళ్ళి ఒక చిన్న ఇంటి దగ్గర దిగారు. ఇల్లు శుభ్రంగా ఉంది. సామాన్లు ఎక్కువ లేవు. అక్కడ టీ.బీ. రోగిలాగ ఉన్న ఇద్దరు స్త్రీలు వీరికి స్వాగతం పలికారు. వారి ముఖాల్లో నమ్రత గోచరిస్తోంది. వారిలో ఒకరు పెళ్ళికుమార్తె తల్లి, రెండవ ఆమె పెళ్ళి కూతురి అక్క.

వారిద్దరూ చాలా సన్నగా, బలహీనంగా ఉన్నారు. తమ ఫ్యాషన్లని, తళుకుబెళుకుల్ని మెచ్చుకునేవారెవరూ లేకపోవడంతో ఫౌజియా చాంద్‌లకి చాలా విసుగు కలిగింది. పెళ్ళికూతురి అక్కకి ముప్ఫై, ముప్ఫై అయిదేళ్ళుండవచ్చు. ఎండు పుల్లలాగ ఉన్న ఆమె తప్పనిసరిగా నవ్వవలసి వస్తే నవ్వడానికి చేసిన ప్రయత్నం చూస్తే, ఏడవబోయి, ఏడుపురానట్టుంది. ఇక తల్లి వగరుస్తూ, వణుకుతూ, పెద్దగా ఊపిరి పీలుస్తోంది. ఇంత గంభీరంగా ఉన్న వాతావరణాన్ని చూసిన గజల్, తళుకు-బెళుకులతో ఉన్న పెళ్ళివారిని చూడడానికి పోగైన గుంపులో కలిసిపోయింది. తరువాత మామిడి చెట్టుపైనున్న కాయల్ని చూసి, కోతిలాగ గబుక్కున చెట్టెక్కేసింది. ఇది చూసిన పెళ్ళికూతురి తమ్ముడు సర్వర్, ఫౌజియా అరవసాగారు. తన గౌనెక్కడ చిరిగిపోతుందో అన్న బెంగ ఫౌజియా కుంటే, మామిడికాయల గురించిన బెంగ సర్వర్‌కి.

'ఓ గజల్ బేగమ్! చెట్టు మీద నుంచి దిగు. ఈ కాయలు మేము అమ్మేశాము. ఒక్కకాయ తక్కువైనా డబ్బులివ్వరు.'

'ఛీ... మీకింత పిసినికొట్టుతనం ఎందుకు? మీరెందుకు తినరు?'

గజల్ చెట్టెక్కడం చూసిన బీబీ రజియా కూడా కంగారు పడ్డారు.

'అరే బీబీ, ఇంకా పచ్చికాయలు, తింటే దగ్గొస్తుంది. పెళ్ళి కుమార్తె, తల్లి ముద్దుగా నచ్చచెప్పడానికి ప్రయత్నించింది.'

'మా ఇంట్లో అసలెవరికీ మామిడి పళ్ళు నచ్చవు. అందుకని ఈ చెట్టు పంట అమ్మివేశాం. పాడు చేసుకుంటే ఏం ప్రయోజనం?'

'అవునండీ... మంచి పని చేశారు?' బీబీ సమర్థించింది.

'ఏయ్ గజల్ త్వరగా దిగు. ఇవాళ నీ కాళ్ళు విరగ్గొడతాను' క్రింద నుంచి పళ్ళు నూరుతూ అంది కుంటత్త.

క్రిందికి దిగుతూనే, తిండి మీద దృష్టి నిలిపింది గజల్. కోడి దగ్గర నుంచి షామీ కబాబ్ దాకా అన్ని తినేసింది. తింటుండగా పెళ్ళికూతురి అక్క మండిపోతున్న ధరల గురించి ప్రస్తావిస్తూ కోడి ఖరీదు రెండు రూపాయలని, మొత్త భోజనం ఖర్చు పది పన్నెండు రూపాయలై పోయిందని చెప్పింది.

భోజనానంతరం గజల్, విరిగిపోయి పనికిరాని సామాన్లన్నీ పడేసి

దుప్పటి కప్పి తలుపులు మూసేసిన గదులని పరీక్షించడంలో లీనమైపోయింది. అక్కడినించే బొమ్మల పుస్తకం తీసుకొచ్చి, మంచి బొమ్మలు చింపి తినడం మొదలెట్టింది. ఇంకా రెండు మూడు బొమ్మలైనా తిందో లేదో, సర్వర్ పరుగెత్తుకొచ్చాడు. ఆ పుస్తకం గతి చూసిన అతనికి బాధేసింది 'ఇదేమిటిలాగ చేశావ్! అర్ధ రూపాయి పుస్తకం తెలుసునా!'

అతడు పుస్తకం లాక్కునేసరికి - పిసినిగొట్టి, అని వెక్కిరిస్తూ వెళ్ళిపోయింది.

పెళ్ళి కూతురి తల్లీ, అక్క కలిసి పిల్లని తీసుకురావడానికి లోపలి కెళ్ళేసరికి, కుంటత్త మెల్లిగా అంది, వీళ్ళని చూస్తే మూడు వేలు రొక్కం ఇచ్చేవాళ్ళలాగ కనబడడం లేదు నాకు. సారె సామాను, రొక్కం అంతా ఒక జాబితా తీసుకుంటే సరి, లేకపోతే తరువాత వీళ్ళేదైనా మోసం చేస్తే పాపం హామిద్‌మియాకి ఇబ్బంది కలుగుతుంది.' ఇంతలో పెళ్ళికూతురు వచ్చింది. అక్కలాగే ఆమె కూడా ఎముకల గూడులాగే ఉంది.

తాడిచెట్టులాగ పొడుగ్గా ఉంది. కను - ముక్కుతీరు కూడా ఓ మాదిరిగా ఉంది.

'సారెలో మేము పది పాత్రలిస్తాము. ఇప్పుడు నేను కట్టుకున్న చీర కూడా కలిపి పదకొండు జతల బట్టలు ఇస్తాము. ఈ చీర ఖర్చు నలభై రూపాయలు' కట్న కానుకల జాబితా చెబుతూ తమ గొప్పతనాన్ని చాటుకోవడానికి ప్రయత్నించింది అక్కగారు.

'సరే కట్నకానుకల మొత్తం జాబితా ఇప్పుడిచ్చెయ్యండి మాకు. వచ్చే శుక్రవారం 'పాప్‌మలే' ఆచారాన్ని జరిపించి, అదే సమయంలో మూడువేల రొక్కాన్ని కూడా ఇచ్చెయ్యండి.' కుంటత్త స్పష్టంగా చెప్పేసింది.

'ఇప్పుడా! అదెలా కుదురుతుంది?' పెళ్ళి కూతురి తల్లి మెల్లిగా అంది.

'మేము కొద్దిగా కట్నం సమకూరుస్తున్నాము. మీరు మా మాట నమ్మండి. మేమలాంటి ఇలాంటి వాళ్ళం కాము. పిల్లల తండ్రి అకాల మృత్యువు వాత పడకుండా ఉండి ఉంటే నేను మీకు లక్షల కట్నం ఇచ్చేదాన్ని!'

కుంటత్త అటూ - ఇటూ చూడసాగింది.

'కిళ్ళీ తెచ్చి పెట్టుబాబూ! తమలపాకులు వేసుకోకపోవడం వల్ల పళ్ళు

నలుపుతున్నాయి' బీబీ ఆవులిస్తూ అంది.

'ఇప్పుడే బజారునుంచి తెప్పిస్తాను' అంటూ ఒక మాసిపోయిన పాత సంచీలో డబ్బులకోసం వెతకసాగింది, పిల్ల తల్లి.

'ఏం చెప్పను ఖాలాజనీ, నేను కిళ్ళీ వేసుకోవడం మానేశాను. పెళ్ళి చెయ్యవలసిన పిల్లలెదురుగా ఉన్నారు. కొంచెం ముందు చూపు అవసరం కదా!'

వారు బయలు దేరబోతూండగా పిల్లతల్లి, తాము ఇవ్వబోయేవాటి గురించి తిరిగి ఒకసారి చెప్పడం మొదలుపెట్టింది. 'వాళ్ళ బాబాయి ముహ్‌దిభాయీ!' అప్పుడు పెళ్ళి కొడుక్కి బంగారు ఉంగరం ఇస్తానన్నారు. వాళ్ళ అత్త లాకెట్ ఇస్తుంది.'

'మీకొక నిజం చెప్పనా...?' జంకుతూ అక్క అతి వినయంగా అంది.

'పదిహేను వందలు మేము ఇప్పుడే ఇచ్చెయ్యగలం, మిగిలిన పదిహేను వందలు, నేను నెలకి వంద రూపాయలు చొప్పున తీర్చేస్తాను.'

'మీరు నమ్మండి. గొప్పవాళ్ళ మాటే విలువైంది కదా!' తల్లి గొణిగింది.

ఇది విని వారు ఆశ్చర్యపోయారు.

'అప్పా...?' హాయ్ అల్లా! ఎవరేనా వింటే ఏమనుకుంటారు? కట్నం డబ్బెవరేనా అప్పు పెడతారా?' కుంటత్త విసురుగా అంది.

'మీ పిల్ల జీతం మీద నమ్మకమేమిటి? రేపెక్కడైనా పెళ్ళై పోతే, ఆమె భర్త ఎందుకు తీరుస్తాడు? మీరేమైనా మాకు రాసివ్వగలరా?'

'నా పెళ్ళా? పెళ్ళి కూతురి అక్క శూన్యంలోకి చూడసాగింది.

'ఇప్పుడిక నా పెళ్ళి... నేనెక్కడికైనా వెళ్ళగలనా...?

ఆమె తలెత్తి రజియా నడిగింది? ఆమె పండు వెంట్రుకలు, ముఖము మీద అలుముకున్న చీకటి తెరలు చూసిన రజియా నిరుత్తరురాలైంది. కాగితం వ్రాయించి పుచ్చుకోవలసిన అవసరం లేదనిపించింది.

వెళ్ళేటప్పుడు గజల్ మళ్ళీ సర్‌వార్ దగ్గరకెళ్ళి ఒక్క తోపు తోసి అంది, 'పిసినిగొట్టు, వెధవముఖం, గాడిద, పంది, గుడ్లగూబ! తన్నడానికి కాలెత్తిందంతే, కుంటత్త గుద్దులు, తన్నులు వర్షించిందా పిల్లపైన.

'కొట్టకండి ఖాలా! తల్లిలేని పిల్ల!' పెళ్ళికూతురి తల్లికి జాలేసింది. ముక్కు, కన్ను ఏకమై ఏడుస్తున్న గజల్‌కి ముక్కునించి రక్తం కారుతుండగా,

కొళాయి కింద కూర్చుని తనని చూస్తున్న సర్వార్ కనబడ్డాడు.

కారు బయలుదేరుతుండగా అతడు పరుగెత్తుకుంటూ వచ్చి, 'ఇంకెప్పుడూ నన్ను కొట్టవు కదూ' అని అడిగాడు. అతన్ని వెక్కిరించింది గజల్.

కారు కొంచెం ముందుకు సాగింది, 'ఎవ్వరూ వీళ్ళ బాధ్యత తీసుకోకండి, వీళ్ళను చూస్తే ఐదువందలైనా ఇచ్చేవాళ్ళలాగ కనబడడంలేదు?' అంది కుంటత్త.

కాని, ఇంటికి రాగానే రజియా హామిద్ భాయీకి ఉత్తరం వ్రాసింది. 'మీ అత్తవారు చాలా గొప్పవాళ్ళు, వాళ్ళు తప్పకుండా మూడువేలు ఇస్తారు. దీనికి నేను బాధ్యత వహిస్తాను.'

ఆమె ఇంతటి కాంతిని జీవితంలో మొదటిసారి చూసింది. స్టేజీ మధ్యలో వృత్తాకారంగా వెలుగు పడుతోంది. జుట్టు విరబోసుకుని, అత్త దుపట్టా కప్పుకుని ఒక ప్రత్యేకమైన భంగిమలో కూర్చుంది. కనురెప్ప కదిపినా అంతే సర్వనాశనం అయిపోతుందని చాంద్ ఆపా ముందుగానే చెప్పింది. నిజానికి పెదిమలకి రంగు పూసుకోవడం వల్ల ఆ పిల్లకి ఏమిటోగా ఉంది. పెద్ద పెద్ద మీసాలున్న ఒకతను ఆ పిల్ల ముఖం మీద ఎన్నో రంగులు పులిమాడు. దుపట్టి కొస చల్లగా తగులుతుండడం వల్ల నవ్వొస్తూంది. ఉన్నట్లుండి రంగస్థలంమీద దీపాలు ఆరిపోయాయి. మెల్లిగా తెర లేస్తూంది. స్టేజ్‌కి ఒక మూల మైక్ ముందు నిలబడి చాంద్ మృదుమధురంగా పాడుతోంది.

ఆమె ఒళ్ళు విరుచుకుంటూన్నట్లు భంగిమలో కదలిక లేకుండా ఉండిపోయిందా లేక గాలిలో కలిసి పోయిందో తెలియడం లేదు. కళ్ళల్లో నీళ్ళు తెప్పించే ఆ తీవ్రమైన కాంతి పై నుంచి వస్తూందో లేక ప్రక్కనుంచి వస్తూందో, ఆమెకి అసలు కనబడడం లేదు. కింద హాలులో జనం నిండి ఉన్న సంగతి ఆమెకు తెలియదు. ప్రేక్షకులు ఆశ్చర్యపోతున్నారు. అది ఒక మంచు తెరో లేక హృదయ ఫలకాలపై ముద్రవేస్తూన్న చాంద్ ఆపా గాత్రమో తెలియడం లేదు.

స్టేజీ మీద తెర పడింది. దీపాలు ఆరిపోయాయి. అంతటి సందడిలో కూడా చాంద్ నవ్వు స్పష్టంగా వినబడుతూంది. తననెంత మంది

ఎత్తుకున్నారో తెలియదు.

'మీరు నిజంగానే ఈ ప్రళయకాలపు ఉపద్రవాన్ని ఎక్కడినుంచో తీసుకొచ్చారు.'

'చాలా గొప్పగా ఉందండీ! చాంద్ సామర్థ్యాన్ని ఒప్పుకుంటున్నాము.'

'థాంక్యూ, థాంక్యూ!' చాంద్ పూలగుత్తులందుకుంటూ అలసిపోతూంది.

అత్త నగలు తెస్తూంటే ఆ పిల్లకెందుకో బాధగా అనిపించింది. ఇంతమంది తనని ముద్దు చేశారు. చాంద్ ఆపా మాత్రం చేరదియ్యలేదు. అప్పుడు, గజల్‌ని దగ్గరకు తీసుకుని, బాగా ముద్దు చెయ్యమని అల్లామియా చాంద్ ఆపాని ఆజ్ఞాపించాడు. చాంద్ ఆపా చేరదీసినప్పుడు తను కొంచెం బెట్టు చెయ్యాలి. కాని చాంద్ ప్రేమకై పరితపిస్తున్న గజల్‌కి ఆమె చూపిన ప్రేమ మత్తెక్కించింది.

స్టేజీపైన చీకట్లో ఒక మూల కూర్చున్న హుమాయూన్ మొట్టమొదటిసారిగా గజల్ చాలా అందంగా ఉందన్న విషయం గమనించాడు.

బయటికి వచ్చిన తరువాత అందరి పొగడ్తలు అందుకుంటూన్న గజల్‌ని ఎవరో గబుక్కుని పైకెత్తి, బుగ్గపైన గాఢంగా చుంబించారు. 'నువ్వు విన్నావా, సంజీవా... ఈ పిల్లపేరు గజల్ అట, గజల్! అన్నారెవరో

'ఇంక హైదరాబాదులోని షాయర్లందర్నీ ఆ ఖుదాయే రక్షించాలి. చాంద్ నవ్వసాగింది.'

'నన్ను వదిలిపెట్టండి!' ఆ పిల్లకెందుకో అతని ఒడిలో ఉంటే భయమేసింది.

'లాభంలేదు, ఇంక నిన్ను విడిచిపెట్టను' తన బుగ్గలతో ఆ పిల్ల బుగ్గల్ని రాశాడు. గడ్డం గుచ్చుకుంది

'ఖాన్ సాహెబ్ విడిచిపెట్టండీ పిల్లని' చాంద్ కోపంగా అంది.

'చాలా అందంగా ఉంది మీ చెల్లెలు! నీవామె ముందు ఒక మత్లావి 'ఆర్టిస్ట్ సఆదత్, చాంద్‌తో అన్నాడు.

'కాదు... మక్తా (గజల్ చివరి షేర్) ఎవరో అన్నారు, దాంతో అంతా నవ్వేశారు.

'సరే మీరంతా పదండి. ఒక కొత్త ఆర్టిస్ట్ గౌరవార్థం అక్కడ డిన్నరు ఏర్పాటు చెయ్యటమైంది.'

'మీరు వెళ్ళండి... నేను సంజీవాతో వెళుతున్నాను.' చాంద్ సంజీవా చెయ్యి పట్టుకుని, అతన్ని నెట్టుకుంటూ తీసుకుని వెళుతూంది.

ఈ లోపల ఖాన్ సాహిబ్ మరికొంతమంది అందమైన స్త్రీలను దగ్గరకు తీసుకున్నారు.

'మీరు పదండి, ఖాన్ సాహిబ్ వంగి గౌరవపురస్సరంగా గజల్‌తో అన్నారు. ఇంత రాత్రి ఎక్కడికెళుతుంది, నిద్రపోతుంది.' రాషిద్ మాటలు చేదుగా ఉన్నాయి. కారులో రాషిద్ రజియాలు చాలా కోపంగా ఉన్నారు. వెనుక సీట్లో కూర్చున్న గజల్‌ని వాళ్ళిద్దరూ మరచిపోయారు. గజల్‌ని వారు స్టేజి మీద చూసినట్టేలేదు కార్లో కూర్చున్న విషయం కూడా గమనించినట్టు లేదు.

'అంతమంది ముందు నేనెలా ఆపగలను? కాని నువ్వయినా బోధపర్చవలసింది.'

'నేనెలా ఆపగలను? సంజీవాని చూసిన దగ్గర నుంచి చాంద్ స్థిమితంగా లేదు. అత్తా ప్లీజ్ ఇప్పుడు నన్ను ఆపవద్దు అంది నాతో.'

'అంతే, నువ్వు వెళ్ళిపోనిచ్చావు. ఇదంతా నువ్వు చేసిన ముద్దే!'

'అయ్యో, ముద్దేమిటి! అల్లా వాళ్ళ మామయ్య, తాతగార్ని రక్షించుకాక!' రజియా అంది.

'చూస్తూండు... అది ఆ వెధవనే పెళ్ళి చేసుకుంటుంది. అసలు ఎవడి కూతురది? తండ్రి కూడా ఒక హిందూ స్త్రీని ఉంచుకున్నాడు. రజియా మాటలలో ఎంత విషముందంటే రాషిద్ జవాబు కూడా చెప్పలేదు. ఏ గోడకో గుద్దుకుని చచ్చిపోవాలనుకుంటున్నాడో ఏమో అన్నట్లు కారు వేగం మాత్రం పెంచేశాడు.'

'చాంద్ ఆపా సంజీవా చాచాతో కలిసి వెళ్ళింది.' వాళ్ళిద్దరికి చాంద్ మీద కోపం వచ్చినట్టు గజల్‌కిప్పుడర్థమైంది.

'నీకెవరు చెప్పారు?' రాషిద్ వెనక్కి తిరిగి అడిగాడు.

'చాంద్ ఆపా స్టేజెందుకెక్కాలి, అని నిన్న సంజీవా అలిగారు. అందుకే మధ్యాహ్నం చాంద్ ఆపా ఏడ్చింది.'

'సంజీవా రోజూ సొసైటీ ఆఫీసుకొస్తూంటాడా?' అత్త అడిగింది. ఉన్నట్లుండి తనకి ప్రాముఖ్యత లభించినట్టనిపించింది గజల్‌కి. జీవితంలో మొట్టమొదటిసారి అత్తా మావయ్యలు ఆమె మాటలు వింటున్నారు. సంజీవా చాచా, చాంద్ ఆపా విషయాలన్నీ చెప్పేయ్యాలనిపించింది. అలాగ చేస్తే మామయ్య వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసేస్తారు, లేకపోతే ఆమె విషంతాగి చచ్చిపోతుంది. ఒకనాడు వయొలిన్ వాయించే లూఈస్, చాంద్ ఆపాతో ఏమో అన్నందుకు, అతనికీ, సంజీవాకి యుద్ధమే జరిగింది. ఒకసారి సంజీవా వచ్చినప్పుడు, చాంద్ ఆపాతో మేకప్ రూమ్‌లో ఉంది. కొద్ది సేపట్లో నాటకం ప్రారంభం అవబోతూంది, కాని అంతా విడిచి పెట్టి సంజీవాతో వెళ్ళిపోయింది. అప్పుడు ఖాన్ సాహిబ్‌కి చాలా కోపం వచ్చింది. ఆయన చాంద్ స్ట్రిప్ట్ తీసి గజల్‌పై విసిరికొట్టేసరికి, గజల్‌తోపాటు అక్కడున్న కళాకారులందరికీ నవ్వొచ్చింది. కోపంతో ఖాన్ సాహిబ్ గంతులేస్తూంటే, ఆయన నున్నటి తలపైన స్వేద బిందువులు ముత్యాల్లాగ మెరుస్తున్నాయి.

గజల్ ఈ విషయాలన్నీ అత్తకి చెప్పింది. చాంద్ వేలికుండే, వజ్రాల ఉంగరం పోలేదనీ, బలవంతంగా దాన్ని సంజీవాకిచ్చిందన్న విషయం కూడా చెప్పింది గజల్.

ఉదయం స్టేజీమీద వేసుకున్న గౌను వేసుకుని ఎగిరెగిరి తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకుంటూన్న గజల్‌ని చూశాడు హుమాయూన్.

'ఇంక ఈ గౌను ఇచ్చెయ్యి. నేను నీకు కొత్త గౌను కుట్టిస్తాను.'

జీవితంలో మొదటిసారి హుమాయూన్ గజల్‌తో అంత మృదువుగా మాట్లాడాడు.

ఎంతో ఇష్టంగా మెత్తగా ఉన్న గౌనుని చేతితో రాస్తూ, 'ఖాన్ సాహెబ్ ఈ ఫ్రాక్ నాకిచ్చేశారు, అన్న శుభవార్త వినిపించింది.

'ఈ రోజు నేనీ గౌను వేసుకునే స్కూల్‌కి వెళతాను ఈ గౌను నా స్వంతం అన్న విషయాన్ని దృఢపర్చుకోవడం కోసమా అన్నట్టు నేలమీద పొర్లాడుతూ ఆ ఫ్రాక్‌ని ఇష్టమొచ్చినట్టు మురికి చెయ్యడం ప్రారంభించింది గజల్. పళ్ళతో పీకింది తరువాత కుళాయి దగ్గర కెళ్ళి గౌను మీద పడుతున్న

నీటి ధారలను తమాషాగా చూడసాగింది.'

వదినగారి చదువుకున్న కూతుర్ని చూసి తాను అనవసరంగా బాధపడ్డానన్న విషయమిప్పుడు బోధపడింది హుమాయూన్‌కి. ఆమె చిన్నాన్ననెప్పుడు ఆదరించకపోయినా కాలేజీలోని రౌడీ వెధవల వెంబడి తిరిగినా, మనసు మాత్రం మంచిదే. గజల్‌చేత స్టేజిమీద కొద్దిగా అభినయింపజేసింది, ఈ ఫ్రాక్ ఉచితంగా లభించింది.

ఈ సాకుతో అతను తిరిగి ఒకసారి ఐవానే గజల్‌కి రాకపోకలు ప్రారంభించాడు. గజల్‌కి అభినయించడం ఎలా నేర్పించాలో చాంద్ దగ్గర కూర్చుని గంటల తరబడి మాట్లాడుతూండేవాడు.

'చిన్నాన్నగారూ, గజల్‌లో నటించగల చక్కని నేర్పుంది. క్లబ్ ప్రెసిడెంట్ ఖాన్ సాహిబ్, గజల్ స్టేజీకోరకే పుట్టిందంటున్నారు. ఇంక మీరు గజల్‌ని నాకిచ్చెయ్యండి. నేను చక్కగా తీర్చిదిద్దుతాను.'

'కాని మా ముర్షిదుల్లో ఆడపిల్లల్ని స్టేజిపై...'

'చాలు... చాలు... ఈ పాత చింతకాయి కబుర్లు అవతల పెట్టండి.' మీరు కూడా తాతగారికి ఏ విధంగానూ తీసిపోరు, చాంద్ కోపంగా అంది. భయంతో కలవర పడ్డాడతను. నిజానికీ చదువుకున్న వారి ఆలోచనలెలా ఉంటాయో అతనికేం తెలుసు?

పొద్దున్న ఖాన్ సాహిబ్ కారులో గజల్‌ని తీసుకెళ్ళడానికి చాంద్ వచ్చేసరికి అంధకారంతో నిండి ఉన్న హుమాయూన్ ఇంటికి కాంతి వచ్చినట్లయింది. అతడు తన చొక్కాతో కుర్చీలను శుభ్రం చేశాడు. ఖాన్ సాహెబ్ కారు తలుపు తెరిచి పట్టుకుని, ఆయన్ని ఇంట్లోకి తీసుకువచ్చాడు. హోటల్‌కెళ్ళి రెండు కప్పులు టీ తీసుకు రమ్మని ఆయాజ్‌ని రెండు తిట్టి హోటల్‌కి పరుగెత్తించాడు, అంత అసహ్యంగా ఉన్న కప్పులో బజారులోని టీ తాగను చాంద్ సందేహించింది. ఖాన్ సాహెబ్‌కి అది టీ తాగే సమయం కాదు. తొరకలు కట్టి ఈగలు ముసురుతూ, ఆ టీ, అలాగే ఉండిపోయింది. వారు నిలబడే మాటి మాటికీ గడియారం చూస్తూండిపోయారు. లోపలికొచ్చిన హుమాయూన్ బద్ధకంగా బట్టలు మార్చుకుంటున్న గజల్ వీపు మీదొక తన్నుతన్ని, చెయ్యి పట్టుకుని ఈడ్చుకొచ్చి కారులో కూలేశాడు. దెబ్బ తగలడం వలన చాలాసేపు

ఏడుస్తూ కూర్చుంది గజల్.

సాయంత్రం వారంతా తిరిగొచ్చినప్పుడు చాంద్, హుమాయూన్‌కి ఒక్కసారిగా పాతిక రూపాయలిచ్చింది.

'ఇది గజల్ రాకపోకల కిరాయి?'

నేడు 29వ తేదీ, వంట చెయ్యడానికేమీ లేదన్న విషయం అతడికి మాటిమాటికీ జ్ఞాపకం చేసింది సాయా. అతడు కసురుకున్నాడు. అతడు ఒకసారి డబ్బుని మరొకసారి చాంద్‌ని, నమ్మలేనట్లు చూశాడు.

ఇది నిజంగా డబ్బే.

ఇక సాయంత్రాలు అతడు ఐవానే గజల్‌లో గడపసాగాడు.

చాంద్ నాటకాల్లో అభినయిస్తూంటే కావలసిన ఏర్పాట్లన్నీ అతడు చూసుకునేవాడు. ఆర్టిస్టుల ఇళ్ళకి పరుగుబెట్టడం, వారికై టీ ఏర్పాటు చెయ్యడం, గజల్‌ని కొట్టి డైలాగ్స్ కంఠస్థం చేయిస్తున్నాడతను. హుమాయున్ జీవితంలో చాలా చేదు చవి చూశాడు. తాను కోరుకున్నది ఇతరులచేత ఒప్పించడానికతని దగ్గర మిగిలిన ఉపాయమల్లా చావగొట్టడమే. భగవంతుడీ చిట్కాని అతనికి బహూకరించాడేమో అన్నట్టు అతడు దీన్ని ప్రతి ఒక్కరి మీద ప్రయోగించాడు.

గజల్ అదృష్టం పండింది. ఆ పిల్లకి రెండు మూడు కొత్త గౌన్లు లభించాయి. ఆ ఫ్రాక్‌లు ఫౌజియా గౌన్లలాగే మెరుస్తున్నాయి. తల్లి పోగానే అందరూ తోసేశారు ఆ పిల్లని, కాని ఇప్పుడు రజియా తన స్నేహితురాళ్ళకి ఆ పిల్ల పాట వినిపించసాగింది. చాంద్ స్నేహితులంతా ఆ పిల్లని ఎత్తుకుని తిరిగేవారు. ఇప్పుడాపిల్ల చాంద్ ఆపాతో కలసి కారులో సొసయిటీ ఆఫీసుకెళుతూంది. ఆ రోజుల్లో ఇంత చిన్న పిల్ల రంగ స్థలంపై నటించడానికి లభించేది కాదు. అందుకని చాలామంది ఆ పిల్ల తమ డ్రామాల్లో, అభినయిస్తే బాగుండుననుకునేవారు.

ఈర్ష్యతో నిండిన ఫౌజియా ఒక్కర్తే, గజల్‌ని ఇంకా ముక్కు చీమిడి కారుతూన్న పనికిమాలిన పిల్లగానే భావించేది. ఫౌజియా తినగా మిగిలిన గుడ్డు, రొట్టిముక్క గజల్‌కిచ్చేది. ఆ రొట్టె ముక్కకై ఎదురు చూస్తూ గజల్ అక్కడి నుంచి కదిలేది కాదు.

ఇప్పుడు గజల్ తాతగారి దగ్గరనుంచి షాహీన్ దాకా అందర్నీ 'మీరు'

అని సంబోధించడం నేర్చుకుంది.

గొప్పదాత లాగ ఇప్పుడా పిల్ల షాహీన్‌కి తనవద్దనున్న చాక్‌లెట్‌లు పెట్టేది. చాక్‌లెట్ డబ్బాలు, ఆటవస్తువులు, గౌన్లు, బొమ్మలు ఒకటేమిటి - లెక్కలేనన్ని బహుమానాలు లభిస్తున్నాయి ఆ పిల్లకి.

ఆయాజ్, షహజాద్‌లను ఈర్ష్య దహించివేస్తోంది. ఆయాజ్ కూడా, సినిమా పాటలను చక్కగా అనుకరించేవాడు. కాని అతణ్ణెవ్వరూ పట్టించుకునేవారు. గజల్ గర్వంగా తిరుగుతూండేది.

'రాత్రి చాంద్ ఆపా ఒక హోటల్‌లో ఎర్రటి డ్రింక్ ఇప్పించింది.'

'మొన్న మెడికల్ కాలేజీలో పెద్ద పేస్ట్రీ తిన్నాను.'

ఖాన్ అంకుల్ నాకు చీర కొని పెడతాను అన్నారు.'

'చీరా...! ఆయాజ్ ఆశ్చర్యంగా అడిగాడు. గజల్ మాటలు వింటూ గుటకలేసేవాడు పిల్లవాడు. తండ్రి గజల్‌పై శ్రద్ధ చూపించడం ప్రారంభించిన నాటినుంచి వీళ్ళిద్దరూ రోడ్లపై బడుద్దాయిల్లాగ తిరగడం మొదలెట్టారు.'

'అవును చాంద్ ఆపా ఆయన్ని చీర అడిగింది. నేనూ అడిగాను. ఇంక నాడియాలాగ నేను కూడా అసలు గుర్రమెక్కి యుద్ధం చేస్తాను.'

'అయితే నువ్వు కూడా నరకంలో భస్మమవుతావు.' ఉడుకుమోత్తనంగా అన్నాడు ఆయాజ్.

'ఏమిటీ...? ఆ పిల్ల గుండె ఝల్లుమంది. ప్లాస్టిక్ బొమ్మ చేతిలోంచి జారి పడింది.'

నాడియా నరకంలో కాలి బూడిదవుతుందని చెప్పేది అమ్మ. భయంతో వణికిపోయింది గజల్, కాని ఆయాజ్‌ని చూసి ఊరుకుంది. చాంద్ ఆపాకి తన ఎడల ఉన్న అభిమానాన్ని గద్ద తన్నుకుపోయినట్టు, తాను ఒంటరిదై పోయినట్టు అనిపించింది. నరకంలోని యమభటులు తండ్రిలాగ తనని రెక్కలు పుచ్చుకుని మంటల్లోకి నెట్టడానికి వస్తారు. పాములు నోళ్ళు తెరుచుకుని కొట్టెయ్యడానికి తన మీదికి వస్తాయి. అక్కడి నుంచి పారిపోదామనుకుంది. కాని దారే కనబడలేదు. ఒక పాము పడగవిప్పి ముందుకొచ్చింది. దాంతో ఆ పిల్ల ఒక్క గంతు గెంతింది. తండ్రి ఒక రూపాయి ఆమె ఒడిలోకి విసిరాడు. అది నిప్పులాగ ఆ పిల్లకి తగిలి

కాలిని కాల్చింది. తండ్రి ఎంతో హుషారుగా ఉన్నట్టు ఒకదాని వెంట మరొక రూపాయి విసురుతున్నాడు. గాయాల వలన కలిగిన మంటతో ఆ పిల్ల ఏడుస్తూంది.

'ఏమైంది?' తండ్రి ధోరణిలో ఇంత ఆప్యాయత మొదటిసారి గోచరించింది. ప్రేమ నిండిన ఆ చేతుల్లో ఎంతటి వెచ్చదనం ఉంది! ఆ పిల్లని గుండెలకి హత్తుకుని అతడెంత ప్రేమగా అడిగాడంటే, ఒక వేళ ఆ పిల్ల అంతవరకూ ఏడవకుండా ఉండి ఉంటే, తండ్రి చూపించిన ఈ అభిమానానికి తప్పకుండా ఏడ్చి ఉండేది. తండ్రి చాలాసార్లు అడిగినా గజల్ ఏం చెప్పలేకపోయింది.

'మరెందుకలాగ వున్నావు?' అతడు అరవసాగాడు.

'నేను నాటకాలలో నటించను. దేవతలు నన్ను నరకంలో పడవేస్తారు.'

'ఏమిటి...? తండ్రికేం అర్థం కాలేదు.'

'నాడియా నరకానికి పోతుందని చెప్పేదమ్మ.'

'నువ్వూ, మీ అమ్మా...! తండ్రి తిట్టాడు.

'మీరిద్దరెప్పుడూ నాకు కష్టం కలిగించే పనే చేశారు. పాపం చాంద్ ఏదో నాలుగు డబ్బులు వచ్చే మార్గం చూపిస్తే, ఇప్పుడు నీ వెధవ్వేషాలు ఎక్కువయ్యాయి. కుయ్, కుయ్, అన్నావంటే ముక్కలు ముక్కలుగా చీల్చి పారేస్తాను జాగ్రత్త!' మర్నాడు ఈ మాటలు విన్నప్పుడు రజియా విపరీతంగా నవ్వింది.

'నువ్వేం గొప్ప పనులు చేశావని నరకం నుంచి తప్పించుకుంటావు?' ఒకనాడీ విషయం చాంద్ ఆపాకీ కూడా చెప్పాలనుకుంది, కాని ఆమె వినిపించుకునే స్థితిలో లేదు. కారణమేమిటో తెలియదు కాని వారిరువురికి మధ్య ఏదో అభిప్రాయ బేధం వచ్చి గొడవ జరిగింది.

'ఆ గొట్టంగాడు, ముసలి పీనుగు ఏమనుకుంటున్నాడు' చాంద్ కోపంతో ఊగిపోతూంది. అలమరాలోంచి బట్టలు తీసి ఇష్టమొచ్చినట్టు నలుమూలలా విసిరేస్తూంది.

'ఊహ్, నా ముందు ప్రేమ వ్యక్తం చేస్తాడా! ముందుగా మురికి కాలవలో ముఖం కడుక్కుంటే సరి.'

రజియా ఎంతో సిగ్గుపడుతూ ఆమెని ఊరుకోబెట్టడానికి ప్రయత్నిస్తూ,

'ఇంక ఊరుకో బాబూ, మీ మామయ్య వింటారు.'

ముందు గదిలో నిలబడి ఉన్న గజల్ చాంద్ ఆపానే చూస్తోంది. కత్తిరించిన జుట్టు ముఖమ్మీద పడుతోంది. చాంద్ ఆపా నేనొచ్చేశాను! నవ్వుతూ తన రాకను తెలియచేసింది గజల్. ఆ పిల్లని చూసేసరికి తననెవరో తిరిగి మంటల్లోకి తోసినట్టనిపించింది చాంద్‌కి.

'ఈ పిల్లనెపంతో ముందుకు రావడానికి ప్రయత్నించాడు - సొసైటీకి మీ నాన్న దగ్గరికిపో, రెక్కలు పట్టుకుని బైటికి గెంటుతూ ఇక మీద ఎప్పుడైనా నా గదిలో అడుగు పెట్టావంటే కాళ్ళు విరగ్గొడతా జాగ్రత్త!'

గజల్‌కి గుండె బ్రద్దలైనట్లనిపించింది. ఇంతకంటే బాధాకరమైన మాటలను నవ్వుతూ సహించేది గజల్, గదిలోంచి గెంటేయ్యడం కూడా అంతగా బాధించలేదు. కాని ఎందుచేతనో చాంద్ కోపాన్ని ఆసమయంలో భరించలేననిపించింది గజల్‌కి. మొట్ట మొదటిసారి నిరాదరణకి గురి అయినట్లనిపించింది. మందమతి షాహీన్, చాడీలు చెప్పే ఫౌజియా ఇద్దరూ నిలబడి తమాషా చూసి పళ్ళికిలిస్తున్నారు. హాల్లో స్థంభాన్ని పట్టుకుని తల్లి మరణించినప్పుడు కూడా ఏడవనంత హృదయవిదారకంగా విలపిస్తోంది, గజల్.

మామగారు ఆ దరిద్రపు ఆర్టిస్ట్‌ని కలుసుకోవద్దని చెప్పినప్పుడు నుంచి ఇలా తయారయింది ఈమె పరిస్థితి, తన గదిలో కూర్చున్న రజియా కుంటత్తతో అంటూంది. ఇరవై సంవత్సరాలు నిండాయి. ఏదో ఒక సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యాలి. లేకపోతే ఏ బెస్తవాళ్ళలోనో, మాదిగాళ్ళలోనో కలిసిపోతుంది. గొంతులు చించుకుంటూ కుంటత్త నేనూ అదే అంటున్నాము, కాని ఎవరైనా బలవంతం చెయ్యలేరుగా!'

'అల్లా మియా చాంద్ ఆపాని చచ్చిపోనీ, అమ్మలాగే ఆమెకి కూడా సమాధి కట్టనీ, కాని అల్లామియా చాంద్ ఆపాని ఎవరూ పెళ్ళి చేసుకోవద్దు.'

చాలాకాలం తరువాత గజల్‌ని తిట్టడానికి అవకాశం దొరికింది.

నోరు మూసుకో ముదనష్టపుదానా! సంధ్య వేళ ఎందుకలాంటి పాడు మాటలంటావు! నమాజ్ చేసుకోడానికి కూర్చుంటూ అంది బీబీ.

తరువాత, ఎవరికైనా తనపైన జాలి పుట్టకపోతుందా అన్న ఆశతో

అందరి వంక చూస్తూ అనాధలాగ ఇంట్లో తిరుగుతూంది గజల్, కానీ, ఎవరికీ తీరుబడిలేదు. ఎవరి పనులు వారికుండడం వల్ల, ఆ పిల్ల ఒంటరితనాన్ని గమనించేపాటి తీరుబడి ఎవరికి లేకపోయింది. ఫౌజియా తన స్నేహితురాళ్ళతో ఒక్కతే ఆడుకునేది. గజల్‌ని ఏ ఆటలోను, చేర్చుకునేది కాదు. గజల్ మురికి బట్టలు చెడు అలవాట్లు అంటే అసహ్యం. షాహీన్‌కి, ఎప్పుడైనా గజల్ తన గ్లాసు ఉపయోగిస్తే దాన్ని సబ్బుతో కడిగేవాడు, షాహీన్ ఒకసారి తెల్లటి షర్ట్, నిక్కరు, జోళ్ళేసుకుని టెన్నిస్ ఆడడానికి వెళుతూంటే గజల్ అతని చొక్కాపై చెయ్యి వేసింది. అంతే కోపంతో గొడవ చేస్తూ ఇల్లంతా ఒక కొలిక్కి తెచ్చాడు. చివరికి చొక్కా మార్చుకునిగాని బైటికి వెళ్ళలేదు. అటువంటి వాడితో ఎవరు మాట్లాడుతారు.

హుమాయూన్‌కి ఆమె ముఖం చూస్తేనే అసహ్యం. సాయాకి కూడా అతనంటే బద్ధవైరం. బతూల్ బ్రతికినంత కాలం గజల్ తన ఇష్టమొచ్చినట్టు అల్లరిచేసి, సాయాని ఏడ్పించేది. అతను సాయాకి తినడం ఇంటిపెత్తనం అప్పగించినప్పటి నుంచి గజల్ ఆమెను కాల్చుకు తినడం మొదలెట్టింది. ఈ విధంగా అస్తవ్యస్తంగా ఉన్న ఇంటి పరిస్థితులు ఆయాజ్, షహజాద్‌లకు మరింత ధైర్యాన్ని కలిగించాయి. షహజాద్, చాలాసార్లు ఇంట్లోంచి ఏదో ఒక వస్తువు తీసుకుని పారిపోవడం, పరిపాటయింది. ఒకసారి హుమాయూన్ జేబులోంచి జీతం మొత్తం తీసుకుని పారిపోయాడు. కొన్ని నెలల తరువాత, వెంటనే వంద రూపాయలు పంపకపోయినట్లయితే ఐదు నెలలు జైల్లో పడుండవలసి వస్తుందని బొంబాయిలోని ఒక పోలీసు స్టేషను నుండి ఉత్తరం వ్రాశాడు.

'కుళ్ళి చావనీ వెధవని... అలా పడుంటేనే వాడు బాగుపడతాడు, బుర్ర సవ్యంగా పని చేస్తుంది?' హుమాయూన్ లెక్కచెయ్యకుండా అన్నాడు.

వీళ్ళిద్దరూ ఎలాగ బాగుపడతారా అని అందరూ దిగులు పడుతున్నారు. తాతగారు, రాషిద్ మావయ్య ఎప్పుడూ ఆయాజ్, షహజాద్‌ల గురించే చర్చించడం విన్న గజల్, అతడు బాగుపడతాడన్న ఆశతో ఎంతో సంతోషించింది.

ఇంక మిగిలున్నది ఆయాజ్. అతడు కేవలం భోజనం వేళకి ఇంటికి

వచ్చేవాడు. ఆ పిల్లవాడ్ని తనవద్ద అట్టేపెట్టుకోవాలనుకుంది బీబీ, కాని అతడిష్టపడుటలేదు. ఇంకెవరింట్లోనో ఎందుకుండాలి! నేను బాగా చదువుకుని గొప్పవాడవుతాను ఐవానే గజల్‌లోని ఎంగిలి మెతుకులకోసం నువ్వేపో! అనేవాడు, గజల్‌తో.

ఇప్పుడతను గజల్ కంచంలోంచి తినే పదార్థాలు లాక్కోవడం, కొట్టడం మానెయ్యడమే కాకుండా గజల్‌ని జాగ్రత్తగా చూసుకోసాగాడు. తండ్రి పెట్టే హింసలని మౌనంగా సహించే అలవాటు చేసుకున్నాడు. సాయా తిట్టినా ఆమెతో పోట్లాడడం కూడా మానేశాడు. ఒకనాడు ఆయాజ్ తండ్రిని స్కూలు ఫీజ్ కావాలని అడిగాడు. కాని హుమాయూన్ మనసు సరిగ్గా లేదానాడు. ఎందుకనో అతడు ఉదయంనుంచీ ఐవానే గజల్‌లోని వారందరినీ పేరు పేరున తిడుతున్నాడు. కాని ఆయనికి, గజల్‌లాగ పరిస్థితుల్ని అవగాహన చేసుకునే సామర్థ్యం లేదు. కోపంతో హుమాయూన్ ఆయాజ్ పుస్తకాలు చింపి వేసి అతణ్ణే చావబాదాడు. అప్పుడు గజల్‌కి చాలా నవ్వొచ్చింది. తండ్రి ఆఫీసుకి వెళ్ళిపోయిన తరువాత అతన్ని వెక్కిరించింది, గజల్.

'ఇప్పుడు ఆమె కనుక బ్రతికుంటే నీకు బుద్ధి చెప్పేవాడ్ని.'

'అచ్ఛా, భాయీ! బి.ఎ. పాస్ అవుతావా?'

చిరిగిపోయిన పుస్తకాల కాయితాల్ని అతికించడం మొదలుపెట్టాడు, అప్పుడు గజల్‌కి పన్నెండేళ్ళు వచ్చాయి! తల దువ్వుకోవడం, తండ్రి చిరిగిపోయిన పెజియామా కుట్టడం అన్నీ చేతనయ్యాయి. సాయా చేతిలోంచి గోధుం పిండి లాక్కుని తన బొమ్మకి రొట్టెలు చెయ్యాలని ప్రయత్నించేది. ఫౌజియాలాగ రాషిద్, షాహీన్ల గలేబుల మీద చక్కని పువ్వులు, డిజైన్లు కుట్టేది. కుంటత్తకి సూదిలో దారం ఎక్కించిచ్చేది. ఇంటికెవరైనా అతిథులు వచ్చినప్పుడు రజియా ఫౌజియా చేతే టీ తయారుచేయించేది.

ఫౌజీయా పెరుగుతూనే కొద్దీ రజియా ఇంకా శ్రద్ధగా చూడసాగిఁది. ఇప్పుడు కాళ్ళు కనబడేలాంటి ఫ్రాక్స్ వేసుకోకుండా చుడీదారుపై జమా కార్‌చోటీ వాస్కట్ బడా దుప్పట్లు వేసుకుంటోంది. బిడ్డని ఈ కాలపు పద్ధతిలో తయారు చెయ్యననేది రజియా. తన ఆడబిడ్డల కూతుళ్ళలాగ తన పిల్లకి ఇష్టమొచ్చినట్టు తిరిగే స్వేచ్ఛనివ్వనన్న అర్థం ధ్వనించేదా

మాటలలో, రజియా ఈ మాటలు విన్న బీబీ ఆలోచించేది. స్నేహితుల్ని పెంచుకోవడం కోసమే కదా చాంద్‌కి స్వేచ్ఛనిచ్చాడు. రాషిద్ గట్టిగా చెబితే చాంద్ ఇంత సాహసించగలిగేదా? చాంద్ కారణంగా ఇప్పుడింట్లో సిరిసంపదలు వెల్లి విరిసినాయి, రజియా తన బిడ్డని అటువంటి స్వేచ్ఛనుంచి కాపాడాలనుకుంటూంది.

రూపురేఖలు, సిరిసంపద లేకుండా తన నడవడిన చాలా గొప్పదన్న గర్వం ఫౌజియాకి వుంది. గజల్‌తోటి ఆ పిల్ల స్నేహం పేరుకి మాత్రమే. .ఎవరైనా పాడు పిల్లని తమాషాకి అన్నా సరే ఫౌజియా గంటల తరబడి ఏడుస్తూ వుండేది. చాంద్, గజళ్ళను పేర్కొని ఆడపిల్లలకి, ఆటపాటలెంత చేటుతెస్తాయో! పరదా లేకుండా ఉండడం వల్ల ఎంత ముప్పు కలుగుతుందో రజియా, ఫౌజియాకి బోధపర్చేది. ఫౌజియా మాట మాటకీ తల్లిలాగే ముక్కూ మూతి తిప్పుతూ ప్రతీ మాట వ్యంగ్యంగా అనేది.

'అయ్యయ్యో! నీకింకా టీ చెయ్యడం రాదా? నేను మొన్న పుడ్డింగ్ చేశాను. డాడీ నాకు పది రూపాయలు బహుమానమిచ్చారు?'

'నాకు బచపన్ కే దిన్ భులానదేనా పాట పూర్తిగా వచ్చేసింది,' గజల్ గొప్పగా చెప్పేది.

'అమ్మీ నన్ను పాడనివ్వదు, పాటపాడే అమ్మాయిలు చెడిపోతారట.'

'చెడిపోవడమేమిటి?' గజల్ ఆశ్చర్యంగా అడిగేది.

'నాకేం తెలుసు... అమ్మంటుందంతే!'

'ఫో అబద్ధాలకోరూ! నీకు పాడడం రాదు, అందుచేత నన్ను చూసి ఈర్ష్యపడతావు.'

'సరే పద అమ్మను అడుగుదాము!'

'వద్దు నేను రాను.' గజల్ చెయ్యి విడిపించుకునేది.

ఎందుకంటే అత్త దగ్గరకి ఎప్పుడు వెళ్ళినా బోలెడన్ని నీతి బోధలు చేసేది.

అవి తప్పించుకోవడం కోసం చాంద్ ఆపా గదిలోకొచ్చి రేడియో వింటూండేది. ఆ గదిలో కొస్తే ఎంతో ఊరట కలిగేది. నిర్దయంగా లోకులు గుచ్చిన బాకులామె హృదయం నుంచి తొలగిపోయేవి. నిజానికి చాంద్ కూడా ఆమెపై ఎక్కువ శ్రద్ధ చూపించేది కాదు.

గజల్ తరుచుగా రాకుండా వుంటే బాగుండుననుకునేది బీబీ. అందుచేత గజల్ వస్తే ఏదో ఒక సాకుతో ఆమెను ఇంటికి తిరిగి పంపించేసేది. అసలు ఇంటి పరిస్థితులు కూడా అస్తవ్యస్తంగానే వుంటున్నాయి. రాషీద్‌కు ఇంట్లో ఒక్క నిముషము వుండడం కూడా కష్టమైపోయింది. వాహిద్ హుస్సైన్ రేయింబవళ్ళు స్నేహితులతో కలిసి రాజకీయ పరిస్థితులపై పునరావలోకనం చేస్తూ గడుపుతున్నారు.

బ్రిటిష్ వాళ్ళు మూటాముల్లె సర్దుకుంటున్నారని వినికిడి. అటువంటి సమయంలో జమీందారీ, జాగీర్దార్లలో గొడవగా ఉంది. ఎందుకంటే ఇత్తిహాద్-ఉల్-ముసల్-మీన్‌కి హైదరాబాదు విలీనం కావడం ఇష్టం లేదు.

నిజామ్‌కి తన అధికారం చేయి జారిపోతూన్నట్లు అనిపిస్తూంది. ఇటు నెహ్రూ సోషలిజంని సమర్థిస్తున్నారు. మరైతే కాంగ్రెస్ రాజ్యంలో జమీందారులు జాగీరులు నిలుస్తాయా? అంతా ఇదే ఆలోచిస్తున్నారు.

మౌంట్‌బాటన్ ఢిల్లీలో వాహిద్ హుస్సేన్, రాషిద్, భారత దేశములోని నవాబులు జాగీర్‌దారుల సుఖశాంతులను, జిన్నా నెహ్రూలకు పంచిపెట్టాలని నిర్ణయించుకున్నాడు.

ఐవానే ఁగజల్‌లోని విశాలమైన హోటల్‌లో పడక్కుర్చీ మీద కళ్ళు మూసుకుని పడుకొని వున్నారు. వాహిద్ హుస్సేన్ ఆయనకు ఎదురుగా, మధ్యనున్న తలుపుపైన కులీకుతుబ్‌షా పెద్ద తైలవర్ణ చిత్రం వేలాడుతుంది. గదిలో మరికొంతమంది కూర్చుని వున్నారు. అంతా మౌనంగా...

ప్రజల భవితవ్యాన్ని నలభైకోట్ల భారతీయుల అదృష్టాన్ని నిర్ణయించబోతున్న ఆచార్య కృపలానీ, లియాకత్ ఆలీఖాన్, నెహ్రూ పండితుడు, జిన్నాల ఉపన్యాసాలు వారంతా రేడియోలో వింటున్నారు.

వాహిద్ హుస్సైన్ కళ్ళు తెరిచి పైనున్న కులీకుతుబ్‌షా ఫోటోను చూసారు. దానికి పోటీగా బంగారు రంగు ఫ్రేములో బిగించిన హుస్మాన్ ఆలీఖాన్, నిలువెత్తు ఫోటో ఉంది. ఆయన ఆసఫియా సల్తనత్‌ను పుస్తకంలాగ గుండెలకదుముకొని నిలబడి వున్నారు. కులీకుతుబ్‌షా కళ్ళలో శాంతి కనబడుతోంది. ఆ చిత్రపటాన్ని చూస్తున్నా వాహిద్ హుస్సైన్‌కి కవితా జగత్తు షహాన్ షా ఐ కుతుబ్‌షా తృప్తిగా కూర్చొని ఏదో గజల్‌కై వెతుకుతున్నట్టు వుంది. లేదా తను గోల్కొండపై నిలబడి చుట్టూ ఉన్న

అడవులలో ఒక సుందర నగర నిర్మాణ పరమైన కలలు కని, తరువాత మూసీ నది ఒడ్డున కలల కనుగుణంగా నిర్మాణ కార్యక్రమాన్నే విధంగా చేపట్టాడో వివరిస్తున్నట్టుగా అనిపించింది. భాగ్‌మతి నివసించడానికి తోటలాగ, ఒక నగరాన్ని నిర్మించాడు. వాటిలో సభ్యతా సంస్కృతుల దివ్వెలు వెలుగుతూండేవి. ఉర్దూ జ్యోతినుంచి జ్యోతులు వెలుగుతుండేవి. తన ప్రేయసితో త్వరగా లేచి ఆనందోత్సవాలకై ఏర్పాటు చెయ్య, కాలం చాలదన్నాడేమో అన్న అనుభూతి కలుగుతుండేది. ఇటు చూస్తే కొన్ని శతాబ్దాల కొండల మాటునుంచి యాత్రికుల బృందాలు వచ్చేస్తున్నాయి. కొంతసేపు అయిన తరువాత దోపిడీదారులు విరుచుకుపడతారు. తరువాత గోల్కొండ అట్టడుగున దాగివున్న గాథలను వెతికేందుకు ప్రజలు వస్తారు. అప్పుడే జారిపడిన మా గొప్పతనానికి గుర్తులైన అణువులను వజ్రాలనుకొని అధికారులు తీసుకువెళ్తారు. అప్పుడీ వజ్రం ఎవరి కిరీటంలోనో అమర్చబడి ప్రకాశిస్తూ సూర్యకాంతిని సుస్థిరం చేస్తుంది.

ఆ గదిలో ఇప్పుడు ఉస్మాన్ అలీఖాన్ పరిపూర్ణ వైభవంతో విరాజిల్లుతున్న విషయాన్ని గురించి ఆలోచించిన వాహిద్ హుసైన్‌కి చాలా తృప్తిగా అనిపించింది. కులీకుతుబ్‌షా అర్థంలేని చింతలతో మునిగి ఉన్నారు. దోపిడీదార్లు ఇప్పుడు ఇక్కడి నుంచి, చాలా దూరం నుంచి వెళ్ళిపోయారు, వందల మైళ్ళ దూరం వెళ్ళిపోయారు. ఢిల్లీ నగరం తిరిగి ఒక కొత్త రూపాన్ని ధరిస్తుంది.

ఆ నగరపు హృదయు సవ్వడులు రేడియో అన్ని వైపులా వ్యాపింపచేస్తుంది. సోఫాపై పడుకుని కళ్ళు మూసుకొని, ఇంకా మా పైన ఏ రెజిమెంట్ అధికారం చెల్లదు, ఆ కాలం వచ్చేస్తుంది. అని ఆలోచించసాగారాయన. ఇప్పుడు ఆసఫియా సల్తనత్ తిరిగి తన గత వైభవాన్ని పొందుతుంది. ఇప్పుడు నెహ్రూ గాంధీలలో ఢిల్లీకధిపతి ఎవరవుతారో? ఆ కాబోయే షహన్‌షా, వస్త్రధారణ తప్పక రాముడు, కృష్ణుడిలా వుంటుంది. నెమలి సింహాసనాన్ని ఆగ్రా నుంచి తీసుకువస్తారు. నెహ్రూ అడుగుజాడలలో నడుస్తారేమో కాని సర్దార్ పటేల్ రామ రాజ్యానికి ప్రాధాన్యత ఇస్తాడు. భగవదనుగ్రహం వల్ల వెయ్యి సంవత్సరాల అనంతరం ఆర్యుల పాలన తిరిగి రాబోతోంది. కౌరవ - పాండవులు

అదృష్ట పరీక్ష జరగబోతున్నది. ఎవరు గెలుస్తారో?

ఈ సమయంలో ఎలాగోలాగ హాజరత్ ఢిల్లీపై దాడి జరిపి యావత్ భారతదేశ పాలనా భారాన్ని కైవశం చేసుకుంటే అసఫియా వంశపు ప్రతిష్ట నెలకొంటుంది. అలా జరిగితే బాగుండుననుకున్నారు వాహిద్ హుసైను. ఈ విధంగా జరిగితే వాహిద్ హుసైను గౌరవం, సంపద వంశ ప్రతిష్ట రక్షింపబడుతాయి. కాని ఆయన ఎప్పుడు ఈ విషయం చర్చించినా,రాషీద్ విసుగ్గా మీరు అలాగే మౌనంగా తమాషా చూస్తుండండి. నాన్నగారు అనేవారు.

'అయితే మనందరి పనీ అయిపోయినట్టేనా!'

ఐవానే గజల్‌లో కూర్చొని రాషిద్ ఎవరితోనో చర్చలలో మునిగివున్నాడు. చూడండి దొరగారు మీదైపోతుంది? ఎటుచూసిన లాభమే, లాభం. జాగీర్లు పోతేనేం ప్రభుత్వం ఏదో గొప్ప హోదా ఇవ్వనే ఇస్తుంది. మీరు వెంటనే ఢిల్లీకి పయనమవ్వండి అక్కడ బోలెడన్ని మంత్రిపదవులు పంచిపెట్టడం జరుగుతూంది. రాషిద్ నవాబు మీరేం అంటున్నారు? మల్లేశం గాభరాగా అడిగాడు.

'మహానుభావా! మీలాంటి పెద్ద మనుషులకు ఏం బెంగా? జాగీర్లుపోతే గొప్ప హోదాలు లభిస్తాయి. ఇబ్బందల్లా మాలాంటి చిన్న జాతి హిందువులకే. ఢిల్లీలో రామరాజ్యం స్థాపిస్తారుటగా?' మల్లేశం దిగులుగా అన్నాడు.

'అబ్బే, ఇక మీదే రాజ్యం,' రాషిద్ వ్యంగ్యంగా అన్నాడు. నెహ్రూ సోషలిజం సమర్థిస్తారు. ఇంక మతం గితం ఏముండదు! పాకీవాళ్ళు, మాదిగాళ్ళు, బ్రాహ్మలు అంతా ఒకే కులస్తులుగా భావించటం జరుగుతుంది.

లోపల హాలులో కుర్చీలో నడుం వాల్చి వున్న వాహిద్ హుసైన్ రాషిద్ మాటలు వింటున్నారు. ఆయునకు గుండె దడగా వుంది. అకస్మాత్తుగా రక్తపోటు పెరిగిపోయింది.

'వెళ్ళండి జనాబ్! ఇంక మీరంతా ఢిల్లీ దయచేయండి రాషిద్ మల్లేశంతో అంటున్నాడు. మీతోపాటు అసఫియా సల్తనత్‌కి న్యాయం జరుగలేదు. ఇప్పుడు ఇంక మీరు ఢిల్లీ దర్బారులో నవరత్నాలలో ఓ రత్నమవుతారు. ఇక మేము కూడ ఒక స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుంటాం.

అందులో వేలుపెట్టే హక్కు ఆంగ్లేయుడెవడికీ ఉండదు.

వాహిద్ హుసైన్ ముఖంలో చిరునవ్వు కదలాడింది. ఆయనకు నిజంగా తన కుమారుడు అసఫియా సల్తనత్ ఒక కిరీటాన్ని శిరస్సుపై ధరించినట్టు అనిపించింది.

'చూస్తూండండి, హైదరాబాదు బంగారు నాణ్యాల చెట్టనుకుని దులుపుకోవడానికొచ్చే హిందూస్తానీలు మెల్లగా మటుమాయు మయిపోతారు.' వాళ్ళకు కూడా ఒక అక్బర్ ఆజమ్ ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించి, ఒకే ఒడ్డున హిందువులకు మహమ్మదీయులకు నీరు తాగిస్తాడు. కనుక ఇక మీదట ఇక్కడ ఎప్పుడూ జరిగే హిందు ముస్లీం పోరాటాలు సమసిపోతాయి.

హిందూస్తానీయులు ఈ గౌరవాన్ని తలచుకుంటేనే వాహిద్ హుస్సైనుకు ఆశ్చర్యం ఆశ కలిగాయి. వెళ్ళిపోయే ఇంగ్లీషువాడి ద్వారా వత్తిడి తీసుకువస్తే రాషీద్‌కు ఎక్కడైనా మంచి హోదా లభించగలదు.

'బాబూ మీకు పని జరగడమే ముఖ్యం...' అవును, నిజమే, సమయమాసన్నమయ్యే వరకు వేచి వుండాలి.

గదిలో రాషిద్, మల్లేశంల మాటలు ఆగిపోయాయి. వారికే ఆపద గోచరించిందో తెలియదు. లోపల గదిలోంచి చాంద్ మెల్లిగా పాడుకుంటుంది.

'అప్పుడే సాయంత్రమై పోయిందా?'

వాహిద్ హుసైన్ ఉలికిపాటుతో ఆలోచించసాగాడు. అవును అస్తమిస్తున్న సూర్యుని కిరణాలు పచ్చదనం ఆయన కేశాలపై పడింది. ఏ యవ్వనపు వేడిలో ఆయన పదునాలుగు బయాజ్‌లు పూర్తి చేశారో ఆ వేడి చల్లబడిపోయింది. చాంద్, గజల్ సాహిద్... చిన్నారి తారలు నవ్వుతూ రాత్రి అవుతుంది... రాత్రి అవుతుందని ఆయనతో అంటున్నాడు.

తెల్లవారగానే రాషిద్ ఏదో పనిమీద వరంగల్లు వెళ్ళిపోయాడు. హామిద్ పెళ్ళి నిశ్చయమయిపోయింది. రజియా పెళ్ళి పనులలో మునిగిపోయింది. బీబీకి ఎదురుగా మెరుస్తున్న చెమికీలతో రంగురంగుల బట్టలువున్నాయి. టిఫిన్ పూర్తి అవగానే శీతాకాలపు ఎండకోసం వాహిద్ హుసైన్ కరివేపాకు చెట్టుకిందికి కుర్చీనీడ్చుకునేసరికి కుంటత్త కూడ దగ్గరకొచ్చి కూర్చుంది.

చాలాకాలం తరువాత కుంటత్త ఇంట్లో దాసీలు, పనిపిల్లలు ఉండాలని అందువల్ల తమ గొప్పతనము వ్యక్తమవుతుందని రోజస్తమానం తను గదమాయిస్తూ ఆజ్ఞాపిస్తూ వుండవచ్చని - పట్టుపడుతుంది. అల్లా దయవల్ల ఇపుడు ఇంట్లో ఏ లోటూ లేదు. రాషిద్ బాంచాహెబ్‌తో కలిసి బీడీ సిగరెట్ల ఫ్యాక్టరీ ప్రారంభించడమేమిటి ఐవానే గజల్ కదులుతున్న పునాదులు గట్టిబడ్డాయి. పరిస్థితులు చక్కబడ్డాయి. చూస్తుండగానే అతను బంజారా హిల్స్‌లో ఒక బంగళా కట్టి అద్దెకిచ్చేశాడు. కొత్త కారు కొన్నాడు. ఫౌజియా పెళ్ళికోసం యాభైవేలు బ్యాంకులో వేశాడు.

'అన్నయ్యా నాకు దాసీ పిల్లలు కావాలి. అల్లా రక్షించుగాక మనషాహీన్ పాషా పెద్దవాడవుతున్నాడు. అతన్ని రాషిద్‌లాగా రసికత లేనివాడిలాగా పెంచను. మీలాగే రాషిద్‌ను కూడా భార్యా విధేయుడుగా తయారుచేశారు. మీరీనాడు అహమద్ నవాబుకు ఉత్తరం వ్రాయండి.'

అరే, అహమద్ మియా వద్ద బానిస పిల్లల పంటేమైనా పండుతూందా! గౌహర్ బేగమ్ మీరు బానిస పిల్లలను పోషించే కాలం మారిపోయింది. విసుగ్గా అన్నారు వాహిద్ హుసైన్.

'మీరు వ్రాయండి... ఉజాలా భాభీ పదిమంది పిల్లలను పంపిస్తారు లేకపోతే ఆ దరిద్ర గొట్టు కైసర్‌నే పంపిస్తారు. నే చెప్పుకింద అణిచిపెట్టి దాన్ని సరి అయిన దారిలోకి తీసుకొస్తాను.'

సరిగ్గా అదే సమయానికి షాహీన్ అహమద్ నవాబు ఉత్తరం తీసుకొచ్చాడు. ఆ వుత్తరాన్ని తాతగారిపై విసిరేసి బయటకి పరిగెత్తాడు. ఇంగ్లీషు మీడియం చదువుతున్న కారణంగా అహమద్ నవాబు గొలుసుకట్టులో రాసిన ఉత్తరం ఎపుడు చదవలేక పోయేవాడు. ఆ కారణంగానే వాహిద్ హుసైన్ అతన్ని అక్షర జ్ఞానశూన్యుడని, గాడిదనీ అంటుండేవాడు.

'భాభీ త్వరగా రా అహమద్ భాయి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.' కుంటత్త నమాజు చదవటానికి సిద్ధమవుతున్నట్టు తలమీద చీర కప్పుకుంది.

అల్లా కరుణ చూపుగాక! చిన్న నవాబు అవసరం వుంటేనే ఉత్తరం వ్రాస్తారు. బీబీ, కిళ్ళీ చేత్తో పట్టుకుని వాహిద్ హుసైన్ వెనుకగా వచ్చి నిలబడింది.

ఎందుకనో ఆయన ఉత్తరం విప్పడానికి కంగారుపడుతున్నారు. ఉత్తరాన్ని ఒడిలో పెట్టుకుని ముందుగా పళ్ళ మధ్య ఇరుక్కున్న వాటిని తీసి పళ్ళు శుభ్రపర్చుకొంటున్నారు. పిమ్మట జేబులోంచి రుమాలును తీసుకొని మొఖం మీద పట్టిన చమట తుడుచుకుని రుమాలా యధాప్రకారము మడిచి జేబులో పెట్టుకున్నాడు. అప్పుడు కళ్ళజోడు పెట్టుకొని చిరునామాను సరిగా చదివారు! 'బామూలా హిజా - ఏ - గరామీ, బిరాదర్ మఆజమ్ దమేదిల్ ఎహితిరామ్ హాజరత్ ఖిబ్లా - ఓ - కాబా నవాబు హుసైను ఖా! షాహెబ్ మదజిల్లా మాజిల్లకమ్.'

'అబ్బా వీడి దస్తూరి అసహ్యంగా వుంది.' కళ్ళజోడు సరిగా పెట్టుకుంటూ అన్నాడు ఆయన.

'అల్లాహ్ తోబా... ఇంక త్వరగా చదవండి బాబు...' బీబీ తొందరపెట్టింది. 'ఆయన జాగ్రత్తగా కవరు చింపి, ఉత్తరం తీసి చదవడం ప్రారంభించారు.'

'హాజరత్ ఖిబ్లా ఓ - కాబ్లా... తరువాత సలామ్ - ఓ - కదమ్ బోసీ (పాదాభివందనం) అనంతరం ఇక్కడ క్షేమ సమాచారం తెలిపిన పిదప అక్కడి క్షేమాన్ని కాంక్షిస్తు వివరించునది ఏమనగా ప్రస్తుతము విషమ పరిస్థితులను ఎదుర్కొంటూ కాలము...' క్రమక్రమంగా ఆయన గొంతు వినపడకుండా పోయింది. కేవలం ఆయన పెదవులు మాత్రము వణుకుతున్నాయి. అహమద్ హుసైన్ రాసిందాన్ని ఆయన కళ్ళతో గ్రహిస్తున్నారు.

'వూరుకున్నారే? గట్టిగా చదవండి బీబీ విసుగ్గా అంది.'

'ఉహ్! వాహిద్ హుసైన్ మోముపై ముడుతలు అధికమయ్యాయి. ఆయన కళ్ళజోడు యాంగిల్ మార్చి ఇంకేదైన చదువుదామని చాలాసార్లు ప్రయత్నించాడు. చిన్న నవాబు చేతివ్రాత చాలా అసహ్యంగా వుంది. కాని నేడు ఒక యాట కూడా సందేహాస్పదంగా లేదు.'

'అల్లాహ్‌మియా... కరుణించు... అసలేమైందంటే?... బీబీ గుండె కొట్టుకోవడం ప్రారంభించింది. చిన్న నవాబు ఆస్థికి, అక్రమ వారసుడు అంతమైపోయి ఉండవచ్చునన్న ఆశాకిరణం, కుంటత్త హృదయంలో తళుక్కుమని మెరిసింది. కాని భగవంతుడి ఇంతటి దయ నమ్మశక్యం

కాకుండా ఉంది.'

'ఏదైన చెప్పండి బాబూ, నా ఊపిరి ఆగిపోయేటట్టుంది.' కుంటత్త కంగారుగా అంది.

ఆయన ఉత్తరాన్ని మడిచి కవరులోపెట్టి కళ్ళద్దాలు తీసారు. ఇంట్లో నిశ్శబ్దం తాండవిస్తూంది. వాహిద్ హుసైన్‌కి ఇంటిల్లిపాదీ మెళుకువగా ఉన్నట్టు... కొందరు ఆలోచిస్తున్నట్టు కొందరు మాట్లాడుతున్నట్టు కనబడుతూంది.

'ఏమిటయ్యేది... అదే... దౌర్భాగ్యురాలు కైసర్...'

'కైసర్...? అందరూ ఉలిక్కిపడ్డారు.'

కైసర్‌కేమైంది. చెప్పండి! మీరు ఉత్తరం నాకిచ్చెయ్యండి! బీబీ ఉత్తరం తీసుకుందామనుకుంది, వాహిద్ హుసైన్ లాగేసుకున్నారు.

'ఆ పిల్ల ఇపుడు కమ్యూనిస్టులలో చేరిపోయింది. అంతేకాకుండా అక్కడ విపరీతంగా గొడవ చేస్తూంది.'

బీబీ, కుంటత్త ఆశ్చర్యంతో నోళ్ళు తెరుచుకుని ఉండిపోయారు.

'ఈ ఫాతిమా బేగమ్‌కి ఏమయ్యింది, వయసులో ఉన్న పిల్లని కమ్యూనిస్టులలోకి పంపించేసింది.'

ఆ దరిద్రగొట్టుది మనకే శత్రువైపోయింది. రాత్రికి రాత్రే గులామ్ రసూల్‌ని తీసుకుపోయి ఎక్కడో దాచేసిందని చిన్న నవాబు వ్రాశాడు. దుండగీడుల గొడవలు ఎంత ఎక్కువైపోయాయంటే మేము రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపోలేకుండా ఉన్నాం. రెండు వారాలనుంచి గ్రామానికి వెళ్ళలేక పోతున్నారు.

బీబీ శూన్యంలోకెటో చూస్తూంది. ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని ఉండిపోయింది. మెడలోని నల్లపూసల దండ ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో బాటు కదలసాగింది.

రజియా పెళ్ళి ఏర్పాట్లు కోసం ఎక్కడికో వెళ్ళిపోయింది.

'హాల్లో కూర్చుని ఆవిడ ఆలోచించింది, అసలీ కమ్యూనిస్టులెవరు? అహమద్ నవాబ్‌తో శత్రుత్వమెందుకు? అయ్యో అనవసరంగా ప్రాంగణంలోంచి లోపలికొచ్చి పొరపాటు చేశాను. అన్నయ్యతో ఈ విషయమై చర్చలు జరిగి ఉండేవి.'

అకస్మాత్‌గా పచ్చ నీలి రంగు జార్జిట్ చీర కట్టుకుని చెదిరిన జుట్టుతో, కళావిహీనమైన ముఖముతో, లోపలికొస్తున్న చాంద్ కనిపించింది. ఆమె రెండు మూడు రోజుల్నుంచి ఇంటికి రాలేదు. ఆమెను తిట్టే అధికారం తనకు మాత్రమే కాదు, వాహిద్ హుసైన్, రాషిద్‌లకు కూడా లేదు. చాంద్‌కి వ్యతిరేకంగా రెచ్చగొట్టాలనుకుంది కుంటత్త. వెండి పాన్‌దాన్ని తనవైపు లాక్కుని ఆమె బీబీతో అంది, ఆ ముదనష్టపు ప్రియుడు, నాలుగురోజుల తరువాత మీ మనుమరాలికి ఇంటికి వెళ్ళడానికనుమతి ఇచ్చాడు.

బీబీ చాలా కంగారుగా కుంటత్త కేసి చూసింది, చాంద్ గదికేసి చూసింది, తర్వాత రాషిద్ మాటలు వినడంతో నిమగ్నమైంది.

కుంటత్త గాభరాపడింది. ఏదో ముఖ్యమైన వార్తే, అందుకే చాంద్ రాక నెవరూ గమనించలేదు. ఆదేమిటో తెలుసుకోవడానికామె కర్ర సహాయంతో కాళ్ళీడ్చుకుంటూ తిరిగి వారి వద్దకు వచ్చి, ఏమైంది... ఏమిటి విషయం?

'ఏం లేదు! మురికిగా ఉన్న ఆమె చేతిని, తన తెల్లని షార్క్-స్కిన్ షెర్వానీ మీదినుంచి విదిలించేశాడు రాషిద్.'

'గౌహర్ బేగమ్, త్వరగా నాలుగు కప్పులు మంచి టీ చేయించి బైటికి పంపించండి.' బీబీ ఆమెను అక్కడినుంచి పంపే ఉద్దేశ్యంతో అంది.

'కాని వచ్చిందెవరు? విషయం తెలుసుకోకుండా అక్కడి నుంచి కదలడానికిష్టపడని కుంటత్త అడిగింది.'

వ్యాపారస్థులొచ్చారు, గౌహర్ బేగమ్! రాషిద్ నవాబు వారివద్ద నుంచి బట్టలు మందులూ కొంటున్నారు. వాహిద్ హుసైన్ బోధపర్చారు.

'అలాగే... గౌహర్ బేగమ్ పొయ్యికేసి వెళ్తూంది, కాని అసలు విషయమేదో తననుంచి, దాస్తున్నట్టామె పసికట్టింది. రెండు మూడు రోజుల్లో రాషిద్ బంజారాహిల్స్‌లోని ఇంటిని ఖాళీ చేయించి, పెట్రోల్, మందులు ఆయుధాలతో నింపేశాడు.'

రాత్రి అందరూ విశ్రాంతిగా కూర్చున్నప్పుడు రజియా, బీబీ, గౌహర్ బేగమ్‌లకు వార్తా పత్రిక భీతిగొల్పే వార్తలు చదివి వినిపించేది. దేశవ్యాప్తంగా జరుగుతున్న అల్లర్లు తిరుగుబాట్లు గురించి విని అందరి

గుండెలు కొట్టుకునేవి.

'అరే మధ్యే మార్గంగా రక్షించ గలిగేవారంతా మరణించారా ఏమిటి?' కుంటత్త గాభరాగా అడిగింది.

'గాంధీగారు ఎంతో బోధపరుస్తున్నారు అని వినికిడి. తిరుగుబాటుకి మారుగా ఆయన స్వయంగా వెళ్ళి మహమ్మదీయులను మృత్యువు నోట పడకుండా కాపాడుతున్నారు,' రాషిద్ ద్వారా విన్న మాటలను రజియా చెప్పింది.

'ఉహ్! ఇక్కడంతా వాతావరణం శాంతియుతంగానే ఉంది' ఆ దెబ్బలాడే వాళ్ళు ఇక్కడికొచ్చేస్తారో ఏమో!' కంగారు పడుతూ అంది బీబీ. పడక్కుర్చీలో కళ్ళు మూసుకుని పడుకుని వార్తలు వింటున్నాడు వాహిద్ హుసైన్. రేడియో కట్టేస్తే వార్తాపత్రిక పట్టుకునేవారు. భారతదేశమంతటా తిరుగుబాట్లు జరుగుతున్నాయి. శరణార్ధులైన ఎంతోమంది హైదరాబాదు వచ్చేస్తున్నారు. హైదరాబాదు ప్రేమతో అందర్నీ ఆదరిస్తుందన్న విషయం అందరికీ తెలుసు. ఈ శరణార్ధులు ఢిల్లీలోని పేరు ప్రతిష్టలుకల వంశాలకు చెందినవారు. తమ వంశం గౌరవ ప్రతిష్టలను కాపాడుతూ ప్రాణాలను సహితం లెక్కచెయ్యనటువంటివారు. కాని నేడు వారి స్త్రీలు తమ బిడ్డల ప్రాణాలను రక్షించుకునేందుకు దుప్పట్లతో మొఖం కప్పుకొని, చేతులు జాపి, వీధులలో తిరుగుతున్నారు. నగరంలో చాలా చోట్ల శరణార్ధుల కోసం క్యాంపులు ఏర్పాటు అయాయి. ప్రజలు ముందుకొచ్చి విరివిగా విరాళాలిస్తున్నారు. బట్టలు, ఆహారధాన్యాలు పంచిపెడుతున్నారు.

రాషిద్ కూడా క్రమంగా ఆందోళన చెందసాగాడు. ఒకప్రక్క కమ్యూనిస్టులు, జిల్లాలో చెలరేగుతున్నారు, వేరొక ప్రక్క ఇండియన్ యూనియన్ జమీందారీలనీ, సంస్థానాలనీ ఏకం చెయ్యాలని పట్టుపడుతూంది. ఈ క్లిష్ట పరిస్థితులు హింసారూపాన్ని ధరించేటట్టున్నాయి. కాసిమ్ రిజ్వీ ఉద్రేకపరిచే క్రోధపూరితమైన తన ఉపన్యాసాలతో ప్రజలను రెచ్చగొడుతున్నారు. ప్రతి యువకుడికి, సైనిక కవాతు అనివార్యం అయింది.

పదమూడు-పధ్నాలుగు సంవత్సరాల వయసు కల షాహీన్ కూడా పొద్దున్నే లేచి రజాకార్ల దుస్తులు వేసుకుని ఎన్‌సీసీ ట్రైనింగ్‌కి

వెళుతున్నాడు.

షాహీన్‌ని రజాకార్ల వేషంలో చూస్తే ఎందుకనో వాహిద్ గుండె కొట్టుకునేది. తమ గౌరవాన్ని కాపాడుకోవడానికి ఇదొక్కటే మార్గం? ఆయన తన జీవితంలో ఎన్నో కష్టాలనెదుర్కొన్నారు, కాని తన సంతానానికెక్కడా ఇంత నీడ కూడా దొరకదు, అనే విషయాన్ని ఊహించలేకపోయారు. ఆయన ఎటువెళితే అటు కత్తులు స్వాగతం పలుకుతాయి. మృత్యువు ఆయన మార్గాన్ని అడ్డగిస్తుంది. అసలీ యుద్ధంలో మేమెందుకు పాల్గొనాలి? పైప్ వెలిగించుకుంటూ ఆయన ఆలోచించేవారు, నాలాంటి సామాన్య మానవులు రాజకీయాలతో పార్టీలతో సంబంధం లేకుండా, తమ ఇళ్ళలో తోటలు పెంచుకుని, ఏ చెట్టునీడనో కూర్చుని గజళ్ళు వ్రాసుకుంటూ భార్యా బిడ్డలకు సంబంధించిన విషయాలలో మునిగి తేలుతున్నవారు, ఈ యుద్ధంలో ఎటువంటి పాత్ర నిర్వహిస్తారు? ఎవరి తరుపున యుద్ధం చేస్తారు? కొంతసేపైన తరువాత ఆయన ఎంతో విచారంగా రాషిద్‌ని అడిగేవారు, ఏమయ్యా! నిజంగా సల్తనత్ - ఆసఫియా దక్కదా?

తమ వంశంలో సల్తనత్ - ఆసఫియా గౌరవ ప్రతిష్టలు జీర్ణించుకుపోయాయని రాషిద్‌కి తెలుసు. అంచేత అతను తండ్రికి ధైర్యం చెబుతూండేవాడు, 'కంగారు పడవలసిన అవసరం, లేదు నాన్నగారూ! కాసిమ్ రిజ్వీ ఎట్టి పరిస్థితులలోను తన ఓటమినంగీకరించరు.

'కాని మియా! పోలీస్ యాక్షన్ హస్తగతం చేసుకుంటామని కాంగ్రెస్ వాళ్ళు సరిహద్దుల్లో సైన్యాన్ని సమాయత్తపర్చమని ఉత్తర్వులు జారీ చేశారు.' నిన్న ఇండియా రేడియోలో చెప్పారు.

హ్! అన్నీ భయపెట్టేందుకు చెప్పేమాటలే! రాషిద్ లెక్కలేనట్టనేసి బైటికి పరుగెట్టేవాడు. హైదరాబాదు, ఆర్థిక సంబంధాల విచ్ఛేదం జరగబోతూందన్న వార్త భీతిగొల్పుతూంది.

అయ్యో ఈ దరిద్రపు గూండాలు యజీద్ సంతతిలాగున్నారు. భాయీ పాషా! మీరు ఒక రూపాయి మిఠాయి తెప్పించండి నేనొక జపం చదువుతాను. కుంటత్త బీబీతో, నావజీఫా మంచి శక్తివంతమైంది. ప్రాణాంతకమైందీను, రాత్రికిరాత్రే నిషేధపు ఉత్తర్వులన్నీ మాయ

మైపోతాయి, అంది.

అత్తమాటలు విన్న రాషిద్ భోజనం చేస్తున్నవాడు, ముద్ద చేత్తో పట్టుకునే లేచి ఆమె వద్దకు వెళ్ళి కింద కూర్చుని అడిగాడు గౌహర్ అత్తా! నీకోసం, షాహీన్‌కోసం బంజారాహిల్స్‌లో ఇంకొక బంగళా కట్టించనా?

'అయ్యో! ఇవాళ నన్నెందుకడుగుతున్నావయ్యా!' అత్త, మేనల్లుడీ విధంగా తననడగడం చూసి లోపల్లోపల ఆనందపడుతూంది.

'ఫౌజియా కోసం మరొక యూబైవేలు తెచ్చియ్యనా?' అత్తకి నవ్వొచ్చింది? రాషిద్ ఇవాళెంత వేళాకోళంగా మాట్లాడుతున్నాడు!

'ఫౌజియా సారెలో బంగళా, కారు తీసుకువెళ్ళాలని మీరు కాంక్షించేట్లయితే వజీఫా వగైరాలేమీ వద్దు.'

'అయ్యో!... అదెందుకయ్యా? ఆశ్చర్యంగా అడిగింది అత్త.

'ఎందుకంటే... పెట్రోలు, మందులు, ఇతర వస్తువులు హిందుస్తాన్ నించి వచ్చేట్లయితే మేము ముందునుంచీ భద్రపరిచిన ఈ సరుకేం కావాలి?

'కాని మందులు లేకపోతే రోగులగతేంగాను?'

'భగవదేచ్ఛ!, రాషిద్ చేతులు రెండూ, పైకెత్తి ఇంటికప్పుకేసి చూస్తూ ఎంతో నమ్మకంగా అన్నాడు. మృత్యువు మందుల వలన తప్పిపోతుందనుకుంటున్నాడు.' మృత్యువు మందుల వలన తప్పిపోతుందనుకుంటున్నారా? ఇవన్నీ మనస్సుకి ఊరట కలిగించే మాటలు.

'సరే బాబూ! నేను వజీఫా చదవను! నువ్వెళ్ళు భోజనం చెయ్యి!'

నేనొకమాట చెబుతాను విను బాబూ! యూనియన్ సైన్యం వచ్చేసిందంటే షాహీన్, అయాజ్‌లను పట్టుకుంటుంది కదూ! వీళ్ళు వేసుకుంటున్న రజాకార్ల డ్రెస్ తీయించెయ్, బీబీ మెల్లిగా అంది.

'అరే, మర్చిపోదూ, ఇవన్నీ! యూనియన్ సైన్యాలొస్తే మాత్రం మనల్నేం చేస్తాయి? మీరు నా మాట నమ్మండి, నేనన్ని విషయాలూ గమనిస్తున్నాను.' నిజంగానే రాషిద్ అన్ని విషయాలు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

అతడు ఇత్తెహాదు-ఉల్-ముసల్మీన్ మెంబరు. సభలు జరిపిస్తున్నాడు, విరాళాలు సేకరిస్తున్నాడు, వీటితోపాటు కాంగ్రెసు ఆఫీస్ కమిటీకి

అధ్యక్షుడు, సంస్థానాలని కలిపెయ్యడానికి సంబంధించిన ప్రతినిధి మండలి, చర్చలు జరపడానికి ఢిల్లీ పయనమైతే అందులో అతనున్నాడు. ఆర్థిక సంబంధాల విచ్ఛేదం జరిగినప్పుడు రాషిద్, మల్లేశం కలిసి బాగా లాభం పొందారు. ఇత్తిహాద్-ఉల్-ముసల్మీన్ ద్వారా పెట్రోల్, సారా ధరలో అమ్మారు. రేడియో ఎంత గట్టిగా పెట్టేసేవారంటే అన్ని గొడవలు, ఆలోచనలు ఆ గోలలో అణిగిపోయేవి. ఆయన బైటికి రావడం పూర్తిగా మానేశారు. పోలీస్ కార్లు, ట్రక్‌లు, పెరుగుతూన్న అలజడ్లు చూస్తే భీతి కలిగేది. ఎటు చూసినా ప్రజలు భయపడుతున్నారు. అటువంటి పరిస్థితుల్లో ఎవరికీ ముషాయరా కాని, సాంస్కృతిక కార్యక్రమాలు కానీ గుర్తొచ్చేవి కావు.

ఇంట్లో, అయాజ్, షాహీన్‌లు రోజంతా గొడవ చేస్తూండేవారు. వాళ్ళిద్దరికీ ఇదొక ఆటగా ఉంది. ఫైరింగ్ ప్రాక్టీసొకటి గొంతు చించుకుని పాడుతూండేవారు!

'తా అబద్ ఖాలికీ - ఆలమ్ యహ్ రియసత్ రఖే.'

దక్కన్ రేడియో నుంచి ఇబ్రాహీమ్ జలీస్ ఒక ప్రోగ్రామ్ ప్రసారం చేసేవారు! అది వినడానికి ఇంటిల్లిపాదీ వాహిద్ హుసైన్ చుట్టూ మూగేవారు.

రాత్రిళ్ళు హైదరాబాదులోని శరణార్థులు రేడియో ద్వారా తమ ఇళ్ళకి సందేశాలు పంపుతుంటే, బీబీ, కుంటత్త కళ్ళు తుడుచుకునే వారు. తమ వారు విడిపోయి దూరంగా వచ్చి పడే దుస్థితి అల్లా ఎవరికీ కలిగించకూడదనుకునేవారు. ఈ యుద్ధాల ఆటేమిటి! అని కుంటత్త ఆయాజ్ షాహీన్లను తిట్టడం మొదలెట్టేది. కాని ఇప్పుడు షాహీన్ కూడా ఇంట్లోని ఇతర వ్యక్తులలాగ కుంటత్త మాటని పట్టించుకోవడం మానేశాడు. అతడిప్పుడు పదిహేను, పదహారు సంవత్సరాల, ఉంగరాల జుట్టున్న తెలివైన వ్యక్తిగా ఎదిగిపోయాడు.

హైస్కూల్ పరీక్ష ఇవ్వబోతున్నాడు. అతని నిక్కర్లు, షేర్వానీలు చిన్నవయిపోయాయి. ఇప్పుడు అతను బంతి, రెండు చక్రాల చిన్న సైకిల్‌కి బదులుగా క్రికెట్ బ్యాట్ తెచ్చుకొని సాయంకాలాలు తోటలోంచి వెళుతూ వేళ్ళాడుతున్న మామిడి కాయల్ని కొడుతూ వుండేవాడు. ఈ మధ్య ఆయాజ్ షాహీన్‌లు బాగా అలసిపోయారు. ఈ ఇంట్లోని వారెవ్వరు

ఆయాజ్‌కెప్పుడూ ప్రోత్సాహమివ్వలేదు. షాహీన్ కూడా. ఆయాజ్ నివసిస్తున్న ప్రదేశంలో ఇత్తిహాద్-ఉల్-ముసల్మీన్ క్యాంపు ఉండేది. అక్కడ సైనిక శిక్షణ ఇచ్చేవారు. ఆయాజ్ రజాకారులలో చేరిపోయాడు. అతనికి ఉత్తేజపరిచే కాశిమ్ రజ్వీ ఉపన్యాసాలన్నీ కంఠస్తం వచ్చు.. సల్తనత్ ఆసఫియా కోసం తమ చిట్టచివరి నెత్తురు బిందువును కూడా ధారపోయడానికి సిద్ధంగా వున్న తమపేటలోని కుర్రాళ్ళందరికీ అతడు నాయకుడు. సైనిక దుస్తులు ధరించి తన గదిలోంచి బయటికి వచ్చిన ఆయాజ్‌ను చూసిన గజల్ వణికిపోయేది. ఇతడు నిజంగానే యుద్ధానికి వెళ్ళేవాడేమోనని!

చాలా రోజుల తరువాత ఒకనాడు గజల్ ఐవానే గజల్ వెళ్ళింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. కుంటత్త కూడా వక్కలు కత్తిరించుకుంటూ మౌనంగా కూర్చుని ఉంది. గజల్ రాకను ఎవరూ గమనించలేదు.

గజల్, ఫౌజియా తోటలోకి వెళ్ళి ఒక మూల కూర్చొని ఎండుటాకుల మధ్య క్రింద పడి ఉన్న నైట్‌క్వీన్ మొగ్గలు ఏరుకోవడము మొదలుపెట్టారు. చిన్నప్పుడు తీరికవేళలలో వారీపని ఎంతో తన్మయత్వంతో చేసేవారు. పనిమనిషి మొత్తం మొగ్గలను ఏరుకున్న తర్వాత వాటినేమూలో పారేసేవారు, పనిమనిషి లచ్చమ్మ వాటిని ఊడిచివేసేది.

'చాంద్ ఆపా వెళ్ళిపోయింది!'

'ఎక్కడికి?' గజల్ చేతులు అలాగే బిగుసుకుపోయాయి. సంజీవాని పెళ్ళి చేసుకున్నట్టూ, అతనితో ఉండటానికి డాడీకి ఉత్తరం వ్రాసింది.

'అల్లా... నిజంగానే! చాంద్ ఆపా పెళ్ళి విషయం విని సంతోషంతో గంతులెయ్యసాగింది గజల్.'

'ఉష్...! నిజంగానే ఇది ఏమైనా సంతోషించదగ్గ వార్తా?' ఫౌజియా మూతివంకర తిప్పుతూ అంది. ఫౌజియా సూటిగా ఉన్న ముఖంలాగే ఉంది ఆమె ప్రవర్తన కూడా. మాటిమాటికీ కనుబొమ్మలు చిట్లిస్తోంది.

సంజీవా వెధవ మొహం! డాడీ, చాంద్ ఆపాను ఇంతెప్పుడూ ఇంట్లోకి రానివ్వరు. ఆ రోజు చాంద్ ఆపాని డాడీ ఎలా తేకలేశారో నీకు జ్ఞాపకముందా?

గజల్‌కి ఆ దృశ్యమంతా కళ్ళకు కట్టినట్లు ఉంది. సంజీవా ఎలా వచ్చి కూర్చున్నాడో రాషీద్ చేయిచాపి పట్టుకుని తీసుకొచ్చి అక్కడ పడేశాడో

జ్ఞాపకం వచ్చింది. దరిద్ర గొట్టు పిల్లా? ఈ కమ్యూనిష్టు పిల్లిక్కడికితీసికొచ్చిమా అందరి ప్రాణాలు తీసేస్తున్నావు. జాగ్రత్తగా విను, మరోసారి వాడిక్కడికొస్తే, వాడితోపాటు నిన్ను కూడా గెంటేస్తాను.'

బాధతో గజల్ గుండె పగిలినట్లైంది. చాంద్ ఆపాతో ఇలాగ మాట్లాడవచ్చా? చాంద్‌తో కాకుండా గజల్‌తోనే అలా మాట్లాడినట్లు అనిపిస్తోంది. ఆ పిల్లకి మామయ్య అలా ఎందుకు మారిపోయాడో అర్థం కాలేదు. ఒకనాడు సాయంత్రం రాషిద్ భోజనాల సమయంలో తానే విడమర్చి చెప్పాడు. ఖానీ షాయర్ ఇందర్‌లాల్ వగైరా సంగతి వేరు. వాళ్ళు గొప్పవాళ్ళు. వారితో సంబంధాలు పెంచుకుంటే వంద పనులౌతాయి. కాని ఈ కమ్యూనిస్టు కుర్రాడు ఇంటికి రావడం మొదలుపెడితే ఏమవుతుంది?

ఆనాడు అక్కడినుంచి లేచిన తరువాత ఆమె ప్రవర్తన ఎలా మారిపోయిందో! ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది. చాంద్ ఆపా వివశత్వాన్ని చూసి గజల్ కూడా కన్నీళ్ళు కార్చింది. రాషిద్ మామ ఎంత నిర్దయుడో పాపం సంజీవా అంకులు అంత మంచివాడు. చాంద్ ఇతర స్నేహితులలాగా ఆమెను ఎప్పుడు కోప్పడలేదు. అతనెక్కడికి వెళ్ళాలనుకుంటే చాంద్ ఆపా తన చెయ్యి పట్టుకుని కూర్చునేది. ఇది గజల్ చాలాసార్లు చూసింది. రావద్దని ఆయన ఎన్నో సార్లు చెప్పాడు. కాని చాంద్ ఆపా ఒప్పుకునేది కాదు. అలాంటప్పుడు అతని తప్పేముంది? సంజీవా అసహ్యంగా లేడు. చక్కగా వున్నాడు. ఠీవిగా పొడవుగా ఉన్నాడు. కాని చాంద్ ఆపా అభివృద్ధికే గ్రహణం పట్టింది. ఎప్పుడూ దిగులుగా కూర్చొని ఏదో రాస్తూండేది. గజల్‌ని పాత చెప్పులాగ వదిలేసింది.

తాతగారి నోటినుంచి ఆమె పేరుతో ఏదైనా విషపు మాటవస్తే ఆయన కేకరించి ఉమ్మి వేసేవారు. రాషిద్ మామూ ఆమె గదికేసి అసలు చూసేవారే కాదు. చాంద్ ఆపాని తలచుకొని బీబీ నిట్టూర్చేది. తన కుమార్తెలు వచ్చినప్పుడు బాధపడ్డట్టు బాధపడేది చాంద్ విషయంలో. రజియా చాంద్‌తో మాట్లాడడం మానేసింది. కేవలం కుంటత్త మాత్రమే కర్ర సహాయముతో కాళ్ళు ఈడ్చుకుంటూ ఆమె గదిలోకి వెళ్ళి జీవితమంతా గుండెలో దాగిన వ్యంగపు తిట్లు అక్కడ కుమ్మరించి వస్తుండేది. కుంటత్త

ఎంత వాగినా ముఖం పగిలేటట్టు జవాబు చెప్పే చాంద్ ఆపా నాలుక ఏమయిందో బదులు పలికేది కాదు. చచ్చిపోయే ముందు గజల్ కంఠం తల్లి విలపించినట్లు ముఖం కప్పుకొని ఏడ్చేది. అటువంటి సమయంలో గజల్ కూడా ఆమె గదిలోకి వెళ్ళి ఆమెతో తానూ దుఃఖించేది. వాళ్ళిద్దరూ గంటల తరబడి ఏడుస్తుండేవారు. చాంద్ ఆపా ఎందుకు ఏడుస్తుందో ఏనాడూ గజల్ అడగలేదు. ఎందుకు కలసి దుఃఖిస్తున్నావని ఆమెని చాంద్ అడగలేదు.

నేడు చాంద్ ఆపా వెళ్ళిపోయిందని ఫౌజియా చెప్పినప్పుడు, ఆమెకెందుకో ఉపశమనం కల్గినట్లు అనిపించింది.

హాల్లో కుర్చీపీటమీద కూర్చుని కుంటత్త మామిడికాయలు చెక్కుతీస్తూ, ప్రక్కన కుర్చీమీద కూర్చున్న రాషిద్ మామతో వాగుతూంది.

మా జుట్టు ఎండకు పండలేదు బాబు! ముందునించీ చెబుతూనే వున్నాను పిల్లకి ఇంత స్వేచ్ఛనివ్వవద్దని! మామిడికాయల్ని, కత్తిని చాటలో పెట్టి చేతులు నలుపుకుంటూ, పది రోజులైపోయింది. ఈ పాటికి సర్వనాశనం చేసి వుంటాడు ఆ కుర్రాడు.

'ఇంక చాలించండత్తా!' రజియా తన గదిలోంచి కస్సుమంటూ వచ్చి తన దగ్గర కూర్చుంది. అక్కడికి మా చాంద్ ఏదో సీతా సావిత్రి అయినట్లు ఈ విధంగా రోజూ ఎన్ని చేస్తుందో? మనస్సు తిరిగిపోతే తిరిగి మావయ్య దగ్గరకు వస్తుంది.

రాషిద్ ఏమనకుండా మామిడి తొక్కలతో ఆడుతున్నాడు.

'మీరు సంజీవాని అరెస్ట్ చేయించ రెందుకు?' రజియా అడిగింది.

'వద్దు దలిమ్ బేగమ్... అలా అనొద్దు!' బీబీ వణుకుతున్న కంఠంతో అంది. ఇప్పుడు అతడు చాంద్ భర్త జీవించినా, మరణించినా అతడితోనే చూస్తాండు, అదింకెప్పుడూ రాదు. ఎవరి మనుమరాలది?

'అవును ఇద్దరూ సివిల్ మ్యారేజ్ చేసుకుంటారు. రాషిద్ లెక్కలేకుండా అన్నాడు. కాని చాంద్ లెక్క తప్పు, రాచరికస్థాయిలో ఖర్చు చేసే ఫ్యాషనబుల్ అమ్మాయి, ఏ నవాబుకు, జాగీర్దారుకో ఎన్నుకోవలసింది. దర్జాగా బ్రతికేది. అడవుల్లో కొండల్లో దాక్కుంటూ తిరిగే ఆ పిల్లవాడు చాంద్‌కేం పెడతాడు?'

'అయ్యో! వారి వంశములో ఎవరూ ఈ విషయం ఆలోచించలేదు, అదేమి ఆలోచిస్తుంది?' కుంటత్త బీబీ కేసి చూస్తూ బాధగా అంది.

'అసలు తప్పంత మీదే! రజియా అటు తిప్పి ఇటు తిప్పి రాషీద్‌పైనే నింద వేయడానికి ప్రయత్నించే సరికి అతడు కోపంగా వార్తాపత్రికను అందుకున్నాడు. తను నిరపరాధినని రుజువు చేసుకునే వార్త ఆ పత్రికలో ఉన్నట్లు వెతుక్కోవడానికి ప్రయత్నిస్తున్నట్టు, నిజానికి అతని తప్పేం చేయలేదు. చాంద్, తన లక్ష్యాన్ని నెరవేరుస్తున్న కాలం ఆమెకు అండగా వున్నాడు.

ఒక్క రాషిద్ మీదే ఆధారపడి ఉందా? ఆ కాలంలో ఇది ఒక సామాన్యమైన రివాజ్. ఒక ఖ్వాజా నవాబు ఉండేవారు. ఇరాన్‌లో పుట్టిన అందమైన భార్యను స్వయంగా ఉన్నత అధికారులు గదుల్లోకి పంపించేవారు. భార్య గదిలోంచి బైటికి వచ్చేసరికి, ఆమె చేతిలో తన ఉన్నతిని సూచించే శుభవార్త ఉన్న కాగితం తీసుకుని మొట్టమొదట ఆయనే చదివేవారు. ఈ భార్యాభర్తలిరువురు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకునేవారు. ఖాన్ సాహిబ్ ఆ అందమైన జంటను చూసి ఈర్ష్యపడేవారు. కాని రాషిద్ రక్తములో మంచితనం ఉండడం వల్ల తన భార్యనెపుడూ ఏ అధికారికి పరిచయం చేయలేదు. చాంద్‌ని అతనితోపాటు చూసిన ఖాన్ సాహిబ్ పెట్టుబడిదారులు ఆమెని చూసి ఆకర్షితులైతే అందులో అతని తప్పేముంది.

రాషిద్ విననట్టు ఊరుకున్నాడు. కొంత సేపయిన తరువాత ఎవరో షాయర్ని రాషిద్‌కు పరిచయం చేస్తే అవునండీ! మా యింట్లో వందతరాల నుంచి కవిత్వం చెబుతున్నారు. కాని నేను కవిని కాను. నేను కేవలం వ్యాపారస్థుణ్ణి మాత్రమే, వెంటనే ఆ కవి తన మిత్రుడి ఎవరితోనో అంటున్నాడు. ప్రజలు స్త్రీనేవిధంగా దురుపయోగం చేస్తున్నారో! కానీ చాంద్ ఎంత నీచురాలో, ఎటుచూసినా అటు దురాశతో చూస్తుంది. చివరికి నచ్చిందెలాంటి వాడు? ఒక పనికిమాలిన ఆర్టిస్ట్, వాడెటువంటి అర్థంపర్థంలేని మాటలు చెప్పాడు ఆమెకి.

ఆనాడు గజల్ చాలా ఆనందంగా ఉంది. షహజాద్ అపాలాగ చాంద్ కూడా పెళ్ళికూతురై ఉంటుంది. బాజాలు వాయించేవాళ్ళు ఛోడోబాబుల్‌కా

ఘర్, వాయించి ఉంటారు. ఆమె చేతులకి గోరింటాకు ఎవరు పెట్టి ఉంటారో? షహజాదీ ఆపా అప్పచెల్లెళ్ళు కూడా చేతులకు గోరింటాకు పెట్టుకునుంటారు. బోలెడన్ని పాటలు కూడా పాడి ఉంటారు.

అన్ని విధాల విసిగిపోయిన గజల్ స్కూలు విషయాలలో మునిగిపోయింది. ఇప్పుడామె ఎనిమిదవ తరగతిలో చదువుతుంది. క్లాస్ టీచర్ మిస్ రెడ్డికి, అందరికన్నా ప్రీతిపాత్రురాలైన శిష్యురాలు. మిస్ రెడ్డి చాంద్ ఆపాలాగ అందమైనది కాదు కాని తరచు ఆమెలాగే గట్టిగా నవ్వుతూండేది. ప్రతిరోజు ఒక కొత్త చీర కట్టుకునేది. అదే రంగు రవిక వేసుకునేది. తల్లో అదే రంగు పువ్వులు గుబాళించేవి. కానీ ఆమె బట్టలనుండి సువాసనలు మాత్రం ఎప్పుడూ ఒక్కలాగే ఉండేది. గజల్ కళ్ళకి గంతలు కట్టి, వెయ్యిమంది స్త్రీలలో వదిలి పెట్టినా సువాసనని బట్టి మిస్ రెడ్డిని గుర్తుపట్టేది, అందమైన వస్తువులంటే ఆమెకి ప్రాణం. అందుచేతనే మెరుస్తున్న గజల్ శరీర ఛాయ, నిద్రపోతున్నట్లు మత్తుగా ఉన్న కళ్ళు అంటే ఆవిడకి చాలా ఇష్టం. స్కూల్లో ఎప్పుడూ మిస్ రెడ్డి గురించి చెవులు కొరుక్కునే వారు. ఎముకల గూడులాగున్న ఇతర టీచర్స్ నిండుగా ఉన్న ఆమెను తప్పించుకు తిరిగేవారు. ఎక్కువ వయసున్న ఆడపిల్లలు, ఆమె వస్తూంటే, పెళ్ళి ఊరేగింపు వెళుతూంటే ఆగిపోయినట్టే, ఆగిపోయేవారు. ఆమె వెళ్ళి పోగానే గట్టిగా నవ్వులు వినబడేవి. మెడ చూశావా స్కూలు గేటులాగ ఎంత పెద్దగా వుందో?

అందరికీ లోపలికెళ్ళడానికి అవకాశముందని వినికిడి. పెద్ద వయస్సు ఉన్న ఆడపిల్లలు ఆమెను చూసి ఈర్ష్య పడేవారు. చిన్న వయసుకల బాలికలు ఆమె అభిమానులు, అలా హజరత్ పుట్టినరోజు సందర్భంగా సాంస్కృతిక కార్యక్రమాలు ఎప్పుడు నిర్వహించినా ఆమె సారే జహా సే అచ్ఛా హిందుస్తాన్ హమారా కి రాగం కట్టేది. దాన్ని గజల్ పాడేది. ఆమె బాలికలందరిలో గజల్‌కే ప్రాధాన్యత ఇచ్చేది. గజల్ ప్రతి పాటనీ తొందరగా కంఠస్థం చేసేది. మిస్ రెడ్డి, ఆ పిల్ల జ్ఞాపకశక్తిని చాలా మెచ్చుకునేది. గజల్ ప్రతి విషయం జ్ఞాపకముంచుకుంటుంది, ఎక్కాలైనా సరే లేక పాఠమైనా...!

చాంద్ ఆపా కోసం కేక, తండ్రి తిట్లు - ఆమె హృదయాన్ని

అసహ్యంతో ఎంతగా నింపేశాయంటే ఇప్పుడింక ఎటువంటి ప్రేమకి, కోరికకి తావులేకుండా పోయింది.

చాలా నెలల శెలవు తరువాత యమ్.యస్. రెడ్డి స్కూల్‌కు వచ్చినప్పుడు, ఆమెనతికష్టం మీద పోల్చుకోగలిగారు. ఇప్పుడామె తల్లో పువ్వులూ లేవు, బట్టల మ్యాచింగ్ లేదు. ఒక గంట కాలములో ఒకసారే చిరునవ్వు నవ్వి వుంటుంది. ఇప్పుడావిడ మిసెస్ ప్రకాశం అని టీచర్లు పిల్లలకి చెప్పారు. వివాహం తెచ్చిన ఆ పరిణామం గజల్‌కి బొత్తిగా నచ్చలేదు. ఒకసారి ఆమెని మాటలతో, పాటలతో ప్రసన్నురాల్ని చేద్దామని ప్రయత్నించింది గజల్. కాని బాలికల రూపురేఖలను పరిశీలిస్తూ తిరగడానికిప్పుడామెకు అస్సలు తీరుబడి లేదు.

ఒక సంవత్సరం గడిచిపోయింది.

గజల్ ఒంటరిగా పాడుతూ, ఎగురుతూ గంతులెయ్యడం తప్ప, ఇంకేం మంచి మాటలు మాట్లాడేది కాదు. టీచర్లెవరూ ప్రోత్సహించేవారు కారు. టీచర్ల దృష్టినాకర్షించేందుకు అవి చాలని కూడా గజల్‌కి జ్ఞాపకముండేది కాదు. ఖాన్ సాహెబ్ ఇచ్చిన ఫ్రాక్ ఇప్పుడామెకి పట్టేది కాదు. ఇది ఆమెనెంతగానో బాధించేది. ఆమె శాశ్వతంగా ఫౌజియా పాత బట్టలతో కాలక్షేపం చేసేది. ఒకసారి తలలో పేలు చూసినందుకు కుంటత్త ఆమెకు రెండు పైసలిచ్చింది, ఫౌజియాననుకరించి గజల్ కూడా ఒక గల్లా కొనుక్కొని రెండవ పైసా అందులో వేసింది. ఫౌజియాలాగే ఒకటి, రెండు నెలల్లో ఆ గల్లా పగులగొడితే, డబ్బుల్తో నిండి ఉంటుందని ఆలోచించింది. కాని షాహీన్ ఆమెను బాగా ఏడిపించాడు.

'ఓసి పిచ్చి మొహమా? నువ్వు రెండు పైసలు పొగొట్టుకున్నావు కదా! ఇది విన్న ఆమె విపరీతంగా ఏడ్చింది. షాహీన్ ఆమె కుండ పగులగొట్టి పైసా తీసుండకపోతే రోజంతా ఏడుస్తూనే ఉండేది.'

ఒకనాడు సాయంత్రం గజల్ స్కూల్ నుంచి ఇంటికొచ్చే సరికి, ఆయాజ్ రజాకార్ల డ్రెస్ విడిచి ఆమె దగ్గరకొచ్చి కూర్చుని, ఇవాళ సాయా ఏమి వండలేదన్నాడు.

'అయితే నువ్వేం తిన్నావు? గజల్ తల్లిలా అడిగింది.'

'ఏమీలేదు! ఆయాజ్ దీనంగా మొహం పెట్టి అన్నాడు.'

గజల్ మనసు బాధపడింది, ఆయాజ్ రజాకార్లలో చేరినప్పటినుంచీ వారిద్దరి మధ్య దెబ్బలాటలు బాగా తగ్గిపోయాయి. ప్రత్యేకించి ఎప్పుడు రాత్రిళ్ళు ఒక దుకాణంలో పనిచేసి, తన ఫీజ్‌తోపాటు గజల్ స్కూల్ ఫీజ్ కూడా కట్టడం ప్రారంభించాడో, తనకు శాంతి రక్షణలు కలిగాయనిపించ సాగింది గజల్‌కి.

ఒక గృహిణిలాగ త్వరగా లోపలికెళ్ళి డబ్బాలన్నీ వెతికిందామె. కాని ఎక్కడా ఒక గింజకూడా లేదు.

'పోనీలే! నాన్నగారొచ్చాక తీసుకొస్తారు, ఆయాజ్ అమాయకంగా అన్నాడు. కాని ఒక కవరులో కొంచెం బొంబాయి రవ్వ కనబడింది. నెయ్యి బాగానే ఉంది, చక్కరైతే డబ్బా నిండా ఉంది. ఆయాజ్‌కి కూడా ఎన్నాళ్ళనుంచో హల్వా తినాలనుంది. ఈ మూడు వస్తువులనీ కలిపే కదా అమ్మ హల్వా చేసేది!'

పొద్దు పోయింది. తండ్రి, సాయా వచ్చే వేళయింది. అందుకని గజల్ త్వరగా ఒక గిన్నె తీసుకువచ్చి అందులో రవ్వ, చక్కెర, నెయ్యి వేసి, బాగా నీళ్ళుపోసి, ఎంతో జాగ్రత్తగా పెద్ద వాళ్ళలాగ చట్రంతో కలపడం మొదలెట్టింది. ఆయాజ్ ఆమె దగ్గరగా స్టూలు మీద కూర్చుని చిన్నారి చెల్లెలి సమయస్ఫూర్తికి పొయ్యి ఊదుతుంటే తలపైన బూడిద పేరుకుపోయింది. ఆయాజ్ పాపం రెండు చేతులతోటీ మేఘాల వంటి పొగను పోగొట్టడానికి ప్రయత్నిస్తున్నాడు.

'పొగా. పొగా, పారిపో, నీ పిల్లని తేలు కుట్టింది!'

కాని ఆ భీతిగొల్పే వార్త కూడా పొగనేం చెయ్యలేకపోయింది. కొంత సేపటి వరకూ గజల్ సునాయాసంగా, గిన్నెలో చట్రంతో కలియపెట్టగలిగింది. కాని హఠాత్తుగా చాంద్ ఆపాలాగ హల్వాకేమైందో కాని, గిన్నెలో బోలెడన్ని చిన్న చిన్న బంతులు ఏర్పడసాగాయి, గజల్ లేచి నిలబడి, శక్తినంతా ఉపయోగించి గరిటెతో తిప్పసాగింది. తండ్రి వచ్చే లోపల హల్వా తయారైపోతే, ఒక వంటకం చేసినందుకు మెప్పు పొందవచ్చుననుకుంది. ఈ హడావిడిలో ఆయాజ్ చెయ్యి కాల్చుకున్నాడు, అతణ్ణి కాపాడబోయి, గజల్ కట్టెకి బదులు నిప్పు ముట్టేసుకుంది. దాంతో గరిటె విసిరేసి ఏడుస్తూ మొత్తుకుంటూ కుళాయి దగ్గరికి పరుగెట్టి నీటిధార

కింద చెయ్యి పెట్టేసింది. ఇంతలో ఆయాజ్ హల్వా పొయ్యిమీంచి దింపి ఒక పళ్ళెంలోకి తీసాడు. చెమ్చాతో అందులో ఉన్న ఉండలతో బిలియర్డ్స్ ఆడసాగాడు. చెమ్చాతో పళ్ళెంలో హల్వా చూసిన గజల్‌కి మంట కొంచెం తగ్గినట్టనిపించింది. ఆ తెల్ల - తెల్లని తియ్యటి ఉండలు తాను చేసినవే అనుకుంటూ, ఊదుతూ హల్వా చల్లార్చడానికి ప్రయత్నించింది. సాయా వచ్చేలోపల అది తినేసి కథకి సుఖాంతం పలుకుదామనుకుంది. ఆయాజ్ గజల్ కోసం ఒక చెమ్చా తీసుకువచ్చాడు. వాళ్ళిద్దరూ హల్వా చల్లారుస్తున్నంతలో సాయా లోపలికొచ్చింది. ఆమెతో పాటు ఆమె ఇష్టసఖి అలీబీ కూడా ఉంది. సాయా తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తూ ఆ హల్వా పళ్ళాన్ని తీసి గోడకేసి కొట్టి ఇద్దరికీ చెరొకటి అంటించింది.

'అయ్యో! ఇద్దరూ కలిసి తల్లిని పొట్టబెట్టుకున్నారు. ఇటువంటి పిల్లల్ని నేనెక్కడా చూడలేదు.'

ఆమె అరుస్తూ అలీబీ సానుభూతి పొందింది. ఇటువంటి ఉపద్రవాలు సృష్టించేవారిని చూడ నిరాకరించింది.

ఆయాజ్ పుస్తకాలు తీసుకునని బైటికెళ్ళిపోయాడు. గజల్ మురికి బట్టల కుప్ప మీద కూర్చుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. వేలిమంట ఇప్పుడు శరీరమంతా పాకి బాధిస్తోంది. గోడపై తెల్ల మచ్చలాగ రెండు మూడు చెమ్చాల వేడి హల్వా తను కూడా తినేసుంటే అంతగా నిరాశాభావం కలిగేది కాదు.

'ఆయాజ్... బాబూ... ఆయాజ్ ఆలీషాహ్...! బైట షాహీన్ అరుస్తున్నాడు.'

గజల్ కన్నీళ్ళు తుడుచుకుని లేచింది. చిన్నతనంలో ఎండిపోయినట్టు సన్నగా మందమతిలో ఉండే షాహీన్ ఇప్పుడు మంచి తెలివితేటలు గల అధునాతన కుర్రవాడుగా తయారయ్యాడు. తరుచు గజల్‌ని దద్దమ్మగా నిరూపిస్తే కాని ఊరుకునేవాడు కాదు. ఏడుస్తున్న గజల్‌ని చూస్తే, హల్వా ఉదంతం చెప్పవలసి వస్తే ఆమెని బాగా ఆట పట్టిస్తాడు. అందుకని కళ్ళు తుడుచుకుని వచ్చింది.

'ఆయాజ్ ఏడి?' షాహీన్ సైకిల్ పెట్టి లోపలికొచ్చాడు.

ఎక్కడికో బైటికెళ్ళాడు! ఎక్కిళ్ళాపుకుంటూ అది గజల్.

షాహీన్ గజల్‌ని జాగ్రత్తగా పరిశీలించాడు. ఏడుస్తున్న గజల్‌ని వేళాకోళం పట్టించడానికి బదులు, ఇవాళ చాంద్ ఆపా వచ్చింది. ఆవిడకూడా ఏడుస్తూనే ఉంది.

'చాంద్ ఆపా, వచ్చేసిందా? గజల్ అమితానందంతో ఎగిరి గంతేసింది.' తన సైకిల్ వెనకాల కూర్చోపెట్టుకుని ఐవానే గజల్ చేర్చమని షాహీన్‌ని బ్రతిమాలసాగింది. మొదట షాహీన్ అలవాటు ప్రకారం తీసుకెళ్ళనన్నాడు. కానీ ఒక షరతుపై తీసుకెళతాను, నువ్వు నీ మురికి చేతుల్ని నా తెల్లటి చొక్కాపై పెట్టకూడదు.

'అల్లా! నేను నిన్ను పట్టుకోకపోతే పడిపోతాను.'

'అదంతా నాకు తెలియదు! పట్టనట్టన్నాడతను.

'సరే పద మొద్దు మొహమా! మాకు అన్నలు దొరికారు, కాని ఎలాంటి కుళ్ళు మొహం వాళ్ళో ఆమె గొణగడం మొదలెట్టింది.'

'ఏంపిల్లా! కుళ్ళు మొహం అన్నావంటే దార్లో ఎత్తేస్తాను జాగ్రత్త! అతను బెదిరించాడు.

'అలాగే పడేసి చూడు! నీ తెల్లటి చొక్కాని నా చేతుల్తో మాపేస్తాను?' దారి పొడుగునా షాహీన్‌తో పోట్లాడుతూనే ఉంది. ఐవానే గజల్ చేరుతూనే, తనని షాహీన్ బలవంతంగా తీసుకువచ్చాడని చెప్పింది గజల్. లేకపోతే తినేటప్పుడు కూర తక్కువగా ఉందనీ, ధరలు పెరిగిపోయాయని గొడవ మొదలు పెడుతుంది కుంటత్త. చాంద్ ఆపా తన గదిలో కూర్చుని వుంది. ఏదో మిణుకు మిణుకు మంటున్న ఏదో తారకా! అన్నట్లు వుందామె. ఆమె ముఖంమీద కనబడే అందమైన రంగులనెవరో చెరిపివేశారు! ఆ మెరుస్తూ అల్లల్లాడే ఉంగరాల ముంగురులిప్పుడు, నిర్జీవంగా వ్రేలాడుతున్నాయి. నిగనిగలాడే బుగ్గలపైన, నల్లటి మచ్చలు కనబడుతున్నాయి. ఎవరో పసుపు రంగులో ముంచి, తీసిపడేసినట్టుంది. ఆ పిల్ల, చాంద్ ఆపా ఎదురుగా కూర్చుని, ఆవులిస్తూంది. కాళ్ళు చేతులు కొడుతూంది కాని చాంద్ వంచిన తల ఎత్తడమే మర్చిపోయినట్టు కూర్చుంది. వరండాలో కూర్చున్న ఫౌజియా ఇదేమీ పట్టనట్టు బీబీ చీరమీద పువ్వులు కుడుతూంది. బీబీ. రజియా, కుంటత్త తమ తమ గదుల్లో మౌనంగా కూర్చున్నారు. గజల్ కూడా ఫౌజియా దగ్గరకొచ్చి కూర్చుంది.

'చాంద్ ఆపా భర్త ఎక్కడున్నారు?' ఆమె మెల్లిగా అడిగింది.

'భర్తా! ఫౌజియా అచ్చం కుంటత్తలాగ ముక్కుమీద వేలు పెట్టుకుని,' చాంద్ ఆపాకి పెళ్ళి ఎప్పుడు అయింది?

'అచ్చా... ఎందుకు! చాంద్ ఆపా పెళ్ళిలో చకసా పెట్టుకోవడం, ఢోలక్ వాయించడం, పెళ్ళికొడుకు జోళ్ళు దొంగిలించడం వంటి కోరికలు తీరుతాయి అని గజల్ సంతోషించింది.'

'తాతగారిప్పుడు, ఆమెను ఏ మాదిగాడికో ఇచ్చి పెళ్ళిచేస్తారు.' ఫౌజియా మాటలకి, గజల్‌కి నవ్వొచ్చింది.

'అయితే ఇన్నాళ్ళనుంచి చాంద్ ఆపా ఎక్కడెక్కడ తిరిగింది! ఆమె సంజీవాని, పార్టీ పనులు విడిచిపెట్టమంది. ఖాన్ సాహెబ్‌కి చెప్పి ఉద్యోగమిప్పిస్తానంది. కాని సంజీవా ఒప్పుకోలేదు. తరువాత ఎవరో గొప్ప వ్యక్తిని వివాహమాడి సుఖంగా బ్రతకమని ఉత్తరం వ్రాశాడు,' ఇది విన్న చాంద్ ఆపాకి జబ్బు చేసింది. ఆమెకి క్షయవ్యాధి వచ్చింది. నాన్నగారు ఆమెను బొంబాయిలోని ఒక హాస్పిటల్ నుంచి తీసుకువచ్చారు. డాడీ స్నేహితుడెవరో వచ్చి చెబితే, బీబీ బలవంతంగా డాడీని పంపించింది.

ఫౌజియా మెల్లి మెల్లిగా అన్నీ చెప్పుకుపోతూంది. ఆ చెప్పే పద్దతిలో చాంద్ ఆపా అంటే అపరిమితమైన అసహ్యం ధ్వనిస్తోంది. గజల్ గుండె గట్టిగా కొట్టుకుంటూంది. ఎందుకో గట్టిగా ఏడవాలనిపిస్తోంది. ఒక వేళ చాంద్ ఆపాకి పెళ్ళి కుదిరితే, ఆకు పచ్చరంగు మఖమల్ సల్వార్ కమీజ్ కుట్టించుకుంటాను.

ఫౌజియా ఏమిటో చాలా దాచుకున్నట్టు దుప్పటి గుండెపై కప్పుకుంది. ఎన్ని జన్మలెత్తినా తనకా మఖమల్ సూటు లభించదు. మనం చక్కగా గోరింటాకు పెట్టుకుని పాటలు పాడతాం కదూ?

ఈ రోజు ఫౌజియా ఎలాగో గజల్ మాట వింది. సూదీ దారం చీర మీద పడేసి వాళ్ళిద్దరూ నైట్‌క్వీన్ మొగ్గలు కోసుకోవడానికి తోటలోకి పరుగెత్తారు. కానీ ఆ రోజు విసుగ్గా వుంది. డాబా మీదికి పరుగెత్తారు. పదమూడు పధ్నాలుగేళ్ళ ఫౌజియా మెట్లెక్కుతూంటే, ఆమె బరువుకి చెక్కమెట్లు కదిలేవి. గజల్ కూడా తక్కువేం లేదు. ఇద్దరూ కనబడని తీగ వలె ఎవరో లాక్కుపోతున్నట్టు వెళ్ళిపోతున్నారు. ఒకరికంటే ఒకరు ముందు

వెళ్ళిపోవాలన్న ఉద్దేశ్యంతో ఇద్దరూ డాబా ఎక్కేశారు. అప్పుడనిపించింది, అసలిక్కడికెందుకొచ్చినట్టు? ఫౌజియా పిట్టగోడమీద కూర్చుని కింద ఉన్న నౌకర్ల ఇళ్ళు పరిశీలించసాగింది. గజల్ పిట్టగోడల మీద కాకిరెట్టలు శుభ్రం చెయ్యాలనుకుంది, చాంద్ ఆపా పెళ్ళి ఎప్పుడవుతుందో! ఎవరీ దరిద్రపు వెధవ నన్ను గుచ్చి - గుచ్చి చూస్తున్నాడు! ఫౌజియా ముఖం చిట్లించి, దుపట్టా సరిచేసుకుని గజల్ దగ్గరికొచ్చి కూర్చుంటూ, ఈ కుంటత్త ఉంది చూశావా, చాలా చెడ్డది బాబూ.

'ఎందుకని ఏం చేసిందామె? ఈనాడెందుకో ఫౌజియా ప్రతి మాటకు ఉలిక్కిపడుతూంది,' గజల్.

'ఇంక చాంద్ ఆపాని ఎవరూ పెళ్ళి చేసుకోరు! ఫౌజియా మెల్లిగా అంది. ఊహ్, ఆవిడంటే ఏమౌతుంది. అల్లామియా! ఆవిడకెప్పుడూ పెళ్ళి జరగకూడదు. గజల్ ఈ విధంగా శాపనార్థాలు పెట్టడం కుంటత్త వద్దే నేర్చుకుంది. ఒకనాడు అంది ఇంక ఫౌజియాకి వెంటనే పెళ్ళి చేసెయ్యి. ఈ మాట చెబుతున్నప్పుడు ఫౌజియా మొఖం ఎర్రగా కందిపోయింది.' హాఁ, హాఁ, హాఁ, హాఁ....! గజల్ కావాలని గట్టిగా నవ్వింది.

'తాతగారు కూడా అంతే, ఫౌజియా ఆగకుండా చెప్పుకుంటూ పోయింది.' గౌహర్ బేగమ్ చెప్పింది నబబుగానే ఉంది. ఆడపిల్లలు - నీళ్ళలోనుంచి తీసిన చేపలవంటి వారు. ఒక్కరోజు తీసి బైట పెడితే సరి, దుర్వాసనతో ఇల్లంతా అసహ్యంగా తయారవుతుంది. ఫౌజియా మాట వినగానే గజల్‌కి హఠాత్తుగా కుళ్ళు చేపలాగయిపోయిన, చాంద్ ఆపా ముఖం గుర్తొచ్చింది. దాంతో మౌనం వహించింది.

తరువాత ఫౌజియా గజల్‌కి దగ్గరగా జరిగి ఆమె రెండు చేతుల్ని తన చల్లని చేతులతో పట్టుకుని తన కాబోయే భర్త గుణగణాలు చెప్పసాగింది. తన గుండెలో బరువు దించుకునేసరికి ఫౌజియా తల్లోని బరువు గజల్ గుండెలో పడినట్లయింది. ఫౌజియా గజల్ కంటే రెండు నెలలు మాత్రమే పెద్ద. ఫౌజియా ఎప్పటినుంచో విహరిస్తున్న ఈ లోకం గురించి, గజల్ ఎప్పుడూ ఆలోచించలేదు. ఫౌజియా తన ఇల్లు భర్త ప్రేమ ఎంతమంది పిల్లలుండాలని విషయాల గురించి కూడా నిర్ణయం చేసుకుంది. నాకు కూడా పెళ్ళవుతుందా? ఇంతకు ముందు ఎప్పుడు ఈ విషయం గురించి

గజల్ ఆలోచించలేదు. ఎక్కువ కాలం ఊరికే వుంచితే ఆడపిల్లలు చేపల్లా కుళ్ళిపోతారనే విషయం నాన్నకుకూడా బాగా తెలిసే వుంటుంది. వారిద్దరు క్రిందికి దిగి వచ్చారు, గజల్ కళ్ళలో కొత్త కొత్త రంగులు కనబడసాగాయి. చాంద్ ఆపా దీన వదనం, ఆమె మర్చిపోయింది.

'గజ్జో, ఇలారా...!' చాంద్ ఆపా చాలా నీరసంగా పిలుస్తూంది.

'హిష్! దాని దగ్గరకి వెళ్ళవద్దు బీబీ.' కుంటత్త నేర్పుగా అంది, గజల్ కుక్కపిల్లలాగ పళ్ళు కొరుకుతూ ఆమె దగ్గరకి పరుగెత్తింది.

'నువ్వెప్పుడైనా క్లబ్ కెళుతున్నావా?'

'ఊహు! గజల్ తల అడ్డంగా తిప్పింది.' మీతోపాటే ఒకటి రెండు సార్లు వెళ్ళానంతే.'

'పోనీలే ఈ రోజు వెళ్ళు, ఒంటరిగా వెళ్ళు, ఈ ఉత్తరం ఖాన్ సాహబ్కిచ్చేసిరా. ఈ రోజే నాన్నగార్కి పంపించెయ్యమని చెప్పు. ఆమె అటూ - ఇటూ చూసి, ఉత్తరాన్ని గజల్ చేతుల్లో పెట్టింది, ఒక రూపాయ నోటు కూడా ఆ పిల్ల చేతిలో పెట్టింది. చాంద్ ఆపా ఆజ్ఞ పాటించడం గజల్కు అలవాటు కాని ఒంటరిగా క్లబ్కి వెళ్ళడం అంత సుళువైన పనికాదు. ఈ విషయం షాహీన్, ఆయాజ్లకు చెప్పడానికి వీల్లేదు. రజియా అత్తకి ఈ విషయం తెలుస్తే, చాంద్ ఆపాని మరింత బాధపెడుతుంది. ఇంట్లో ఎవరికీ చాంద్ ఆపా మీద అభిమానం లేదన్న విషయం గజల్కి అర్థమైంది.

చిట్టచివరికి ఎలాగో ధైర్యం చేసి ఇంటికెళ్ళాలని టాంగా తెప్పించుకుని క్లబ్కెళ్ళి, ఐదు నిమిషాలు అక్కడే ఆగమని లోపలికెళ్ళింది.

గజల్ ఎంతోమంది చపరాసీలు, క్లర్కుల మధ్యనుంచి, ఖాన్ సాహెబ్ దగ్గరకు వెళ్ళింది. ఆమెను చూసి ఖాన్ సాహెబ్ లేచి నిలబడ్డారు. మాటిమాటికి బట్టతలపై వెంట్రుకల కోసం వెతుక్కుంటూ చిరునవ్వు చిందిస్తున్నాడు. మీరు ఇప్పుడు పెద్దవారు అయిపోయారు. బీబీ నిజంగా, గజల్ ఆగిపోయింది.

ఆయన నవ్వుతూ వుంటే గజల్కు కూడా నవ్వొచ్చింది. ఆయన చూపులకు కంగారు పడసాగింది.

తరువాత ఆయన ఐస్ క్రీమ్, సాండ్విచెస్, బిస్కెట్స్, పాలు, పేస్ట్రీ అన్నీ తెప్పించారు. గంటయింది. చాంద్ ఆపా ఇచ్చిన ఆ ముఖ్యమైన

ఉత్తరాన్ని విప్పకుండా బల్లమీద పడేశారు ఆయన. గజల్‌ని ఒక క్లిష్టమైన షేర్‌లాగా నవ్వుతూ చదువుతున్నాడు ఆయన. చాలాసేపు ప్రయత్నించి చివరికి అక్కణ్ణించి వచ్చేస్తున్నప్పుడు ఆ వుత్తరానికి జవాబు చెప్పమని అడిగితే ఖాన్ సాహెబ్ పైపు వెలిగించుకుంటూన్నారు. సంజీవా జైల్లో వుంటే ఆమె ఉత్తరాన్ని పంపించే ప్రయత్నం చేసేవాణ్ణి, కానీ అతడు ఇపుడు అండర్‌గ్రౌండ్‌లో వున్నాడని చాంద్‌కి చెప్పు.

ఆమె ఇంటికి వచ్చేసరికి తండ్రి, సాయా గది తలుపులు వేసుకుని నిద్రపోయారు. అయాజ్ లాంతరు ముందు పెట్టుకుని కునికిపాట్లు పడుతున్నాడు. గజల్ వస్తూనే కాళ్లు చేతులు పట్టుకుని రక్‌అత్, నమాజ్ నాలుగుసార్లు చదువుకుంటే తన రహస్యం పడకుండా ఉంటుందన్న నమ్మకంతో అలాగా చేసి గుండె దడదడలాడుతుండగా వెళ్ళి మంచంమీద పడుకుంది. కాని అంకులు బట్టతల మాటి మాటికీ మెరుస్తూ కళ్ళ ముందు కనబడింది. ఐస్‌క్రీమ్ తిన్న రుచి యింకా మిగిలివుంది. తన తండ్రి చాంద్ విషయంలో ఎలా అనుచితంగా ప్రవర్తించాడో తెలియదు కాని ఆనాటి నుంచి చాంద్ తనని మరిచిపోయింది. లేకపోతే తాను కూడా ఈ పాటికి చాంద్ ఆపాలాగ వందల నాటకాలలో అభినయించి ఉండేది.

మరునాడు బురదతో నిండివున్న బొమ్మకు జడవేస్తూంది గజల్, ఇంతలో ఇంటిముందు కారాగిన చప్పుడు అయింది.

ఇవ్వాళ బీబీ ఎందుకొచ్చారు?' ఆమె బైటికి రాబోతూ ఆగిపోయింది. తల్లిలాగ చిన్న కన్నంలోంచి తొంగి చూసింది.

ఖాన్ సాహబ్ నాన్నతో అంటున్నాడు. భారత్ కళామండల్ వారు మళ్ళీ ఒక్కసారి గజల్‌ని తమ నాటకాల్లో తీసుకుందామనుకుంటున్నారు. గజల్ తన పర్యవేక్షణలో వుంటుందని తండ్రికి నమ్మకం కలిగేటట్టు చెబుతున్నారాయన.

ఒక్కసారిగా ఊచల్ని విరిచేసి పారిపోయినట్టు పరుగెట్టింది. అంకుల్ని వాటేసుకుందామని కానీ తండ్రి అక్కడే ఉండడంతో ఆగిపోయింది.

గుడ్డిదానికి ఏం కావాలి రెండు కళ్ళు? నాన్న తన చిరునవ్వును కనబడకుండా జాగ్రత్తపడుతూనే తన అయిష్టతని వ్యక్తం చేస్తూ అన్నాడు. 'కేవలం మీ ఆదేశానికి కట్టుబడుతున్నా మా ముర్షిదుల్లో పుట్టిన ఆడపిల్లల్ని

గట్టి పరదాలో ఉంచుతారు.'

ఖాన్ సాహెబ్ తన దుస్తులకు ఏ అత్తరు పూసుకున్నారో కాని ఇల్లంతా గుప్పుమంది. ఆయన గదిలో కూర్చుంటే ఆయన నున్నని బట్టతల మీద నల్లటి ఇంటికప్పు కనబడుతుంది. గజల్‌తో చాంద్ ఆపా ఖాన్ సాహెబ్ బట్టతల గురించి ఎప్పుడు వేళాకోళం చేస్తూండేది. చాంద్ చాలా నిర్దయురాలు. రియాజ్ తమన్నాయీ ఆమె అందాన్ని పొగుడుతూ కవిత్వం చెబితే అతన్ని ఎంత ఏడ్పించిందంటే పాపం నిజంగా ఏడ్చేవాడు. ఎవరైన ఆమెని కన్నెత్తి చూస్తే హింసించి నవ్వుతూండేది. నల్లగా ఉండే సంజీవా తన చెదిరిన జుట్టుతో, క్లబులో ఏదో ఒక మూల కూర్చుని వరుసగా సిగరెట్లు కాలుస్తూ వుంటే చాంద్ ఆపా అతని చుట్టు సీతాకోక చిలుకలా తిరుగుతుండేది. ఒకసారి వెనుకనుంచి వచ్చి, సంజీవా బుజం మీద గడ్డం ఆనించింది చాంద్. చేత్తో అతను తోసేసి 'చాంద్ ఈ విధంగా నువ్వెంతకాలం నాతోపాటు తిరుగుతావు ఆలోచించు?'

గజల్ అక్కడున్న సంగతి మరచిపోయి సంజీవ జుట్టుని ముద్దు పెట్టుకుంటూ 'నువ్వెదురుగా వున్నప్పుడు నేను ఏమీ ఆలోచించను. ఏం జరుగుతుందో జరగనీ.'

తనను కొంచెం కూడా పట్టించుకోని, పిచ్చి మొహంతో నల్లగా వున్న అతడు చాంద్ ఆపాకి ఎలా నచ్చాడో. ఖాన్ అంకుల్ ఎంత అందంగా ఠీవిగా వున్నారో?

ఆయన గజల్‌ని తన క్లబ్ మెంబరు చేసి చాంద్‌ని విస్మరించినప్పుడు సాహెబ్ గొప్పతనము, గజల్‌కి, హుమాయూన్‌కి అర్థమైంది. ఇంటి అద్దె కట్టకపోవడం వలన జరగపోయే జప్తును, ఆపించాడు ఆయన. హుమాయూన్‌కు ఆఫీసులో ప్రమోషన్ ఇప్పిస్తానని మాట ఇచ్చాడు. ఇవన్నీ కాకుండా ఆలిఫ్-లైలాలో అతని వాటాని సవతి అన్నదమ్ముల వద్దనుంచి ఇప్పిస్తానన్నాడు.

గజల్ దర్జా పెరిగిపోయింది. అన్నిచోట్లకి ఖాన్ అంకుల్‌తో కారులో తిరుగుతూంది. క్లబ్ సభ్యులందరూ గజల్‌కేసి చూడసాగారు.

బిల్‌గరామీ కూడా గజల్‌ని చూసి చిరునవ్వు చిందించసాగాడు, నిజానికి అతని ఇరాని అందం, స్త్రీలలో అతనికొక విశిష్ట స్థానాన్ని కల్పించింది.

అతని పై ఏ ఫిల్మ్ డైరక్టర్ దృష్టి అయినా పడిందంటే అతడు బొంబాయి ఎగిరిపోతాడు. కనుక రేపటి ఈ అశోక్ కుమార్‌తో సంబంధ బాంధవ్యాలు వీలైనంత వరకూ పెంపొందించుకోవాలని అంతా ప్రయత్నించేవారు. బిల్‌గరామీ, బంగారు రంగు జుట్టు, పచ్చని ఛాయ, అందమైన అవయవ సౌష్టవం, చూసి స్త్రీలంతా మానసికంగా అశాంతికి గురి అయ్యేవారు.. కాని గజల్ అతనికేసి కన్నెత్తి అయినా చూసేది కాదు. దానికి కారణమేమంటే, ఖాన్ మామా ఆమెకొకసారి, బిల్‌గరామీ నీడనుంచి కూడా దూరంగా ఉండమని, అతడు దుష్టుడని చెప్పారు. దాంతో గజల్ జాగ్రత్తగా ఉండేది. ఆయన మాట వినడం గజల్‌కి కర్తవ్యమైపోయింది. ఆయన, హుమాయూన్‌కి ఎన్నో సహాయాలు చెయ్యడమే కాకుండా గజల్‌కి కూడా బహుమానాలివ్వడం ప్రారంభించారు. కుర్తా, బట్టలు, బంగారు గొలుసులు కొత్త కొత్త చెప్పులు.

ఒకసారి ఆయన, గజల్‌కి చీర కట్టుకోమని సలహా ఇచ్చారు. ఒకేసారి ఐదు చీరలు తెచ్చిచ్చారు. చీరలు, చాంద్ ఆపా అలమారలో కూడా లేనంత అందమైనవి, ఖరీదైనవి. వాటితోపాటు లిప్‌స్టిక్, పౌడరు, ఈ వస్తువుల్ని ఎక్కడ, ఎలా ఉపయోగించాలో గజల్‌కి అర్థం కాలేదు. ఖాన్ మామా ఎప్పుడైనా ఆమెను సినిమాకి తీసుకువెళదామని వస్తే తండ్రి, గజల్ భయపడుతూంది వద్దనేవాడు, తరువాత గజల్‌ని గబగబా తయారు చేయించేవాడు. ఒకనాడు ఖాన్‌మామ ఆమెని తన ఇంటికి తీసుకువెళ్ళారు.

అది ఆయన బంగళా కాదు. పాదుషా మహలు. గజల్ జీవితంలో అంత అందమైన ఇంటిని చూసి ఎరగదు. కానీ ఆ యింట్లో నౌకర్లు తప్ప మరెవరూ లేరు. ఖాన్ సాహెబ్‌కి భార్య వుందని ఒకసారి చాంద్ ఆపా చెప్పింది. రెండు మూడిళ్ళు అమ్మేసి, ఒక చిన్న ఇంట్లో తన పిల్లలతో వేరే ఇంట్లో వుండేది.

చాంద్ వాళ్ళ కాలేజీలో ఆమె చదువు చెప్పేది. వాళ్ళకి, ఒక అమ్మాయి ఉండేది. చాంద్ కాలేజీలో చదువుకుంది. ఒక కొడుకున్నాడు. అతడు షాహీన్‌కి మంచి స్నేహితుడు. ప్రతి సాయంత్రం షాహీన్‌తో క్రికెట్ ఆడడానికి ఐవానే గజల్‌కి వచ్చేవాడు. చాంద్ ఆపా ద్వారా గజల్ వారి గాధలెన్నో వింది. ఇంత మంచి ఖాన్ సాహెబ్ అంటే ఎందుకో ఆయన

భార్యా బిడ్డలకసహ్యం. ఖాన్ సాహెబ్, చాంద్ ఆపా కలిసి వెళుతుండగా ఆయన భార్య 'ముసలి కోతికి మామిడి పిందెలంటే చాలా ఇష్టం,' అందని ఒకసారి షాహీన్ చెప్పాడు.

ఇంతమంచి వ్యక్తిని ఆవిడ ఎందుకు వదిలేసిందో అడగాలనీ ఆవిడతో బాగా దెబ్బలాడాలని అనిపించేది గజల్‌కి. ఇటువంటి వ్యక్తి, ఇంత గొప్ప బంగళా ఇంకేం కావాలావిడకి! ఒకనాడు ఆవిడ దగ్గరికి వెళ్ళాలని గట్టిగా అనుకుంది. వద్దు నన్ను వెనకేసుకొచ్చి మాట్లాడితే, ఇంకా ఈర్ష్య పడుతుంది. అని ఆయన గజల్‌ని ఆపేశారు.

ఇప్పుడు గజల్ ఎక్కువ సమయం ఖాన్ మామా ఇంట్లో గడుపుతూంది. సాయంత్రం టీ అక్కడే తాగుతుంది. ఆఫీసునుంచి హుమాయూన్ కూడా అక్కడికే వెళ్ళిపోయేవాడు, అక్కడ కూర్చుని ఆయన్ని పొగుడుతూండేవాడు. హుమాయూన్‌కి అంతా తలవంచి నమస్కరించేవారు, ఆయన చేతులకి కళ్ళురుద్దుకునేవారు.

గజల్ ఇప్పుడు మంచి పనిమంతురాలైంది. ఖాన్ మామకి టీ తయారు చేస్తుంది. నీచ ప్రవృత్తి కలిగిన ముసలివాళ్ళైన ఖాన్ మామా స్నేహితుల ఆదర సత్కారాల బాధ్యత స్వీకరించింది. ఒకసారి అతని స్నేహితుడొకడు, గజల్‌ని ఇంట్లో చూసి ఖాన్‌తో అన్నాడు కొత్త కారొచ్చేసిందేమిటి మీ ఇంటికి?

'ఈ విషయంలో తొందర పనికిరాదు.'

'ఏ కారు, మామా?' గజల్ కుతూహలంగా అడిగింది.

'ఆ ముందటిది?' అతని స్నేహితుడు, గజల్ ఉనికిని లెక్కచెయ్యకుండా అడిగాడు.

'అబ్బే, అదిప్పుడు చాలా పాతదైపోయింది?'

'జబ్బు చేసిందట కదా!'

'అవును ఒక కమ్యూనిస్టు కుర్రాడి ప్రేమలో.'

ఖాన్ మామా ఏదో పనిమీద గజల్‌ని లోపలికి పంపించేశారు. ఆమె మంచం చివర కూర్చుంది. చాంద్ ఆపా గురించి జరుగుతూందీ సంభాషణంతా... ఆమె అంత తెలివి తక్కువది కాదు. 'ఖాన్ సాహెబ్ ఎంతటి క్రూరుడు! ఎదురుగా ఉన్నప్పుడు చాంద్ ఆపాని ఎంత

పొగిడేవాడు. నేడామెను పాత కారుచేసేశారు! ఇప్పుడింతే కొత్త కారు కొనబోతున్నారో!'

ఒక అర్థం కాని భయం నలువైపుల నుంచి ఆవహించింది. బీబీ సరిగ్గా ఇదే చెప్పారు, ఈ పరాయి వాళ్ళు మనకేమవుతారు? నేనక్కడి ఎందుకొచ్చాను? బీదపిల్ల ఇక్కడ తినడానికి మంచి మంచి పదార్థాలు దొరుకుతాయి. అందుకని ఎప్పుడూ చూడకపోవడంతో వచ్చేస్తార నుకుంటారందరూ, కాని ఖాన్ మామా అంత ప్రేమగా పిలిస్తే తిరస్కరించడం సాధ్యమా! ఆయన నాన్నకెంత సహాయం చేశారు! ఎన్నో వందలాయన నాన్నకి అప్పిచ్చారు. అందుకనే ఆయన ఎడల, కావలసిన దానికంటే ఎక్కువ అభిమానం చూపించేదామె. ఖాన్ మామా ఆజ్ఞలన్నీ శిరసావహించ వలసివచ్చేది. ఆయన, అర్థంలేని మాటలన్నింటికి బలవంతంగా నవ్వేది. ఆయన తూలుతూ పిచ్చిపిచ్చిగా వాగుతున్నప్పుడు కూడా గజల్ ఆయనతో పరాచికాలాడుతూండేది. నిజానికిక్కడి నుంచి పారిపోవాలనిపించేదామెకి, ఆయన మాటిమాటికీ గజల్‌ని హింసించేవారు, తింటున్న ప్లేట్ లాగేసుకునేవారు. వెనుకనుంచి వచ్చి ఉన్నట్లుండి కళ్ళు మూసేవారు. ఒకసారి ఆటల్లో ఆమెను రెండు చేతులతో పైకెత్తేసరికి గజల్ చాలా కంగారుపడింది. ఎలాగో అతన్ని తోసేసి, ఏదో తెలియని భయంతో గదిలోంచి బైటికొచ్చి ఒక్క పరుగున గేటు బైటికి చేరుకుంది.

ఎందుకనో ఆ రోజు ఖాన్ మామా అంటే చాలా భయం వేసింది. ఆయన మంచి నిజాయితీపరుడైన మనిషిలా కాకుండా, మారిపో యినట్టనిపించింది. ఒక అపరిచితుడి లాగ... ఒక భయంకరమైన వ్యక్తిలాగ, తోచింది. తరువాత చాలా రోజులదాక ఆమె ఖాన్ సాహబ్ ఇంటికి వెళ్ళలేదు. ఒకనాడు ఆయనే వచ్చి, గజల్‌కి నా మీద కోపం వచ్చింది. అందుచేత ఇప్పుడు నేను భోజనం చెయ్యను, అన్నారు.

'లేదంకుల్ మీరంటే నాకెందుకు కోపం! లోలోపల ఎంతో సిగ్గనిపించింది. ఎంతమంచి అంకుల్, తన గురించి ఎంత శ్రద్ధ!' ఓసి మొద్దు మొహమా? నీకెవరైనా, ఎప్పుడైనా ఇంతటి ప్రాముఖ్యతనిచ్చారా! నీకు కోపం వస్తే ఎవరైనా భోజనం మానేస్తారా, నువ్వేమో గొప్పలు పోతున్నావు! చాంద్ ఆపాని చూడు! అంతగా గర్వపడకు, ముదనష్టపు

పిల్లా!

చాలా సేపటివరకు ఆమె తనను తాను నిందించుకుంది. మనసులో లేచిన అర్థంలేని అనుమానాలకి, ఊహల్లోనే ఎన్నోసార్లు గట్టిగా స్వయం శిక్షించుకుంది. అంతే! తండ్రి చేత చెప్పుదెబ్బలు తిన్న తరువాత, తేలిక పడ్డట్టు, ఆమెకు మనసు కుదుటపడింది.

ఆమె తనను, చాలా పెద్దదిగా ఊహించుకుంది. చాంద్ ఆపాలాగ ఒడ్డూ, పొడుగూ ఉంది. చక్కగా అలంకరించుకున్న ప్రాముఖ్యత, వ్యక్తిత్వంకల తనకి, అందరూ ప్రాధాన్యత ఇస్తున్నారు... ఇదెంత గొప్ప విషయం... ప్రపంచంలో నమ్మశక్యం కాని విషయం... ఖాన్ మామని ఎలా గౌరవించాలి. గజల్‌వంటి అల్పురాలికి అతి సామాన్యమైన దానికి అంత ప్రాముఖ్యత ఇస్తున్నారు.

ఇప్పుడామెకి చాంద్ ఆపాలాగ సమాజంలో మెలగవలసిన పద్ధతులన్నీ అలవడ్డాయి. గట్టిగా ఊదుకుంటూ టీ తాగడం మానేసింది. ఎదురుగా ఎన్ని మంచి పదార్థాలున్నా, ఒక వస్తువు పూర్తయితే కాని మరొకటి ససేమిరా తియ్యకూడదు! అంతా తినడం ముగించేసరికి తాను కూడా లేచేసేది.

ఇప్పుడు చాలా నాటకాల్లో ఆమె చీరకట్టుకోవలసి వచ్చేది. కాని చీరకట్టుకోవడం ప్రాణాంతకంగా ఉండేది. ఎన్ని చుట్లు తిప్పినా ఇంకా బోలెడంత బట్ట మిగిలిపోయేది. ఇక్కడకూడా ఖాన్ సాహెబ్ ఉపకరించారు. ఆయన కేవలం వ్యాపారవేత్త మాత్రమే కాదు, భారత కళా మండల్, అధ్యక్షులు కూడా. అంతే కాకుండా నాటకాలు వ్రాయడం దగ్గరనుంచి మేకప్ వరకు సమస్త కళల్లో నైపుణ్యముందాయనకి. గజల్‌కి కొత్త రకంగా ఒంటికి అతుక్కుపోయినట్టు, చీరకట్టుకోవడం కూడా ఆయనే నేర్పించారు. చచ్చిపోయేవుందు, అస్తమానూ అంటూండేది అమ్మ, అల్లా ఎక్కడున్నాడో? నా మొర ఎందుకు ఆలకించడో!

అమ్మపోయిన తరువాత కష్టం కలిగినప్పుడు, దెబ్బలు తింటున్నప్పుడు గజల్ సువిశాలమైన ఆకాశంలో అల్లామియా కోసం వెతుకుతూండేది, కాని ఆమెకెప్పుడు దేవుడు కనబడలేదు. ఏమో, ఎంత దూరంగా ఉన్నాడో! ఎప్పుడూ ఎవ్వరి ప్రార్థన, ఆలకించడు, కాని ఇప్పుడు తన గోడు విన్నాడు.

ఆమె ప్రతిసారి నమాజ్ చేసుకున్నప్పుడు సజదాత్రల నేలకానించి దణ్ణం పెట్టుకోవడం చేస్తూ నిజంగానే జానమాత్ (నమాజ్ చేసుకోవడానికి కూర్చునే చాప) తడిపేసేది. అల్లానేం కోరుకునేదో! ఆమె పెదవులు మాత్రం కదిలేవి. చేతులు చాపి ఉండేవి. ముఖమంతా కన్నీళ్ళతో నిండిపోయేది. పద్ధతి ప్రకారం, తమ కోరికల జాబితా ఆయనకి వినిపించడానికి, అల్లా మియాకి తెలియ చెప్పాల్సిన అవసరం ఉందా! అసలు తనకేం కావాలో, తన కోరికేమిటో తనకే అర్థం కాదు. కాని ఒకసారి నాన్న తన్నులతో శరీరమంతా నొప్పుల్లాగ ఉండడంతో తన మంచంమీద, అటూ ఇటూ దొర్లుతూంటే నా బాధ ఎవరితో చెప్పుకోనూ. అన్న బాధతో దుఃఖం ముంచుకొచ్చింది. ఈ ప్రపంచంలో తనకెవరున్నారు? అకస్మాత్తుగా ఏదో తెలియని భయంతో లేచికూర్చుంది. చీకట్లో నలుమూలలా చూసింది. తండ్రీ సాయా వేరేగదిలో ఉన్నారు. గజల్ దగ్గరగా వేరేమంచం మీద ఆయాజ్ మంచి నిద్దర్లో అటు తిరిగి పడుకున్నాడు. ఈ అంధకార బంధురంలో, నిశ్శబ్దమనే సముద్రపు లోతుల్లో నేనొంటరిదాన్ని... గుండె మీద పెద్ద బండ పడినట్లయింది. తనని ఒంటరిదానిగా గ్రహించి, భూతాలు తండోపతండాలుగా వీందికి వస్తూన్నట్లనిపించింది. భయంకరమైన చీల్చి చెండాడే మృగాలు తనకోసం కాపుకాశాయి. ఒక నల్లటి సర్పం వంటి దయ్యం, ఎర్రటి నాలుక చావుతూ ఆమె కేసి వస్తూంది. దాని కళ్ళునిప్పు కణాల్లా మండుతున్నాయి. గోళ్ళు బాకుల్లా వంగి ఉన్నాయి. 'వద్దు... అబ్బా (నాన్న)... ఆయాజ్ అన్నయ్యా... నన్ను రక్షించండి... రక్షించండి... రక్షించండి! కెవ్వుమని అరిచి మూర్ఛపోయింది. అంతా లేచేశారు. మరునాడు... మూడవనాడు కేకలెయ్యడం భయపడడం జరుగుతూ వచ్చింది. ఆ పిల్ల ఒంటరిగా ఉంటే చాలు భయంకరమైన కళ్ళతో దెయ్యాలు ఆమెను చుట్టుముట్టేవి.

'జుమేరాత్ (గురువారం) నాడు రెండు సంధ్యలు కలుస్తాయి. స్నానం చేసి డాబామీదికెళ్ళింది. బీబీ గట్టి నమ్మకంతో అంది.'

'నేను షాహీన్ సాహబ్ దగ్గరికి తీసుకెళతాను. ఒక్క తాయెత్తుతో బాగైపోతుంది. కుంటత్త ధైర్యం చెప్పింది.'

ఆమె ఎన్నో దీపపు వత్తుల్ని నీళ్ళల్లో కలుపుకుని తాగింది. కాని ఆ

భూతాల సంఖ్య పెరుగుతూనే పోయింది.

అందుకని ఆ పిల్ల ఖాన్ మామా ఇంట్లో ఎక్కువసేపు గడిపేది. అది ఐవానే గజల్లో ఎవరికీ ఇష్టంలేదు.

ఒకనాడు ఫౌజియా హేళనగా అంది 'ఛీ!' నువ్వు అసహ్యంగా ఉన్న ముసలాణ్ణి భర్తగా ఎన్నుకున్నావా?

అతడు డాడీకంటే కూడా పెద్దవాడు అట! ఫౌజియా తప్పుగా అర్థం చేసుకున్నందుకు గజల్కి విపరీతంగా నవ్వొచ్చింది. కోపం కూడా వచ్చింది. ఖాన్ సాహబ్ తనకి అంకుల్. అంకుల్తో సరదాగా మాట్లాడితే ఆయన ఇంటికి వెళ్ళితే తప్పా? ఖాన్ మామా తనకేమౌతారో వీళ్ళకేం తెలుసు? తనని ఇబ్బందుల్లో ఆదుకున్న మనిషి, ఎన్నో విధాల సాయపడ్డారు, ఆయన చేసిన ఉపకారాలు సహాయాలు లెక్కలేనన్ని ఉన్నాయి.

ఇంటికి వచ్చిన తరువాత ఫౌజియా మాటలు తలుచుకుని ఆమె విపరీతంగా ఏడ్చింది. అల్లామియా? మనుషులెంత ధూర్తులో! ఆమె సంతోషాన్ని ఏమాత్రం సహించలేరు. ఆ రోజు నమాజ్ చేసుకున్న తరువాత ఖాన్ సాహబ్ భార్యని వెనక్కి తీసుకురమ్మని అల్లాని వేడుకుంది. అలాగ జరిగినట్లయితే లోకులీ విధంగా జుగుప్సాకారంగా మాట్లాడడం మానేస్తారు. చాలాసార్లు ఆయన ఇంటికి వెళ్ళడం మానేద్దామనుకుంది, కాని ఇంట్లో తోచేదికాదు. నిజానికి ఆయాజ్ తప్ప, మిగిలిన వారంతా దయగా చూస్తున్నారు. తండ్రైతే జీవితాంతం సంతానం ఎడల ఉపేక్షాభావం వహించినందుకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్టుంది. సాయా ఇప్పుడు అడక్కుండానే అన్నం పెడుతుంది. ఆయాజ్కి బీబీ, ఫౌజియా ఏం నేర్పిపెట్టారో కాని అతడికి గజల్ ఈ విధంగా బైట తిరగడం, ఖాన్ మామా ఇంటికి వెళ్ళడం అస్సలు నచ్చేది కాదు. అతడు చాలా సార్లు, వెళ్ళవద్దని అడ్డగించాడు, కొట్టాడు, దెబ్బలాడాడు. చిట్టచివరికి, తిరిగి ఎప్పుడైనా ఆమె ఖాన్ మామతో కలిసి ఎక్కడికైనా వెళ్ళినట్లయితే తను ఇల్లు విడిచిపెట్టి వెళ్ళినవాడు తిరిగి రానని బెదిరించాడు. అందువల్ల ఆయాజ్ అన్న మాటలికి గజల్ హడలిపోయింది.

అందరికీ ఆమె మీద కోపమే. ప్రత్యేకించి ఆమె ఖాన్ ఇంటికి వెళ్ళడం

ఎవరికీ ఇష్టం లేదు. నీరసంగా ఉన్నా చాంద్ కూడా చాలాసార్లు ఖాన్‌ని కలుసుకోవద్దని అతడు మంచివాడు కాడని కోప్పడింది.

'అరే ఊరుకో చాంద్ ఆపా...! ఖాన్ మంచి మనిషి. నువ్వసలు ప్రతివాడితో దెబ్బలాడి వచ్చేస్తావు...' ఇప్పుడు నేనేం చెయ్యను? ఎక్కడికెళ్ళను? ఖాన్ మామ ఉండి వుండకపోతే అబ్బ - నాన్న ఈపాటికి తనని ఖైమా చేసి కాకులకు గద్దలకు వేసేవాడు.

తరువాత ఒకనాడు, చాంద్ హుమాయూన్‌కి ఉత్తరం వ్రాసింది. ఖాన్ నడవడిక మంచిది కాదని, గజల్‌ని ఖాన్ ఇంటికి పంపవద్దని ఆ వుత్తరంలో వుంది. హుమాయూన్ ఆ ఉత్తరాన్ని ఖాన్‌కు చూపించాడు.

తరువాత ఒకసారి హుమాయూన్‌కి కుంటత్తకి దెబ్బలాట జరిగింది. ఒకసారి వాహిద్ హుస్సైన్, రాషీద్ అతనికి బోధపరచడం కోసం వచ్చారు.

గజల్ ఎప్పుడు ఫౌజియా విడిచిన బట్టలు వేసుకోవాలని, వాళ్ళ ఎంగిలి మెతుకులకోసం పడి వుండాలని అంటుండేవాడు హుమాయూన్. గజల్‌కి కూడా ఈ మాటలు నిజమే అనిపించింది. అత్తవారంతా తన శత్రువులు అనేవాడు. బతూల్ బ్రతికుండగా ఆలిఫ్‌లైలా నుంచి హుమాయూన్‌ని గెంటివేసినప్పుడు తన తాతగారికి పిల్లల బరువు గురించి చింత కలగలేదు. ఇప్పుడు గజల్ ఎంతో ఉన్నత స్థాయికి ఎదిగేసరికి అందరూ కళ్ళలో నిప్పులు పోసుకున్నారు. ఒకనాడు భారత్ కళా మండల్ ఆఫీసులో కూర్చొని ఖాన్ సాహెబ్ గజల్ కోసం ఎదురు చూస్తున్నాడు. ఇంతలో బిల్‌గరామి వచ్చారు. బిల్‌గరామి, ఖాన్ సాహెబ్ స్నేహితుడే కాకుండా ప్రతి నాటకంలో చాంద్‌తో హీరోగా అభినయించేవాడు. చక్కనివాడు, ఆరోగ్యవంతుడు. మంచి స్వభావం కలవాడు. చిన్నప్పుడు గజల్, చాంద్ ఆపాతో కలిసి ఇక్కడికి వచ్చే రోజుల్లో ఒక అందమైన మూగ గుమ్మను చూసినట్టు బిల్‌గరామీని చూస్తుండేది. బిల్‌గరామీ అభినయనైపుణ్యం బొంబాయి వరకు పాకిందని వినికిడి. అతను చాంద్ ఆపాతో కలిసి స్టేజి పైకి వచ్చేసరికి అప్సరసవంటి నాసిన్ ప్రేమ్ ఆధిబిల్ జంట వచ్చిందా అన్నట్టుండేది. చాంద్, భారత్ కళామండలి నుంచి వచ్చేసిన నాటి నుంచి ఇంకే అమ్మాయితోనూ కలిసి పనిచేయడం అతనికి నచ్చేది కాదు. అందరితోటి చక్కగా వ్యవహరించేవాడు. ప్రత్యేకించి గజల్‌ని చిన్న

పిల్లలాగా అభిమానించేవాడు.

ఒకసారి అతను, గజల్‌కి ఎత్తుమడమల జోళ్ళువేసి తనతోపాటు హీరోయిన్‌గా నటించేట్లు అవకాశమివ్వమని ఖాన్ సాహెబ్‌కి చెప్పాడు. కాని ఆయన ఒప్పుకోలేదు. స్త్రీలే కాకుండా పురుషులు కూడా బిల్‌గరామి అంటే ఇష్టపడతారనే విషయం ఖాన్ సాహెబ్‌కు తెలుసు. చాంద్ విషయంలో కూడా బిల్‌గరామి, ఖాన్ సాహెబ్‌ల మధ్య గొడవ జరిగిందని వినికిడి.

గజల్‌కి ఆ విషయం అసలు నచ్చేదికాదు. కళా మండలిలో ఎప్పుడు ఏదో ఒక గొడవ జరుగుతుండేది. ఆ గొడవలో చెప్పులు విసురుకునే దాక వచ్చేది. నిన్న అతియా మూలంగా వాయిలిన్ వాయించే రవి, మేకప్‌మెన్ సఆదత్ మధ్య గొడవ జరిగింది. ఎవరో బిల్‌గరామి, ఖాన్ సాహెబ్‌ల బాంధవ్యం గురించి వేళాకోళం చేసేసరికి, బిల్‌గరామి మూతి ముడుచుకుని కూర్చున్నాడు. ఒకసారి ఎప్పుడో బిల్‌గరామి, చాంద్ గురించి ఖాన్ సాహెబ్ అనేసరికి, ఒక్కొక్కడి పనిపట్టడం మొదలెట్టాడు. అతని అందాన్ని చూసి మెచ్చుకోవడం చూసి అందరూ ఈర్ష్యపడేవారు. అతడు తల్లిదండ్రులకు ఏకైక పుత్రుడు. తండ్రి రాజకుటుంబానికి చెందినవాడు. తల్లి ఇరాని స్త్రీ. ఏదో కాలేజీలో పనిచేసేది. బిల్‌గరామిలో ఇరాని అందం, రాచరికం గర్వం, డాబు దర్బారు రక్తములో జీర్ణించుకుపోయాయి. జాగీర్‌దార్ కాలేజీలో మూడుసార్లు బి.ఏ. తప్పిన అతను చదువుకు స్వస్తి చెప్పి సంగీత అభినయాలకేసి దృష్టి మరలించాడు. హైదరాబాదులో జరిగే ప్రతిపాట కచేరికి హాజరయేవాడు. ఉస్మానియా విద్యార్థులు నాటకాలు వేయడం ప్రారంభించేసరికి, ఈ నాటకాల్లో బిల్‌గరామి నాయకపాత్ర ధరించేవాడు. అతని పచ్చని కనుగుడ్లు, బంగారు వన్నెజుట్టు, మెరిసే ఇరాన్ దేహచ్ఛాయలు గంభీర కంఠం - కన్యలను, వివాహితులను కూడా సమ్మోహితుల్ని చేసింది. అతని డ్యుయెట్ పాడుతుంటే శృతులతో కూడిన అస్పష్టమైన గజల్ కంఠధ్వని ఎటో కొట్టుకపోయేది. అయినా అతను గజల్‌ని ఎంతో మెచ్చుకునేవాడు. నేడు బిల్‌గరామీ వచ్చేసరికి ఒంటరిగా దిగులుగా కూర్చొన్న గజల్‌ని చూసి పరిస్థితిని అర్థం చేసుకున్నాడు.

'ఈ మధ్య మీరెందుకనో దిగులు పడుతున్నట్లు కనపడుతున్నారు.'

నీవుకి బదులు మీరు సంబోధించిన మొట్టమొదటి వ్యక్తి, బిల్‌గరామి ఆ విధంగా సంభోదించేసరికి గజల్‌కి వెంటనే తన గొప్పతనము అవగాహన అయింది.

'లేదే! ఎంతో సేపటినుంచి మనస్సులో అణచుకున్న నిట్టూర్పు బైటికి రావడంతో ఆమె ఉలిక్కిపడింది. తాను దిగులు పడితే దానికి ఇంత ప్రాధాన్యత! జనం ఆమెను కొట్టి, ఏడిపించి మరిచిపోతారు. బిల్‌గరామి తననెందుకని ఇంతగా గమనించాడు. ఆమె వేడితాకిన కొవ్వొత్తిలా కరగడం మొదలెట్టింది.

'మీరు మీ భవిష్యత్తు గురించి బెంగపడుతున్నారు. మీవంటి అందమైన కళాకారుల భవిష్యత్తు నిజంగా బ్రహ్మాండంగా ఉండాలి.'

'అతను గజల్ దగ్గరగా వచ్చి కూర్చున్నాడు. అంత దయ చూపించకండీ అని ఆమె ఎలా చెప్పగలదు. అంత దయతో మాట్లాడుతుంటే నరాలు చిట్లి పోగలవు.'

'బ్రహ్మాండంగా వుండవలసిందే...! అతను రెప్పవాల్చకుండా గజల్‌ని చూస్తున్నాడు.'

'ఇదంతా ఖాన్ సాహెబ్ మూర్ఖత్వం లేకపోతే మీలాంటి కళాకారులు నాతో వుంటే ఎక్కడినుంచి ఎక్కడకు చేరుకునేవారో? ఖాన్ సాహెబ్ గురించి చెడ్డగా మాట్లాడడం ఆమెకు నచ్చలేదు. కాని ఆ రోజు ఏమయిందో నోటివెంట ఒక్క మాట రాలేదు.

'నిజం చెప్పాలంటే ఖాన్ సాహెబ్‌కు ప్రేమ వ్యవహారాలతో తీరిక దొరకదు. అందుకని కళా మండలిలో ఏ పని సక్రమంగా జరగదు.'

'మార్చ్‌లు షాకత్ ఛ్వాన్వీ డ్రామా అతి కష్టంమీద ఆమె నోరు పెకిలింది.'

'లేదండీ, వీళ్ళు ప్రేమకలాపాలు తప్ప ఇంకే పనిచెయ్యరు.' బిల్‌గరామి గజల్ మాటకి అడ్డొస్తు అన్నాడు. సిగరెట్ వెలిగించుకున్నాడు. గజల్ తల వంచుకుంది.

'పాపం చాంద్‌ని పట్టి పీడించి వదిలిపెట్టాడు ఖాన్ సాహెబ్. ఇప్పుడు ఇంక మీ వంతు...

ఆ సంభాషణ వదిలేసి వేరే విషయం గురించి మాట్లాడసాగాడు.

హైదరాబాదు హార్ట్ సొసయిటీ వారీ సంవత్సరం తమ నాటకంతో బొంబాయి వెళుతున్నారు.'

గజల్ గుండెల్లో ఎవరో బాకు గుచ్చినట్లయింది. చాంద్ ఆపాను ఖాన్ సాహెబ్ నాశనం చేశాడా ఇప్పుడు ఇంక నా వంతా... నిజంగానే ఖాన్ సాహెబ్ నన్ను ప్రేమిస్తున్నాడా? హాయ్ అల్లా ఇప్పుడు ఏదీ దారి?

'ఊహ్, పోనీ మాకేమిటి అక్కడి నుంచి లేచి పారిపోవాలనిపించింది. బిల్‌గరామికి ఆమెకి సంబంధించిన నిజాల్ని తెలుసు.'

'నేను కూడా కళా మండలిని విడిచిపెట్టి హైదరాబాదు హార్ట్ సొసైటికి వెళ్ళిపోవాలనుకున్నాను, అశోక్ కుమారులాగా ముఖం పెట్టి అన్నాడు.'

'ఎందుకు? గజల్‌ని ఎవరో ఒక్కతోపు తోసినట్లయింది. ఇప్పుడు ఇంక ఖాన్ సాహెబ్ నుంచి దూరంగా పారిపోయి ఎక్కడికి వెళ్తుంది? ఆమెని ఎవరు ఆదరిస్తారు?'

'ఏం చెయ్యం? మమ్మల్ని ఎవరు పట్టించుకుంటారు ఇక్కడ?'

అతను గజల్ ముఖాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు.

'అతనామె అభినయాన్ని మెచ్చుకుంటారు కదా!' ఆమె నెమ్మదిగా అంది.

'నాకు లోకుల అభిప్రాయాలతో పనిలేదు. నిజం చెప్పాలంటే నేను కేవలం నీ కోసమే పడివున్నాను.'

'నా కోసమా... నాకోసమా... కేవలం నాకోసమా... ఇంత అందగాడు...'

ఇంత గొప్పవాడు... ఇంతటి పేరు ప్రఖ్యాతులు కలవాడు... అతడి హావభావాలకి చాంద్ మొదలుకొని రజియాదాక పడిచచ్చేవారు! ఆటోగ్రాఫు పుస్తకం తీసుకుని అతని వెంట పడే స్త్రీలు ఈ రాకుమారుని వంటి అందమైన హీరో నాకోసం... యా అల్లా... ఏం జరుగుతుంది ఈ రోజు? నేను మరణించను కదా... బిల్‌గరామి ఆ కరుణ, ఆ వినయము ఎన్ని రంగులలో కనబడుతోందో! ఎన్ని నెలవంకలై మెరిసిందో! ఆకాశం నుంచి వర్షించి గజల్‌ని ఆపాదమస్తకం ముంచెత్తింది. తనలో ఇంకేమి మిగిలిందని. దాచిపెట్టడానికి! తనకు తానే రాబోయే కన్నీటికి జలుబు పేరుతో ఎన్నోసార్లు తుడుచుకుంది. బిల్‌గరామి నెమ్మదిగా ఆమె చెయ్యి చూడడము, తన ఎడల జరగనున్న అన్యాయాలను లెక్కపెట్టడంలో

కాలయాపన చేస్తున్నాడు. ఎగురుతున్న పక్షుల రెక్కల సైతము. - లెక్కించగల నేర్పు చురుకుదనము ఉన్న కళాకారులెందరో కళా మండలిలో ఉండేవారు. దురదృష్టవంతులైన ఆ కళాకారులు ఏమయ్యారో! నేడు గజల్ చెయ్యి, బిల్ గరామి చేతిలో వుంది. ప్రేమాభిమానాలు చవిచూడని గజల్ ప్రేమకోసం పరితపించి నేడు మానసికంగా తన సర్వస్వాన్ని తనకర్పించేసిందన్న విషయము ఆ మూర్ఖుడికి తెలియదు. అర చేతిలోని రేఖలను చదివే నెపంతో అతడు చెయ్యి పట్టుకుని కూర్చున్నాడు. విపరీతమైన ఎండలో కూడా చలివేస్తున్నట్టు, వణుకుతూంది గజల్. ఆమె చేతులు చెమటలతో తడిసిపోయాయి. ఎంత ప్రయత్నించినా ఒక్క మాటైనా మాట్లాడలేకపోయింది. బిల్‌గరామి తన సాముద్రిక శాస్త్ర పరిజ్ఞానానికి సంబంధించిన చిత్రవిచిత్రమైన కథలు చెప్పసాగాడు.

'మీ చేయి చాలా టిపికల్‌గా వుంది.' కొంత కంగారు పడినట్లు కనబడి తిరిగి సర్దుకున్నాడు. ఆమె అరచేతిని అటు ఇటు తిప్పి పరిశీలించసాగాడు. గజల్ పట్టు పట్టేసరికి ఒక్కొక్కమాటే చెప్పసాగాడు.

'మీరెవర్ని నమ్ముతున్నారో అతడు ఒట్టి స్వార్థపరుడు. మీరు చిన్నప్పటినుంచి ఎటువంటి ఆనందాన్ని పొందలేదు.' కాని కొద్దికాలం తరువాత మీ భవిష్యత్తు చాలా గొప్పగా వుంటుంది. ఇది సత్యం.

గజల్ ధైర్యాన్ని కూడగట్టుకుని మొట్టమొదటిసారి అతనికేసి చూసింది. ఆపాదమస్తకము ఒక విధమైన సంచలనం కలిగింది. బిల్‌గరామికి తను ఏమి పొందానో తెలిసిందో లేదో!

'మీ భర్త చాలా అందంగా వుంటాడు.'

ఇది విన్న గజల్ తన చెయ్యి విడిపించుకుందీ, రెండు చేతుల్లో ముఖం దాచుకుంది.

'కాని మీరతన్ని హృదయపూర్వకంగా గౌరవించరు.' అని అతడు చెయ్యి చూసినందుకు ఏదో నా ఫీజు తొందరగా ఇవ్వండి.

సరిగా అదే సమయానికి చాడీలు చెప్పే స్వభావంకల రవి లోపలికి వచ్చాడు. వాళ్ళిద్దరినీ కుతూహలంగా చూడసాగాడు.

'ఇదా పద్ధతి! నన్ను, గజల్ సుల్తానని పిలిచి గంటయింది.'

బిల్‌గరామి కోపంగా రవితో అని, వెళ్ళిపోతున్న గజల్ చెయ్యి గబుక్కున

పట్టుకున్నాడు. తియ్యండి, తియ్యండి, నా ఫీజు త్వరగా!

'నా దగ్గర ఏమి లేదు'? నిస్సహాయంగా అంది గజల్, నిజానికి ఫ్యాషనుగా పర్సు పుచ్చుకుని తిరిగేది. అంతేకాని తండ్రి నేటి వరకు ఎప్పుడూ ఒక రూపాయని ఇవ్వలేదు దగ్గర వుంచుకోవడానికి.

'సరే తర్వాత వసూలు చేసుకుంటాను!' అతను తన సిగరెట్ కేసు తీసుకుని మెల్లిగా పాడసాగాడు 'తక్రిచ్ కుచ్‌తో బహారే - ములాకత్ చాయి ... సక్‌హై... వారేసఖ్... తకిరీప్... అచ్చా చెల్దియ్, టాటా!'

ఆ రాత్రి గజల్‌కి అస్సలు నిద్రపట్టలేదు. తనేదో పెద్ద తీరంలో ఉన్నట్లు అనిపించింది. నలువైపులా విమానాల హోరు. రాట్నాల శబ్దము, ఎక్కడో మేఘాలు హోరుమని గర్జిస్తున్నాయి. తరువాత కారు టైరు పేలింది. అకస్మాత్తుగా ఆ నిశ్శబ్ద వాతావరణంలో బిల్‌గరామి కూనిరాగాలు వినబడ్డాయి. దేక్‌దిల్‌కే జమిల్ దరాస్తిహె ఎదే జాన్ కదీమ్ సబ్‌ల్ ఆప్‌న - ఆమె ఎన్నో సార్లు ఆ గజల్‌ని బిల్‌గరామి మత్తెక్కించే కంఠంతో పాడుతుండగా విన్నప్పుడు శ్రోతలు ఊగి సోలేవారు. అన్ని సభల్లో, పార్టీల్లో ఈ గజల్ పాడమని కోరేవారు, అందరి హృదయాలలో ఇంతటి పేరు ప్రఖ్యాతులున్న వ్యక్తి... తన గురించి...?

'ఆమె హృదయం ఖంగారు పడిందో లేక సంతోషంతో పొంగిపోయిందో అర్థం కాలేదు. కళ్ళు తుడుచుకున్న తరువాత ఖాన్ సాహెబ్ తిరుగుడు చరిత్ర హీనత అవగతమైంది. ఆయన చాంద్ ఆపాని సర్వనాశనం చేసాడు. పాపం చాంద్ ఆపా తన గదిలో పడివుంది. కానీ ఆమె క్షేమ సమాచారం కనుక్కోవడానికి ఎప్పుడూ ఆయన రాలేదు...' తన భర్తని అగౌరవపరచడం విషయమై కోపం వచ్చింది... అతను ఎవరో... ఎక్కడుంటాడో? అల్ప వయస్కురాలైన కన్నెల్లాగే గజల్ కూడా ఇంకా తను కాబోయే భర్త రూపకల్పన చేయలేదు. అదింకా ఒక అస్పష్టమైన నీడలాగే ఉంటూ, ఎల్లప్పుడూ ఎదురుగానే వుంటూ కంటికి కనబడటం లేదు.

'అసలు ఇంత మంచి మనిషిని ఎలా అగౌరవించను. ఎంతో చింతించేది. దరిద్రపు మొహాన్ని! నేను ఎప్పుడు పిచ్చిపనులే చేస్తుంటానని నాన్న అన్న మాట అక్షరాలా నిజం అయితే ఈ మూర్ఖత్వానికి అంతం వుండదా!'

తన భయాలు దుఃఖాలు ఇంకెవరి జీవితములోను గుమ్మరిస్తే బాగుండుననిపించేది. కాని ఆమెకి చిన్నప్పుడు బొమ్మల పెళ్ళిళ్ళు చేసి గుజ్జనగూళ్ళు ఆడుకున్నటువంటి స్నేహితురాళ్ళెవరూ లేరు. ఇటువంటి ఆటలకు సరదాలకి ఆమెకు అవకాశం ఎక్కడ దొరికింది? అసలు ఊహ తెలిసినప్పటినుంచి నలువైపుల నుంచి ఆమెకు లభించినవి - ఛీత్కారాలు చెప్పుదెబ్బలే. పాపం చాంద్ ఆపా తనని రంగస్థలం పైకి తీసుకొచ్చి ఉండకపోయినట్లయితే నేడు బిల్‌గరామి నేను కేవలం నేను నీకోసం...! అనేవాడా? ఎటు తిరిగీ ఫౌజియా ఒకతే ఉండేది. కాని అత్త ఆమెని తన నీడకూడ పడకుండా జాగ్రత్త పడుతుంది. ఆమె కూడా స్వతహాగ గర్విష్టి.

కాలేజీల్లో ఉపన్యాస పోటీలో పాల్గొంది. పరదాలు కట్టిన కారులో కాలేజీకి వెళ్ళేది. షాహీన్ మిత్రుడి ఎదుట పడటానికి కూడా సాహసించేది కాదు. బంధువర్గంలో వరసకి అన్నలైన వారి ముందుకూడా గట్టి పరదా వుండేది. చాంద్ విషయము అనుభవంలోకి వచ్చాక - అత్తని గొప్ప చేసింది.

షాహీన్ డాక్టరీ చదవటానికి అలీఘర్ వెళ్ళిపోయాడు ఆయాజ్‌కి అతడంతే అసహ్యం వేస్తూంది. అతడు చదువు సంధ్యలు విడిచిపెట్టి ఇప్పుడు ఇత్తెహాద్ -ఉల్-ముసల్‌మీన్‌లో ప్రముఖ సదస్సుడు అయిపోయాడు. రేయింపగళ్ళు గొడవల్లోనే మునిగి తేలిపోయేవాడు. ఆయాజ్ గురించి ఆలోచించేపాటి తీరుబడి హుమాయూన్, గజల్‌లో ఎవరికి లేదు.

ఉదయం ఖాన్ సాహెబ్ వస్తే ఈసారి నాటకంలో బిల్‌గరామితో నాయిక పాత్ర ధరిస్తానని చెప్పుదామని నిర్ణయించుకొంది, కాని ఖాన్ సాహెబ్ టూర్లో వున్నాడు.

సాయంత్రం బిల్‌గరామి వస్తే ఈ విషయం చెప్పింది. అతను కార్లో వచ్చాడు. అసహ్యంగా వున్న తన గదిలో బిల్‌గరామిని కూర్చోబెట్టటానికి గజల్‌కి ఎంతో సిగ్గుగా వుంది.

తను ఎంతో సామాన్యమైన పిల్ల అని తప్పక అనుకుంటాడు. ఎంత బీదదీ... అతడు ఎంత గొప్పగా వున్న కార్లో తిరుగుతుంటాడు. అంత గొప్ప తండ్రికి తనయుడు అల్లా ఇంటికెందుకొచ్చాడు.

'హుమాయూన్ లుంగీ విడిచి, ఉతికిన పైజమా కుర్తా వేసుకుని వచ్చేసరికి బిల్‌గరామి కార్లో గజల్‌ని కూర్చో పెట్టుకుని కారు స్టార్ట్ చేసాడు.'

హుమాయూన్‌కి చాలా కోపం వచ్చింది. ఖాన్ సాహెబ్‌కి ఈ కుర్రాడికి అదే తేడా. హుమాయూన్ అనుమతి లేకుండా ఖాన్ సాహెబ్ ఎప్పుడూ గజల్‌ని తీసుకెళ్ళే సాహసం చేయలేదు. కాని ఆ రోజు కొత్త డ్రామాకి సంబంధించిన కళాకారుల మీటింగ్ ఉందని ఈపాటికి అక్కడికి చేరుకొని ఉండవలసిందని హుమాయూన్‌కు తెలుసు. అందుచేతనే కాబోలు ఖంగారులో బిల్‌గరామీ కారు దిగలేదు. గబాగబా బట్టలు మార్చుకుని తన పాత సైకిల్ తీసుకుని హుమాయూన్ సొసైటికి చేరుకున్నాడు.

కాని అక్కడ ఖాన్ సాహెబ్ అక్కడ కూర్చుని ఏదో కాగితాలపై సంతకాలు చేస్తున్నాడు. దర్గయ్య హార్మోనియమ్ తీసుకుని ఒక మూల కూర్చుని రీ... రీ... అంటూ వాయిస్తున్నాడు.

ఇంకా నాలుగు అవలేదు, అందువల్ల ఆర్టిస్టులెవరూ రాలేదు.

గౌరవ పురస్సరంగా సలామ్ చేసిన తరువాత గజల్ ఎక్కడుంది అని అడిగాడు.

'గజల్...'

'అవును. బిల్‌గరామీ సాహబ్ ఇప్పుడే వచ్చి కార్లో తీసుకొచ్చారు.'

'బిల్‌గరామీ...? తన కార్లోనా?' ఖాన్‌సాహబ్ లేచి నుంచున్నారు. కోపంతో హార్ట్ ఎటాక్ వచ్చినట్టు చతికిలబడ్డారు. అశాంతితో కాళ్ళు చేతులూ కొట్టుకుంటున్నారు. ఆయన అలా చింతించడము చూసిన హుమాయూన్ కంగారు పడ్డాడు.

'వాళ్ళిప్పుడే వచ్చేస్తారు! అతడు ఖాన్ సాహబ్‌ని శాంత పరుద్దామనుకున్నాడు.'

'మీరింటికి వెళ్ళండి... వాళ్ళు రారు! 'ఖాన్ సాహెబ్ కంఠంలో బాధ ధ్వనించింది.'

'సాలీ... హరామ్ జాదీ... నాకు చెప్పకుండా వెళ్ళిపోయింది! ఈ రోజు దాన్ని చంపేస్తాను' ప్రయత్నించి కూడా తన వాక్కునదుపులో పెట్టుకోలేక పోయాడతను.

'ఆమెని బిల్‌గరామి చంపుతాడు' ఖాన్‌సాహబ్ బాధతో తల పట్టుకుని

కూర్చున్నారు.

'నాన్నగారు నన్ను చంపేస్తారు. ఆయనకి చెప్పి వస్తాను.'

గజల్ చెయ్యి పట్టుకుని బిల్‌గరామీ ఆమెను లోపలికి లాగేసరికి, ఆమె ఖంగారు పడింది - కారు స్టార్ట్ అయ్యాక, అతడు నవ్వుతూ ఆమెను చూశాడు. నేడు నేను కూడా మిమ్మల్ని బాగా కొడతాను.

ఎందుకు...? ఆమె తన మాసిపోయిన దుస్తుల్ని దుపట్టాతో కప్పుకుంటూ నిజంగానే ఖంగారు పడింది.

'మీరు నన్ను ఆరు నెలల్నుంచి ఏడిపిస్తున్నారు!'

'నేనా...? ఉలిక్కిపడింది.'

'కాకపోతే ఇంకెవరు...?' బిల్‌గరామి ఆమెను రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. మాటిమాటికి ఎదురుగా వస్తూన్న వాహనాల్ని చూసి బ్రేక్ వెయ్యవలసి వస్తూంది.

'ఇంత లెక్కలేనితనమా... మీకు మీరు తప్ప వేరెవరూ కనబడరు...?'

గజల్‌కి ఎవరో మత్తింజక్షను ఇచ్చినట్టు, కాళ్ళు చేతులు పట్లు తప్పాయి. నేనెవర్ని? నా ఉనికి ప్రాముఖ్యత నాకెప్పుడూ తెలియలేదు! నా చూపులను కూడా ఎవరైనా పరిశీలించగలరా?

'సరే నా ఫీజేది?' గజల్ మౌనంగా ఉండడం చూసి అతడు మరొక ప్రశ్న వేశాడు.

ఎక్కడో అణిచివేయబడ్డ నవ్వామెను వెతుక్కుంటూ వచ్చింది... ఆమె నవ్వడం మొదలైంది. చార్‌మీనార్ దాటిపోయింది. ముఅజ్జమ్ జాహీ మార్కెట్ వచ్చింది. ఒక కిళ్ళీ కొట్టు దగ్గర బోలెడంతమంది కవులు, కళాకారులు నిలబడి ఉన్నారు. గజల్ నవ్వుకి ఆశ్చర్యపడి అటు చూసేసరికి, బిల్‌గరామీ చెయ్యి ఊపి అందరినీ విష్ చేశాడు. అబిడ్ రోడ్ వచ్చింది.

'భారత కళా మండల్ అయుంటుంది...' నవ్వుతూ అని ఒంగి ఊరేగింపు చూడసాగింది, ఊరేగింపు బ్రహ్మాండంగా ఉంది. బోలెడంత సారె, అల్లా! ఇంత సారె కట్నం అవి ఎక్కడ్నించి వస్తాయి. గజల్ ఖంగారుగా ఆలోచించసాగింది... బాగా రద్దీగా ఉండడం వలన బిల్‌గరామి కారు స్పీడు తగ్గించవలసి వచ్చింది. పెళ్ళి కొడుకు గుర్రం మీద కూర్చున్నాడు. ముఖము సెహరాపూల మాలలతో కప్పి వుంది. ఎర్ర రుమాలు కట్టిన

తల్వారు ఉంది అతని చేతిలో! ఆ చేత్తో అక్కడున్న జనానికి మాటిమాటికీ సలామ్ చేస్తున్నాడు.

'ఇతడి పెళ్ళికూతుర్ని లాంకొ్కొచ్చేయాలనిపిస్తూంది.' బిల్‌గరామికి నిజంగానే కోపం వస్తూంది. అతడికి ప్రతి పెళ్ళి కొడుకు మీదా కోపం వచ్చేది. ఆ పెళ్ళి కూతుళ్ళనెత్తుకు పోయేందుకు ఉపాయాలాలోచించేవాడు.

గజల్‌కింకా నవ్వొచ్చింది. వారు పట్టణపు వీధి, గోల్‌కొండ రోడ్డు కేసి నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుపై వెళుతుండగా గజల్ ఇటు - అటు చూసింది... సాయంకాలపు చల్లని గాలులు ఆమె ముంగురులను తాకుతున్నాయి. బెరక్స్‌లోని సైనికులు హాకీస్టిక్స్, క్రికెట్‌బాట్స్ తీసుకుని గ్రవుండ్‌కేసి వెళుతున్నారు. ఎక్కడో దూరంగా భాగమతి మహల్ కనబడుతూంది. కోటకెదురుగా కొండరాళ్ళపై కట్టిన మహల్ కనబడుతూంది.

'గజల్ నేను కోటపైకెళ్ళి నిన్ను పిలిస్తే నువ్వు వింటావా? బిల్‌గరామీ ఆమె పైకి పూర్తిగా వంగుతూ అన్నాడు.'

'పో...! గజల్ నువ్వు పిలవకపోయినా, నీ కంఠధ్వని వింటూంటాను మనసులో అనుకుంది గజల్.

వాళ్ళిద్దరూ ఏదో సినిమాలో యాక్ట్ చేస్తున్నట్లు అనిపిస్తూంది. అచ్చు సినిమాలోలాగే ఉంది దృశ్యం. హీరో, హీరోయిన్లు కార్లో కూర్చుని అడవుల్లోకి వెళ్ళిపోతున్నారు. ఉన్నట్లుండి పెట్రోలు అయిపోతుంది, లేకపోతే టైర్ పేలిపోతుంది. అదీకాకపోతే హీరోదారి మర్చిపోతాడు, కాని బిల్ గరామి ఈ దార్లన్నిట్లో చాలాసార్లు వచ్చాడు. అందుచేత అతడు ఉస్మాన్ సాగర్ దగ్గర నిర్మానుష్యంగా ఉన్న ఒకచోట కారు ఆపి, అచ్చు అశోక్ కుమార్‌లాగ ఆమెను పట్టుకుని కిందికి దింపాడు.

'అల్లా... ఎన్ని నీళ్ళో...! తను హృదయంలో అణిచి ఉంచిన నవ్వులాగ ఈ నీళ్ళు కూడా ఇప్పుడే బైటికొచ్చి నలుమూలలా వ్యాపిస్తున్నాయి. ఎగురుతున్నాయి. మిలమిలలాడుతున్నాయి... పొరలు పొరలుగా... నీళ్ళెప్పుడైనా ఇంతగా మెరుస్తాయా... బంగారంలాగ ఒకచోట... వెండిలా మరోచోట... ప్రవహిస్తున్న తరంగాలను చూసేసరికి కళ్ళు తిరిగినట్లయింది. ఇది కల కాదు కదా... ఆమె భయంతో బిల్‌గరామి చేతిని పట్టుకుంది. ఇది

కలా లేక నిజమా అన్న విషయం తలచుకుని ఆమె నవ్వింది.

'అల్లా! ఎంత మంచిదీ చోటు! విశాలమైన ఆకాశాన్ని మొట్టమొదటిసారి చూసింది.

'ఇదివరకు ఇది అసలు బాగుండేది కాదు. ఇవాళ నువ్వు రాబట్టి ఇంత అందంగా మారిపోయింది!' బిల్‌గరామి ఆమె చేరువకొచ్చేసరికి అతడి నోటినుంచి, ఖాన్ సాహెబ్ నోటి నుంచి వచ్చేలాంటి పెట్రోల్ వాసనే వచ్చింది. గజల్‌కి ఆ వాసన పడేది కాదు, దూరంగా జరిగింది. బిల్‌గరామికిది నచ్చలేదు.

'మీకు నేనంటే అసహ్యం అని ఖాన్ సాహెబ్ సరిగ్గానే చెప్పారు.' అతడు చాలా బాధగా సిగరెట్టు వెలిగించుకుంటూ ఒక రాతి మీద కూర్చున్నాడు.ర

'అసహ్యమా...? నవ్వుతూ నవ్వుతూ హఠాత్తుగా ఆగిపోయింది. మీరంటే నాకెందుకసహ్యం? జీవితమంతా ఇతరులు ఛీదరించుకున్న గజల్ కదిలిపోయింది. ఎవరినీ నేనంత కష్టపెట్టను శత్రువుల్ని కూడా అన్ని బాధలు పెట్టను.'

'అచ్ఛా! అసహ్యం లేకపోతే అతను తడబడుతూ లేచి ఆమె ముందుకొచ్చి చెయ్యి చాపాడు.'

'ఇదిగో తీసుకో...!' ఆమె, బిల్‌గరామి చేతిపై ఒక్క దెబ్బవేసి రాళ్ళకేసి పరుగెట్టింది. కేవలం పసిపిల్లలాగ చేతిపై ఒక్క దెబ్బవేసి నవ్వుతూంది. బిల్‌గరామి ఆమె వెంట పరుగెడుతున్నాడు. ఆమె ఎత్తైన రాళ్ళపై కాళ్ళు ఆనించి దోసిళ్ళతో నీళ్ళు తీసి బిల్‌గరామీ పై పొయ్యసాగింది. అంతే... ఇంక ముందంతా నీళ్ళే... సాయంత్రపు నల్లని నీడలు ఆకాశపుటంచులు నీటిలో విలీనమైపోయినట్టుంది. చెరువు గట్టు చివర బెస్త కుర్రవాడొకడు నీళ్ళలో వల పన్ని కూర్చుని ఉన్నాడు. ఎర్రగా ఉండి క్రమంగా నల్లబడుతున్న సాయంత్రపు వెలుగులో దూరంగా ఇద్దరు మనుష్యుల నీడలు ఒకదాన్నొకటి వెంటాడుతున్నట్టు గమనించాడతడు... ఒక రాత్రి రాతి చాటున దాగున్న వారిరువురు బైటికి రానేలేదు... రాత్రి అవుతూంది. వాళ్ళిద్దరూ ఎదుటపడితే తన వలని తీసుకోవచ్చు అనుకున్నాడా బెస్తకుర్రవాడు. నేడీ రెండు నీడలే తన వలలో చిక్కుకుంటాయేమో

అనిపించిందతనికి.

రాత్రి నొప్పి పెడుతున్న గజల్ శరీరంపైన మరో నాలుగుతన్నులు తన్నాడు, తండ్రి. తన్నులు పూలవలె ఉన్నట్టు గజల్ నవ్వుతూనే ఉంది. నేడేమిటో శరీరం చాలా తేలికగా అయినట్లు అనుభూతి కలిగింది. గజల్‌కి బిల్‌గరామీ చేసిన ఉపకారాలన్నిటికి సహాయాలన్నిటికీ బదులు తీర్చేసినట్టనిపించింది. విషయమంతా తండ్రికి చెప్పెయ్యమని మరునాడు ఖాన్ సాహెబ్‌కు చెప్పింది. అంత పేరు ప్రఖ్యాతులు గల ఐశ్వర్యంగల అల్లుడు తనకు లభిస్తున్నందుకు తండ్రి కూడా సంతోషపడ్డాడు.

చెప్పుదెబ్బలెన్నో సహించింది, చాలు... ఇంకిక్కడుండను పెళ్ళి ఏర్పాట్లు త్వరగా చేయించమని మరునాడు ఖాన్ సాహెబ్‌కి చెప్పాలనుకుంది. కాని ఖాన్ సాహెబ్ మరునాడు రాలేదు. కాని తన సంతోషంతో ఆయన కోసం ఎదురుచూడడం కూడా జ్ఞాపకం లేకపోయింది, గజల్‌కి. తన విలువైన రెండు చీరలు ఒక పౌడరు డబ్బా ఖాన్ సాహెబ్ ఇంటి దగ్గర ఉన్నాయి.

బిల్‌గరామి కూడా రావచ్చు...

నాల్గవ రోజు ఖాన్ సాహెబ్ డ్రైవరు ఒక అంటించిన కవరు హుమాయూన్‌కిచ్చాడు, అందులో పదిరూపాయల నోట్లు పదున్నాయి. ఆ పైకం గజల్‌కి ఇవ్వవలసింది, దాంతోపాటు ఒక చిన్న ఉత్తరం కూడా ఉంది. పనుల వత్తిడి వలన తను గజల్ హుమాయూన్‌లకు ఎటువంటి సహాయము చేయలేకపోయానని అందులో రాసి ఉంది. కనుక ఆయన స్వయంగా తనింటికి రావలసిన అగత్యం కూడా లేదని వ్రాసి వుంది ఆ ఉత్తరంలో.

గజల్ ప్రసక్తే లేదు. తండ్రి కంగారు పడ్డాడు. కానీ గజల్ ఏడవడం మొదలుపెట్టింది. ఖాన్ సాహెబ్ మంచితనం జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడింక హుమాయూన్ భవిష్యత్తు ఏమౌతుంది? అంటే ఆలిఫ్- లైలాలోని అతని భాగం అప్పెలా తీరుతుంది? చాంద్ ఆపా చెయ్యి పట్టుకుని గదిలోంచి గెంటేసినప్పుడు ఎంత బాధపడిందో అలాగే అనిపించసాగింది. ఖాన్ సాహెబ్ ఎదురుగా ఉండి ఉంటే తల, ఏ గోడకో వేసి కొట్టుకుని మరణించి ఉండేది. ఈ తీవ్రమైన యాతననుంచి ముక్తి అయినా లభించి ఉండేది.

బిల్‌గరామి వస్తే, అతనితో వెళ్ళి ఖాన్ మామని క్షమార్పణ

కోరుకుందామని ఎదురు చూడసాగింది.

హుమాయూన్, ఖాన్ సాహెబ్ ఉత్తరాన్ని లెక్కలేనట్లు మంచం మీద విసిరి వేశాడు. గజల్‌లాంటి అందమైన అమ్మాయిలకి మంచి డిమాండ్ ఉందని. ఖాన్ సాహెబ్ లాంటి పిచ్చివాళ్ళు ప్రతి వీధిలో లభించగలరు. ఈ నిజాలు అతనికి అవగతమయాయి. అందుకని, లెక్కలేనట్టు ఆ ఉత్తరాన్ని మంచంపై విసిరేశాడు.

ఇప్పుడతను, ఇతరుల ముందు తను చాలా గొప్ప వాడైనట్టు ప్రవర్తించసాగాడు. మిస్కిన్ ఆలీషాహ్ తనయుడు కావడం వల్లన అయిదో పదో హిందుస్తానీ సినిమాలు చూడాలి. వార్తా పత్రికల్లోని వార్తకేనాడు ప్రాధాన్యతనివ్వలేదు. మారుతున్న ప్రపంచపు పరిస్థితులనెప్పుడూ గమనించలేదు. అలిఫ్- లైలా నుంచి బైటికొచ్చినప్పటి నుంచి రోజంతా ఫైళ్ళతో గడిచిపోయేది. పార్టీల్లో భారతదేశపు చింతాజనకమైన రాజకీయ పరిస్థితుల గురించి జనం చర్చించుకునేవారు, మార్లిన్ మన్రో కళపైనా, పికాసో కళ్ళపైనా సంభాషణలు జరిగేవి. అటువంటప్పుడు కుర్చీని వెనక్కు జరుపుకుని సిగరెట్ పొగ గుప్పు గుప్పున వదులుతుండేవాడు. మొదట్లో అతన్నెవరూ పట్టించుకునే వారు కాదు.

గజల్, చాంద్, ఖాన్, సాహబ్‌తో లేకుంటే ఇబ్బందిగా ఉండేదతనికి. ఎప్పుడైనా ఖాన్ సాహెబ్ దృష్టి అతనిపై పడితే హుమాయూన్‌ని వీరు గజల్ బీబీ ఫాదర్ హుమాయూన్ అలీషాహెబ్!' అంటూ పరిచయం చేసేవారు.

ఫాదర్... ఒక కళాకారిణి తండ్రి అవడం వలన, కళాకారులకు సంబంధించిన తన పరిజ్ఞానాన్ని ఒలకపోసేవాడు. మంచి కళాకారులు కరువైపోయారనీ అభినయంలోని ప్రత్యేకతలను గురించో, లేక రంగస్థలం అవసరాలను గురించో తాను విన్నవి ఏకరువు పెట్టేవాడు. అతనా విధంగా మాట్లాడడం చూస్తే మిస్కిన్ ఆలీషాని వంశంలో షీరా - మురీద్‌కి మారుగా రంగస్థలం - నాటకాలు మొదలైన వాటికి శిక్షణ యిచ్చేవాడేమో అనిపించింది.

తన అనుభవాన్ని బట్టి బట్టతల ముసలాడి గుప్పెట్లోంచి గజల్‌ని విడిపించడం మంచిదని ఆలోచించాడు తను. బిల్‌గరామి కూడా

చెడ్డవాడేమీ కాదు. బంజారా హిల్స్‌లో ఉండే గొప్పవారితో అతడికి పరిచయాలున్నాయి. అతడితో వుంటే గజల్ స్థాయి బాగా పెరిగే అవకాశాలున్నాయి. ఇంకేముంది... పొద్దు వాలే ముందు గుమ్మం దగ్గర బిల్‌గరామీని కారు హారన్ వినిపించేది. గజల్ వేడి టీ కప్పు తెచ్చేది. ఒక్కొక్కపుడు దుపట్టా వేసుకోవడం మర్చిపోతే వేరొకప్పుడు జడ వేసుకోవడం మరిచిపోయేది.

ఆ బెస్తవాడు వారి నీడలకోసరం ఎదురు చూస్తుండేవాడు. ఆ కుర్రాడు వారికొరకు ఎదురుచూసి చూసి అలసిపోయేవాడు. బిల్‌గరామీ కూడా ఒకే దారిలో నడుస్తుండడం వలన విసిగిపోయేవాడు. ఇంత అందమైన అమాయకురాలైన పిల్లనెవరైనా మోసగించడమెలాగని ఆలోచించడానికి కూడా భయపడసాగాడు. ఆ రోజుల్లోనే మిస్టర్ చడ్డా హైదరాబాదు వచ్చారు. సినిమాలకోసం క్రొత్త ముఖాలను వెతుక్కుంటూ వచ్చారాయన. ఆయన లెటర్ హెడ్‌పైన విల అభిత్ ప్రొడక్షన్స్ అని వ్రాయబడి ఉంది. ఆ కంపెనీకి నిర్మాత, డైరక్టరు, కథా రచయిత, అన్నీ ఆయనే. ఒక్క సంగీత దర్శకుని పేరు మాత్రం ఆ పాడ్ మీద లేదు. కాని వేరు వేరు సంగీత సభలతో తన సంగీత పరిజ్ఞానాన్ని వ్యక్తం చేసిన విధానాన్ని బట్టి అంతా ఆశ్చర్యపోయారు. తరువాత తన గొప్పతనానికి సంబంధించిన చిత్ర - విచిత్రమైన సంఘటనల గురించి, ఆయన వివరించారు. అతి సాధారణైన పేజీ మాస్టర్ నౌషాద్ బహుజనాదారణ పొందిన, బాణీలన్నీ నిజానికి తాను కట్టినవేనన్నారు, బర్మన్ తన శిష్యుడు అన్నారు. లతా క్రొత్త కాంట్రాక్ట్ కోసం తన ఇంటి చుట్టూ తిరుగుతోందన్నారు.

తన వ్యాపార సందర్భంగా ఆయన ఎప్పుడూ ఎక్కడికో ధర్మబోధ చేసే గురువులు - శిష్యుల, కర్తవ్యం కోసం ట్రంకాల్స్ చేస్తూండేవారు. ఆయన నోట్‌బుక్‌లో రేయింబవళ్ళు ప్రతి క్షణంకి సంబంధించిన కార్యక్రమాలు వ్రాసి ఉండేవి. ఆయనకి హీరోయిన్ల అవసరం వుంది. మద్రాసు, ఢిల్లీ, కలకత్తాలో అమ్మాయిల్ని వేల సంఖ్యలో నిరాకరించారు.

కాని ఆయన వస్తూనే బిల్ గరామీ ఎలా ఎదుర్కొన్నాడంటూ ఆశ్చర్యపోయారు. ఖాన్‌సాహెబ్‌కి ఈర్ష్య కలిగింది. ఆయన ఈ మధ్య భారత్ కళా మండల్‌కి రావడంలేదని ఒక ఇంజనీరు గారమ్మాయికి

పాకశాస్త్రం నేర్పడంలో నిమగ్నులయ్యారని వినికిడి.

బిల్‌గరామీని అనుకరిస్తూ, నగరంలోని ఉన్నత వంశాలకు చెందిన వారు, సాంస్కృతిక సంస్థలు, మరెంతోమంది కళాకారులు మిస్టర్ చడ్డాకి విందులు ఏర్పాటు చేశారు. ఆయనికి అప్సరసలని తలదన్నే ముఖారవిందాలని చూపించారు. చడ్డాకి హీరోయిన్ ఎంపిక కష్టసాధ్యమైపోయింది. రెండు రోజులుండి వెళదామనుకుని వచ్చిన ఆయన్ని, రెండు వారాలైనా జనం కదలనివ్వలేదు.

చివరికాయన బిల్‌గరామీని హీరోగా ఎంపిక చేశారు. ఎగ్రిమెంట్ ప్రకారం అతనికి పదకొండు వందల నెలసరి జీతం నిర్ణయమయింది. అంతేకాకుండా అతని కళా నైపుణ్యంపై సర్వహక్కులు మితీ భగత్ ప్రొడక్షన్స్ హస్తగతమయ్యాయి. అటువంటి శుభకార్య సంభవాలలో బిల్ గరామీ సికిందరాబాదులోని ఒక హోటల్లో పార్టీ ఇచ్చినప్పుడు గజల్ ఇంట్లో పడి కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది. చడ్డా దృష్టినాకర్షించాలని ఆమె చేసిన ప్రయత్నాలని వ్యర్థమయ్యాయి.

బిల్‌గరామీ ప్రేయసీ జమాల్ వచ్చింది. ఆయన బిల్‌గరామీని తనతో తీసుకు వెళుతున్నారు. బిల్‌గరామీ చీమలు పట్టిన కబాబ్‌లా తయారయ్యాడు. ప్రతి అందమైన యువతి పరవశమై అతనివైపు పరుగులు తీసేది. బంజారా హిల్స్‌లో నివసించేవారిలో భర్తలకు విడాకులిచ్చిన భార్యలు తొంభైశాతం స్త్రీలు బిల్‌గరామీ ప్రియురాళ్ళని ఒకసారి రవి, గజల్‌కి చెప్పాడు. స్త్రీలను చూసి అశాంతికి గురి అయేవాడు. తరువాత, అందమైన స్త్రీలను చూడడం తనకిష్టమని నిజానికి అతని ప్రవర్తన మంచిదేనని సమర్థించుకునేవాడు. గజల్ ఓర్పు వహించేది. ఒకటి, రెండు నెలల్లో వివాహం జరిగిపోతే తను మూమాని అత్త బేగమ్‌లాగ అతనిపై అధికారం చలాయించ వచ్చనుకుంది... నేడు బిల్‌గరామి బొంబాయి వెళుతున్నాడు పెళ్ళి విషయం అతనేం పట్టించుకునేవాడు కాదు. మా అమ్మ చాలా మొండి మనిషి కనుక ఆమెను ఒప్పించడం కష్టం.

మరునాడు బిల్‌గరామీ పరుగెత్తుకుంటూ వచ్చి, మిస్టర్ చడ్డా గజల్‌ని హీరోయిన్‌గా ఎంపిక చేశారన్న శుభవార్త తెలియజేశారు. నిజానికతడు లేడి వంటి కన్నులు గల గజల్‌ని మొట్టమొదటిసారి చూసినప్పుడే ఈ

నిర్ణయం తీసుకున్నాడు.

హుమాయూన్ సంతోషం పట్టలకపోయాడు. అంతులేని సంతోషంతో గజల్ నవ్వడం కూడా మర్చిపోయింది. ఎందుచేతనంటే చడ్డా ప్రతి అమ్మాయితో, ఆమెని ఎన్నుకుంటున్నానని చెప్పి అందర్నీ తనతోపాటు బొంబాయి తీసుకు వెళుతున్నాడు.

వీళ్ళల్లో ప్రతి అమ్మాయిని ఎవరో ఒక డైరక్టర్ కప్పగిస్తానంటున్నాడతను.

ఇవన్నీ విన్న బిల్‌గరామి, ముందుగా చడ్డాతో తానొక్కడినే వెళతానని గజల్‌ని తరువాత పిలిపిస్తాననీ అన్నాడు. ఆనాడు మొట్టమొదటిసారిగా బిల్‌గరామీతో భార్యలాగ గజల్ పోట్లాడింది. అతడ్ని లెక్కచెయ్యకుండా ఎగ్రిమెంట్‌పైన సంతకం పెట్టేసింది. ఆ విధంగా ఎగ్రిమెంట్‌పై సంతకం చెయ్యడానికి వెయ్యి రూపాయలు డిపాజిట్ చేయవలసి వుంది. ఎగ్రిమెంటుపైన సంతకం పెట్టేసింది. ఆ విధంగా వ్యతిరేకపు చర్య తీసుకునే పక్షంలో ఇది తప్పనిసరిగా కట్టి తీరాలి, ఇక్కడ హుమాయూన్ ఓటమి నంగీకరించవలసి వచ్చేంది, కాని బతూల్ వద్దనుంచి లాక్కుని సాయా కర్పించిన నగలిప్పుడు పనికొచ్చాయి.

చడ్డా మంచి సరదాగా మాట్లాడే స్వభావం కలవాడు. అతడు కూర్చున్నంతసేపూ, జనం అతని మాటల్ని వింటూండేవారు. అతడి ఆలోచనల్ని సమర్థించేవారు. అతడు సభ్యతా సంస్కారాలతో వ్యవహరించేవాడు. తనతోటి కొద్దిపాటి పరిచయంతోనే అతను తన సమర్థత ప్రాముఖ్యతని - హుమాయూన్ ఒప్పుకునేటట్టు చేశాడు. గజల్ గుణగణాల గురించి స్పష్టంగా వాదించాడు. ఇంకా చాలా చిన్న వయస్సు, కనుక తాను, ఆమెకి నెలల తరబడి శిక్షణ ఇవ్వాలన్నాడు.

సరిగ్గా ప్రయాణమై వెళ్ళవలసి రోజు, బిల్‌గరామీ చడ్డాల మధ్య ఏదో మాటా మాటా పెరిగి పెద్ద దెబ్బలాట జరిగిపోవడంతో చడ్డాతో బొంబాయి వెళ్ళకూడదని అనుకున్నాడు బిల్‌గరామీ. ఇటు లక్ష రకాలుగా ప్రయత్నించినా గజల్ - హుమాయూన్‌ల టిక్కట్ల పైకం సమకూరలేదు. అందుచేత చడ్డా ఇతర అమ్మాయిలతో బయలుదేరాడు, గజల్ కూడా అతి త్వరలో బొంబాయి చేరుకుంటుందన్నాడు. గజల్ వెళ్ళిపోతుందన్న

వార్త విన్న హైదరాబాద్ హార్ట్ సొసైటీ, భారత కళా మండలిలోని వారంతా శోకంలో మునిగిపోయారు. గజల్‌తో అన్ని సంబంధాలు తెంచివేసుకున్న ఖాన్ సాహెబ్ కూడా ఈ వార్త చదివి వినిపించారు. ఎంతో కృంగిపోయారట. ఇంతైనప్పటికీ గజల్‌కి ఒక గొప్ప ఫేర్‌వెల్ పార్టీ ఇచ్చారు. సరిగ్గా అదే సమయంలో ఎవరో వార్తా పత్రికలోని ఒక వార్త చదివి వినిపించారు. బెంగాల్‌లోని ఒక విమానంలో చడ్డానరెస్టు చేసినట్లు, అతడు అమ్మాయిల్ని కొనడం - అమ్మడం అతని వృత్తి అని ఆ వార్త సారాంశము.

ఈ పెను తుఫాను ఎంత వేగంగా ప్రారంభమైందో అంత వేగంగా ఆగిపోయింది.

తన ఇష్టానికి వ్యతిరేకంగా గజల్ ఎగ్రిమెంటుపై సంతకం చేసినందువల్ల ఇక తనకేం సంబంధం లేదని, బిల్‌గరామీ తన దృష్టిని మరో వైపుకు మరల్చుకున్నాడు.

ఇటు బిల్‌గరామీ తప్పుకున్నాడు. అటు హుమాయూన్ తిరిగి చెప్పందుకున్నాడు. అంతే ఇంకేముంది, అల్లా ఇవ్వడం బందా పుచ్చుకోవడం గజల్‌ని చితకొట్టడం తప్ప అతనికి వేరె పనేమీలేదు. ఓర్చుకున్నందుకు ఇటువంటి పరిణామంతో ఎప్పుడో ముక్కలైపోయింది.

ఆ దుర్ఘటనతో ఆమె మెదడు ముక్కలైపోయింది. హుమాయూన్ తిట్లు ధిక్కారాలు ఎవరిపైనో! ఆమె మౌనంగా కూర్చుని ఆకాశం కేసి చూస్తూండేది. ఆమె తన జీవితానికి సంబంధించిన ఎంత చక్కని కార్యక్రమాన్ని రూపొందించుకుందో! ఆమె బిల్‌గరామీ భార్యగా బంజారాహిల్స్‌లోని స్త్రీలందర్నీ నిప్పులపై పడుకునేట్టు చేస్తుంది.

అతని జుట్టులాంటి బంగారు రంగు జుట్టు నీలి కళ్ళతో, ఉండే పిల్లలమధ్య నివసిస్తూ, నాటకాలని మర్చిపోయి రోజంతా అత్తలాగ దోమతెరలో కూర్చుని ఉంటుంది. అతడు తన తండ్రిలాగ మాటిమాటికి పిల్లల్ని కొడతాడు కనుక, బిల్‌గరామీతో పోట్లాడడం జరుగుతుంది. అతడు పిల్లల్ని కొడితే గజల్ భయంతో వణికిపోతుంది. తన గాయాలన్నీ గుర్తొచ్చి ఖంగారుగా బిల్‌గరామిని పిలుస్తూంది. పిల్లలపై ఎప్పుడూ చెయ్యెత్తనని అతడి వద్ద మాట తీసుకుంటుంది. తనని ఒక వివాహిత స్త్రీగా ఊహించుకున్నపుడల్లా రజియా అత్త ఎదురుగా ప్రత్యక్షమవుతుంది.

అత్తగారి అభిమానానికి పాత్రురాలు, మామగారి అపురూప కోడలు... ఎప్పుడు చూసినా రాషిద్ మామయ్యతో గుసగుసలు, పిల్లలు మాటిమాటికి వచ్చి ఆమెనల్లుకుపోయేవారు.

తరువాత గజల్ ఒకనాడు తనుకూడా అలసిపోయి తివాసీ పరిచిన బల్లపై నడుం వాలుస్తుంది. బిల్‌గరామి పెన్షన్ తీసుకుంటూ తాతగారిలాగా గాజర్ మురబ్బా తెస్తాడు. అతడా మురబ్బాలో కిస్‌మిస్ వేసినా, కొబ్బరి వేసినాసరే... తను మాత్రం బీబీలాగ ఏం పట్టనట్టు పడుంటుంది.

ఆమె బిల్‌గరామితో వివాహపరమైన కలలు కని ఉండకపోయినట్లైతే, ఖాన్ సాహెబ్‌లాగే ఇతన్ని కూడా మర్చిపోయేది. కాని పధ్నాలుగేళ్ళ ప్రాయంలోనే ఆమె సౌభాగ్యవతితనం కోల్పోయింది. వైధవ్యపు దుఃఖాన్ని అనుభవిస్తూ, ప్రపంచాన్ని విడిచిపోవాలనుకుంది.

అద్దంలో తన ముఖాన్ని జాగ్రత్తగా చూసుకుంది. ఏడవడం వల్ల బుగ్గలు నిప్పుల్లాగా ఎర్రగా అయిపోయాయి, దెయ్యంలాగ జుట్టు చెదిరిపోయింది. తన పళ్ళు ఊడిపోయినట్టు, జుట్టు తెల్లబడిపోయినట్టు అనిపించింది. గజల్‌కి విధవరాలిలాగే ఉండే చేతి గాజుల గలగలలాడాయి. ఆమె రాయితో గాజులు పగులగొట్టుకుంది. చాలాసేపు వెతికిన తరువాత అమ్మ పెట్టెలో ఒక తెల్ల చీర, నల్ల జాకెట్టు దొరికాయి. అద్దంలో ఆ రూపం చూసుకుని ఏడ్చేసింది. హాయ్ అల్లా! తనని పలుకరించడానికైనా రాలేదెవరూ... నిర్దయులు తనని చూసి పరిహాసించే వారంతా ఏమయ్యారు. అమ్మ!... అమ్మ ఉంటే... ఆమె బాధ చూసి గుండె బాదుకునేది. కేవలం పధ్నాలుగేళ్ళకే వైధవ్యం సంభవించింది.

ఆమె ఏడ్పులో ఎంతటి బాధ ఉందో కాని సాంయా లోపలికి పరిగెత్తుకొచ్చింది. ఆమెను గుండెలకదుముకుని, ఏడ్చేసింది. చచ్చిపోతావా ఏమిటి? నీ తండ్రెప్పుడూ కొడుతూనే ఉంటాడు! అంటూ బోధ పర్చసాగింది.

ప్రేమ భరితమైన సాయా మాటలు, మండుతున్న గుండెలపై చన్నీళ్ళు చిలకరించాయి. ఆమె సాయా చేతుల్లో ఎంతసేపలాగుందో తెలియదు, కాళ్ళు చేతులు చల్లబడి ప్రాణం లేనట్టు మంచం మీది నుంచి క్రిందికి దొర్లిపోయింది.

బీబీ వాళ్ళకి ఈ వార్త తెలియగానే వాహిద్ హుస్సైన్ కంగారుగా పరుగెత్తుకొచ్చారు.

వాళ్ళకి గజల్ అంటే విపరీతమైన అసహ్యంగా ఉండేది, కాని ఆమె చనిపోతుంటే చూస్తూ ఊరుకోలేక పోయారు. డాక్టరు వచ్చాడు... సాయా మందు పట్టింది. ఆమెకి స్పృహ వచ్చింది. అప్పుడు బీబీ, ఫౌజియా ఆమెని చూడడానికి వచ్చారు.

ప్రపంచమంతా పెడ మొగము కావచ్చు కాని బీబీకి మాత్రం కడుపుకోత లాంటిది. మరణించిన కూతురు గుర్తు! ఆమె కుమార్తెలిద్దరూ ఒక్కొక్క పాపని కని విడిచిపోయారు. మొట్టమొదటిసారి సమాధిపైన పువ్వులుంచేందుకు వచ్చినట్లు చూసిందామె గజల్ని.

ఫౌజియా కూర్చున్నంతసేపూ, మాటి మాటికి విరగబడి నవ్వుతూనే ఉండేది.

ఆమె అందమైన కళ్ళు, ఆరోగ్యవంతమైన శరీరం ఆ నవ్వు చూస్తుంటే దుఃఖం అంటే ఏమిటో ఆమెకి తెలియదేమో అనిపిస్తొంది.

ఈ ముదనష్టపు అల్లుడు తమ ఇంట అడుగుపెట్టిన ఘడియని నిందించసాగింది. ఏ వేశ్య కడుపున పుట్టాడో అల్లాకే తెలుసు. బిడ్డ సంపాదనతో బ్రతుకుతున్నాడు. ఆ రోజు బీబీ హుమాయూన్ల మధ్య తిరిగి ఒకసారి పెద్ద దెబ్బలాట జరిగింది. కూతురి సంపాదన తింటున్నావని బీబీ చెప్పితే, కూతురి సారెతో మోసం చేశారని అతను నిందారోపణ చేశాడు. తరువాత వాహిద్ హుస్సైన్, అహమద్ హుస్సైన్ల దర్జాల గురించి వర్ణిస్తూ ఐవానే గజల్ని లోని గతించిన షాయర్లందరూ మంచి వంశస్తులు కారనీ ప్రేమ కలాపాలు తప్ప, ఇంకే పనీ చెయ్యలేదన్నాడతడు. ఈ గొడవల తరువాత గజల్ కొరకు ఐవానే గజల్ తలుపులు తిరిగి తెరుచుకున్నాయి. అప్పుడు అమ్మమ్మని పట్టుకుని గజల్ ఎంతగానో ఏడ్చింది. తరువాత కుంటత్త, మూమాసీలతో తనపై జరుగుతున్న అత్యాచారాల గాథ వినిపించి అంతటికీ తండ్రే కారణమని, ప్రతి చోటకీ తనని బలవంతంగా పంపిస్తారని హృదయ విదారకంగా ఏడుస్తూ చెప్పడం వల్లనే తిరిగి ఐవానే గజల్లో స్థానం లభించింది. తరువాత బిల్ గరామీ కథంతా చెప్పేసరికి, ఒక్క గుద్దు గుద్ది కుంటత్త గజల్ నోరు మూయించండి,

ఫౌజియాని పంపించాలింకా!

ఆనాటి నుంచి బీబీ మాటననుసరించి, గజల్ ఈ గాథలనుచ్చరించక పోవడమే కాకుండా, మర్చిపోవడానికి ప్రయత్నించసాగింది.

ఫౌజియా మెట్రిక్ పాస్ అయినప్పుడు గొప్ప విందు జరిగింది. గజల్, బిల్‌గరామీ శోకంలో పడుంది. కానీ విషయం అందరికీ చెప్పనవసరం లేదుకదా!

తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చేసరికి ఒక సాదా చీర కట్టుకుని బోసి చేతులు చెవులతో వచ్చింది గజల్. చాలామంది ఆడవాళ్ళున్న చోట ఆమెకి భయంగా ఉండేది. కేకలు, పోట్లాటలు, వేదనలు, ఒకరిని చూసి మరొకరు ఈర్ష్య పడడం ఇవన్నీ నచ్చేవి కావు. గజల్‌కి పురుషుల సభలలో లభించే కపటరాహిత్యమైన వాతావరణం, ఆనందం, ఇక్కడ లభించవు. అక్కడ గజల్ నందరూ అభిమానించేవారు. కాని వివాహాది శుభకార్యాల సందర్భంలో గుమిగూడిన స్త్రీలంతా తనని పది తలలు, పన్నెండు చేతులతో పుట్టబట్టి ప్రదర్శిస్తున్న విచిత్రపు పిల్లని చూసినట్టు చూసేవారు.

చాంద్ ఆపా రెండు నెలలపాటు అనంతగిరి శానిటోరియంలో ఉండి వచ్చింది. కాని ఆమె సంజీవా కోసం ఎదురు చూడడం మానలేదు. ఎంతో అందమైన పురుషుడ్ని లెక్క చెయ్యని చాంద్ ఆపా, సంజీవాకోసం స్వయం సర్వనాశనమయింది.

గజల్‌కి కూడా ఖాన్ మామా నచ్చేవారు. బిల్‌గరామీకి ఆమె తన సర్వస్వాన్ని అర్పించేసింది. అయినప్పటికి బిల్‌గరామి జ్ఞాపకాలు, ఆమె హృదయాన్నంతగా బాధించలేదు. ఇప్పుడు బిల్‌గరామి వస్తే అతని ముఖమ్మీద ఉమ్మెయ్యాలనిపించేదామెకి.

మెల్లిగా అతడు రావడం మొదలెట్టారు. చాంద్ ఆపా తన గదిలో పడక్కుర్చీలో పడుకుని ఏదో ఇంగ్లీషు నవల చదువుతూంది, ఆమె రూపురేఖలెంతగా మారిపోయాయి! ఆమె ఒంటికి పట్టినట్లున్న రవికలోంచి గుండ్రని ఒంపుసొంపులు ఉబికివచ్చేవి. అటువంటిదిప్పుడు ఎండిపోయినట్లు శరీరంపైన వేళ్ళాడుతూంది. అందంగా ఉండే జుత్తు ఇప్పుడు ఒక పిలక జడలాగుంది. బుగ్గలు పీక్కుపోయాయి. బంగారు రంగు శరీరపు ఛాయ పాలిపోయింది.

వస్తూన్న స్త్రీలంతా, ఒకసారి మేకప్ లేక, జుగుప్సాకారంగా ఉన్న చాంద్‌ను, నిండుగా వికసించినట్లున్న గజల్ నొకసారి చూసి తికమకపడుతున్నారు. అయ్యో, ఇక్కడి వాతావరణమంతా కలుషిత మైపోయింది, అంటూ చెవులు కొరుక్కుంటున్నారు.

'ఐవానే గజల్‌లో ఎప్పుడూ ఇటువంటి ఆటలే సాగాయి.

చాంద్ ఆపా అలసిపోయి ఒక ప్రక్క కూర్చుండిపోయింది కనుక ఇటు-అటు తిరగవలసి వచ్చింది.'

స్త్రీలంతా ఎంతో ఆసక్తితో గజల్‌ని దగ్గరికి పిలిచి చూసేవారు, 'ఈమె మిస్కీన్ ఆలీషాహ్ మనుమరాలు... గజల్?'

'అవును ఈమే ప్రఖ్యాత రంగస్థలనటి బీబీ గజల్! ఇప్పుడు మిస్ గజల్ అయి వుండవచ్చు.'

'మిసెస్ గజల్‌కూడానేమో!' అంతా నవ్వసాగారు.

'బీబీ! బోసి చేతులు, చెవులతో ఎందుకొచ్చారు, మీరు? ఈ ఫ్యాషన్‌కూడా వచ్చిందేమిటి?'

టిబిలో చాంద్ ఆపా ఉన్న స్థితికి తనూ చేరుకోవాలనిపించింది గజల్‌కి, కప్పు కూలి పోవడమో లేక ప్రళయం వస్తేనో అనుకుంది. కాని ఏమీ జరుగలేదు.

విసిగిపోయి తనే స్వయంగా చాంద్ ఆపా వద్దకి పరుగెత్తింది... చాంద్ ఆపాని చుట్టుకుపోయి భోరున ఏడుద్దామనిపించింది.

చాలాకాలం తరువాత నేడు చాంద్ ఆమెతో మాట్లాడింది. దాచలేదు. ఖాన్ సాహెబ్ అత్యాచారాల దగ్గరనుంచి, బిల్‌గరామీ నమ్మించి మోసం చేయడం వరకు అంతా చెప్పేసింది.

'బిల్‌గరామీ కనబడితే ముక్కలు ముక్కలుగా నరికి పోగులు పెడదామనిపిస్తూంది.' చాంద్‌తో చాలా కోపంగా అంది గజల్.

'హు...' చాంద్ ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయి అంది, బిల్‌గరామీకి కేవలం నీ శరీరాన్ని మాత్రమే అర్పించడం మంచిదైంది. ఇంకేమీ సమర్పించుకోలేదు.

ఆమె ఏమంటూందో గజల్‌కేమీ అర్థం కాలేదు.

లేకపోతే నాలాగ రెండు విధాలా హింసకు గురి అయేదానివి. ఆమె

చెప్పుకుంటూపోతూంది. నేనెన్నోసార్లు వేడుకున్నాను, కాని అతడు నన్నెప్పుడూ తాకలేదు... కాని అతడికి నా మీద నమ్మకమే లేకపోయింది...!

నేడు చాంద్ కాంతిని కోల్పోయిన కళ్ళతో చూస్తూ కూర్చుంది. గజల్ ఎక్కెక్కి ఏడుస్తూంది. గజల్ తన దౌర్భాగ్యానికి ఏడుస్తుందనుకుంది చాంద్.

'నేను ఇరవై ఆరు సంవత్సరాల వయస్సుకే మృత్యువుకు అతి సమీపంగా ఉన్నాను. కాని గజల్! నువ్వు నీ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించడం మానెయ్యి. తన అదృష్టాన్ని తానే నిర్మించుకోగల ధైర్య సాహసాలు స్త్రీలందరికీ ఉండవు. అందుకని నువ్వు, నీ సుఖశాంతులను బీబీ చేతుల్లో పెట్టు లేకపోతే రాషిద్ మామయ్య వాళ్ళు నిన్ను ఉపయోగించి లాభాలు పొందాక నిన్నువతల కీడ్చి పారేస్తారు.'

గజల్‌కేమీ అర్థం కాలేదు. ఆమె చాంద్ కంపిస్తున్న పెదవుల్ని చూస్తూంది. చాంద్ ముఖం ముడతలు పడ్డ తెల్లబట్టలాగ పాలిపోయి ఉంది. బంగారం రంగులో మెరుస్తుండే కళ్ళు నల్లగా అస్తమిస్తున్నట్లున్నాయి.

ఇంటికొస్తూనే గజల్ బిల్‌గరామీ గురించిన శోకాన్ని విసిరవతల పారవేసి చక్కటి రంగు దుస్తులు ధరించింది.

బీబీ ఇంట్లో హంగామా జరుగుతోంది. గజల్, చాంద్‌ల శోకపూరితమైన పరిస్థితుల గమనించిన తరువాత రజియా - బీబీలకు ఫౌజియా గుండెలమీది కుంపటిలా అయిపోయింది. వాళ్ళిద్దరు ఎలాగో అలాగ - ఫౌజియాకి వెంటనే పెళ్ళి చేసెయ్యాలని త్వరపడసాగారు. ఎప్పుడు చూసినా రజియా, రాషిద్, వాహిద్ హాస్సైన్లు కూర్చుని గుసగుసలాడుతూండేవారు. ఒక ప్రక్క వాతావరణం అసలే బాగాలేదు. ఇండియన్ యూనియన్ సైన్యం, రజాకార్ల మధ్య గొడవలు జరుగుతున్నాయి. మేము యుద్ధం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నామని కాసిమ్ రిజ్వీ ప్రకటించేశాడు. అలా హాజరత్ ఇత్తిహాదుల్ ముసల్మాన్ శక్తిసామర్థ్యాలను చూసి భయంతో ఏదో ఒక ఒప్పందం కుదుర్చుకుందామనుకుంటున్నారు. రాషిద్‌ని అటు బైటి ప్రపంచానికి సంబంధించిన వెయ్యి సమస్యలు వేధిస్తూంటే, ఇటు పెళ్ళి కొడుకుల సందేశాలకు సంబంధించిన ఎర్రటి కవర్లు అందుతున్నాయి. చివరికి ఒక రోజు ఫౌజియా అదృష్టానికి సంబంధించిన నిర్ణయం

జరిగిపోయింది. పిల్లవాడు డాక్టరు పట్టా పుచ్చుకొని లండన్‌నుంచి అప్పుడే ప్లేన్ దిగాడని వినికిడి. అదీకాక తండ్రినుంచి సంక్రమించే ఆస్థి ఉండనే ఉంది. చాలా గొప్పవాళ్ళట. కేవలం యాభైవేల రొక్కం, ఒక ఇల్లు నలభై తులాల బంగారం తోటీ సంబంధం ఖాయం అయింది. రజియా రాషిద్‌లు కూర్చుని తమ అదృష్టానికి పొంగిపోయారు.

తాంబూలాలు పుచ్చుకునే శుభకార్యానికి ఇంచుమించు వందమంది బంధువులకి ఉత్తరాలు వ్రాయించింది కుంటత్త. వీరంతా ఈ వంశపు అమ్మాయిలను వేలెత్తి చూపి, పేర్లు పెట్టిన వారే. ఆ వంశంలోనే పుట్టిన సతీసావిత్రిలాంటి ఒక పిల్ల ఎంతటి గొప్ప వారింట్లో అడుగు పెట్టబోతుందో, అందరికీ చాటి చెప్పాలనుకుంది ఆమె.

వాహిద్ హుసైన్ తన కవిత్వాన్నవతలపెట్టి ఉత్తరాలు వ్రాసేవారు. తరువాత ఇంటిల్లిపాదికి చదివి వినిపించేవారు. అప్పుడు అందరూ కూర్చుని ఏ ఆహ్వానం అనవసరమో, అతిథుల్ని ఏ విధంగా ఎటువంటి బిరుదు నామాలతో పిలవాలో, విందు ఏ విధంగా ఉండాలో ఎవరి ఎడల ప్రేమానురాగాలు ఏ విధంగా, వ్యక్తం చెయ్యాలో నిర్ణయించేవారు.

ఈ శుభ సందర్భంగా, ఉజాలా బేగమ్, అహమద్ హుసైన్ నసీర్లతో కలిసి వస్తే, నసీర్ పుట్టినపుడు, పెరిగిన వైమనస్యాలు తొలగిపోగలవని కుంటత్త భావించింది. అక్రమ సంతానమైన నసీర్ ఇప్పుడు బి.ఏ. పాసైన యువకుడు. కాని ఉజాలా బేగమ్ తన శత్రువులు నివసించే ఐవానే గజల్‌లో అడుగు పెట్టనని ఒట్టు పెట్టుకుందిట. ఈ వార్త విన్న వాహిద్ హుసైన్, అహమ్మద్ హుసైన్ ఇంట్లో కాలు పెట్టకూడదని నిర్ణయించుకున్నారు. ఇప్పుడిక సుస్తీలు, చావులు, ఏదేని శుభ సందర్భాల్లో వ్రాసే ఉత్తర ప్రత్యుత్తరాలు మాత్రమే జరుగుతున్నాయి. రాకపోకలు లేక పోయినా కుంటత్త మాత్రం ప్రతి చిన్న విషయం తెలుసుకుంటూనే ఉంది. అహమద్ హుసైన్ నసీర్‌కి అధికారానికి సంబంధించిన మెళకువలన్నీ నేర్పాడనీ, ఉజాలా బేగమ్ నసీర్ కొరకు అమ్మాయిల్ని పోషిస్తున్నదని తెలుసుకుంది కుంటత్త. ఈ పిల్లల మధ్య అతను అచ్చోసిన ఆంబోతులాగ తిరుగుతూ కవిత్వం ఒలకపోస్తున్నాడట. ఉజాలా బేగమ్ ప్రత్యేకంగా అతనికి షాయురాపైన అభిరుచి కలిగేటట్టు చేసింది. రాషిద్‌లాగ

వంశపారంపర్యంగా వస్తూన్న పద్ధతుల్ని విడిచిపెట్టినట్టు కాక నసీర్ తమ వంశపు వ్యక్తిలాగ గుర్తింపు పొందాలన్నది ఆమె అభిలాష.

ఈ ఉత్తరం ఔరంగాబాద్ వెళ్ళగానే ఉజాలాబేగమ్ ఎందుకనో నసీర్‌ని అక్కడికి పంపించింది.

ఘాజియా తాంబూలాల వేడుకకింకా బంధువులు వచ్చినా రాకపోయినా, ఇంటిల్లిపాదీ నసీర్ ఆదర సత్కారాల్లో మునిగిపోయారు. అతడు మొట్టమొదటిసారి పెత్తండ్రిని చూడడానికి తమ పూర్వీకుల ఇంటికి రావడమే, ఆ సత్కారాలకి కారణం.

రజియాకి అవకాశం కలిగితే అతని గొంతు నులిమి చంపివేసేదే. కాని పైకి ఆప్యాయంగా మాట్లాడవలసి వచ్చింది. కాబట్టి గజల్ని ఇంటికి వచ్చెయ్యమని హుమాయూన్ అన్నప్పుడు బీబీ వద్దంది. 'ఇంత పనెలా అవుతుంది? కనీసం గజల్ అయినా ఇంట్లో ఉంటే...'

మెదడులో ఏదో మెరుపు తళుక్కుమంది. కాంతి ప్రసరించసాగింది. ఎర్రటి రంగులు నదిలా ప్రవహించసాగాయి.

రసభరితమైన ఆమె పెదవులకెక్కడా శాంతి లభించడం లేదు. పౌడర్ అద్దుకున్నా ముఖంపై నల్లటి కురుల క్రింద ముత్యాల కన్నులు, కాంతులు వెదజల్లుతున్నాయి. కళ్ళు... కళ్ళు... భీతిహరిణీక్షణ... మత్తెక్కించే అమాయకపు కళ్ళు... నిర్దయ... కళ్ళు... కళ్ళు మాత్రమే అతని వ్యూహాకందడం లేదు.. ఆమె గొప్ప అందగత్తెతే కాదు... కాని ఆమె మేని ఛాయలోనే ఆకర్షణ ఉందో లేక వంచిన విల్లులా ఉన్న ఆ కనుబొమ్మల్లోనే ఉందో... క్షీణచంద్రుడులాగ ఉన్న అర్ధనిమీలిత నేత్రాలు, రెప్పల క్రింద అణగి వున్న కళ్ళ మొదటి చూపులో, అప్పుడే కన్నీళ్ళు తుడుచుకుని వచ్చినట్లనిపిస్తోంది. కాని ఆమె నవ్వుతున్న పెదవులు కళ్ళలో గోచరమయ్యే భావాన్ని మరుగు పరుస్తున్నాయి.

లోపల గాజు సామాను విరుగుతున్నట్టుంది.

తివాసీపైన కూర్చున్నవారంతా ఏ మాటలపై నవ్వుతున్నారో! అదే విషయంపైన సంభాషణ జరుగుతూండవచ్చు.

అతడిక్కడికి వచ్చినవాడే షాహీన్, పట్టణపు రోడ్లపైన సైకిల్ నడపవద్దని, గజల్‌తో స్నేహాన్ని పెంచుకోవద్దనీ, రోడ్లపై సైకిల్

నడపడానికీ, గజల్ స్నేహానికి ఉన్న కొన్ని హద్దులను తెలుసుకోక పోయినట్లైతే ప్రాణాపాయం తప్పదని నసీర్‌ని హెచ్చరించాడు.

అవడానికి నసీర్, రాషిద్‌కి తమ్ముడు, కాని ఒక్కరోజులోనే అతను షాహిన్‌కి తమ్ముడైపోవడమే కాకుండా ఇరువురు గొప్ప స్నేహితులై పోయారు. యువకుల మధ్య ఉండే రహస్యపూరితమైన వేళాకోళాలు, అన్నీ మజిలీలు దాటేశారు. షాహిన్ రెండు మూడు రోజుల్లోనే ఉస్మానియా యూనివర్శిటీ నుండి గండిపేట వరకూ అన్నీ చూపించేశాడు. వీళ్ళిద్దరూ బాంబే టాకీసులో 'కిస్మత్' సినిమాలోని ముసిలి ముమ్‌తాజ్ శాంతిని చూసి చూసి విసిగిపోయారు. అందుచేత తాకటానికి నిషిద్ధమైన వస్తువులను తాకాలని నిర్ణయించుకున్నారు. వీటికేవిధమైన ప్రాధాన్యత ఉండదని అతడికి నమ్మకం. షాహీన్ తనని కేవలం పల్లెటూరి బైతులా భావించి ఆటపట్టించడానికి ప్రయత్నిస్తున్నాడు. తను హైదరాబాదెప్పుడూ చూడకపోవడంతో, ప్రపంచమే ఎరుగడనుకుంటున్నాడు. అమాయకుడు. ప్రపంచంలో తానెరుగున్నవేమేమిటో అతడు షాహీన్‌కెలా చెప్పగలడని? ప్రపంచ సుఖాలన్నిటినీ తను చవిచూశాడు. అతడు ప్రతి శెలవులకీ జల్సాగా తిరగడానికి బొంబాయి వెళ్ళేవాడు. తను జల్సా చెయ్యడం నేర్చుకోవాలని కోరుకునేవారు అబ్బాజాన్. తను అనుభవించే భోగాలను చూసి అమ్మ కూడా సంతోషంగా నవ్వుతూండేది. పైకి మాత్రం తెచ్చిపెట్టుకున్న కోపంతో కనుబొమ్మలు చిట్లిస్తూ, 'మొద్దు మొహమా! అన్నీ తండ్రి పోలికలే!' అనేది.

తల్లికి తమ వంశాచారాలంటే మక్కువ ఎక్కువ అవడంచేత, అతడు బైట తిరగడం నచ్చేదికాదు. ఆవిడకి మగవారుంటే ప్రదేశంలో నవ్వులు, కేరింతలూ, నృత్యగీత కార్యక్రమాలలో నిండి ఉండడమంటే ఇష్టం. అందుకని తల్లి నసీర్ కోసం పని పిల్లల్ని, బానిస పిల్లల్ని దేవిడీలోని అన్ని భాగాల్లో నింపేసింది.

ఈ దివాణం ఔరంగాబాదులోని ఒక కస్బా (పల్లె కంటే పెద్దది అయిన ఊరు)లో ఉంది. అక్కడ చిన్న రైల్వే స్టేషన్ కూడా ఉంది. అక్కడి నుంచి ఆ రైలు పట్టాలు గజల్ వాళ్ళ పట్టణం దాకా వచ్చేవి. కాని అతడెప్పుడూ ఆ పట్టాపై వెళ్ళలేదు. ఇప్పుడతడు పట్టభద్రుడు.

తండ్రితోపాటు పట్టణంలోని ముషాయరాలకు వెళ్ళేవాడు. తమ జాగీరునంత పర్యవేక్షించేవాడు. గోధుమలు పండే పొలాల దగ్గర్నుంచి స్త్రీకి సంబంధించిన సత్యాల వరకు అన్నీ తెలుసుకున్నాడతను. అతడెంత వరకూ ఎదిగాడంటే ఇప్పుడు తల్లితండ్రుల్ని ఒప్పించి హైదరాబాదు రాగలిగాడు. పేరెన్నికగన్న షాయర్ల కవితల్లో మార్పులు చేర్పులు చేసి చాలా కీర్తినార్జించాడు. ఇది చూసిన తండ్రి ఎంతగానో ఆనందించాడు. ఒకప్పుడు అతడు తన బదులు గులామ్ రసూల్ కొడుకై పోతాడేమో అని భయంగా ఉండేది. కవిత్వమంటే నసీర్ అభిరుచి ఆ భయాన్ని పారద్రోలింది. కవిత్వం వల్లనే అహమ్మద్ హుసైన్ వంశం ప్రసిద్ధమయింది. అటువంటప్పుడు నసీర్ తన సంతానం కాదనే సందేహమే అక్కర్లేదు.

నేడతనికి కవిత్వం చెప్పాలనే మనసు కలిగింది. ఒంగి, రసభరితమైన గజల్ అధరాలని పొగడాలని ఉందతనికి. లెక్కలేనంత మంది అమ్మాయిల్ని చూశాడతను. ఉజలాబేగమ్ అతని కోసం పోగు చేసిన అమ్మాయిలకు భిన్నంగా ఉంది గజల్. మెరుపువలె మెరిసిపోయే ఈ అమ్మాయంటే ఎందుకో భయంగా ఉంది. కాని మరొకవైపు ఏదో ఆకర్షణ ఆమె వైపు లాక్కుపోతూంది.

ఈనాడు రాషిద్ నసీర్‌తో సన్నిహితత్వం పెంపొందించుకోవాలని నిర్ణయించుకున్నాడు. పెద్ద వాళ్ళలాగ అతడితో భవిష్యత్తు గురించి మాట్లాడాడు. కొంత వేళాకోళంగా సంభాషణ కొనసాగింది. ఒకటి రెండుసార్లు చెయ్యిపట్టుకుని చనువుగా చిన్న చిన్న దెబ్బలు కొట్టాడు. అతను కూడా పైపైకి రాషిద్‌తో చనువుగా ప్రవర్తించాడు. ఈనాడెలాగైనా సరే గజల్‌తో తప్పక సన్నిహితత్వం పెంచుకుని తీరాలని తీర్మానించు కున్నాడు.

వరండాలో కూర్చొని రాషిద్‌భాయీ తన విషయాలన్నీ ఏకరువు పెడుతున్నాడు. నసీర్ ఎడతెరిపి లేకుండా రెండు గంటలనుంచి ఎంతో ఆసక్తిగా ఒకప్పుడు సిమెంటులోని లాభాలను గురించి మరొకప్పుడు, పెట్రోల్లో వచ్చిన నష్టాలను గురించి వింటున్నాడు.

మందుల వ్యాపారంలో విపరీతమైన లాభాలు వచ్చినట్లు, ఒక్కసారిగా నవ్వేశాడు. ఎదురుగా నిలబడిన గజల్‌ని చూసి, ఆమె చెయ్యిపట్టుకుని,

'ఇవ్వాళ నువ్వు నాకు చాలా చక్కగా కనబడుతున్నా'వని చెప్పాలని పిస్తోందతనికి.

అతడు కంగారుగా లేచి నిలబడ్డాడు.

'ఏమైంది... మందుల, రాశుల క్రిందినుంచి ఆయాసపడుతూ రాషిద్ భాయీ అడిగాడు.

'ఏం లేదు...' ఆ విధంగా ఉన్నట్లుండి నిలబడినందుకు అతడు సిగ్గుపడ్డాడు. ఉట్టినే బట్టల్ని దులుపుకుంటూ 'ఏదో పురుగో, పుర్రో కుట్టినట్టుంది.'

'ఏమైంది...? ఏమైంది?' ఒక్కసారిగా అంతా గుమిగూడారు. చిరునవ్వులు చిందిస్తూన్న ఆడపిల్లల గుంపు ముందు హాల్లో పోగయ్యారు. ఒకరినొకరు తోసుకుంటూన్న వారంతా బట్టలు దులుపుకుంటున్న నసీర్ చేతుల్లోంచి పామొస్తుందేమో అన్నట్లు చూస్తున్నారు. ఆ తరువాత వారందరి మధ్యనుంచి వంగివున్న రెండు పెదవులు, ఏమైందంటూ' విచ్చుకున్నాయి.

'నేడు నువ్వు చాలా చక్కగా ఉన్నావు' అందామనుకున్నాడు కానీ అనలేకపోయాడు.

'సరే, మా ఆర్థిక సంబంధాలు విచ్ఛేదం కాలేదనుకో! అయినా సిమెంటులో వచ్చిన నష్టాన్ని సంవత్సరం వరకూ తట్టుకోగలను,' రాషిద్ భాయీ కొత్త సిగరెట్ వెలిగించుకుని సంభాషణని కొనసాగించబోయాడు.

కాని ఇంకొక నిముషం కూడా ఏ విధమైన నష్టాన్ని నేను భరించలేను - అనుకున్నాడు నసీర్.

ఇప్పటివరకు అమ్మాయిలు కూర్చున్న దగ్గర రంగురంగుల మరకలు కనబడుతున్నాయి. నీలి పువ్వుల తెరలు రెపరెపలాడుతున్నాయి. గాలి తాకిడికి తెరలటూ ఇటూ కదిలితే, తెల్లని మృదువైన పాదాలు ఇటూ, అటూ పరుగెడుతూ కనబడేవి. ఎవర్ని చూసినా ఆ గదివైపే ఆకర్షింపబడుతున్నారు. ఒక నౌకరు చేతిలో పూలబుట్టలున్నాయి. మరోవైపు నుంచి ఇస్త్రీ చేసిన బట్టలు తీసుకొస్తున్నారు. బీబీ ఒక ప్రక్క కూర్చుని కొబ్బరి, పటికబెల్లం కిళ్ళీలు ట్రేలో సర్దుతూంది. మగవాళ్ళున్న వైపు కర్ర పట్టుకుని వంట వాళ్ళని అజమాయిషీ చేస్తోంది కుంటత్త. ఆహూతులు రావడానికి ఇంకా చాలా వ్యవధి వుంది. అయినా పేటలోని పిల్లలంతా

గేటు వద్ద షహనాయీ వినడానికి గుమికూడి కిటికీల వద్ద, తలుపుల వద్ద నిలబడి, లోపలేం తమాషా జరుగుతూందో అని ఆసక్తిగా చూస్తున్నారు.

మాటి మాటికీ గదిలోకి పరుగెడుతున్న ఆ చిన్న పిల్లని ఎత్తుకుందా మనిపించింది నసీర్‌కి. ఆ పిల్ల మాసిన బట్టలు, బురదతో నిండినట్టున్నాయి. ముక్కు కారుతోంది. అతనా పిల్లని పట్టుకుందామని అడుగుముందుకేసేసరికి తెర, తలకి తగులుకుని తలవని తలంపుగా అతని కళ్ళు అటుకేసి చూశాయి. అక్కడ అందరి మధ్య కూర్చున్న గజల్ ఒక జూకా తన చెవి దగ్గర పెట్టుకుని, 'నేనెలాగున్నాన'ని అడుగుతుంది.

'ఇవాళ నువ్వు చాలా బాగున్నావు!' అనాలనిపించినా అంతమందిలో ఎలా అనగలడు?

'బీబీ... ఫౌజియాకి ఎర్రకతాన్ చీర కట్టనా?' రజియా కంగారుగా అత్తగారి వద్ద నుంచుని అడుగుతూంది.

'గులాబీ జార్జెట్ చీర కట్టమంటూంది గజల్'

ఫౌజియాని చూడడానికి అత్తగారొస్తున్నారు. అందుకని ఆమెని అలంకరించడం చాలా ముఖ్యం. ఆమె నలంకరించే బాధ్యత గజల్ స్వీకరించింది. ఆమె అన్ని విధాలా ముస్తాబు చేస్తూంది. పనిలో పని అమ్మాయిలకి నవ్వులు పంచిపెడుతూంది.

ఆడపిల్లల్ని అలంకరించడం ఎంతటి మూర్ఖత్వం, వెలుగుతున్న జ్యోతిపై బట్ట కప్పినట్టు, అంతగా అలంకరించినా, మిట్టమధ్యాహ్నం దీపం వెలిగించినట్టు, ఫౌజియా గజల్ ముందు వెల వెలాపోతుంది. ఆ వచ్చే వాళ్ళు ఫౌజియాకి బదులు గజల్‌ని ఎంపిక చేసేసుకుంటారేమో... ఈ ఆపద విషయమై గజల్‌ని హెచ్చరించాలనుకున్నాడు నసీర్. ఆ ఒక్క క్షణంలో అతడెన్నో సార్లు హాల్లో... హాల్లో...! అంటూ గట్టిగా అరిచాడు. అతనెంతో ప్రయత్నించాడు. కాని గజల్ వినలేదు.

ఆడపిల్లలు కిలకిలా నవ్వుతూన్నప్పుడింక వెలుగులెందుకు? అయినప్పటికి రజియా వాళ్ళు కూర్చున్నచోట, పైన, తాను సారెలో తీసుకొచ్చిన దీపగుచ్ఛం వెలిగించింది. క్రింద తివాసీపైన నగల పెట్టెలు, గాజులు, రకరకాల చీరలు ఉన్నాయి. వాటి మధ్య కూర్చున్న ఆమె

నవ్వుతూంది. ఎన్నో రోజుల తరువాత గజల్‌కి నవ్వే అవకాశం లభించింది. ఇవాళ తనని తాను మర్చిపోవాలనుకుంది. ఫౌజియాని చూస్తూండాలంతే!

ఆమెకి గజల్ అని నామకరణం చేసిన మూర్ఖులెవరా అని నసీర్ ఆలోచిస్తున్నాడు. ఆమె ఖయ్యాం దివాన్ (గజళ్ళ పుస్తకం) మొత్తంలో కూడా ఇక్కడ లేదు. ఆమె శరీరంలోని ప్రతి అవయవం చక్కగా మలచబడినట్లుంది. ప్రతి అవయవంపైన కవిత్వం చెప్పొచ్చు.

వేల సంవత్సరం రాకముందు ఎక్కడో మొట్టమొదటిసారిగా షేర్ చెప్పినప్పుడు గజల్‌ని దృష్టిలో పెట్టుకుని చెప్పి ఉంటాడు. ఐవానే గజల్ గోడలపైనున్న ముసలి షాయర్లందరూ గజల్ కోసమై ఎదురుచూసి చూసి తనువు చాలించి వుంటారు. నేటి వరకు ఉద్భవించిన షాయర్ అంతా ఆమెను పొందటానికి చేసిన ప్రయత్నం మాత్రమే. అతడు కూర్చుని-కూర్చుని అలసిపోయాడు. ఈ సుదీర్ఘ యాత్రతో అతడి కాళ్ళ చేతులు బాధించసాగాయి. లెక్కలేనంతమంది కవులు, దీవాన్లు అతని ముందు కనపడ్డారు. తానే ఈ కురుల చల్లని నీడకై పాకులాడుతూ శతాబ్దాల అవధిని అధిగమించినట్టు భావించసాగాడు. ఆమె ఒక చూపుకై ఎన్నో పూటలు గడిచిపోయాయి. ఆశాదీపాన్ని పట్టుకొని ఆమెను వెతుకుతూ శతాబ్దాలపాటు పయనించి గజల్‌కి మూడు గజాల దూరంలో ఉన్న ఆ గది ముందుకొచ్చాడు.

అప్పటికి ఒక గొప్ప గజల్ తయారయింది. పెన్సిల్‌తో సిగరెట్టు పెట్టెపైన ఆ గజల్ వ్రాసి, రాషిద్ భాయికి వినిపించాలని నిర్ణయించుకున్నాడు. అతను కూడా ఇటుకలు, రాళ్ళ వ్యాపారం గురించి చెప్పి తన నుంచి బోలెడంత సానుభూతిని పొందాడు. అతడు రాషిద్ భాయీని పొగిడాడు. రాషిద్ భాయీ అతడ్ని బ్రహ్మాండంగా పొగిడాడు. ఇంత జరిగితేమటుకు ఏం లాభం? లోపల గదిలోంచి తన కవిత్వాన్ని మెచ్చుకునే తీరుబడే లేదెవరికీ, ఆమె ప్రతి నగ తాను పెట్టుకుని చూసి ఫౌజియాకి అలంకరిస్తూంది.

నవ్వుతూంటారు కనుకనే ఆడపిల్లలు అందంగా ఉంటారు. కానీ మగవారు నవ్వాలంటే ఎంతో ప్రయత్నించవలసి వుంటోంది. నవ్వడానికి తగిన కారణాలు వెతుక్కోవలసి వస్తూంది. అద్భుతమైన జోక్స్ ఉంటే

తప్ప నవ్వే అవకాశం ఉండదు. ఇంక అమ్మాయిలు ఒక ఉంగరం పెట్టె తెరచి చూసి షాయర్లు తమ గజల్ వినిపించడం మర్చిపోయేటంత గట్టిగా నవ్వుతారు. రాషీద్‌భాయీ బ్లాక్‌లో కొన్న మందుల వేగన్ల గురించి ముచ్చటించాలని చూస్తున్నారు. కాని అది భరించే శక్తి నసీర్‌కి లేదు. అసలే ఎవరో అతనిపై పెద్ద బండరాయి పడేసినట్టుందతనికి.

అమ్మాయిల నవ్వులు చిలికి చిలికి గాలివానైనట్టు మిన్నుముట్టాయి. ఉంగరం చూసి ఊరేగింపుని ఊహించుకోవచ్చును. ఆ సమయంలో ఫౌజియా చుట్టూవున్న అమ్మాయిల పరిస్థితి అలాగేవుంది. తప్పించుకునే మార్గం లేకుండా, ఎవరో ఒకరు ఉంగరం తీసుకుని తను చెయ్యిపట్టుకునేప్పటికి క్షణాలను ఊహించుకుంటున్నారు.

నసీర్ సిమెంట్ బస్తాలని, మందుల పెట్టెల్ని ఆవలకు నెట్టి ఒక సారి తెరవెనుక భాగంలోకి చూడాలనుకున్నాడు.

ఈపాటికామె తప్పక జూకాలు పెట్టేసుకుని ఉంటుంది.

అతడు కూజాల వద్ద నిలబడి రెప్పపాటు లేకుండా ఆమెను చూస్తుండగా, వెళుతున్న ఆమె ఆగిపోయింది.

'మీకేం కావాలి?' నసీర్ అంత కంగారు పడుతూండడం చూసి అడిగిందామె. అతని ఉద్విగ్నతను చూసి గజల్ పెద్దపెట్టున నవ్వేసింది. ఆ నవ్వువిని అటూ - ఇటూ వెళుతున్న వారాగిపోవడం చూసి షాహీన్ గది వెతకసాగాడతను.

అర్థరాత్రి షాహీన్ గదిలో నిద్రపోతున్న వాడల్లా లేచి తోటలోని మెట్లపై కూర్చుని సిగరెట్ కాల్చసాగాడు.

నడిరేయి చందమామ ఆకాశంలో తన కాంతిని వెదజల్లుతున్నాడు. గాలి బంధించినట్టుంది. ఉక్కవలన ఊపిరాడడం లేదు. ప్రాంగణంలో సందడి లేదు. పిల్లలు నిద్రపోయారు. బిరియానీ బఘూరా బైగన్, పాత్రలు తీసేసారు. ఇంట్లోని స్త్రీలంతా కాబోయే అత్త ఆడబిడ్డలు ఫౌజియాని అణువణువు పరీక్షిస్తున్న గదిలో గుమిగూడారు. ఇచ్చిపుచ్చుకోవడాలపై తర్జన, భర్జనలు జరుగుతున్నాయి. రాషిద్, వాహిద్ హుసైన్, షాహీన్లు నిద్రపోయారులా ఉంది.

'మీరు లేచారా... నేనిప్పటికి మూడుసార్లొచ్చాను గదిలోకి'.

నసీర్ ఆశ్చర్యంగా చూశాడు. ఎదురుగా గజల్ నిలబడి ఉంది. చక్కగా ముస్తాబై, నిద్ర ముంచుకొస్తున్నట్లు నిలబడింది.

'మీరు... మీరు నాగదికొచ్చారా...? నిజం...?'

'అవును... మీరు భోజనం చెయ్యలేదు కదా... మీరు భోజనం చేసేదాకా నేనివాళ పడుకోకూడదంది ముమానీ బేగమ్.'

'ఐతే రండి... ఇక్కడ కూర్చుని జాగరణ చేద్దాం!' అతడికి నవ్వొచ్చింది.

'ఎందుకు...! మీరు భోజనం చెయ్యరా?' గజల్ కంగారుపడింది.

'నేనెందుకు తినాలి... నా గురించెవరికి పట్టిందిక్కడ?' తెచ్చి పెట్టుకున్న కోపంతో అన్నాడు.

'ఎందుకు...? ఏమైంది?' గజల్ ఆశ్చర్యపోయింది.

ఉజాలా బేగమ్, వాహిద్ హుస్సైన్ల మధ్య ఉన్న వైమనశ్యాలు ఆమెకి తెలుసు.

(నసీర్ రాకముందు ఇంట్లో ఒక సమావేశం జరిగి, నసీర్‌ని చాలా గొప్పగా గౌరవించాలని, ఎంతో దర్జాగా ఉంచాలని, నిర్ణయమయింది.)

'ఏదో ఎందుకు, మీ విషయమే చూడండి, నేనొచ్చి నాలుగు రోజులైంది, కాని మీరు నాతో మాట్లాడనే లేదు.'

'అవును, నిజమే.' గజల్ ఆలోచించింది. సంఘంలో తన స్థానమేమిటో తనకి తెలుసు. అందుచేత అతని ముందుకు ఎంత తక్కువ వస్తే అంత మంచిదని ఊరుకుంది కాని కావాలని అతన్ని చిన్నపుచ్చలేదు. ఉజాలా బేగమ్, గోరంతలు కొండంతలు చెయ్యడంలో నిష్ణాత అని ఆమెకి తెలుసు.

'నేనా?' ఆశ్చర్యంగా అంది. 'నాదేముంది? మీకు సరియైన అతిథి మర్యాదలు చెయ్యడానికి రాషిద్ మామూ ఉన్నారు, ముమానీ బేగమ్ ఉంది, షాహీన్ ఉన్నారు! బీదవారిమైన మేము, మిమ్మల్నెలా పిలవగలం... ఏం చూపించగలం?' ఎంతో బాధగా అంది.

'మీరు బీదవారా?' ఆశ్చర్యంగా అడిగాడు నసీర్.

'నేను ఇంతకు ముందెప్పుడూ ఇటువంటి రూపం, సౌందర్యం ఆకర్షణలతో కూడిన సంపన్నురాలైన అమ్మాయిని చూడలేదు!' అంటూనే భావోద్రిక్తుడయ్యాడు.

'గోడనాసరాగా చేసుకున్న గజల్ చేతులు వాటంతట అవే క్రిందికి

వాలిపోయాయి. 'నాకు కవిత్వం చెప్పకండి. ఇవాళెంతగా నిద్ర ముంచుకొస్తూంది స్పృహలేనట్టుంది!'

కవిత్వమా పాడా...!' ఉడుకుమోత్తనంగా అన్నాడు, నసీర్.

'స్పృహ ఉన్నప్పుడు నా మాట విందురుగాని, వెళ్ళండి... వెళ్ళి పడుకోండి.'

ఆమె కాళ్ళు రాళ్ళలాగైపోయాయి. ఎలాగో ఒక చీకటి గదిదాకా వచ్చింది. అక్కడ మిగిలిపోయిన ఆహార పదార్థాలున్న పాత్రలు, ప్లేట్లు, బుట్టలు ఉన్నాయి. అక్కడేపడున్న దస్తర్‌ఖాన్ల మీద పడి గుండె పగిలేలా ఏడవడం మొదలుపెట్టింది.

తనను గురించిన పొగడ్తలు విన్నప్పుడెందుకో సమ్మోహితురాలయేది. పొగిడేవారి కంఠధ్వని ముందుగా గుండెల్లో తేనెలొలికించేది. తరువాత నేటివరకు తీరని కోరికల విషం నరనరాల్లో నింపి దహించేది. లోగడ ఇతరులు తన్ని అసహ్యించుకున్న సంఘటనలు వరుసగా ప్రత్యక్షమయ్యేవి. ఇంత అసహ్యం, చీకట్లను చేసి విలపించేది... ఇప్పుడేమవుతుంది?... తనతో ఇంకేమంటాడతను?

మరునాటి రాత్రి కూడా నసీర్ తోటలోకొచ్చి మెట్లమీద కూర్చున్నాడు. నేడు చంద్రుడు దగ్గరగా జరిగి, చెవిలో, 'ఇప్పుడేమాలోచిస్తున్నావు నసీర్ మియా' అంటున్నాడు.

అప్పుడే గజల్, అతని దగ్గర్నుంచి లేచి వెళ్ళింది. తోటవేపు నుంచి వస్తూన్న గాలిలోని సౌరభం, నిజానికి గజల్ మీద ధ్యాసవల్లనేనని నసీర్ నమ్మకం. ఈ మూడు గంటల్లో గజల్‌తో ఎన్ని కబుర్లు చెప్పాడో! గజల్, తన తల్లి అకాలమరణం, తండ్రి దుష్ప్రవర్తన మొదలుకుని, తనని మోసం చేసిపోయిన మగవాళ్ళదాకా అన్ని విషయాలు ఏకరువు పెట్టింది. ఐనా నసీర్ ఆమె చెయ్యి విడిచి పెట్టలేదు. ఆమెతో కలిసిన తన జీవితం గురించి మొత్తం కార్యక్రమం తయారు చేసేశాడతను. అతడు గజల్ని, ఉజాలా బేగమ్ కోడలిగా, తన ప్రేయసిగా, తన పిల్లలకి తల్లిగా, అన్ని రూపాల్లో చూశాడు. ఉజాలా బేగమ్ వాళ్ళింట్లో, తమ ఇంటి కోడలికి పెట్టవలసిన ఉంగరాన్ని నసీర్ తన వేలినుంచి తీసి గజల్ వేలికి పెట్టాడు.

ఏడు తరాల నుంచి, పెళ్ళి కూతురి మొహం చూసినప్పుడు, ఆమెకి

పెళ్ళికొడుకు, ఇస్తూ వచ్చిన ఈ వజ్రపుటుంగరాన్ని గజల్ వేలికి పెట్టినందుకు అతను కించిత్తయినా కంగారు పడలేదు. అతను ఉంగరమున్న చేతిని తన పెదవులకి తాకిద్దామనుకునేసరికి గజల్ తన చేతిని గాభరాగా లాక్కుని 'నా దగ్గరికి రావద్దు!' అంది.

'ఎందుకు?' అతను బలవంతంగా చెయ్యిపట్టుకున్నాడు.

'ఎందుకంటే నువ్వు నిప్పువి... నేను కాలిపోతాను.' ఆమె నిజంగానే గాభరాగా అంది.

'నీకీ అగ్నిలో కాలడం నచ్చదా?' గజల్ కళ్ళపైకి వంగి అడిగాడతను.

'నువ్వెప్పుడైనా మోసపోయి, బాధ కలిగితే నీకు తెలిసేది. కాలిపోవడమంటే ఏమిటో!' ఆమె కంగారుగా మొహం అటువైపుకి తిప్పుకుంది.

మరునాడు అజా[1]కి ముందే, ఆమె నసీర్ గదిలోకి వచ్చింది. నసీర్ ఆనందంతో పొంగిపోయాడు. చెయ్యి విడిపించుకుని వెళ్ళిపోయినందుకు పశ్చాత్తాపపడిందేమో రాత్రంతా నిద్రపట్టలేదేమో!

'నసీర్ నేను రాత్రంతా ఆలోచించాను. చాలా శ్రద్ధగా ప్రయత్నించాను. ఈ ఉంగరం, కథల్లో వ్రాసినట్టు... నన్ను నిజంగానే నీదాన్ని చేస్తుందేమో...!' ఆమె నిద్రలో గొణుగుతూందేమో అనిపించింది నసీర్‌కి.

'ఏం వ్రాసుంది కథల్లో...?'

'ఉంగరంలో షహజాదీ[2] ప్రాణముండేది... ఆ ఉంగరం ఇంకెవరి వద్దకైనా చేరుకుంటే షహజాదీ మరణించేది.'

'అయితే ఏమైందిట!' అతను గజల్ నడుము పట్టుకుని తన వద్ద కూర్చోపెట్టుకున్నాడు, 'పిచ్చిదానా! నువ్వెందుకు కంగారుపడతావు?'

'అదికాదు, ఉంగరం నువ్వు తీసేసుకో, లేకపోతే విషయం చాలా దూరం వెళుతుంది!' ఆమె ఉంగరం తియ్యబోయింది.

'విషయం చాలా దూరం వెళ్ళిపోయింది. ఈ ఉంగరం ప్రాముఖ్యత ఏమిటోకాని, నా పీకల మీదికొచ్చింది.'

గజల్ గాభరాపడింది. గజల్ భుజంమీద తన ముఖాన్ని రుద్దుతూ

---

[1]మహ్మదీయులకు ప్రార్థనా సమయాన్ని తెలియజేయుట.

[2]పాదుషా కుమార్తె.

అన్నాడతను. 'నువ్వు దొరక్కపోతే నేను చచ్చిపోతాను. నువ్వు నన్ను మోసగించవు కదా?'

కొద్దిపాటి తేమ తగలగానే కరిగిపోయే పటిక బెల్లంలాగ, ఈషన్మాత్రం ప్రేమ లభించగానే కరిగిపోయింది గజల్. ఆమె తన అస్తిత్వాన్ని క్రమంగా కోల్పోతూ, అతనిలో ఇమిడిపోయింది.

నసీర్ కళ్ళు తెరిచేసరికి ఒక అందమైన ఉదయం అతనికి స్వాగతం పలికింది. గజల్ ఎప్పుడు లేచి వెళ్ళిపోయిందో తెలియదు. కాని, ఆమె ఉనికిని గుర్తుచేసే వెచ్చదనమింకా దిండుపైన మిగిలి ఉంది. సువాసనలతో నిండి ఉన్న పక్క, నసీర్‌కి శరీరంలోని ప్రతి అణువును ఒక విచిత్రమైన మత్తులో ముంచుతూంది. ఆ విచిత్రమైన అనుభూతిని అతడింతకు ముందెరుగడు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరయాడు. పొయ్యి దగ్గర అలసి సొలసి ఏదో లోకాల్లో విహరిస్తున్నట్లు గోడనానుకుని నిల్చుని ఉంది గజల్. ముంగురులు మోముపై రెపరెపలాడుతున్నాయి. రాత్రంతా నిద్రపోనట్టు, కళ్ళు వాచిఉన్నాయి. పొయ్యిమీది కుండలో ఏదో మరుగుతూంది. ఆ పాత్రపైనే దృష్టి నిలిపి ఏదో ఆలోచనల్లో మునిగి ఉంది గజల్. ఉఫ్! ఆ అమ్మాయిలో ఎంతటి ఆకర్షణ ఉందో! వెలిసిపోయి, మాసిపోయిన బట్టల్లో సహితం పుత్తడి బొమ్మలాగా మెరిసిపోతూంది... ఆమెకేసి కన్నులారా చూస్తేనే, ఎలాగో అయిపోతున్నాడు నసీర్. ఒక్కసారి ఉలిక్కిపడి, సర్దుకున్నాడు.

నేడింట్లో అంతా మౌనంగా ఉన్నారు. రాత్రి నుంచి చాంద్ పరిస్థితి ఏమీ బాగుండలేదు. ఫౌజియా మొదలుకొని వాహిద్ హుసైన్ వరకు అంతా డాక్టరుతో పాటు ఆమె గదిలో ఉన్నారు. నసీర్ కూడా కొంచెం సేపు అక్కడ కూర్చున్నాడు. నేడాతని అంతరంగంలో ఆనందపు సెలయేళ్ళు ఉప్పొంగుతున్నాయి. అందువల్ల ఆ బాధాకరమైన వాతావరణంలో ఎక్కువసేపు కూర్చోలేకపోయాడు.

అతడు తన గదిలోకొచ్చి, రాత్రి గజల్ తలపెట్టుకుని పడుకున్న దిండుని, గుండెలకానించుకుని పడుకున్నాడు. అదృష్టమతనికై ఎంతటి వెలలేని రత్నాన్ని దాచి ఉంచుంది! నిన్నటి సాయంత్రం వరకూ అతనికీ విషయం అవగతం కాలేదు. ఇప్పుడీ రహస్యాన్ని దాచేదెలా? తనకెవరి

భయమూ లేనట్టు కాంతులీనుతున్న వజ్రపుటుంగరాన్ని వేలికి పెట్టుకుని తిరుగుతూంది; గజల్.

మధ్యాహ్నం హుమాయూన్ వచ్చి గజల్‌కి సాయంత్రం నాటకం రిహార్సల్‌కెళ్ళాలని చెప్పినప్పుడు, అతని ముందే రిహార్సల్ చూడడానికి తప్పక రమ్మని నసీర్‌కి చెప్పిందామె. సాయంత్రం అతను వేసుకోడానికి షేర్వాని తనే ఎంపిక చేసి పెట్టెలోనుంచి తీసింది. అతడి జోళ్ళు పాలిష్ చేసింది. తమ ఇంటికి వచ్చి, తన నటనా కౌశలానికి లభించిన కప్పులను, షీల్డ్‌ని చూడవలసిందిగా కోరింది.

మరునాడంతా అతను గజల్ ఇంట్లోనే గడిపాడు. ఇద్దరూ రోజంతా ఏవేవో ఖబుర్లు చెప్పుకుని నవ్వుతూనే ఉన్నారు. మధ్యాహ్నం 'నజిమా' సినిమా చూడడానికి వెళ్ళారు.

జమురుద్ మహల్ బాల్కనీలో కూర్చున్న గజల్‌కి, ఎంతో కాలంనుంచి నసీర్‌తో కలసి జీవిస్తున్నట్టనిపించింది. నసీర్ ప్రేమలోని వెచ్చదనం చాలా పాతపడిపోయినట్టనిపించిందామెకి. ఒక గృహిణిలాగ, గజల్, అతనికి వశమయిపోయేది. దాచుకోవడానికి ఆ శరీరంలో ఏముంది కనుక? ఆమె మొట్టమొదటిసారిగా తన ఆత్మని ఒక పురుషుడికి అర్పించింది, మిగిలిన విషయాలన్నీ మర్చిపోవాలనుకుంటూంది.

ఇద్దరూ ఇంటికి తిరిగొచ్చారు. హుమాయూన్ తననెంత అనుమానిస్తాడో అని నసీర్ కంగారుపడ్డాడు. కాని అటువంటిదేమీ జరగలేదు. గజల్ చేతికున్న ఉంగరాన్ని అందరూ చూసీ చూడనట్టు ఊరుకున్నారు. అది వారికి కొత్తకాదు.

మరునటి ఉదయం అతను లేచి ముందు హాల్లోకి వచ్చేసరికి షేవ్ చేసుకుంటున్న షాహీన్ అతన్నడిగాడు, 'ఇప్పుడు మీరింకొకనెలో, నెలన్నరో ఉంటారనుకుంటున్నాను.

మొన్నటి సాయంత్రం షాహీన్, ఇంకొక్క వారం ఉండవలసిందని ఎంత బ్రతిమాలినా, అత్యవసరమైన పని ఉందని, వెళ్ళి తీరాలంటూ అతని అభ్యర్థనని త్రోసిపుచ్చిన నసీర్ ఎవరివల్లో చిక్కుకున్నాడో షాహీన్‌కి తెలిసిపోయిందనీ, అర్థమైన నసీర్ ఒక వెకిలి నవ్వు నవ్వేశాడు.

షాహీన్ తెలివితేటల్ని చూసి అతనికి ఈర్ష్య కలిగింది. షాహీన్, నసీర్లు

ఇంచుమించు ఒకే వయసువారు. ఈ పట్నవాసపు పిల్లలు ఆవులించకుండానే పేగులు లెక్కపెడతారు.

'ఏం నా ఊహ నిజమే కదూ...?' షాహీన్ నవ్వుతూ చెయ్యి చాచేసరికి ఇద్దరూ పకపకా నవ్వేశారు.

రాషిద్-రజియాలు, ఫౌజియా సారె సామానులు కొనడానికి వెళ్ళారు. చాంద్ తన గదిలో మూలుగుతూ పడుంది. హాల్లో బల్లపైన కూర్చొని ఫౌజియా, కుంటత్త బట్టలు కత్తిరిస్తున్నారు. అక్కడ కూర్చోవడమెలాగ అని తికమకపడుతూ నిలుచున్న నసీర్‌ని చూసి, కుంటత్త తన కళ్లద్దాలు సరిచేసుకుంది... అతడు కంగారుపడ్డాడు.

ఇంక అతని ప్రేమ మత్తు వదలగొడతారు. కుంటత్త ఉపదేశాల ప్రకరణం ప్రారంభించబోయింది.

'బాబూ నసీర్, ఏం తింటున్నావో ఏమో! ఇక్కడ నీకు హాయిగా ఉన్నట్టు లేదు!'

అదేం లేదు అత్తా! నేనెంతో హాయిగా ఉన్నాను.'

'అత్తా! ఇతడు కావలసినదానికంటే ఎక్కువే సుఖంగా ఉన్నాడు...' షేవ్ చేసుకుంటూనే వెనక్కి తిరిగి అనేసరికి, షాహీన్ని కొట్టడానికి పరుగెట్టాడు నసీర్.

'ఏమో బాబూ! మేము చాంద్ విషయం ఎంతో బాధపడుతున్నాము. అందుకనే నసీర్‌బాబు తిండి తిప్పల విషయం కాస్త జాగ్రత్తగా చూడమని గజల్‌కి చెప్పాను!' కుంటత్త బల్లమీద బట్టపరుస్తూ అంది.

'అదే, అదే చాలా చక్కగా చేశారు.' షాహీన్, నసీర్‌కేసి చూస్తూ అన్నాడు.

'గజల్ ఇతన్ని చాలా జాగ్రత్తగా చూస్తుంది. ఇప్పటిదాకా ఏమేమి తినిపించిందో అత్తకి కాస్త చెప్పునాయనా!' తనన్న మాటలకి, నసీర్‌తోపాటు తనూ నవ్వేశాడు షాహీన్.

'ఫో వీడొట్టి పోకిరీ పిల్లాడు!' నవ్వుతూ అంది అత్త.

'నీకేమిష్టమో చెప్పు, నేనదే వండిస్తాను!' తిరిగి కత్తెర చేతుల్లోకి తీసుకుంటూ అంది కుంటత్త.

'ఆహా, ఆహా... ఎంత మంచి మాటన్నావు అత్తా...?' షాహీన్ ఎగిరి

గంతేశాడు. 'ఇదిగో నసీర్‌మియా, ఇటువంటి అవకాశం మళ్లీరాదు. ఆ త్వరగా చెప్పు, నీకేమి ఇష్టం?'

'నువ్వు నోరు మూసుక్కూర్చుంటావా లేక నన్ను రమ్మంటావా...?' నసీర్, షాహీన్‌ని కొట్టడానికి పరుగెత్తాడు. వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటూ బైటికి పరుగెత్తారు.

తరువాత నసీర్ ఒకనెల హైదరాబాదులో, రోజులు క్షణాల్లా గడిపాడు. తండ్రికి తెలియకుండా తల్లి దగ్గర నుంచి వెయ్యి రూపాయలు తెప్పించుకున్నాడు. పైన పైనకి పాకులాడే స్వభావం గల ఉజాలా బేగం, కొడుకు మొదటిసారి హైదరాబాద్ వెళ్ళడంతో, అతను వాహిద్ హుసైన్ ముందు తమ దర్జా ఒలకపొయ్యాలన్న ఉద్దేశ్యంతో పంపించింది. ఆ డబ్బుతో, గజల్‌తో కలిసి టాక్సీలో తిరిగాడు అతను. ఆమె కోసం ఎన్నో బహుమతులు కొన్నాడు. గజల్‌ని బీబీ వాళ్ళింట్లో ఎక్కువ రోజులు అట్టేపెట్టడం హుమాయూన్‌కి ఇష్టంలేదు. కానీ నసీర్ ప్రతి సాయంత్రం హుమాయూన్ వాళ్ళింటికి, బోలెడన్ని బహుమానాలు తీసుకువెళ్లేవాడు. అది చూసిన హుమాయూన్ గజల్ని కట్టడిచెయ్యడం మానేశాడు.

ఇక నసీర్‌తో కలిసి ఎక్కువ కాలం హైదరాబాద్‌లో ఉండలేననిపించింది గజల్‌కి. ఎటుచూసినా తనని ఎరిగున్న వాళ్ళే కనబడుతున్నారు. నసీర్‌తో తనని కలిసి చూసిన వాళ్ళంతా నవ్వేవారు. 'నేనింకెప్పుడూ హైదరాబాద్ రాను. అక్కడే ఎక్కడో అజంతా గుహల్లోనే ఒక కుటీరం ఏర్పాటు చేసుకుని అక్కడే ఉందాం.' నసీర్‌తో అంది గజల్. నసీర్ తన పరిస్థితులు వివరించడం మొదలుపెట్టేవాడు. ఒక చిన్న ఊళ్ళో, ఒక పెద్ద పురాతనమైన భవనం. అందులో కఠోరమైన మనస్తత్వం గల అతని తల్లిగారు ఉంటారు. ఆవిడ అనుమతి లేనిదే నసీర్ గడ్డిపోచ కూడా తుంచలేడు. అక్కడ నసీర్ పొలాలున్నాయి. ఆ పొలాల్లో, గజల్‌తో కలసి ట్రాక్టర్ నడుపుతూండవచ్చు. అక్కడ గ్రామాల్లోని జనం ఎప్పుడూ పేస్ట్రీ తినలేదు. రంగస్థలం-నాటకాలు చూడలేదు. అక్కడ బోట్‌క్లబ్ లేదు. బిల్‌గరామీ, ఖాన్ సాహెబ్ వంటి సంఘ సేవకులూ లేరు.

ఈ మాటలు విన్న గజల్ ఆనందంతో పొంగిపోయింది. అంత అందమైన వాతావరణం...! సామాన్యమైన మనుషులు! బోట్‌క్లబ్, భారత్ కళామండలి

మలిన వాతావరణం కంటె ఆ ప్రదేశం ఎంత భిన్నంగా ఉంటుందో! అక్కడ తనెవరికీ భారంగా ఉండదు. ఆ ఇంట్లో అందరూ గౌరవిస్తారు... తను కూడా ఫౌజియాలాగ పెళ్ళికూతురై అక్కడికెళ్ళిపోతుంది.

పొడుగాటి గోళ్ళపై పాలిష్ చేసుకుంటున్న గజల్‌ని చూసి నసీర్ నవ్వుతూ అన్నాడు, 'ఔరంగాబాద్ వెళ్ళేముందు నువ్వీ గోళ్ళు కత్తిరించుకోవాలి! పొడవాటి గోళ్ళంటే అమ్మకసహ్యం!'

ఇది విన్న గజల్‌కి పెద్దగా నవ్వొచ్చింది. తాతగారికీ, బీబీకి కూడా తన, ఫౌజియా యొక్క గోళ్ళంటే ఒళ్లుమండేది.

'అక్కడి స్త్రీలు పరదా లేకుండా తిరగరు, లిప్‌స్టిక్ వేసుకోరు.'

ఒకనాడు అన్నం తింటున్నప్పుడు నసీర్ అడిగాడు. 'నీకు బిరియానీ చెయ్యడం వచ్చా?' అప్పుడు నసీర్‌కి ఒక అందమైన నాజూకుగా ఉన్న అమ్మాయి గుర్తొచ్చింది. ఆ అమ్మాయిని కోడలిగా చేసుకోవాలని నిర్ణయించుకున్నప్పుడు అమ్మ, 'నసీఫ్ సభ్యతా సంస్కారాలు నా మనస్సు నాకట్టుకున్నాయి. పిన్నమ్మా! ఆ పిల్ల కోడి బిరియానీ ఎంత బాగా చేసిందంటే దరిద్రగొట్టు బావర్జీలంతా సిగ్గుతో తలవంచుకోవాలి, అని ఎన్నో సార్లంది. తెల్లగా ఉండి మూర్ఖురాలిలాగ కనబడే ఆ పిల్ల, నసీర్‌క్కూడా నచ్చింది. ఇంకా అమ్మ వాళ్ళకి కబురుపంపక పోవడం మంచిదైంది.

'నాకేమీ వంట రాదు' గజల్ గొప్పగా చెప్పింది. చాంద్ ఆపా సహవాసంలో తన అందమైన చేతులు, పొయ్యి అంటించడానికి, వంటచేయడానికి కావని గజల్ తెలుసుకుంది.

'అలాగైతే నువ్వు ఆడదానివేనా అని అనుమానమొస్తుందమ్మకి', ఈ మాటకి గజల్‌కి కూడా నవ్వొచ్చేసింది.

నసీర్ వెళ్ళిపోయేటప్పుడు ఇద్దరూ విపరీతంగా దుఃఖించారు. గజల్ అతని దగ్గిర లెక్కలేనన్ని ఒట్లు పెట్టించుకొంది. అతను ఇకమీదట ఏ నాటకంలోనూ నటించవద్దని, ఘోషాలో ఉండటం అలవాటు చేసుకోమని గజల్‌కి గట్టిగా చెప్పాడు. కారణం - అతని తల్లి పరదాలేకుండా తిరిగే స్త్రీలని వేశ్యలుగా భావిస్తుంది.

వెళ్ళేముందు, నసీర్ కొంచెంసేపు బీబీ వద్ద కూర్చున్నాడు. అతి త్వరలో

ఉజాలా బేగమ్ గజల్ గురించి కబురు పంపిస్తుందన్న వార్త చెవిని వేశాడు. బీబీ ఆశ్చర్యంతో అవాక్కైపోయింది. రాషిద్-రజియాలు ఈర్ష్యాసూయలతో కుతకుతలాడిపోయారు.

పిల్లి అదృష్టం కొద్దీ ఉట్టి తెగిపడింది. విశృంఖలంగా తిరిగినా ఈ పిల్ల, ఉజాలాబేగమ్ కోడలై రాజ్యమేలగలదని ఇక్కడెవరూ కలలో కూడా అనుకోలేదు. ఈ విషయాన్ని ప్రప్రథమంగా అంగీకరించింది వాహిద్ హుసైన్. చిట్ట చివరికి రజియా ఆమోదించింది. మళ్ళీ ఒకసారి నసీర్ రావాలని, అప్పుడు గజల్‌నొక్క తోపుతోసి ఫౌజియానతని గదిలోకి పంపెయ్యాలని ఆశపడుతోందావె. ఆశ్చర్యం... ఫౌజియా గురించెక్కడెక్కడో వెతికారు గొప్ప సంబంధం కోసం. చివరికి ఇప్పుడిప్పుడే పైకొస్తున్న డాక్టరు దొరికాడు. అతడి కోరికల కంతే లేదు. ఇటు అందరిచేత అవమానించబడి, తిరస్కరించబడి పాడైపోయిన పిల్ల రజియా ఇంట్లోనే ఉంటూ నసీర్‌ని కాజేసింది.

ఒకనాడు గజల్, గదిలో కూర్చుని నసీర్‌ని తల్చుకుని దుఃఖిస్తోంది. తడబడుతున్న అడుగులతో చాంద్ ఆమె పద్దకొచ్చి కూర్చుని, తన ఎండిపోయిన చేతుల్ని ఆమె భుజంమీద వేసి, 'నసీర్‌ని మర్చిపో గజ్జూ! పిల్లలకు చందమామనెవరు తెచ్చిచ్చారు?' చాంద్ మాటలు విన్న గజల్ ఉలిక్కిపడింది, ఆమె జాగ్రత్తగా పరిశీలించింది.

'నన్ను పిచ్చిదాన్ననుకుంటున్నావు కదూ...? ఇన్ని జ్ఞాపకాలతో ఎలాగ జీవించగలవా అని నీ గురించాలోచించినప్పుడు నా గుండె బ్రద్దలవుతూంటుంది.' అలసి పోయినట్టుంటూ అక్కడి బల్లమీద కళ్ళు మూసుకుని పడుకుంది.

ఈ చాంద్ ఆపా ఎలాంటి అపశకునపు మాటలు మాట్లాడుతుంది! ఇప్పుడు ఆమె అంటే గజల్‌కెటువంటి సానుభూతి లేదు. ఈమె కూడా ముమానీ బేగమ్ లాగ నా అదృష్టానికి ఈర్ష్యపడుతూంది.

'చాంద్ ఆపా! నన్ను గురించిన విషయం లేకుండా ఏ పద్యం పూర్తి చెయ్యనని ఆయన నాకు మాటిచ్చారు.'

'పిచ్చిదానా! చాంద్ ఆపా నవ్వులో చేదు కనపడింది. 'అతని పద్యాలు పూర్తవడంతో నీ జీవితం చక్కబడుతుందా?' ఊపిరి పీల్చుకోవడం కోసం

ఆగింది. 'గజ్జూ! ఈ కళాకారులంతా ఇంతే, ఏ ఒక్కరి తోడూ, స్నేహం వీరికక్కర లేదు. జీవితాన్ని అందంగా మలచగలిగే జ్ఞాపకాలు మాత్రం కావాలంతే!'

చాంద్ ఆపాని ఏమైనా వాగనీ నసీర్ జ్ఞాపకాలు తన ఆత్మలో నిండి ఉన్నాయి. నసీర్, బిల్‌గరామీ కాడని ఆమె నమ్మకం. తన వరుడు అంత పెద్ద ఆస్థికి యజమాని కావడం తన అదృష్టం. నసీర్ బీదవాడైనా తను అదే విధంగా స్వీకరించేది. సారె సామాన్లేవీ అక్కర్లేదని చెప్పేశాడు... ఇంక ఫౌజియా భర్త ఆరేడు వందలు సంపాదించుకునే డాక్టరు, అయినా అత్తవారికి తృప్తిలేదు. సారె సామాన్ల పట్టిక పెంచి పెంచి రజియా అలసిపోతుంది. ఈమధ్యనే వైద్యశాస్త్రంలో ఉన్నత విద్య నభ్యసించడానికి షాహీన్‌ని ఐరోపా దేశానికి పంపారు. ఇప్పుడింక కూతురి వివాహంలో ఎక్కువ ఖర్చు చెయ్యడానికి సంసిద్ధంగా లేదు. నగలు పెట్టడం, వివాహం సందర్భంగా విందు చెయ్యడం, వాళ్ళకి అచ్చిరాలేదు. అందుకని పెళ్ళికూతురికి బట్టలు మాత్రం తీసుకువస్తానని వాళ్ళ అత్తగారు చెప్పింది.

ఫౌజియా తన కాబోయే భర్త ముఖం కూడా చూడలేదు. అయినా విన్న మాటల్ని బట్టి, అతనిపై మనస్సు నిల్పుకోవడమే కాకుండా అతని అలవాట్లన్నీ తెలుసుకుంది.

'ఆయనకి నలుగు పిండి నచ్చదు. అందుకని జల్వా అప్పుడు నాకు నలుగుపెట్టారు.'

'మాంసం చాలా ఇష్టంగా తింటారుట... అనవసరపు ఖర్చంటే కోపమంట... పరిశుభ్రత అంటే చాలా ఇష్టం...'

ఆమె మెల్లి మెల్లిగా ఇవన్నీ గజల్‌కి చెప్పి, నవ్వేది.

ఫౌజియా మాటలు వింటూ గజల్ తన ఊహల్లో తేలిపోయేది. 'తిండి తిప్పలపై ఎటువంటి ఆసక్తి లేదు... నేను ఎదురుగా కూర్చుంటే సరి, ఆయన కవిత్వం చెపుతుండాలి... నా కళ్ళపై వేయి సంవత్సరాల వరకూ పద్యాలు చెబుతూనే ఉంటారుట. ఆయనకి పిసినిగొట్టుతనమంటే అసహ్యం... నన్నెప్పుడూ నాటకాల్లో వెయ్యవద్దని చెప్పి వెళ్ళారు...'

కాని హుమాయూన్ ఎందుకొప్పుకుంటాడు! నిజానికి అతనేం ప్రయత్నం చెయ్యడం లేదు. వారంతట వారే వచ్చేవారతన్ని పొగడ్తల్తో

ముంచెత్తడానికి తమ అసమర్థతని వారు వ్యక్తం చేసే పద్ధతి చూస్తే గజల్ హృదయం ద్రవించిపోయేది. ఖుర్‌దాద్ నెల (ఇంచుమించు ఆషాఢ మాసం) వచ్చేసింది.

చిరు మేఘాలు కమ్ముకుంటున్నాయి. మారుతున్న కాల ప్రభావం వలన హృదయాల్లో కూడా అలజడులు చెలరేగుతున్నాయి.

ఇండియన్ యూనియన్ సైన్యాలు హైదరాబాద్ సరిహద్దుల్లోకొచ్చేశాయి. ఎటు చూసినా అలజడులు, అశాంతి, వ్యాపించి ఉంది. సర్ వాల్టర్ మాంకేటన్ ద్వారా ఆలా హజరత్ ఢిల్లీ పంపిన తీర్మానాలన్నీ తిరస్కరించడం జరిగింది. ఇటు కాసిమ్ రిజ్వీ, జిన్నామీద ఎన్నో గొప్ప గొప్ప ఆశలు పెట్టుకుని కూర్చున్నాడు. హైదరాబాదు నుండి వెళ్ళే ఉత్తరాలు, టెలిగ్రాములు, మరియు వార్తలు వీటన్నిటి రికార్డు ఇండియన్ ఏజెంటైన కె.ఎమ్.మున్షీ దగ్గిర వుందన్న విషయం కాసిమ్ రిజ్వీకి తెలియదు. సైన్యంతో నిండిన పాకిస్తానీ విమానాలు బేగంపేట విమానాశ్రయంలో దిగనున్నాయని రిజ్వీ ప్రజలకి చెప్పాడు. హైదరాబాదు భవిష్యత్తుకి సంబంధించిన సమస్యని సైన్యపు చర్యల వలన పరిష్కరించగలగడం, జరగని పని అని జిన్నాకి తెలుసు. అందువల్ల దాడులు జరపడం వంటి ఏ విధమైన చర్య తీసుకోవడాన్ని ఆయన వ్యతిరేకించారు. ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో కాసిమ్ రిజ్వీ తన ఉద్దేశ్యాన్ని మార్చుకోడానికి ఒప్పుకోలేదు.

సల్తనత్ ఆసఫియాని కాపాడడం కోసం ప్రజలు చాలా ఉత్తేజితులై ఉండడం వల్ల రిజ్వీ తన పద్ధతి ప్రకారం రజాకార్లని సరిహద్దుల్లో యుద్ధం చెయ్యమని ఆదేశాన్ని జారీ చేసేశారు.

'కింగ్ కోఠీ'లో కూర్చున్న 'ఆలా హజరత్'. ఢిల్లీలోని చరిత్రహీనుల్ని రజాకారు గూండాలని మూతులు పగులగొట్టమని ఆజ్ఞలిస్తున్నారు. కాని అప్పటికే నిరాశ్రయులైన యువకులు ఇండియన్ యూనియన్ సైన్యాన్ని ఎదుర్కోవడానికి వెళ్ళి ట్యాంకుల క్రిందపడి గడ్డిపరక కంటె హీనంగా నలిగిపోసాగారు.

రాషిద్ పరిస్థితుల్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. విభిన్నమైన వస్తువుల వ్యాపారంలో, ఐవానే గజల్‌కి ఋణవిముక్తి కలిగేటంతటి ధనాన్ని

సంపాదించాలనుకుంటున్నాడతను. ఆ పరిస్థితుల్లో హైదరాబాద్‌లోని ప్రతి వ్యాపారస్థుడూ లాభ నష్టాల తక్కెడ్ని పట్టుకుని, తనెటువైపు మొగ్గాలా అని ఆలోచిస్తున్నాడు.

నలువైపులా స్వార్థం నిండిపోయింది. అంతా పారిపోవడానికి మార్గాలు వెతుక్కుంటున్నారు. తమంత తామే నాయకులై కూర్చున్న స్వార్థపరులు, అమాయకులైన యువకుల్ని ఉసికొల్పుతున్నారు. వాతావరణమంతా 'అల్లాహో అక్బర్' నినాదాలతో ప్రతిధ్వనిస్తోంది.

'పదండి ముందుకి! మాతృభూమికై చిట్టచివరి నెత్తుటి బిందువుని సహితం అర్పించండి!' కాసిమ్ రిజ్వీ అరుస్తున్నారు.

'గూండాలు, బద్మాష్‌లు...! వారందర్నీ బంధించండి!' అలా హజరత్ కోపంగా హుకుమ్ జారీ చేస్తున్నారు. నేడు తన ఆగ్రహానికి తలుపులు గోడలు ఎందుకు కదిలిపోవడం లేదా అని ఆయనకి ఆశ్చర్యంగా ఉంది.

ప్రతి ఇంటి నుంచి వెళ్ళిన ఎవరో ఒకరు, అడవుల్లోని ఏ పొదల్లోనో చిక్కుకుని చిరునిద్రకు గురైనారు. చేతిలో ఏ ఆయుధం లేని కారణాన, స్వరక్షణార్థమై ఏ విధమైన ప్రయత్నమూ చేసుకోక పోవడం వలన, వారు ముందుకు దూసుకువస్తూన్న ట్యాంకుల్నాపడం కోసం చేతులు జాపి నిలబడినందుకు అలాగా అకాల మృత్యువు వాత పడ్డారు. వారు ఒక స్వతంత్ర సంస్థానానికి చెందిన ప్రజలు. సంస్థానానికి చెందని ప్రతి వ్యక్తిని వారు అసహ్యించుకొనేవారు. వారి గొప్ప మనసు గురించి అంతా చెప్పుకునేవారు. ఎవరి వద్దనైనా ఆశ్రయం లభిస్తే చాలు ఏడు తరాలవరకు నిశ్చింతంగా ఉండేది. ఇక్కణ్ణించి తూష్ణీభావంతో నెట్టివేసిన వారికి తలదాచుకోడానికింత చోటైనా దొరికేది కాదు. మా సభ్యతా సంస్కారాలు... మా రాజ్యం... మా దేశం... మా ప్రభువుపై ప్రాణాలర్పిస్తాం అనే ప్రభుభక్తి పరాయణులైన ప్రజలు తుపాకులకెదురు నిలుచోరు, తమ హుజూర్ - రు - పుర్‌నూర్ నేని తమ జీవితాన్ని ఊహించనైనా ఊహించలేని వారు... ఇదొక విచిత్రమైన రాజ్యం... ఆశ్చర్యకరమైన నిరంకుశత్వంలో పాదుషా ఎడల ప్రేమాభిమానాలు, అన్నిటికన్న మిన్నయైన అనుభూతులు.... ఈ విషయం ఇండియన్ యూనియన్ సైన్యానికి ఐదు రోజుల్లో అడుగడుగునా తెలిసివచ్చింది.

తమ కంటివెలుగును పోగొట్టుకున్న తల్లుల్లాగ, రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి.

విద్రోహపు ఉద్వేగాన్ని రగిల్చిన వారు రాత్రికి రాత్రే పాకిస్తాన్‌కి పారిపోయారు. మిగిలి ఉన్న వారు ఎక్కడెక్కడో దాక్కున్నారు.

ఐవానే గజల్, తోటలోని ఇంగ్లీషు మాట్లాడే పిట్ట. వాహిద్ హుసైన్ తోటలోకెందుకు రావడం లేదా అని ఆదుర్దాపడుతూంది.

అది ఆయన కుర్చీ దరిదాపుల్లో షూ... షూ... షూ... బూ అంటూ తిరుగుతూంది.

తోటలోని మళ్ళలో విరిసిన పువ్వులు తలఎత్తి ఆయన కోసం ఎదురుచూస్తున్నాయి. వాటి తల నరకమని ఆజ్ఞ ఇవ్వాదగ్గ వ్యక్తి గుండెపోటుతో తన గదిలో పడున్నారు. ఆయన కవిత్వపు పుస్తకాలన్నీ అలమార్లలో మౌనంగా పడున్నాయి.

ఐవానే గజల్‌లో నివసించేవారు మంచి సమయస్ఫూర్తి గలవారు. వారు రాబోయే అపాయాన్ని గ్రహించడమే కాకుండా తమ రక్షణకై తగిన ఏర్పాట్లు కూడా చేసుకున్నారు. రాషిద్‌కంతా లాభసాటిగానే ఉంది. అతడు నెల, నెలన్నర క్రితం ఇత్తిహాదుల్ ముసల్మాన్‌లో ప్రముఖ సభ్యుడైపోయాడు. గొప్ప పెట్టుబడిదారులు, వ్యాపారస్థుల వద్దనుంచి విరాళాలు వసూలు చేసి, కాసిమ్ రిజ్వీ ముందు పొయ్యసాగాడు. కేవలం ఒప్పందాలు, ఒడంబడికలతో విషయం సమాప్తమవకూడదని అతను కాంక్షిస్తున్నాడు. అటువంటప్పుడు అతనికి లక్షల్లో నష్టం కలిగే అవకాశం వుంది. యూనియన్ సైన్యాలొస్తున్నాయని విన్నప్పుడు, రాజకీయాన్ని విడిచిపెట్టి, కేవలం వ్యాపారస్థుడైపోయాడు.

'నేను రాజకీయపు గొడవల్లో పడను' అతడు తన స్నేహితులతో అన్నాడు, మేము వ్యాపారస్థులం... ఈ రాజకీయాలతో మా కంపెనీ అతడు షోలాపూర్, అహమ్మదాబాదుల గుండా వస్తువులు స్మగుల్ చేస్తుండేవాడు.

కొడుకు చేస్తూన్న ఈ రకం పనులలో వాహిద్ హుసైన్‌కి ఎటువంటి ఉత్సాహం కలుగకపోగా, ఒక విధమైన నిరసనకి గురి అయింది ఆయన అంతరంగం. విగత వైభవం తిరిగొస్తుందన్న అస్పష్టమైన ఆశాకిరణం

పూర్తిగా అదృశ్యమైపోయింది. ప్రతి జాగీర్దార్ ఇంట్లోనూ విషాదచ్ఛాయలు ఆవరించుకొన్నాయి.

దర్జాగా బ్రతకాలంటే - అవకాశాల్ని స్వార్థానికుపయోగించుకునే తెలివితేటలు ఎటువంటి మాటలనైనా భరించగలిగే హృదయం, ప్రతి ఒక్కర్ని పొగడగలిగే నాలుక కూడా ఉండాలన్న విషయం వీరెరుగరు. జాగీర్దారు కొడుకు కూడా జాగీర్దారే అన్న విషయం మాత్రమే వీరికి తెలుసు. గొప్పవాళ్ళ అదృష్టాన్ని అల్లామియా ఒక్కసారి బంగారు కంఠంతో వ్రాసేస్తే, ఇంక దాన్నెవరూ చెరపలేరన్నది వీరి భావన.

వాహిద్ హుసైన్ పితామహులు జాగీరుతో సంబంధము కలవారు. తమ స్వంత పోలీసులు, సైన్యం కల అధికారుల కోవకు చెందినవారాయన. వీరే సల్తనత్ ఆసఫియాని నిజంగా రక్షించే వారనిపించుకునే వారు. అప్పటివరకూ, రెజిమెంట్ అధికారం నెత్తిన పడలేదు. జాగీర్దార్లను ప్రశ్నించే అధికారం హుజూరు వారికే ఉండేది కాదు. అటువంటప్పుడు వాహిద్ హుసైన్ తాత తండ్రులకు భోగభాగ్యాలనుభవించే వారసత్వం లభించింది. అందుచేతనే వారు ఐవానే గజల్ నిర్మించారు, అందులో కాలానుగుణంగా ఒక కొత్త ప్రియురాలు జనిస్తూండేది. ఈ అందాల భరిణల ఊహే పెద్ద పెద్ద జాగీర్దార్లను స్థిరంగా ఉండనిచ్చేదికాదు. హుజూర్ వారి దృష్టికూడా ఐవానే గజల్‌లోని మదోన్మత్త పైనే ఉండేది. అంబరాబాగ్‌లో భారతదేశం నలుమూలల నుంచి వజ్రవైఢూర్యాలు సమకూరేవి. ఐనా ఐవానే గజల్లోని మెరుస్తూన్న చందమామ ముందు అవి వెలా తెలా పోయేవి. దాని ఆకర్షణ సుదూర ప్రాంతాలనుంచి జనాన్ని లాక్కొచ్చేది. నసీర్ కూడా ఐవానే గజల్‌లో అటువంటి ప్రియురాలినే ఊహించుకుంటూ వచ్చాడు. తిరిగి వెళ్ళేటప్పుడు, అందం ప్రభావం వల్ల రాయిగా మారిపోయాడు. ఈ ఉన్నతికి లోనయిన వాహిద్ హుసైన్ తాత తండ్రులు పొలాలకి పొలాల్ని నమిలేశారు. దేవిడిలు మ్రింగేశారు. భార్యల నగలు ఊదేశారు. చేతులు తుడిచేసుకుని సమాధుల్లోకి పోయి నిద్రించారు. ఇక మిగిలింది సంతాన మొక్కటే. ఇప్పుడు శిక్ష అనుభవిస్తూంది.

రోజుకు రెండుసార్లొచ్చేవాడు డాక్టరు, వాహిద్ హుసైన్‌కి మందులకి బదులు రెండు మూడు శుభవార్తలు ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయేవాడు.

సాయంత్రం రాషిద్ వార్తాపత్రికచేత పట్టుకుని దానిపైన చిన్న కాగితం పెట్టుకుని, అందులోంచి మంచి వార్తలు చదివి వినిపించేవాడు. ఇక మిగిలింది కుంటత్త, షేకూమియా. రాషిద్ దృష్టిలో వీరిరువురు అబద్ధాలు చెప్పేవాళ్ళు. రేడియోలలో ప్రసారమయ్యే వార్తల్ని కూడా, అతిశయోక్తిగా చెబుతూండేవారు. ప్రజల్లో భయం వ్యాపించాలని అలాగే చెప్పేవారు.

కుంటత్త మాత్రం నాటి వార్తాపత్రికల్ని ఏ మాత్రం విశ్వసించేది కాదు. ఆవిడకి వార్తలందించేవాళ్ళలో ముఖ్యులు చాకలి భాయీ లాంటి వాళ్ళు, అందరికంటే ఎక్కువ షేఖూమియా, అతను రజాకార్లలో చేరిపోయాడు. కాని భయం వల్ల ఇంట్లోంచి అడుగుబైట పెట్టేవారు కారు. నిజానికి ఖూమ్‌లూ, రామ్, వినిపించిన మాటల్ని ఆధారంగా చేసుకుని, రజాకార్ల సాఫల్య, విజయాలగురించి అతను కథలుగా చెప్పేవాడు. ఆ కథలకి అతను నాయకుడు.

అందుకని, వాహిద్ హుసైన్ గదిలోకి బీబీ, డాక్టరు తప్ప ఇంకెవరూ వెళ్ళకూడదని రాషిద్ గట్టిగా కట్టడి చేశాడు. బీబీ ఎంత మౌనంగా ఉండిపోయిందంటే, ఆమె వాహిద్ హుసైన్‌తో కాని, ఇంకెవరితోకాని మాట్లాడడమే మానేసింది. రేయింబవళ్ళు మౌనంగా ఉండి తలుపుల్ని గోడల్ని చూస్తూండేది. అసలా కాలమే అలాంటిది. అందరూ భయపడుతున్నారు. ఎవరూ ఎవరితోనూ మాట్లాడేవారు కారు. పగలూ రాత్రి దణ్ణాలు పెట్టుకుంటూ, చెంపలేసుకుంటూండేవారు.

వాహిద్ హుసైన్ తన గదిలో చేదుమందులు మ్రింగుతూ పడుకున్నారేకాని, ఆయన మనస్సంతా ఔరంగాబాద్‌లోనే ఉంది. అక్కడ ఆయన తమ్ముడు ఎన్ని ఇబ్బందులు పడుతున్నాడో, రాషిద్ తన స్నేహితుడి ద్వారా వాళ్ళ క్షేమ సమాచారం తెలుసుకున్నానని, వాళ్ళు సురక్షితంగా ఉన్నారని చెప్పాడు. కాని ఔరంగాబాద్ గురించి బాధాకరమైన వార్తలు వస్తూండేవి. ప్రత్యేకించి అహమ్మద్ హుసైన్ జాగీరు బాంబులవల్ల నాశనమైపోయింది అని తెలిసింది. ఉజాలా బేగమ్, అహమ్మద్ హుసైన్ నసీర్, ఎక్కడున్నారో, అసలున్నారో లేదో తెలీదు. అప్పుడప్పుడూ ఉజాలా బేగమ్ మాటలూ ప్రేమ గుర్తొచ్చినప్పుడు, బీబీ నెమ్మదిగా విలపించేది. చిన్న తోడికోడలి నాశనాన్ని తల్చుకుని ఏడ్చిన మొట్టమొదటి పెద్ద

తోడికోడలామె. ఆమె దుఃఖం చూసి రజియాకి కోపం వచ్చింది. తన కొడుక్కి అదృష్టం పడితే సంతోషించడానికి బదులు, దుఃఖించే ఆమె ఎటువంటి స్త్రీ బాబూ! అదే గూండాలు దేవిడీని దోచుకుపోయినా రెండున్నర లక్షలు ఖరీదు చేసే ఆ స్త్రీని తీసుకుపోయి వుండరు కదా! నేడు కాకపోతే రేపు... ఆ వస్తువులన్నీ స్వంతం అవుతాయి కదా!

గజల్‌కి దుఃఖంతో పిచ్చెక్కిపోతూంది. నసీర్ వెళ్ళినప్పటినుంచి గజల్ గురించి ఏమీ పట్టించుకోలేదు. ఈమె మాత్రం రోజుకి నాలుగేసి ఉత్తరాల చొప్పున వ్రాసింది. నసీర్ తల్లి పరమ గయ్యాళి అనేది ఫౌజియా. ఆమె గజల్ ఉత్తరాలన్నీ తీసుకుని పారేస్తుండేది. అకస్మాత్తుగా అతడొకనాడు పెళ్ళికి తరలివస్తాడు. పాపం గజల్ ఎప్పుడూ ఆశగా తలుపుకేసి చూస్తూండేది. ఈ మధ్య ఎవరికీ నాటకాలు గుర్తు రావడంలేదు. అక్కడక్కడ శాంతి సమితులు ఏర్పడుతున్నాయి. మసీదులకు వెళ్ళి ప్రజలు ప్రార్థనలు చేస్తున్నారు. దర్గాలకి వెళ్ళి తమ భర్తల్ని సోదరులని క్షేమంగా తిరిగి వచ్చేటట్టు చెయ్యమని, అలాగ తిరిగొస్తే పువ్వుల చాదర్ కప్పుతామని స్త్రీలు మొక్కుకుంటున్నారు. కానీ దర్గాలు ఉన్న వారికి, అవమానాలకి గురి అవుతున్న వేలాది ప్రజలను చూడడం వల్ల, పువ్వుల దుప్పట్లలో ఏ విధమైన అభిరుచి ఉన్నట్టు కనబడలేదు.

ఒకనాడు రోడ్డుమీంచి ఏదో గొడవ జరుగుతూండడం విన్న గజల్ కిటికీ దగ్గర్నుంచి పరుగెత్తింది. ఆమె వెంట బీబీ, రజియా, కుంటత్త కూడా వచ్చారు.

రోడ్డు మీంచి, రజాకార్ల దళాలు యుద్ధానికై వెళుతున్నాయి. ఇరవై ఐదు ముప్పై నుంచి పదహారు పదిహేడు సంవత్సరాల వయస్సుగల కుర్రాళ్ళవరకు, కాలినడకన మార్చ్ పాస్ట్ చేస్తూ, వెళుతున్నారు. వారి ముందు, మృత్యువు నడుస్తూన్నట్టుంది. అనుసరించవలసిన మార్గమేదో వారికి తెలియదు. అయినప్పటికీ దేశాభిమానం పేరిట ప్రాణాలర్పించడానికి సంసిద్ధులైయారు. పేటలోని వారంతా వారిపై పువ్వులు జల్లుతున్నారు, నినాదాలు చేస్తున్నారు. అక్కడక్కడ ఆపి పూలమాలలు వేస్తున్నారు.

గజల్ జాగ్రత్తగా పరిశీలించింది. ఆ సమూహానికి కమాండర్ షేఖూమియా, అతని సన్నని నడుముపై వంట్లా ఓనిలవడం లేదు ఆయన

అరమైలు నడిచి విపరీతంగా ఆయాసపడుతున్నాడు.

'అత్తా... అత్తా... వారి నాపండి!' గజల్ ఏడుస్తూ కుంటత్తని కుదిపేసింది.

తరువాత రాషిద్ కూడా గేటు బైటకొచ్చి వాళ్ళందరితో చేతులు పట్టుకుని అభినందించాడు. మెడలో వెయ్యడానికి పూలమాలలు తెప్పించాడు. ఉన్నట్లుండి ఫౌజియా అరిచింది! 'ఆయాజ్ భాయీ... గజల్ చూడు, ఆయాజ్ భాయీ కూడా వెళుతున్నారు!

గజల్ కంగారుగా చూసింది, నిజంగానే ఖాకీ దుస్తులు ధరించి, భుజమ్మీద తుపాకీ పెట్టుకున్న ఆయాజ్, అందరితో నడుస్తూన్నాడు. ఐవానే గజల్ ముందునుంచి త్వరగా వెళ్ళిపోతే బాగుండును. తననెవరూ చూడకూడదని అనుకుంటున్నాడు అతను.

'ఆయాజ్ భాయీ... మా అన్నయ్యా...!' గజల్ అరిచేసరికి అతడు, పంక్తిని విడిచి వచ్చాడు, బీబీ కాళ్ళకి నమస్కరించడం కోసం వంగాడు. అందరూ గట్టిగా ఏడుస్తున్నారు.

'గజ్జో! నేను కూడా యుద్ధానికి వెళుతున్నాను. నువ్వు కంగారు పడకు. నేను త్వరగా వచ్చేస్తాను' అందరూ ఏడవడం చూసిన ఆయాజ్‌కి కూడా భయమేసింది.

'వద్దు... వద్దు... ఏమైనాసరే వద్దు... నేను వెళ్ళనివ్వను!' గజల్ రెండు చేతులతో అన్నని పట్టుకుని ఏడుస్తూంది. బీబీ, కుంటత్త కూడా వద్దన్నారు.

'గజ్జో, నేను మెట్రిక్ పాస్ అయ్యాక కూడా ఎక్కడా ఉద్యోగం దొరకడం లేదు. అక్కడి నుంచి తిరిగి వచ్చిన తరువాత నాకు సైన్యంలో పెద్ద పదవి దొరుకుతుంది. ఖాసిమ్ రిజ్వీ మాకు మాటిచ్చారు. అప్పుడు మనింటి కష్టాలన్నీ గట్టెక్కిపోతాయి. నువ్వు ఏడవక్కరలేదు... నన్ను వెళ్ళనివ్వండి, బీబీ...!' ఆయాజ్ ఏడుస్తూ అందరికీ చెప్పాడు. దాంతో అందరికీ ఆయాజ్ ఉజ్వలమైన భవిష్యత్తు కనబడింది. నిజమే, ఈ పిల్లలు ఏదో ఒకటి చెయ్యాలి కదా!

'కాని ఆయాజ్ భాయీ, నీకు యుద్ధం చెయ్యడం ఏం తెలుసు? ఒక్క తుపాకీతో ఎలా యుద్ధం చేస్తావు?' ఫౌజియా అడిగింది.

రాషిద్ లోపలికొచ్చి అందర్నీ కేక వేశాడు, 'ఏమిటీ గొడవంతా?

అనవసరంగా ఆయాజ్‌ని కూడా బాధ పెడుతున్నారు మనింటినుంచి ఒక్కడైనా యుద్ధానికి వెళ్ళకపోతే చెడ్డ పేరు రాదూ! వెళ్ళు నాయనా, నిన్ను అల్లాకి అప్పజెప్పాము. క్షేమంగా ఇంటికి తిరిగిరా!'

అటు షేఖూమియాని కుంటత్త ససేమిరా వెళ్ళనివ్వడం లేదు. ఆమె పరిస్థితి ఏమీ బాగా లేదు. చివరికి రాషిద్ అందర్నీ బలవంతంగా లోపలికి పంపాడు. వాహిద్ హుసైన్ అంటే భయం వల్ల, ఆయాజ్ వెళ్ళడం వార్త వింటే ఆయన ఆరోగ్యం ఎక్కడ దెబ్బ తింటుందో అన్న భయంతో అంతా మౌనం వహించారు.

ఆనాడెవ్వరూ భోజనం చెయ్యలేదు. ఇల్లంతా భయంకరమైన నిశ్శబ్దం ఆవరించింది. వేలాడుతున్న తాటిమీద కూర్చుని, ఆ పిట్ట మాత్రం ఇంట్లో వాళ్ళని మాటి మాటికి అడుగుతూంది షూ... షూ... షూ... వూ...!

రోడ్డు మీద జీపులు, కార్లు, ట్యాంకులు అరుస్తూ తిరిగేవి. రాత్రిళ్ళు బ్లాకౌట్ వలన పట్టణమంతా స్మశానం లాగుండేది.

కుంటత్త, గజల్ ఇద్దరూ జానమాజ్‌పై కుర్చుని యుద్ధభూమికి వెళ్ళినవాళ్ళ క్షేమం కోరుతూ, తెల్లవార్లూ ప్రార్ధనలు చేసేవారు.

శత్రువులకి వెన్ను చూపవద్దని నేను షేఖూభాయికి చెప్పేశానమ్మా! ఎంతైనా రక్తం కదా... అతడు యుద్ధంలో మెరుపులాగ మెరుస్తాడు.'

కాని మరునటి ఉదయం, లోన మెట్ల మీద కల్లు తాగిన మైకంలో బీడీ కాలుస్తూ హాయిగా కూర్చుని ఉన్నాడు అతను. అడిగితే, ప్రస్తుతానికి కుర్రాళ్ళని పంపించాను. నేను కొద్ది రోజుల తరువాత వెళతాను.' అన్నాడు.

ఆనాటి మధ్యాహ్నం, నౌకర్లందరూ వెళ్ళిపోయిన తరువాత రజియా, బీబీ కలిసి, ప్రాంగణంలో గొయ్యి త్రవ్వి, అందులో నగలూ, డబ్బూ దాచేశారు. దోపిడీలంటూ ప్రారంభమైతే మన ఇంటిపైన కూడా అందరి దృష్టి పడుతుందని రాషిద్ అంటూండేవాడు. కుంటత్త గోతిపై మట్టి సరిచేసి, ఒక కోటను మొక్క ఉన్న తొట్టె దానిపైన పెట్టేసింది. తరువాత నుంచోడానికోసం కర్ర తీసుకుంటూ వణికిపోయింది.

సన్నగా, పొడుగ్గా, అందంగా, పెద్ద పెద్ద కళ్ళతో ఒక అపరిచిత స్త్రీ ఎదురుగా నిలబడి ఉంది. తెల్లటి చీరపైన నల్లటి బురఖా కప్పుకుని ఉందామె. ఆమెతో చామనఛాయగల ఒక రెండు మూడేళ్ళ పిల్ల వుంది.

'ఎవరు నువ్వు?' రజియా కంగారుగా అడిగింది, నౌకర్లంతా వెళ్ళిపోయారు. రాషిద్ కూడా ఇంట్లో లేడు. ఈ మధ్య సి.ఐ.డీ.లు అందరిపైన, ఒక కన్నేసి ఉన్నారని వినికిడి.

'నేను కైసర్‌ని... నమస్కారం ముమాజీజాన్... ఆదాబ్ అర్జ్, గౌహార్ అలీ!' 'కైసర్...?' అంతా ఉలిక్కిపడ్డారు. బీబీ కూడా తన గదిలోనుంచి బైటికి వచ్చింది. గజల్ ఆమెని జాగ్రత్తగా చూడసాగింది.

ఆమె కైసర్, ఆ పెద్ద జుట్టు వున్న పిల్ల. ఆమె పొడవైన జడనొకసారి బషీర్ బేగమ్ కత్తిరించి పారేసింది. రజియా ఆమెని చూసి వణికిపోయింది. ఇలాహె ఖైర్... ఈమె కమ్యూనిస్టులకి నాయకురాలని వినికిడి... ఇక్కడేం దోచుకుపోవడానికి వచ్చిందో ఎవరికి తెలుసు? ఆమెతో పాటు ఎంతమంది గూండాలు బైట నిలబడి ఉన్నారో! కుంటత్త కూడా ఇదే ఆలోచిస్తోందేమో! అందుకనే వెంటనే ముందుకొచ్చి ఆమెని కౌగలించుకుని, అరే కైసర్ ఎంతో పెద్ద దానివైపోయావు నువ్వు... నీ రంగు ఎందుకింత నల్లబడింది.

'నువ్వెంత కఠినాత్మురాలివి... మేమంతా నిన్నెంతగానో తల్చుకుంటూండే వాళ్ళం.'

'బాగున్నావా కైసర్?' దడదడ లాడుతున్న గుండెలతో అడిగింది బీబీ.

'ఫాతిమా బేగమ్ ఎక్కడున్నారు?'

'నేను చాంద్‌ని కలుద్దామని వచ్చాను... ఒక ముఖ్యమైన పనుంది!' అందర్నీ ఉపేక్షిస్తూన్నట్టుందామె.

'చాంద్ తోటా...? అప్పుడంతా కంగారు పడ్డారు. చాంద్ కెప్పుడూ ఆమెతో బద్ధవైరం. ఇప్పుడు కలుసుకోడానికెందు కొచ్చిందో?'

'నువ్వెవరో హిందువుని పెళ్ళి చేసుకున్నావటగా! తుపాకీ పుచ్చుకుని అడవుల్లో తిరుగుతూంటావట! కమ్యూనిస్టుల్తో కలిసిపోయావట' కొంచెం ధైర్యంగా అంది రజియా.

'అవును! మీరు సరిగ్గానే విన్నారు.' ఆమె హాల్లోని కూర్చుంది. పిల్లని ప్రక్కన కూర్చోబెట్టుకుంది.

'మీరు కావాలనుకుంటే నన్నిప్పుడే అరెస్టు చేయించవచ్చు.' ఆమె

నవ్వుతూ అంది. 'మా బాబాయి నా తలకి వెయ్యి రూపాయలు వెల కట్టారు.'

ఇది విన్న వారు, ఈ రాక్షసి ఇక్కడేం ఉపద్రవం తెచ్చి పెడుతుందో అని గడగడ వణికిపోయారు.

'ఐతే ఇక్కడికెందుకొచ్చావు? మాతో నీకేం సంబంధం?'

'అవును, నేను వెళుతున్నాను. నా బిడ్డని చాంద్ దగ్గర విడిచి పెడదామని వచ్చాను. నాకే ఠికానా లేదు. క్రాంతి తండ్రి, క్రాంతిని చాంద్ కప్పగించి రమ్మన్నారు'

'దాని తండ్రెవరు?' కుంటత్త కోపంగా అడిగింది.

'సంజీవా!'

'సంజీవా?' అంతా మంటల్లో పడ్డట్లయింది.

బషీర్ బేగమ్ ఇప్పుడే కైసర్ జడ కత్తిరించి పారేసినట్లు, అందుకు కోపంగా కైసర్ చాంద్ గుండెని అదిమేసినట్టనిపించింది కుంటత్తకి.

'ఊ హుం! నవాబు వాహిద్ హుసైన్ తన మనుమరాళ్ళకు ఆశ్రయం ఇచ్చి, ఈ ఇంటిని కలుషితం చేశారు. కాని ఇప్పుడే అక్రమ సంతానాన్ని పెంచి ఈ ఇంటిని వేశ్యాగృహంగా మారనివ్వను.'

కుంటత్త కంఠంలో గొప్ప శక్తి ఉన్నట్టనిపిస్తోంది. ఆవిడ చాలా గట్టిగా మాట్లాడుతూంది.

'సంజీవా కూతురెక్కడుంది?... ఇక్కడికి తీసుకురా... ఇలారా కైసర్!'

తన గది తలుపు దగ్గర నిలబడిన చాంద్ ఒణుకుతూంది. కైసర్‌లో పలి కొచ్చింది. చాంద్ ఆమెని రెండు చేతులతో చుట్టేసి పాత వైరాన్ని మర్చిపోయి, కైసర్‌తో కొత్త బంధుత్వం ఏర్పర్చుకుంటున్నట్లు ఎంతో అభిమానం చూపించింది. తను ఒణుకుతున్న చేతులతో పిల్లనెత్తుకుని గుండెలకు హత్తుకున్నప్పుడు మాత్రం కన్నీటిని ఆపుకోలేక పోయింది. చాంద్ పరిస్థితి చూసి కైసర్ కూడా ఏడవడం మొదలుపెట్టింది. ఆమె తెల్లని చేతుల్ని, తన చేతుల్లో పట్టుకుని మౌనంగా కూర్చుంది.

'అయితే నేను వెళ్ళనా చాంద్? మా ఇద్దరికీ క్రాంతి గురించి చాలా దిగులుగా ఉంది. కాని దాన్ని నువ్వే కాపాడగలవని సంజీవా చెప్పాడు' కైసర్ కళ్ళు తుడుచుకోసాగింది.

'అవును, నేను కన్న కల ఇదే కనుక,' చాంద్ కళ్ళు మూసుకుని అంది. 'దాన్ని నేనే కాపాడగలుగుతాను.'

కైసర్ వెళ్ళడానికి ఉద్యుక్తురాలయింది. చాంద్ కళ్ళు మూసుకునే అడుగుల సవ్వడి విని అడిగింది. 'మళ్ళీ ఎప్పుడొస్తావు?'

'ఎప్పటికీ రాను!' కైసర్ మెల్లిగా అంది, నేను అండర్ గ్రౌండ్‌లో ఉన్నాను. నన్ను ఉరి తీస్తారు. కాంతికి మాటి మాటికి జలుబు చేస్తూంటుంది. దానికి కొంచెం టీ... కైసర్ గబగబా బైటికి వచ్చింది. ఆమె రాకకై ఎదురు చూస్తూన్న బీబీ, కుంటత్త, రజియాలను పట్టించు కోకుండా వెళ్ళిపోయింది. గేటు దగ్గర, గజల్ ఆపేసింది, 'మీ అమ్మాయి ఈ ఇంట్లో ఎలా ఉంటుంది?'

'అవును, నాకు తెలుసు, పాపం చాంద్ మృత్యువుకి చేరువగా వుంది. కాంతిని నేను నీకప్పగిస్తున్నాను. నువ్వు గజల్‌వి కదూ?'

గజల్ కంగారు పడింది. కాంతిని తనెలా కాపాడగలదు!

'నీలో కూడా ఆ వంశపు చిహ్నాలే కనబడుతున్నాయి...!' కైసర్ గజల్‌ని పరిశీలిస్తూంది.

'మా అన్నయ్య యుద్ధానికి వెళ్ళిపోయాడు!' గజల్ విపరీతంగా ఏడుస్తూంది, 'మీరెలాగైనా సరే అతన్ని కాపాడి తీసుకురండి?

'గజల్ బీబీ! మేమేమీ చెయ్యలేము, ఆమెకు జాలి లేనట్టుంది.' దురాశాపరులు తమ స్వార్థానికై నీ అన్నని మృత్యువు ముఖంలోకి నెట్టి వేశారు. నువ్వు ఓర్పు వహించు.

'లేదు... లేదు!' గజల్ ఇంకా గట్టిగా ఏడవడం మొదలు పెట్టింది.

'ఏడవడం మానెయ్యి గజల్... నీ ఈ పద్ధతి కూడా మార్చుకో' కైసర్ ఆమెను అక్కున జేర్చుకొని అంది.' చాంద్‌లాగ పురుషులతో ఆడుకోవడం మానెయ్యి. శరీరమే కాకుండా నీకు మెదడు కూడా ఉంది కదా! దానినెందుకుపయోగించవు?

ఇంత సూటిగా ఉన్న కైసర్ మాటలకీ, గజల్‌కి కోపమొచ్చింది? కాని ఏడవడం తప్ప ఏం జవాబు చెప్పలేకపోయింది.

'సరే గజల్ నేను వెళతాను, ఐవానే గజల్ అలవాట్లనుంచి నా బిడ్డను కాపాడు, దాని తల్లి దండ్రులెవరో దానికి తప్పకుండా చెప్పు.' కైసర్

గబగబా మొహం కనబడకుండా బురఖా కప్పుకుని బైటికి వెళ్ళిపోయింది.

'నువ్వు దాంతో ఏం మాట్లాడావు?' గజల్ దగ్గరకొచ్చి రజియా ప్రశ్నించింది.

'ఆయాజ్ భాయీని తిరిగి తీసుకు రమ్మని అడిగాను, కాని ఆమె ఏం చెయ్యలేదు.'

గజల్ ఇంకా ఏడుస్తూనే ఉంది.

చాంద్ ఆపా గదిలోకెళ్ళేసరికి, ఆమె భుజంపైన కాంతి నిద్రపోయింది.

'కైసర్ నీతో ఏమంది?' చాంద్ చాలా కుతూహలంగా అడిగింది. కైసర్, సంజీవా విషయాలేమైనా చెప్పిందేమో అని ఆశ కాబోలు.

'సంజీవా మామా మమ్మల్ని ఎప్పుడూ తల్చుకుంటూంటారు. ఆయన కాంతిని పంపించారు. ఆయన కూడా త్వరలోనే వస్తారు.' గజల్‌కి తను చెప్పిన అబద్ధాలకి తనకే ఆశ్చర్యంగా ఉంది.

'లేదు, అతడింక రాడు!' చాంద్ పక్క మీద పడుకుని, కాంతిని తన దగ్గరగా తీసుకుంది. 'ఇంక నేనతని కోసం ఎదురు చూడను...'

తరువాత నిద్రపోతున్న పిల్లని పరికించింది. ఆ పిల్ల చేతుల్ని, తన చేతుల్లోకి తీసుకుని ఉంగరాల జుట్టుని ముద్దు పెట్టుకుని, కళ్ళు మూసుకుంది.

'చాంద్ ఆపా!' గజల్ కేకలేస్తూంది.

రెండేళ్ళనుంచి, చాంద్ బ్రతికున్న వారిలో లెక్కలోలేదు. కాని ఆమె మరణించేసరికి, నేడు తిరిగి, ఒక మంచి వయస్సులో ఉన్న కూతురు మరణించినట్టు విలపించసాగింది. గజల్ మాటి మాటికీ మూర్ఛ పోతూంది. శిలా ప్రతిమే అయిపోయింది.

'ఎక్కడుంది చాంద్...? ఎక్కడుంది చాంద్...?' తడబడుతూ తన గదిలోంచి వచ్చారు వాహిద్ హుసైన్. తెల్ల దుప్పటి కప్పిన చాంద్ శవం ఆయనకు కనబడలేదు.

'ఎక్కడికెళ్ళింది... నా చాంద్ నా బిడ్డ?' ఆయన తల బాదుకొని ఏడుస్తున్నాడు.

ఇరవై ఆరు సంవత్సరాల చాంద్‌ని చూసి, ఆమె మరణానికి దుఃఖించడానికి బదులు, తల మీద ముసుగేసుకుని, చెంపలేసుకోసాగింది పరామర్శకి వస్తూన్న స్త్రీల మధ్య కూర్చుని కుంటత్త. సతీ సావిత్రి యింటి

మనుమరాలు, కన్యగానే మరణించినందుకు దుఃఖిస్తోంది. లేనిపోని మాటలతో ఆమె గుండె చిల్లులు పడేటట్లు బాధించారని దూషిస్తుందామె.

మూర్ఛ వచ్చి పడిపోతూన్న గజల్‌ని, చూసుకుంటూంది ఫౌజియా. నేడు తన తల్లి, మళ్ళీ చచ్చిపోయినట్లనిపించింది గజల్‌కి. చాంద్‌ని సూర్యుడులాగ భావించింది. తన జీవితమే ఆమె అనుకుంది. హైదరాబాదు మొత్తంలో పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టిన సౌందర్యం తిరిగి చాంద్ ముఖములో గోచరించింది. ఆ మెరుస్తూన్న ముఖంలో కనబడుతూంది. ఆమె గులాబీ రంగు పెదవులు కలువ మొగ్గల్లాగ పవిత్రంగా కనబడుతున్నాయి. ఆమె కోమలమైన శరీరంపైన కన్యత్వపు జిలుగులు వున్నాయి. శవంపైన కప్పే గుడ్డలోంచి, ఆమె నల్లని జుట్టు అలలు అలలుగా కదులుతూ ఆమె జీవించే ఉన్నదన్న భావం కలిగిస్తున్నాయి. ఇంతటి సమ్మోహనమైన రూపాన్ని లోకులు ఎలా మట్టిపాలు చేస్తారో!... ఆలోచిస్తోంది గజల్.

చిట్ట చివరి చూపుల కోసం చాంద్ మృత దేహాన్ని ఐవానే గజల్‌లోని పెద్ద హాలులో పెట్టారు. ప్రేమకీ విధమైన పరిణామం, తమ కవిత్వంలో ఎప్పుడూ తమకు గోచరించనట్టు, అక్కడ గోడలపైవున్న ఫ్రేములలోని షాయర్లందరూ అశాంతికి గురైనారు.

రెండు గంటల్లోపల రాషిద్, ముందే అన్ని ఏర్పాట్లూ చేసి ఉంచినట్టు, చాంద్‌ని పాతిపెట్టేసి వచ్చాడు. రజియా ఫినైల్ జల్లి చాంద్ గదిని శుభ్రంగా కడిగింది. ఆమె బట్టలు, మేకప్ సామాను, వయొలిన్, ఫొటోల ఆల్‌బమ్ చిత్తు కాగితాలమ్మే వాడికిచ్చేసింది. ఈ సామానంతా - ప్లేగ్ వ్యాపింపజేసే, ఎలుకేమో అన్నట్టు ఇంటిల్లిపాదీ ముక్కు మీద బట్ట పెట్టుకుని తప్పుకుని తిరిగారు.

క్రాంతిని తీసుకొచ్చి తన గదిలో దాచేసింది గజల్. చాంద్ మరణించిన మూడవనాడు, ఇంట్లో బంధువులంతా నిండి వుండగా, అహమద్ హుసైన్ వ్రాసిన ఉత్తరాన్ని తీసుకొచ్చి చదివాడు రాషిద్. కైసర్ గ్రామంలోని ఎందరో జాగీర్దార్లను చంపేసింది ఆమె, అహమ్మద్ హుసైన్ సంపదనీ దేవిడీల ఆచూకీ కూడా తెలిపింది. కనుక వారంతా ప్రాణాలు కాపాడుకుని ఔరంగాబాదు వచ్చేశారు. పరిస్థితులు చక్కబడగానే, నసీర్ వివాహానికై

నిశ్చితార్థం జరుగుతూంది. అప్పటికి హైదరాబాదు నుంచి అంతా రావలసింది.

'హారున్‌జీదీ... చుడైల్!' పళ్ళు కొరుకుతూ అంది రజియా.

'అయ్యో! చేతుల్లోంచి జారిపోయింది!' చేతులు నులుముకుంటూ కుంటత్త అంది.

'పిన్ని, గజల్‌తో నిశ్చితార్థానికి అంగీకరించలేదా?' ఫౌజియా అడిగింది.

'అవును, నిశ్చితార్థం ఆమె సోదరి కూతురు నఫీస్‌తో జరుగబోతూంది.' రాషిద్ ఉత్తరం మడిచిపెడుతూ అన్నాడు.

ఉత్తరం పెట్టి రాషిద్ బైటికి వెళ్ళాడంతే. ఔరంగాబాద్‌లో ఇండియన్ యూనియన్ సైన్యాలు ప్రవేశించాయని, సర్వనాశనం జరిగిపోతూందని వార్త అందింది.

ఇంక ఎవ్వరూ ఓర్చుకోలేక పోయారు. కుంటత్తైతే గుండె బాదుకుంటూ కేకలెయ్యసాగింది. 'అయ్యో నా తమ్ముడు... అరే, ఎంత దర్జాగా ఉండేదా మహాలు! అయ్యో, నేను నాశనమై పోయానరా!'

బీబీ, రజియా, గజల్, ఫౌజియా అంతా, ఆమెతో పాటు శృతి కలిపి దుఃఖించసాగారు. బాధతో పిచ్చెక్కిపోతూంది గజల్‌కి. వాహిద్ హుసైన్ దిండుమీదికి వంగి, చేతుల్లో తల పట్టుకుని కూర్చున్నారు.

సాయంత్రమయ్యేసరికి ఆయన రక్తపు పోటు రెండు వందల కంటే పెరిగిపోయింది. ఎక్కిళ్ళు ఎంతకీ కట్టడం లేదు. డాక్టరు కంగారు పడ్డాడు. రాషిద్ అశాంతిగా పచార్లు చేస్తున్నాడు.

ఇంట్లోని వారంతా ఆయనకి నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు.

తరువాత రాషిద్ ఆయన దగ్గర కూర్చొని, మనసు కుదుట పర్చడానికి ప్రయత్నించాడు. 'మీ ఆరోగ్యం కొంచెం కుదుట పడనివ్వండి, నేను ఔరంగాబాదు వెళ్ళొస్తాను. మీరు బాబాయి ఆస్థి ఎక్కడెక్కడుందో, ఎంతుందో... దేవిడీలో ఎంత విలువ చేసే సామానుందో అన్నీ వివరంగా చెప్పండి నాకు. కొంచెం ప్రశాంతత ఏర్పడగానే, మిగిలిన సామాను హైదరాబాదు తీసుకొస్తాను.'

వాహిద్ హుసైన్ వెక్కిళ్ళు ఆగిపోయాయి. ఆయన తల పైకెత్తి రాషిద్‌ని చూశారు.

'బాబాయి ఆస్థి చాలా ఉంది, కాని కైసర్ రైతులందర్నీ తిరుగుబాటుదార్లుగా మార్చి వేసింది. ఈ గొడవలన్నీ నేను పడలేను. నువ్వే చక్కదిద్దగలవు.'

తలవైపు దిక్కునున్న రుమాలు తీసుకుని ఆయన, కళ్ళు తుడుచుకుని, రాషిద్ చెయ్యి పట్టుకుని అన్నారు, 'అహమ్మద్ మియా ఆస్థికి సంబంధించిన వ్యవహారాలన్నీ ఇంక నువ్వు చూసుకోవాలి!' ఆయన లేచి కూర్చున్నారు. 'లక్షల ఆస్థి వాడిది. ఉజాలా బేగమ్ వద్ద వేల రూపాయల జవహర్ ఉండేది. అమీన్‌గఢ్‌లోని పొలం, దౌలతాబాద్‌లోని తోటలు!' ఆయన లేచి అలమరాలోని పాత కాగితాలు తీసుకొచ్చారు, రాషిద్ మెల్లిగా గదిలోంచి బైటికి వెళ్ళిపోయాడు.

సాయంత్రానికి వాహిద్ హుసైన్ రక్తపు పోటు తగ్గింది.

నా తమ్ముడి ఆత్మ శాంతికై రెండు పైసల మిఠాయి ఇచ్చి పుణ్యం కట్టుకున్నారా ఎవ్వరైనా... అంతా పనికిమాలిన వాళ్ళే!' ఇంట్లోని వాళ్ళందర్నీ కేకలేస్తూ, తను కురాన్-షరీఫ్ తీసుకుని కూర్చున్నారు.

'ఆయనకి వారసులు లేరా? ఫాతిహా బ్రహ్మాండంగా చేయిస్తాను,' రజియా గర్వంగా అంది.

ఈ గొడవల నుంచి కొంత తీరుబడి దొరకగానే, రాషిద్‌కి క్రాంతి జ్ఞాపకమొచ్చింది. 'ఆ కుక్క... ఆ దరిద్రగొట్టు పిల్ల... దానినిప్పుడే ఇంట్లోంచి తగలెయ్యండి... లేకపోతే ప్రభుత్వానికీ వార్త తెలిసిందంటే అందర్నీ ఉరి తీస్తారు.'

ఆ పిల్లకోసం అంతా వెతికారు. ఆ పిల్ల చాంద్‌కి గుర్తేమో అన్నట్టు క్రాంతిని గుండెలకి హత్తుకుని కూర్చుని ఉంది బీబీ. బీబీ ఒడిలోంచి ఆ పిల్లని తీసుకొచ్చి, ఈ పిల్లనెక్కడైనా పారెయ్యమని కరీమ్ కప్పగించింది రజియా.

చాంద్ శవాన్ని ఆ రోజు తిరిగి తీసుకువెళ్తున్నట్టు గజల్ ఏడ్వడం మొదలుపెట్టింది. బీబీ మౌనంగా కూర్చుంది. గజల్‌కి కోపం వస్తోంది. ఎంతకాలం మౌనంగా ఉంటుంది బీబీ! రాషిద్, రజియాలనామె ఎందుకు కోప్పడదు? ఆమె ఎంతకాలం ఈ ఇంట్లో అపరిచితురాలిలాగ ఉంటుంది?

'గజల్ గేటు తేసి పరుగెత్తింది. క్రాంతి రోడ్డుపైన నిలబడి ఏడుస్తోంది.

గజల్ వెంటనే క్రాంతి నెత్తుకుంది. కొంతసేపైన తరువాత ఆమె రంగమ్మ కుటీరంలోకి వెళ్ళింది.'

'ఇది నా పిల్ల, దీన్ని నీ దగ్గర అట్టే పెట్టుకో. నేను కొద్ది రోజుల తరువాత వచ్చి తీసుకెళతాను.'

'నీ పిల్లా?' రంగమ్మ ఆశ్చర్యంగా అడిగింది. రంగమ్మ వాళ్ళింట్లో పనిమనిషిగా ఉండేది కనుక ఆమెకు గజల్ విషయమంతా తెలుసు.

'ఈ పిల్లకేం పెట్టను బీబీ... ఈ పిల్ల పాలు తాగుతుందేమో!'

'అది నేను ఏర్పాటు చేస్తాను... నువ్వు బెంగ పడకు...' ఆమె పిల్లని అక్కడ కూర్చోపెట్టి, ఇంటికేసి వచ్చింది.

బైట మల్లేశమ్, రాషిద్‌ని బ్రతిమాలుతున్నాడు, 'ఈ ఒక్క రాత్రి నా భార్య సోదరిని మీ ఇంట్లో అట్టే పెట్టుకో, మేము ప్రాణాపాయ స్థితిలో ఉన్నాం.'

'నేను నాన్నగార్ని అడుగుతాను' రాషిద్ ఉపేక్షా భావంతో అన్నాడు.

'మా ఇంటిమీద గూండాలు దాడి చేస్తారేమో!'

తరువాత హఠాత్తుగా రేడియో మూగపోయింది.

యుద్ధ వార్తల మధ్య ఇండియన్ యూనియన్ సైన్యాలు వస్తున్నాయి అన్న వార్త మారుమోగిపోయింది.

హైదరాబాదంతా భయంతో వణకసాగింది.

'నా తమ్ముడు... నా కొడుకు... నా భర్త...!'

ప్రతి ఇంట్లోంచి గట్టిగా కేకలు వినబడుతున్నాయి. స్త్రీలు ఇంటి కప్పుల పైకెక్కి, తుపాకి పట్టుకోవడం కూడా చేతకాని ఆ పసివాళ్ళయిన సిపాయిల్ని పిలుస్తున్నారు. వేలాది యువకుల శవాలు చెట్లలో ఇరుక్కున్నాయి. రాళ్ళపై పడి ఉన్నాయి, నదులలో తేలుతున్నాయి.

హోటళ్ళు, బజార్లు నిశ్శబ్దంగా ఉన్నాయి. దక్కను రేడియో ఉండి - ఉండి అడుగుతూంది. 'భగవంతుడా? ఇదెక్కడి అన్యాయం?'

రజియా డాబా పైకెక్కి చూసింది. పట్టణమంతా నిశ్శబ్దంతో నిండి వుంది. ఎదురుగ్గా ఉన్న ఖాదిమ్ అలీ బేగ్ ఇంటి ముందు ట్రక్ ఆగి ఉంది. అందులో విలువగల సామాన్లు పెడుతున్నారు.

ఖాదీమ్ అలీబేగ్ బొంబాయి నుంచి ఒక డకోటా, సంపాయించారని,

అది వారిని క్షేమంగా పాకిస్తాన్ చేరుస్తుందని, లోకులు అంటున్నారు.

ఇత్తిహాద్-ఉల్-ముసల్మీన్ సభలలో, దేశంకోసం చిట్టచివరి నెత్తుటి బొట్టుని కూడా అర్పించమని ప్రజలకి శిక్షణనిచ్చిందా ఖాదిమ్ ఆలీ బేగ్. తల్లుల్ని - భార్యల్ని, మాతృభూమి, వారినుంచి త్యాగాన్ని ఉపేక్షిస్తూందని బ్రతిమిలాడుతూ చెప్పింది ఆయనే.

'ఈనాడు మీరంతా మా ఇంటికొచ్చెయ్యండి!' తను డాబా పై నుంచి మల్లేశ్ రజియాతో అన్నాడు. 'నిజానికి కంగారుపడ వలసిందేమీ లేదు వదినా! మేము మీ పొరుగువారమే!' రజియా కన్నీళ్ళొత్తుకుంటూ క్రిందికి దిగి వచ్చింది.

అదృష్టం బాగుంది షాహీన్ లండన్‌లో ఉన్నాడు, కాని వయస్సులో ఉన్న ఫౌజియా కారణంగా రజియాకి దిక్కు తోచడం లేదు.

'పోలీసులు ఇళ్ళని సోదా చేస్తారు.' రాషిద్ గాభరాగా ఇల్లంతా కలియ తిరుగుతున్నాడు. 'అయ్యయ్యో! వంద సంవత్సరాల స్వేచ్ఛ నేడు మంటలో కలిసిపోయింది!' ఈ రోజే ఆమె తలపై నుండి కిరీటం తొలగింపబడినట్టు కుంటత్త బాధపడుతూంది.

ఈ స్వేచ్ఛలో నువ్వెన్ని భోగాలనుభవించావు? అని ఎవరైనా ఆమెనడిగితే, గజల్ ఆలోచిస్తూంది, ఆయాజ్ ఇప్పుడెక్కడున్నాడో? ఇంత చిన్న వయస్సులో అతను మరణించడానికి ఆస్కారం లేదని ఆమె గట్టి నమ్మకం. అతడు తప్పకుండా ఏ కొండల్లోనో దాక్కొని ఉంటాడు. లేకపోతే ఏ క్యాంపులోనో తన తోటివాళ్ళతో కలిసి కూర్చుని ఉంటాడు... ఆస్పత్రిలో ఉండి ఉండవచ్చు... లేక తిరిగి... లేక...

ఆమె ఏడుస్తూంది. ఈ మధ్య కన్నీళ్ళెంత ఎక్కువగా ఉన్నాయంటే ఎవరూ ఎవరినీ ఓదార్చ యత్నించేవారు కారు. కుంటత్త షేఖూభాయీ కోసం ఏడుస్తూంది. రజియా తన అన్నదమ్ముల కోసం ఫౌజియా కాబోయే భర్త కూడా ఏదో ఫ్రంట్‌కి వెళ్ళాడట.

ఇక మిగిలింది రాషిద్! అతడు చాలా బాధ పడుతున్నాడు. నేడే అతను మకుటాన్ని కోల్పోతున్నాట్టయిందతనికి, ఇంకేమౌతుందో? హరిశ్చంద్రుడు, ఖాన్, మల్లేశమ్, బరువా, ఎవరెవరు తనకోసం కాచుక్కూర్చున్నారో... అలాంటప్పుడు తనేం చెయ్యాలి? మదరత్‌జింగ్

మనుమడు, వాహిద్ హుసైన్ కొడుకైన అతని కర్తవ్యమేమిటి? ఆత్మహత్య లేక కుక్క చావా?

అతడు పిచ్చివాడిలాగ తలపట్టుకుని ఆలోచిస్తున్నాడు.

'షేఖూమియా ఏమైనా వార్త పంపారు? ఆయన నా కొడుకుని కూడా తీసుకెళ్ళారు.' బైటెవరో స్త్రీ అడుగుతూంది.

'నాన్న చిరునామాకి ఉత్తరం వ్రాయాలని, అమ్మ అడుగుతూంది. ఒక చిన్న పిల్ల తలుపు దగ్గర నిలబడి రాషిద్‌ని అడుగుతూంది.'

ఏ చిరునామాకి...? అతడేం సమాధానం చెప్పాలి! ఈ స్త్రీలంతా ఆశావాదులు! వారి భర్తలు మేఘాల్లాగ వాతావరణంలో కలిసిపోయారని వారికి తెలుసు. ఉత్తరం వ్రాయాలన్న ఆశని వదల్లేదు. తరువాత చాలా జాగ్రత్తగా ఆలోచించి పువ్వుల దండలు తీసుకుని, యూనియన్ సైన్యాలకి స్వాగతం పలకడం కోసం సికింద్రాబాదు పరుగెత్తాడు. అలా వెళ్ళడానికి ముందు ఆలీ జనాబ్ జె.ఎన్. భేందరా పేర ఒక దరఖాస్తు వ్రాశాడు. అందులో నిజామ్ కాలంలో, వ్యాపారం చేసుకునేవాళ్ళని బాధలకు గురిచేస్తున్నారని, బలవంతంగా వారిని ఇత్తిహాద్-ఉల్-ముసల్మీన్‌లో సదస్యులుగా చేస్తున్నారన్న ఉదాహరణని పేర్కొంటూ, ప్రస్తుత పరిస్థితుల్లో న్యాయం చేకూర్చవలసిందిగా అప్పీల్ చెయ్యబడింది.

సాయంకాలం అతడు బాగా అలిసిపోయి, చెమటతో ఆపాదమస్తకం తడిసిపోయి ఇంటికి వచ్చేసరికి, అలా హజరత్ రేడియోలో ఉపన్యసిస్తున్నారు. ఆయన హైదరాబాదు విలీనం గురించి సూచిస్తూ, ప్రతి విషయంలో ధైర్యం వహించి, భగవంతుడికి కృతజ్ఞులుగా ఉంటూ క్రొత్త పరిస్థితులతో, సరిపెట్టుకుని, వాటికనుగుణంగా ఉండవలసిందని ప్రజలకు సలహా ఇచ్చారు.

అలా హజరత్ కంఠధ్వని మొట్టమొదటిసారిగా ఐవానే గజల్‌లో ప్రతిధ్వనించింది. నడుస్తూన్న వాళ్ళు ఆగిపోయారు. వాహిద్ హుసైన్ గౌరవ పురస్సరంగా తలవంచుకుని నిలబడ్డారు. ఆయనతో సహా ఇంట్లోని వాళ్ళందరి కళ్ళు అశ్రుసిక్తాలయ్యాయి.

నేడు దక్కన్ రేడియో మౌనం వహించగానే ఎమ్.ఎ. రవూఫ్, ఈ సంస్థానాన్ని ఇలాగే చిరస్థాయిగా ఉంచవలసిందని ప్రార్థన చెయ్యలేదు,

ఉస్మాన్ ఆలీఖాన్ క్షేమం కోసం అల్లాని వేడుకోలేదు.

తెల్లవారగానే అహమద్ హుసైన్, ఉజలా బేగమ్, నసీర్ల దశదిన కర్మ సంబంధమైన ఫాతిహా చేశారు. వారు ఎప్పుడు ఎక్కడ మరణించారో ఎవరికీ తెలియదు. ఐనా వాహిద్ హుసైన్ ఏ విధమైన లోపం జరగడానికి అంగీకరించలేదు.

పొద్దుట్నించి గజల్ ఏడ్చి ఏడ్చి పిచ్చెక్కిపోతూంది. ఇక తనని నసీర్ పెళ్ళి చేసుకోడని ఆమెకి తెలుసు. అయినప్పటికీ అతని చావు, ఆమె అంగీకరించటం లేదు.

'మా తమ్ముడు పాదుషాలాంటి మనస్సు కలవాడు!' వాళ్ళింట్లో ప్రతి పని దర్జాగా బ్రహ్మాండంగా జరిగేది. కుంటత్త కళ్ళు తుడుచుకుంటూ, వంటవాళ్ళ చేత పని చేయిస్తూంది. ఆనాడు ఐదు వందల మందికి భోజనాల ఏర్పాటు జరుగుతోంది. అహమద్ హుసైన్ అంత పెద్ద ఆస్తిని విడిచిపెట్టి పోయాడు. ఆయన కర్మ అదీ గొప్పగా జరగాలి కదా!

నేటి రాత్రి విషం త్రాగి తాను కూడా మరణించాలని నిర్ణయించుకుంది గజల్.

'అయ్యో ఉజాలా భాభీ'! నాచేత్తో, నీకు కఫన్ కూడా వెయ్యలేక పోయాను కదా!' కుంటత్త అందుకుంది. వచ్చిన స్త్రీలంతా శృతి కలిపారు.

'అరి దౌర్భాగ్యులారా! మమ్మల్ని చిత్రవధ చేశారా! అయ్యయ్యో! చక్కటి సంసారం మట్టిలో కలిసిపోయింది?' కుంటత్త గుండె బాదుకుంటూంది. ఆవిడతో పాటు బీబీ, రజియా, ఫౌజియా గట్టిగా ఏడుస్తున్నారు.

గజల్ లోపల మౌనంగా పడుకుని ఉంది గజల్. నసీర్‌తో తన వివాహం జరగదు. అతని జ్ఞాపకాలనే ఆధారంగా చేసుకుని జీవితం గడిపెయ్యాలని నిర్ణయించుకుంది. ఇంత త్వరగా నసీర్ దశదిన కర్మ జరుగుతుందని ఎవరికి తెలుసు?

ఆమె బైటికున్న కిటికీని తెరిచి, దూరంగా రంగమ్మ గుడిసె దగ్గిర ఆడుకుంటూన్న క్రాంతిని చూస్తుంది. ఈ మధ్య రోడ్లన్నీ నిర్మానుష్యంగా సందడి లేకుండా ఉన్నాయి. ప్రతి ఇంట్లోంచి ఏడుపులు, మొత్తుకోవడాలు వినబడుతున్నాయి. గజల్‌కి అప్పుడప్పుడు తానేదో సుదీర్ఘమైన కల,

కంటున్నట్టనిపించేది. ఇప్పుడు కళ్ళు తెరుచుకోగానే చాంద్ ఆపా నల్లటి జార్జెట్ చీరలో అందంగా ఉండి, వయోలిన్ మీద, తన తెల్లని వ్రేళ్ళతో మెల్ల మెల్లగా కూని రాగాలు తీస్తుంటుంది.

'షమాజలై హేతో ఉస్మనే ధు చా ఉదతా హై.'

షోలా - ఏ - ఇష్క్ సియహ్ - పోష్ హు ఆ మేరేబాద్ ముక్కు తుడుచుకునేందుకు అమ్మ వీపుమీద ఒక్క గుద్దు గుద్దుతుంది. అప్పుడు తన చిన్న పైజమాని పైకి లాక్కుని ఫౌజియాని, 'నువ్వెందుకింత నవ్వుతావ'ని అడుగుతుంది.

ఇంతలో ఎవరో, ఆమె గది తలుపు బాదడం మొదలెట్టారు. గజల్! అనర్థం జరిగిపోయింది బైటికి రా! ఫౌజియా కంగారుగా లోపలికొచ్చి గజల్‌పై పడిపోయింది.

తరువాత ఇద్దరూ కలిసి హాల్లోకి వచ్చారు.

రాషిద్ మామయ్య స్పృహ తప్పి పడి ఉన్నారు. బీబీ అతనిపై నీళ్ళు జల్లుతూంది. రజియా గోడనానుకుని మౌనంగా ఉండిపోయింది. కుంటత్త పరవాన్నం గిన్నెలపైన వెండి వర్క్ అంటిస్తూ ఒక ఉత్తరాన్ని మాటిమాటికీ ముద్దు పెట్టుకుంటూంది. బైటినించెవరో కేకలేస్తున్నారు.

'వాహిద్ నవాబుగారి కోసం చల్లటి నీళ్ళు పంపించండి, డాక్టరుగార్కి ఫోన్ చేసి, వాహిద్ నవాబ్‌కి బాధెక్కువైపోయిందని చెప్పండి.'

అతిథులుగా వచ్చేసిన స్త్రీలు ఏదో మంత్రం వారిని రాతి ప్రతిమలుగా మార్చేసినట్టు, గుడ్లప్పగించి చూస్తున్నారు.

'ఏమైంది, బీబీ?' గజల్ భయంగా బీబీని చుట్టుకుపోయింది. బీబీ గజల్‌ని జాగ్రత్తగా పరిశీలించి చూసి, ఆమెను దగ్గరకు తీసుకుంది.

తరువాత కుంటత్త వద్ద నుంచి ఉత్తరం లాక్కుని, గజల్ కిచ్చింది.

గౌరవనీయులైన అన్నయ్యగార్కి,

పాదాభివందనములతో తెలియజేయునదేమనగా భగవదనుగ్రహం వలన క్షేమంగా ఉండి, మీ క్షేమాన్ని కోరుకుంటున్నాము. మిగతా విషయాలేమిటంటే, మీ అందరి ప్రార్థనల వల్ల మేమంతా ఔరంగాబాదులో సురక్షితంగా ఉన్నాము. గుండాల దాడుల వార్త వినగానే మేము ఇంట్లోని విలువైన వస్తువులన్నీ ఇక్కడికి తీసుకు వచ్చేశాము. నేటి సాయంత్రం

నసీర్ వాళ్ళమ్మ, నసీర్ నవాబ్‌లతో విమానంలో పాకిస్తాన్ వెళ్ళిపోతున్నాము. ఆస్థికి సంబంధించిన విషయాలు పరిస్థితులు శాంతియుతంగా ఉన్నప్పుడు చూసుకుందాము. మీ నుంచి దూరమవుతున్నందుకు చాలా బాధగా ఉంది. కాని దైవ కృప వలన మన మనస్సులు దూరం కాలేదు. వదినగారికి పాదాభివందనాలని, పెద్దలు - పిన్నలు అందర్నీ ప్రత్యేకించి అడిగినట్టు తెలియపరచ వలసింది.

భవదీయుడు, నవాబ్ అహమద్ హుసైన్ ఖాన్.

ఉత్తరం చదివి, గజల్ తల ఎత్తేసరికి వెండి వర్కులు పువ్వుల్లాగ నలుపైపులా ఎగురుతున్నాయి. ఆమె త్వరగా గదిలోకెళ్ళి నమాజ్‌పై పడిపోయింది. నసీర్ చేతుల్లో ఇమిడిపోయినట్టు రెండు చేతులూ జాపి భూమిని పట్టుకుంది. నీళ్ళు నిండిన కళ్ళతో చూసేసరికి, విమానం తలుపు వద్ద నిలబడ్డ నసీర్ అస్పష్టంగా కనబడినట్లయింది. అతను క్షణక్షణం తననుంచి దూరమైపోతున్నాడు. కాని గజల్ హృదయంలో ఒక శాంతియుతమైన జ్యోతి ప్రకాశించింది. నసీర్ ఇచ్చిన ఉంగరం ఆమె చేతికి ఉంది. అందులో ఆమె ప్రాణం నిలిచి ఉంది. ఇంతకు ముందు కూడా, ఆమె జీవితంలోకి ఎంతో మంది పురుషులు వచ్చారు, కాని నసీర్‌లాగ, ఆమె హృదయ స్పందన కాలేకపోయారెవరూ. ఆమె నాలుగు రోజుల్లో, తారసపడ్డ ప్రతి వ్యక్తినీ మర్చిపోయేది. తను చేసుకున్న ప్రతిజ్ఞల్ని నవ్వుతూ మర్చిపోయేది, కాని నసీర్ జ్ఞాపకం మాత్రం కమలంలాగ ఎప్పటికీ వైదొలగలేదు, నిజానికి అతన్ని కలుసుకోవాలన్న ప్రతి ఆశా నశించిపోతుంది.

వాహిద్ హుసైన్‌ని చూడడానికి వచ్చిన డాక్టర్, రాషిద్ నాడి చూస్తున్నాడు. అతడు మాత్రం జీవితం మీద నిరాశ కలిగినందువల్ల, మందుపుచ్చుకోనని ఒట్టు పెట్టుకున్నాడు. షాహీన్‌ని అమెరికా నుంచి తొందరగా పిలిపించవలసిందని ఒకటే మాట పట్టుక్కూర్చున్నాడు. తరువాత అతను రజియాతో 'మనం కూడా మన డబ్బుని పాకిస్తాన్‌కి బదిలీ చేసెయ్యాలి, పరిస్థితులెలా ఉంటాయో మనమేం చెప్పగలం! షాహీన్ తిరిగొచ్చేస్తే, అన్ని విషయాలూ తేల్చుకోవాలి?

రాషిద్ ఇంకా పక్కమీంచి లేవనే లేదు. రాత్రి వాహిద్ హుసైన్‌కి

గుండె పోటొచ్చింది. ఇది రెండవ ఎటాక్, రాషిద్ మొత్తం డాక్టర్లందర్నీ పిలిపించాడు. మంచిమాటలు, ఎన్నో ఆశల ఇంజక్షన్లు ఇవ్వబడ్డాయి. సాయంత్రమవుతుండగా ఆ పన్నెండు 'బయాజ్'ల పుస్తకాలు అస్పష్టమైపోసాగాయి. వాటిలో వాహిద్ హుస్సైన్ రాసిన కాంక్ష - ప్రేమలతో నిండి ఉర్రూతలూగించిన కవిత్వం ఇమిడి ఉంది. ఆయన మృత్యువు ఎంత నిశ్శబ్దంగా సమీపించిందంటే రాషిద్ నమ్మలేదు. డాక్టరు ఆక్సిజన్ తొలగించి, సామాన్లన్నీ సర్దుతున్నాడు. కాని రాషిద్ ఆయన మీదకి వంగి గుండె చప్పుడు లెక్కపెడుతున్నాడు. జీవితాన్ని నేలపెట్టి కాలరాచిన ఆయనెలా మరణించగలరు? ఆయనకి జీవితంమీద మమకారం తొలగలేదు. పువ్వులకి నవ్వడం, చెట్లకి మత్తుగా ఊగడం నేర్పారు. తన చుట్టూ తన లోకంలో లీనమై జీవితమంతా గడిపారు. తన చుట్టూ ప్రేమ అనే మొలకల్ని పెంచుకుంటూ వచ్చారు. ఆయన ఒక వ్యక్తిగా కాకుండా, ఐవానే గజల్ సంరక్షకుడిగా ఉంటూ, ఒక విధమైన సభ్యతని, ఒక శకాన్ని తనతో తీసుకు వెళ్ళిపోయారు. అవన్నీ గాధలుగా, కథలుగా ఐవానే గజల్‌లో ముందు తరం వారు వింటారు. నేటితో ముగియనున్న శకం, తన కర్తవ్యాన్ని నిర్వర్తించింది. ఇల్లంతా శోకంతో మునిగిపోయింది. పనివాళ్ళు తమ స్వామి భక్తిని తెలియపర్చడం కోసం, మరింత గట్టిగా అరుస్తున్నారు.

బీబీ మధ్యాహ్నపు నమాజ్ చదువుతూన్నప్పుడు, వాహిద్ హుస్సైన్ గదిలోంచి రాషిద్, ఫౌజియాల కేకలు వినిపించాయి. గజల్ గబుక్కున ఆసరాగా ఉందామనుకుని బీబీవద్దకొచ్చింది. కాని బీబీ నెమ్మదిగా 'జానామాజ్' మడిచిపెట్టింది. ఏడుస్తున్నవాళ్ళని తొలగిస్తూ వాహిద్ హుస్సైన్ తలవైపుకొచ్చింది.

అంతా మౌనంగా ఉన్నారు. నలభై సంవత్సరాల తోడు బీబీ నేడెంతగా విలపిస్తారో, కాని ఆమె చాలా నెమ్మదిగా వెనుదిరిగి రాషిద్‌ని పట్టుకుని, 'నువ్వెందుకేడుస్తున్నావ్... ఆయన మరణించరు... ఆయన నన్ను వదిలిపెట్టలేరు!' అని మౌనంగా గోడనానుకుని కూర్చుంది.

ఆమెను ఏడ్పించడానికి ఉదయందాకా అవకాశమున్న ప్రయత్నాలన్నీ చేశారు, ఆమె తన చేతుల్ని చూసుకోగానే అకస్మాత్తుగా ఏడవడం మొదలుపెట్టింది.

'నా చేతులు శూన్యమైపోయాయి! నేనిప్పుడు, ఇక్కడ నుంచి పారిపోతాను. నా బంధం తెగిపోయింది.

తరువాత ఆమె మంచం మీంచి లేవలేదు. ఏమీ మాట్లాడలేదు. 'పిచ్చెక్కిపోయింది' అన్నారెవరో.

డాక్టరెవరో 'బ్రైన్ హేమరేజ్ అయిపోయిందన్నారు.'

రోజులు గడుస్తున్నాయి. ఒక వారం... రెండు వారాలు... రెండు నెలలు... బీబీ చావలేదు.... బ్రతకనూ లేదు. జీవన్మరణాల మధ్య ఒక్క ఊపిరి సూత్రప్రాయంగా మిగిలి ఉంది. ఎవరు మాత్రం ఎంతకని డాక్టర్లను పిలువగలరు? ఎంత ఆక్సిజన్ ఇవ్వగలరు? ఎన్నాళ్ళని గొట్టాలతో ఆహారాన్ని అందించగలరు!

ఇంట్లోని ఈ దుస్సంఘటనల గురించి విన్న షాహీన్, వైద్య శాస్త్రంలో పెద్ద పెద్ద డిగ్రీలతో తిరిగొచ్చాడు. అతడు ఒక్కసారిగా ఆరడుగల ఆజానుబాహువుగా తయారైపోయేసరికి రజియా, అతణ్ణి చూసి కంగారుపడింది.

షాహీన్ బీబీని అటూ ఇటూ కదిపి చూశాడు. నాలుగు సంవత్సరాల వరకు, మానవుని గుండెకు సంబంధించిన ప్రత్యేకమైన ప్రయోగాలు చేస్తూ వచ్చాడు. వందలాది మనుషుల గుండె చీల్చి చూశాడు, కాని తన నానమ్మ కేసు చాలా విచిత్రంగా అనిపించిదతనికి. అతడు అగమ్య గోచరంగా ఉండడం చూసిన కుంటత్త, కర్ర సహాయంతో వచ్చి నుంచుంది. 'బాబూ! ఇదేమైనా కొత్త జబ్బా నాయనా! ఈమె జీవితమంతా కళ్ళు మూసుకునే బ్రతికింది.'

చిట్టచివరికి ఆ రోజు కూడా వచ్చేసింది. షాహీన్ వచ్చి రాషిద్‌కి 'ఇంక బీబీ జీవించి లేదు. రాత్రి నిద్రలోనే ఎప్పుడో ప్రాణం పోయి ఉంటుందని' అన్నాడు.

ఐవానే గజల్‌లోని వారు శవాల్ని సమాధి వద్దకు సాగనంపడంలో అనుభవజ్ఞాలయారు. రెండవ జామయ్యేసరికి ఐవానే గజల్‌లో బీబీ ఉనికి మాయమైంది. మధ్య హాల్లో తగిలించి ఉన్న వాహిద్ హుసైన్ పెద్ద చిత్రపటం, కళ్ళు తెరుచుకుని చూస్తూ, ఈ విషయాన్నెంత మాత్రం ఒప్పుకోవడం లేదు.

బీబీ శవాన్ని తీసుకెళ్ళిపోయిన తరువాత గజల్‌కి, తనెంత పనికిరానిదో, తెలియవచ్చింది. సాయాని మహమ్మదీయురాల్ని చేసి, ఆమెని హుమాయూన్ వివాహం చేసుకున్నప్పటి నుంచి, గజల్‌కి ఆ ఇంటికి సంబంధ బాంధవ్యాలు తెగిపోయాయి. అయినప్పటికి, బీబీని పాతిపెట్టేప్పుడు హుమాయూన్ ఆమెని బలవంతంగా ఇంటికి తీసుకువెళ్ళాడు.

'రామ వనవాసం' స్టేజ్‌పైన ప్రదర్శించడం మొదలెట్టి మూడు రోజులైంది.

మూడు రోజుల నుంచి గజల్‌ని, అందరి ముందు ఒక గోతిలో పూడుస్తున్నారు. తరువాత కర్టెన్ వేసేసి, ఆమెని పైకి తీసేవారు. రంగస్థలం మీద ఏం వాగుతూందో ఆమెకి తెలిసేది కాదు. ఆమె, తాను భూమిలో ఇమిడిపోయే పతివ్రత సీత దృశ్యం రావాలి, తననెవరూ బైటికి తియ్యకూడదు, ఆ క్షణం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూండేది. ఇదెటువంటి భూమాత, తన గుండెలో ఆమెకింత చోటివ్వడానికి సుముఖంగా లేదు.

ప్రజలామె అభినయానికి సమ్మోహితులవుతున్నారు. చప్పట్లు కొట్టి రాషిద్ చేతులు నొప్పెడుతున్నాయి.

మారుతున్న పరిస్థితుల్లో రాషిద్ తన పద్ధతిని కూడా మార్చేసుకున్నాడు. శరణార్థుల సహాయార్థమై, రాజకీయ పార్టీలన్నీ పెద్ద పెద్ద కార్యక్రమాల్ని రూపొందించాయి. ఈ కమ్యూనిస్టు పార్టీ వైపునుంచి కూడా సహాయం కోసం, ప్రణాళిక ప్రారంభమయింది. ఈ సందర్భంగా కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలు కూడా ఏర్పాటు అయాయి. వంద రూపాయల ఖర్చుతో, 'రామ వనవాసం' నాటకం వేస్తే అది వేల రూపాయలు తెచ్చి పెడుతుందని సర్వార్‌కి తెలియదు. ఆ ఘనత సీత పాత్రధారి అయిన గజల్‌కే దక్కుతుంది. ఆమె సీత పాత్రలో జీవించింది. ఎంతో నిస్సహాయతతో భూదేవి ఒడిలో విలీనమైపోవాలని దీనాతి దీనంగా ప్రార్థిస్తూంటే, సర్వార్ వంటి కఠోర స్వభావం గల మనిషి కూడా కంపించిపోయేవాడు. నిజానికతనికి ధర్మపరమైన కథలు, ప్రత్యేకించి స్త్రీలను హింసించే గాథలంటే అసహ్యం. అందుచేతనే నాటకం సందర్భంగా ఎవరో మొదటిసారి గజల్ని తీసుకొచ్చేసరికి, ఆమె ఎగిసిపడుతున్న అందం, సిగ్గులేనితనం, అర మరికలు

లేకుండా అందరితో ప్రవర్తించే విధానం, సర్వార్‌కి కొంచెం కూడా నచ్చలేదు. అలవాటు ప్రకారం ఖుర్షీద్ ఆపా, ఆమెని కూడా ఒక ఉన్నత వంశానికి చెందిన పిల్లగా ఋజువు చేసింది. ఒకనాడు పెద్ద పెద్ద మీసాలున్న బక్క పలుచని వ్యక్తి, గజల్ తండ్రినంటూ, ఆమె అభినయాన్ని గురించి వ్యాపార సరళిలో మాట్లాడేసరికి, ఇతడెవరో ఆడపిల్లల్ని తార్చే బ్రోకర్ అన్ని సర్వార్‌కి గట్టిగా అనిపించింది. మంచి వంశానికి చెందిన తండ్రెవరైనా కూతుళ్ళకి వెలకడుతూ తిరుగుతారా! మూడవ రోజు, చివరిసారిగా గజల్, భూమిలో ఇమిడిపోయేటప్పుడు నాటకం క్లైమాక్సంతా నాశనమైపోయింది. గజల్ భూమిలోంచి మొహం పైకి పెట్టి 'నా మీద రాళ్ళు రువ్వండి, దయచేసి నన్నెవ్వరూ బైటికి తియ్యకండి, నా మీద మట్టి పొయ్యండి. నన్ను సంగ్‌సార్ చెయ్యండి', అని గట్టిగా అరవడం మొదలెట్టేసరికి, ఆ దుఃఖపూరితమైన దృశ్యాన్ని చూసి దుఃఖించవలసిన వారంతా నవ్వసాగారు.

ఆదరాబాదరాగ తెర దించేశారు. ఆ నాటకం డైరక్టరైన రమేష్ సిన్హా పరుగెత్తుకొచ్చారు. తన స్నేహితుల మధ్య నుంచి లేచి, సర్వార్ కూడా స్టేజ్ పైకి పరుగెట్టాడు.

'నన్ను చంపెయ్యండి... నా మీద బండ పెట్టెయ్యండి. మీలో ఎవరైనా మానవత్వం ఉన్న వారున్నారా?' గోతిలోంచి గజల్ అరుస్తోంది.

'నాకు చెప్పు, ఏమయ్యింది?' చెమటతో తడిసిపోయిన గజల్ని ఒక కుర్చీ మీద కూర్చోపెట్టి సర్వార్ అడిగాడు.

రాత్రి రెండు గంటల వేళ సర్వార్, గజల్ని ఇంటి దగ్గర దిగబెట్టడానికి వచ్చేసరికి, హుమాయూన్ ఇంట్లో లేడు. సాయా విసుగ్గా తలుపుతీసి, సణుక్కుంటూ వెళ్ళి పడుకుంది.

'ఇక చూడండి, పురుషులు, రాత్రిళ్ళు కూడా ఇంటికొస్తున్నారు?

గజల్‌కి స్పృహ వచ్చింది, కాని కళ్లు ఇంకా మూసుకునే ఉన్నాయి. శరీరం చల్లగా ఉంది. ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది. సర్వార్‌కి ఏడ్చేవాళ్ళంటే అసహ్యం. అప్పటి పరిస్థితి అతన్ని కంగారు పెట్టింది. గోతిలోంచి పైకి తీస్తూన్నప్పుడు, ఈ పిల్లలో ఏదో ప్రత్యేకత ఉందనిపించిందతనికి. ఏదో తెలియని ఆకర్షణ ఉంది, అదే, అతన్ని

సాయంత్రం ఏడు గంటలనుంచి రాత్రి రెండు గంటల వరకు ఆమెతో తిప్పింది.

'ఇప్పుడు చెప్పండి, అసలు కథేమిటి?' గజల్ వాళ్ళింటికి వచ్చి గదిలో కూర్చున్న తరువాత సిగరెట్ వెలిగించి అడిగాడు సర్వార్. ఈ అమ్మాయినెవరో అపహరించి తీసుకువచ్చారని ఆ భీతిగొల్పే మీసాల మనిషి, బలవంతంగా ఆమెని చెడు వ్యాపారంలో పెట్టాడని సర్వార్ నమ్మాడు.

'కథేమీ లేదు, నాకీ విషయం చెప్పండి, భూమిలో కలిసిపోయే హక్కు కేవలం సీతకి మాత్రమే ఉందా? నేనెందుకు చావకూడదు?'

'మీరెందుకు చావాలనుకుంటున్నారు?' సర్వార్ నెమ్మదిగా అడిగాడు. 'మీరింకా చాలా చిన్నవారు, ముందు మీకు వివాహం జరుగుతుంది, పిల్లలు పుడతారు. స్త్రీ గజల్ ఎన్నో పద్యాలు వ్రాయటం జరుగుతుంది.

షాయరీ పేరు వినగానే గజల్‌కి నసీర్ జ్ఞాపకం వచ్చి గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. 'ఇంక నా పెళ్ళెప్పటికీ జరగదు. నేను బ్రతికున్నంతకాలం, ఇదే విధంగా ప్రతిరోజూ సమాధిలో పడుకోవాలి.'

'మీ ఫీజ్ గురించి ఆనాడు దెబ్బలాడిన ఆయన, నిజంగా మీ తండ్రేనా?' సర్వార్ నెమ్మదిగా అడిగాడు.

ఆయన నిజంగా తన తండ్రేనా అని గజల్ కూడా ఆలోచించడం మొదలుపెట్టింది.

'మీరింత నిరాశగా ఎందుకున్నారు?' మత్తెక్కించే గజల్ కళ్ళ నుంచి తనని కాపాడుకుంటూ అడిగాడు సర్వార్.

తరువాత అతడు లేచి తన రుమాలుతో ఆమె కన్నీళ్ళు తుడిచాడు. 'అప్పుడప్పుడు మనిషి తను చెయ్యవద్దనుకున్న పనిని పరిస్థితుల వల్ల చేస్తాడు. కాని ఇక ముందు అలా జరగదు. మీ గురించి ఆలోచిస్తాను. మీకెప్పుడైనా కలవాలనిపిస్తే, నన్ను ఆఫీసులో కలుసుకోండి.'

అతడు, ఆమె కన్నీళ్ళని, బాధని మొత్తం, రుమాల్లో మూట కట్టుకుని వెళ్లిపోయాడు.

గజల్ మంచం మీద పడుకుని ఆలోచిస్తూంది. అతడికి ఇరవై రెండు, ఇరవై మూడేళ్లుండవచ్చు. కాని అతని ప్రవర్తన ఉన్నతంగా, కుతుబ్‌మినార్

అంత ఎత్తుగా ఉంది. అతడి ముందు తను పసిపిల్లలాగ, మూర్ఖురాలిలా ఉంది. ఇంత రాత్రైనా అతను స్పృహలేని గజల్ శరీరాన్ని స్పృశించలేదు. ఒక్కసారి కూడా ఆమె గులాబి రంగుతో మెరిసిపోతున్న బుగ్గల్ని తాకలేదు. ఇతడెంత విచిత్రమైన పురుషుడు. తన యౌవ్వనాన్ని రాషిద్ మామూలాగ ఉపేక్షించే ఒక అపరిచిత పురుషుడ్ని గజల్ మొదటిసారి చూసింది. నిజానికి ఆమెని చూడగానే పురుషులు మతులు పోగొట్టుకునేవారు.

ఇప్పుడతడేమిటాలోచిస్తాడు? ఏం చెయ్యబోతున్నాడో? ఉదయం లేస్తూనే, అనుకున్నట్టుగానే తండ్రి నాటకం పాడు చేసినందుకు బాగా తిట్టాడు. ఆఫీసుకెళ్ళేటప్పుడు, 'నిన్న ఖుర్షీద్ ఆపాతో చెప్పొచ్చాను, ఆమె నిన్ను సినిమా తారని చెయ్యడానికి ఏమైనా సాయం చేస్తుంది. ఈ రోజు ఆవిడ దగ్గరికెళ్ళిరా.' అని హుకుం జారీ చేశాడు.

అందుకని తన బాధని మేకప్‌లో దాచుకుని, ఆమె ఖుర్షీద్ ఆపా ఇంటికి వెళ్ళింది. ఖుర్షీద్ ఆపా, భారత్ కళామండలి నిర్వాహకురాలు, వయస్సు యాభైకిపైనే ఉంటుంది. కాని ఆమె దర్పం లెక్కలేనితనం, స్థూలకాయం చూసి ఆమెపై ప్రహారం చేసే ధైర్యం లేకపోయింది వయస్సుకి. ఆమె తన రంగు పూసుకున్న జుట్టుని బుగ్గలపై పడేటట్టు దువ్వుకునేది. సిగరెట్ కాల్చడం వల్ల నల్లబడ్డ పెదవుల్ని, లిప్‌స్టిక్‌తో మెరిసేటట్టు చేసేది. వంచిన విల్లులాగున్న ఆమె సన్నని కనుబొమ్మలు, కృత్రిమమైన కనురెప్పలు, నలువైపులా వేటకోసం వెతుకుతూన్నట్టుండేవి. తన స్థూల దేహంపైన ఆమె రవిక పేరుకి మాత్రం వేసుకునేది. నగ్నత్వమనే దోషారోపణతో ఆమె పోలీసులు బంధించకుండా వుండేందుకు వీలైనంత భాగాన్ని మాత్రమే ఆ రవిక కప్పేది, కాకపోతే అందరూ చూడడానికి అనువుగా, అంతా ప్రదర్శితమవుతూ ఉండేది. ఆమె తన యౌవనాన్ని ఏ చీకటి అడవుల్లోనో కోల్పోయింది. పరుగెడుతూ పరుగెడుతూ ఆయాసం వచ్చేసరికి తన కంటే పది సంవత్సరాలు చిన్నవాడు, మూర్ఖుడూ అయిన గుమాస్తాని పెళ్ళి చేసుకొంది. రిక్షాలో వెళుతూ, అకస్మాత్తుగా ఆవిడ ఏవిధంగా సైకిల్ మీద ఆఫీస్‌కెళుతున్న లతీఫ్ సాహబ్‌ని పిలిచి, తనని వెంటనే పెళ్ళి చేసుకోమని ఎలా ఆజ్ఞాపించిందో లోకులు రకరకాలుగా హాస్యాలాడుకునేవారు.

నడిరోడ్డులో జరిగిందీ సంఘటన ఖుర్షీద్ ఆపా బెదిరింపొకటి. పాపం కాజాని వెతకడానికి పరుగెత్తాడతను. ఇప్పుడా లతీఫ్ సాహబ్‌కి ఒకటే పని, సాయంత్రం ఖుర్షీద్ ఆపా ఇంటి వద్ద పోగయ్యే స్నేహితులకి సిగరెట్లు, సారా, కిళ్ళీలు వగైరా ఏర్పాటు చెయ్యడం ఖుర్షీద్ ఆపా ఎక్కడికైనా వెళ్ళవలసి వస్తే రిక్షా తెచ్చిపెట్టడం. ఇవి మినహాయించి, ఇంకేపని చేస్తూండగా లతీఫ్ సాహబ్‌ని ఎవరూ చూడలేదు.

ఎప్పుడైనా ఏ నాటకంలో అయినా తల్లిపాత్ర నిర్వహిస్తున్నప్పుడు రాత్రయిపోతే, లేస్తూనే, అనేదావిడ 'ముద్దు మొహల్లారా! మీకు కొంచెమైనా సిగ్గుండద్దా!'

నా మొగుడు నా కోసం ఎదురుచూస్తుంటాడు కదా!

అవును ఖుర్షీద్ ఆపా 'మగడున్న ఆలి' అని గుర్తొచ్చేది. రంగస్థలమే కాకుండా, రేడియో నాటకాల్లో గయ్యాళి అత్త, తల్లి పాత్రలు ఎంత గొప్పగా నటించేదంటే అంతా పొట్ట చెక్కలైయ్యేటట్టు నవ్వేవారు. రేడియో నాటకాల్లో మాత్రం ఆమె దర్పంగా ప్రవర్తించేది. రిహార్సల్ జరిగేటప్పుడే డైరక్టరుకైనా నోరెత్తే దమ్ముండేది కాదు. ఖర్మకాలి ఏమైనా అన్నాడో, తిట్లతో తలవాచిపోయేది. ఎటువంటి నీచాతి నీచమైన తిట్ల వర్షం కురిపించేదంటే, ఎంతటి పురుషుడైనా సిగ్గుపడాల్సిందే. ఆమెకెవరైనా అభినయం ఎలా నేర్పగలరు? గొప్ప గొప్ప వాళ్ళే ఆమె ముందు నిలవలేకపోయేవారు. ఎంత గొప్ప వాళ్లనైనా సరే చిటికలో ఎగరగొట్టేది. ఒకనాడు పడిపడి నవ్వుతూంది. ఈ రోజు ఏ నక్కని తొక్కొచ్చిందో అనుకున్నారు, కాని సోదరి మరణించినట్టు టెలిగ్రామ్ వచ్చిందని తెలిసింది. ఇది వినగానే ఆమె గౌరవం పెరిగిపోయేది.

అందంగా అలకరించబడిన అతి పెద్దదైన ఆమె ఇల్లు నిజానికొక చిన్న క్లబ్. ప్రతి సాయంత్రం ఉన్నత శ్రేణికి చెందిన కళాకారులవంటి వారు, ఆమెపై, అభిమానముండి, ఏ దిగులూ లేని వాళ్ళు ఇక్కడ పోగయ్యేవారు. ఎవరికి ఏం కావల్సినా, తాగడం, వేశ్యల నృత్యాలు, చంపడాలు, చావడాలు, అన్నిటికీ ఆస్కారముండేదక్కడ. ఆవిడ ఎవరినీ వద్దనేది కాదు. ఏడుపుగొట్టు మొహాలామె కన్సలు నచ్చేవి కావు. అటువంటి వారిని చెవి పట్టుకుని గెంటేసేది. ప్రేమించేవారికి సౌకర్యాలు

సమకూర్చడానికి కాంట్రాక్ట్ తీసుకున్నట్టు అన్నీ అమర్చేది. ఎవరెంతటి అపరిచితులైనా సరే, ప్రేమ పేరిట అన్ని విధాలా సహాయపడడానికి ఆమె సిద్ధపడేది. ఆడదాని వల్ల నేర్చుకున్నవాడు, చట్టం, పెళ్ళిలాంటివి నమ్మడు, లేకపోతే ఎంతోమంది తన ఎదుట ఏడుపుగొట్టు మొహాలేసుకుని తిరుగుతూండేవారు, అనేదావిడ.

ఆవిడ శాశ్వతంగా ఒక కాజీని కుదిర్చిందనీ హైదరాబాదు నుంచి లేవదీసుకొచ్చిన పిల్లలకి, అతడు ఖుర్షీద్ ఆపా ఇంట్లో పెళ్ళిళ్లు చేయిస్తాడని లోకులు చెబుతూండేవారు. ఖుర్షీద్ ఆపాకి పెళ్ళి గిళ్ళీ నమ్మకం లేదు. అంతేకాకుండా, జీవితాంతం గుదిబండలాగా మెడకు చుట్టుకుని పడుండే ఆడవాళ్ళంటే భయంగా ఉండేది. ప్రేమికుల కోసం పరుగులెడుతూ చేసే ఆమెని చూసి, ఖుర్షీద్ ఆపా, మంచి హకీమ్ అజమల్ ఖా అంటూండేవాడు బిల్‌గరామీ. రెండువేల రూపాయలతో పని జరగకపోతే రెండు పైసల విలువ చేసే పొదుపు కథని ప్రయోగించి చూసేది. వైద్యం చెయ్యడంలో ఆమె ఎప్పుడూ పక్షపాత దృష్టితో పని చెయ్యలేదు. అందుచేత ఆ పని చేస్తున్నారన్న నెపం మీద, కష్టకాలం దాపురించిన పోలీసు వాళ్లెవరినీ ఆమె ఇంటి మీద దాడి జరుపుదామనుకుంటే, ఖుర్షీద్ ఆపా వెంటనే అతన్ని ఎక్కడో అక్కడ ఇరికించేసేది. కొన్నాళ్ళ తరువాత, అతడు కూడా ఆ కులాసా పురుషుల మధ్య కూర్చుని ఖుర్షీద్ ఆపాని పొగుడుతూ కనబడేవాడు. ఆ విధంగా చేసేదామె. ఖుర్షీద్ ఆపాకి కోపం తెప్పించే పనులు చేయడమంటే మాటలా!

ఫోజులు కొట్టే పెద్ద పెద్ద ఆఫీసర్లు దర్జా ఒలకపోస్తూ కార్లలో తిరిగే వ్యాపారవేత్తలు ఆమెని చూడగానే లేచి నిలబడేవారు, కాని ఆవిడ మాత్రం తిట్లు లేకుండా ఎవరితోనూ మాట్లాడేదేకాదు. ఆవిడ ఎటువెళితే అటు నవ్వుల పువ్వులు విరబూసేవి.

గజల్ ఆవిడ దగ్గరకి చాలా మంచి మూడ్ కనబరుస్తూ వెళ్లింది. ఏ అమ్మాయికి సంబంధించిన ఏ స్కాండల్, ఆవిడకి తెలియదు కనుక! ఖాన్ - బిల్‌గరామీల మాట దాగి ఉంటుంది?

'ఇంక నువ్వు బొంబాయి వెళ్లి ఏదైనా సినిమాలో పని చూసుకోవడం మంచిది, లేదా ఈ మగాళ్లు నిన్ను ఎందుకు పనికిరాని దాన్నిగా చేసి

పారేస్తారు.'

'నేనెలా వెళ్ళనక్కడికి?' గజల్, కంగారుపడింది.

'నేను పంపిస్తాను,' ఒక కిళ్లీ నోట్లో పెట్టుకుని చాలా నెమ్మదిగా అంది.

గజల్ మౌనం వహించింది. ఖుర్షీద్ ఆపాతో ఎక్కువగా మాట్లాడే ధైర్యం లేదామెకి. ఆవిడ ఖాన్‌సాహెబ్‌ని కూడా కుర్రాడంటుంది, కుర్రాడనే ఋజువు చేసి వదిలిపెట్టేది. తరువాత ఆవిడీవిధంగా అంది, 'వాడు, మన పిల్లాడు శివరాజ్ లేడూ! నువ్వేంటే పడిచస్తాడు. చాలాసార్లు నా దగ్గిరకొచ్చాడు, కాని నువ్వేమో బిల్‌గరామీ చేతుల్లో చిక్కుకున్నావు.

గజల్ సిగ్గుపడిపోయింది. ఖుర్షీద్ ఆపా ఏ మాటైనా సరే పచ్చిగా మాట్లాడేది. ఆవిడకి షాయరీ అంటే చాలా చిరాకు.

'శివరాజ్ బొంబాయిలో మంచి పలుకుబడి గలవాడు. అతను ఎన్నో లక్షల రూపాయలు చిత్ర పరిశ్రమలో పెట్టుబడి పెట్టాడు. నువ్వు కొన్నాళ్ళతనింట ఉండు. ఏదో ఒక అవకాశం దొరక్కపోదు.

'కొద్ది రోజులుండనా?' గజల్ ఆశ్చర్యంగా అడిగింది.

ఏ పురుషుడితోనైనా కొన్నాళ్లు కలిసి ఉండడం అన్నది ఖుర్షీద్ ఆపా దృష్టిలో గొప్ప విషయమేం కాదు. అది కూడా గజల్‌లాంటి పిల్లకి.

గజల్ పుట్టు పూర్వోత్తరాలన్నీ తెలిసిన ఖుర్షీద్ ఆపా దృష్టిలో అదేమంత గొప్ప విషయమేమీ కాదు.

'మరేమిటనుకున్నావు?' వెధవ పని చేసినా కడుపు నిండేటట్టుండాలి.

ఇటునుంచి అటునుంచి తన్నులు తినడం కంటే సినిమా హీరోయిన్ అయిపోవడం మంచిది. నీ ముఖం చాలా బాగుంది.

'కాని ఇదెలా సాధ్యమవుతుంది?' ఆవిణ్ణి చెడా మడా తిట్టెయ్యా లనిపించింది గజల్‌కి. ఎటుపడితే అటుపోవడానికి తనేమైనా వేశ్యా?

గజల్ శివరాజ్ ముఖం గుర్తు తెచ్చుకుంది. నాటకం అయిపోయాక, దాదాపు ఎప్పుడూ పూలమాల తీసుకుని స్టేజిమీద కొచ్చేవాడతను.

అతడు చాలా పెద్ద ఆఫీస్‌కి డైరక్టరు, ఆస్థిపరుడు. అతడు వస్తే, రాజా సాహబ్, రాజా సాహబ్, అంటూ అంతా లేచి నిలబడేవారు. ఊళ్ళో ఎన్ని సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినా అతని అధ్యక్షతలోనే జరిగేవి.

డబ్బు తక్కువైనప్పుడంతా అతని దగ్గరికే పరుగెత్తేవారు. కళలకి, సభ్యతకి, అభిభావకులుగా ఉండడమన్నది వారి వంశాచారమై పోయింది. పొట్టిగా, గుండ్రంగా ఉండేవాడు. చిన్నపిల్లల్లా అస్తమానం నవ్వుతూండే, మూర్ఖుడిలా కనిపించే మనిషి. చూడీదార్ పైజమా, నల్లటి ట్వీడ్, షేర్వానీ, ముఖమల్ టోపీ, జరీ సలీమ్ షాహీ జోళ్ళు వేసుకొని, మంచి సువాసనలు గల క్రీమ్ రాసుకునే వాడు. గజల్ దృష్టి అన్నిటికంటే ముందు అతని మెరుస్తూన్న జుట్టుమీద పడేది. స్త్రీలతో సంబంధాలు పెంచుకోవడంలో, వారిని గౌరవించడంలో అందె వేసిన చెయ్యి. చాలా నెమ్మదిగా, ఎంతో సభ్యతా సంస్కారాలతో మాట్లాడేవాడు. ప్రతి ఒక్కరి మాటకీ తలాడిస్తూ, 'అవునండీ', 'చక్కగా చెప్పారు' 'సెలవియ్యండి' అంటూండేవాడు. అటువంటప్పుడు స్త్రీలు అతని చుట్టూ తిరక్కేం చేస్తారు! చాంద్ మీద వేలు ఖర్చు పెట్టాడని, ఎన్నో సంవత్సరాలు కూడా ఉన్నాడని వినికిడి.

హుమాయూన్ ఖుర్షీద్ ఆపా ఇంటి చుట్టూ వేలసార్లు తిరిగాడు. చివరికి అతని ప్రయత్నాలు ఫలించాయి. గజల్ లక్షసార్లు నిరాకరించినా, ఒప్పుకోకపోయినప్పటికీ, శివరాజ్ ఆమెను వదలలేదు. అతను ప్రతిరోజు గజల్ ఇంటికొచ్చిపడేవాడు. ఆమె కోసం బహుమతులు తీసుకొచ్చేవాడు. ఆమెను పార్టీలకీ, సినిమాలకీ తీసుకెళ్ళాలనుకునేవాడు. గజల్ దేనికీ ఒప్పుకోకపోయేసరికి ఒకనాడు గజల్ని సినిమా తారని చెయ్యడానికి బొంబాయి తీసుకువెళతానని హుమాయూన్కి చెప్పాడు. అతడు నాల్గవ తేదీన విమానంలో సీట్లు కూడా బుక్ చేయించాడు. ఏడుస్తూ మొత్తుకుంటూ, హుమాయూన్ తన్నులు - గుద్దులు తింటూ గజల్ విమానాశ్రయం చేరుకునేసరికి విపరీతంగా వణుకుతూంది. ఒక్కసారిగా, సినిమాతెరపైన, సంగీత ఝుంకారతుల మధ్య గజల్ని చూసి అంతా ఆశ్చర్యపోవాలన్న ఉద్దేశ్యంతో, ఈ విషయాన్ని ఐవానే గజల్లోని వాళ్ళకి తెలియకుండా దాచాడు హుమాయూన్. వెళ్లేటప్పుడు ఒకసారి సంతోషంగా ఉండమని సలహా ఇచ్చాడు. హుమాయూన్ రాజా సాహబ్ సెక్రెటరీ గజల్ సామాన్లుంచి హుమాయూన్ సామాన్లు ఒకటొకటిగా విడిగా తీసిపెట్టేసరికి, హుమాయూన్ ఏరోడ్రోమ్-క్యాంటిన్లో కెళ్లాడు.

'రాజా సాహబ్, నా కోసం సీట్ రిజర్వ్ చేయించలేదా?'

'లేదండీ,' ఆయన సిగరెట్ నుసిని నెమ్మదిగా దులుపుతూ అన్నాడు.

'ఐతే గజల్ ఎలా వెళుతుంది?'

'నేనున్నానుగా!'

హుమాయూన్‌కి కొంచమైనా తెలివి ఉండి ఉంటే, ఈ జవాబు విన్న తరువాత నోరు మూసుకుని ఊరుకునేవారు. రాజులతో మాటకి మాట అనటమంటే ఏమన్నా తమాషానా? గజల్‌ని, ఆమె తల్లిని తిట్టి - తిట్టి నాలుక పదునెక్కింది. కోపంతో ఒళ్ళు మర్చిపోయి 'నేను గజల్‌ని వంటరిగా పంపించలేను. నేను కూడా వస్తాను.

ఇది విన్న శివరాజ్ బెల్ కొట్టి సెక్రెటరీని పిలిచాడు. అతడితో ఇంగ్లీషులో ఏదో చెప్పి, పేపర్ చదువుకోసాగాడు. విమానం బయలుదేరబోతోందని ఎనౌన్స్ చెయ్యగానే, అతను క్యాంటీన్ నుంచి బైటికొచ్చాడు. గజల్ ఆయన వెంబడి, 'రాజా సాహెబ్! రాజా సాహెబ్!' అంటూ పరుగెట్టింది, కాని ఆయన గబగబా విమానం కేసి వెళ్ళి పోయారు. తరువాత గజల్ సీట్ రద్దు చేయించేశారని నౌకరు చెప్పాడు. ఇది విన్న గజల్, అక్కడే కుర్చీమీద కూలబడింది. కొంతసేపటికి వరకూ హుమాయూన్ మౌనంగా వేళ్ళతో జుట్టు దువ్వు కుంటూ నిలబడ్డాడు. తరువాత గజల్‌ని చితక తన్ని ఏడుస్తూన్న ఆమెని అక్కడే వదిలేసి, బైటికొచ్చి తన సామాను టాక్సీలో పెట్టించుకుని, ఇంటికి వెళ్ళిపోయాడు.

కొంత సేపటి వరకు నొప్పి ఎక్కువగా ఉండటం వలన ఆమెకి ఏం గుర్తు రాలేదు. ఆమె పళ్ళనుంచి రక్తం కారుతూంది, బుగ్గలు వాచిపోయాయి. ఇప్పుడామె ఒక్కత్తే క్యాంటీన్‌లో కూర్చుని ఉంది. శివరాజ్ సగం కాల్చిన సిగరెట్ నుంచి ఇంకా పొగ వస్తూంది. ఆయన పర్స్ అక్కడే టేబుల్ మీద పడుంది. ఆమె చుట్టుపక్కల వెళుతున్న ప్రయాణీకుల కంఠధ్వనులు, ప్రతిధ్వనిస్తున్నాయి. వెయిటర్స్ ఇటూ - అటు తిరుగుతున్నారు. ఏరోడ్రోమ్ లైట్ల కాంతులతో మెరిసిపోతూంది. దాన్ని లెక్క చెయ్యకుండా రాత్రి చిక్కబడుతూంది.

గజల్‌కి ఎక్కడికెళ్ళాలో అర్థం కాలేదు. ఆమె శివరాజ్ పర్సు తెరిచింది. అందులో ఎన్నో వంద రూపాయల నోట్లు ప్లేను టిక్కెట్లు, టెలిఫోన్ నంబర్లున్న ఒక డైరీ, ఒక చెక్ ఉన్నాయి. ఆ పర్స్‌ని త్వరగా తన పర్స్‌లో

పెట్టుకుని లాంజ్‌కేసి పరుగెట్టింది, 'బొంబాయి విమానం వెళ్ళిపోయిందా?

ఆమె నెమ్మదిగా వచ్చి పెద్ద హాలులో ఉన్న ఒక కుర్చీలో కూర్చుంది. టాక్సీలో సామాను పెట్టించిన తరువాత చాలాసేపటి వరకూ రోడ్లపై తిరుగుతూ గడిపింది. తరువాత సర్‌వార్ ఆఫీసు వద్ద టాక్సీని ఆపించింది. కాని అతను ఆఫీసులో లేడు. అతని మిత్రుడు సర్‌వార్ ఇంటి చిరునామా చెప్పాడు. అది, ఎదురుగానే ఉంది.

ఇది సర్‌వార్ ఇల్లు, శిధిలావస్థలో ఉంది. పాత తలుపులు పైన చిరిగిన గోనె పట్టా వ్రేలాడుతూంది. ఎదురుగా ప్రాంగణంలో తక్కువ వెల్తురులో ముగ్గురు - నలుగురు పిల్లలు దొంగాట ఆడుతున్నారు.

ఇప్పుడీ ఇంట్లోకెళితే ఇక్కడెన్ని గొడవలొస్తాయో! బైటినుంచి నిశ్శబ్దంగా కనబడే ఇళ్ళలోపల ఎన్ని కన్నీళ్ళు దాగి ఉంటాయో... ఇప్పుడింకొక కథ ప్రారంభమవుతుంది... సర్‌వార్ బీదరికం, ప్రేమ గొడవ... ఈ కథలంటే ఆమెకిప్పుడు భయం వేస్తూంది. అందుచేతనే ఆమె కవిత్వం వినేది కాదు, నవలలు చదివేది కాదు. నాయికా నాయకులకు, ప్రేమ తప్ప ఇంకేం లేనట్టుండే సినిమాలు కూడా ఆమెకి నచ్చేవి కావు. అయినప్పటికీ అడుగడుగునా, తన గుండెని చేతబట్టుకుని ఎవరో ఒక మగాడు తారసపడుతూనే ఉండేవాడు. అతడితో గజల్ కూడా విధిలేక ఏడ్వవలసి వచ్చేది.

'సర్‌వార్ సాహిబ్ ఉన్నారా?'

'ఆ! ఒకమ్మాయి పరుగెడుతు అంది. దాగుడు మూచీ!'

'ఆయన్ను పిలవండి కొంచెం' ఆడుకుంటున్న అమ్మాయిలతో అంది.

'ఆయన పడుకున్నారు... మీరు లోపలికి వెళ్ళండి... విడిచి పెట్టు... విడిచి పెట్టు.'

ఆమె లోపల అడుగు పెట్టిందో లేదో పరుగెడుతూన్న ఇద్దరమ్మాయిలు ఆమెకడ్డు పడ్డారు... దొంగ... దొంగ!

ప్రాంగణంలో కొచ్చిన ఆమె నిలబడిపోయింది. పాతకాలపు పెంకుటిల్లు. మధ్యలో ఖాళీ స్థలం, రెండు పక్కలా హాలు, గదులు, హాల్లో, పంజరంలో చిలుక వ్రేలాడుతూంది. ప్రాంగణంలో కోళ్ళ గంప ఉంది. ఒక విరిగిన నులక మంచంపైన, చిన్న పిల్లవాడు పడుకుని ఉన్నాడు. పిందెలతో

ఉన్న ఒక పెద్ద మామిడి చెట్టు, ఇంటంతటిని తన నీడలో దాచుకుంది.

అల్లాహ్!... ఇక్కడొక ప్రపంచం ఉన్నట్టుంది. సర్వార్ ఒంటరివాడు అనుకుందామె. ఓ గదిలో ఒంటరిగా ఉన్నాడనుకుంది.

'ఎవరు?... అరే గజల్... ఎలా వచ్చారు?' ఒక సన్నగా - పొడుగ్గా ఉన్న మధ్య వయస్కుడు లేచి నిలబడ్డాడు. మాసిపోయిన బనీను వేసుకుని, చాపమీద కూర్చుని పిల్లలకి చదువుచెపుతున్నాడు.

గజల్ ఇంకా గాభరా పడింది. విశృంఖలంగా తిరిగే ఆడపిల్లలు, బ్రహ్మచారుల్ని కలుసుకోడానికి ఇలా ఇళ్ళకొస్తే ప్రళయమే వస్తుంది. తరువాత పొగలు నిండి నల్లగా ఉన్న గదిలోంచి, సన్నగా - పొడుగ్గా ఉన్న స్త్రీ బైటికొచ్చింది. మాసిన చీరతో చేతులు తుడుచుకుంటూ, 'ఎవరు నువ్వు?... ఎవర్ని కలుసుకోడానికొచ్చావు?' ఆ ప్రశ్న నేలనుంచి, నింగి నుంచి, ఇంటంతని తన నీడతో కప్పిన మామిడి చెట్టు నుంచి, కోళ్ళ గంపనుంచి, చిలుక నుంచి అన్ని దిశలనుంచి ప్రతిధ్వనిస్తున్నట్టనిపించింది గజల్‌కి.

'అరే, ఈమె గజల్, రజియా ఆపా ఆడబిడ్డ కూతురు, మిస్కీ ఆలీ షాహీ మనుమరాలు. నన్ను గుర్తుపట్టలేదా... నేను హామీద్‌ని... రజియా తమ్ముణ్ణి.

'హామిద్ భాయీ!' గజల్‌కి ప్రాణం లేచొచ్చినట్టనిపించింది. రజియా అత్తతో కలిసి ఈయన నిశ్చితార్థానికి వెళ్ళింది తను. అక్కడి పెళ్ళి కూతురి తమ్ముడితో తన్నుకోడం కొట్టుకోడం జరిగింది. ఈయనే ఆ హామిద్ భాయీ.'

'సర్వార్ సాహిబ్ ఇక్కడుంటారా?'

'అవునండీ, అతడు నా తమ్ముడు, హామీద్ భార్య ఇప్పుడు చాలా సంతోషంగా అంది.

'మీరు సర్వార్‌ని మర్చిపోయారా? నా నిశ్చితార్థానికి వచ్చినప్పుడు మీరు సర్వార్‌ని బాగా కొట్టారు.'

అంతా నవ్వేశారు.

'హాల్లోనే ఎందుకు నిలబడ్డారు, లోపలికి రండి!'

ఇల్లంతా సందడితో నిండిపోయింది. గజల్ నేడు తిరిగి ఈ ఇంటి

అదృష్టాన్ని మేల్కొల్పడానికి వచ్చినట్లనిపించింది. ఒక పిల్ల నేలమీద పడున్న పుస్తకాల్ని, మాసిన బట్టల్ని, చెప్పుల్ని గబగబా తీసేసింది, హామిద్ భార్యా, మాసిన దరిమీద, ఒక తెల్లని దుప్పటి తీసుకువచ్చి పరిచింది. ఎక్కడ్నించో ఒక విరిగిపోయిన విసిన కర్ర, వెతుక్కొచ్చారు, హామిద్ భాయీ. గజల్ అలాగే నిలబడిపోయింది.

'మీరు బట్టలు వేసుకోండి...' గజల్‌ని బలవంతంగా దుప్పటి మీద కూర్చోబెట్టి, హామిద్ భాయీ బీబీ, ఆమెతో అంది. 'ఆఫీసునుంచి వచ్చిన తరువాత ఉక్క వలన చొక్కా వేసుకోరు.'

'ఊహూ... ఇప్పుడు ఇస్త్రీ షర్టెందుకు పాడు చెయ్యాలి! గజల్ బేగమ్ పరాయిదా ఏమటి? మనింటి పిల్ల.'

బైటింకా పిల్లలు దాగుడు మూతలు ఆడుతున్నారు.

హామిద్‌భాయీ తన పిల్లలతో అంటున్నారు, 'ఈమె మీ అక్క, చాలా గొప్ప కళాకారిణి. ఈమె డ్రామా చూపించడానికెప్పుడైనా మిమ్మల్నందర్నీ తీసుకెళతాను. ఆ... ఎప్పుడు నాటకం వెయ్యబోతున్నారు?' ఆమె దగ్గరగా కూర్చుంటూ హామిద్‌భాయీ అడిగారు.

'అల్లాకే తెలియాలి...!' ఆమె గాభరాగా అంది.

బనియన్, ఫ్యాంట్ వేసుకుని, జుట్టంతా చెదిరి ముఖం మీది పడుతుండగా నిద్రమత్తుతో గదిలోంచి బైటికొచ్చిన సర్‌వార్, గజల్‌ని చూస్తూనే వికసించిన మొహంతో, అయితే మొదటి సీను ప్రారంభమై పోయిందన్నమాట...' అనుకున్నాడతను. అసలు సర్‌వార్ ఇంటికి రావడంలోని అంతరార్థమేమిటో? వెధవ మొహం... తనని తానే నిందించుకోసాగాడు.

'ఓహో... నేడు మా పైనెంత దయ కలిగింది....! ఆపా, ఈ శుభ సందర్భంలో రెండు కప్పులు టీ చేసిపెట్టు.' అతడు కూడా హామిద్ భాయీ దగ్గర కూర్చున్నాడు.

'అలాగే అలాగే! కాని ముందు గజల్‌ని ఇంత ఉక్కగా ఉన్నప్పుడు టీ తాగుతుందో లేదో అడగండి, లేకపోతే అనవసరంగా పాలు - చక్కెర వృథా అవుతాయి. తొందరగా అనేశారు హామిద్ భాయీ.

'వద్దు, నేను టీ తాగను,' ఇవాళ నా ఒంట్లో బాగాలేదు.

'నేనిప్పుడే వస్తానంటూ,' హామిద్‌భాయీ, పొయ్యిదగ్గరికి వెళ్ళి పెళ్ళాంతో ఏదో గుసగుసలాడారు.

'మా ఇంటినెలా కనుక్కున్నారు?' సర్‌వార్ అడిగాడు, వెంటనే కొద్దిగా సిగ్గుపడుతూ, కంగారుపడుతూ అన్నాడు. 'మీరు మా ఇంటిని చూడడం మంచిదే అయింది. మేమైతే సాధారణంగా జీవిస్తాము. హామిద్ భాయికి వెయ్యి రూపాయలు జీతం వస్తుంది. ఆయన తన భవిష్యత్తుని తీర్చి దిద్దుకోవాలనుకుంటున్నారు, కనుకనే చాలా పొదుపుగా ఉంటారు. పార్టీలో పని చెయ్యబట్టి నాకు ప్రభుత్వోద్యోగం రాదు. అందుచేత ఒక వార్తాపత్రిక ఆఫీసులో పనిచేస్తున్నాను. అమ్మ, పెద్దక్క మరణించారు. అన్నగారు పాకిస్తాన్ వెళ్ళిపోయారు. అందుచేత చిన్నక్కతోటే ఉంటున్నాను.'

'ఊహు!' గజల్ బైట ఆడుకుంటున్న పిల్లల ఆట చూస్తుంది. సర్‌వార్ కథలో కొత్తదనమేమీ లేదు. హామిద్ భాయీ నిశ్చితార్థం నాడు, సర్‌వార్ వాళ్ళమ్మ చెప్పిన కథే. పాపం హామిద్ భాయీ ఎంత కష్టపడుతున్నారో! ఎన్ని కోరికల్ని అణుచుకుంటున్నారో. అదృష్టం ఎప్పుడు కలిసొస్తుందో కాని దానికోసం ఎంత ఇబ్బంది పడుతున్నారో.

'గజల్, మీ వదిన, ఇవాళ మాతో భోజనం చెయ్యమంటోంది.' చాలా సేపటి తరువాత హామిద్ తన నిర్ణయాన్ని ఎరుకపరచారు.

'కొంచెం సేపైనా మాతో ఉండలేరా?' ఎంతో బాధగా అన్నాడు - సర్‌వార్. గజల్ జవాబు వినకుండానే, 'నేనిప్పుడే కొన్ని పళ్ళు మిఠాయి తీసుకొస్తాను,' అన్నాడు.

'లేదు హామిద్ భాయీ, ఇంక నాకు సెలవిప్పించండి?' ఆమె గాభరాగా తన చీర కొంగుతో విసురుకుంటూ అంది. చాపతో చేసిన ఒక గుండ్రని దస్తర్‌ఖాన్ తీసుకొచ్చి పరిచింది వదిన.

విరిగిపోయిన గాజు ప్లేట్లన్నీ వచ్చాయి. పుల్లటి పప్పు బఘూరాబైగన్. ఆహార పదార్థాలను చూస్తూ పిల్లలంతా తమ పళ్ళాలు తీసుకుని వచ్చేశారు. కాని బీబీ అందర్నీ బైటికి పంపించేసింది.

'ముందు అతిథిని తిననివ్వండి. మీకు తరువాత పెడతాను.'

గజల్‌కి తన చిన్నతనం గుర్తొచ్చింది. ఎప్పుడైనా ఎవరేనా అతిథులొస్తే ఇలాగే ఉండేది. సర్‌వార్ ఖర్బూజా ముక్కొకటి కోసిచ్చాడు, 'తీసుకో...'

చాలు, ఇది చాలు... ఆమె ఆలోచించింది. ఈ చిన్నగా, సమాధిలో ఉన్న ఇల్లు... పొగతో మసిబారిపోయిన వంటగది, అక్కడ అన్నం పప్పు తప్ప మరేమి వండే ఆస్కారం లేదు. రోజంతా అక్కడ కూర్చుని ఆరిపోతున్న నిప్పురవ్వలను రాజేస్తుండాలి. బైట ప్రపంచంలో ఎంత అందమైన మేఘాలు కమ్ముకుంటున్నాసరే. ఉస్మాన్ సాగర్‌లో ఎన్నో బంగారు వెండి కాంతులు కలిసిపోయినా, ఐవానే గజల్‌లో టేబుల్‌పైన కోడి కోడంతా పెట్టి ఉన్నా, పత్తర్ గట్టిలోని దుకాణాల్లో కతాన్, కాంజీవరపు పట్టుచీరలు మిలమిలా మెరిసిపోతున్నా, ఖాన్ సాహిబ్ టేబుల్ మీద లెక్కలేనన్ని మేకప్ సామాన్లు పడున్నా, నిషాత్ టాకీస్ గ్రీన్ రూమ్‌లో సీత, నూర్‌జహాన్, క్లియోపాట్రా పాత్రలకు కావలసిన సామాగ్రి అంతా పెట్టినా, ప్యాలెస్ టాకీస్‌లో జనం తెర ఎప్పుడు తీస్తారా అని ఎదురు చూస్తున్నా, ఆమె కోసం ఎదురుచూసి చూసి అలిసిపోయినా సరే, తను మాత్రం నిద్రపోదు. రాత్రంతా సర్‌వార్ కోసం ఎదురుచూస్తుంది. సారా మైకంలో ఏ ముషాయరానో గజల్ చదువుతుండే అతనికై ఎదురుచూస్తుంది. అతడు అర్థరాత్రి ఏ పత్రిక ఆఫీసులోనో కూర్చుని వార్తలు తర్జుమా చేస్తూంటాడు.

'ఇంకేం కావాలి?' సర్‌వార్ ఒంగి ఆమె ముఖం కేసి చూస్తూ అడిగాడు.

'చాలు... ఇంకేం వద్దు!'

బైటికొచ్చి, ఆమెను టాక్సీలో కూర్చోబెట్టిన తరువాత సర్‌వార్, నువ్వెవరో నాకివాళ తెలిసింది.

'ఇదింకా అనర్థమైపోయింది!' నిట్టూరుస్తూ అందామె.

'సరే, నేను రేపొస్తాను, నువ్వు ఐవానే గజల్‌కి వెళుతున్నావు కదూ?'

'ఆ...' ఏ ఉద్దేశ్యం లేకుండానే అలా అన్న గజల్, ఐవానే గజల్ చేరుకుంది.

మరునాడు తను చెయ్యని తప్పులన్నిటికి కూడా క్షమార్పణ కోరుతూ తనని ఇంటికి రానివ్వవలసిందిగా తండ్రిని అనుమతించమని వేడుకొంది. అతను ఆ కాగితం వెనుక గజల్ని విమానాశ్రయంలోనే పూడ్చిపెట్టి వచ్చానని వ్రాసి పంపించాడు. ఇక్కడ ఐవానే గజల్‌లో కూడా ఎవరూ ఆమెని పట్టించుకునేవారు కారు. బీబీ ఒక్కర్తే మౌనంగానే ఆమెను

సమర్థించేది. తాతగారి భయంవలన, ఆమెను భరించేవారంతా. కాని ఇప్పుడు ఇంట్లో రజియా రాజ్యం, ఆమె తన అత్తవారి తరఫు వారినెవరినీ సహించేది కాదు. రాషిద్ మాత్రం, ఎందుకో తెలియదు. ఏడుస్తూన్న గజల్ తలమీద చెయ్యిపెట్టి, చచ్చిపోయిన తన అక్కల్ని తల్చుకుని అన్నాడు. కాని ఈ రోజు నుంచి నువ్వు హుమాయూన్ ఇంటికి వెళ్ళవు. ఏడుపులు పెడబొబ్బలూ మానేసి హాయిగా ఉండు.'

ఆమె ఎక్కడికెళుతుంది? ఒక ప్రక్క కాంతిని గురించిన బెంగ తినేస్తూంది, ఎందుచేతనంటే రంగమ్మ, కాంతిని ఉచితంగా పెంచడానికి ఒప్పుకోవడం లేదు. శివరాజ్ పర్సు లోనించి రెండునోట్లు తీసిచ్చి ఆమె నోరు మూయించింది. సర్వార్ వచ్చి ఏదో పత్రిక ఆఫీసులో తనకి కూడా ఉద్యోగమిప్పిస్తాడన్న ఆశతో అతని కోసం ఎదురుచూస్తూంది. కాని సర్వార్ రాలేదు. ఆనాడు తను వచ్చేసిన తరువాత హామిద్ భాయీ వాళ్ళింట్లో పెద్ద హంగామా జరిగివుంటుంది. ఇటువంటి తిరుగుబోతు అమ్మాయిలతో స్నేహం పెంచుకున్నందుకు, బీబీ అతణ్ని బాగా తిట్టి ఉంటుంది. గజల్‌తో ఎందుకు మాట కలిపానా అని అతను కూడా పశ్చాత్తాపడి ఉండవచ్చును. ఇదీ మంచికే అయింది. ఈ నాటకం ఇంతటితో ముగిసింది. తరువాత రాషిద్ ఒకనాడు, హామిద్‌భాయీ మరణించాడన్న వార్త మోసుకొచ్చాడు. రోడ్డు దాటుతూ ఒక బాంబు పేలుడులో చిక్కుకున్నారుట హామిద్ భాయీ. 'వద్దు... వద్దు...! గజల్ అరుస్తూంది.' హామిద్ భాయీ జీవితాన్ని తీసేసుకోవద్దు. ఆయన తన భవిష్యత్తుకి సంబంధించిన ఎంతో చక్కని కలలు కన్నారు. జీవితంలోని ప్రతి కష్టాన్ని, ప్రతి చేదు అనుభవాన్ని, భవిష్యత్తులో దర్జాగా బ్రతకడం కోసం, ఓర్చుకున్నారు.

ఒకనాడు సర్వార్ కూడా వచ్చాడు. చాలాసేపటి వరకూ హామిద్ భాయీకి సంబంధించిన విషయాలు ముచ్చటించిన తరువాత బాధాకరమైన ఆ విషయాన్ని మారుస్తూ 'నీ గురించి కూడా ఏదైనా చెయ్యాలని ఆలోచిస్తున్నాను.' అన్నాడతను.

'నా గురించా...? ఏమిటి...?'

ఆ మధ్య కుంటత్త అంటూంది, శాంతి కోసం ఏర్పాటైన సంస్థలు

వాళ్ళ ప్రభుత్వంతో కలిసి, తిరుగుబోతు అమ్మాయిల్ని పట్టుకుంటున్నారుట. వాళ్ళని జైళ్ళల్లో పడేస్తున్నారుట.

'ఇప్పుడు నీకెంత వయస్సుందేమిటి? నీ వయస్సు అమ్మాయిలకి నవ్వడం కూడా చేత కాదు, కాని పరిస్థితులు నిన్ను కన్నీటి స్నానం చేయించాయి.'

'మీకు నా గురించి ఏమేమి తెలుసు?'

'ఈ చర్చ విడిచి పెట్టు! అతడు సిగరెట్ వెలిగించి ఐవానే గజల్‌లోని ఆ గొప్ప హాలుని చూడసాగాడు.

ఐవానే గజల్‌లో స్త్రీ పురుషుడి అవసరాలు తీర్చడానికి మాత్రమే ఉపయోగపడేది. 'నేనా దేవిడికి సంబంధించిన ఎన్నో కథలు విన్నాను' అతడు హాల్లో అమర్చిన ఫోటోలు చూస్తున్నాడు.

'కాని ఐవానే గజల్ నన్నే విధంగానూ బాధించలేదు. నాకు లభించిన చిట్టచివరి ఆశ్రయం' గజల్ నెమ్మదిగా కుర్చీమీద తల పెట్టుకుని కూర్చుంది.

ప్రతి అసహాయురాలైన స్త్రీకి ఇదే చిట్టచివరి ఆశ్రయం అవుతూంది. అతడు సిగరెట్ పొగ బైటికి వదిలాడు. 'సరే, ఇంతటి మృదుభావాలు కలిగి ఉన్న నువ్వు ఈ బురదలో ఎలా చిక్కుకున్నావని నేనడగను.'

'వినాలనుకుంటున్నారా మీరు?' గజల్ లేచి కూర్చుంది.

'లేదు'. సర్వార్ చేతితో సైగతో ఆపేశాడు. నేనిపుడు నిర్ణయించు కున్నాను. మనం ఇప్పుడు మాట్లాడుకోబోయే మాటలు స్వచ్ఛంగా ఉంటాయి. నిజాలే మాట్లాడుకుందాం. ఎందుకంటే నీముందు నేనబద్ధం చెప్పలేను.

గజల్‌నెవరో వెనక్కి నెట్టినట్లయింది. 'స్వచ్ఛమైన మాటలు, నిజాలు? నాతోనా...? నేను నసీర్ కోసమే జీవిస్తున్నానని చెప్పెయ్యనా? ఈ ఉంగరం నా చేతికున్నంత వరకు నిజం చెప్పి తీరాలి తప్పదు. ప్రపంచంలోకెల్లా గొప్ప నిజం, అవిస్మరణీయమైన సత్యం కేవలం నీ ఉనికి మాత్రమే అంది.

మళ్ళీ ఏవో అశాంతికరమైన జ్ఞాపకాలతో, అతడు లేచి నిలబడ్డాడు. సిగరెట్ నలిపి పారేశాడు, టేబుల్ మీద పేరుకుని ఉన్న దుమ్ము వేలితో శుభ్రము చేయసాగాడు. 'ఎందుకో తెలియదు కాని గజల్ నీతో మాట్లాడేటప్పుడు నా నాలుక తడబడుతుంది... ఊపిరాడనట్లనిపిస్తుంది,'

నిజంగానే ఊపిరి పీల్చుకోవడానికై ఆగాడు. తిరిగి కుర్చీలోని దిండుపై తల పెట్టుకుని, తన వైపే చూస్తూన్న గజల్‌కి దగ్గరగా వచ్చేడతను.

'నువ్వనుమతిస్తావా? నేను చెప్పెయ్యనా...?'

'వద్దు, వద్దు...!' గజల్ చెవులపై చేతులు పెట్టుకుని నిలబడి పోయింది. 'ఇది నిజం అవదు... ఇవాళ కేవలం నిజాలే మాట్లాడుతానన్నావు...'

ఆమె భయంతో వెనక్కి జరిగింది. ఇంటంతటికీ నీడనిచ్చిన మామిడిచెట్టు జ్ఞాపకమొచ్చింది. పొగచూరిపోయిన గది, పల్చగా నీళ్ళలా ఉన్న పప్పు, ఒట్టి కాళ్ళతో పరుగెట్టే బీబీ, ఖాళీగా ఉన్న పళ్ళాలు పుచ్చుకుని తలుపు దగ్గర నిలబడ్డ చిన్న - చిన్న పిల్లలు. ఏదో మంత్రానికి కట్టుబడినట్టు గజల్ మనసు ద్రవించిపోతూంది. బైట నిద్రపోతూన్న పిల్లవాడ్ని ఎత్తుకోవడానికి ఉరికింది, కానీ సర్‌వార్ కంఠధ్వని విని ఉలిక్కిపడింది, 'నేను నిన్నా పాత ఇంటికి తీసుకు వెళ్ళను. నువ్వు అలిఫ్‌లైలా రాకుమారివి. నేను, నిన్ను నా ఊహా సింహాసనం పైన కూర్చోబెట్టుకుంటాను. ఏ విధమైన దుఃఖము... ఏ కష్టమూ నీదాకా రావు... నువ్వు... నువ్వు... కవిత్వానికి ప్రాణమై ఉంటావు... నా అందమైన ఊహాలకి ప్రతిబింబం!'

ఎవరో తనని పొడిచినట్లు కుర్చీలో చతికిలబడింది గజల్ - 'జాన్ గజల్...? ప్రేయసీ...? కవిత్వాన్ని పూర్తి చేసేదానా...?'

గజల్ ఈ విధంగా నిరాశతో కూర్చోవడం చూసిన అతను ఉన్నట్లుండి గంభీరంగా మారిపోయి, 'నిన్ను మగవాళ్ళెంతగా మోసగించారో నాకు తెలుసు. ఇప్పుడు నీకెవరి మీదా నమ్మకం లేకుండా పోయింది... కాని నా కవిత్వంలో నువ్వు శాశ్వతంగా జీవించి...'

'అవును! నాకు నీ మీద కూడా నమ్మకం లేదు.'

తరువాత, ఇంత త్వరగా ఈ మాట సర్‌వార్‌తో అనేసినందుకు ఎంతో బాధపడింది గజల్. ఏ పురుషుణ్ణి నిరాశపర్చలేకపోవడమే ఆమెలోని పెద్ద బలహీనత. ఆమె ఇతరుల్ని బాధల నుంచి తప్పించడానికి తన సర్వస్వాన్ని కోల్పోయింది. కాని ప్రేయసిగా ఆటలాడి విసిగిపోయిందామె. సర్‌వార్ తన పాత ఇంట్లో ఆశ్రయమిస్తానని ఆశ పెడతాడనుకుంది. తన ఇంటి మీద వ్యాపించి ఉన్న మామిడి చెట్టు గురించి ఆశ చూపిస్తాడనుకుంది. కాని నేడతను నిజం చెప్పడానికే నిర్ణయించుకున్నాడు.

'గజల్...! గజల్ వెనుతిరిగి చూసింది. సర్వార్ తలవంచుకుని విలపిస్తున్నాడు - చిన్నతనంలో తను బాగా చితక్కొట్టినప్పటి పిచ్చిపిల్ల వాడిలాగ ఏడుస్తున్నాడు.'

సర్వార్ ఇప్పటికీ, మాసిపోయిన షేర్వానీ, కుచ్చుల్లేని తుర్కటోపీ పెట్టుకున్న చిన్న పిల్లాడిలాగే కనిపించాడు గజల్‌కి.

'అవును... మనిద్దరం ఇవాళ నిజాలే మాట్లాడుకోవాలన్నావు నువ్వు, వెళ్ళు ఈ సంఘటనపై ఒక కవిత వ్రాసెయ్యి, ఈ గాయాన్నెప్పుడూ గుండెల్లో పదిలపర్చుకో నాలాగ...'

కోపం, బాధలవల్ల సర్వార్ ఏమీ అనలేకపోయాడు. అతడు అచ్చం ఆడపిల్లల్లాగా తలవంచుకొని మెల్లిగా ఏడుస్తున్నాడు.

మళ్ళీ ఎప్పుడైనా ఐవానే గజల్‌కి వస్తే నాకు, - జాన్‌మన్... ఊహాలోకపు సామ్రాజ్ఞి... కళలకి ప్రాణం... అంటూ నినిపించు.

ఇప్పుడు గజల్ ఏడ్చేసింది. రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకుని గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది.

ఒకటి రెండుసార్లు సర్వార్ ఇంటికి రావడం చూసిన రాషిద్, అతనికి ఎంతో శ్రద్ధగా మర్యాదలు చేశాడు. అతడెప్పుడూ పేరు ప్రఖ్యాతులున్న వారితోటి, పెద్ద మనుష్యుల తోటీ స్నేహాన్ని పెంచుకోవడంలో ముందంజ వేసేవాడు. సర్వార్ కవిత్వ మీ మధ్య జనప్రియమైంది. ప్రతి పత్రికలోను అతని పేరు కనబడుతూంది. ప్రతి ముషాయరాలోనూ అతడు హాజరు. కమ్యూనిస్టు సాహితీవేత్తలు ఏర్పాటుచేసుకున్న సాహితీ సంస్థకతనే కార్యదర్శి అని వినికిడి. ఈ మధ్య కమ్యూనిస్టుల వ్యవహారం చాలా జోరుగా ఉంది. కనుక ఒకరిద్దరు కవులతో సన్నిహితత్వం పెంచుకోవడమే మంచిది. గజల్‌తో సర్వార్ పెంచుకుంటూన్న స్నేహంపై ఎటువంటి ఆంక్షలు విధించలేదు రాషిద్. సర్వార్ కేవలం రాషిద్‌ని కలుసుకోవడానికి మాత్రమే వస్తున్నాడనుకున్నారు - కుంటత్త, రజియా.

సర్వార్ రావడానికి రెండు వారాల ముందే హామిద్‌భాయీ రాషిద్‌కి, పద్ధతి ప్రకారం సర్వార్ పైగాం పంపించేశారు. ఎర్రటి కాగితం మీద అతడి వివరాలు దానితోపాటు బి.ఏ. డిగ్రీ తీసుకున్నప్పటి అతని ఫొటో కూడా పంపించారు. సర్వార్‌కీ విషయం అస్సలు తెలియదు. గజల్‌కి

కూడా, ఇంట్లో అందరికీ ఈ సంబంధం నచ్చిందని, గజల్ కూడా పెళ్ళికూతురు కాబోతున్నదని ఫౌజియా చెబితే తెలిసింది.

అది విన్న గజల్ అలసటగా చతికిలబడింది. ఫౌజియాకి ఏం చెప్పాలో ఆమెకి తెలియలేదు. ఆమె, అంత కంగారు పడడం చూసిన ఫౌజియా దగ్గరగా జరిగింది.

ఆమె పచ్చటి బట్టలు నలుగు - పసువు వాసనలతో నిండి ఉన్నాయి.

'నీకు సర్వార్ నచ్చలేదా? గొప్ప కవట!'

'కాదు... సర్వార్‌కి నేను నచ్చలేదు. ఫౌజియా, నేడు సర్వార్ ఈ సంబంధాన్ని తిరస్కరిస్తున్నట్టు చెప్పడానికి వచ్చాడని రాషిద్ మామూతో చెప్పు. హామిద్ భాయీ తన ఇష్టం ప్రకారం ఈ పైగామ్ పంపించారు.'

'ఏమిటి... సర్వార్‌కి నువ్వు నచ్చలేదా' ఫౌజియా ఆశ్చర్యపోయింది.

'ఒకవేళ నీ గురించేమైనా తెలిసిందేమో అతనికి!'

'అందుకే చెబుతున్నాను. ఈ సంబంధాన్ని పట్టించుకోవద్దని అత్తకి చెప్పు.' గజల్ గురించి ఆలోచించడానికి అక్కడి తీరికెవరికుంది?

ఫౌజియా దర్జీతో గొడవ పడుతూంది. రజియా సారె సమకూర్చడంలో మునిగిఉంది. రాషిద్ పెళ్ళి ఆహ్వానం పత్రికల మీద పేర్లు వ్రాస్తున్నాడు. ఇల్లంతా బంధువులతో నిండిపోయింది. ఫౌజియా స్నేహితురాళ్ళు రేయింబవళ్ళు ఆమెని చుట్టుముట్టి ఉన్నారు. గేటు దగ్గర మంగళ వాయిద్యాలు మ్రోగుతున్నాయి. హాల్లో అమ్మాయిలతో పాటు డోలు పుచ్చుకుని కూర్చుంది కుంటత్త.

అంతా పెళ్ళి పాటలు పాడుతున్నారు.

ఎందుచేతనో పాడుతూ పాడుతూ కుంటత్త కంఠం కంపించేది, ఆమె కళ్ళు తుడుచుకుంటూండేది.

ఫౌజియా వరుడు ఊరేగింపుతో ఐవానే గజల్ గేటు దగ్గరకి వచ్చాడు. లోపలంతా హడావిడిగా ఉంది, మెరిసిపోతున్న స్త్రీలు, నవ్వులు, పకపకలు, బిరియానీ, కోడికూర సువాసనలు, గుండెల్ని పిండే పాటలు!

బాబుల్ మోరా నైహార్ చూట్‌జాయే...

స్నేహితురాళ్ళ మధ్య పెళ్ళి కుమార్తె కూర్చున ఫౌజియా నవ్వి నవ్వి అలసిపోతూంది. గజల్ ఎదురుగా కూర్చుని, సౌభాగ్యానికే చిహ్నమైన

సింధూరపు పొట్లాన్ని విప్పి గోరింటాకు పెట్టిన చేతులపైన సింధూరం అలంకరిస్తూంది. నగలు పెడుతుండేది. మేకప్ చేస్తూంది.

'సిగరెట్ చాలా కాలుస్తారంటగా, నాకు పొగాకు వాసనంటేనే పడదు' జరీనా అంటూంది. ఆయనకు ఎర్ర రంగు చాలా ఇష్టమట.' తరువాత ఆమె గజల్ చెయ్యి పట్టుకుని అంది 'ఈ డాక్టర్లు ఉట్టి సిగ్గుమాలిన వాళ్ళు. నేను మూడు రోజులవరకు కళ్ళు తెరువను' ఆమె సిగ్గుతో గజల్‌కేసి వంగిపోయింది.

నేనింక ఎప్పుడూ ఏ మగవాడిని చూసి సిగ్గుపడను. నేను దేనికి గాభరాపడను.

షాహిన్, రాషిద్ మామూ పెళ్ళి విషయం ఒప్పించడానికి వచ్చేసరికి ఫౌజియా, విపరీతంగా ఏడుస్తూంది. ఇక ఆమె అతడికోసమే జీవిస్తుంది. అతడి కోసమే మరణిస్తుంది. తన ముందు జీవితమే ఒక అపరిచితునికి అప్పగించేసింది, ఐనా ఫౌజియా ఏడుస్తుంది, పిచ్చిది - నేనైతే ఈ సంతోషం పట్టలేక మరణించేదాన్ని...

'ఇంక చాలు ఊరుకో, ఎంతకని ఏడుస్తావు? గజల్‌కి వరుసకి అత్తయిన ఒకామె, ఆమె కళ్ళు తుడిచింది.

'చిన్నప్పట్నించీ కలిసున్నారిద్దరూ, రజియా బేగమ్, ఇంక గజల్‌కి పెళ్ళి చేసెయ్యండి, పాపం ఒంటరితనం వల్ల గాభరా పడుతూంది.

నేనొంటరి దాన్నయివుంటే... ఫౌజియాలాగా... ఫౌజియా నేడు తన భర్త ఇంటికి వెళుతుంది.. వంటరిగా... శూన్యమైన పగలు... శూన్యమైపోయిన మనసుతో... నేనెక్కడికి వెళతాను... ఏమేమి తీసుకొని...?

తరువాత అందరి దృష్టి గజల్‌పై స్థిరపడింది.

ఒకనాడు ఆమె సాహిద్ అక్కతో కలిసి సినిమాకెళితే అత్త బాగా కోప్పడింది.

'ఇంక ఈ తిరుగుళ్ళన్నీ మానెయ్యి. నేటినుంచి పూర్తిగా పరదా ఉండి తీరాలి. ఇంట్లో కొత్త అల్లుడు వచ్చాడు. నేను నా ఇంటికి చెడ్డపేరు రానివ్వను. నీకిష్టమైతే ఇక్కడుండు, లేకపోతే మీ నాన్నింటికి ఫో.'

కూతురు వెళ్ళిపోగానే అత్తలో ఎంతో మార్పువచ్చింది. రెక్కలు విరిచేసిన తరువాత ఎగిరిపోవమ్మంటే, పక్షి ఏ కొమ్మ మీద

వాలగలుగుతుంది? గజల్ మౌనంగా బట్టలు మార్చుకొని, చీపురు పుచ్చుకుని బైట ఊడవసాగింది. అసలామె కోసం బైట మాత్రం ఎవరు ఎదురు చూస్తున్నారు గనుక? ఆమె కావాలనే నలువైపులా తలుపులు బిగించుకుంది. అలా ఉంటున్నాకూడా, ఫౌజియా తన భర్తతో కలిసి వచ్చిందంటే, అత్త, ఆమెని గదిలోకి తోసి బైట గడియపెట్టేది. గజల్‌కి ఫౌజియా భర్త అంటే అసలు నచ్చేది కాదు. అతడు చాలా గర్విష్ఠి, సభ్యత తెలియనివాడు. వస్తూనే ఇంటిల్లిపాదినీ జబ్బు మనుష్యులుగా చేసి, తన డాక్టరునన్న గొప్ప చాటుకోవడానికి ప్రయత్నం చేసేవాడు. అతడికి ఫౌజియా చేసిన ఏ పనీ నచ్చేది కాదు. ప్రతి చీరకి, ప్రతి నగకి వంకలు పెడుతుండేవాడు. అనుక్షణం అతని మూడ్ సరిచేయడానికే సరిపోయేది ఫౌజియాకి. ఇంటికొస్తూనే తల్లికి చెప్పేది 'అమ్మా స్వీట్‌లో కేవడా వెయ్యోద్దు... డాల్డా తెప్పించొద్దు... కోడి రోస్ట్ చేయించు, ఆయనకి సందడి అంటే గిట్టదు, అందుకని కుంటత్తని నెమ్మదిగా మాట్లాడమని చెప్పు.

ఇంత చేసినా అత్త వారింట్లో తననెవరూ ఖాతరు పెట్టరని ఫౌజియాకి ఫిర్యాదు చేసేవాడు.

పెళ్ళి అయిన మూడు - నాలుగు నెలల తరువాత ఒక్క రోజుండడానికి వాళ్ళిద్దరూ వస్తే, కూడా ఫౌజియా అత్తగారి ఉత్తరం వచ్చేది. క్రితంసారి పాడునెయ్యి తినబట్టి ఆమె పుత్రుడికి జబ్బు చేసింది కనుక, అతడికేం పెట్టొద్దని అందులో వ్రాసి ఉండేది.

అందుకని ఫౌజియా ద్వారా, ఆమె భర్త వివరాలు తెలుసుకుందామంటే, ఫౌజియాకి తీరుబడి ఉండేది కాదు.

ఒకనాడు ఫౌజియాని పంపించిన తరువాత, రజియా బాధపడుతూ కూర్చుని ఉంది. షెఖూబాయి ఆమె దగ్గరికొచ్చి కూర్చున్నాడు. షెఖూబాయి ఇప్పుడు ఇత్తిహాల్-ఉల్-ముసల్‌మీన్ నుంచి బైటపడి, కాంగ్రెసు శాంతి-సమితికి కార్యదర్శి అయిపోయాడు. అక్కడక్కడ హిందూ - ముస్లీముల ఐక్యతకై సమావేశాలు జరిపిస్తూ దేశద్రోహులు, నిర్దయులు అయినటువంటి ముస్లీముల వివరాలు, పట్టిక, సైనిక ప్రభుత్వం ముందుంచాడు. ఏ ఇంట్లో ఎన్ని ఆయుధాలు, దాచారో, ఏ భవనంలో

ఎంత బంగారం పాతిపెట్టారో ఎవరెవరు తమ సంపాదనని పాకిస్తాన్‌కి తరలిస్తున్నారో, మొదలైన వివరాలన్నీ ప్రభుత్వానికి అందించడం వల్ల ఇప్పుడతను దర్జాగా బ్రతుకున్నాడు. బ్రహ్మాండమైన కొత్త కొత్త షేర్వానీ, చిరిగిపోని మంచి చెప్పులు వేసుకుని తిరుగుతున్నాడు. ప్రతి సాయంత్రం చిత్తుగా తాగి రుచికరమైన తినుబండారాలు దొన్నెలో పెట్టుకుని, హాలు మెట్లపైకొచ్చి బల్ల దాకా వచ్చేసరికి గజల్‌కి చాలా ఆశ్చర్యమనిపించింది. నౌకర్ల క్వార్టర్ల దగ్గరినుంచి హాలు మెట్ల వరకు అతనికి హద్దులు నిర్ణయమయాయి. వాహిద్ హుస్సైన్, బీబీల అనంతరం ఇప్పుడు రజియా వ్యక్తిత్వాన్ని గుర్తించనట్లు వ్యవహరిస్తున్నాడేమో అనిపిస్తోంది.

దుల్హాన్ బేగమ్ ఏ యింట్లో అమ్మాయికి గౌరవం లభిస్తుందో, అటువంటి ఇంట్లోనే అమ్మాయిని పడేయాలి.' బాధాపూరితమైన రజియా ముఖాన్ని చూసి, అలాగ మాట్లాడి బల్ల చివర కూర్చున్నాడు.

'షేఖూబాయి ఇది అదృష్టానికి సంబంధించిన విషయం, నుదుట వ్రాత ఎవరు మార్చగలరు? వరుడి కోసం తెగ గాలించాం.'

'అయినప్పటికీ అమ్మాయినే గౌరవించే ఇంట్లోనే ఇవ్వాలి. ఇప్పుడు నేనున్నాను, మంచి వయసులో ఉన్నా ఏ అమ్మాయినైనా నాకిచ్చి పెళ్ళి చెయ్యండి. నేనెలా ఆమె అనుయాయినైపోతానో చూడండి.'

షేఖూబాయీ మాటలకి రజియాకి నవ్వొచ్చింది. కుంటత్త మూతి వంకరగా తిప్పుతూ అంది, 'మొదనష్టపోళ్ళకి వెకిలిమాటలు పోవు.'

అత్త షేఖూబాయీ మాటలు శ్రద్ధగా వినడం గమనించింది.

మధ్యాహ్నం మళ్ళీ కుంటత్త దగ్గర కూర్చుని రజియా గుసగుసలాడుతుంది. సాధారణంగా ఏదైనా ముఖ్యమైన నిర్ణయం తీసుకోవలసినప్పుడు, స్త్రీ మొహంలో కనబడే గాంభీర్యం కనబడుతుందామె ముఖంలో.

షాహీన్ హాస్పిటల్ వెళ్తున్నప్పుడు, వాళ్ళిద్దరూ మెల్లిగా మాట్లాడుకోవడం చూసి గట్టిగా నవ్వుతూ అన్నాడు, 'నేను వినేశాను, నీ గురించి చెడ్డగా మాట్లాడుకుంటున్నారని షేఖూభాయీకి చెప్పేస్తాను.'

'మా మాటలతో నీకేం పని?'

'నాకన్ని విషయాలతో పనుంది. మీరేం మాట్లాడుకుంటున్నారో నాకు

చెప్పండి.' అతను తన బ్రీఫ్‌కేస్ పెట్టేసి ఇద్దరికీ మధ్యగా వచ్చి కూర్చున్నాడు.

'వెళ్లు నాయనా, ఆసుపత్రిలో రోగులు ఎదురుచూస్తూ ఉంటారు.' కుంటత్త అతడిని అక్కడినుంచి పంపెయ్యాలనుకుంది.

'పోతేపోనీ రోగుల్ని, నేనేమైనా సరే వెళ్ళను, సాయంత్రమై పోయినా సరే.'

'ఐతే విను గజల్ పెళ్ళి గురించి ఆలోచిస్తున్నాం, మేము.'

'అదన్నమాట విషయం, షాహీన్ తన బ్రీఫ్‌కేస్ తీసుకుని లేస్తూ, ఫౌజియాకోసం పట్టుదల, మొండితనం ఉన్న ఓ నామ్‌హాకీమ్‌ని వెతికారుగా, గజల్‌కోసం అటువంటి వాణ్ణి మాత్రం వెతక్కండి' అన్నాడు.

షాహీన్‌కి తన బావగారంటే అస్సలు ఇష్టంలేదు. అతని అలవాట్లు, పద్ధతులు, నచ్చేవి కావు. అతడు చెప్పుకునే గొప్పలు సహించలేకపోయాడు. వైద్య వృత్తికతడెటువంటి ప్రాముఖ్యతనిచ్చేవాడు కాడు. తాహిర్ ఐరోపాలో కేవలం భోగాలనుభవించాడనే వాడు షాహీన్. అతనిలో సామర్థ్యం శూన్యం, నేను అమెరికాలో ఏడు సంవత్సరాలుండి వచ్చాను. సామర్థ్యం విషయంలో నా ముందు నిలవలేడు షాహీన్ అనేవాడు తాహిర్.

వాళ్ళ మాటలు విన్న గజల్ ఆశ్చర్యపోయింది. ఫర్నీచర్ శుభ్రపరుస్తున్న గజల్, వదిన ద్వారా సర్వార్ తిరిగి ప్రయత్నించడం లేదు కదా, అనుకుంది. అతడి పైగామ్‌ని అతని ముఖంమీదే తిప్పికొడతాను. నేనింకా, ఈ ఆటకోసమేనా మిగిలిపోయింది. సర్వార్‌కి నా గురించేమీ తెలిసి ఉండదు. ఇలాగ ఆలోచించి సర్వార్ పేర ఒక ఉత్తరం వ్రాసింది. గజల్, తన గత జీవితానికి సంబంధించిన విషయాన్ని వివరించింది. లేఖలో, ఇవన్నీ తెలిశాక కూడా విస్తృతమైన మీ మామిడిచెట్టు నీడలో నాకు చోటిస్తారా అని ప్రశ్నించింది చివరికి. జీవితాన్ని పవిత్రంగా భావించి, దేవుడి ఎడల కృతజ్ఞతా పూర్వకమైన భావంతో జీవించే పుణ్యాత్ముల ఇంట్లో తానుండగలదా?

సాయంత్రం ఉత్తరం కవర్లో పట్టి, అంటించి, పోస్ట్ చేద్దామనుకుంటుండగా ముమానీ బేగమ్ కుంటత్తతో అంది నాకైతే గజల్ షేఖూభాయ్ జోడీ చాలా బాగుందనిపిస్తూంది. ఇద్దరూ బాగుపడతారు.

గజల్ చేతిలోని లేఖ జారిపడింది. ఆమె రాతి ప్రతిమలా నిలబడి పోయింది. ఆమెనావిధంగా చూసిన రాషిద్ గాభరాపడ్డాడు.

నే చెప్పేదేమిటంటే రజియా, కొంచెం జాగ్రత్తగా ఆలోచించు గజల్, షేఖూభాయీ జోడీ కూడా వారిద్దరికీ ఇంచుమించు నలభై ఏళ్ళు తేడా ఉంది, అన్నాడు రాషిద్.

'మీరు వెతకాల్సింది సరియైన జతగాడ్ని. ఇలాంటి పిల్లని చేసుకోవడానికి ఎవడు ఒప్పుకుంటాడు. ఒకతేమో పోయి సమాధిలో పడుకుంది. ఈ మేనకోడలు మనల్ని సమాధిలో పడుకోబెడుతుంది.

'సరే, సరే, ఈ మాటల్ని వదిలెయ్యి, నేనది ఏమిటంటే మీరే పిల్లవాడినైనా...' రాషిద్ చిరాకుగా అన్నాడు.

'హా! అబ్బాయిలు రోడ్లపై తిరుగుతుంటారు. మీరు మీ అమ్మాయికోసం మంచి పిల్లవాడ్ని - ఆ సరే, సరే, మెల్లగా మాట్లాడు. రాషిద్ ఓడిపోయాడు.

'అసలు విషయమేమిటి అంటే రాషిద్ మియా! కుంటత్త పరిస్థితిని సమర్థిస్తూ' మగాడు కొంచెం గట్టివాడైతే, దానికి ముక్కు తాడు వేస్తాడు లేకపోతే ఇది జీవితాంతం ఇలాంటి గొడవల్లోనే ఇరుక్కుంటుంది.

రాషిద్ ఇంకేం అనలేదు. బియ్యం బాగు చేస్తూన్న గజల్‌ని చూస్తూ కూర్చున్నాడు. గజల్ మౌనం చూసిన అతనికి ఒక విధంగా నిశ్చింత అనిపించింది.

షేఖూ భాయిలో, ఏదైన ప్రత్యేకత చూసిందేమో గజల్, లేకపోతే ఈ కాలంలో అమ్మాయిలు, తమకి ఇష్టం లేకుండా ఏం మాట్లాడరు.

'ఇక మీ కోసం కూడా పెళ్ళి కూతుర్ని వెతుక్కోండి రాషిద్ మియా - వెంటనే రాషిద్ మూడ్ మార్చడం కోసం, విషయం మారుస్తూ మాషా అల్లాహ్ మా షాహీన్ బాబా చదువుకుని పెద్దవాడై, ఉద్యోగస్థుడు కూడా అయిపోయాడు. ఫౌజియా లేని ఈ ఇల్లు బాగులేదు. కోడలొస్తే కొంత కళ తెస్తుంది.

'ఈ పనులు చెయ్యడానికి, ఆయనకి తీరుబడిలేదు రజియా ఎప్పటిలాగే కోపంగా అంది. ఈయనకి తెలిసిందొక్కటే, డబ్బు సంపాదించడం. బిడ్డల సుఖ సంతోషాలతో ఆయనకేం పని?

అరే, కోపం తెచ్చుకోవద్దు బేగమ్, ఆ పని కూడా చేస్తున్నాను జాషాన్

జాహ్ మనమరాలికోసం, రహీమ్ మియాకి చెప్పాను పిల్ల బి.ఏ. పాస్ అయిందట, రొక్కమే లక్ష రూపాయలిస్తారట.

'నిజంగా' రజియా ఆశ్చర్యపోయింది.

'అరె ఆ వెధవ మొహం వేసుకునుండే రహీమ్ మియా సంగతి వదిలెయ్యి! నేను స్వయంగా కరామత్ ఆపా దగ్గరకి వెళతాను, మనబ్బాయికేం తక్కువ? అందం చందం, ఐరోపాలో సంపాయించుకున్న ఇన్ని డిగ్రీలు! హాస్పిటల్‌లో కూడా వాడంటే అందరికీ ఇష్టమేనట.'

'షాహీన్‌ని కూడా అడగండి ముందు,' ఇది విని అంతా మౌనం వహించారు. షాహీన్ చాలా సరళ స్వభావుడు. అభిమానం, ఆత్మ ప్రదర్శన అతన్ని అంటనైనాలేదు. కాకపోతే విదేశాల్నించి వస్తూ మరికాస్త పట్టుదలని మోసుకొచ్చాడు. తనకి నచ్చిన పనే చేసే వాడు. వస్తూనే రాషిద్‌తో ఎన్నోసార్లు వాగ్ యుద్ధం జరిగింది. అలాగని అతను సభ్యత లేనివాడు కాదు. ఎదురు జవాబులు చెప్పేవాడు కాదు. షాహీన్ వస్తే పాకిస్తాన్ వెళ్ళిపోదామని ఎదురు చూశాడు రాషిద్. ఇక్కడి డబ్బంతా అక్కడికి తరలిద్దామనుకున్నాడు. ఇక్కడి ఉద్యోగాల్లో ఏముంది కనుక? కాని షాహీన్‌కి పాకిస్తాన్ వెళ్ళడం సుతారామూ ఇష్టంలేదు.

యూరప్ నాగరికత అంటే అతని కసహ్యం. అతడు హైదరాబాదులో మాత్రమే ఉండదలచుకున్నాడు. డబ్బు సంపాదించడం, కూడబెట్టడం వంటి విషయాలలో అతడికే మాత్రం అభిరుచి లేదు, వైద్య శాస్త్రంలోని పరిశోధనలు చెయ్యడంలోనే కాలాన్ని వినియోగించాలన్నది అతని అభిమతం.

రాషిద్ నెత్తీ, నోరు-కొట్టుకుని, చేసేది లేకే ఊరుకున్నాడు. వయస్సులో ఉన్నవాడు, ఇష్టమొచ్చినట్టు ప్రవర్తించేవాడు అయినా కొడుకుని ఏం చెయ్యగలరు?

ఒంటరిగా గదిలో కూర్చొన్న గజల్‌ని చూసిన రంగమ్మ నెమ్మదిగా లోపలికొచ్చింది. 'బీబీ, నేను పిల్లని తోటలో పెట్టి వచ్చాను. ఇంక ఆ పిల్లని ఇంట్లో ఉంచడానికి ఒప్పుకోవడం లేదు నా మొగుడు, గజల్ పరుగెట్టుకెళ్ళింది. క్రాంతి హాయిగా కూర్చుని ఎండిపోయిన పువ్వులు, ఆకులు ఏరుతూంది. పిల్ల ఎండిపోయి పుల్లలాగా అయిపోయింది. ఆ పిల్ల

నల్లని ఎత్తైన జుట్టును కత్తిరించేసింది రంగమ్మ.

గజల్ ఆ పిల్ల నెత్తుకుని గట్టిగా గుండెకి హత్తుకుంది. ఆ పిల్ల జాగ్రత్తగా పరిశీలిస్తూంది. ఆ పిల్లనెక్కడికి తీసుకెళ్ళను? గజల్ భర్త గదిలో పడుకుంది. గేటు లోపలికి కారురావడం చూసి, కాంతిని గదిలో కూర్చోపెట్టి, ఇక్కడ మాట్లాడకుండా కూర్చుంటే, నేను రొట్టి తెచ్చిపెడతాను, అంది గజల్.

తరువాత ఎనిమిది రోజుల పాటు, ఖాళీగా ఉండి పెద్ద గదిలో కనబడే ఈ కోళ్ళుండే స్థలంలో కాంతిని దాచి ఉంచింది. ఈ భాగంలోకి జనం రాకపోకలు ఎక్కువగా ఉండేవి కావు. కాని మాటిమాటికి పళ్ళెం, రొట్టెలు తీసుకు వెళ్ళడం చూసిన కుంటత్తకి గజల్ వద్ద దొంగతనం చెయ్యడం లేదుకదా అన్న అనుమానం వచ్చి జాగ్రత్త పడింది. రొట్టె పెట్టుకోవడానికి వెళ్ళినప్పుడల్ల రోడ్డు మీద పిల్లలతో ఆడుకో అని తరిమేసి సాయంత్రమైతే ఆ కోళ్ళ స్థలంలోనే ఉంచి తలుపు మూసేసేది, బైటికి రాకు, లేకపోతే, లోకులు నిన్ను చంపేస్తారని కూడా చెప్పింది.

నాలుగు సంవత్సరాల కాంతి ఇటువంటి అపాయాల్లోనే పుట్టింది. తుపాకీ చప్పుళ్ళు... పారిపోవడాలు... గోతుల్లో... గుహల్లో దాక్కోడం... అన్నం నీళ్ళు లేకపోయినా ఓర్చుకోవడం... ఆ పిల్లకన్నీ అలవాటు. ఇప్పుడు కోళ్ళతో పాటు చీకటి కొట్లో ఏడ్చి - ఏడ్చి నిద్రపోవడం కూడా నేర్చుకుంది.

కాని కుంటత్త దిగులనిపించి, ఎన్ని గుడ్లున్నాయో చూడడం కోసం కర్ర సాయంతో వెళ్ళి తలుపు వేసేసరికి గుడ్ల తోపాటు పెద్ద పిల్లకూడా ప్రత్యక్షమైంది. ఆమెకి భయంతో ప్రాణం కరడుకట్టింది. ఆమె అరుపులకి ఇంట్లోని వారంతా అక్కడ గుమికూడారు.

ఈ పీడ ఎక్కడ్నుంచి దాపురించిందిరా బాబూ అని, రజియా, రాషిద్‌లు బాధపడ్డారు. ఎవరి పిల్లో, ఏ ఉద్దేశ్యంతో వాళ్ళింట్లో దాగి వుందో? పరిస్థితులు బాగాలేవు. పిల్లపేరుతో పోలీసులు ఇంటి మీద దాడి జరిపితే భూగృహంలోని రహస్యాలన్నీ బైటికొస్తాయి.

అందరి కేకలు, బొబ్బలు విన్న భయం వల్ల ఏడుస్తూ గజల్‌ని చుట్టుకుపోయింది. ఆ పిల్ల ఒంటినుంచి కోళ్ళ దుర్వాసన వస్తూంది. పైగా తీవ్రమైన జ్వరంతో వణుకుతూంది.

పిల్ల గజల్ దగ్గరకి వెళ్ళడం చూసిన రజియాకి ఈ పిల్ల ఆనాడు కైసర్

అప్పగించిన పిల్లకాదు కదా! అన్న సందేహం కలిగింది. కాని ఈ పిల్ల అది కాదని, ఇద్దరిలో చిన్న తేడాలున్నాయి. కైసర్ పిల్ల ఒక్క సంవత్సరం వయసు కలది, చాలా తెల్లగా ఉండేది. అలా వెయ్యి సాక్ష్యాలు చూపెట్టింది గజల్, మురికిలో పడున్న పిల్లల వివరాలు ఎవరికి జ్ఞాపకం? అందువల్ల అంతా ఊరుకున్నారు. షాహీన్ పిల్లని ముట్టుకుని చూసి, తన బట్టలకి తగలకుండా, చేతులతో ఎత్తుకుని లోపలకి తీసుకువచ్చాడు. బల్లమీద ఆ మురికి పిల్లని పడుకోబెట్టాడు. కొంచెం మందిచ్చి, ఒక ఇంజక్షన్ ఇచ్చాడు. ఇదే మంచి అదననుకొన్న గజల్ ఒక కప్పు వేడి పాలు తీసుకొచ్చింది.

తరువాత అక్కడున్న వారందరినీ ఉద్దేశించి, అభినయంతో పాటు గొప్ప విషయం చెప్పసాగింది. ముమానీ బేగమ్, ఒక మాట వినండి. రాత్రి నమాజు చదువుకుని పడుకున్నానా నిజంగా నేనీ పిల్లని కల్లో చూశాను ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్నాను. ఇంతలో తాతగారు వచ్చారు. ఆయన ఒళ్ళో ఈ పిల్లుంది. మేమప్పగించే ఈ పిల్లని ఐవానే గజల్లో జాగ్రత్తగా ఉంచు. అప్పుడు మీ మామయ్య బాధలన్నీ తొలగిపోతాయి. అత్తా పొద్దుట్నుంచీ ఈ స్వప్న ఫలం ఏమిటో మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను.

షాహిన్ హాస్పిటల్‌కి వెళ్ళిపోయాడు. ఈ కల గురించి విన్న అందరి శిరస్సులు, శ్రద్ధతో ఒంగిపోయాయి. తను జయించగలిగినందుకు, సంతోషంగా కళ్ళు తుడుచుకుంది గజల్. తను ఎలాగూ కుంటత్తకి, వదిన కాబోతూంది. అందువల్ల కుంటత్త దగ్గర్నుంచి రజియా దాకా అంతా ఆమెని బాగా చూస్తున్నారు. కుంటత్త వెంటనే తన గదిలోకి వెళ్ళి ఒక శాలువా తెచ్చి ఆ పిల్లకు కప్పింది.

'దుల్హన్ బేగమ్ పడుండనియ్యి పిల్లని, షాహీన్ బాబా బిడ్డల్ని ఆడిస్తున్నాడు.'

కల గురించి విన్న రజియా కూడా ఏమిటో సద్దుకుంది. ఏ నిస్సహాయురాలైన తల్లి కన్నబిడ్డ? మన ఔదార్యం, పేరు ప్రతిష్ట గురించి విన్నవారెవరో, తీసుకొచ్చి ఐవానే గజల్లో పడేశారు. అల్లాహ్, రసూల్ మనకీ పిల్ల రక్షణ అప్పగించారు. కనుక అది మన కర్తవ్యం.

ఎవరి పిల్ల, ఎక్కణ్ణుంచి వచ్చింది అన్న విషయంతో అసలు పని లేదు

షాహీన్‌కి, ఇంట్లో ఉంది కనుక, రెండు పూటలా మందివ్వడం, బిస్మిల్లాహ్ బీకు, గజల్‌కు చెప్పి అ పిల్లని శుభ్రంగా ఉంచేటట్టు చేసే బాధ్యత తనమీద వేసుకున్నాడతను.

'నీ పేరేమిటి?'

'కాతీ... ఆ పిల్ల వచ్చీరాని మాటలతో చెప్పింది. కనీజ్, కనీజ్ అంటూంది! గజల్ గబుక్కున అంది.

'అయ్యో! ఎవరు తురక పిల్ల! తండ్రి పాపం సరిహద్దుల్లో చచ్చిపోయి వుంటాడు. ఏ ఆసరా లేని తల్లి ఇక్కడ విడిచి పెట్టింది? రజియాకి జాలేసింది.

'ఏమైనా సరే, పోలీసులకి చెప్పేస్తే ఏ గొడవ జరగదు, రాషిద్ అన్నాడు, అనాధ పిల్లల్ని దేవిడీల్లో చేర్పించడం ఏం కొత్త కాదు.

'నా ఉద్దేశ్యమేమిటంటే, ఏ ఆసరాలేని పిల్లల్ని పెంచడం కోసం సదాబ్ రాషిద్ ఆలీఖాన్ ఒక క్యాంపు వుంటుందని వార్తా పత్రికల్లో ఒక వార్త వేయిస్తే సరి. కాంగ్రెస్ ప్రభుత్వం ఇటువంటి పనుల్ని మెచ్చుకుంటుంది.

'రాషిద్ మామూ! నేను కూడా మీ క్యాంపులో పని చేస్తాను ఎంతో సంతోషంగా అంది గజల్.

'అనాధ పిల్లలపై జాలి చూపిస్తే అల్లాహ్ డెబ్బై తప్పుల్ని మన్నిస్తాడు.'

'గౌహర్ అత్తా, మీరు కూడా ఏదైన తప్పు చేశారా? షాహీన్ అన్న ఈ మాటలకి అంతా నవ్వేశారు. ఎందుచేతనో కాని కుంటత్తకి మాత్రం ఏడుపొచ్చింది.'

ఇదేమైనా నా ఏడవ్వలసిన మాట? నవ్వవలసిన విషయం! షాహీన్ గజల్‌తో అన్నాడు గజల్ బేగమ్! ఈ పిల్లకి సేవ చేసినందువల్ల మీ కేమిటి లాభం?'

ఇది విన్న గజల్ కూడా కన్నీళ్ళు కనబడకుండా ఉండడం కోసం లోపలికి పరుగెట్టింది. కాని షాహీన్ చాలా పట్టుదల గల మనిషి, వెంటనే లోపలికొచ్చాడు. గజల్ మూల కూర్చుని ఏడుస్తూంది. బిగుతుగా ఉన్న ప్యాంట్‌తో మెల్లిగా ముడి కాళ్ళేసుకుని కూర్చున్నాడతను.

'గజల్, నిజంగా ఒక మాట చెప్పు, కానీజ్ నీ మూర్ఖత్వానికి ఫలితం కాదుకదా?

'షాహీన్ భాయీ... ఆమె షాహీన్ చెయ్యి పట్టుకుని ఏడుస్తూ కాంతి కథంతా వివరించింది.

మరునాడందరూ టిఫిన్ చెయ్యడం కోసం బల్ల దగ్గిర కూర్చునుండగా ఒక అంటించిన కవరు నెవరో కిటికీలోంచి లోపలికి విసిరేశారు. రాషిద్ చాలా గాభరా పడ్డాడు. ఈ మధ్యనే బందిపోట్ల గుంపొకటి పట్నంలోకొచ్చింది. వారిని 'బంగాలీ' అనేవారు. ఈ గుంపులోని వారు, ఇంత మొత్తం ఫలానా జాగాలో పెట్టండి, లేదా ప్రాణాలు దక్కవు, అంటూ ముందు ఉత్తరాలు వ్రాసేవారు. తరువాత నిజంగానే చంపేసేవారు.

అందువల్ల అంతా తినడం మానేసి లేచి నుంచున్నారు. రజియా కవరు విప్పవద్దని అందరికీ చెప్పింది, లోపలేమైనా బాంబు ఉందేమో కాని కాంతి పరుగెడుతూ వెళ్ళి కవరు తీసి ప్రేమగా పట్టుకుంది.

'పప్పో... పప్పో... తీసుకో...! కవరు గజల్ చేతిలో పెట్టింది. తన పాత ప్రేమికులెవరికైనా తనపైన మళ్ళీ ప్రేమ పుట్టుకు రాలేదు కదా అని గజల్ భయపడింది. గజల్ కాంతి వద్దనుంచి కవరు తీసేసుకుంది, కాని రాషిద్ కవరు తిప్పి గట్టిగా చదువుతూ అందరికీ వినిపించసాగాడు. ఇది సంజీవా చాంద్ పేర వ్రాసిన ఉత్తరం చాంద్‌కి మాత్రమే.

ఏడు సంవత్సరముల తరువాత నా ఉత్తరం చూసి కోపగించకు. నా ఆశయం, నీ ప్రేమకన్న గొప్పదనుకున్నాను. నాధ్యేయం నన్ను తన వైపు పిలుస్తూంది. చాంద్‌ని సంపూర్ణంగా పొందలేనని నాకు తెలుసు.

నీ అంతట నువ్వు నా చేతుల్లో వాలిపోయినప్పుడు నిన్ను నువ్వు నాకు సమర్పించినప్పుడు కూడా నిన్ను పూర్తిగా పొందలేనని తెలుసు. నువ్వు ఐవానే గజల్ చక్కగా అలంకరింపబడిన కవిత లాంటి దానివి. జీవితంలోని కటువుగా ఉండే కఠోర సత్యాల్ని నువ్వు భరించలేవు. అందువల్ల నిన్ను మోసగించను. నేను ఎన్నుకున్న మార్గంలో కష్టాలు ఎదురయ్యాయి. అన్ని వైపులా తుపాకులే, ప్రతి మలుపులోనూ అపాయమే. కాని ఇన్ని అపాయాలు చుట్టుముట్టి ఉన్న కొంచెం సేపైనా మేము చల్లని నీడని వెతుక్కునే వాళ్ళం.

కైసర్ అలాంటి ఒక చీకటి గుహలో కలిసింది. అక్కడ ఉరితాళ్ళు మాత్రై ఎదురు చూస్తున్నాయి. అటువంటి పరిస్థితుల్లో మేము కలిసిపోయాం.

ఇందులో కైసర్ త్యాగమే గొప్పది. తనకానందం కలిగించడం సంగతటుంచి, తను జీవించి ఉంటాడన్న నమ్మకాన్ని సహితం కలిగించలేని పురుషుణ్ణి స్వీకరించడం నిజంగా గొప్ప విషయమే.

కాంతి పెద్దదైనప్పుడు ఐవానే గజల్ పాత చరిత్ర తప్పక వినిపించు, అది కైసర్ కథ. హైదరాబాదులోని మహాళ్ళలో పెరిగే ప్రతి బానిస పిల్ల కథ, నేనెవరినో, అది కూడా నువ్వే కాంతికి చెప్పగలవు. సరే, నా ఊహలవలె అందంగా ఉండే నీ పిల్లలందరికీ నా ముద్దులు, చాంద్ తన వద్దనే ఉందన్న భ్రమలో ఉన్న మూర్ఖుడైన భర్తకి సలామ్.

నాకు, ప్రపంచాన్నంతటనీ ప్రేమించడం నేర్పిన నీ అద్వితీయమైన సౌందర్యానికి, చివరిగా సలామ్ చేస్తున్నాను.

నీ సంజీవా,

'అచ్చా, ఐతే ఇది ఆ అక్రమపు సంతానమే నన్నమాట - కోపంతో కుంటత్త కాంతిని కొట్టడానికి ఉరికింది.

'ఈ పిల్లని వెంటనే ఇంట్లోంచి గెంటెయ్యాలి, లేకపోతే ఆపద వచ్చి పడుతుంది!' రాషిద్ కంగారుగా అన్నాడు.

'తీసుకెళ్ళు' పెంటకుప్ప మీద పారెయ్యడానికి ఇదేమైనా చచ్చిన ఎలుక కాదు కదూ! షాహీన్ మెల్లిగా గుడ్డు తింటూ అన్నాడు.

'కాకపోతే ఇంకేమిటి? రజియా మండిపడుతూ అంది.'

'అవకాశముంటే, వెంటనే ఆ నల్లపిల్లని తీసి రోడ్డు మీద పారేసేది రజియా... వచ్చి తీసుకెళ్ళవలసింది అని. ఒక అనాధపిల్ల ఇక్కడికొచ్చేసిందనీ, వచ్చి తీసుకెళ్ళవలసిందనీ నేనిప్పుడే పోలీసులకి ఫోన్ చేస్తాను. రాషిద్ తినడం ఆపేసి లేచాడు. షాహీన్ గజల్‌కేసి చూసాడు. కాంతితో పాటు తనని కూడా రోడ్డుపైన విసిరెయ్యమని ఆజ్ఞాపించినట్టు, రెండు చేతులతో కాంతిని పట్టుకుని వణికిపోతూంది గజల్.'

'కాని కాంతి ఎక్కడికీ వెళ్ళదు. ఇక్కడే ఉంటుంది!' అన్నాడు షాహీన్!

ఏమిటీ? రాషిద్ పట్టలేని కోపంతో అన్నాడు. ఈ విషయంలో నీకేమిటి సంబంధం?'

'ఉందంతే! షాహీన్ లెక్కలేకుండా అన్నాడు.'

ఒక వేళ ఎవరైనా మనింట్లో ఒక పిల్లని దాచి ఉంచాము అన్నారంటే

మన వంశ గౌరవం ప్రతిష్ఠ మంట కలిసిపోతాయి. నీ డాక్టరీ - ఫ్యాక్టరీ అలాగే ఉండిపోతుంది.

'పోనివ్వండి, కూలి పని చేసుకుందాం! షాహీన్ లెక్క చెయ్యకుండా టీ కలుపుకుంటున్నాడు. కాంతి మాత్రం ఎక్కడికీ వెళ్ళదు. ఆమె చాంద్ ఆపా స్మృతి చిహ్నం.

'అంకుల్ హా, హా...! కాంతి నేలమీద కూర్చుని చీమల్ని చంపుతూంది.

.... అది చాంద్ స్మృతి చిహ్నమైన పిల్లని ఆమె తండ్రికి చెప్పి తన కూతురి జ్ఞాపకార్థం, దీన్ని ఇక్కణ్నుంచి తీసుకెళ్ళమని రజియా ఈసారి కాస్త గట్టిగా గర్జించింది. వాదనలో షాహీన్‌ని గెలవడం కష్టమని ఆమెకి తెలుసు.

'మన మెందుకిస్తాం? కాంతిని మనమే స్వయంగా పెంచుదాం రాషిద్ ముందు రజియాకేసి, తరువాత కుంటత్తకేసి చూశాడు. ఆరడుగుల ఎత్తున్న ఇంతగొప్ప డాక్టరైన కొడుకు ఎదురుగా ఉంటే ఎవరైనా నిస్సహాయమైన వాడై పోతాడు! అతడి చదువుకు యాభై వేలు ఖర్చు పెట్టాడు కాని అతను పనికిమాలిన వాడయ్యాడు!

తెలివి, చతురత అతనికి అసలు లేవు. అమెరికానుంచి వచ్చిన డాక్టరెవరైనా పల్లెలో ఉందామంటాడా? కాని అతనన్నాడు. అతడు వెళ్ళడానికిష్టపడటం లేదు. నిజానికి, అతడు అమెరికా, పాకిస్తాన్‌కు వెళ్ళిపోతే బాగుండుననుకున్నాడు. రాషిద్ యూరప్ నుండి ఒక దొరసానిని పెళ్ళి చేసుకోనీ, తను ఇంగ్లాండు మనుమలు, మనవరాళ్ళకి నానమ్మ అనిపించుకోవచ్చు కదా అనుకునేది రజియా. కాని ప్రతిసారీ, ఆంగ్లవనితలు మన దేశానికి అనుకూలంగా ఉండరమ్మా, అంటూవుండే వాడు షాహీన్. ఆ విధంగా రాషిద్ డబ్బు సంపాదించే మార్గాలు ఎన్ని చూపినా అన్నీ నిరాకరించేవాడు. అప్పట్లో హైదరాబాదులో హార్ట్ స్పెషలిస్టులు ఒకరిద్దరుకంటే లేరు కనుక ఉద్యోగంతో పాటు ఐవానే గజల్ ముందు భాగంలో ప్రయివేట్ క్లినిక్ పెడితే బాగుండుననుకున్నాడు రాషిద్. కాని ఒకేసారి ఇంతమంది రోగుల్ని నేను జాగ్రత్తగా చూడలేను అని, ఆ సలహాని కూడా త్రోసిపుచ్చాడు.

ఇవన్నీ చాలవన్నట్టు ఇవాళ కాంతి ఈ ఇంట్లోనే ఉంటుందని

పట్టుపడుతూంది గజల్. గబుక్కున అంది, 'మూమానీ బేగమ్ కాంతిని నా గదిలోనే దాచి ఉంచుతాను మీరు నిశ్చింతగా ఉండండి.'

అన్నట్టుగానే కాంతి నెప్పుడూ గదిలోనే ఉంచేది. కాని కాంతిప్పుడు బాగా అల్లరి నేర్చుకుంది. షాహీన్ తాగించిన టానిక్కులతో ఆరోగ్యంగా ఉంది. మూసిన తలుపుల్ని బాదుతూ అరుస్తూండేది. 'గజల్ ఆంటీ! నేను బాత్‌రూమ్ కెళ్ళాలి నాకాకలేస్తూంది. త్వరగా తలుపు తియ్యండి.'

నోరు ముయ్యి హరామ్‌జాదీ, ఇంక నోరు మూస్తావా లేక నీ గొంతు నులిమెయ్యనా? కుంటత్త కేకలు విని ఇంకా అల్లరి చేసేది.

'నోరు ముయ్యి హరామ్‌జాదీ బుడ్డీ, ఇప్పుడే వచ్చి నిన్ను కర్రతో కొడతాను!

ఒకసారి ఫౌజియా ఐవానే గజల్‌కి వచ్చినపుడు ఆమె ఆడబిడ్డ కూడా ఆమెతో పాటు వచ్చింది. రెహానాని ఉజాలాబేగమ్ వంశంలో ఇచ్చి వివాహం చేశారు. ఆమె రజియా, కుంటత్త గజల్‌కి అక్కడి పరిస్థితుల్ని వివరించింది. ఉజాలా బేగమ్ ఇక్కడ వదిలిపెట్టి వెళ్ళిపోయిందో అంత ఆస్థినీ, పాకిస్తాన్ ప్రభుత్వం నుంచి పొంది మునుపటి కంటే ఇంకా దర్జాగా బ్రతుకుతూంది. బీజానీ టీ నీటితో మరణించింది. నసీర్ పాకిస్తాన్‌లోని గొప్ప కవి, అతడికి ఇద్దరు పిల్లలు. పాకిస్తాన్ వెళ్ళగానే అహమద్ హుసేన్ ప్రపంచంలో సరదాలన్నీ వదిలేసి, గడ్డం పెంచుకుని మహమ్మదీయుల సంఘంలో మెంబర్ అయి ధర్మ ప్రచార పరమైన పని చేస్తున్నారు. రెహానా అంది, ఒకసారి నసీర్ భాయీ గజల్‌కి అస్సలు పెళ్ళికాదని పందెం వేశారు.

'ఎందుకని' గజల్ ఆశ్చర్యంగా అడిగింది.

'నాకేం తెలుసు!' రెహానా అంది.

'ఈ షాయర్లంతా ఇలాగే బుర్ర తిరుగుడు వాళ్ళు. మనసులో ఏదైనా తల్చుకుంటే సరి, ఇంక అదే పట్టుకుని కూర్చుంటారు. 'అవును అతనూ అలాంటి వాడే. ఎటువంటి పరిస్థితుల్లో పెళ్ళి చేసుకున్నాను! ఉజాలా బేగమ్ చాలా కఠినాత్మురాలు అతడు దుఃఖిస్తూంటాడు. రాత్రిళ్ళు తనని కలల్లో వెతుకుతుంటాడు. అతని ఉంగరం నాచేతికుంది. కనుక అతడు పదిమంది బిడ్డలకు తండ్రియైనా సరే... రాత్రంతా ఎదురుచూస్తుంటాను.

అతడు కేవలం నావాడే అని అతడి నమ్మకం నేనతడి కోసం వనవాస దీక్షననుభవిస్తున్నాను కదా! జీవితపు విషాన్ని ఒక్కొక్క గుటకే మింగుతున్నాను... రాత్రంతా నసీర్ గురించే కలలు కంటూండిపోయింది గజల్.

మరునాడు షాహీన్ కాంతితో కలిసి బంతాట ఆడుతుండగా గేటు వద్ద చాలా మంది గోల వినిపించింది. నలభై యాభైమంది కలిసి అరుస్తున్నారు. అందరూ గాభరాగా పరుగెత్తారు. ఒక హిందువుల పిల్లని తురకవాళ్ళు దాచిపెట్టారని, పేట మొత్తం కొంతమంది హిందువులు పోలీసుల్ని తీసుకొచ్చారని అర్థం అయింది. వీళ్ళ నాయకుడు మల్లేశం.

'అల్లా రక్షించుగాక! అనర్థం జరిగిపోయింది. ఇప్పుడేమౌతుందో? రజియా వణుకుతూంది.

రాషిద్ షాహిన్లు, కాంతి చాంద్ కూతురు. సంజీవాకి, చాంద్‌కి వివాహం జరిగిపోయిందని వాళ్ళకెన్నో విధాల నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కాని పోలీసులు ఒప్పుకోలేదు. విషయం పూర్తిగా పరిశీలించే వరకూ కాంతిని తమ రక్షణలో ఉంచడానికి తీసుకు వెళ్ళారు.

రజియా తృప్తిగా నిట్టూర్చింది.

ఆరేళ్ళ కాంతికి పోలీసులంటే విపరీతమైన భయం కాబట్టి గట్టిగా అరుస్తూంది. ఆ పిల్ల ఏడవడం చూసి గజల్ కూడా ఏడవడం మొదలుపెట్టింది.

'నష్టజాతకురాలు, కొంచెంసేపట్లో ఊరుకుంటుంది. ఇంకీ విషయంలో ఏం చెయ్యవలసిన అవసరం లేదు.'

'అయితే మనం కాంతిని పోలీసులకప్పగించేద్దామా?' షాహీన్‌కి చాలా కోపం వచ్చింది.

ఇది విన్న కుంటత్తకి తృప్తిగా ఉంది.

'మంచిదే హిందూ తండ్రికి పుట్టిన పిల్ల హిందూ ధర్మ సత్రంలో పెరుగుతుంది. ఇంక నువ్వేడవకు, లేకపోతే నువ్వే కాంతికి తల్లివనుకుంటారు లోకులు.'

ఆమె గజల్‌ని కేకలేసింది.

ఒక నెల గడిచిపోయింది. షాహీన్ ఈ విషయం మర్చిపోయాడు.

ఒకసారి అంతా నిద్రపోయిన తరువాత గజల్ అతని గది కిటికీ దగ్గర కొచ్చి నిలబడింది.

'షాహీన్ భాయీ, నాకొక పని చేసి పెడతారా?'

'ఏ పని?' షాహీన్ గమనించాడు, గజల్ చాలా రోజులనుంచి ఏడుస్తూనే ఉంది కాబోలు.

'ఎలాగైనా సరే, నాకొక పని చేసి పెడతారా?'

'ఏ పని? ఎలాగైన సరే నాకొక్కసారి కాంతిని చూపించండి!' మరునాడు షాహీన్ గజల్ని కార్లో కూర్చో పెట్టుకుని గంటల తరబడి తిరుగుతూనే ఉన్నాడు. మూడు నాలుగు పోలీసు స్టేషన్లు గాలించాడు. తరువాత ఓ మంత్రితో మాట్లాడాక చిట్టచివరికి ఆ ధర్మసత్రం చిరునామా దొరికింది.

కాంతి చేతుల్లో పళ్ళెం పెట్టుకుని పిల్లల వరుసలో నిలబడి అరుస్తూంది. త్వరగా అన్నంపెట్టు, లేకపోతే ఈ పళ్ళెంతో నీ తల పగులగొడతాను.

సత్రం మేనేజర్ను పక్కకి తీసుకువెళ్ళి మాట్లాడాడు షాహీన్, ఒక వెయ్యి రూపాయలు అతని చేతిలో పెట్టి కాంతిని తనతోపాటు కార్లో కూర్చోపెట్టుకున్నాడు.

కాని ఇప్పుడింక కాంతినింటికి తీసుకువెళ్ళడం మంచిది కాదనిపించింది. అందుచేత ఆపి తన క్లినిక్కి తీసుకెళ్ళి డ్యూటీలో ఉన్న నర్సుని పిలిపించాడు.

'సిస్టర్! ఇది ఒక అనాధ పిల్ల, ఇక్కడే ఉంటుంది, నువ్వు ఈ పిల్లను కాపాడు.'

'మనమేం చెయ్యగలం డాక్టర్! ఏసు ప్రభువు చేస్తాడంతా.'

'ఇది వారిరువురి మూర్ఖత్వానికి ఫలితం అయి ఉండవచ్చునిపించింది సిస్టర్కి.'

'కాదు షాహీన్ అంకుల్! నన్ను భగవంతుడు రక్షిస్తాడు. హరిః ఓం... హరిః ఓం తత్ సత్! పసిపిల్ల అయిన కాంతి షాహీన్తో అంది.'

షాహీన్ ఆశ్చర్యపోయాడు. కేవలం ఒక్క నెలలో ధర్మసత్రం వాళ్ళు కాంతిని పూర్తిగా హిందువుగా తయారు చేశారు. ఆ పిల్ల దారి పొడుగునా గజల్ షాహీన్లకి పాప పుణ్యాల పరిజ్ఞానాన్ని బోధిస్తూనే ఉంది. ఆమె భజన పాటలు వినిపించింది. ఈ ప్రపంచానికి పునాది వేసింది పరమ

శివుడుని చెప్పింది.

'చాలు, చాలు నోరు మూసుకో!' గజల్ కోపంగా అంది.

తరువాత గజల్ నర్స్‌తో చెప్పింది, 'ఈ పిల్లని ధర్మసత్రం వాళ్ళు పూర్తిగా హిందువుని చేసేశారు మేరీ! నువ్వీ విషయం జాగ్రత్తగా చూసుకో!'

'గజల్ ఆంటీ! మీరు నాకు కృష్ణ భగవానుడి విగ్రహం ఒకటి తెచ్చి పెట్టండి. ఆ మూర్తిని నేను నా గదిలో పెట్టుకుంటాను.'

'రేపట్నించి నేనిక్కడికొచ్చి నీకు నమాజు ఖురాన్ - షరీఫ్ నేర్పిస్తాను.' ఆ పిల్ల మాట విననట్టంది గజల్.

రెండు మూడు రోజుల తరువాత నమాజ్ నేర్పించే పుస్తకం యస్‌రస్-ఉల్-ఖురాన్ తీసుకుని క్లినిక్‌కి వచ్చేసరికి మేరీ క్రాంతి గుండెలపై క్రాస్ వేసి ప్రార్థన చెయ్యడం నేర్పిస్తూంది.

గజల్ ఆ పిల్లకి నేర్పుదామని కూర్చునేసరికి క్రాంతి కాళ్ళు నేలమీద కొడుతూ గదంతా తిరగడం మొదలు పెట్టింది. నేనింక చదవను. ఒకప్పుడు భగవంతుడు నన్ను నాశనం చేసేశాడు. మరొకప్పుడు ఏసు ప్రభువు నన్ను మన్నించాడు. గజల్ ఆంటీ! ఈ అల్లాహ్, భగవంతుడు, ఏసు ప్రభువు, అంతా పిల్లల్నెందుకు వెంటాడుతారు?

'ఊరుకో, మాట్లాడకు! అల్లాహ్ పేరిట అగౌరవంగా ప్రవర్తించకూడదు. ఇలాగ మాట్లాడితే అల్లా నిన్ను నరకంలో పడేస్తాడు.' చిన్నప్పుడు తనని, తల్లి నరకయాతనలు గురించి చెప్పి భయపెట్టేదని గుర్తొచ్చింది గజల్‌కి.

'అయితే నేను అల్లాహ్ మియాని ప్రశంసించనా ఆంటీ!'

నాస్తికుల సంతానం! గజల్ మనసులో అనుకుంది.

ఈ పిల్లెంత మొండిది, ఎంత ఉద్దండురాలు! అంతా తల్లి పోలిక, కాని మొహం చూస్తే సంజీవా గుర్తొస్తాడు. అదే ఛామని ఛాయ. తెల్లటి పళ్ళు, పెద్ద పెద్ద కళ్ళు, తల మీద ఒత్తుగా ఉన్న ఉంగరాల జుట్టు. ఆ మనిషిలో ఎటువంటి సమ్మోహన శక్తి ఉందో కాని, చాంద్‌వంటి అపురూపమైన అందగత్తెని పిచ్చెక్కేటట్టు చేసింది. ఆమె సంజీవా పారేసిన, సిగరెట్ పీకని తీసుకుని తన బుగ్గలకి తాకించుకునేది. సాయంత్రం సంజీవా రాబోయే

మార్గాన్ని, రోజంతా చూస్తూ కూర్చునేది.

ఇంత ఎదురు తెన్నులు చూసిన తరువాత వచ్చిన అతనికి, మత్తులో మునిగి తేలుతున్న చాంద్ శరీరాన్ని అలంకరణల్ని కన్నారా చూడడానికి కూడా తీరుబడి ఉండేది కాదు. ఏదో ఒక తప్పని సరి పని మీద వెళ్ళవలసి వచ్చేది. అతడికి ఒక చూపు గడియారం మీద, రెండవ చూపు చాంద్ మీద ఉండేది. అతనేదో అప్పు తీరుస్తున్నట్టు గబగబా నవ్వుతూ చాంద్‌తో మాట్లాడేవాడు. తరువాత చాంద్‌ని ఆమె అభిమానుల గుంపు విడిచిపెట్టి వెళ్ళిపోతే ప్రపంచమంటే విముఖత్వంతో తన ముఖాన్ని చేతుల్లో కప్పేసుకునేది.

అదే తొందరపాటు - చంచలత్వంతో రెండు ముక్కలు మాట్లాడే అలవాటు కాంతికి అబ్బింది. ఆమె ఏ విషయాన్నైనా సరే పైకి కనపడే పద్ధతిని అతి తక్కువగా గమనించేది. ప్రతి విషయం అసలు రూపాన్ని వెతికేది. షాహీన్ గజల్‌తో వరుసగా వేసిన ప్రశ్నలకి బదులుగా తాను ఐవానే గజల్‌లో ఉండడానికి వీలు లేదని ఆమెకి తేలిసిపోయింది. తనకే ఇల్లూ లేదు, తల్లి తండ్రి లేరు. కనుక తను సిస్టర్ మేరీ ప్రతి మాట విని, మౌనంగా ఒప్పేసుకోవాలి, కాని సిస్టర్ మాట ఏదీ వినేది కాదు. ప్రతి రోజు షాహీన్ క్లినిక్‌కి వచ్చినప్పుడు, ఎన్నో అత్యాచారాలు సహించినట్టు మొహం పెట్టి కాంతి చేసిన అపరాధాల గురించి రిపోర్టు వినిపించేది మేరీ, 'ఈ పిల్ల నన్ను తిట్టింది. నా బీర్ బాటిల్ విరిచేసింది. రాత్రి అన్నం తినలేదు. మందు పారబోసింది. చీకట్లో ఒంటరిగా రోడ్డు మీదికి వెళ్ళిపోయింది...'

'సరే, నేనివాళ ఆమెపై కోప్పడతాను' కాని కాంతిలో ప్రవహిస్తున్న రక్తం కేకలేస్తే ఊరుకోదని షాహీన్‌కి తెలుసు.

వర్షాలు ప్రారంభమయాయి. హైదరాబాదులో వర్షాలు - నేటి సాయంత్రం వర్షం కురిస్తే రేపూ అదే సమయానికి ఎల్లుండి అదే సమయానికి వస్తుంది.

షాహీన్ బైటికి వెళ్ళాలనుకున్నాడు, కానీ ప్రతిసారి ఆకాశాన్ని చూసి తిరిగి వచ్చేశాడు. వరండాలో వున్న కుర్చీలో కూర్చుని, ఉదయం చదివిన దినపత్రిక మళ్ళీ చదవసాగాడు.

'సలామ్ డాక్టర్ సాహబ్ క్షేమమా?' షేఖూమియా పైకొచ్చి జాగీర్దార్లకు చేసినట్టు ఒంగి సలామ్ చేశాడు.

'ఓహో, షేఖూ భాయీ! ఇవాళీ వర్షంలో ఎక్కడినుంచి రాక?'

అతను గుడుంబా తాగి రాత్రి వస్తూండేవాడు. నౌకర్ల గదుల్లో రాత్రిళ్ళు పడుకుంటూండే వాడు. ఇంట్లోని ఏదో ఒక వస్తువు తీసుకుని పారిపోయేవాడు. అతడిపైన విధించిన ఆంక్ష ప్రకారం ప్రాంగణం వాకిలిదాకానే అతను రావచ్చును. షేఖూభాయీకి కూడా తన హద్దులు తెలుసు. అందుచేతనే ఎప్పుడైనా ఆకలేసినా, దాహం వేసినా కుంటత్తని పిలవలసి వస్తే గుమ్మం దగ్గరినుంచే అరుస్తూండేవాడు.

కాని ఈనాడు షేఖూభాయీకి వరండా దాకా వచ్చేందుకు అనుమతెలా లభించింది?

'ఇక చెప్పండి షేఖూభాయీ మీ రాజకీయపు పరిస్థితులెలా వున్నాయి?'

'ఏం చెప్పను డాక్టర్ సాహబ్! దేశంకోసం ఎన్ని కష్టాలనుభవించవలసి వస్తుందో మహమ్మదీయులెంత చితికి పోయారో పాపం, వారిని రక్షించాలి మనం.' షేఖూ భాయీ విజృంభించాడు. 'చూడు బాబూ, ఇప్పటికి పది కుంటుంబాలని వారి సంపాదనతో సహా పాకిస్తాన్ పంపించేశాను. ఒక్క అజీముద్దీన్ నవాబు పది లక్షల రూపాయలు తమతో తీసుకెళ్ళారు. ఇచ్చట బీదవారైన ముస్లీముల కోసం మేము క్యాంపులు ప్రారంభించాము. భారత ప్రభుత్వం నాకు వాటి కాంట్రాక్ట్ ఇచ్చింది. అందుకని షాహీన్-షాహీన్ బాబా మధ్య మనం దర్జాగా ఉన్నాం.'

'అరే, ఈ మాటల్ని వదిలెయ్ షేఖూభాయీ, ఇంకేవైన చెప్పు, ఈ మధ్య గుడుంబా ధర ఎలాగుంది?'

'హా, హా, హో! షేఖూ భాయీ నవ్వుతున్నాడు. ఏమిటి డాక్టర్ పాషా, షేఖూ భాయీ ఇవాళ కొత్త రుచి చూడు అని ఎప్పుడూ ఒక్క రూపాయన్నా ఇవ్వలేదు.

'మీరు ఆత్మహత్యా చేసుకోవడం నాకిష్టం లేదు. గుడుంబా మీకు విషం లాంటిది.'

'ఛోడో మియా, విషం ఎక్కడెక్కడుందో! విషం వ్యాపించకుండా మీరెలా ఆపగలరు?' షేఖూ భాయీ గజల్‌కేసి సైగచేస్తూ అన్నాడు,

'ఛోటే నవాబ్, మీ దేవిడీలోనే విషం వ్యాపించింది, దానికెలాగ చికిత్స చేస్తారు డాక్టర్ సాహిబ్?'

షాహీన్ కళ్ళెత్తి చూశాడు. గజల్ లోపలి గదిలో తలుపుని ఆసరాగా చేసుకుని నిలబడి ఉంది - ఏదో ఆలోచనలో మునిగి ఉంది. షాహీన్ ఆలోచించాడు. ఈ విషమంటే షేఖూమియాకి కూడా భయమేనా? ఈ విషం షేఖూ మియా జీవితంలో వ్యాపించింది, కుంటత్త యౌవ్వనాన్ని బూడిద చేసింది, బీబీకి ఆ జన్మ కారాగార శిక్ష విధించింది. చాంద్‌ని సమాధిలో పడుకోబెట్టింది, ఇప్పుడిక గజల్ రూపంలో ఐవానే గజల్‌లో ప్రవేశించింది. ఈ విషం ఎక్కడి నుంచి వచ్చింది? షాహీన్ డాక్టర్ బుర్ర, ఐవానే గజల్‌ని కదిలించి పారేసిన ఆ కారణాన్ని వెతకడం ప్రారంభించింది. ఈ భవనంలో ఏదో జరుగుతూంది, అది ఇక్కడి స్త్రీలకి జీవితం పట్ల ఎప్పుడూ విముఖత కలిగిస్తూ వచ్చింది. ఐశ్వర్యం - షాహీన్ భూమి పొరల్లో ఏదో వెతుకు- ఆలోచించాడు - సంపద, దక్కను జాగీర్దారుల పాలిటి అమృతం, విషము కూడా. వారు జీవితాంతం ఈ అమృతాన్ని తాగారు. దాని ఒక్క గుటక చివరికి వారి ప్రాణాలు తీసింది. ఐవానే గజల్‌లో నివసించిన వారు ఐశ్వర్యాన్ని పెంచారు. సంపదతో మహాళ్ళు కట్టించారు. ఐశ్వర్యపు షామియానాలు తమ సమాధులపై ఏర్పాటు చేసుకున్నారు. కాని ఐవానే గజల్లోని పెద్ద హాలు బైతుల్ గజల్‌లో పెట్టబడిన ఫొటోల్లోని ఆ పెద్ద మనుషులు ఐశ్వర్యవంతులు కాదు, కేవలం కవులు మాత్రమే! కవిత్వం, అది జీవితమంతా వారిని అశాంతికి గురి చేసింది. వారు ప్రేయసి భావ భంగిమలకై తమ జీవితాన్నే పణంగా పెడుతూ వచ్చారు. హృదయంతో పాటు ప్రాణాల్ని కూడా ఆమెకు అర్పిస్తున్నామని ప్రతి ప్రేయసికీ చెప్పారు, ఆమె కొరకు నమ్మకంతో కూడిన ప్రేమ కానుకలు తీసుకొస్తున్నామని చెప్పారు, కళ్ళల్లో ఆశ్చర్యాన్ని నింపుకుని పాపం ఎదురు చూస్తూ నిలబడి ఉంది ఆమె.

నేడు గజల్ ముఖంలో ఒక అపూర్వ సమ్మోహనా శక్తి గోచరిస్తూంది, బల్లెపు ములుకులులాగ సూటిగా గుండెల్లో గుచ్చుకునే ఆకర్షణ. అప్పుడెందుకనో, షాహీన్‌కి, గజల్ ఒకసారి చాంద్ ఆపాలా కనిపిస్తూంది, మరోసారి బీబీలాగా... ఏదో ఉంది... అది చూసిన తరువాత

ప్రపంచమంతా చీకటి మయంగా కనబడుతూంది. నేడు షాహీన్ కళ్ళకేమో అయింది, అతని శరీరంలో ప్రవహిస్తున్న రక్తం ప్రభావం కావచ్చు లేదా యూరోప్‌లో అయిదు సంవత్సరాలు గడిపిన అతను, ఆడదాన్ని, అందులోని అన్ని రుచులు చవిచూసినవాడే!

అతడు తన తాతముత్తాతల్లాగా అందాన్నొక్కసారి చూసి కవితల పుస్తకం నింపడానికి ఉపక్రమించేంతటి తీరని కోరికలతో మగ్గిపోలేదు. కానీ గజల్‌లో ఏదో ఆకర్షణ, మగవాడి శరీరంలో విషంలాగ వ్యాపించే, ఏదో... ఉంది.

నసీర్ చాచా పాపం ఆమెని చాలా మోసం చేశాడు. ఆమె కోరుకున్న పురుషులంతా ఆమెను మోసగించారు.

చిన్నప్పుడు గజల్ ఎంత ఉత్సాహంగా వాగుతూండేదంటే, అందర్నీ నడిపించే షాహీన్ ఆమె ముందు ఓడిపోయేవాడు. షాహీన్‌కి రంగురంగుల ఫోటోల కథల్ని నమిలే సులువైన మార్గాలు నేర్పిందామె. కాలువలు దాటడం, తినుబండారాలు దొంగిలించడం, తండ్రి ముందు అబద్ధం చెప్పడం - అన్నీ నేర్పింది. షాహీన్‌కి పాత రోజులు గుర్తుకు రాసాగాయి. టిఫిన్ చేసే టేబుల్‌పైన కూర్చుని ఇష్టమొచ్చినంత దిగమింగిన తరువాత కింద పడ్డ అన్నం ఏరుకుని తినేది గజల్. కాని ఇప్పుడు, ఎప్పుడు చూసినా కన్నీళ్ళు తుడుచుకుంటూ కనబడుతూంది. చిన్నప్పట్నించి గజల్‌ని చిరెత్తించడం, ఏడిపించడం అలవాటు షాహీన్‌కి. కాని మాటలతో ఎదుర్కోడానికి బదులు నిట్టూర్చి మొహం తిప్పేసుకుంటోంది.

'మీరు కంగారు పడకండి డాక్టర్ సాహబ్, ఈ విషాన్ని మింగడానికి నేనిప్పుడు సిద్ధంగా ఉన్నాను.' అతనావిధంగా ఆలోచనల్లో మునిగి ఉండడం చూసి షేఖూ భాయీ అన్నాడు. 'నాలుగు తగిలిస్తే సరి, ఒక్క రోజులో దారికొస్తుంది.'

'ఎవరు? షాహీన్ ఉలిక్కిపడి అడిగాడు.

'ఇదే గజలా బేగమ్. పోనీలే కదా అని నేను చేసుకుంటున్నాను. ఏం చెయ్యను? రాషిద్ నవాబు తలమీది బరువు తగ్గించాలి కదా?'

'గజల్‌ని మీరు పెళ్ళి చేసుకుంటున్నారా?' షాహీన్ ఆశ్చర్యపోయాడు.

'అసలు విషయమేమిటంటే, నాకు ఇష్టం లేదు, రాషిద్ ఆ రోజన్నారు.

కాదనడమెలా... మీరే చెప్పండి?'

షేఖూఖాంటూ వెళ్ళిపోయిన తరువాత, అతడు తిన్నగా తల్లి దగ్గరికెళ్ళాడు.

'అమ్మీ, ఫౌజియాని పిలిపించండి. కొన్నాళ్ళుంటుంది. గజల్ మౌనం వల్ల నాకింట్లో ఉండాలనిపించడం లేదు!'

'ఇంక నీ భార్య తోటే కులాసాగా గడపాలి, బాబూ!' కుంటత్త కళ్ళు తిప్పుతూ, హావభావాలు ప్రదర్శిస్తూ అంది. కుంటత్తా విధంగా మాట్లాడే అవకాశాలు చాలా తక్కువగా కలిగేవి. ఎటువంటి చందమామలాంటి పెళ్ళికూతుర్ని వెతుకుతున్నానంటే, ముఖం చూస్తూ కూర్చోవాల్సిందే!

'అయ్యో! కేవలం చూడడానికి మాత్రమే ఉపయోగపడే పెళ్ళి కూతురై ఉంటుంది...! అమ్మీ నాకోసం పెళ్ళి కూతుర్ని ఎంపిక చేసే పని కుంటత్తకి అప్పచెప్పద్దు ముఖం చూస్తూ కూర్చోవడానికే అయితే, నేను గజల్ బొమ్మ చేయించుకుంటాను' ఈ మాటకంతా నవ్వేశారు. గజల్ మాత్రం మరింత గంభీరంగా మిషిన్ మీదబడి తన సారెకి సంబంధించిన బట్టలు కుట్టసాగింది.

'కాకపోతే ఏమిటి ఒక రాతి బొమ్మలాగ మారిపోతూంది.'

ఒక అందమైన అమ్మాయిని చూస్తూన్నప్పుడు పురుషులు మూర్ఖులైపోతారు. కొంచెం గమనించండి తెలుస్తుంది. ఇంత పెద్ద వాన, తుఫానులాంటి హోరుగా ఉన్న మధ్యాహ్నం, ఆడదాన్ని వెయ్యిసార్లు డిసెక్ట్ చేసిన అనుభవజ్ఞుడైన డాక్టరు, కాని గజల్లో ఏదో ప్రత్యేకత కనబడుతూండడం వల్ల, గజల్ గురించి నిర్విరామంగా రెండు గంటల నుంచి మాట్లాడుతున్నాడు. అది కూడా చూపులు గజల్పై మాత్రమే నిలిపి మాట్లాడుతున్నాడు. మిషన్పై కుడుతూన్న ఆమె అందమైన చేతులపైన, మూసుకున్న పెదవులపైన బాధగా ఉన్న కళ్ళపైన, తైల సంస్కారం లేక వదలిపేసిన, జుట్టుపైన - ఇవన్నీ ఆమె ముఖాన్ని మరింత మనోజ్ఞంగా తయారుచేశాయి, దృష్టి నిలిపి మాట్లాడుతున్నాడు.

ఆనాడు పాపం గుండె నొప్పి, రక్తపుపోటుతో రోగులు గంటల తరబడి మూలుగుతూనే ఉన్నారు. క్లినిక్‌లో, పొద్దుటి పేపర్ అలానే పడుంది. రాషిద్ మాటి-మాటికీ లోపలికి - బైటికీ తిరుగుతూ, రోగులు ఎదురు చూస్తూంటారు. ఇంత పేరు ప్రఖ్యాతులున్న డాక్టరుకి పోచుకోలు కబుర్లతో

వృధాగా రెండు గంటలు కాలక్షేపం చెయ్యడానికవకాశం ఉంటుందా? రాత్రి పదకొండు గంటలకి రోగుల్ని చూసి షాహీన్ ఇంటికొచ్చేసరికి, షేఖూభాయికోసం, భోజనం టేబుల్ మీద పెట్టి మేలుకొని కూర్చొని ఉంది గజల్. షేఖూ వచ్చి భోజనం చేసేవరకూ గజల్ మేల్కొనే ఉండాలని కుంటత్త ఆజ్ఞ జారీ చేసింది.'

'ఈ మధ్య షేఖూభాయికి చాలా మర్యాదలు జరుగుతున్నాయి. స్వర్గంలో భవనం రిజర్వ్ చేయించుకోవాలనుకుంటున్నావా ఏమిటి?'

ఇది వింటూనే బల్లపైకి ఒంగి గజల్ ఏడవడం మొదలెట్టింది. అంతా నిద్రపోయారు. వాన, చలి వల్ల కుంటత్త కూడా తన గది తలుపులు మూసేసుకుంది. బైట వర్షం జోరుగా కురుస్తోంది. ఇప్పుడు షేఖూ భాయీ ఏ కాలువలోనో స్పృహ తప్పి పడుంటాడు. ఆ విషయం ఎవరికీ తెలియలేదు, లేకపోతే గజల్ ఏడవడం షాహీన్ మొట్ట మొదటి సారి ఆమెని తన చేతులతో పొదివి పట్టుకుని బోధపర్చడం, వీటన్నింటికీ - ఎంత గొడవ జరిగేదో, గజల్ వంటి తిరుగుబోతు అమ్మాయిల విషయంలో అతను ఆలోచించనక్కర లేదని మధ్యాహ్నమే రజియా కేకలేసింది.

'కాని నాకొక విషపు ఇంజక్షన్ ఇచ్చెయ్యి షాహీన్ భాయీ! నీకు నాపైన కొంచెమైనా సానుభూతి ఉంటే నీ క్లినిక్ నుంచి కొంచెం విషం తెచ్చిపెట్టు.'

'కాని ఎందుకు గజ్జో... నువ్వేం అపరాధం చెయ్యలేదు. నిన్ను, చాంద్ ఆపాని ఇంట్లో వాళ్ళే, చంపారని నాకు తెలుసు.

'లేదు నన్నెవరూ చంపలేదు. తన భుజం మీద నుంచి షాహీన్ చెయ్యి తొలగించి, అంది, నేనే చచ్చిపోదామనుకుంటున్నాను.

'ఎందుకని? ప్రపంచాన్ని చూసి భయపడుతున్నావా? షాహీన్ చేతులిప్పుడు, కన్నీళ్ళతో నిండిన ఆమె బుగ్గలపై ఉన్నాయి.

'ఈ ప్రపంచం అంటే భయపడడానికి, ఇంకా నన్ను నాశనం చెయ్యడానికి ఏం మిగిలుంది కనుక? నాకు కేవలం షేఖూభాయీ అంటేనే భయం, ఇలా అంటూండగానే ఆమె స్పృహ తప్పుతున్నట్లనిపించింది.

ఆమెను తన చేతుల్లో ఎత్తుకుని ఆమె బల్ల మీద పడుకోబెట్టి ఇంజక్షన్ ఇచ్చాడు, గది తలుపులు మూసి తన గదిలోకెళ్ళిపోయాడు.

మరునాడు గజల్‌లో పెను తుఫానే వచ్చింది. షాహీన్ తన వ్యక్తిత్వపు ప్రత్యేకతనంతా కూడదీసుకుని డైనింగ్ టేబుల్ దగ్గిర, గజల్ వివాహం షేఖూభాయీతో జరుగనివ్వనని నొక్కి చెప్పాడు.

'నువ్వింకా కుర్రాడివి! ఇంటి వ్యవహారాలు నీకేం తెలుసు? ఏది మంచిదనిపిస్తే, మేమదే చేస్తాం! రజియా కూడా షాహీన్‌కి తల్లే కదా! చాలా గొప్ప తండ్రికి కూతురు, ఐవానే గజల్‌కి మహారాణి.

'మీరలా చెయ్యలేరు.'

రజియా చేతిలోని ముద్ద జారిపోయింది. రాషిద్ నువ్వులు బియ్యం కలిపినట్టున్న తన జుట్టుని ప్రక్కకు తీసి షాహీన్‌ని చాలా జాగ్రత్తగా పరిశీలించి, రొట్టెని చాలా ముక్కలు చేసి పారేశాడు. అతడు షాహీన్ ఈ రూపాన్ని మొట్టమొదటిసారిగా చూస్తున్నాడు.

'ఒకవేళ మీరు షేఖూభాయీకి గజల్‌నిచ్చి పెళ్ళిచేసినట్టయితే నేను గజల్‌కి విషం ఇచ్చేస్తాను.

'నువ్వింకొకసారీ విషయంలో కల్పించుకున్నావంటే, నేను విషం మింగేస్తాను.' రజియా కూడా కోపంతో గర్జించింది. అంతా మౌనం వహించారు. కట్టెల్ని ఊదుతూ కారుతున్న కన్నీళ్ళని తుడుచుకుంటూ పరాఠాలు కాలుస్తోంది గజల్, డైనింగ్ టేబుల్ దగ్గిర చెలరేగిన పెనుతుఫాను సంగతి ఆమెకి తెలియనే తెలియదు.

విషయం ఇంత దూరం వస్తుందని షాహీన్ ఊహించలేదు. అందుకు కారణం, అతడింతవరకు తల్లిదండ్రులతో ఎప్పుడూ ఈ విధంగా మాట్లాడి ఉండలేదు. తల్లి ముందు తలవంచడం, ఆమె ప్రతిమాటకి తల ఊపడం ఆ ఇంటి ఆనవాయితి. అటువంటి పద్ధతి ఉన్నప్పటికీ, వెయ్యిసార్లు అనుకుని కూడా తల్లిని క్షమాపణ కోరలేదు.

రజియా తన గదిలో పడుకుని దుఃఖిస్తోంది. తల్లీ కొడుకుల మధ్య రాషిద్ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. కొడుకు ప్రవర్తన అతన్ని గాయపరిచింది. అయినప్పటికీ భార్య ఎడల పక్షపాతం లేకుండా ముందుచూపు కనబర్చలేదు.

ఆనాడు క్లినిక్ పని ముగించుకుని షాహీన్ మధ్యాహ్నం భోజనానికి ఇంటికి రాలేదు. సాయంత్రం క్లబ్‌కి వెళ్ళిపోయాడు. రాత్రి పన్నెండింటికి

ఇంటికి వచ్చినప్పుడు, కుంటత్త ఎంత బ్రతిమాలినా అతను భోజనం చెయ్యలేదు.

కొడుకు ప్రవర్తన చూసిన రజియా తనే ఓటమి నంగీకరించింది. మెల్లిగా తను చేసిన తప్పు మర్చిపోయాడు షాహీన్, రజియా కూడా మామూలుగానే అతను హాస్పిటల్‌కి వెళ్ళేటప్పుడు ఆపి, అడిగేది, మధ్యాహ్నంకి ఏం చేయించను?

ఇవాళేం తినాలి, ముందే ఆలోచించుకున్నట్టు అతడేవో పేర్లు చెప్పేవాడు.

ఇంట్లోని వాళ్ళీ విధంగా నిశ్శబ్దంగా ఉండడం చూసి గజల్ కొంచెం జాగ్రత్తగా మెలుగుతూంది. కాని ఈ మధ్య అన్ని విషయాలు పట్టించుకోవడం మానేసిందామె. అందుచేత అస్తమానం పొయ్యి దగ్గరే వుండడం మొదలెట్టింది. అక్కడ పని అయిపోతే ఇల్లు శుభ్రం చేస్తూండేది. ఇల్లంతా కడిగేది. కుంటత్త తల్లో పేలు చూస్తూండేది. ఇల్లంతా వందలాది అభిమానుల హృదయాలను జయించిన ఈ రంగస్థల అప్సరస ఒక్కచూపు చూస్తే కంపించిపోయే సర్‌వార్ ప్రపంచంలోని బాధలన్నిట్నించి రక్షిస్తూ తన ఊహాలోకపు మహారాణిగా ఊహించుకుంటున్న గజల్‌ని ఇప్పుడు చూస్తే అస్సలు నమ్మేవారు కాదు.

రజియా ఇంటి పరిస్థితుల్ని చూసి షాహీన్ పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభం చేసింది. ఆనాటి నుంచి గజల్‌తో కూడా కటువుగా వ్యవహరిస్తూంది. ఆమె నాలుగు సార్లడిగితే ఒక్కసారి తన జవాబు లభించేది.

కాని షాహీన్ మాత్రం హాయిగా ఉన్నాడు. సాయంత్రం క్లినిక్ నుంచి ఇంటికొచ్చేసరికి అతని జేబులో ఒకప్పుడు టాఫీలు, మరోసారి చాక్‌లెట్లు, ఇంకొకప్పుడు పుల్లటి రేగుపళ్ళు ఉండేవి. ఎవరూ చూడకుండా ఆ పొట్లం గజల్‌కేసి ఎగరేసేవాడతను. ఎప్పుడైనా షాహీన్ తన గదిలో పడుకుంటే, ఆ గదిలో ఇంకెవరైనా కూడా ఉన్నారేమో అనిపించేది రజియాకి, అప్పుడు ట్రాన్సిస్టర్‌లో ఏదో ఒక నాటకం వింటున్నాడని జ్ఞాపకం వచ్చేది.

మధ్యాహ్నం షాహీన్ ఇంటికి భోజనానికి వచ్చేసరికి హాల్లో అన్ని వైపులా రంగు రంగుల బట్టలు, చెమ్కీ అంచులు మెరుస్తున్నాయి. రజియా, కుంటత్త కలిసి బట్టలు కుడుతున్నారు. గజల్ నల్లటి ముఖమల్ పైన

టికలీలు కుడుతూంది.

షాహీన్ ఇటు చూశాడు. గజల్ ఇప్పటి వరకూ చమ్కీ కుడుతూంది.

రాత్రి అతను క్లినిక్ మూసిన తరువాత ఇంటికొచ్చేసరికి అలవాటు ప్రకారం అంతా నిద్రపోతున్నారు. గజల్ గదిలో మాత్రం దీపం వెలుగుతూంది. షాహీన్ మెల్లిగా తలుపు తెరిచి లోపలికి చూశాడు. గజల్ చేతిలో సగం కుట్టిన బట్ట ఉంది. కాని ఆమె ఏడుస్తోంది. షాహీన్ మెల్లిగా తలుపు మూసేసి, గజల్ దగ్గరికెళ్ళి కూర్చున్నాడు.

'నువ్వు నీ కన్నీళ్ళ ఖజానానెక్కడ దాచి ఉంచావు గజల్? నువ్వేడుస్తూండడం పదిహేనేళ్ళనుంచి చూస్తున్నాను.'

గజల్ ఏం మాట్లాడలేదు. చేత్తో పట్టుకున్న సూదిని తన వేళ్ళలో గుచ్చుకుని రక్తం పైకి తెప్పిస్తూంది. షాహీన్ తన దగ్గిర కూర్చోవడం చూసి ఆశ్చర్యపోయింది.

'షాహీన్ నన్ను షేఖూభాయీని పెళ్ళిచేసుకోనియ్యి, లేకపోతే ఈ కుక్క ముట్టిన కూడెవరు తింటారు? నేనెంత కాలమని ముమానీ బేగమ్ నెత్తిన కూర్చోగలను?' కానీ షాహీన్ ఏమీ వినలేదు. అతడు గజల్ని చూస్తున్నాడు. అతడాలోచిస్తూన్నాడు - ఐవానే గజల్లో నివసించిన వారంతా నిరపరాధులే. వారు స్త్రీ సౌం ర్యంలో కొవ్వొత్తులల్లాగ కరిగిపోయారు, ప్రేమించడం తప్ప వేరే పనేమీ చెయ్యలేదు వారు. ఐనప్పటికీ ఐవానే గజల్ పుస్తకాలయంలో పెట్టిన డెబ్భైఅయిదు కవిత పుస్తకాలు పరిపూర్ణత్వాన్ని సంతరించుకోలేదు. చెప్పడానికి వాటిలో ఇంకా చాలా మిగిలి ఉంది. ఛామనిఛాయి, పొడిగా ఎగురుతున్న జుట్టు గురించి, షాహీన్కి కూడా తాతగారిలాగ కవిత్వం చెప్పాలని మనసు ఉవ్విళ్ళూరింది. గజల్లో ఏదో విచిత్రమైన మత్తులాంటిది ఉంది కనుకనే, సాహితీపరమైన వివిధ విధానాల్లో ఇది కవుల హృదయాల్లో మకుటాయమానంగా భాసిల్లిందని అతనికి అర్థమైంది. ప్రతి యుగంలో కవులు దాన్ని గుండెలకి హత్తుకున్నారు... దాని గురించి తప్పక రాసి తీరాలనుకున్నారు. ఆ కొద్ది క్షణాల్లో షాహీన్ కూడా గజల్కి నాజూకైన పేర్లు పెట్టాడు. చాలా అందమైన వాటితో పోల్చాడు... అనుభూతులు ఎన్ని సముద్రాలని దాటో... దారిలోని ఎన్ని పర్వతాల్ని లంఘించాలో... అప్పుడతను రొప్పుతూ అన్నాడు,

గజల్ ఒక వేళ నేను నిన్ను వివాహం చేసుకోవాలనుకుంటే నువ్వు ఒప్పుకుంటావా!'

ఈసారి గజల్ చెయ్యి మరింతగా కంపించి సూది అరచేతిలో గుచ్చుకుపోయింది. షాహీన్‌కేసి బాధగా చూసింది. షాహీన్ తనని నిర్దాక్షిణ్యంగా గాయపరిచినట్లు అతన్ని నఖశిఖపర్యంతం చూసింది. కత్తితో ఒక్కవేటు వేసినట్లు బాధపడుతూ వణుకుతున్న చేతులతో, షాహీన్‌ని దూరంగా నెట్టివేస్తూ అంది, 'వద్దు, వద్దు అలా చెయ్యొద్దు.' చేతులతో చెవులు మూసుకున్నప్పుడు అరిచేతుల్లోంచి, నెత్తుటి బిందువులు ఆమె బుగ్గలపై పడసాగాయి.

'నేను ఈ నాటకం ఆడి - ఆడి విసిగిపోయాను, నన్నింకా ముక్కలు చెయ్యొద్దు... వెళ్ళిపో ఇక్కడ్నించి వెళ్ళిపో షాహీన్!'

షాహీన్ ఆమె చేతులు పట్టుకుని కోపంగా అన్నాడు, నీ అందాన్ని చూసుకుని గర్వపడడం మానెయ్యి! నువ్వు డ్రామా రిహార్సల్ చెయ్యడానికి నేనేమీ బిల్‌గరామీని కాను! తరువాత ఆమె బుగ్గలపై అంటుకున్న రక్తాన్ని తుడిచేశాడతను.

ఆమె కళ్ళెత్తి చూసింది. షాహీన్‌ని చూసింది. అలా చూస్తూనే ఉంది. అతని ముఖంలో ఎలాంటి పొగడ్తగానీ బ్రతిమాలడం కాని కనపడలేదు. అతడు చాలా అభిమానవంతుడిలాగా ధైర్యం ఉన్నవాడిలా కనబడ్డాడు. అప్పుడు గజల్ కనుక తిరస్కరిస్తే వీపుమీద రెండు తగిలించేట్టు వున్నాడు.

'నేను నసీర్‌లాగ ప్రేమ నటించడం లేదు. నాకు నీమీదే ప్రేమ గీమ లేదు తరువాత సంగతి చెప్పలేను!

అతడు బైటికి వెళ్ళిపోయాడు.

ఇతడు షాహీన్! రక్తం నిండి ఉన్న తన అరచేతిని నొక్కుకుంటూ ఆలోచించింది గజల్. షాహీన్ కూడా తనని స్త్రీగా భావిస్తున్నాడన్న విషయాన్నెప్పుడూ గమనించలేదు గజల్. తను షాహీన్ ఉనికినేనాడు పట్టించుకోలేదు. ఆమె దృష్టిలో షాహీన్ ఎప్పుడూ అమాయకుడు - మూర్ఖుడు కొంచెమైనా ఆలోచించాలి కదా! ఇంత పెద్ద డాక్టరు ఐవానే గజల్ యజమాని కొడుకు మూర్ఖుడు!

'నాకు నీ మీద ప్రేమ గీమా లేదు. తరువాత సంగతి చెప్పలేను!

అయితే... తరువాత సంగతి నేను చెబుతాను. ఇప్పుడే, ఈ క్షణంలోనే... ఆమె లేచి షాహీన్ గదికేసి పరుగెత్తింది.'

పాపం కుంటత్త జానమాజ్‌పైన కూర్చుని ఎంతో తన్మయత్వంతో తన ఆదర్శపు సూర్యుడ్ని మేల్కొల్పమని ప్రార్థిస్తుంది. వాహిద్ హుసైన్ మనుమడు, రాషిద్ కొడుకు కూడా ఎంగిలి కూటికై ప్రాకులాడుతాడన్న విషయం ఆమెకు తెలియనేలేదు.

తెల్లవారింది, గజల్ నవ్వుల సవ్వడికి అంతా మేల్కొన్నారు. ప్రాంగణంలో మెల్లిగా పాడుతూ తిరుగుతుంది ఆమె... 'జాగో, మోహన్ ప్యారే జాగో...!'

పొద్దున్నె బాదంపప్పులతో హారీరాచేసి రాషిద్ మేల్కొన్నారు. రాషిద్ కివ్వడానికి బదులు తన తడి జుట్టు విరబోసుకుని అద్దం ముందు కూర్చుని, చాంద్ ఆపా మేకప్ సామాను ఉన్న డబ్బా తెరిచింది. ఇవాళ కూడా గజల్ కాళ్ళ దగ్గర కూర్చుని కాంతి అడుగుతూంది. 'ఆంటీ! ఇవాళ మీరు మీ మొహాన్నెందుకు ఎర్రగా చేసుకుంటున్నారు?'

రజియా ఆమె సారె కోసమని మూడు నాలుగు జతలు బట్టలు కుట్టించింది. అందులోంచి ఆకుపచ్చ చీర తీసుకుని కట్టేసుకుంది.

కాని తన సమస్యలతో సతమతమవుతున్న రజియాకి గజల్‌లో వచ్చిన మార్పు గమనించేటంతటి తీరిక లేకపోయింది.

ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించి ఉండేది. ఎండాకాలపు మొదటి తీవ్రమైన గాలి ప్రతి వస్తువుని కదిపేస్తూన్నట్టుంది. చెట్లనుంచి పండుటాకులు రాలిపోతున్నాయి. సపోటాలు పండుతున్నాయి. మామిడి చిగుళ్ళ సువాసనలు అన్ని వైపులా వ్యాపిస్తున్నాయి.

కె.ఎమ్. మున్షీ ఇండియన్ యూనియన్ ఏజెంటు అయి అధికారాలన్నీ హస్తగతం చేసుకున్నారు. కొద్ది నెలల క్రితమే గాంధీగారు హత్యగావించబడ్డారు. అందువల్ల అన్ని వైపుల భయం, అశాంతి వ్యాపించింది. ఇత్తెహాద్-ఉల్-ముసల్మాన్ నాయకులు కొందరు రాత్రికి రాత్రే పారిపోయారు. కాసిమ్ రిజ్వీ జైల్లో ఉన్నారు. లాయర్ అలీని ఇంటిలోనే బంధించి వుంచారు.

అప్పుడు రాషిద్ అతని తోటివారు, కాంగ్రెస్ ప్రభుత్వం ఎడల

తమకుగల భక్తిని వెయ్యి విధాలు నిరూపించడానికి ప్రయతించారు. అయినప్పటికీ జాగీర్లు, అధికారాలు పోయాయి. వారు గాభరాపడి ఎదురు తిరగడం గురించి ఆలోచించేవారు... కాని ఎదురు తిరగడమెలా?

ఎటు చూసినా బాధలు కన్నీటి గాథలు. గాంధీగారి సూచన మేరకు తమ బిరుదుల్ని, జాగీర్లని వదిలేసిన వేలాది జనం ఉరిశిక్షలు, కఠిన కారాగార శిక్షలకి గురి అయారు. వాళ్ళకి నిర్ణీత కాలం ముందుగానే పెన్షను లభిస్తోంది. చాలామంది చిన్నపెద్ద క్లర్కులు, పోలీసు ఆఫీసర్లు, ముఖ్యమైన పదాధికారులని బలవంతంగా వారి పదవులనుండి తొలగించడం జరిగింది. ఇటువంటి ఈ స్వార్థం నిండి ఉన్న పరిస్థితుల్లో ముందు - ముందు ఏం జరగనున్నదో అని ప్రతి వ్యక్తీ ఆలోచిస్తున్నాడు. రాషిద్ అన్ని విధాలా ప్రయత్నిస్తున్నాడు. కమ్యూనిస్టు పార్టీపై ఆంక్షలు విధించారు. మఖ్దూమే అతని అనుచరులు అండర్ గ్రవుండ్‌లోనికి వెళ్ళిపోయారు.

ఇలాంటి పరిస్థితుల్లోంచి బైటపడి ఎక్కడికి వెళతాడని షాహీన్ ఆలోచిస్తూండేవాడు.

రాషిద్ అభిప్రాయాలన్నిటినీ, షాహీన్ త్రోసిపుచ్చాడు. అతను పాకిస్తాన్ వెళ్ళడు. అమెరికా వెళ్ళి డబ్బు సంపాదించడు. ధనార్జనలో అతనికేవిధమైన ఆసక్తి లేదు. తన తండ్రి తాత సంపాదించిన డబ్బు ఐవానే గజల్ రూపంలో నలువైపులనుంచి వారిని చుట్టుముట్టి ఉంది. అన్ని వైపులనుంచి అలాగే బంధాల్లో ఉన్నప్పుడు, ఇంక పారిపోయే ప్రయత్నమెందుకు చెయ్యాలి? కనుక షాహీన్ హైదరాబాదులోనే ఉండ దలుచుకున్నాడు. రాజకీయ సాంఘిక ఆందోళనలన్నింటికీ దూరంగా వైద్యపరమైన పరిశోధనల్లో కాలం గడపాలన్నది అతని అభిమతం. హైస్కూల్లో చదువు రోజుల్లో ముఖ్దూమ్ వ్రాసిన రోమాని కవితలతనికి చాలా నచ్చేవి. అతడు సైన్సు, పుస్తకం పట్టుకుని ఎప్పుడూ పాడుతూండేవాడు.

ఒకనాడొక స్థానిక పత్రికలో అతడు 'ముఖ్దూమ్ యొక్క కొత్త కవిత చూశాడు. అది జైల్లోని ఊచలు ఊడపెరికి హైదరాబాదు మొత్తం ప్రతిధ్వనిస్తూంది.

ముఖ్ధూమ్ వ్రాసిన ఇటువంటి కవితల వల్ల షాహీన్‌వంటి మంచి చదువుకున్న యువకులు పరిస్థితులతో రాజీ పడడానికి బదులు నలువైపులా

మార్గాలనే అన్వేషిస్తుండేవారు. అవసరాలు, తప్పనిసరి పరిస్థితుల వల్ల చాలా పద్ధతులు విడనాడారు. దేవిడీల నుంచి పరదాలున్న కార్లలో జట్కాలలో తిరిగే అమ్మాయిలు బస్ స్టాండ్‌లోని క్యూలో నిలబడి కనబడుతున్నారు. ప్రతి ఇంటిలోని ఆడపిల్ల ఇప్పుడు స్కూల్‌కెళుతూంది. మూసి ఉన్న గదుల్లో తివాసీ మీద తంబూర పట్టుకుని ఉండే నవాబు ఇప్పుడు రేడియో స్టేషన్ నుంచి దాదార్రా, టుమ్రీలు పాడుతున్నారు. హవేలీలు వేలం వేయటం జరుగుతూంది. కార్ల, ఇళ్ళ ధరలు పడిపోయాయి. దూల్హా నవాబు రిక్షా తొక్కుతున్నారు. మిస్కీన్ అలీషాహ్ మనుమరాలు ముఖానికి రంగులు పులుముకుని, శరణు ఇస్తానని మాటిచ్చిన ప్రతివాడికి, కన్న తండ్రి పోగొట్టుకున్న అలిఫ్‌లైలా తిరిగి ఇప్పిస్తానని నమ్మించిన ప్రతి పురుషుడితో ప్రేమనభినయించడానికి సిద్ధంగా ఉంది. షాహీన్ డబ్బు పోగు చేసుకునే బదులు హాస్పిటల్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. ఇప్పుడతను హైదర్‌గూడాలో ఒక చిన్న క్లినిక్ స్వంతంగా ఏర్పాటు చేస్కున్నాడు. వాళ్ళకి పెళ్ళిళ్ళకోసం తన జేబులోని డబ్బు ఇచ్చేవాడు, అవసరమున్న ఏ వ్యక్తి అయినా అతని ముందుకొచ్చి నిలబడితే వెంటనే గజల్‌కి పెళ్ళి చేసుకుంటానని ఆఫర్ చేసినట్లు, జేబులు తడువుకునేవాడు. అతడు ఐరోపా మొత్తం చూశాడు. తల్లీ, గజల్ అనుకుంటున్నంతటి మూర్ఖుడేం కాడతను.

కాని అకస్మాత్తుగా గజల్‌లో అతనికి ఏమేం ప్రత్యేకతలు కనబడ్డాయో అతనింకేమీ ఆలోచించలేదు. గజల్ తనతో సహకరిస్తుంది. తనతో పాటు నవ్వగలుగుతుంది. అంతే! అటువంటప్పుడు ఆమె గతం గురించి నేనెందుకు పట్టించుకోవాలి? పాపం చిన్నప్పట్నుంచి ఛీత్కారాలు మాత్రమే పొందిన బీదపిల్ల. ఇటువంటి పిల్లలు ప్రతి దేవిడీలోను ఉంటారు. ప్రతి బంగళాల్లోంచీ వస్తున్నారు. ఏ అపరాధం లేని తమ కుటుంబాలని నిలిపేందు కోసం ఎన్నో మార్గాలు అన్వేషించవలసి వస్తూంది. స్టేజిపైన నటించడం, ఆఫీసుల్లో గుమాస్తాలుగా, స్కూల్ టీచరుగా పనిచెయ్యవలసి వస్తూంది. లేకపోతే క్లబ్బుల్లో పార్టీల్లో ఫ్యాషనబుల్ స్త్రీగా మెరిసిపోతూ, ఒకప్పుడు రాషీద్ జీవితానికి కావలసినది సమకూర్చేది, మరొకప్పుడు హుమాయూన్ జీవితానికి తిండి - బట్టలు సమకూర్చేది, మరొకప్పుడు హుమాయూన్

సమస్య తీరిపోయేది.

కొడుకు ప్రవర్తన రాషిద్‌కి బాధ కలిగించింది. ఇటు ఫౌజియా వలన కూడా, అతనికి సౌఖ్యం లభించలేదు. తను పెళ్ళి చేసుకోవడం విషయంలో తొందరపడ్డానని తనకి కట్నం రూపంలో డబ్బై అయిదు వేల దాకా లభించేదని, తను నష్టపోయినట్టు, భర్త మాటి - మాటికి ఫౌజియాతో అంటుండేవాడు.

ఈ పరిస్థితులు రాషిద్‌ని చాలా తొందరగా ముసలివాణ్ణి చేశాయి. అన్ని వైపుల నుంచి కలిగే బాధలు, ఆలోచనలు, కష్టాలు ఇబ్బందులు ఒంటరిగా అనుభవిస్తున్నాడతను. అతడి కొడుకు తండ్రి ఇబ్బందుల్ని అర్థం చేసుకునే వాడు, కాని నిత్యం డబ్బు సంపాయించే ప్రయత్నాల్ని విరమించమని సలహా ఇస్తున్నాడు. నాకొక్కడికి ఎంత కావాలి? అని ప్రశ్నించేవాడు.

ఓర్చుకుని, ఓర్చుకొని రాషిద్‌కి గుండె జబ్బు పట్టుకుంది.

'ఒకనాడు బలవంతంగా పరీక్ష చేసాడు, ఎన్నో టెస్ట్‌లు చేశాడు. రక్తపోటు పరీక్ష చేసి కంగారు పడుతూ అన్నాడు, డాడీ, మీకు బ్లడ్‌ప్రెషర్ బాగా పెరిగిపోయింది, ఉప్పు మానెయ్యండి.'

రాషిద్‌కి మాత్రం తన బాధలన్నింటికి విరుగుడు ఉప్పంటే నమ్మబుద్ధి కాలేదు. రజియా కూడా చాలాసార్లు గజల్‌ని జాగ్రత్తగా గమనించి ఈ కొత్త చీరెందుకు కట్టేసుకున్నావని అడిగింది. ఎప్పుడైనా ఆ పిల్ల షాహీన్‌తో నవ్వుతూ మాట్లాడుతూంటే కోప్పడేది. గజల్ సంగతి ఆమెకి తెలుసు. షాహీన్, షేఖూభాయీతో జరుగవలసిన ఆమె పెళ్ళి ఆపించేశాడు. షాహీన్ ఎడల ఆమె కృతజ్ఞత కనబరుస్తూంది. ఇంక ఏ పోలీసు విభాగంలోని ఏ సైనికుడికో ఇచ్చి పెళ్ళి జరిపించాలి, అప్పుడు పొగరంతా అణిగిపోతుంది.

కాని గజల్ ఈమధ్య కుంటత్తని బాగా పరిశీలిస్తుంది. దానికి కారణమేమిటంటే అన్ని పట్టించుకునే ఆమె మారిపోయిన గజల్ పద్ధతుల్ని తెలుసుకోలేదు. పొద్దస్తమానం షేఖూభాయీ గదిలో దూరి ఏవో గుసగుసలాడుతూండేది. ఆవిడ తన సారెకోసం తయారుచేసి వుంచిన దుస్తుల్లోంచి నీలం, పసుపు రంగు చీరలు కూడా కట్టేసుకుంది. లేస్తూనే షేఖూభాయీకి ఒక సగం ఉడికించిన గుడ్డు, ఒక కప్పు పాలు పంపించమని

పనిమనిషికి హుకుమ్ జారీ చేసేది.

గజల్ ఈ ఫర్మాన్ని శ్రద్ధగా వింది. రజియా ఇది వినకపోవడం మంచిదైంది. షేఖూభాయీకెప్పుడూ నౌఖర్లకిచ్చే ఆహారం పంపించేవారు.

ఒకసారి కుంటత్త సబ్బు బిళ్ళ తీసుకుని ఎండిపోయిన తన చేతుల్ని బాగా రుద్దుతూ గజల్తో అంది, మీరు పొద్దస్తమానం మొహానికి పౌడరు రంగులు పూసుకుంటారు. అయినా మొహం పెంకులాగే ఉంటుంది. నన్ను చూడు, యాభైఆరు ఏడులో అడుగిడుతున్న మోహంలో ఎటువంటి కళ ఉందో చూడు!

వస్తూ పోతూ గజల్ నెత్తి మీదొకటి కొట్టడం షాహీన్కి అలవాటు, అతడు చాలా పొడుగవడం వల్ల, అతని తల మీద కొట్టాలంటే గజల్కి స్టూల్ మీద నిలబడాల్సి వచ్చేది. ఒకనాడు టీపాయ్ షాహీన్ని పట్టుకోవడానికి ఒంగేసరికి షాహీన్ ఆమె నడుముని పట్టుకుని ఎత్తేస్తాడు. రాషిద్, రజియా ఎక్కడికీ వెళ్ళరు. తన గదిలో ఉండి శబ్దం చేస్తూ తిరుగుతూన్న కుంటత్త ఈ దృశ్యాన్ని చూసింది.

సాయంత్రం అంతా డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నపుడు కుంటత్త నిప్పంటించింది. హబీబ్ జంగ్ మనుమరాలితో షాహీన్ బాబా పెళ్ళి నిర్ణయం చేశారు. పాతకాలపు వాళ్ళనుకుంటాను.

తన ఇష్టానికి వ్యతిరేకంగా ఈ సంబంధం ఎలా ఖాయం చేశారు అని షాహీన్ ఆశ్చర్యపోతాడనుకున్నారు రజియా, రాషిద్లు! కాని అతను చేపముళ్ళు శుభ్రం చేస్తున్నాడు.

'అదే మంచిది. మనం మాత్రం అభినవ భావాలు కలవారమా ఏమిటి?'

రాషిద్ కూడా ఈ మధ్య, వాహిద్ హుసైన్లాగ ఆలోచించడం మొదలుపెట్టాడు. అక్కడక్కడ నెరుస్తూన్న జుత్తు భీమకాయం గర్జిస్తున్నట్లుండే కంఠధ్వని, ఇవన్నీ చూస్తూన్న గజల్కి తాతగారు గుర్తొచ్చేవారు.

'కాని వాళ్ళకీ నీ ఇంటికీ సాంత్యమెక్కడ రాషిద్ నవాబ్?' కుంటత్త విషయాన్నక్కడే ఆపడానికి సిద్ధంగా లేదు!

'వాళ్ళు మనింటి పద్ధతులు కూడా చూస్తారు. ఇక్కడ ఎప్పుడు చూసినా ఆడపిల్లల వెకిలితనాలు, వేళాకోళాలూను. షాహీన్ వేళ్ళు చేపముళ్ళు నుంచి

తప్పించుకునే ప్రయత్నంలో ఉన్నాయతని చేతులు. టేబుల్‌కి అటువైపు కూర్చున్న గజల్‌ని చూడకూడదన్న ప్రయత్నంలో నిమగ్నమయ్యాడు.

'ఇంట్లో ఏ అమ్మాయిల్ని అట్టే పెట్టుకున్నాం కనుక? ఎటు చూసినా గజల్ ఒక్కర్తే కదా?' రజియా మంచినీళ్ళు తాగుతూ అంది...

కుంటత్త మూతి తిప్పుకుంటూ రజియాని రెప్పలార్పకుండా చూసింది. ఈ రజియా కూడా కోపంగా వాళ్ళని చూడసాగింది. రాషిద్ విధిలేక ఇలా అనవలసి వచ్చింది. అత్త మెదడు పూర్తిగా పాడైపోయింది. గజల్ మాసోదరి జ్ఞాపక చిహ్నం, వాళ్ళు నీచులైతే, మేమే స్వయంగా ఈ సంబంధాన్ని వద్దనేస్తాం.

మామయ్య మాటలు వినక ముందే గజల్ అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయింది. ఆ రోజు కుంటత్తనందరూ నోటికొచ్చినట్టు మాటలన్నారు. అందుకని ఆవిడకూడా అందర్నీ లక్ష్యపెట్టకుండా తనకి అవమానం జరిగినప్పటికీ గజల్ పకపకలు ఆగిపోతాయని, ఇక షాహీన్‌తో ఆమె పరాచికాలాడడానికి సాహసించదని నమ్మింది కుంటత్త. కాని రాత్రి నమాజ్ చేసుకోవడానికి వరండాలో కొచ్చేసరికి అందంగా అలంకరించుకొని సువాసనలు విరజిమ్ముతూ ప్రాంగణంలో నిలబడి ఉంది. షాహీన్ సూట్ వేసుకుని వరండాలో నిలబడి మంచినీళ్ళు తాగుతున్నాడు.

ఆమె స్తంభాన్ని అనుకుని నోరు తెరుచుకుని ఈ దృశ్యాన్ని చూస్తూ ఉండిపోయింది.

వారు ఒకరునొకరు రాసుకుంటూ బైటికి వెళుతుంటే షాహీన్ కుంటత్తతో నేను సెకెండ్‌షో చూడడానికి వెళుతున్నాను. కనుక గేటు లాక్ చెయ్యవద్దని చెప్పాడు.'

తరువాత కారు స్టార్టు అయిన శబ్దం వినబడింది.

ఆ రోజు కుంటత్త రాత్రి చదువుకోవలసిన నమాజ్ చెయ్యలేదు. తెల్లవారు జామున నిద్రపట్టలేదు. తన మాటని రజియా దాకా తీసుకెళ్ళడానికి ఆయాసపడుతూంది.

కాంతి ఇక్కడే ఉంది. జ్వరంగా ఉన్నట్టుంది. అందువల్ల ఆ పిల్ల బాగా ఏడుస్తూ మూలుగుతూ ఉంది. కాని కుంటత్త తనకేం పట్టనట్టు ఊరుకుంది.

పొద్దున్నే గజల్ తన చేత్తో షాహీన్‌కి టీ తాగిస్తూంటే ఆ దృశ్యాన్ని తలుపు కన్నంలోంచి చూసిన కుంటత్త రజియాకి కూడా చూపించింది.

రాషిద్ దృష్టి ఎలాగో షాహీన్ గది మీద పడేసరికి, గజల్ రెండు చేతులూ పట్టుకుని గిరగిరా తిప్పుతున్నాడు షాహీన్. అతను తన గదిలోకొచ్చి సిగరెట్టు కాలుస్తూ ఏదో ఆలోచిస్తుంటే కొంచెం సేపట్లో రజియా కోపంతో ఆడపిల్లిలా ఆ గదిలో ప్రవేశించేసరికి సిగరెట్‌ని యాష్‌ట్రేలోకి ఆర్పేసి అన్నాడు 'షాహీన్ అత్తవారు పెళ్ళెప్పుడు చేద్దామనుకుంటున్నారు?'

రజియా మీదెవరో నిప్పులు పోసినట్లైంది. కోపంగా అంది, చాల్చాలు అర్థం పర్థం లేకుండా మాట్లాడకండి. నా నోరు విప్పించవద్దు, ఇదంతా మీ నిర్వాకమే!

'ఏమైందసలు? షాహీన్‌కి పెళ్ళయిపోతే...!'

చెబుదామనుకున్నాడు. కాని రజియా మెరుపులా తిరుగుతూ అంది. మాట్లాడకండి, నేనీ ఇంటికొచ్చి ఎంత బాధపడ్డాను, మురికి గుంట. నా పిల్లలు కూడా పవిత్రంగా మిగలరని నాకు తెలుసు. మీ చెల్లెళ్ళు చచ్చిపోయారు. చెడిపోయిన కూతుళ్ళని నా మెడకి చుట్టిపోయారు.

అప్పుడే కర్టెన్ పైకెత్తి షాహీన్ లోపలికొచ్చాడు పైవుడి సరిచేసుకుంటూ, 'అమ్మీ! మీరు నా గురించి పెళ్ళి కూతుర్ని వెతకొద్దు నా వధువు ఇంట్లోనే వుంది.'

చెప్పడానికి తల్లితోనే చెప్పినా, నిజానికి తండ్రి నుద్దేశించి చెప్పిన మాటలవి. తరువాత ఈల వేసుకుంటూ బైటికి వెళ్ళిపోయాడు షాహీన్. ఏదో మంత్రం చదివి వారిని శిలా ప్రతిమలుగా మార్చేసినట్టు వారిద్దరూ అలాగే ఉండిపోయారు. చాలాసేపటి తరువాత, అపాయాన్ని సూచిస్తున్నట్టు గడియారం గంటలు కొట్టేసరికి రాషిద్ ఉలిక్కిపడ్డాడు.

'ఓహో! టైమెంతైందో?' తన చుట్టు ప్రక్కల ప్రపంచాన్ని గమనించాడు. ఇది తన గది. ఇక్కడే వాళ్ళిద్దరి మంచాలకి దగ్గిరగా పడుకున్న చిన్నారి షాహీన్ లేవడానికి ప్రయత్నించే వాడు. లేవలేకపోయేవాడు. అప్పుడప్పుడు రాషిద్ తన రెండు వేళ్ళూ అందించేవాడు, వాటి సహాయంతో లేస్తాడని, తరువాత అతను లేచి

హాస్పిటల్‌కి వెళ్ళిపోయాడు, అక్కడ స్క్రీన్‌మీద రోగుల గుండెల్ని పరీక్షిస్తాడు. గాయపడ్డ గుండెలకి మందు రాస్తాడు. పట్టణంలో ఉన్న డాక్టర్లందరిలో గొప్ప హార్ట్ స్పెషలిస్ట్ తను, కాని తన తండ్రి గుండె గురించి ఆలోచించలేదతను. తను బ్లడ్‌ప్రెషర్ పేషంట్ అటువంటి వ్యక్తి గుండెపై ఎంత దెబ్బతీశాడూ... పెరుగుతూన్న రక్తపోటుతో తల తిరుగుతుండగా రాషిద్ అన్నాడు. 'రజియా గడుస్తూన్న కాలాన్ని వెనక్కి మళ్ళించకు జరిగేవన్నీ జరగనీ.'

ఆ రాత్రి గజల్‌కి అసలు నిద్రపట్టలేదు.

పురుషులు తనని పెళ్ళి చేసుకుంటానని ఆఫర్ చెయ్యడం, చాలాసార్లు జరిగింది... బిల్‌గరామీ, సర్‌వార్, ఇప్పుడు షాహీన్ కూడా అదే చేశాడు.

వీళ్ళంతా పురుషులు. తన ముందొక ఆశాదీపాన్ని వెలిగించి, తమ ప్రపంచాన్ని వెలుగుతో నింపుకుంటూనే వున్నారు. వారి దృష్టిలో ఆమె ఒక ప్లాస్టిక్ బొమ్మ. పెంపుడు పిల్ల, మూడ్ బాగుంటే ముద్దు చేస్తారు. లేకపోతే తన్ని తగిలేస్తారు.

ఈ రోజు షాహీన్ కూడా తనని పెళ్ళి చేసుకుంటానని అంటే ఆమె ఆశ్చర్యపడలేదు. తరువాత చిన్నతనంలో దీపావళి దృశ్యం జ్ఞాపకం వచ్చింది... వందల కొద్దీ దీపాలు వరుస క్రమంలో వెలుగుతూ... నువ్వు నన్నే ఎందుకు పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావు? ఆమె కంగారుగా ప్రశ్నించింది.

'నువ్వు జీవితాంతం ఏడుస్తూండడం నాకిష్టం లేదు కనుక...!'

'ఊహ్! దీపావళి దీపాల వరుసలు క్రమంగా ఆరిపోతున్నాయి. అయితే నువ్వు కూడా నామీద జాలిపడి పెళ్ళి చేసుకుందామనుకుంటు న్నావన్నమాట... నా మీద దయతో... కాని ఆమె ఈ మాట షాహీన్‌తో అనలేదు.

'సరే నేనొకవేళ జీవితాంతం నవ్వుతూనే ఉంటానని మాటిస్తే?'

'చాలు, ఇంక చాలించు వేదాంతం! అతడింక ఏ విధమైన తర్కానికి సిద్ధంగా లేడు' మా బదౌలత్ ఒకసారి నిర్ణయించుకున్నారు, అది మారదు.

అతడు తల్లి గదిలోకెళ్ళి, ఆలస్యమైతే ఏమవుతుందో అన్న గాభరాతో తన ఉద్దేశాన్ని వెల్లడించేశాడు.

అతను హాస్పిటల్‌కి వెళ్ళిపోయిన తరువాత, తన గది మూసుకుని గజల్ చాలాసేపు ఏడ్చింది. నువ్వు లేకపోతే నేను జీవించలేనని అతడొక్కసారైనా అనలేదు. ఇంకే స్త్రీ గురించి ఊహించుకోలేను, అనలేదు. నామీద జాలితో నన్ను పెళ్ళి చేసుకుంటాడు. తరువాత బాధపడతాడు. అసహ్యించుకుంటాడు. అతడికి ఖాన్, బిల్‌గరామీ, నసీర్ కథలు పూర్తిగా తెలిసినట్టు లేదు. తరువాత రాషిద్ మామయ్య, కుంటత్త ఉన్నదీ లేనిదీ కల్పించి వినిపిస్తే, అతడు తననుంచి దూరమైపోతాడు.

నసీర్ ఇచ్చిన ఉంగరం నేనెలా తీసెయ్యగలను? జల్వా నాటి రాత్రి షాహిన్ నా చేతి, ఏ వేలు పట్టుకుంటాడు వాహిద్ హుస్సైన్ నవాబు పౌత్రుడు.

వద్దు వద్దు ఇతడు చాలా గొప్పవాడు, పర్వతంలాగ తయారై నానెత్తిమీద సవారీ చేస్తాడు. నేను నలిగిపోతాను. ఐవానే గజల్ మొత్తం బరువు, బాధ్యతలు నేనెలా మోయగలను?

ఐవానే గజల్ కేవలం ప్రేయసులకోసం, ప్రియురాళ్ళకోసం ఉన్నట్టుంది. ఈ ఇంటికే స్త్రీ అయినా భార్య రూపంలో అడుగుపెట్టిందంటే, రజియాలాగ అన్ని విధాల నష్టపోతుంది. నేను కూడా ఇక్కడ షాహీన్ ప్రియురాళ్ళకి సేవలు చేస్తూండాలి.

రజియా ముమానీ రెండు రోజుల్లో తన్ని తగిలేస్తుంది. కుంటత్త విషం పెట్టి చంపేస్తుంది. ఎంగిలి మెతుకులు తినే కుక్క గుడ్డి గవ్వ ఖరీదు చెయ్యని తిరుగుడు పిల్ల! వద్దు నేను షేఖూ భాయీని పెళ్ళి చేసుకుంటాను, నన్ను తీసుకుని ఎక్కడకైనా పారిపొమ్మని, పొద్దున్నే షేఖూ భాయీకి చెబుతాను. నాకు డబ్బు సంపాయించే సులువైన పద్ధతులు జ్ఞాపకమున్నాయి... నేను నిన్ను అన్ని విధాలా సుఖపెడతాను.

ఆమెపక్కమీద అటూ ఇటూ దొర్లుతూనే ఉంది మసీదులో నమాజ్ సమయమయిందని చెబుతూనే ఉంది.

అల్లా చాలా పెద్ద వాడు, అల్లా చాలా పెద్దవాడు! పొద్దున్నే జ్వరంతో కాలిపోతూన్న కాంతిని ఎత్తుకున్నప్పుడు నేను కాంతి కోసం మిగిలిపోతాను అనుకుంది. అప్పుడు కాంతికి ఎనిమిదేళ్ళు ఐదవ తరగతి చదువుతూంది. తన గురించి అంతా తెలుసామెకు.

తరువాత కాంతికి స్వెట్టరు తొడిగి. గదిలోంచి బైటికొచ్చేసరికి హుసైన్ బీబీ అడిగింది. గజల్ బీబీ! ఇవాళ కుంటత్త ఎక్కడికెళ్ళారు? స్టోర్ రూమ్ తెరిచి గోధుమ పిండి కూడా ఇవ్వలేదింకా!

అప్పుడామె తొంగి చూసింది. కుంటత్త తన గదిలో లేదు. ఇంత పొద్దున్నే ఎక్కడికి వెళ్ళింది. గజల్‌ని చంపే ఏర్పాట్లు కోసం... ఆమె ఉండి ఉంటే షెఖూభాయీతో గజల్ వివాహ విషయం వెంటనే నిశ్చయమైపోయేది.

'నువ్వెక్కడికి వెళుతున్నావు?' రజియా చాలా కోపంగా అడిగింది.

'కాంతిని క్లినిక్‌లో దించడానికి వెళుతున్నాను. గజల్ బాధపడుతూ అంది. కాంతి ఇవాళ ఇక్కడుండకూడదనుకుందామె. ఇవాళ ఏమేమి తమాషాలు జరుగనున్నాయో! క్లినిక్‌లో మేరీ ఆ పిల్లకి మందిచ్చి జ్వరం తగ్గేటట్టు చేస్తుంది.

'మరి కుంటత్త ఎక్కడున్నారు? అచ్చు పోలీసు వాళ్ళలాగ అనుమానంగా చూస్తూ అడిగింది. తనకి తెలియకుండా తనకి వ్యతిరేకంగా ఏదో కుట్ర జరుగుతూందని రజియాకి ఇప్పుడు నమ్మకం కలిగింది. షాహీన్ గజల్ కుంటత్తని కూడా తమతో కలుపుకున్నారు.

అందుకే కుంటత్త ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది. ఇప్పుడు గజల్ కూడా కాంతిని తీసుకుని ఎక్కడికో పారిపోతూంది.

'ఇంట్లోంచి బైటికడుగు పెట్టాల్సిన అవసరం లేదు, రజియా కోపంతో గర్జించింది. కాంతికి జ్వరమైతే షాహీన్‌కి చూపించు. ఆమె ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

ముమానీ బేగం తిట్లేం కొత్తకాదు కనుక గజల్ ఏమీ బాధ పడలేదు.

తన పక్క మీద కాంతిని రగ్గు కప్పి పడుకోపెట్టేసరికి, ముమానీ బేగమ్ గదిలోంచి గట్టిగా కేకలు వినబడసాగాయి.

డ్రాయింగ్ రూమ్‌లో పత్రిక చదువుతున్న రాషిద్, నిద్రపోతున్న షాహీన్, గజల్ నౌకర్లు, పనిమనిషి - అందరూ పరుగెట్టుకొచ్చారు.

తెరిచివున్న ఇనప్పెట్టె పట్టుకుని రజియా అరుస్తూంది. 'నన్ను దోచేసుకున్నారు... నా నగలన్నీ... డబ్బు... నన్నే దోచేసుకున్నారు... నాశనం చేసేరెవరో...'

అంతా కంగారు పడ్డారు. రాషిద్ ఇనప్పెట్టె అన్ని వేపులనించి చూశాడు. షాహీన్ ఇనప్పెట్టె అన్నివేపుల నించి చూశాడు. గదంతా వెతికాడు. ఎవరో రజియా తలవైపునుంచి తాళాలు తీసి ఇనప్పెట్టె తెరిచారు. అందులోంచి ఈ వంశపు సంపద అయిన నగలు మాత్రం తీసుకున్నారు. రజియా సారెలో వచ్చిన నగలను తాకనైనా లేదు. చిన్నప్పటినుంచి చెయ్యని ప్రతి తప్పుకీ శిక్ష అనుభవించిన గజల్, భయంతో స్పృహ కోల్పోయే టట్టుంది. ఈనాడెటువంటి తిట్లు పడతాయో తనకి!

'షాహీన్ పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చెయ్యబోతూంటే రాషీద్ వచ్చి అతని చేతులోంచి ఫోన్ లాక్కున్నాడు, మూర్ఖుడా, కుంటత్తని జైలుకి పంపిస్తావా? అసలు విషయమేమిటో ముందు తెలుసుకోనియ్యి!'

'కుంటత్త...?' షాహీన్ ఆశ్చర్యంగా అడిగాడు.

'అవును! ఇంకేమిటనుకున్నావు?'

సాయంకాలానికి కుంటత్త షేఖూభాయీని వివాహం చేసుకున్నట్టు రాషిద్‌కి తెలిసిపోయింది. తన విలువైన సామాన్లన్నీ రాత్రికి రాత్రే తీసుకెళ్ళిందని తెలిసిపోయింది. వాహిద్ హుసైన్ అధీనంలో ఉన్న తన నగలు డబ్బు మాత్రమే రజియా సేఫ్‌లోంచి తీసుకుంది కుంటత్త. కోర్టుద్వారా తేల్చుకోదల్చుకుంటే తను సిద్ధమేనని కబురు పంపించిందామె.

'నేనామెని పోలీసులకప్పగిస్తాను, దరిద్రగొట్టు మొహం, సిగ్గులేని ముసిలిది... ఈ ముసిలితనంలో ఇలాంటి వెధవ పని చెయ్యడానికి సిగ్గన్నా లేకపోయింది... అరిచి అరిచి రజియా మొహం ఎర్రగా కందిపోయింది.'

'నీకేమైనా పిచ్చెక్కిందా? రాషిద్ ఆమెకి బోధపర్చాడు. కేసుపెడితే ఐవానే గజల్‌లో సగభాగం పోగొట్టుకోవాల్సి వస్తుంది. ఆస్తి, డబ్బు, అన్నింటిలోను సగం వాటా ఇవ్వవలసి వస్తుంది.'

'అల్లాహ్ తోబా! ఈ వంశపు ఆడపిల్లలు... వెధవ మొహాలు... వృద్ధాప్యంలో కూడా, నమ్మదగినవారు కారు. జుట్టు పండిపోయింది. నడుము విరిగి వంగి పోయింది, ముసిలిదానికి పొగరు తగ్గలేదు. ఎన్నాళ్ళనుంచీ ఆ పనికిమాలిన ముసలాడి మీద ఆశపెట్టుకుందో.'

రజియా గొణుగుతూనే ఉంది.

'పోనీ, ఒక శత్రువు మన దార్లోంచి తప్పుకుంది...!' లోపలికొచ్చి

ఎంతో సంతోషంగా గజల్‌తో అన్నాడు.

షేఖూభాయీ దక్కకపోయేసరికి - గజల్ నిజంగానే ఏడ్చేసింది. షాహీన్ ఇప్పుడింకేం జరుగుతుంది. ఆమె పిచ్చిదానిలాగ అడిగింది.

నా పుత్రుడు డాక్టర్ షాహీన్ రాషిద్ గజల్ సుల్తానుల వివాహం నేటి సాయంత్రం జరుపుటకు నిశ్చయించపబడింది. కనుక మీరు మా ఆనందోత్సాహాల్లో పాలు పంచుకోవలసింది. నీకు నాతో కలిసి ఉండే శిక్ష విధించడం జరుగుతుంది.

సంతోషంతో కూడుకున్న ఈ పెళ్ళి నాటి రాత్రంతా గజల్ ఆలోచిస్తూనే ఉంది, అమ్మాయిలెన్ని అబద్ధలాడుతుంటారు! ఆ శుభగడియల్లో... నాకు సన్నాయి స్వరాలు మత్తెక్కిస్తూన్నట్లు అనిపించనే లేదు. ఎక్కడా తారాచంద్రులు మెరవడమూ లేదు. నా హృదయంలో కుసుమ కవళికలు వికసించనూలేదు. ఐవానే గజల్‌లోని నిరాశా జనితమైన నిస్పృహతో చీకటి తెరలు నావైపుకే వస్తూన్నట్టున్నాయి.

కంగారు పడి నసీర్ ఇచ్చిన వజ్రపుటుంగరం మాటి మాటికీ తీసేస్తుంది. మళ్ళీ పెట్టుకుంటుంది. అప్పుడప్పుడు షాహీన్ ఆమె వద్దకు వచ్చి, గడ్డం పట్టుకుని పైకెత్తుతూ అన్నాడు. 'ఇంకా భయపడడం మానెయ్యి. ఆలోచించడం మానెయ్యి, నేటి నుంచి నువ్వేం కోరుకుంటే అదే జరుగుతుంది.'

'వద్దు, వద్దు గజల్ గట్టిగా అరిచి ఏడవడం మొదలెట్టింది. షాహీన్ దయచేసి నన్నింతగా అవమానించవద్దు, నాకేం వద్దు.'

కాని షాహీన్ తన మాట మీద నిలబడ్డాడు. నాకేం వద్దు అతడు గజల్‌ని, అతి మృదుపైన జాజి పువ్వుల్ని తాకినంత సుతారంగా, స్పృశించాడు. ఆమె మొహం చూస్తూ కూర్చున్నాడు! ఆమె మాటలు వింటున్నాడు.

పెళ్ళయిన తరువాత వాళ్ళు ఐవానే గజల్‌పై అంతస్తులో ఉంటున్నారు. కాంతిని హాస్పిటల్ నుండి ఇంటికి రప్పించేశారు. ఆమె కింద ఒక గదిలో ఉంటుంది.

'నేను క్లినిక్‌కి వెళ్ళిపోనా? ఇవాళ సినిమా చూడాలని ఈ రోజు నువ్వేం తింటావు? కొంచెం సేపు తల్లితో మాట్లాడడానికి కిందికి వెళ్ళినా అతను

ప్రతి పనీ గజల్‌ని అడిగే చేసేవాడు.

కాని ఇంతటి అపారమైన ప్రేమని ఆమె ఎలాగ భరించగలదు.

చిన్నప్పట్నించి దెబ్బలూ, తన్నులూ తినడానికి అలవాటు పడింది. షాహీన్ నిష్కపటమైన ప్రేమ ఆమెకి వెగటనిపించసాగింది, జీవితాంతం తను దెబ్బలాడుతూ, కలలుకన్నటువంటి భర్తకాదు షాహీన్. అతని అత్యాచారాలు సహిస్తూ, కన్నీళ్ళు కారుస్తూ అతని కాళ్ళు పడుతూండాలన్న కోరిక మనసులో దాచుకుంది గజల్. షాహీన్ ఒక అపరిచితుడు. ఆకస్మికంగా తన జీవితంలోకి వచ్చిన వ్యక్తి తనని భార్యగా కాక ఒక వేశ్యగా భావించిన అపరిచితుడతడు. ఆమె శారీరక వాంఛల్ని అవగాహన చేసుకోవడమే అన్నిటికంటే ముఖ్యమైన పనిగా భావించాడతను.

అందుకని షాహీన్ ఆమెని దగ్గరికి లాక్కున్నప్పుడు, గజల్ మైళ్ళ దూరం పారిపోయేది. ఎంతదూరం అంటే, ఆమెని తాకడానికి చేతులందేవి కావు. గజల్ కోసం కొత్తకారు కొన్నాడు. బంజారాహిల్స్‌లో స్థలం కొని ఇల్లు కట్టిస్తున్నాడు. కాంతిని కూతురిగా భావించి పెంచుతానని మాటిచ్చాడు, కాన్వెంట్‌లో చేర్పించాడు. అల్లరిచేసే చంచలత్వం, అల్లరి స్వభావం ప్రతిభలున్న కాంతి పెరిగే కొద్దీ ఆమె తెలివితేటలు రెట్టింపు వేగంతో అభివృద్ధి చెందుతున్నాయి. స్కూల్లో ప్రతి క్లాసులో మొదటి డివిజన్‌లో పాసైంది. కాని టీచర్‌తో ఇష్టమొచ్చినట్టు మాట్లాడడం వలన కఠినంగా శిక్ష పొందింది కూడా. షాహీన్ ఆ పిల్లకి మంచి బట్టలు కొనేవాడు. ఆమె ప్రతి కోరికా తీర్చేవాడు. ఒకసారి గజల్ అతని అడ్డగించింది కూడా. కాంతి మీద మనం ఇంత డబ్బెందుకు వృథా చెయ్యాలి? దాన్ని చదివించాం. అదే గొప్ప?

షాహీన్ అన్నాడు 'అయితే ఏం? నువ్వు పిల్లల్ని కనవద్దు కాంతి హాయిగా ఉంటుంది. నువ్వు పిల్లల గొడవలు లేకుండా హాయిగా ఉండు, భోగాలనుభవించు.'

'భోగాలు... భోగాలు.. అసలెన్ని భోగాలని అనుభవిస్తాను? అప్పుడప్పుడు గజల్ ఆలోచిస్తూండేది, షాహీన్ నిజంగా దేవుడు. నేను హాయిగా సుఖంగా ఉండాలని ఎలాంటి ప్లాన్లు వేస్తున్నాడు! కాని వాళ్ళ కేకలు గొడవల్లో తనని తాను మర్చిపోవాలి అనుకునేది గజల్.

షాహీన్ తనకి ప్రేమను పంచి ఇప్పుడు ఏదో లెక్కచెయ్యకుండా, పట్టించుకోకుండా వైదొలగుతున్నాడు. కాంతి ఏదీ లెక్క చెయ్యకుండా, అస్సలు సెంటిమెంట్లు లేకుండా తయారైంది. ఆమె గజల్ ప్రేమని కూడా హేళన చేసేది. ఒకసారి ఎనిమిది సంవత్సరాల కాంతి ఆమెనడిగింది, గజల్ అంటీ, రజియా ఆంటీ చెబుతూంది మీకు పిల్లలు పుట్టాక నన్ను ప్రేమగా చూడరటకదా!

'నువ్వు నా చందమామవి, చందమామ... నా కాంతిని ప్రేమించకుండా ఉండగలనా నేనెప్పుడైనా? ఆమె నిజంగానే కాంతిని గుండెలకి హత్తుకుంది.

'కాని నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఆంటీ మీకు, షాహీన్ అంకుల్‌కి నన్ను పెంచినందువల్ల ఏమిటి లాభం? నేనేం మీ బిడ్డను కాను కదా?'

'మొద్దు మొహమా... ప్రతి పనీ లాభం కోసమే చేస్తామా?'

'ఎందుకు చెయ్యకూడదు?' కాంతి కూడా గట్టిగా జవాబు చెప్పింది. చూడండి ఆంటీ, మీరెంతో డబ్బు ఖర్చుపెట్టి నన్ను పెద్దదాన్ని చేశారు కదా, మరి దానికి బదులుగా నేనుకూడా మిమ్మల్ని అభిమానించాలి కదా?

గజల్ పుస్తకం పెట్టేసి కాంతిని చూస్తూంది, ఈ పదిపన్నెండేళ్ళ పిల్లకి, ప్రపంచంలో తనవారెవరూ లేరని తెలుసు. తనకు బ్రతకడం నేర్పిన వారికి ఋణపడి ఉన్నానని తెలుసు. అల్లాహ్! కాంతికి నీడెక్కడ లభిస్తుంది?

అది నాకంటే ఎక్కువ చేదే చవిచూస్తుంది... అది కూడా జీవితాంతం ఒంటరిగా బాధపడుతుందా? లోకులు దాన్ని చూసి జాలిపడతారా లేక అసహ్యించుకుంటారా?

కైసర్, సంజీవాల సంతానమైన ఈ బిడ్డ ఐవానే గజల్‌కి ఏం చేద్దామని వచ్చింది!

గజల్ ఎప్పుడూ మౌనంగా, ఏదో పోగొట్టుకున్నట్టుండడం చూసిన షాహీన్‌కి గుండెకి గాయమైనట్టుండేది.

'ఈ పిల్ల ఇప్పుడు కూడా ఆనందంగా లేదు. నేనింకేం చేయాలి ఈమె కోసం?'

షాహీన్ వైద్యమే కాకుండా మనస్తత్వ శాస్త్రవేత్త ఫ్రాయిడ్ సిద్ధాంతాలన్నీ చదివాడు, కార్ల్‌మార్క్స్ సిద్ధాంతాలన్నీ చదివాడు. అతడు మానవ శరీరంపైన పరిశోధనలు జరిపాడు, మానవ మేధస్సుకి సంబంధించిన చిక్కులపై ఇబ్బందులపై దృష్టి సారించాడు. ఇరవై ఏడేళ్ళ వయస్సులో అతను ప్రపంచాన్ని తెరిచి చూసాడు, విడదీసి ప్రతి భాగాన్ని పరిశీలించాడు. తన పిడికిలిలో విలవిలలాడుతున్న సీతాకోక చిలుకలాగ భావించాడు నన్ను. అతడు తమ కుటుంబాన్ని, పద్ధతుల్ని ఏనాడు లెక్కచేయ్యలేదు. తన తల్లి - తండ్రుల అనుభూతుల్ని తన మార్గానికెప్పుడు, అడ్డుగా భావించలేదు. పురుషులకి స్వేచ్ఛ అతని దృష్టిలో ముఖ్యమైనది. అందుకనే కాబోలు అతనే స్త్రీనీ ప్రేమించలేదు.

గజల్ జీవితంలో కూడా, తను మొదటి పురుషుడు కాదన్న విషయం అతనికి తెలుసు. అతడేనాడూ స్త్రీ శారీరక పవిత్రతకు ప్రాముఖ్యత నివ్వలేదు.

ప్రేమనెప్పుడు శ్రద్ధ వహించవలసిన విషయంగా భావించలేదు. గజల్ విషయం ఇలా జరిగి ఉండకపోతే, బహుశా అతను మరొక ఐదేళ్ళో - పదేళ్ళో మెడికల్ కాలేజీలో చదివే అమ్మాయిలు, నర్సులతో కాలక్షేపం చేసి ఉండేవాడేమో! తనకై తల్లి నిర్ణయించిన అమ్మాయినే పెళ్ళిచేసు కునేవాడేమో! కాని అది అతడి స్వంత నిర్ణయం. ఇతరులు, తన పనుల్లో తల దూర్చడం కాని తనని బెదిరించడం కాని, అతడు సహించేవాడు కాదు. రకరకాల వలలను పన్ని, మగవాళ్ళని శాశ్వతంగా ఉచ్చులో బిగించాలనుకునే అమ్మాయిల్ని అతనిట్టే పసికట్టేసేవాడు. గజల్ అతన్ని ఆకర్షించడానికి ప్రయత్నించినా, అమ్మీ, కుంటత్త గజల్‌కి సంబంధించిన విషయానికింత ప్రాధాన్యత ఇచ్చి ఉండకపోతే అతడు షేఖూభాయీ కాకపోతే గజల్ పాణిగ్రహణం చేయగల మరో వ్యక్తి కోసం ప్రయత్నించేవాడు.

అతడు తనని వివాహం చేసుకోగలగడాన్ని గజల్ అసంభవంగా, ఎందుకు భావించిందో? ఒక నిస్సహాయురాలైన, చెడిపోయిన పిల్ల, తన కోడలవడానికి ఎంత మాత్రం వీలులేదని అమ్మ ఎందుకనుకుంటూంది? తానది చేసి చూపించాడు.

భర్తగా తన బాధ్యతలన్నీ తాను సక్రమంగా నిర్వర్తిస్తానని గజల్‌ని

నమ్మించాలనుకున్నాడు. ఇంతకంటే ఇంకేం చెయ్యాలి?

కాని గజల్, పాత కాలపు జ్ఞాపకాల వలయంలోనుంచి ఇంకా బైటపడ్డట్టు లేదు. తెలివి తక్కువ పిల్ల, ఒట్టి మూర్ఖురాలు. బహుశా నసీర్ తొలి ప్రేమకే తనపై హక్కుందని ఆమె నమ్మకం కాబోలు. అందుచేతనే నసీర్ ఇచ్చిన ఉంగరం ఇలా ఆమె చేతికుండి, ఆమె షాహిన్ భార్యగా కాకుండా, ఒక దాసిలాగ వ్యవహరిస్తోంది. అతి సామాన్యమైన పిల్ల. ఎప్పుడైనా ఛీత్కరించవచ్చు.

మెల్లిగా సినిమా ప్రోగ్రాములు వెయ్యడం మానేశాడతను. బైటికి వెళ్ళగానే గజల్ తనని లోగడ ఎరుగున్న వారెవరైనా కనబడతారేమో, తామిద్దర్ని కలిసి వెళ్తుండగా, ఎవరైనా కనిపించి, ఏదైనా ప్రశ్నిస్తారేమో అని గాభరాపడుతూ చూస్తూండేది.

షాహీన్ విసుక్కునేవాడు, 'ఈ ప్రపంచంలో మరో జన్మెత్తాలని, నిన్నెవరూ గుర్తించకూడదనీ ఎందుకనుకుంటావు? అటూ - ఇటూ చూడడం మానెయ్యి, నువ్వు కేవలం నన్నే చూస్తూండు. నీలోని ఈ భయం వల్ల నిన్నెవరికీ పరిచయం చెయ్యడం మానేశాను నేను.'

గజల్ కంగారుగా తల వంచేసుకునేది.

తెరమీద డైరెక్టర్ ఏం చూపిస్తున్నాడు? దిలీప్ కుమార్ ఎలా అభినయిస్తున్నాడు? ఏమీ చూడకుండా, ఇద్దరూ ఒక దగ్గిర ఒకరు కూర్చుని మనస్సులోని భయాలు, అనుమానాలు మొదలైన వాటి గురించి మాట్లాడుకుంటూండేవారు.

'సరే పద. సినిమా అయిపోయింది...' అతడు లేచి నిలబడేవాడు.

గజల్ ఉలిక్కిపడి లేచి నిలబడేది. చాలాసార్లు తన ఆలోచనల్లో మునిగిఉన్న గజల్ బైటికొచ్చేటప్పుడు షాహీన్‌కి బదులు, ఇంకో పురుషుడి చేతిలో తన చెయ్యి పెట్టి, ఎవరి అడుగుల్లోనో అడుగులు కలిపి నడిచేది. షాహీన్ వెనుదిరిగి చూసి కారువైపు కెళ్ళిపోయేవాడు. అప్పుడు గజల్ ఉలిక్కిపడి ఇటూ - అటూ చూసేది. నీలం రంగు కారుని గుర్తుపట్టి అందులో షాహీన్ కూర్చున్నాడని తెలుసుకునేది.

రాత్రి క్లినిక్‌నుంచి తిరిగివచ్చిన తరువాత, సరదాగా గజల్‌తో కబుర్లు చెప్పడానికి బదులు తన స్టడీరూమ్‌లో కెళ్ళి పేపర్లు, పత్రికలు ముందేసుకుని

కూర్చునేవాడు. అటువంటప్పుడు గజల్ గుండె పగిలినట్లనిపించేది!

చూశావా... చివరికతడు నేనంటే బేజారైపోయాడు కదా? ఎంతకాలం బలవంతంగా నవ్వించగలడు? అతడు స్నేహితులకెప్పుడూ నన్ను పరిచయం చెయ్యడు. నేనెప్పుడైనా బైటికెళితే, అస్తమానూ, నేనెవర్ని చూస్తున్నానా అని గమనిస్తుంటాడు. నన్నెప్పుడూ పాడమని కోరలేదు. నసీర్, బిల్‌గరామీ, ఖాన్ల గురించెప్పుడూ అడగలేదు.

క్రమంగా అతని పేరు ప్రఖ్యాతులు పెరగసాగాయి. గజల్ వల్ల నిరాశ చెందిన అతను తన వైద్య వృత్తి మీదే దృష్టిని కేంద్రీకరించాడు. ఇప్పటి వరకు హైదరాబాదులో మంచి హార్ట్ స్పెషలిస్టులు ఎక్కువమంది లేరు. అందువల్ల అతనికి రోజంతా పనితోనే సరిపోయేది. ఉదయం ఎనిమిది గంటలకి క్లినిక్ తెరిచేవారు. మధ్యాహ్నం భోజనానికొచ్చినప్పుడు గజల్‌తో కొంచెంసేపు సరదాగా కాలక్షేపం జరిగేది. తరువాత రాత్రి పదకొండు గంటల వరకూ హాస్పిటల్ డ్యూటీ ఉండేది. మధ్యలో పేషెంట్ల ఇళ్ళకెళ్ళటం.

మళ్ళీ రాత్రి అయ్యేది - మళ్ళీ అనుమానాలు, సలహాలు, జాగ్రత్తలు, మొదలైన వాటిని తీసుకుని వచ్చేది రాత్రి - గజల్‌ని ఏడిపించి వదిలిపెట్టేది.

షాహీన్ ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నా ఒకనాడు గజల్‌కి ఒళ్ళు మండిపోయింది. 'షాహీన్ మన పెళ్ళి అయి ఐదు సంవత్సరాలయ్యింది. నేను చాలా భోగాలనుభవించాను. ఇంక నాకు నా బిడ్డ కావాలి. నేనెంత కాలమని ఒంటరిగా ఉండను?'

'పిచ్చిదానా... నేనున్నాను కదా నీ కోసం! పిల్లలు పుడితే లేనిపోని ఇబ్బందుల్లో పడిపోతావు. చూడు, క్రాంతి తన తల్లితండ్రుల్ని ఎలా విమర్శిస్తూందో? చూశావా! నువ్వు ఉట్టుట్టికే భయంతో వణికి పోతుంటావు.'

షాహీన్ మాటలు విన్న ఆమె మౌనం వహించేది.

'నువ్వన్నది నిజమే!'

నేనెవరినో... ఏమిటో? నేనా మాట మర్చిపోయాను. కాని షాహీన్ మర్చిపోలేదు. అతని పిల్లలు కూడా మర్చిపోరు. అందుకే అతడు తన బిడ్డలికి, నన్ను తల్లిని చేయదల్చుకోలేదు. ఆ చెడిపోయిన పిల్లనెవరూ పెళ్ళిచేసుకోడానికి ఇష్టపడలేదు, కాని షాహీన్ ఆమె కోసం ఈ త్యాగం

చేశాడు. ఇంత గొప్ప త్యాగం! అతడు తలుచుకుని ఉంటే పెళ్ళయిన తరువాత మూడు నాలుగు నెలలు తనతో ఆడుకుని వదిలించుకునేవాడు, కాని అతను తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే వున్నాడు,.

అతడు ఫౌజియా పిల్లల్ని భుజాల మీద ఎత్తుకుని తిరుగుతూండేవాడు. వాళ్ళ కోసం గిలక్కాయలు, ఆట వస్తువులు కొనుక్కొస్తూండేవాడు. పదిహేను సంవత్సరాల కాంతితో పసిపిల్లలాగా మాట్లాడేవాడు, కాని నా కడుపున ఒక కాయ కాయించి ఐవానే గజల్ తోట అందాన్ని పాడు చెయ్యడానికిష్టపడే వాడు కాడు.

'మళ్ళీ ఆలోచించడం మొదలెట్టావేమిటి?' అతడు గజల్ తలపట్టుకుని ఊపుతూ ప్రశ్నించాడు. తిరిగి గంభీరంగా అన్నాడు. 'గజల్, నిన్ను సంతోషపెట్టలేనందుకు చింతిస్తున్నాను. నువ్వు కలలుగన్న పురుషుణ్ణి నేను కాను. నువ్వు నా కోరిక మన్నించి త్యాగం చేశావని అనిపిస్తూంటుందప్పుడప్పుడు. కాని నన్ను నమ్ము నేను నీ దారికెప్పుడూ అడ్డు రాను, నువ్వు ఎక్కడికి వెళ్ళాలనుకుంటే అక్కడికి వెళ్ళొచ్చు. నువ్వు చెయ్యదల్చుకున్నది చెయ్యొచ్చు.'

'నాకు తెలుసు...' గజల్ ఏం చెయ్యలేనట్టు అరుస్తూ అంది, 'దయచేసి, ఈ ఇంట్లోంచి వెళ్ళిపో అని మాత్రం నీ నోటితో అనవద్దు ఆమె ఊరుకుంది. తను తప్పు చేసిందని ఆమెకు తెలుసు. అతడిప్పుడు ఎక్కడికి కావాలంటే అక్కడికి పంపించడానికి సిద్ధంగా ఉన్నాడు. అనుక్షణం విడిచిపెట్టడానికి తయారుగా ఉన్నాడు. అతను నా మార్గం నుంచి తొలగిపోతున్నాడు, కాని నేనెక్కడికి వెళ్ళను?

ఆమె దోసిట్లో మొహం దాచుకుని ఏడవసాగింది.

'ఏం, మొదలయ్యిందా ఏడుపు?' షాహీన్ అపార్థం చేసుకుంటూ అన్నాడు. 'నాతో మాట్లాడడమే కష్టమైపోయింది. అసలు నన్నేం చెయ్యమంటావో కాస్త చెప్పు? దరిద్రపు జీవితమొక పీడలాగైపోయింది.'

అతడు మినీబార్ తెరిచి సారాసీసా తీశాడు.

ఉదయం నాస్తా చెయ్యడానికి వచ్చి ఇద్దరూ మూతులు ముడుచుకు కూర్చున్నారు. కాంతి తన పరీక్షా ఫలితాలతో ప్రత్యక్షమైంది. ఆ పిల్ల మెట్రిక్ ఫలితాలు వచ్చాయి. మొదటి డివిజన్‌లో పాస్ అయింది.

'అంకుల్ మీరిప్పుడు తప్పకుండా సైకిల్ కొనిపెట్టాల్సిందే! మీరు ప్రామిస్ చేశారు.'

'ఆడపిల్లలు సైకిల్ తొక్కరు. నువ్వే అమ్మాయినైనా సైకిల్ తొక్కుతుండగా చూశావా? ఆ అమ్మాయి గజల్ సహాయాన్ని ఉపేక్షిస్తూ షాహీన్‌కేసి చూసింది.

'ఇది ఐవానే గజల్ ఆనవాయితి.' అతడు కాంతితో అన్నట్టు 'నేను నీకు సైకిల్ తెచ్చిపడతాను!'

'అనాథ పిల్లలపై జాలి చూపించే ఆనవాయితీని మీరు కాపాడుతున్నారు! గజల్ కోపంగా తిప్పికొట్టింది.

'జాలి? నేనెవరి మీదైనా జాలి పడగలనా?' షాహీన్ సిగరెట్ వెలిగించి అగ్గిపుల్లనార్పుతూ అన్నాడు. 'నేను కఠినాత్ముడినైన, జాలిలేని డాక్టర్‌ని, గుండెల్ని చీల్చి పారేసి, మానవుణ్ణి ముక్కముక్కలుగా కోసి పారేసే వాణ్ణి. జాలి అంటో ఏమిటో, అనుభూతులెలా ఉంటాయో, ప్రేమ ఎలా వుంటుందో నాకేం తెలుసు?

'నా వల్ల ఏమి లభించలేదని స్పష్టంగా ఎందుకు చెప్పరు? ప్రేమ, గౌరవం, న్యాయం, ఏం లభించింది కనుక!' గజల్ కోపంతో అరవసాగింది.

'ఒక వేశ్యని వివాహమాడితే ఇంతకంటే ఏం పొందగలరు? నా నుంచి ఏమాశించారు? ఎలాగు నాకు ప్రేమ, సంపద, తలదాచుకోడానికి, మీ నీడ అన్నీ ఇచ్చారు. ఇక బిచ్చగత్తె దగ్గర ఏముంటుందివ్వడానికి? మీరు తరువాత పశ్చాత్తాపపడవలసి వస్తుందని నేను ముందే చెప్పాను!'

'కాని మీరెందుకు పశ్చాత్తాప పడాలి అంకుల్? ఒకవేళ ఆంటీ మీకు సూట్ అవకపోతే విడాకులు ఎందుకు తీసుకోరు?' కాంతి షాహీన్ భుజాల మీద చెయ్యిపెట్టి హఠాత్తుగా అంది.

ఆ పిల్ల మాటలు విన్న గజల్ షాహీన్ ఒక్కసారిగా మాటలాపేశారు. కాంతికి పదిహేనేళ్ళు వచ్చాయని, ఆమె బోలెడన్ని పుస్తకాలు, నవలలు, కథలు చదివిందన్న విషయం వారిరువురు మర్చిపోయారు. ఆ పిల్ల రేయింబవళ్ళు పుస్తకాల్లోనే మునిగిపోయేది. అయినా ఆ అమ్మాయికి స్కూల్లో మంచి మార్కులే వచ్చేవి. ఆ అమ్మాయికి స్నేహితులు చాలా తక్కువ. ఎప్పుడూ ఒంటరిగానే తిరుగుతూండేది. శెలవుల్లో చదివి చదివి

అలిసిపోతే ఒంటరిగానే తిరగడానికి వెళ్ళిపోయేది. రంగులు, కుంచెలు తీసుకుని పెయింట్ చేస్తూండేది. కిటికీ తెరిచి గంటల తరబడి బైటికి చూస్తుండేది.

కాంతితో స్నేహాన్ని పెంచుకోవాలని గజల్ ఎంతగానో అనుకునేది. తను కూడా ఒంటరిదే కదా! తన మాట వినేవాళ్ళెవరైనా ఉంటే బాగుండును, వారితో తన మనసులోని మాట చెప్పుకోవచ్చు. క్రింద ఉండే రజియా, రాషిద్‌లు ఆమెతోటి సంబంధ బాంధవ్యాలు పూర్తిగా తెగతెంపులు చేసుకున్నారు. షాహీన్‌ని స్వంతం చేసుకున్న నేరానికి - ఆమె క్రిందికి దిగడానికి వీల్లేదని శాసించారు. రజియా దగ్గరికి వెళ్ళి షాహీన్ నావాడు కాడని చెపుదామని ఎన్నోసార్లనుకుంది గజల్, తాను రజియా సొత్తేమీ కాజేయలేదు. అందువల్ల కాంతితో, కులాసాగా కాలం గడపాలి అనుకునేది. కాని, కాంతి గజల్ షాహీన్‌ల మధ్య వున్న సున్నితమైన బంధాన్ని కూడా గమనించిందని నేడు తెలిసింది.

ఇక గజల్ ఎక్కడికెళుతుంది? ఉంపుడుకత్తెగా తప్ప అంతకంటే ఉన్నతమైన స్థానాన్ని ఇవ్వలేదు. రాషిద్ తననెప్పుడు దుల్‌హన్ అని పిలువలేదు. తల్లి కమ్మని రజియా తమ వంశంలోని ఏ ఆభరణాన్ని గజల్‌కివ్వలేదు. నసీర్ వంశంలోని పెళ్ళికూతురు పెట్టుకోవలసిన ఉంగరం మాత్రమే ఆమె చేతికుంది. ఈ ఉంగరమెవరిచ్చారని కూడా షాహీన్ ఎప్పుడూ ప్రశ్నించలేదు. ఇప్పుడతను మిసెస్ షాహీన్ అయిపోయిన తరువాత ఇంకా ఈ ఉంగరం తనవేలికెందుకుండాలని చాలాసార్లు ఆలోచించింది. గజల్ ఆ ఉంగరం తీసి డ్రెస్సింగ్ టేబుల్ మీద పడేసేసరికి ఏదో దిగులుగా అనిపించింది. చాలా బాధ పడిపోయింది. ఊపిరి ఆడనట్టనిపించింది. ఈ ఉంగరంలోనే నా ప్రాణాలున్నాయని నసీర్‌తో తానన్నట్టే అనిపించింది. నసీర్ లేకుండా తాను జీవించడం నేర్చుకుంది, కాని ఉంగరం లేకుండా కొద్ది నిమిషాలైనా ఉండలేక పోతూంది. గజల్ ఒకసారి ఆ ఉంగరంతో ఆడుతూండడం చూసింది కాంతి.

'ఇది మీ ప్రధానపు ఉంగరం కదూ ఆంటీ?'

'అవును! ఈ ఉంగరంలో నా ప్రాణాలున్నాయి!' అంతటి భావుకత్వంతో, కాంతి ఆ మాటలెలాగ అందో, నిజానికి ఆ రోజు తరువాత

ఆమె కాంతితో మాట్లాడేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండేది.

'మీ ప్రాణాలా...? అదెలా ఆంటీ?'

'ఇదిగో కాంతి విను!' అమె వెంటనే మాట మారుస్తూ అంది.

నేను మరణించినప్పుడు కూడా, నువ్వీ ఉంగరాన్ని నా వేలినుంచి తియ్యనివ్వద్దు.

నాకు తెలిసిపోయింది. ఈ ఉంగరం మీ ప్రేమ చిహ్నం కాని ఈ ఉంగరంలో మీ ప్రాణం ఇమడగలదని ఎందుకు మోసపోతున్నారాంటీ? కాంతి ఆమె మూర్ఖత్వానికి నవ్వసాగింది.

'నీకేం తెలుసీ విషయాలు? పెద్దదానివైతే అర్థమౌతుందీ.'

'అయితే నన్నింకా చిన్నదాన్ననుకుంటున్నారా ఆంటీ? పదహారేళ్ళ అమ్మాయిని! ఓహ్ నేనింక పెద్దదాన్ని కాదూ ఆంటీ! నేనప్పుడే 'సెక్సు' పరమైన పుస్తకాలు కూడా చదివాను.'

'అవును ఆంటీ! ఆ పిల్ల తన ధోరణిలో,' గజల్ ఆశ్చర్యపోవడాన్ని గమనించకుండా చెప్పుకుపోతోంది. ఆంటీ! మీదెలాంటి ప్రేమ? షాహీన్ అంకుల్‌ని పెళ్ళి చేసేసుకున్నారు. ఇప్పుడూ ఏడుస్తూ మొత్తుకుంటూ ఆయనతోనే కలిసి ఉండాలనుకుంటున్నారు. మీ కేసు నాకు అర్థం కావడంలేదు!

కాంతి చాలా హాయిగా గజల్ మంచం మీద పడుకుని మొగ్గలేస్తూంది, నవ్వుతూ మాట్లాడుతూంది. ఆమె కత్తిరించిన ఎత్తైన జుట్టు మొహం మీద పడుతుంది. పొట్టి గౌను క్రిందినుంచి ఆమె నల్లటి, ఆరోగ్యంగా ఉన్న తొడలు కనబడుతున్నాయి.

'అందుకనే కాబోలు నువ్వింతవరకు ఎవరినీ ప్రేమించలేదు' అతి కష్టం మీద గజల్ మంచి సరదా మూడులో ఉన్నట్టుంది. ఆమె కాంతితో స్వేచ్ఛగా మాట్లాడి సరైన సంబంధం కుదిర్చి పెళ్ళి చేసేస్తే ఈ బాధ్యత నుండి విముక్తి లభిస్తుంది కదా అని చాలా రోజుల నుంచి ఆలోచిస్తూంది.

'నేనెలా ప్రేమించను ఆంటీ? కాలేజీలో కూడా చాలామంది అమ్మాయిలదే అడుగుతారు. ఆమె గుండెలు క్రింద పెట్టుకుని బోర్లా పడుకుంది. ఎవరో ఒక అబ్బాయి గురించి ఎంతకని ఆలోచించను, నా ఊహలు మారిపోతూంటాయి.' చాలా అమాయకంగా అంది కాంతి.

'సరే ఆంటీ... ఒక మాట చెప్పనా? ఆమె లేచి కూర్చుంది. ఒక కుర్రాడు, నఆదత్, నన్ను ప్రేమించాడు కూడా!

'అచ్చా? గజల్ సర్దుకుని కూర్చుంది.

'ఏమేమి జరిగిందో, నాకంతా వివరంగా చెప్పు...!' కాని క్రాంతి ప్రత్యేకించి ఏం జరగనట్టు మళ్ళీ పడుకుంది.

తరువాత తన రెండు చేతుల్ని దిండుగా తలక్రింద పెట్టుకుని వెల్లకిలా పడుకుని కప్పుకేసి చూస్తూ, 'ఆంటీ, నా క్లాస్‌మేట్ ఒకడున్నాడు, నఆదత్, అతడెప్పుడూ నా వెంట తిరుగుతుండేవాడు ఆంటీ, ప్రతి విషయానికి నన్ను సమర్థిస్తూండేవాడు. నా కోసం క్యాడబరీ చాక్‌లెట్లు, చ్యూయింగమ్‌లు తెచ్చేవాడు. నాకు నోట్స్ కూడా తయారు చేసిచ్చాడు. అతడు మా క్లాసులో బాగా చదివే పిల్లాడు. ఒకనాడు కాలేజీకి వెళ్ళేటప్పుడు బస్‌లో నేనంటే అతనికి చాలా ఇష్టమని చెప్పాడు, అతనికి ఎప్పుడూ నా ధ్యాసేట. వెంటనే నాకు విషయం అర్థమైపోయింది.' క్రాంతి లేచి కూర్చుంది, కాని ఆంటీ నిజం చెబుతే కోప్పడరుకదా?

'లేదు, నువ్వంతా చెప్పు' ఆ పిల్ల నిజానికి కట్టుబడి ప్రాణాలను కోల్పోయిన వారి సంతానం, అన్న విషయం గజల్‌కి తెలుసు.

'అయితే అంటీ, ఒకనాటి రాత్రి, నఆదత్ మనం ట్యాంక్‌బండ్‌పైకి కలుసుకుందామంటే నేనక్కడికి వెళ్ళాను, మీరంటే నాకున్న భయం వలన అతన్నిక్కడికి తీసుకురాలేదు.

ఏ హోటల్‌లోనైనా గది తీసుకుంటావా లేక నన్ను మీ ఇంటికి తీసుకెళతావా అని అతన్నడిగాను.

ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని తన మాటలు వింటూన్న గజల్‌ని చిలిపిగా చూస్తూ మొహం మీద పడుతున్న జుట్టుని విదిలిస్తూ చెప్పింది, 'నా మాట విని అతను గాభరాపడ్డాడు. క్రాంతీ! జీవితాంతం మన కలిసి ఉండగలమా, లేదా ముందు చెప్పు మళ్ళీ అవే పిచ్చి మాటలు, ఆంటీ! నాకు నిజంగా కోపం వచ్చింది. అప్పుడు నేను అన్నాను, 'దాంతో పనిలేదు. నేను నీతో కేవలం ఇప్పటి విషయం మాట్లాడుతున్నాను, నువ్వు నాకు నచ్చావు. అందుచేత నేను నీతో వస్తాను, కాని ఆంటీ, అతడొకటే మాట పట్టుక్కూర్చున్నాడు నన్ను పెళ్ళి చేసుకుంటావా లేదా?'

'తరువాతేం జరిగింది? గజల్ ఆతురతగా ప్రశ్నించింది.

'అంతే నా మూడ్ పాడైపోయింది...!' ఆమె గట్టిగట్టిగా కాళ్ళూపసాగింది.

'నేను అతన్ని ఎందుకు పెళ్ళి చేసుకుంటాను? పెళ్ళయిన తరువాత జీవితాంతం అతని మాట వినాలి, కృతజ్ఞత కలిగి ఉండాలి. ఏ భార్యాభర్తలైనా పూర్తి స్వేచ్ఛతో ఎక్కడ జీవిస్తున్నారు? మీరే చెప్పండి ఆంటీ! మనసు పడి, భర్తని మోసం చేస్తూ జీవించడమన్నది, నేనెప్పుడూ చెయ్యను!'

'అయితే ఆంటీ, నా మాటలు విన్న అతను వెంటనే మళ్ళీ ఎప్పుడైనా వస్తానంటూ' పారిపోయాడు.

'హా, హా, హా... దిండులో మొహం దాచుకొని నవ్వసాగింది క్రాంతి.

'ఆంటీ! మా కాలేజి కుర్రాళ్ళున్నారు చూశారా! అందరూ తల్లి దండ్రులంటే భయపడి చస్తారు. వాళ్ళ అమ్మకి నచ్చనంత వరకూ వాళ్ళెవరిని ప్రేమించరు. అంతా ఒట్టి పిరికిపందలు.'

'నువ్వు ఎవరు? గజల్ ఆమెను జాగ్రత్తగా పరిశీలిస్తూ అడిగింది.'

'నేనా? నేను క్రాంతిని, ఆంటీ! మా మమ్మీ, డాడీ ఏ తప్పులు చేశారో మీకు తెలుసు కదూ! మా లెక్చరర్ గోపాల్‌రెడ్డి నాకంతా చెప్పారు. ఆయన గొప్ప జీనియస్, పెద్ద స్కాలర్ మీ తోటీ, అంకుల్ తోటీ పరిచయం చెయ్యడానికి ఆయన్నెపుడైన ఇంటికి తీసుకు వస్తాను. ఆంటీ! గోపాల్‌రెడ్డి నేను రేపేం చెయ్యాలో ఎక్కడికెళ్ళాలో చెప్పారు.

క్రాంతి మాట్లాడి మాట్లాడి అలిసిపోయింది. చాలాసేపటి వరకు కప్పుకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తూంది.

గజల్ బదులు పలుకలేదు. మౌనంగా కూర్చుని వాతావరణాన్ని చూస్తూంది, ఆ కపోలాలు కన్నీటితో తడిసిపోతున్నాయి.

ఐవానే గజల్‌కి సంబంధించిన అందమైన తోటంతా నాశనమైపోయింది. దేవిడీ అంతా నిశ్శబ్దం తాండవిస్తూంది. ఎండుటాకులు, కన్నీటిలాగ రాలిపోతున్నాయి. తరువాత షాహీన్ మాటపై చాకలి కరీమ్‌ని పిలిపించే వారు. అతడా ఆకులన్నీ ఏరుకుని తీసుకుపోయేవాడు.

మామిడి పళ్ళు, సీతాఫలాలు, సపోటాలు, నారింజకాయలు వాటంతటవే పండిపోయి, కింద రాలిపోయేవి, కాని వాటిని తీసుకోవడం కోసం ఏ

పిల్లవాడు పరుగెత్తుకొచ్చేవాడు కాడు. తోటలోని చెట్లన్నీ, క్రమశిక్షణ మర్చిపోయి మళ్ళీ పొదలతో కలిసిపోయాయి. పువ్వులు మళ్ళీ రాలిపోయాయి. గులాబీ మళ్ళను కోసి పారేసి మొక్కజొన్నలు నాటాడు తోటమాలి.

లోపలకూడా గదులన్నీ మూసి ఉన్నాయి. రజియా సాయంత్రమవ్వగానే వరండాలో దీపం వేసేది, లేదా ఆమె గదిలో దీపం వెలుగుతూండేది. రాత్రి పదకొండు గంటలకి రాషిద్ ఇంటికొచ్చేవాడు, వాళ్ళిద్దరూ అక్కడే కూర్చుని భోజనం చేసేవారు. బిస్మిల్లా సాహిబీ గబగబా గిన్నెలు సర్దుకొని పడుకునేది.

గజల్, కాంతిల కంఠధ్వని కూడా వినబడేది కాదు కిందికి. చెట్లలాన్‌లో రంగుల పిట్ట గంతుతూ హాలు ముందున్న కరివేపాకు చెట్టు మీద కూర్చుని నలువైపులా తిరుగుతూ, తోకాడిస్తూ ప్రతి ఒక్కరి క్షేమ సమాచారాన్ని ఇంగ్లీషులో అడుగుతుండేది. షూ... షూ... బూ... ఈల వేసే చిన్న పిట్టకి ఇల్లు ఇంత నిశ్శబ్దంగా ఉండేదేమిటా అని ఆశ్చర్యంగా ఉండేది. తన ప్రతి కొత్త గజల్‌ని ఈ పిట్టకు వినిపించిన వాహిద్ హుసైన్ ఎక్కడికెళ్ళారు? తన గొంతు ముందు ఈ పిట్ట గొంతు అస్సలు నచ్చని కుంటత్త ఎక్కడుంది?

'ఛో! ఇక్కడి నుంచి. దరిద్రపు మొహమా... ఎప్పుడు చూసినా, అరుస్తూంటుంది.

చాటున వలగా చేసి తన్ని పట్టుకునేందుకు ప్రయత్నించే ఆ పసిపిల్లలు ఎక్కడకెళ్ళారు? అలిగే స్వభావం గలిగి, తన్నొకసారి రాయితో కొట్టిన బషీర్ ఏమయ్యింది? తనకెప్పుడూ రొట్టెముక్కలు పెట్టే, జాలి గుండెగల బతూల్ ఏది? చిలిపిగా చంచలంగా ఉండి తన గొంతులో గొంతు కలిసి ఈలవేసే చాంద్ ఎక్కడుంది? తన ఈల కూడా నవ్వించలేక పోయిన, ఎప్పుడూ ఏడుస్తూండే గజల్...

ఈ మధ్య ఫౌజియా కూడా నెలల తరబడి పుట్టింటికి రావడం లేదు. తన ఏకైక సోదరుడు చేసిన మూర్ఖపు పనికి తల్లితోపాటు ఆమెకి కూడా చాలా కోపం వచ్చింది! బాధగా కూడా అనిపించింది. కట్నకానుకల కోసం గొడవపెట్టి దెబ్బలాడి, నెలల తరబడి ఇంట్లో సరదాగా గడిపే

కోరిక తీరక మనసులోనే అణగారిపోయింది. ఇంత జరిగినా ఆమె గజల్‌ని అసహ్యించుకోలేకపోయింది. ఎందుకంటే గజల్ తన ఈడుగల స్నేహితురాలామెకి, చిన్ననాటి సహవాసకత్తె. బహుశా తన దురదృష్టం కూడా ఒక కారణం కాబోలు భర్త ప్రేమ పొందలేక నిరాశ చెందిన ఆమె బిడ్డల నీడలో కాలం వెళ్ళబుచ్చాలనుకునే సరికి, వరుసగా ఏడుగురు పిల్లలు పుట్టేశారు. వారిలో అందరికంటే చిన్న పిల్లవాడ్ని ఫౌజియా భారం కొంతతగ్గుతుంది కదా అన్న ఉద్దేశ్యంతో, రజియా పెంచేది. ఆ చిన్నవాడికంటే మరో చిన్నవాడొచ్చే సరికి పెద్దవాడు తల్లిదండ్రుల దగ్గరకి వెళ్ళిపోయేడు. ఫౌజియా డాక్టరు భర్త ఇప్పుడు ముగ్గురు భార్యలకు రక్షకుడు. ప్రతి భార్యకి ఆరేడుగురు పిల్లలు, అందువల్ల అతను భార్యలంటే భయం పట్టుకుని ఇంటి పని మనుషులతోనూ, హాస్పిటల్ నర్సులతోనూ కాలక్షేపం చేస్తూన్నాడు. ఫౌజియా అనుపమ సౌందర్యం, అలగడం, అన్నీ ఏమైపోయాయో? పుల్లలాగైపోయింది. మూడు నాలుగు సీసాల రక్తం ఎక్కించి, ఆమె భర్త తిరిగి భూమ్మీదకు లాక్కొచ్చేవాడు.

మళ్ళీ సంవత్సరం మరొక బిడ్డని కనడానికి వియ్యాలవారు అచ్చట్లు - ముచ్చట్లు ఎక్కువగా తీర్చలేదన్న బాధలేదిప్పుడు ఫౌజియా అత్తగారికి, కాని ఫౌజియా బైటికొచ్చేది కాదు. అందరికంటే పెద్ద భార్య అవడం వల్ల, భర్తకి సంబంధించిన పనులు, సమస్యలు అన్నింటికీ ఆమె బాధ్యురాలు, ఇదికాక సవతుల తగాదాలు తీర్చడం, వారి సంతానం అవసరాలు గమనించి తీర్చడం, అన్నీ ఆమె బాధ్యతే!

పుట్టింటికొస్తే మాత్రం, పైన గజల్ దగ్గరే కాలమంతా గడిచిపోయేది. ఆమె గజల్‌తోటిది, కాని ఆమెకంటే పది సంవత్సరాలు పెద్దదానిలాగ కనబడుతూంది. అక్కడక్కడ జుట్టు నెరుస్తూంది. చిక్కిపోయి కళావిహీనంగా అయిపోయింది. గుండె దడ రక్తం తక్కువగా ఉండడం, నీరసం వల్ల ఆమె ముఖం కాంతి హీనమై పోయింది.

గజల్ అదృష్టానికి ఈర్ష్యపడేది ఆమె. ఎంత అదృష్టవంతురాలైందీ 'పిల్ల! చిన్నతనం నుంచి ఇష్టమొచ్చినట్టు భోగాలననుభవించింది. మగవాళ్ళతో బాగా జల్సా చేసింది. తరువాత షాహీన్‌లాంటి చదువుకున్న, అందమైన ఉన్నత వంశానికి చెందిన కుర్రాణ్ణి కొట్టేసింది.

ఇద్దరి జీవితం ఎంత శాంతియుతమైంది! అన్నా వదినలు దెబ్బలాడుకుంటూండగా, ఫౌజియా ఎప్పుడూ చూడలేదు. ఒకరిపై ఒకరెప్పుడూ ఫిర్యాదులు చేసుకోవడం వినలేదు. పూవుకి, తావి విచ్చినట్లు పిల్లలు కూడా పుట్టలేదు. అధిక సంతతి ఫౌజియా పాలిటి అల్లా వక్రదృష్టిగా అనిపించేది. గజల్‌ని చూడండి ఎంత హాయిగా ఉందో! ఇరవై అయిదేళ్ళొచ్చినా, పదహారేళ్ళ పిల్లలాగా ఆరోగ్యంగా ఉంది. రకరకాల ఫ్యాషన్లు, కొత్తకొత్త మేకప్‌లు... భర్త ప్రక్కదార్లెందుకు తొక్కుతాడు? పెళ్ళాం కొంగు పుచ్చుకుని ఎలా, చుట్టూ తిరుగుతాడో! చీకట్లోనో, వెల్తురులోనో ఎప్పుడైనా ఏ పనిమనిషినైనా ఏమన్నట్టూ వినలేదు.

ఇన్ని ఉన్నా, ఆమె పైకొచ్చినప్పుడు నిశ్శబ్దంగా ఐవానే గజల్ 'చూసి ఆమెకి భయం వేసేది. ఇప్పుడీ ఇంట్లో ఏ పిల్లలాడుకుంటారు?

ఏకైక పుత్రుడైన షాహీన్‌కి సంతానం కలుగకపోతే ఐవానే గజల్ చరిత్ర అంతరించిపోవలసిందేనా!

ఫౌజియా తల్లి - తండ్రులు కోరుకోకపోయినా, ఫౌజియా మాత్రం ప్రతి నమాజు తరువాత అన్న ఇంట్లో దీపం వెలిగించమని అల్లాని ప్రార్థించేది. గజల్‌కి హకీమ్‌ల దగ్గరకీ డాక్టర్ల దగ్గరికీ వెళ్ళమని సలహా ఇచ్చేది. పిల్లలు కావాలనే అభిలాషలేని ఈమె ఎటువంటి స్త్రీ అని ఆశ్చర్యపోయేది. ఒంటరిగా ఇంట్లో పడుంటుంది. ఫౌజియా చంటి పిల్లల్ని పైకి పిలిపించి వారితో ఆడుకునేది, కాని తన బిడ్డ కావాలన్న కోరికేలేదు. చిట్టచివరికొకనాడు ఫౌజియా అనేసింది.

'నువ్వెందుకు చికిత్స చేయించు కోవడం లేదు నాకర్థం కావడం లేదు.'

'నాకు సుస్తీ లేదు కనుక' గజల్ నిదానంగా జవాబు చెప్పింది.

'అయితే...? ఆశ్చర్యపోయింది ఫౌజియా.'

'విను ఫౌజియా!' గజల్ నెమ్మదిగా చెప్పడం ప్రారంభించింది. నేనొక వేశ్యనన్న విషయం నీకెందుకు గుర్తులేదు? పదిమంది మగవాళ్ళచేత తిరస్కరింపబడినదాన్ని. మరి షాహీన్ వాహిద్ హుసైన్ నవాబు పౌత్రుడు, అక్తరుద్దెలా దౌహోత్రుడు, ఐవానే గజల్‌లో ప్రవహించే రక్తం అపవిత్రం అవాలనుకుంటున్నావా? మీరు జాలిపడి మీ ఇంట్లో నాకింత నీడ

కల్పించారు ఫౌజియా! ఈ మంచితనానికి ప్రత్యామ్నాయంగా మిమ్మల్ని తలవంచుకునేలా చెయ్యదల్చుకోలేదు. మీ అన్నయ్యకిప్పుడింకొక పెళ్ళి చెయ్యి నువ్వు... గుణవంతురాలినిచ్చి చెయ్యి... మీ తల్లి దండ్రులిద్దరి వైపునుంచి మంచితనం మిగిలి ఉండేటట్టు... రెండు చేతులతో ఫౌజియాని పట్టుకుని, ఆమె భుజంమీద తల పెట్టుకుని ఏడవడం మొదలు పెట్టింది గజల్. ఫౌజియా మౌనం వహించింది. ఫౌజియా తనని గుండెలకి హత్తుకుని బోధ పరుస్తుందని... అన్నగారినీ విషయమై ప్రశ్నిస్తుందనీ భావించింది గజల్. కాని తన భుజం మీదినుంచి గజల్ శిరస్సు తొలగించి క్రిందికెళ్ళిపోయింది ఫౌజియా.

రాత్రినుంచి రాషిద్ ఒంట్లో నలతగా ఉంది, అతడికి కొద్దిగా హార్ట్ఎటాక్ వచ్చింది. అతడు ఎన్నికల్లో ఓడిపోయాడు. యాభైవేల రూపాయలు, మంత్రినవుతానన్న ఆశ, ప్రభుత్వం ఆసరా, మనిషి గుండె ఇన్ని రకాలుగా ఓడిపోవడాన్నెలా తట్టుకోగలదు.

నేడు గజల్, కాంతి క్రిందికొస్తే ఎవరూ కాదనలేదు. తన బాధల్లో తానున్న రజియాకి అడ్డగించాలన్న ధ్యాసే లేదు.

అంతా రాషిద్ గదిలో గుమిగూడి ఉన్నారు. రాత్రి తొమ్మిది గంటల సమయం. చలి బాగా పెరిగిపోయింది.

రాషిద్ ఇప్పుడు నిన్నటికంటె మెరుగ్గా ఉన్నాడు. గజల్, కాంతి క్రిందికి రావడం అతనికి, బాగుందనిపించింది. ఇల్లు కోల్పోయిన సందడి మళ్ళీ వచ్చినట్లయింది. షాహీన్ ఇదంతా తనని సంతోషపెట్టడానికి చేస్తున్నాడని అతనికి తెలుసు. అయినప్పటికీ, తనవైపు కూర్చుని షాహీన్ గట్టిగా నవ్వడం అతనికి చాలా నచ్చింది. అప్పుడే పరదా తొలగించి షేఖూభాయీ లోపలికొచ్చాడు.

చూడిదార్ పైజామా, ట్వీజ్ షెర్వానీ, తుర్కీ టోపీ, గడ్డం గీసుకొని శుభ్రంగా ఉన్నాడు. ఆ వెనుక కుంటత్తా నిలబడి ఉంది, కాని ఆవిడ ఆనవాలు కట్టలేనంతగా మారిపోయింది. జుట్టుకి రంగు వేసుకుంది. చెవులకి జూకాలు, మెళ్ళో పదిపేటల గొలుసు, చంద్రహారం, నల్లపూసల దండ, గులాబీ రంగుతో మెరిసిపోతున్న కతన్ పట్టుచీర, చేతికి మంచి ముత్యాల కంకణాలు!

గదిలో ఉన్నవారంతా ఆమెకంటే చిన్నవారే, కాని ఆమె అందరికీ ఒంగి ఒంగి సలాము చేసింది. చిట్టచివరికి రజియా దగ్గరికెళ్ళి ఆమెను కావిలించుకుని ఏడవసాగింది.

రజియాకి కోపంతో ఒళ్ళు మండిపోతూంది. ఆమె కుంటత్తని తోసేసి అంది, మీరిక్కడి కెందుకొచ్చారు? ఎవరి అనుమతితో వచ్చారు.

'హుస్స్! ఊరుకో రజియా!' రాషిద్ కోపంగా అన్నారు. అసలు మాట్లాడనియ్యకుండా వస్తూనే దెబ్బలాట పెట్టావా...'

'నాకు తెలుసు రాషిద్ మియా! రజియా దుల్‌హన్ నాతో దెబ్బలాడుతుందని నాకు తెలుసు, తిడుతుందనీ తెలుసు, ఎందుకంటే... అందరికీ దూరంగా ఒక పుస్తకం పుచ్చుకుని కూర్చుంది. ఇప్పుడు కుంటత్త మాటలు వినడానికి తమాషా చూడ్డానికి, పుస్తకం పడేసి దగ్గిరికొచ్చి నిలబడింది.

'దుల్‌హన్ పాషా! కోరికల్ని విడిచిపెట్టు? కుంటత్త అంటూంది 'మీ మామూగారు నన్ను డాబా మీంచి తోసేసి, తనతో కూడా సమాధిలోకి ఏం తీసుకుపోయారని? నువ్వేం తీసుకెళ్ళగలవని కుక్కలు పారేసిన ఎంగిలి తింటున్నారు.'

'నోరు మూసుకో సిగ్గులేని ముసిల్దానా, రజియా కోపంగా అంది', ఎంత సిగ్గులేని దానివే. ముగ్గుబుట్టకి రంగు వేసుకుని వెకిలిగా తయారయ్యావు. ఇంక నాకు సలహా చెప్పడానికి వచ్చావు!

గజల్ వెనక్కు జరిగి కోపంతో కంపిస్తున్న షేఖూభాయీని చూసింది. షాహీన్ తల్లి, కుంటత్తల మాటలు శ్రద్ధగా వింటున్నాడు. కాని కాంతి పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుతూంది. ఒక హాస్యరస ప్రధానమైన నాటకాన్ని చూస్తూన్నట్టు ఈ వాక్‌యుద్ధాని చూసి ఆనందిస్తూంది ఆమె.

'ఇంకేం చెయ్యగలను నేను! ఈ ఇంట్లోంచి నేనెక్కడికీ వెళ్ళకూడదని వాహీభాయీ నన్ను డాబా మీది నుంచి క్రిందికి తోసేసి కీళ్ళు విరిచేశారు.' అరే! నాకు మీ అందరి సంగతి బాగా తెలుసు. అంతా ఒకే కోవకి చెందినవారు. ఒకప్పుడు నన్ను క్రిందికి తోసేస్తారు. మరొకప్పుడు చాంద్‌ని మంటల్లోకి నెట్టేస్తారు!

మీ కవిత్వం తగలబడా! ఆడదాన్ని సర్వస్వాన్ని దోచుకొని, విసిరి

పారేసే ఐవానే గజల్ మీదింత మట్టి పొయ్యండి.

గట్టిగా అరిచి అరిచి గౌహర్ బేగమ్ నిస్త్రాణువుగా అయిపోయి ఒరిగిపోతూంటే షేఖూభాయీ పట్టుకున్నారు.

'చాలు గౌహర్ బేగమ్! నువ్విక్కడికి జగడమాడడం కోసం రాలేదు.'

తరువాత కుంటత్త ఒంటిమీదినుంచి ఒక్కొక్క నగా తీసి రాషిద్ కేసి విసిరేస్తూ షేఖూభాయీ అన్నాడు, తీసుకో రాషిద్ మియా ఈ నగల్ని తిరిగి సేఫ్‌లో దాచేసుకో! గౌహర్ బేగమ్ పిచ్చిది నాకు నగలక్కరలేదని నేనామెకు చెప్పాను. ఒక్క గౌహర్ చాలు.

రాషిద్ బంగారు కంకణం చేత్తో పట్టుకుని ఆశ్చర్యంగా చూశాడు, ఉప్పొంగి పోయాడు. తరువాత నలభైతులాల బరువున్న హారం వచ్చి అతని గుండెపై పడింది, అతను హారంతో పాటు గుండె పట్టుకుని ఉండిపోయాడు.

అంతా మౌనంగా ఉన్నారు. షాహీన్, గజల్, ఫౌజియా, రజియా కాంతి, ఏదైన సినిమాలో ఆఖరి దృశ్యం వచ్చేసినట్టు, అందులో విలన్, దైవతుల్యమైన రూపాన్ని ధరించి, ఒక్కొక్క రూపాయికోసం అందరి ముందూ చేతులు జాపి షేఖూభాయీ రూపంలో వేల రూపాయల విలువ చేసే నగలు రాషిద్ మొహం మీద కొట్టే దృశ్యం వచ్చేసినట్టు అంతా నిశ్శబ్దంగా తిలకిస్తున్నారు.

జీవితంలో నిజంగా ఎప్పుడూ ఇలా జరుగలేదు!

కాంతికి ఒక సమస్యలాగ అనిపించింది.

'ఇవి కూడ తీసేసుకో... గోరింటాకుతో ఎర్రగా ఉండే ఉంగరాలున్న చేతిని రజియా ముందు చాపి అంది కుంటత్త.'

'ఉండనీ... నాకింక నగలక్కరలేదు! ఏ ఉద్దేశ్యంతోటో రజియా అందరి ముందు, కేవలం పైపై మాటలుగా అంది.'

'వెళ్ళు నగలన్నీ తీసుకువెళ్ళు షేఖూభాయీ.'

'గుడుంబా తాగడానికి నేనొక కార్ఖానాలో ఉద్యోగం చేస్తున్నాను.'

దుల్హన్ పాషా మీ అభిమానానికి కృతజ్ఞుడ్ని!' షేఖూభాయి రెండు చేతులు జోడించి అలవాటుగా అతి వినయంగా అన్నాడు.

'గౌహర్ బేగంకి పెళ్ళి కూతురవ్వాలని కోరికగా ఉండేది. అందుకని

ఈ నగలన్నీ తీసుకొచ్చింది.

'అయితే అప్పుడే ఎక్కడ తీరిపోయిందావిడ పెళ్ళి కూతురు ముచ్చట?' ఒళ్ళు మండి అంది రజియా.

'కోటి కోరికలతో నిండి ఉన్న పదహారేళ్ళ కన్య కదూ! ఇంకొక రెండేళ్ళు ముసుగేసుకుని కూర్చోనియ్యండి. తోభ! తోభ! అల్లాహ్‌మియా!' రజియా గట్టిగా చెంపలేసుకుంది.

'ఐవానే గజల్‌లోని పిల్లను, అమ్మాయిలను, అల్లా రక్షించుగాక! వెధవ మొహాలు మోరాలోని పురుగుల్లాంటివారు, వీళ్ళని సమాధుల్లో పడుకోబెట్టినా సరే, చచ్చినా సరే, నమ్మకూడదు!' రజియా కుతకుతలాడిపోయింది.

ఈ దెబ్బలాట జరుగుతున్నంతసేపు రాషిద్ నోరు విప్పలేదు. చంద్రహారం అతని గుండెలపైనే ఉంది. కాంతి, రజియా షేఖూభాయి సంభాషణ కడుపుబ్బ నవ్వుతూ, వింటూంది. కొంతసేపైన తరువాత కాంతి సంశయిస్తూనే ముందుకొచ్చింది. ఆమె మంచంమీదున్న చెవికమ్మ తీసి రాషీద్ మీద పెడుతూ అంది.

'రాషీద్ అంకుల్ డెడ్ బాడీ మీద నేను అందరికంటే ముందు బంగారు పువ్వు పెడతాను.

ఇది విన్న అందరూ ఉలిక్కిపడ్డారు. షాహీన్ బాధగా లేచాడు. అతడు కుర్చీమీదినుండి లేచి రాషీద్‌కేసి ఒంగి క్షణంకాలంలోనే, తన తండ్రి మోక్షం పొంది పోయాడని గ్రహించాడు.

రాషిద్ మూడవ వర్ధంతి నాడు గజల్ ముందు హాల్లో తెల్లటి బట్ట పరిపిస్తుండగా ఎవరో నౌకరు ఒక ఉత్తరం తీసుకొచ్చి ఆమె చేతిలో పెట్టాడు. అది ఆమె పేరనే ఉంది.

'నన్ను మొత్తం పాకిస్తాన్‌లో గొప్ప పేరు ప్రతిష్టలు కలిగి అందరూ మెచ్చుకునే కవిని చేసిన ఆనాటి గజల్‌ని సంబోధించి నేను మాట్లాడుతున్నాను. కాని నా కవిత్వం రసహీనమయిపోతూంది. దానికి కారణం, నీ జ్ఞాపకాలు, చిత్రపటం, అస్పష్టమయిపోవడమే!

కనుక నవ్య జీవితాన్ని పొందడానికి నీ దగ్గరికొస్తున్నాను. నాతో నా భార్య కూడా ఉంటుంది.

ఇంకెవ్వరికీ స్వంతం అయ్యే అవకాశం లేని,

నసీర్

గజల్ ఉత్తరాన్ని మడిచి కవరులో పెట్టింది. పొద్దు వారుతున్నప్పటి నిరాశ, వర్థంతి జరుగనున్న ఈ ఇంట్లోని నిశ్శబ్దత, ఆమెనావరించాయి. తివాసీ కొస చేత్తో పట్టుకున్న ఆమె అన్నీ మర్చిపోయింది. ఈ పది సంవత్సరాల్లో ప్రాంగణమంతా వ్యాపిస్తున్న చీకటిని మాత్రమే చూస్తున్నట్టనిపించిందామెకు.

ఆమె ఎదురు చూస్తోంది - ఏదో సవ్వడికై, ఎవరో సన్నగా పాడుతున్నట్లున్న స్వరం కోసం, మేరా షాయరా, జానే గజల్, ఐవానే గజల్, మేరీ గజల్...!

అతడు మిసెస్ షాహీన్‌ని కలుసుకుని ఎంత నిరాశపడతాడు? నేనతడి గురించి ఎందుకు ఎదురు చూడాలి? అతడి కవిత్వపు మూడ్‌ని నాశనం చేస్తాను. అతడి కవిత్వ దృష్టిని మార్చివేస్తాను...

నసీర్‌ని ఏడిపించడం కోసం ఆమె షాహీన్ ఎడల మరింత అభిమానంతో వ్యవహరించసాగింది. ఫౌజియా అన్నట్టు, తన రూపు రేఖల్ని, అందాన్ని, ఎవరి గురించో ఎదురుచూస్తూ వృథా చేసింది. మేకప్ ఎక్కువయ్యింది. తనకు బాగా నప్పే చీరలన్నీ తీసింది. సాయంత్రం షాహీన్‌తో పాటు ఆబిద్ షాప్‌కెళ్ళింది. శరీరంలో భాగాలను చక్కగా ప్రదర్శించడానికి వీలుగా ఉన్న అనేక రకాల జాకెట్లు కుట్టించుకుంది. తను మర్చిపోయిన నవ్వుని తిరిగి గుర్తు చేసుకుంది.

నసీర్ భార్య, పనికిరాని మోడల్‌లా తెల్లగా గుండ్రంగా ఉంది. ఇద్దరు పిల్లలు పుట్టగానే ఊరిపోయింది. ఒక పద్ధతి పాడూ లేకుండా కుట్టిన బట్టలు వేసుకుని, పిచ్చి మేకప్‌తో ఉంది. అనవసరమైన బలహీనతల్ని కూడా సహించలేక ముక్కు మూతి విరుస్తోండే మనిషి. చిన్న చిన్న విషయాలకి కూడా నసీర్ ఆమెను బ్రతిమాలవలసి వచ్చేది.

చూసేవాళ్ళ ప్రాణాలను హరించగలిగే శరీరలావణ్యం, మత్తెక్కించే కళ్ళు, సర్వం మరిపించగల ముఖము, ఏమీ ఎరుగనట్లు అపరిచితుడిలాగే గజల్‌ని కలిశాడు నసీర్. అది గజల్‌కి కూడా నచ్చింది. భార్య ముందు నసీర్ తన పరువు తీస్తాడేమో అని ఆమె భయపడింది.

రజియా అతణ్ణి చాలా గౌరవించింది. మర్యాదలు చేసింది. ఇల్లంతా ఒకసారి సందడితో నిండిపోయింది. నసీర్ భాయీని కలుసుకోవడానికి, ఫౌజియా కూడా పిల్లలతో వచ్చింది. దూరం వెళ్ళిపోతే మాత్రమేం? రక్త సంబంధమైన ప్రేమ ఎప్పుడో ఒకప్పుడు చివరికి లాక్కొచ్చింది. షాహీన్ అన్నలాగ అతణ్ణి ఆహ్వానించాడు. నసీర్ మొట్టమొదటిసారి హైదరాబాదు వచ్చినప్పటి లాగ వారిద్దరూ ప్రవర్తించసాగారు.

నసీర్, షాహీన్ వైద్యవృత్తి గురించి వ్యంగ్యంగా మాట్లాడితే, అతని భీమకాయం చూసి, పాకిస్తాన్‌లో కవుల ఎడల చూపే గౌరవంపై ఛలోక్తులు విసిరాడు షాహీన్. కొంచెం సేపట్లోనే వాళ్ళిద్దరూ, గజల్, నఫీస్‌లు చేసే పనుల గురించి చెవులు కొరుక్కుంటూ నవ్వుకోసాగారు. మొట్టమొదటిసారి నసీర్ హైదరాబాదు వచ్చినపుడు గజల్ గురించి చెబుతూ జాగ్రత్త సుమా అని తను హెచ్చరించిన మాట షాహీన్‌కి జ్ఞాపకమే లేదు. ఔరంగాబాదు వెళుతున్నప్పుడు, దారిలో సర్వస్వం కోల్పోయిన బాటసారిలా ఏడుస్తూ నసీర్, షాహీన్‌తో అన్నాడు, 'షాహీన్ నేను చచ్చిపోతాను. నాతో సహకరిస్తావని కేవలం నీ మీదే ఆశ పెట్టుకున్నాను. ఖుదా మీద ఒట్టు, లేకపోతే నేను విషం మింగేస్తాను. నువ్వింకెప్పుడూ నా ముఖం చూడలేవు.

ఇప్పుడు రాగానే, షాహీన్ భార్యనెరగనట్టు, వారికి వివాహ సందర్భమైన అభినందనలు అందచేశాడు. అతడు గజల్ భాభీ, గజల్ భాభీ అనడం ప్రారంభించాడు.

ఇంత పెద్ద అబద్ధాలు వాళ్ళెలా చెప్పగలిగారో అని ఆశ్చర్యంతో గజల్ ఒకసారి నసీర్‌ని, మరొకసారి షాహీన్‌ని చూసింది. షాహీన్ నసీర్ ముందు గజల్‌తో కొత్త పెళ్ళి కొడుకులాగ వ్యవహరించాడు. క్షణం సేపైనా గజల్ ప్రక్కనుంచి జరిగి కూర్చునేవాడు కాడు. గజల్‌కి గాభరా వల్ల గుండెదడ పట్టుకుంది. అందరూ మొహాలకి రంగులు పులుముకుని ఏదో నాటకంలో నటిస్తున్నట్టుందంతా, తెర కిందికి పడేలా వుంది. అప్పుడు ఇంకొక తమాషా ప్రారంభమవుతుంది.

నసీర్ సరదాగా కాలం గడపడానికి భారతదేశం వచ్చాడు. హృదయంలో నిద్రాణమైన భావాలను మేల్కొల్పడానికి, అవి క్రాంతిని చూడగానే మేల్కొన్నాయి. ఆహా!, ఏమా యౌవనపు శోభ! అతనికి 'జోష్'

జ్ఞాపకమొచ్చాయి. ఆహా, ఎలాంటి పిట్టని పెంచాడంటూ షాహీన్ ఎంపికని మెచ్చుకున్నాడు. ఐవానే గజల్‌లో ఒక కొత్త ప్రేయసి వచ్చింది. ఈసారిక్కడ మరొక క్రొత్త కథను విడిచి వెళ్ళాలనుకున్నాడతను. అందుచేతనే అతను గజల్ పట్ల ప్రత్యేకంగా శ్రద్ధ కనబరచలేదు. అతను షాహీన్‌తో కలిసి ఉండి ఆ నూతన వ్యక్తి విషయంలో భాగస్తుడవడం మంచిదనుకున్నాడు. కాని షాహీన్‌కి ఈ నవయౌవ్వన వనిత విషయంలో ఇంకెవరూ పాలుపంచుకోవడం ఇష్టం లేనట్టనిపిస్తుంది. లేకపోతే ప్రళయాన్ని సృష్టించగల అందాన్ని చూడనట్టు ఊరుకోవడానికి ఏ కారణమైనా ఉందేమో!

'నువ్వీ పిట్టని చాలా గొప్పగా పెంచావు.' ఒకనాడు ఓర్చుకోలేక అనేశాడు నసీర్. షాహీన్, నసీర్‌ని కోపంగా చూశాడు. మనసులో ఏ మూల్లో కూతురి స్థానాన్నివ్వక పోయినా, కాంతి యౌవ్వనానెప్పుడూ షాహీన్ దురుద్దేశంలో చూడలేదు. బహుశా నాలుగైదేళ్ళ పిల్లప్పట్నుంచి ఎత్తుకుని పెంచడం వల్ల కాబోలు, అతడు కాంతికి ఆట వస్తువులు తెచ్చిచ్చాడు, తన పక్క మీద పడుకోబెట్టి జోకొట్టి నిద్రపుచ్చాడు. రజియా ఎప్పుడూ కాంతిని లైలా కుక్క అనే అంటూండేది. నసీర్ మాట అతనికి నచ్చలేదు. అందుకని రాత్రి అతను జీవితంలో మొట్టమొదటిసారి కాంతిని కేకలేశాడు.

'ఇంట్లో బంధువులున్నారు, ఎప్పుడూ మినీ గౌనులు బెల్-బాటమ్ వేసుకోవద్దు.'

అంకుల్ తన బట్టల విషయం ఎప్పుడూ పట్టించుకోకపోవడం వల్ల, మొదటిసారి కోప్పడేసరికి భయపడి పోయింది కాంతి. కానీ జవాబు చెప్పకుండా మౌనం వహించింది. అలాగ ఊరుకోడానికి గల మరొక కారణం ఏమిటంటే ఆమె అంకుల్‌కు ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి.

'ఇవాళ నువ్వు ఇంట్లో ఎందుకున్నావు? కాలేజీకి వెళ్ళలేదేం? షాహీన్ మళ్ళీ అడిగాడు. నసీర్ ఇక్కడున్నంత కాలం, కాంతి వీలైనంత తక్కువ సేపు ఇంట్లో ఉండడం మంచిదనుకున్నాడు షాహీన్. నిజానికి ఆమె ఇంట్లో ఎక్కువ సేపు ఉండేది కాదు. ఆమె ఎప్పుడూ గోపాల్‌రెడ్డితో కలిసి ఉండేది. అతడు నక్సలైట్ల ఉద్యమంలో పాల్గొనడం వల్ల కళాశాల

నుంచి తీసేశారు. అతనితో పాటు కాంతిని కూడా ఉద్యోగం లోంచి తీసివేశారు.

'అంకుల్ అతడు... ఆ గోపాల్ రెడ్డి...!' కాంతి చెప్పడానికి జంకుతూంది.

'ఇంక గోపాల్ రెడ్డితో స్నేహం మానెయ్యి. ఒకసారి ఉద్యోగం పోగొట్టుకున్నావు. ఈ ఉద్యోగం కూడా పోతుందేమో జాగ్రత్త' షాహీన్ నెమ్మదిగా బోధపరిచే ధోరణిలో అన్నాడు. ఎందుచేతనంటే ఉపదేశాలు వినేవాళ్ళల్లో కాంతి లేదనే విషయం అతనికి తెలుసు.

కాంతి జుట్టు వెనక్కి విదిలిస్తూ మెల్లిగా అంది, 'అదికాదు జరిగింది...'

'మళ్ళీ ఉద్యోగం పోయిందా...?' షాహీన్ ఆశ్చర్యంగా అడిగి తనగదికేసి వెళ్ళిపోయాడు. ఎక్కడికన్నా వెళ్ళనీ నాకేం? అలమరా తెరచి బాటిల్ మీద మూత తీస్తూ అనుకున్నాడు అతను.

చాలాకాలం తరువాత నఫీస్ - నసీర్లతో సరదాగా కాలక్షేపం చేసి గజల్ పైకొచ్చేసరికి రాత్రి పన్నెండైంది. షాహీన్ ఎవరో పేషెంట్ని చూడడానికి వెళ్ళాడు. కాంతి గదిలో ఇంకా దీపం వెలుగుతూంది. చదువుకుంటూందనుకుందామె, ఈ పిల్ల ఎటు వైపు పయనిస్తూందో? ఎక్కడెక్కడ తిరుగుతూందో, ఏమీ చెప్పదు అచ్చం మగపిల్లల్లాగ జర్సీ, బెల్‌బాటమ్ వేసుకుని తిరుగుతుంది. సిగరెట్లు కాలుస్తుంది. ఆడపిల్లలకి సంబంధించిన విషయాలేవి నేర్చుకోలేదు పిల్ల - మేకప్ చేసుకోవడం, మంచి బట్టలు వేసుకోవడం కాని సినిమాలు చూడడం... ఏ సరదా లేదు.

తన గదికేసి వెళుతూ గజల్ ఆగిపోయింది. తెల్ల కమీజు, నీలం ప్యాంటు వేసుకుని సిగరెట్ వెలిగిస్తూంది కాంతి, ఆమె జుట్టు మొహం మీద పడి వుంది. గదంతా ఏదో సామానుతో నిండి ఉంది.

'ఈ సామానేమిటి?' గజల్ లోపలికొచ్చి అటూ ఇటూ చూసింది. అవి నల్లటి గుడ్డతో కట్టిన రైఫిల్స్ తుపాకీ గుళ్ళున్న పెట్టెలు... గజల్‌ని చూసి కాంతి గాభరాపడిపోయింది. 'మీరు కంగారు పడకండి. నేను ఇంక ఇక్కడికి రాను. మిమ్మల్ని ఇబ్బంది పెట్టను!'

'నువ్వెక్కడికి వెళుతున్నావు? ఏం చెయ్యడానికి...? నేనివాళ గోపాల్‌రెడ్డితో వెళుతున్నాను. ఇప్పుడు మాతోటి వాళ్ళు కూడా

వస్తూంటారు' మీరు కంగారు పడకండి, నేనింక ఇక్కడికి రాను, మిమ్మల్ని ఇబ్బంది పెట్టను!

'నువ్వెక్కడికి వెళ్తున్నావు. ఏం చెయ్యడానికి...?' చాలా సేపటి తరువాత గొంతు సరిచేసుకుని అడిగింది.

'నేను యుద్ధం చెయ్యడానికి వెళ్తున్నాను... ఖాళీ సిగరెట్ పెట్టెని ఒక తన్నుతన్ని ఎదురుగా ఉన్న పెట్టెలపైన ఒక దుప్పటీ వేస్తూ అంది కాంతి.'

'ఇవాళ మీరు వార్తలు చదివారా ఆంటీ? వరంగల్‌లో ఏడుగుర్ని ఉరితీసేశారు... మనిషి నెత్తురు అంత చౌకా ఆంటీ?' ఆమె గదిలో అటూ - ఇటూ తిరుగుతూ కొన్ని వస్తువులు జేబుల్లో నింపుకుంటూంది... తమ హక్కులు, విముక్తి, న్యాయం అడిగినందుకు గాను వేసేటువంటి శిక్షల కంతం ఉండదా?

'కానీ ఇది చాలా అపాయకరమైన మార్గం, కాంతీ, గజల్ ఎంతో దుఃఖంతో అంది. ఆమెకి కైసర్ - సంజీవాల పరిణామం గుర్తుకొస్తూంది.

'దోపిడీలు, హత్యలు, బందిపోట్లుగా దోచుకోవడం కాకుండా వేరే మార్గం ఉండొచ్చు... దాన్ని గురించెప్పుడైనా ఆలోచించావా?' గజల్ అలిసిపోయి మంచంమీద కూర్చుంది.

'మా డాడీ అన్నారు, కాంతి సిగరెట్ వెలిగిస్తూ అంది, న్యాయ భిక్ష అడిగినందుకు, నాకు ఉరితాడు లభించింది.'

'ఇప్పుడు నాకేం లభిస్తుంది?' ఒళ్ళువుండి అడిగింది గజల్, తిరుగుబాటుదార్ల సంతానం! చివరికి అదే పోలిక వచ్చింది కదా!

'కాంతి!' ఆమె కళ్ళు మూసుకుని తల పైకెత్తింది,

అపరిచితులకై గజల్ హృదయంలో ఎప్పుడూ ప్రేమ పొంగి పొర్లుతుంది. ఆమెకు ఏ వస్తువు అయినా నచ్చితే, దానిలోని చెడు, దానంతటదే మాయమయిపోయేది. నసీర్‌లాంటి కళ్ళతో చిరునవ్వు నవ్వి అతని చిన్న కూతుర్ని గజల్ ముద్దు చేస్తే, అందులో సంతోషించాల్సిందేమీ లేదు. నిజానికై ప్రాణం పెట్టడం ఆమె పాత అలవాటు. ఒక వారం రోజుల్లోనే, నఫీస్‌తో కలిసి ఎన్నో మజిలీలు దాటేసింది గజల్.

పిల్లల్ని బాదడం, భర్తతో దెబ్బలాడడం అయిపోయాక సమయముంటే

నఫీస్ పైకొచ్చేసేంది. నఫీస్, గజల్ ఒకే మంచంమీద పడుకుని కబుర్లు చెప్పుకొనసాగారు. ఆసక్తికరమైన మాటలు, రహస్యాలు అత్తా ఆడబిడ్డలు పెట్టే ఆరళ్ళు - భర్త రొమాన్స్‌కి సంబంధించిన కథలు, ఇద్దరు సన్నిహితులైన స్నేహితురాళ్ళు మాత్రమే చెప్పుకునే కబుర్లన్నీ చెప్పుకున్నారు.

ఒక సాధారణ వనితలాగ ముందు ఉజాలా బేగమ్ అత్యాచారాల గురించి చెప్పింది - నఫీస్ తరువాత తమ కుటుంబం తన అందచందాల గురించి గొప్పలు చెప్పింది. చిట్టచివరికి నసీర్ విషయానికొస్తూ, మీ నసీర్ భాయీ ఉన్నారు చూశారా, చాలా ఇదైన మనిషి... గర్వంగా సున్నితంగా చెప్పింది.

'పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకుంటాను, లేదా జీవితాంతం బ్రహ్మచారిగానే మిగిలిపోతాను అనేవారు నాతో. ఆయన కవిత్వంలో, అంతా నేనే నిండి ఉన్నాను.

ఇది విన్న గజల్ ఆశ్చర్యపోయింది.

ఆయనతో పెళ్ళి జరిగినప్పుడు నాకు చాలా భయమేసింది, కవులంటే బోలెడంతమంది అమ్మాయిలు మీద పడి చస్తారు కదా! పాకిస్తాన్‌లోని కవులు చీమలు పట్టిన కబాబ్‌లాంటివారు. ఎంతమందో ప్రియురాళ్ళు వాళ్ళ ప్రాణాలకి చుట్టుకుని ఉంటారు.

'ఆ, అయితే నీతో ఇంకా ఏం చెప్పేరు నసీర్?' గజల్ ఏదో పోగొట్టుకున్న ధోరణిలో ప్రశ్నించింది.

'నేను ఆయన కోరుకున్న మొట్టమొదటి, చిట్టచివరి అమ్మాయినని ప్రమాణం చేసి చెప్పారు.'

గజల్ నవ్వాలనుకుంది, కాని ఓడిపోయి, గట్టిగట్టిగా కాళ్లు ఊపడం మొదలెట్టింది.

'నిజానికొకసారి ఆయన, ఒకమ్మాయి తనని ప్రాణప్రదంగా ప్రేమించిందని ఒప్పుకున్నారు.'

'అబ్బా? అకస్మాత్తుగా నఫీస్ కత్తితో ఒక్కపోటు పొడిచినట్లు ఉలిక్కిపడింది.'

'అవును!... చాలా గొప్ప రసికుడు మీ నసీర్‌భాయీ ఆ పిల్ల భారతదేశంలోనే ఉందని నాకు తెలుసు. అందుకనే నేను పంతం పట్టి

ఆయనతో పాటు వచ్చాను. ఆమె ఇంకా నా కోసం ఎదురు చూస్తూంటుందని, నన్నోడిపించడానికి అంటూంటారు.

'ఊహ్...' కోపంతో పెదవులు కొరుక్కొంది గజల్.

'కాకపోతే ఏమిటి? నఫీస్ నిశ్చింతగా అంది.' ఒక అందమైన పిల్ల నేనంటే పడి చచ్చేది. కాని ఆ అమ్మాయి ప్రేమించడానికి మాత్రమే పనికొస్తుంది. అంటారాయన.

గజల్‌కి అలసటగా అనిపించి కళ్ళు మూసుకుని పడుకుంది, కేవలం ప్రియురాలు మాత్రమే... నసీర్ ప్రేయసి, దిల్‌గరామీ ప్రియురాలు... ఖాన్ ప్రేయసి... షాహీన్ ప్రేయసి... సర్వార్ ప్రేయసి... జాన్ గజల్... షాయార్ గర్ (కవికంఠ)... ఐవానే గజల్ ప్రియురాలు...!

తరువాత నఫీస్ గుండెల మీద కొంగు సరిచేసుకుని చాలా గర్వంగా భార్య ప్రాముఖ్యతని వెల్లడించింది, ఇప్పుడు నేను గట్టిగా కట్టి పడేశాను. నాకోసం సూదిలోంచి దారంలాగ దూరిపోతారు...

గజల్ ఎలాగో ఆ గదిలోంచి తన గదిలోకి వచ్చింది... చావు జ్ఞాపకమొచ్చినట్టు.

గోడకేసి తలకొట్టేసుకోవాలనింపించింది. పక్కమీద పడి కాళ్ళు చేతులూ కొట్టుకోసాగింది.

మనసు బ్రద్దలయినట్లు వుంది. దీన్నే హార్ట్ ఎటాక్ అంటారు, గుండెపై ఒక గట్టి దెబ్బ తగులుతుంది. పెద్ద గాయం ఏర్పడుతుంది. కాని నా హృదయంలో గాయానికెక్కడైనా చోటు మిగిలి ఉందా? పళ్ళు కొరుక్కుంటూ, చీర విప్పి పారేసింది. ఎవరినో చంపెయ్యాలనీ నాశనం చేసేయ్యాలని చేతులు తొందరపడుతున్నాయి. ఆమె అటు తిరిగేసరికి ఎదురుగా డ్రెస్సింగ్ టేబుల్ అద్దం ఉంది. ఆమె ముఖం ఎర్రగా కందిపోయింది! జుట్టు విరబోసుకునుంది.

...జుగుప్స కలిగింది. గజల్... జాన్ జాన్...!

షాహీన్ మెడికల్ కిట్ తీసి అయోడిన్ సీసా ఒకటి తీసింది. ఆలోచించి లెటర్ ప్యాడ్ మీద వ్రాయసాగింది.

'నా చావుకు నేనే బాధ్యురాల్ని,

ఆమె ఇంకా విషపు సీసా మూత తియ్యనైనా లేదు, గుండెలో

ఓర్చుకోలేనంత నొప్పి కలిగింది...

ఆమె నలువైపులా చూసింది. ఆ ఇంటి గురించి ఎన్నెన్ని కలలు కన్నది... అలమరాలో ఎన్నో వస్తువులు పోగు చేసింది - రంగు రంగుల చీరలు, రకరకాల జోళ్ళు బోలెడన్ని మంచి ముత్యాల నగలు, వీటి కోసం గంటలు తరబడి ముఖానికి రంగులు పూసుకోవలసి వచ్చింది. సారాకంపులో మునిగి ఉన్న మగాళ్ళ ప్రేమ, బట్టతల ముసలాళ్ళ వెకిలి వేషాలు నవయువకుల వేగిరిపాటు ఎటువంటి విషాలు తాగింది, ఈ అలమరాలలో సినిమా పాటల పుస్తకాలు నిండి ఉన్నాయి. తన నటనని మెచ్చుకుంటూ రాసిన పేపర్ కటింగ్స్ ఉన్నాయి. చిన్నది పెద్దది కప్పులు, షీల్డ్‌లు తన ఆల్బము.

ఈ ఆల్బము తన జీవితానికి అద్దం పడుతుంది. ఇందులో ఎరుగున్న మొహాలెన్నో, ఉన్నాయి. ఆమె లేచి దాన్ని తెరిచింది. అందులో ఉన్నవారంతా, తనపై ప్రాణాలర్పించడానికి సిద్ధంగా ఉన్నవారే, కానీ గౌరవాన్నెవరు అర్పించలేకపోయారు. వారు తమ యౌవ్వనాన్ని ఆనందమయం చేసుకోవాడానికి ప్రియురాల్ని చేసుకున్నారు, తరువాత భార్యలుగా మాత్రమే కాగల వారిని వివాహం చేసుకున్నారు. అగ్గిపెట్టె తీసుకుని ఆల్బము అంటించడం మొదలు పెట్టింది.

చచ్చేముందు ఈ ముఖాలన్నిటినీ తగలెయ్యాలి.

ఫోటోలన్నీ గబగబా కాలిపోయాయి, కాని రబ్బర్, తోలుతో ఉన్న అట్ట కాలడానికి చాలా సేపు పట్టింది. బూడిద పోగుచేసి పారేద్దామనుకుంటే, బూడిదలో సగం కాలిన ఫోటో కనబడింది. అది సర్‌వార్ కన్ను, ఇంకా రెప్పలార్పకుండా తననే చూస్తోంది. సర్‌వార్ ఆఫర్‌తోపాటు ఈ ఫోటోతనకి లభించింది. ఆ ఫోటో నాడిస్తూ ఇల్లంతా తిరిగింది గజల్.

'ఈ హాజరత్‌ని గమనించింది, కవిత్వం చెబుతూంటారు. నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు.'

నేనన్నాను వెళ్ళవయ్యా కవీ! నీ కవిత్వపు మూడ్ నెందుకు పాడుచేసుకుంటావ్! నేనింకా ఎన్నో నాటకాల్లో అభినయించాలి, పెళ్ళికి తీరుబడేది? ఇవాళ సర్‌వార్ మొహం పూర్తిగా కాలిపోయింది. ఒక్క కన్ను మాత్రం మిగిలి ఉంది. నాకేసే చూస్తోంది.

కిటికీ దగ్గరికెళ్ళి ఆ ఫోటో ముక్కను కింద వదిలేసింది. చాలా సేపు ఆ ముక్క కొట్టుకుంటూ చివరికి ఏదో రాయికెళ్ళి కొట్టుకుంది.

ఆమె మనసు చల్లబడింది - తనుకూడా ఎవరో ఒకర్ని ఉంచవలసిన స్థలంలో ఉంచింది.

లోపలికొచ్చింది, లెటర్‌ప్యాడ్ ఎదురుగా, పెట్టుకుంది.

నా చావుకి నేను బాధ్యురాల్ని.

ఎందుకు? నా చావుకి నేనెలా బాధ్యురాల్ని అవుతాను? ఉర్దూ కవులందరూ నా చావుకి కారకులు. ఒక కొత్త ప్రేయసికై ఎదురుచూస్తూ బంగారు ప్రేముల్లో బంధింపబడి మౌనంగా గదిలో పడున్న ఐవానే గజల్ నివాసులంతా నా చావుకి కారకులు. కొత్తగా ఎవరి ప్రేమకైనా గురి అయి వాళ్ళు యుద్ధానికెళ్ళినా ప్రియురాళ్ళ డోలీల్లో కూడా వెళ్ళేవారు. తన వారికి దూరంగా పనుల ఒత్తిళ్ళ, అభిరుచులకి దూరంగా, ఏడుపుల, నిట్టూర్పుల సవ్వడులు వినిపించనంత దూరంగా ఉండేవారు.

గజల్ తెరిచిన పెదవులపైకి ఒరిగిపోయాడతను! 'నువ్వు ఈ నాటికి కూడా నా కవిత్వానికి ప్రాణానివి, కానీ ప్రపంచానికి మన ఈ పిచ్చి ప్రేమకు సంబంధించి సాక్ష్యం ఏదీ దొరకకూడదని నా కోరిక.'

అతడు గజల్‌ని ఎంతసేపు చుంబించాడో, ఎప్పుడు బైటికి వెళ్ళిపోయాడో తెలియదు.

ఉలిక్కిపడ్డ గజల్ ఉంగరం లేని తన వేలిని తడువుకుంది. క్రిందనుంచి స్తంభాల్నెవరో కూలదోస్తే, కప్పు కూలిపోయినట్టు ధమ్మని కూలిపోయింది.

ఐవానే గజల్‌లో అన్నింటికంటే పెద్దది, అందమైనదీ, అయిన బైత్-ఉల్-గజల్‌లో, చక్కగా స్నానం చేయించి, అలంకరించబడిన గజల్ శవం ఉంచబడింది. అప్పుడు కూడా అనాదికాలం నుంచి వస్తూన్న అదే అమాయకత్వం విరాజిల్లుతుందామె ముఖంలో. ఆ అమాయకత్వం తోటే ఎందరో మగవాళ్ళని పిచ్చివాళ్ళని చేసిందామె. తన కన్నీళ్ళని అంతం చేసేసి ఇప్పుడామె మెల్లిగా నవ్వుతూన్నట్టుంది.

కరివేపాకు చెట్టు క్రింద రెండు చేతులతో తలపట్టుకుని అచ్చం తాతగారిలాగ కూర్చున్నాడు షాహీన్. ఇల్లంతా జనంతో నిండిపోయింది. ఇంగ్లీషులో మాట్లాడే పిట్ట షాహీన్ దగ్గరకే వచ్చి ఈ దుస్సంఘటన

గురించిన వివరాలడిగితే, అతడు తలెత్తి ఆ పిట్టని చూశాడు...

'ఆమెందుకు చచ్చిపోయిందో నాకేం తెలుసు? కవులు వ్యాసాల్లో ప్రేయసి మరణం వర్ణించలేదు. అతడెవర్నీ కాంక్షించడు. విశ్వాసపు కొలమానాన్ని కోరడు...!'

ఒక వారం తరువాత నల్లబుర్ఖా వేసుకున్న కాంతి వచ్చింది. గజల్ ఆంటీ చావు ఆమెను కదిలించి వేసింది. చాలా ఏడ్చింది. ఆమె శవంపై కప్పి వున్న బట్ట తొలగించి గజల్ వేలు తడిమింది. పిమ్మట షాహీన్ అంకుల్ దగ్గరకి వెళ్ళి మెల్లిగా అంది, 'అంకుల్ ఆంటీ వేలికున్న ఉంగరం ఏది?'

కాంతి ఈ అర్థంలేని మాటలకతడు జవాబివ్వలేదు.

'ఆంటీ చావుకి కారణం నాకు తెలుసు...'

ఇప్పుడామె నసీర్‌కి ఎదురుగా నిలబడింది. ఆతడామెను కాంక్ష నిండిన కళ్ళతో చూస్తున్నాడు.

'నసీర్ అంకుల్! ఆంటీ ఉంగరం పోయింది కనుక ఆమె మరణించింది. నేను మరణించిన తరువాత కూడా ఉంగరం తియ్యవద్దు. అందులో తన ప్రాణముండేదని ఆమె నాతో చెప్పింది.

'అచ్ఛా, ఎలాంటి ఉంగరం అది నఫీస్' ఆశ్చర్యంగా అడిగింది.

నసీర్‌ని తన చావుకి కారణంగా నిర్ధారిస్తే అతడికెంత చెడ్డ పేరొస్తుంది? నఫీస్ అలిగి పుట్టింటికెళ్ళిపోతుంది. నసీర్ పోలికలున్న ఆ చిన్న పిల్ల తల్లికోసం ఏడ్చి ఏడ్చి చచ్చిపోతుంది. ఇంక నసీర్ రెండు చేతుల్లో ముఖం దాచుకుని కూర్చుంటాడు. మొత్తం పాకిస్తాన్‌లో అతని శత్రువులంతా అతణ్ణి విమర్శిస్తారు. అతడికున్న పేరు మట్టిలో కలిసిపోతుంది. నసీర్‌కి సంబంధించిన ఈ భయంకరమైన ఊహాల్ని తన ముందునుంచి తీసి పారేసింది.

మరేం రాయను... ఎవర్ని హంతకుడిగా నిలబెట్టాలి?

'గజల్'

ఆమె తిరిగి చూసింది.

నసీర్ ముఖంలో కనబడుతున్న ప్రశ్నలన్నింటిని ఒక్క చూపులో చదివేసింది గజల్. పది సంవత్సరాలనుంచి పరితపిస్తున్న శరీరం, అశాంతిగా

ఉన్న కళ్ళు, ఎంతో ప్రయత్నం మీద నఫీస్, షాహీన్‌ని తప్పించుకుని అతడక్కడికి వచ్చాడు. ఇన్నేళ్ళుగా సుషుప్తావస్థలో ఉన్న గజల్ శరీరంలోని సమర్పణాభావం, తననితాను రక్షించుకోలేని భావోద్రేకంతో నిండిపోయింది. పది సంవత్సరాల అనంతరం నసీర్ నేడామె ఎదురుగా ఉన్నాడు. అతణ్ని చూసిన గజల్ ఏమీ తెలియని కన్యలాగ వణికిపోతూంది. అప్పుడామె తన చావు సంగతి మర్చిపోయింది. నఫీస్ - షాహీన్లు కూడా గుర్తుకు రాలేదు, నసీర్ ఆమెకింకా చేరువగా వచ్చాడు - ఎంత దగ్గిరగా వచ్చాడంటే ఆమె తెలియకుండానే అతన్ని చుట్టుకుపోయింది.

కాని నసీర్ తన నడుముపై ఉన్న ఆమె చేతుల్ని తీసి పట్టుకున్నాడు.

'గజల్, ఈ ఉంగరం ఇచ్చెయ్యి, ఈ ఉంగరం నఫీస్ పెట్టుకోవాలని అమ్మ చెప్పింది. నేను నీకింకా ఎన్నో బహుమతులు ఇచ్చి వెళతాను... ఆ... ఒకనాడు నన్ను కూడా కరుణించి, కాని షాహీన్‌కి తెలియకుండా సుమా! నీ జ్ఞాపకాలు నా ప్రాణానికే ముప్పయి కూర్చున్నాయి...'

ఆమె నోరు తెరుచుకుని నసీర్‌ని చూస్తూంది. ఆమెలో విని అర్థం చేసుకునే శక్తి నశించిపోయింది, చేష్టలుడిగిపోయాయి. ఎవర్నో పట్టుకోవడానికి పైకి లేచిన ఆమె చేతులు అలాగే ఉండిపోయాయి. నసీర్ మెల్లిగా ఉంగరం తీసేసుకున్నాడు.

'నీకెలా చెప్పను, నీ వియోగంలో నా ప్రాణం...?'

గజల్ ఐవానే గజల్ నుంచి వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోతుంటే ఎవరి కళ్ళలోనూ కన్నీళ్లు లేవు. రజియా, ఫౌజియా, నఫీస్, నసీర్ ఎవరికీ కన్నీళ్ళు లేవు. రజియా, ఫౌజియా, క్రాంతి అక్కడినుంచి మాయమయ్యారు. చిట్టచివరి చూపులకోసం జనం గజల్ మొహంపై బట్ట తొలగించేసరికి షాహిన్‌కి కనబడలేదు. అతడి కళ్ళలో గజల్ రూపం అస్పష్టంగా అయిపోతూంది.

నేడు నసీర్ పాకిస్తాన్ వెళ్ళిపోతున్నాడు.

నిన్నటికి గజల్ పోయి నలభై రోజులైపోయింది. ఖైత్మే కురాన్ అనంతరం నసీర్ అల్లాహ్ మియాని ప్రార్థించాడు... గజల్ అపరాధాన్ని మన్నించమని ఆమె నరక యాతనలు తగ్గించమని ప్రార్థించాడు.

తరువాత అతను ఐవానే గజల్‌లోని అన్నిటికంటే పెద్దదైన

హాల్లోకొచ్చాడు, అక్కడ నివసించిన వారి బయాజ్‌లు పరిశీలించసాగాడు, కొన్ని మంచి గజళ్ళు ఎంపిక చేసుకుని పాకిస్తాన్‌లో జరిగే ముషాయరాల కోసం సామగ్రిని సేకరించడం కోసం ప్రయత్నిస్తున్నాడు.

వాహిద్ హుసైన్ బయాజ్ మీది పురుగును దులుపుతుండగా అకస్మాత్తుగా నలువైపులా వెలుతురు వ్యాపించింది. ఫ్రేముల్లోంచి, నిద్రిస్తున్న కవులందరూ అశాంతిగా చూడసాగారు. చెదలు పట్టిన బయాజ్‌లు తెరుచుకున్నాయి. మరొక ప్రియురాలి నఖశిఖ వర్ణన రాసుకుందామని వరండాలో ఎదురు చూస్తున్నారు.

నసీర్ గాఢమైన వాంఛతో ఆ ప్రియమైన అమ్మాయిని చూస్తున్నారు. ఆమె కపోలాల కాంతితో సాయంత్రం ఉపవనంగా మారుతూంది.

'అభివాదాలు, కాంతిదేవి! రండి, ఇక్కడ కూర్చోండి!'

అతడు లేచి నిలబడి వంగి ఆమెకు ఆసనం చూపించాడు. తైల సంస్కారం లేని తన జుట్టును విదిలించి సిగరెట్ నోట్లోంచి తీసి అంది, 'ధన్యవాదాలు, నాకు తీరుబడిలేదు... మళ్ళీ పాత పుస్తకాల అలమరా తెరిచి కొన్ని కొత్త పుస్తకాల పాకెట్ సూట్‌కేస్‌లో పెడుతూంది.'

'ఆహా, మీకు కూడా కవిత్వమంటే ఇష్టమా?'

అతడు కాంతి దగ్గరిగా నిలబడ్డాడు, ఆమె వెనుదిరిగి భరించలేనట్టుగా అతన్ని చూసింది సిగరెట్ దమ్ము పీల్చి అంది.

'లేదు, ఇవి వేరే పుస్తకాలు. భద్రంగా ఉంటాయని వీటినిక్కడ పెట్టాను నేను!'

'కాని నేనివాళ మిమ్మల్ని వెళ్ళనివ్వను, అంతకోపం ఎందుకు?'

అతడు కాంతి చెయ్యి పట్టుకున్నాడు. ఈ కాలపు పిల్లలకి ప్రేమలో తొందరపాటు, బలవంతం చెయ్యడం - ఇవి నచ్చుతాయని అతనికి తెలుసు.

కాంతి తన చెయ్యి విడిపించుకోలేదు. నసీర్ మొహంలో కనబడుతున్న ప్రశ్నలు అర్థం చేసుకుంది. ప్యాంటు జేబులో రెండో చెయ్యి పెట్టుకుంటూ అంది 'మీరు నా నుంచి దూరంగా కూర్చోవాలి. నసీర్ సాహెబ్ ఎందుకంటే నా జేబులో టైమ్ బాంబు ఉంది. నేను మీ దగ్గరకొస్తే ఐవానే గజల్‌తోపాటు మీరు నాశనమయిపోతారు!'

కాంతి నవ్వుతూంది.

ఎంత కష్టంగా, గట్టిగా నవ్వుతూందంటే అలమరాల్లో నిశ్చింతగా నిద్రపోతూన్న బల్లులు అశాంతిగా తొంగి చూడసాగాయి.

ఇది గజల్! అని అవి అశాంతిగా తొంగి చూడసాగాయి. కొత్త కోరిక అనుకున్నాడు నసీర్...

అతడు మెల్ల మెల్లగా ఐవానే, గజల్ గైటువైపు నడిచాడు.

కరివేపచెట్టు మీద కూర్చున్న పిట్ట ఈల అతనికింకా వినబడుతూంది షూ...

షూ... షూ... షూ... షూ... వ్వూ...!

Laserset at Crystal Hues Ltd. New Delhi - 110 049 and printed at Shivam Offset Press, Naraina Phase - I, New Delhi - 110 028